వి భూ తి — ౧-౧





అష్టవిభూతిసంపన్నుడగు

# శ్రీ స దా శి వు డు




ప్రతి మాస శివరాత్రిని ప్రకటింపబడును.

పుండ్రము ౧ | సికింద్రాబాదు<br>శా॥ శ॥ ౧౮౬౦ బహుధాన్య<br>మహాశివరాత్రి. | రేఖ ౧

## నైవేద్యము



శ్లో॥ ప్రపంచ పరమార్థైక-కారణం మారమారణం
ప్రపద్యే పరమేశానం భవపాశనివారణం.

శ్రీ పరమేశ్వరానుగ్రహమున హృద్గతకిరణ మొకటి నేటికి బహిర్గత మగుచున్నది. చిరకాల వాంఛితములలో నిదియు నొకటి. ఆరంభ మల్పమైనను నిర్వాహణవ్యగ్రత విశేషించెను. ఒనర్చిన ఘన కార్యమేదియు లేదుకాని, తలంపు మాత్రము మెండనియే.

మానవుడు కర్మజీవి. ఏదేని యొక క్రియ లేకయే యూరకుండ జాలడు. అధికారితారతమ్యము ననుసరించి యాక్రియలును వివిధము లగును. అనుష్ఠానానుగుణముగ ఫలమును లభించుననుట. సర్వసాధార

ణము. సుఫల మనుభవించుటకు సుక్రియ యత్యవసరము. అట్టిక్రియా
నిర్ణయము సులభము కాకపోయినను ఉపలబ్ధసాధనములలో సుధీజన
సేవ, శాస్త్రాధ్యయనము, అధ్యాత్మజ్ఞానము అను త్రిపుటితో ఉ
యుక్తక్రియానిర్ణయ మగుచునే యున్నది. "కింకర్మ కిమకర్మేతి
కవయోఽప్యత్రమోహితాః" అనునది సుభాషితాభాసము మాత్రమే

జ్ఞానానుభవలేశమే కారణ మగుగాక! అభిమతప్రచారము
నకై పత్రికను ప్రకటించు తలంపు దీర్ఘకాలమునుండియు ననుభూతి
మగుచు వచ్చుచునే యున్నది. కొంతవరకైనను అభిప్రాయము స్థాయిగ
నుండవలయునన్న మాసపత్రికయే అవసరమైనది.

ఎటులైననేమి? జన్మజరామరణములులేని ఈశ్వర 'విభూతి'కి నేడు
పత్రికారూపమున జన్మము గల్గింపబడుచున్నది. సాహసము క్షంత
వ్యమే! వాఙ్మయవీథులలో దిరిగి తిరిగి తుదకు 'విభూతి' నామకరణ
మును శరణము బొందవలసి వచ్చినది. ఇందుకు మా వీరశైవత్వమున
కొంతవరకు గారణము కావచ్చును. కాని యంతమాత్రమునకై రు
"విభూతి" యావిష్కరింపబడలేదు. 'విభూతి' యాదర్శము విజ్ఞానము
అది పలువిధములుగ నుండవచ్చును. 'విభూతి'కి భస్మార్థము సహజమ
య్యైనను సంపత్తు, శోభ, మహిమ, మున్నగు నర్థములును సుప్రసిద్ధములే

"విభూతిరస్తు సూనృతా" (ఋ. ౧-౩౦-౫)
"రయిర్విభూతిరీయతే వచస్యా" (" ౬-౨౧-౮)
"ఏవాహి తే విభూతయ ఊతయః" (" ౧౯-౬)

అని వేదములందును ఐశ్వర్యార్థము సుస్పష్టము. కూర్మపుర
ణమునందు శాశ్వతముగ నిలుచు భగవదైశ్వర్యమే 'విభూతి' య
బడెను. (ఐశ్వర్యం తస్య యన్నిత్యం విభూతిరితి గీయతే॥ అ॥ ౧॥) శ్రీ
శైవాచార్యుడగు జగద్గురు రేణుక భగవత్పాదులును సిద్ధాంతశిఖామ
(౧౩-౭౫) యందు "ప్రజ్ఞావిభూతియోగేన తమాహు ర్గురుసత్తమ

అని విభూతికి నింతటి వ్యాపకార్థము నంగీకరించిరి. భాగవతమునందు [౮-౨౮-౮౩] "నమో వాచో విభూతయే" అని వాగ్విభవము విభూతి పదముతో గంఠోక్తిగ నుపన్యసింపఁబడినది. "యా: మద్విభూతయ ఋతవస్తే" యను నుపనిషద్వచనమునే కవిచంద్రుడగు కాళిదాసుండును "అభిభూయ విభూతి మార్తవీం" [౮-౮-౩౬] అని మధురకావ్యముగా నావిష్కరించెను. ఇక భగవద్గీతయందలి "విభూతిమ త్సత్త్వం" "ఆత్మవిభూతయః" "ఏతాం విభూతింయోగం" "నాంతోస్తి విభూతీనాం"మున్న గుసూక్తిసమవాయమును దడవనవసర ముండదు. యోగశాస్త్రమునందలి మహిమ నిరూపణకు'విభూతి పాద'మనియే పేరుకలదు.మత్స్యపురాణమున [అ. ౮. ౨] వైష్ణవ వ్రతమొకటి "విభూతి ద్వాదశి" యనియే విస్తరింపబడినది. ఇటులు మా"విభూతి"యొక్క అర్థముతోబాటు కార్యక్షేత్రమును విస్తృతమనుసంగతి సహృదయులకు దెలుపుకొనుచున్నాము. ఎచటనోయున్న జైనబౌద్ధవాఙ్మయము నుద్ధరించుటకు నాంధ్రధీమంతులును శ్రీమంతులును బద్ధకంకణు లగుచున్నారేకాని యింతకంటె నన్నివిధముల సమృద్ధమును తమకు ననాదికాలమునుండి సంబద్ధమును నగు శైవవాఙ్మయమునుగూర్చి శ్రద్ధయే కలుగకున్న దనుచున్నందులకు మన్నింతురుగాక! శైవవీరశైవ సారస్వత మపారసాగరమని కాబోలు విద్వాంసులదృష్టి యిటు సరిగ ప్రసరించుటలేదు. ఈ శివ పథమునను 'విభూతి' యథాశక్తి పాటుపడును. ఈ యనాదృత వాఙ్మయము నాదరించవలసియున్నది. శైవాభిమానము వైష్ణవవిరోధి యెన్నటికిని కానేరదు. మాకు నవిరోధములగు వైష్ణవవ్యాసములకును 'విభూతి' లో స్థానము సురక్షితము.

కేవల సారస్వతనిర్వహణకయియే యవతరించినవని చెప్పబడు పత్రికలు సైతము సంపాదకుని స్వాధీనములోనో యధిపతి యాజ్ఞలోనో (మతదృష్టితో) మెలగుటలేదా? తెలియకపోయినను పరమత వాఙ్మయమును విలక్షణముగ విమర్శించి యామత పండితుల సమర్థములగు వ్యాసములనుకూడ ప్రకటించకయు తిరిగ పంపించకయు దిగమ్రింగిన సంపాదకు లెందరో గలరు. ఇది గోముఖవ్యాఘ్రత కుదాహరణము.

'విభూతి'కి ధర్మ, నీతి, సదాచారములయందు అవిచలమైన ప్రేమ యుండుననుటకు గారణము అంధవిశ్వాసము కాదు. సక్రమ సంపాదితమైన స్వానుభూతియే! ప్రమాణ బద్ధముగ నిరూపించు ధర్మ విమర్శనవ్యాసములకును స్వాగత మిడుదము. సరస సారస్వత రసాస్వాదనముతో "ఆనంద బ్రహ్మ"ను గనుగొనుటలోను 'విభూతి' వెనుక నుండ జాలదు. కవులకు పండితులకు 'విభూతి' కళేబరము, స్వాధీనము కావున ఆలోచించి సముచితమైన సంభారముతో దానిని సజ్జన నైవేద్యముగా నొనర్చు భారము విద్వాంసులకే కలదు.

విమలవిషయములుగల ఉభయశైలికిని 'విభూతి'లో స్థానము కలదు కాని, జటిలమైన గ్రాంధికమునకును వికటమైన గ్రామ్యమునకును పాత్రముకాదు. వ్యావహారికమను నెపమున బలాత్కారముగ శైలిని జెరిచి పరిభాషలను సైతము రూపుమాపుట తగని పని యని మనవి. సరళమగు గ్రాంధికమే మనయుద్దేశ్యముల నధికముగ బ్రచార మొనర్చ గలదు.

పత్రికకు ప్రజాహితసాధనమే పరమధర్మము కావున తదనుగుణమగు మనోరంజనసామగ్రియు యవసరమే! లోకమున భిన్నరుచి యుండుట సహజమైనను ఆపేరిట నీతిబాహ్యముగ, విచ్చలవిడిగ, పిచ్చి విషయములను కూడ నచ్చుగొట్టించి సురుచిని సమాధిసేయుటకు మా శక్తి నుపయోగించలేము. ధర్మ, అర్థ, కామ, మోక్షములను సుసంస్కార సంపన్నమైన బుద్ధితో నుపయోగించుకొనవలయు ననియే "విభూతి"—వీక్షణము.

నిజాం రాష్ట్రమునందలి డెబ్బదిలక్షల యాంధ్రుల పక్షమున నెన్నియో పత్రికలుండవలసియుండెను. ఆసౌభాగ్యము కలిగినది కాదు. అర్థవార వార్తా పత్రిక "గోలకొండ" యొకటిమాత్రమే యాడుకొనుచున్నది. 'నీలగిరి' "తెనుగు" పత్రికలు వైకుంఠమును జేరి ద్వాదశాబ్దములును గడిచినవి. "ఆంధ్రాభ్యుదయము" 'దేశబంధు' 'శైవప్రచారిణి' 'సుజాత'

మాసపత్రికలును పుట్టుట గిట్టుట జరిగినది. అందు 'సుజాత' మరువదగి నదికాదు. జనోపయుక్తముగ నుండియు మూడవయేట ముక్తినందినది. విధివిలాసము దురవగాహముకదా!

డెబ్బదిలక్షల నిజామాంధ్రులకును మూడులక్షల అఖిలాంధ్ర వీరశైవులకును తన్మూలమున నిఖిలాంధ్రులకును ప్రాతినిధ్యము వహించు తలంపుతో నేటి మహాశివరాత్రి పవిత్ర జాగృతని 'విభూతి' కావిర్భావతి కలిగినందులకు సంతసించుచున్నాము.

ప్రస్తుతము నిజాం రాష్ట్రమున సత్యాగ్రహాందోళనము చెల రేగుట వలన రాజకీయాతురత లక్కరలేని పత్రికలును వెలువడుట కష్టతరముగ నున్నది. 'విభూతి'కి ననుమతి దొరకుట కనకాద్రిలభించిన ట్లైనది. 'విభూతి' ప్రకటనానుమతికి ప్రత్యక్ష కారణమైన సికిందరాబాదు కంటోన్మెంటు ప్రభుత్వమునకును, పరోక్షకారణమైన నిజాం ప్రభుత్వ మునకును కృతజ్ఞతను వెల్లడించు చున్నాము.

పత్రికా స్వరూపమునకు ప్రధానసామగ్రిని నిష్పాదించిన కవి లేఖకుల పరిశ్రమయే ప్రధానప్రశంసకుఁబాత్రము. వారిసహాయము సదాభిలషణీయము, వారి కా కష్టము తప్పదు. ఈ యేకైక 'విభూతి'ని ఆదర్శముగ, జనాదరణీయముగ, సిద్ధపరచుటకై వ్యాసకర్తలును, వారికి యథాశక్తి సౌకర్యము గలిగించుటకై "విభూతి" యును దృఢముగ బ్రయత్నించ వలసియున్నది.

మహోదారముగ ముక్తహస్తముతో ద్రవ్యసహాయ మొనర్చిన వీరశైవమహాజనులు పరమ 'విభూతి'-సంపన్నుండైన మహేశ్వరుని యనుగ్రహము నధిరోహించి విరాజిల్లుచున్నారని పాఠకులకు దెలి యకపోదు. 'విభూతి' కొంతవరకైనను శాశ్వతరూపమును పొందవలయు నన్న తమవాగ్దానమును సార్థకపరచి బంధుమిత్రాదుల సానుభూతి సహాయముల సంపాదించుట కర్తవ్యమని కుశలురగు తమకును సువిది

తము. నిజామాంధ్ర మహాశయులు తమ 'విభూతి'ని తప్పక సంరక్షించు కొనవలయును. ''పరోపకారాయ సతాం విభూతయః'' అని యార్య వచనము. అనుమతి లభించుట దడవుగ శివరాత్రి ముహూర్తమున ప్రథమసంచికను ప్రకటించు తలంపుతో శీఘ్రపడవలసి వచ్చినది కావు నను, కొన్ని వ్యాసము లాలస్యముగ జేరుటవలనను, మా యీ ప్రథమ సంచికకు యథేచ్ఛముగ నాకారసృష్టిగలిగించుట కనువైనదికాదు. ముందింకను పరివర్ధింపబడును

'విభూతి' యావిర్భావమునకు గారణులైనవారందరకును నిమిత్త మాత్రమైన సంపాదకభూమినుండి కృతజ్ఞతాపూర్వకముగ సమర్పింపబడు నైవేద్య మిదియ.

బహుధాన్య
మహాశివరాత్రి, }

[signature]



# అభినందనము

## బండారు తమ్మయ్యగారు



శా. శ్రీమన్మంగళధామమై చిదమల శ్రీభూతి సంపన్నమై
క్షేమారంభ ఫలాఢ్యమై త్రిజగతీ శ్రేయస్కరంబైన ని
స్సీమానందమహంబు భవ్యతరసుస్థేమస్థితిన్ గూర్చి స
త్ప్రేమోదీర్ణతఁ బ్రోవుఁగావుత "విభూతిన్" సర్వకాలంబులన్.

సీ. వివిధ రూపాత్మక విజ్ఞానమునకును
స్థానంబులైన వేదములయందు
నిగమాగమ రహస్య నిర్నిబంధంబుల
మెలకువల్ దెల్పెడు స్మృతులయందు
సకలార్థ సాధక సత్య సమ్మత ధర్మ
తత్త్వంబుఁజూపు శాస్త్రములయందు
సాహిత్య సారస్య సౌభాగ్యగరిమంబు
ప్రకటించునట్టి కావ్యములయందు

గీ. తీర్థతనుజెంది బహుచరితార్థమయినఁ
వీరభద్ర విభూతి సంభారమూనఁ
సత్కళానుభూతిని నిత్యశర్మదమయిఁ
పొదలుఁగావుత భూతి "విభూతి" యెపుడు.

గీ. భక్తి బండారు తమ్మయాహ్వయుఁడొనర్చు
ధన్యవాదములు నభినందనములొంది
సరస సత్కవి విబుధ బంధుర విభూతిఁ
గ్రాలుమా "విభూతి" సుపత్రికామతల్లి !



# రమ్యాలోకము.

కవీంద్ర రాయప్రోలు సుబ్బారావుగారు.

సొబగు లెగయు తారకల రాసులకు నడుమ
దర్శనీయమౌ క్షీరపథంబు పగిది
దేశభాషా ప్రవాహ-వీథికలలోన
తెనుగుపాయ రంజిలు తేనెతోణుకులాడ.

ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో, ఇందు పుట్టినాడ!
కలదయేని పునర్జన్మ కలుగు గాక
మధురమధురంబయిన తెన్గు మాతృభాష!

పూల కడుపులలో తేనె పోసె నెవడొ
దానిదీయు నేరుపు తుమ్మెదకు లభించె
భాషలోని మాధుర్యలావణ్య భావ
సాధుభోగము కవిముఖ సాధ్యమయ్యె.

మాధు లిచ్ఛయించెదరు సంభోగసుఖము
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప అర్రాడెద ననడె యాంధ్ర
రసికకులరాజు పండితరాజు మున్ను!

సరస వాక్యార్థము లభిధావరణ మెడలి
లక్షణా వ్యంజనా వీథులం భ్రమించు
పూవువిడిచి వాయుతరంగముల నపార
దూరమేగెడి పరిమళ సారమట్లు.

---

"రమ్యాలోక కావ్య"ములో నిది యొక కిరణపంచకము.

# భారతదేశమునందలి భాషా సమస్య

## కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.



భారతదేశమొక చిన్న దేశముకాదు. దానికొక ఖండమున కుండు లక్షణములున్నవి. విస్తీర్ణమున రష్యాను వదలి యైరోపాఖండమునకు సమానమైనది. రష్యానువదలి యైరోపాఖండమున నెన్ని భాషలున్నవో యన్ని భాషలున్నవి. లిపిలేని కేవల సంభాషణ భాషలనువదలి హిందూదేశమున ౨౨ భాషలున్నవి ఆవిధముననే యైరోపాఖండమున ౨౧ భాషలున్నవి. ఇట్లున్నను నైరోపావలె బహుజాతీయతాయుతముగాక నేకజాతీయత కల్గి యున్నట్లు మనకు తెలియును. దీనికేమి కారణము ?

ఏకజాతీయతకు మూలకారణములు రెండని పూర్వ శాస్త్రజ్ఞులు చెప్పుదురు. (౧) ఏకమతము (౨) ఏకభాష. ఈ విషయములం దైరోపాతో పోల్చిన రెండు సంగతులు మనకు గోచరమగును. ఐరోపాయంతయు దాదాపొకమతమే; అనగా క్రైస్తవమతము. కాని వెనుక నెట్లున్నను నిప్పుడు ముఖ్య ప్రపంచ మతములు(అనగా క్రైస్తవ, మునల్మాను, హిందూ) మూడునుకలిసి మనదేశమందు త్రివేణీ సంగమము గల్పించెను. కావున నీవిషయమున సాధర్మ్యముకంటె వైధర్మ్యమే యెక్కువగానున్నది. అయినను నేకజాతీయతయే ప్రబలియున్నట్లు మన యనుభవము. ఇక భాషావిషయమున జూచిన వైధర్మ్యముకంటె సాధర్మ్య మెక్కువగా కనబడును. హిందూదేశమునందలి భాషలన్నియు నార్యుల యేక నాగరకతా. విజ్ఞానావృత మగుటచే నా సంస్కృతిని తమలోనికి మార్చుకొని యెక్కువ సంబంధము కల్గి యున్నవి. ఒక్క యుర్దూ తప్ప మిగిలిన భాషలన్నియు సన్నిహితసంబంధము కలవిగా నున్నవి. కావున మతవిషయమున నేకజాతీయతకు ప్రతిబంధకమును, భాషావిషయమున సహాయమును నగపడుచున్నవి. ఇట్టి స్థితిలో నేకజాతీయత యగపడుట యెట్లు తటస్థించెను?

జాతీయతా విషయమున వెనుకటి సూత్రములు మారిపోయినవి. మతమునకు బలము తగ్గినది, హిందూదేశముననే కొంచెము మతా వేశము మిగిలియున్నదిగాని, యైరోపాలో మతమునకు బలము బొత్తుగ తగ్గినది. మతము వ్యక్తిసంబంధముగాని, జాతిసంబంధము కాదను సిద్ధాంతము ప్రపంచమంతయు వ్యాపించియున్నది. ఇక భాషయా? ఈవిషయమునకూడ భారతదేశము నందలి పట్టుదల యెచ్చటను గానము. భాషకూడ నేకజాతీయతా సంపాదనమున ముఖ్య విషయము కాదను నభిప్రాయము క్రమముగా వ్యాపించుచున్నది. ఇక నీ యేకజాతీయతా సూత్రము లేవియని యడుగ వచ్చును.

ఆధునిక రాజకీయ వేత్తలిచ్చిన సూఖ్యసూత్రములను ముందు చెప్పెదను. (౧) నిర్దిష్ట సరిహద్దులు గల్గినట్టియు నవిచ్ఛిన్న మైనట్టియు నొక భూభాగము. (౨) రాజకీయార్థికైక సంబంధము. వీనిని కొంచెము వివరింతును. మొదటిదాని కర్థము, మధ్యమధ్య వేరు రాజ్యసంబంధము గల భూభాగములుండకుండ రాష్ట్రములన్నియు కలిసియుండి దేశమంతయు నిర్దిష్ట సరిహద్దులలో నుండుట, హిందూదేశమును పరీక్షించిన రాష్ట్రములన్నియు నొకదాని వెంబడి యొకటిగ నున్నవి. సరిహద్దులు ప్రకృతి కృతములు, మూడు సముద్రములు నొక పర్వత పంక్తి. రెండవది మొత్తము మీద నేకపరిపాలనమునకు లోబడి యుండుట యనవచ్చును. ఇచ్చటకూడ హిందూదేశమునందలి రాజకీయార్థిక సమస్యలు దేశమంతకు నొకేవిధముగ వర్తించును. దేశమంతయు నేకపరిపాలనమున నున్నది. కావున నాధునిక సూత్రముల ప్రకారము భరతదేశమున కేకజాతీయతకు వలసిన సాధనములున్నవి. రెండుదాహరణము లిచ్చెద. (౧) అమెరికా సంయుక్తరాష్ట్రములను చూచిన నచ్చట ప్రపంచమున నున్న యన్నిమతములు, నన్నిజాతులును, నన్నిభాషలును గాననగును. అయినను నేక జాతీయత ప్రబలియున్నది. ఒక్క చిన్న కళంకముమాత్ర మున్నది. తెల్ల నల్ల భేదమింకను పాటింపబడుచున్నది. (౨) రెండవది స్విడ్జర్లాండు దేశము చిన్నదైనను భాషామతవైవిధ్యము కల్గియున్నది. మరియు ప్రపంచమున

నున్న రాజ్యములన్నిటిలోను మిక్కిలి సులక్షణమైనట్టియు, ప్రజా సంతృప్తికరమైనట్టియు రాజ్యాంగము గలదియని రాజకీయ వేత్తలచే మెప్పునుపొందినది. కావున రెండు సాధనములకు తోడుగ సంబద్ధములైన భాషలును కాశ్మీరమునుంచి కన్యాకుమారి వరకొకే నాగరకతా విజ్ఞానములును గలవు.

ఇటీవల కొందరు మతమును, భాషను, పురస్కరించుకొని యీ జాతీయతకు భంగము కల్గింపవలెనని ప్రయత్నించుచున్నారు. రాజకీయమునకును మతమునకును సంబంధములేదని ప్రపంచమునందంతటను నంగీకరింపబడుచున్నది. ఇచ్చటమాత్రము సంబంధకల్పన మేలనలయును? ఇప్పుడుప్రపంచమునంతను నర్థపురుషార్థ మేలుచున్నది. కావున నార్థికముగ జూచిన మతమునకు తావేలేదు. ఆర్థిక సమస్యకు సామ్యవాద సిద్ధాంతము పరమావధి. దానిలో మతమునకు తావులేదు. అందుచే నందరిని మతమును మరువమని నాయాశయముకాదు. రాజకీయమున సర్వమతములకును వాని సంస్కృతికిని రక్షణమున్న చాలును. కొంతకాలము క్రిందట కాంగ్రెసువారు మతసంస్కృతుల రక్షణమునుగూర్చి కరాచీలో నొక తీర్మానము నంగీకరించిరి. అందన్నిమతసంస్కృతులకును రక్షణము నొసంగిరి. మిక్కిలి సమంజసము.

ఇక భాషనుగూర్చి విచారించిన నచ్చటకూడా నొకసమస్య నిటీవల కల్పించినారు. దేశమునకంతకును సామాన్యభాష యుండవలయుననియు నట్టిభాష హిందీగా నుండవలయుననియు నాయకులు చాలమంది తీర్మానించి హిందీప్రచారమునకు గడంగిరి. వెంటనే కొందరుర్దూ సిద్ధాంతమును లేవదీసిరి. ఇచ్చట రెండుచిక్కులున్నవి. ౧. పదజాలము ౨. లిపి. భారత దేశమునందలి *యధిక సంఖ్యాకభాషలు సంస్కృతప్రాకృతములతో సంబంధము గలవిగాన హిందీయందెక్కువగా నట్టి పదములుండవలెనని హిందీవాదుల వాదన. రెండవపక్షమువారు ఫారసీ యరబ్బీ భాషలలోనుండి గ్రహించవలెనని వాదించుచున్నారు. హింది

*భారతదేశమందలి భాషలన్నియు సంస్కృత జన్యములని మాతర్కము.

సం॥ వి॥

వాదులు దేవనాగర లిపిలో వ్రాయవలెనన్న నుర్దూవాదు లుర్దూలిపిలో వ్రాయవలెననుచున్నారు. ఇప్పుడిరుపక్షములవారిలో సామరస్య వాదులీ రెండుసమస్యలకు నీవిధముగా సమాధానమును కుదుర్ప ప్రయత్నించుచు చున్నారు. భాషయొక్కనామము హిందీయనియు, నుర్దూయనియు నుండ కుండ "హిందూస్తానీ" యనియుండ వలెనని మొదటిది. ఉభయపక్షముల వారును కలిసి యాభాషకు పదజాలమును సిద్ధాంతీకరించి నిఘంటువును తయారు చేయవలెనని తీర్మానించినారు. ఏలిపిలోనైనను వ్రాయనచ్చు నననది రెండవది. ఈవిధముగా రాజీకుదురుట మంచిదేకాని యిచ్చట కొన్ని విషయములను మనవి చేయ వలసియున్నది.

ఏ భాషనైనను బలవంతముగా సామాన్య భాషను చేయవలె ననుట మంచిదిగాదు. ఐరోపా ఖండమున మహాసంగ్రామమునకు వెనుక నిట్టి ప్రయత్నములు జరిగినవి. "ఎస్పరాంటాడు" యను భాషను సృజించి యైరోపా భాషలలోని యధికసంఖ్యాక పదములను గ్రహించి దానికొక వ్యాకరణమును సృజించి ప్రచారము చేయవలెనని యొకసంఘ మేర్ప డెను. కాని యది నిష్ఫలమయ్యెను. ఇట్టి వైఫల్యమునకు రెండు కార ణములున్నవి. (౧) స్వభాషాభిమానము. (౨) నిర్బంధ వైముఖ్యము. ప్రతివానికిని స్వభాషయం దభిమానముండుట సహజము. అసహజమైన దానిని నిర్బంధము చేసిన ప్రతిఘటనము తప్పదు. ఈసందర్భమున మదాసు రాష్ట్రమున జరుగుచున్న హిందీప్రతికూలోద్యమము నుదా హరణము నిచ్చుచున్నాను. భారతదేశము యొక్క యుత్తర దక్షిణ భాగములకు భాషావిషయమున నంతరము చాలగలదు. దక్షిణ భారత మున స్వభాషలుగాక యింగ్లీషుతప్ప యే యితరభాషయు ప్రజల మన ముల నాకర్షింప జాలదు. ఏక భాషకై చేసెడి ప్రయత్నము లన్నియు భస్మహుత్యములే. మరియు నింగ్లీషున కెంతశ్రమ పడవలయునో హిందూ స్తానీ కంత శ్రమపడలసి యున్నదని దక్షిణ భారత వాసుల యను భవము. ఈవిషయమున చర్చచేగాని, నిర్బంధముచేగాని పరిష్కరింప జూచుట చాలా పొరబాటు. మరియు రెండులిపుల నెవ్వరు నేర్చుకొందురు? హిందూస్తానీయని నామమిడినను భాషయొకటేగాన నెవ్వరును మోస

పోరు. కావున నీవిషయమున పరిశీకత్తుల మనస్సు తృప్తిపరచుటకు గాని, మన లాలసను తృప్తిపరచుటకు గాని ప్రయత్నించుట చాలాహాని కరమని నాయభిప్రాయము. మూర్ఖుని తృప్తిపరచుటయు, శిక్షించు టయు వాని మౌర్ఖ్యము నభివృద్ధిచేసి నష్టేయగును.

కావున నిచటనొక నా సలహాకలదు. ఈ యేకభాషా సమస్యను వదలివేసిన నిప్పుడు హిందూముసల్మాను సంఘములకు రెంటికిని పరిబ లిన వైరమునకుగల కారణములలో నొకటి తగ్గును. జాతీయ సామాన్య భాష యుండ వలదాయని పరిశీలించిన నట్లుండుట జాతీయతకొక ముఖ్య సూత్రముకాదని వెనుక మనవిచేసియుంటిని. దేశీయులు నన్ను నిందించి నను నాయాశయమును చెప్ప సాహసించుచున్నాను.

౧. దైవికముగా నెట్లు హిందూముసల్మాను సంఘములు కలసి యుండిన యట్లే బ్రిటిషువారు మనల నేలుచున్నారు. ఈ పవిత్ర త్రివేణీ సంగమమునుండి హైందవజాతీయతాగంగ యచ్ఛప్రవాహమై ప్రవహింప వలసియున్నది. ఇంగ్లీషుభాష యీ నూటయేబది సంవత్సరములనుండి యీ దేశమున సామాన్యభాషయై రాజభాషగా నున్నది. మరియు నది ప్రపంచభాష యగుటకు కూడ సమర్థమై యట్లగు సూచనలుకూడ కన బడుచున్నవి. రెండు గోళార్థములయందును బలవంతములైన మిక్కిలి పలుకుబడిగల దేశముల భాషయై యిటీవల యంతర్జాతీయ భాషగాకూడ వాడబడుచున్నది. అందు వాఙ్మయశాస్త్రము లపారముగా పెరిగిపోయి నవి. మరియు భాషాసంపర్కము మన కవిచ్ఛిన్నముగా సర్వకాలము నుండ గలదు, తద్భాషాపఠనమే మన స్వాతంత్ర్యశోభకు మూలకార ణము భాషచేసిన యపకృతి యేమియులేదు. స్వాతంత్ర్యవాంఛ తీర్చకపోవుటచే బ్రిటిషు రాజ్యాంగముపైనున్న కోపము భాషపై తీర్చుకొనుట సమంజసముకాదు. ఇప్పటికే బోధనము నందును, న్యాయ స్థానములందును, సమస్త వ్యవహారములందును నుపయుక్తమైయున్నది. కావున నితరభాషలకు పోక దానిని యావద్భారతభాషగా నుంచుకొనిన సమంజసమగుటయేగాక, పదజాలమునందును, లిపియందును తగాదా పడుచున్న హిందూ ముసల్మానుల భాషాకలహముకూడ నశించును.

ఈతోంవ నిదివరకే జవాహరలాలు, సుభాసుగార్లు హిందీని రోమ
నక్షరములలో వ్రాసిన నొక కలహకారణము నశించునని సెలవిచ్చి
యున్నారు. భాషనుకూడ నఖిలభారత భాషగా గ్రహించిన మరియొక
కారణముకూడ నశించునని సవినయముగా మనవి చేయుచున్నాను.

ఈ విషయమున మరియొక లాఘవముకూడ కలదు. హిందూ
స్తానీ నఖిలభారతభాషగా గ్రహించిన, స్వభాష, హిందూస్తానీ, (తప్పక)
యింగ్లీషునని భాషాత్రియ సమస్యకు బదులుగా స్వభాష, యింగ్లీషునని
భాషాద్వయసమస్యయే యగునని లాఘవమునుకూడ కారణముగా
మనవిచేయుచు నీవిషయమున నాయకులందరును సమంజస మార్గమున
నడతురుగాక యని యాశించుచున్నాను.



[అత్యాశచే సుందోపసుంద న్యాయముపలె స్వదేశభాషల పరిత్యజించి ప
ఖండ భాషకై కేలొడ్డు దుర్దశ నేడు భారతవర్షమునకు గలిగినది. సంస్కృతభాష
భారతదేశ సామాన్యభాష కావలయునని యయోధ్యలోని సంఘము ప్రయత్నిం
చున్నది. దాని మొర వినువారు లేరు. జపాను, ఇరాను, రష్యా మున్నగు దేశములలో
సామాన్యభాష ఇంగ్లీషేనా ? విజ్ఞులీవిషయమున సాత్త్విక భాషలో తమ సమంజ
మైన యభిమతములను సంక్షేపముగ లిఖించవలెనని కోరుచున్నాము. సం॥ పి॥ ]

# శుద్ధబోధి జాతకము

## శిరోమణి, సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు



క. తరతరములనుండి మహా
త్తరమై వహ్నివలెఁ బూతతరమై ధర్మో
త్తరమై పుణ్యక్షేత్రము
కరణిని నొక విప్రకులము గలదు ధరిత్రిన్. ౧

ఆ. వె. పాల సంద్రమందుఁ బ్రభవించియున్నఁ జం
ద్రుఁ డిసీ! కళంక దూష్యుఁడయ్యె
బ్రాహ్మణాన్వయమునఁ బ్రభవించి మన బోధి
సత్త్వుఁ డత్యుదార చరితుఁడయ్యె. ౨

క. చదువుల సరస్వతియుఁ, బ
ల్లిదమగు గొనములకుఁ గూడలి, యశోలతకుం
గుదుర కీర్తిధనుఁ, డట్టిం
డుదయింపఁడు ప్రాయికముగ నుర్విని నెపుడున్. ౩

క. ప్రేయస్త్వము సత్పురుష
జ్యాయస్త్వము శేముషీ మహత్త్వముఁ గరుణా
భూయస్త్వము విద్వజ్జన
గేయత్వము వడసి యతఁడు క్షితిఁ బెంపుగొనెన్. ౪

గీ. ధర్మదేవత మంత్రిపదంబు నొందెఁ
దత్త్వబోధంబు తగు కార్యదర్శి యయ్యె
సత్త్వ సామగ్రి మిత్రరాజముగ నయ్యెఁ
బ్రాయమును బొందియున్న యా బ్రాహ్మణునకు. ౫

క. తన తాతలు ముత్తాతలు
జనకుండును దన కొసంగు జ్ఞానక్షేత్రం

బును సేద్యంబొనరిచి వి
న్ననువు గఁదా శుద్ధబోధి నామము వడసెఁ. ౬

గీ. సాభిలాషంబు చారుదృశ్యమును గనఁడు
ఆలకింపఁడు శారివ్యపికారవంబు
మూర్కొనం బోఁడు సురభిళ పుష్పమేని
నిండు జవ్వనమందుఁ గన్పించు నతఁడు. ౭

గీ. కొలిచి కూఁకట్లు పెండిలి సలిపియున్న
కొమ్మ బంగారు బొమ్మయొయ్యొ బమ్మమరులు
ప్రళయ పవనాక్షుభితవార్ధి పగిది నతఁడు
కదలఁబాఱని యంగరంగమునఁ గ్రాలె. ౮

ఆ. వె. కత్తిపైని సాముఁగావించు వడువున
బావియొడ్డునందుఁ బండినట్లు
చిచ్చునొద్దఁ జిన్ని చితుకున్నగతి వాని
యువతితోడి మనికి యొప్పుచుండె. ౯

క. ఘనతర నితంబ సింహా
సనమున స్మితమనెడి ఛత్రచామరములతో
స్తనకనకకలశములతో
మనోజు రాజ్యరమనాఁగ మగువ వెలింగెఁ. ౧౦

గీ. ఆతరుణి నూఁదుకొని మీనకేతనుండు
నిలిచి ముక్కంటిగాఁ బతిం దలఁచి యెడఁద
నిట్టనిలువున నీరయి నేలజాఱ
వాఁడిచే ముల్కి యూడనిఁ బాడె దవ్వు. ౧౧

సీ. తన మనోహరుని సుందరవక్త్రబింబంబు
నాదర్శఫలకంబుగాఁ దలంచుఁ
దన కాంతు లలిత ముగ్ధకటాక్ష వితతిని
సర్వాంగములకు భూషలుగఁ దాల్పు

తన నాథు సద్గుణతండంబు సామ్రాజ్య
విభవలాభముగ భావించుకొనును
తన ప్రాణపతి యశస్తరుణీలలామంబుఁ
జెలిమికత్తియనుగా సలుపుకొనుచు
గీ. పతిహితాచారముం బూని భవ్యమైన
భర్తృవాల్లభ్య మార్జింపఁ బ్రియతపడును
అలశశాంకుని రోహిణివలెను గొలుచు
నలఁతిదవ్వుల వసియించు చతనివెలఁది. ౧౨

సీ. సతి శిష్యురాలయి సవరింప శుశ్రూషఁ
బతి దేశికుఁడయి తత్త్వంబుఁ గఱపు
సతి పెద్దవరవుడై సలుప నూడిగములఁ
బతి స్వామియై ప్రసన్నత వహించు
నెచ్చెలియైసతి నెనరుఁ జూపఁగడింది
పతి చెలికాఁడయి పఱపు నెనరు
గృహలక్ష్మియై సతి మెలయింప సతతంబు
గృహవిష్ణువై పతి మెలయఁ జేయు
ఆ. వె. నిండుజవ్వనమున నుండియు వృద్ధుల
యవ్విధమున వదలి మైహికేచ్ఛ
(బ్రహ్మచర్యదీక్షఁ బాటింతు) దంపతుల్
వింత వడుచుం గాంచ విబుధవరులు. ౧౩

సీ. పతి వల్కలముఁదాల్ప సతి వల్కలముదాల్చుఁ
బతి భస్మమలఁదిన సతియు నలఁదుఁ
బతి జడల్ దాల్చిన సతి జడల్ దాల్చును
బతి స్నానమాడిన సతియునాడుఁ
బతి యుపాసం బున్న సతి యుపాసంబుండుఁ
బతి పూజలొనరింప సతి యొనర్చుఁ
బతి వల్కకుండిన సతి వల్కకుండును
పతివల్కరించిన సతియువల్కుఁ.

గీ. బతి కనంగఁ దన్ను సతికాంచుఁ బతివంకఁ
బతితపంబానర్ప సతియొనర్చు
నీడవోలెఁ బతికి నెలఁతులమానికం
బెల్లవెంటలందు నెలయఁ జేసె. ౧౪

క. శుచితగలిసిన పాటవలెన్
రతనంబును గూడుకొన్న రతనంబువలెన్
క్షితి విధియుత యగు శ్రద్ధయు
గతినిఁ దదర్ధాంగ యుచితగతిఁ దవరారెన్. ౧౫

చ. తరుణి తపోంతరాయమని తత్సహవాసమురోసి కాననాం
తరములనాఁడు పుర్వయినఁ దారనితావులఁ గాపురింతురి కొం
దఱు మును లిమ్మహాత్మునకుఁ దత్సహవాసమె దోహదంబుగాఁ
బరఁగ నిరంతరాయమయి వర్తిలుచుండెఁ దపఃక్రియల్ తగన్.

క. అనురూప మనుప్రియం
బనుగుణ మనువర్తనంబు ననుభావంబై
తనరుచు నా దాంపత్యము
కనువిందును జెవులవిందుఁ గావించెఁ గదున్. ౧౭

కం. రతిమన్మథు లట్లాదం
పతు లాకర్షక సురూప వైభవులయ్యున్
వితతప్రణయులు నయ్యున్
జితేంద్రియత నొంది వారు సెలఁగుదు రెపుడున్. ౧౮

ఆ. వె. సతియె మేలుబంతి పతికందు రా జంటఁ
బతియె మేలుబంతి సతి కటండ్రు
సత్యదానశౌచ శమదమాదుల స్పర్ధ
గొనినరీతిఁ గూర్చుకొనిరి వారు. ౧౯

(స శే ష ము)

---

# 'మేఘదూత' కథకు మూలము

## (వి ద్యా ని ధి)



కవితాసవితయగు మహాకవి కాళిదాసుని మేఘసందేశమనెడు సుమధుర ఖండకావ్యమును చవిజూడని రసికు లుండరు. దీనికి "మేఘదూతమ"ను నామాంతరమును కలదు. దీని ననుకరించి 'పవనదూత' "హంసదూత' మున్నగు పేరులతో 'దూతకావ్యవాఙ్మయ"ము విస్తరింపబడెననియును, కాళిదాసునికంటె బూర్వమున దూతకావ్యములుండెననియును పరిశోధకు లభిప్రాయపడుచున్నారు.

ఈ దూతకావ్యములలో విశేషముగ విప్రలంభశృంగారమే [విరహవేదన] ప్రతిపాదింపబడియుండుటచే నాయికా నాయకులచరిత్రమైతిహాసికమా? కల్పితమా? అను సంశము తేలుటలేదు. కొన్ని దూత కావ్యకథలకు మూలము సహజముగా దెలియనైనది కాని కాళిదాసుని మేఘదూత కథకు మూలములేదనియు, అది కల్పితమో, స్వీయ చరిత్రయో అయ్యుండునని విద్వాంసు లూహించుచుండిరి. ఇదమిత్థమని యెవ్వరైన తేల్చినటులు కానరాదు.

కాళిదాసుని రఘువంశ కుమారసంభవ విక్రమోర్వసీయ మాలవికాగ్నిమిత్ర శాకుంతలాది కావ్యముల కథలన్నియు సంస్కరింపబడినవే కాని స్వకపోల కల్పితములు కావు. కథను కల్పించి పోషించుటయే సులభనుని భావించుచున్నాను. ఇందు స్వేచ్ఛయే కారణము కావున వికట పరిశ్రమ లేదు. ఉపలబ్ధ (పురాణాది) గాథలన్ననో అతి పరిశ్రమతో కావ్యలక్షణములను రక్షించుకొనుచు లోకరంజన గావించ వలయును. పైగా మూలకథకు విపరీతాంశములను జేర్చకూడదు.

మేఘదూతకావ్యకథకును మూలమెచ్చోటనో యుండునని కాళిదాసుని స్వభావమునుబట్టి భావించుచునే యున్నాము. వెదకినచో మ్మూలకథ దొరకకుండునా ?

ఈ మధ్య 'ప్రతిభ' (3-౧) గ్రంథసమీక్షలో శ్రీచర్ల గణపతి శాస్త్రిగారి "మెయిలు రాయబారము" సందర్భమున "౧౩౬౮ సం॥ క్రిందట కాళిదాసును సర్గుజా సంస్థానంలోవున్న రామగిరికి పంపి వేశారట" అనియును, "రమారమి డెబ్బది సంవత్సరములక్రింద డాక్టరు భాఊదాజీ మహాశయుడు కాళిదాసుని భార్య పేరు పద్మావతీదేవి అని ప్రకటించాడు. ఎక్కడ లభ్యమైందని అడిగేసరికి డాక్టరు మౌనం అవలంబించాడు... నిజానికి కాళిదాసకవి సంగతులేవీ తెలియవు. ఒకటి కావచ్చు, కవికి ప్రియావియోగం కొంతకాలం కలిగి వుండవచ్చు" అనియును వ్రాయబడి యున్నది, వీనికన్నిటికిని పరామర్శ ఈక్రింద చేయబడుచున్నది.

కావ్యము లెన్నిటి నవలోకించినను భారతాది పురాణేతిహాస ముల యవలోకన లేకయే సమగ్రజ్ఞానము లభించన జాలదని మాగు రువు లనవరతము సోదాహరణముగ బోధించుచుండెడివారు, వారి యా దేశపాలనార్థమై బ్రహ్మ వైవర్తపురాణము నవలోకించుచుండ—

"శ్లో॥ అలకాధిపతర్నామ్నా కుబేరః శివపూజకః
తస్యాసీత్పుష్పవటుకో హేమమాలీతి నామతః॥
తస్య పత్నీ సురూపా చ విశాలాక్షీతి నామతః।
స తస్యాం స్నేహసంయుక్తః కామపాశవశం గతః॥
మానసాత్పుష్పనిచయమానీయ స్వగృహే స్థితః।
పత్నీ ప్రేమసమాకృష్టో న కుబేరాలయం గతః॥
కుబేరో దేవసదనే కరోతి శివపూజనం।
మధ్యాహ్నసమయే రాజన్ పుష్పాణి ప్రసమీక్షతే॥
హేమమాలీ స్వభవనే రమతే కాంతయా సహ।
యక్షరాట్ప్రత్యువాచాథ కాలాతిక్రమకోపతః॥
కస్మాన్నాయాతి యక్షా! హేమమాలీ దురాత్మవాన్।
నిర్ణయః క్రియతామస్య ప్రత్యువాచ పునః పునః॥"
"వనితా కాముకో గేహే రమతే స్వేచ్ఛయా నృప".
తేషాం వాక్యం సమాకర్ణ్య కుబెర : క్రోధపూరితః॥

ఆహ్వాయామాస తం తూర్ణం వటుకం హేమమాలినం।
జ్ఞాత్వా కాలాత్యయం సోపి భీసువ్యాకులలోచనః॥
ఆజగామ నమస్కృత్య కుబేరస్యాగ్రతః స్థితః
తం దృష్ట్వా ధనదః క్రుద్ధో కోపసంరక్తలోచనః॥
ప్రత్యువాచ రుషావిష్టః కోపాత్ప్రస్ఫురితాధరః।
రే పాప దుష్ట దుర్వృత్త! కృతవాన్ దేవహేలనం॥
అతో భవ శ్విత్రియుక్తో వియుక్తః కాంతయా సహ।
అస్మాత్ స్థానాదపధ్వస్తో గచ్ఛ స్థానమథాధమం।
ఇత్యుక్తే వచనే తేన తస్మాత్ స్థానాత్ పపాత సః।
మహాదుఃఖాభిభూతశ్చ కుష్ఠపీడిత విగ్రహః

"అలకాధిపతియైన కుబేరుని యాస్థానమున ఉద్యానమునుండి పూజాపుష్పముల నందించుటకై హేమమాలియను యువకుడు ఉద్యోగిగా నుండెను. రూపసియు యువతియునగు విశాలాక్షియను తనభార్య యొక్క మోహప్రసంగవశమున నొకనాడు పుష్పములదెచ్చుట మరచెను. ఆదినమున శివపూజాసమయమునందు పుష్పములు లేమికి కుబేరుడు క్రుద్ధుడై శివతిరస్కారాపరాధినిగా నిర్ణయించి హేమమాలిని "కుష్ఠరోగ పీడితుడవై భార్యావియోగమునందుము" అని శపించె నను కథ విస్పష్టముగ నుండుటచే మేఘదూత కథామూలమిదియే యని వ్రాయ నవసరము లేదు.

ఈ కథ తర్వాత నీయక్షుడు భార్యావియుక్తుడై కుష్ఠగ్రస్తుడై యడవుల బరిభ్రమించుచు మార్కండేయోపదేశానుసారముగ వ్రతము నాచరించి యారోగ్యమునంది భార్యను పొందెనని యా పురాణమున గలదు. ఈ యపరాధ మొకసారియేకాదు, అనేకమారులును కుబేరుని పూజావిఘ్నము కలిగినది. పలుసారులు హెచ్చరించినను విననందున హేమమాలి యిట్టి దారుణశాపమునకు గురియయ్యెను. ఆ పురాణమున కుబేరుని శివపూజానిష్ఠయు, యక్షదంపతుల విశేషానురక్తి సంభాషణలును వివరింపబడినవే కాని "శాప మొక సంవత్సర పర్యంత"

మని కాని "రామగిర్యాశ్రమమునుండి మేఘునితో సందేశమంపె" నని కాని మూలమునలేదు. ప్రతిభాసంపన్నుడగు కాళిదాసు విప్రలంభ శృంగారమునకు విరోధములగు శివపూజగోడవను కుష్ఠరోగ వికారమును త్యజించి యక్షుని విరహవిలాపమునుమాత్రమే మేఘునికి వినిపించి యొక సంవత్సరగాథనుగా దెలిపి అద్భుతమైన విరహయుగమును సృజించి ఇక్షుఖండమునుబోలు ఖండకావ్యము నావిష్కరించెను.

దీని గురుతెఱుగక రామగిరిగ్రామ మాసంస్థానములో నుండుటచే గాబోలు డా॥ భాఊదాజీగారు మొదలైనవారు సర్గుజా సంస్థానములో కాళిదాసు వియుక్తుడై యుండునను కల్పితగాథను ప్రచురించిరి. ఇక గాళిదాసకవి భార్య పద్మావతియనియును జెప్పుట సాహసమే! జనకతనయ స్నానమొనరించుటచేత గలుగు పవిత్రత నాపాదించుట కయియే 'రామగిరి' కల్పింపబడినదికాని నాగపూరు, సర్గుజా, నల్లగొండ [నిజాం], ప్రాంతములలోనున్న "రామగిరి" గ్రామమేమాత్రమును కాదు.

ఇటులే మేఘదూతలోని ప్రదేశములను తిథులను చారిత్రకముగ విమర్శించి ముడివేయ దలచుట వృథాప్రయాసయని రసైక గ్రహణ ధురీణులకు దెలియనిది కాదు.

"బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అనునట్లు "వ్యాసోచ్ఛిష్ట జగత్సర్వ" మ్మను నార్యోక్తియు నుండుటచే ననంత కథలకును వ్యాసమహర్షి వస్తువును ప్రసాదించియే యున్నాడు. కాని నేటి "పురాణనిందా యుగము"న వానిని దడవువారును కొలదియేకద! *



* ఇయ్యది శుక్లసం॥ కార్తీక బ॥ ౧౪ నాడు కాశీ సంస్కృత విద్యార్థుల "వక్తృత్వ కలోత్తేజక సంఘ"మున నుపన్యస్తము.

# శ్రీ శివాష్టకం

## ముదిగొండ నాగవీరయ్యశాస్త్రివిరచితం

శ్రీశాదిసర్వవిబుధేశాభిగీతసకలాశాంతసంగతయశాః,
కోశాధినాథమణికోశాంచితాంఘ్రిరచలేశానశృంగనిలయః,
కేశాంతరాళధృతభేశార్ధమండన ఇభేశాననాదిజనకః,
కేశాయితోడుపదవీశాంత దేవసరిదీశానమూర్తిరవతాత్ ॥

౨ ఆశానుబంధభవపాశాసితల్లజనికాశాతిభాసురచిదా -
దేశాతిపూతసుమునీశావళీహృదయకోశార్పితాంఘ్రికమలః ।
ఆశాతురాసురదుశావమానితదిగీశానముఖ్యసు మన :
క్లేశాపహారపటురాశావళీపటయుగీశానమూర్తిరవతాత్ ॥

౩ అంభోజసంభవముఖాంభోజహింసకకరాంభోజవిక్రమపటో ।
అంభోజినీడజరథాంభోజినీరిపుద్భృంగభోజశోభితముఖ !
కుంభోద్భవర్షి హృదయాంభోజజాగరపదాంభోజ మాం చిరతరం ।
శంభోఽవతాద్ వరకృపాంభోధిగుప్తనిఖిలాంభోజజాండవితతే !

౪ కాంతారవాసిమునికాంతావళీహృదయకాంతాభిరామసుతనో ।
కాంతాభిగీతరతికాంతాంగయష్టిహర కాంతాలికాగ్నినయన !
సంతానకామమునిసంతానదానచణసంతానశోభనతరో !
చింతాభియుక్తబుధచింతామణేఽస్మదభిచింతాం హరాదరనిధే !॥

౫ సోమం శిరఃకలితసోమం వనర్షివరసీమంతినీప్రికరదృ
క్కామం దృగస్తమితకామం సితీరుచిరవామం నికామసుషిమం
భీమం సురారిజనభీమం కనద్ద్వాదశభామం తమామరచయ -
క్షేమంకరం వృషలలామం తటిద్రుచిజటామండలం హృది భజే॥

౬ నాళీకజన్మరచితాళీకజన్మవచనాళీకదర్పకుపితం ।
నాళీకజాక్షకృతనాళీకదృగ్రుచిరనాళీకపూజనరతం
కాళీసముల్లసిత కేళీవిశేషరచితాళీకవాదకుశలం
వ్యాళీవరాజినగజాళీఘనాజినపటాళీదరం హృది భజే॥

[ ౨౪ వ పేజీ చూడుడు. ]

# మాతృప్రేమ

నూతికట్టు కోటయ్యగారు బి. ఏ.

౧

చిన్నతమున నల్లరి చేష్టలెన్నొ
తెలిసి తెలియకనేఁ జేయ విలసితకరు-
ణార్ద్రదృష్టిని సైరించి నాన్నగారు
కోపపడునెడ నేవొసాకులు వచించి
తదుపిషను దుర్తిటిఁ జల్లార్చు తల్లిఁదలఁతు.

౨

ప్రేమమీఱంగ నన్నముపెట్టి శాక
పాకములుపెట్టి నేయింతవైచి మూఁటిఁ
గలిపి ముద్దలు ముద్దలు గారవించి
"నాన్న! కడుపారతినుము నన్గన్న తండ్రి!
అవతల జరూరు పనులుంట నయితిగాదు
నోటి కందియ్యఁగా నేఁడు నేఁటికెట్లొ
నన్నురక్షింపుమయ్య మానాన్న! ముద్ద

---

[ ౨౩ వ పేజీ తరువాయి. ]

౭ మిత్రాయుతోత్కరపవిత్రీతిమాత్రరుచిగాత్రాభిరామమహసే ।
విత్రాసకారియమసూత్రాభిపాతమునిపుత్రాభిరక్షణకృతే ।
గోత్రాధిరాడ్దువిత్రనేత్రారవిందయుగమిత్రాననాయ భవతే ।
వృత్రాసురారిముఖజైత్రామరస్తుతచరిత్రాయ సన్నుతిరియం॥

౮ గంగాసరిల్లలదభంగామలామితరంగావళీజడజటే ।
శృంగారజన్మరుచిరాంగాపహారకృదపాంగాభిరామనయనే ।
భృంగావళీవరభుజంగావళీరుగభిరంగాయమానసుగళే ।
భంగానభిజ్ఞశివలింగే భృశం హృదయ! భంగం విహాయ వసతాత్॥



లొక్కటొక్కటిగా నోటనుంచుకొనర!”
అనుచు బుజ్జగించి వచించి అమ్మ యేఁగె
హర్షమున మెక్కఁదొడఁగితినన్న మేను.
మధుర సౌగంధ్య బంధుర మందగమన
పవనవీచిక లొకకొన్ని పఱచి యపుడు
నాదు ఘ్రాణేంద్రియము దన్పఁగాఁ దొడఁగిన
వాసనామధురిమకు భావమునఁ జొక్కి
ఎచటనుండి వచ్చినదబ్బ! యీసుగంధ
మని విచారణ సేయు చున్నంతలోన

* * *

అప్పుడే కాచిదింపిన ఆలనేయి
యుట్టిపైఁ బెట్టఁబడియుంట తట్టెనాకు.
నేతిబొట్టన్న నాకతిప్రీతి యవుట
కావలసినంత నేయుంట కట్టెదుటను
చుట్టుపక్కలనెవ్వరు చూచువారు
లేకపోవుటవలనను, లేచివచ్చి
తమక మాపుకొనఁగలేక తత్క్షణంబ
యొక్క మొగి లేచి నేయున్నయుట్టి దరిసి
దక్షిణ కర ముచ్ఛిష్ట సిక్తంబు కాన
వామకరమున ఘృతపాత్రపై కెఁదీయు
నంతలో నేమిసెప్ప—నాయంతరాత్మ
జల్లుమనియెను గుండె గుభిల్లుమనియె
ఉట్టి అంది యందని చాటనో ఘృతమ్ము
పాత్రనిండుగ నుండఁగఁ బట్టియో గ్ర
హించినది వామకరమాటనేమొ బరువు
నాఁగఁజాలిన శక్తిలేనందుచేతొ
ఏదికారణమోగాని ఘృతముపాత్ర
యొరిగిపోయెను నామది సురిగిపోయె

సగ్గమునకుఁ బయి నేయొల్క భూమ్మితలమున
గడగడ వడంకు చెదిసేయఁగావలయునో
నిర్ణయింపఁగ లేకుంటి నెమ్మనమున

* * *

అంతలో నమ్మవచ్చి నిర్ఘాంతపోయి
"అయ్యయో ! ఏమిరా యిది ! అంత నేయి
యొలికెనా? పిల్లి యుట్టెక్కి యొలకఁబోసి
నదియ? లేకున్న నీవేన? అరరెమెంత
పనియొనర్చితివి? ఎన్నాళ్లు పాటుపడిన
నింత నేయిలభించెను? ఇపుడె కదర
కాచివడబోసి యుట్టిపై వైచినాను
నాయనా ! నన్ను అడిగిన వేయ నటర!".

అనుచు కన్నీళ్ళ పర్యంత మైనదామె
నాన్నగా రప్పుడే వచ్చినారు సర్వ
ముఁ గనుఁగొనినారు నాబుద్ధి పూర్తిగా నె
ఱింగిన కతన ఇంత మత్కృతముగాఁ ద
లంచి కోపఘూర్ణితహృదయాంచలుఁడయి

* * *

పచ్చిజొన్నదంటును గొనివచ్చి నాదు
నొడలు పచ్చడిసేయఁగా నూహసేసి
అట్టె దంటెత్తినాఁడు, నాకపుడు తండ్రి
పరిశియ కాలరుదునిఁబోలి విలయకాల
దండధరుఁబోలి కన్పట్టె, దంటుముక్క
కాలసర్ప జిహ్వాగ్రమై కానిపించె
అమ్మ యడ్డముగావచ్చి "అయ్యో యింక
నిలచియున్నావు? పరుగెత్తి నేర్పుగదుర
దెబ్బలను తప్పుకో"మ్మని తెలియఁబలుక
కాలికిం బుద్ధిసెప్పితి కాని యపుడె

పడెను ఘాతమ్ము నిర్ఘాతపాతమట్లు
రెండవది యాఁగలేదు "కుఱ్ఱండు కాదు
పిల్లియఁట"యని బొబ్బలు పెట్టుచున్న
అమ్మ వామకరమ్ము పైనపుడ పడెను
ఏను పరుగెత్తి మా 'కక్క' యిల్లుసేరి
రెండునాళ్లటనుండి మాతండ్రి పట్ట
నాంతరంబున కేఁగినాఁడని యెఱింగి
చల్లగాఁ జేరుకొంటి మాయిల్లు; నాదు
బ్రదుకునకు నొక "ఎడ్వెంచ" రయిన నిదియె
వ్రాసిప్రచురించినాఁడను వ్యాసముగను

3

నాన్నగారి కోపాగ్నికింధనముకాక
యెన్నిసారులు మాయమ్మ నన్నుఁ బ్రోచి
నదియొ యెన్ని యబద్ధములాడినదియొ
అన్నియు వచింపఁగా సాధ్యమగునె నాకు?

---

నిజాం రాష్ట్రాంధ్ర మహాసభాధ్యక్షులును, సుప్రసిద్ధ
నాయకులును నగు శ్రీ మాడపాటి హనుమంతరావుగారి

## సందేశము

నిజాము రాష్ట్రములోనుండి యొక తెనుగు మాసపత్రికను 'విభూతి' యను పేర ప్రకటించుటకు ప్రభుత్వమువారి సెలవు పొంద గలిగిన మీరు ధన్యులు. తమ పత్రిక మొత్తముమీద ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుటయేకాక ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయ వ్యాప్తి విషయమున దురదృష్టవంతమగు నిజాం రాష్ట్రాంధ్రదేశమున ఆంధ్రమాసపత్రిక లేని లోపమును తీర్చుగాక యని నమ్ముచున్నాను. తమ కృషి విజయవంతముగా జేయ దైవమును ప్రార్థించుచున్నాను.

విధేయుడు,

మా. హనుమంతరావు.

# ఉత్తర కాశియందలి శక్తిస్తంభ లేఖ.

వేద కావ్య స్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధి, విద్యారత్న

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు.



పర్వతసార్వభౌముఁడగు హిమవంతుఁడు తన యుద్యానవనమందు మహోత్కృష్ట సౌందర్యమును రచించుకొనినాఁడు. నూతన ప్రవేశ మహోత్సవావసరమునఁ (Opening Ceremony) గాఁబోలు, నిమంత్రితులైన దేవతలిచ్చోటి యలౌకిక రమణీయతచే నాకృష్ట మనస్కులయి నేఁటికి నాస్థలమునందే నివసించుచున్నారు. అందువలననే యది దేవభూమి. భారతీయ మహర్షులు నాపుణ్యభూమి నాశ్రయించియే యిష్టార్థములను బడసిరి. కవితాకామినీ కాంతుండును మహానుభావుండును నగు కాళిదాసుఁడు స్వీయ ప్రథమకృతి ప్రారంభమున "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః" అని లిఖించి హిమాలయ ప్రశస్త్యభేరీధ్వానమును భూనభోంతరాళభాండంబునఁ బూరించెను. ప్రపంచ వివిధ భాగములనుండి వేనవేలు ప్రజలు ప్రతివత్సరము నాహిమవత్పుణ్యక్షేత్రమును సందర్శించి పరిపూతు లగుచున్నారు. ప్రతి భారతీయుని హృదయమున హిమాలయ సందర్శనోత్సుకత కలదు.

అస్మద్గురు వరేణ్యులు దమ హిమాలయ యాత్రానుభవమును గూర్చి నిరూపించిననాఁడు నాకును హిమాలయ సందర్శనాభిలాష గాఢముగ జనించినది. అటుపిమ్మట నేను కాశి చేరినపిదప నది యించుక పెరిఁగినను శుక్లసంవత్సరమునఁ గాశీపట్టణములోని విపరీత గ్రీష్మము నాహిమాలయ యాత్రాభిలాషను బ్రబలపఱిచినది. ఒక మిత్రునితోఁ గలిసి చైత్రకృష్ణ తృతీయ మొదలు జ్యేష్ఠకృష్ణ పంచమివఱకు హిమాలయ యాత్రను సేవించి కృతార్థుఁడ నైతిని. దానికి సంబంధించినవిషయ వైశద్యము ప్రత్యేక గ్రంథము నపేక్షించుచున్నయది.

నేను గొనివచ్చిన శాసనములలో "ఉత్తరకాశీశక్తిస్తంభ లేఖ", ముఖ్యమయినది కనుక, తత్సమాచారము నీక్రింద వివరించుచున్నాఁ

డను. హరిద్వారము * నుండి యుత్తరకాశీక్షేత్రము (బార్హాహాట్ అని యును దీనికి మఱొక పేరు) ౧౮౦ మైళ్ళదూరమున నున్నది. మేము నూఱుమైళ్ళమాత్రి మామార్గముననే నడిచి 'ధరాసు' క్యాంపు (చట్టి) నుండి యుత్తరకాశిదారి నెడఁబాసి యమునోత్తరీ (యమునానదిపుట్టుక) మహాక్షేత్రమును సేవించుకొని యాత్రోవన 'గంగానీ' చట్టివఱకు వెనుకకుమరలి "సింగోటా, చాకూరీ" చట్టీలమీఁదుగా నుత్తరకాశికిఁ 15-5-1929 జేరితిమి. ఉత్తరకాశి, కాశి, (బనారస్) యొక్క ప్రతి బింబమనఁదగి యున్నది. లేక కాశియే యుత్తరకాశీప్రతికృతి యగుఁ గాక! ఏలయన నుత్తరకాశిలో నతి ప్రాచీన చిహ్నములు దృగ్గోచరము లగుచున్నవి. వానిని రెండువేల సంవత్సరములకంటె నిటీవలివని చెప్పవలనుపడదు. ఉత్తరకాశిలోను శ్రీవిశ్వనాథుడు, అన్నపూర్ణ, దుర్గాదేవి, కాలభైరవుఁడు, డుంఢిరాజు మున్నగు ప్రధాన దేవతలు కాశిలోవలె విరాజిల్లుచున్నారు. స్నానార్థమై గంగానదియుఁ దత్తటమున దశాశ్వమేధ మణికర్ణికాఘట్టములును బ్రత్యక్షమగుచున్నవి. ఈ పుణ్యక్షేత్రము ధవళహిమావృత నగములమధ్యను సమప్రదేశములోనుండి, చూపఱ మనోరమను జూఱగొనుచున్నయది. అచ్ఛోటి సలిలసమీరరాజముల వేఱుగాఁ బ్రశంసింపనేల? ఇది టిహరీ (Gorh wal) రాజ్యమున మూఁడవ పట్టణమఁట! మిడిల్‌స్కూల్, పోస్టాఫీస్, మ్యునిసిపల్‌బోర్డు మున్నగునవికూడ దీని యాటవిక పట్టణత్వమునకు సాక్ష్యములు. యాత్రికుల కొఱకు రెండు ధర్మశాలలును గలవు. కాలీకమ్మలీవారి ధర్మశాల, ఔషధశాల, సుప్రసిద్ధములు. పరిసరమునఁగల రెండు మూఁడాశ్రమములును నుత్తరకాశీ పవిత్రతనినుమడించుచున్నవి.

ప్రాతఃకాలమున స్నానసంధ్యాదులనుదీర్చుకొని సమస్తదేవతా సందర్శన మొనర్చితిమి. భోజనానంతరము మఱొకమారు శ్రీవిశ్వనాథు మందిరమున కెదురుగాఁగల ధ్వజ (స్తంభ) మండపమును మడిబట్టల తోడఁ బ్రవేశించితిమి. ఇందే యీవ్యాసమునకు విషయము లభించి

---

* ఈ క్షేత్రము హరిహరులకు మహాద్వారముగ నున్నను మహాదేవుని ప్రాధాన్యమువలన నుత్తరదేశీయులలో హరద్వార (Hardwar) మనియే దీని వ్యవహారము.

నది. విశ్వనాథాలయ ముత్తరకాశిలో నధికమహత్త్వము కలదనుటసహజమే! ఆయాలయము మూఁడు నాలుగు పర్యాయములు సంస్కరింపఁబడినటులు తోఁచుచున్నది. అయినను జీవకళ లుట్టిపడు కొన్నివిగ్రహములు శిలాఖండములు మున్నగువానివలన నీయాలయ ప్రాచీనతను సులభముగఁ గనిపట్టవచ్చును. విశ్వనాథునకు నెదురుగా ౧౫ అడుగుల దూరమున నొక శక్తిస్తంభముకలదు. దానిని త్రిశూలమనియు జయస్తంభమనియును జెప్పవచ్చును. స్తంభముయొక్క క్రిందిభాగమున నొక మూరపొడవులో గుండ్రని రాగిదిమ్మ యొకటి కలదు. ఇట్టివింకను నేడు దిమ్మలు (లింగమునకుఁ బానవట్టమువలె) స్తంభమూలమున నున్నవని యచటివారు చెప్పుదురు. మీఁదికి ౧౭ అడుగుల పొడవుగలభాగ మిత్తడితోను జివరిమూఁడడుగులు నినుముతోడను స్తంభము నిర్మింపఁబడి త్రిశూలము పరశువులతోఁ దీర్పఁబడినది. అనఁగా నీస్తంభము భూసమతలమునుండి ౨౧ అడుగుల పొడవుకలదు. స్తంభ మష్టకోణముగ నున్నయది. చుట్టుకొలత రెండడుగు లుండును. ఈ కోణములలో మూఁడు బంతులతో నొక లేఖ చెక్కఁబడినది. దానినిగూర్చి "దేవాసురులు మహాఘోరసంగ్రామ మొనర్చినపుడు మహాదుర్గయొక్క శక్తి యాకాశమునుండి భూపతిత మయినది. ఇందలి లిపి యేరికిని దెలియదు" ని యచటి పురోహితవృద్ధులు వివిధాద్భుతవిషయములను జెప్పుదురు! ఇట్టి దంతకథను సత్య మని నమ్మియే కాఁబోలు నొక యమాయకపు సంస్కృత పండితుఁడు "కేదారఖండ"మను సుప్రసిద్ధస్కాంద మహాపురాణభాగమునఁ గొన్ని సంస్కృత శ్లోకములఁగూర్చెను. "నిక్షిప్తా యత్ర పూర్వం హి సంగరే దేవతాసురైః। అద్యాపి దృశ్యతే తత్ర శక్తిర్ధాతుమయీ శుభా" కే. ఖం. అ. ౯౩-౨౨. "మహాకాల్యాః కథం దేవ పతితా శక్తి రుత్తమా" ౯౩-౨౩. ఇందలి తాత్పర్యము, పురోహితుల వాఙ్మూలమునకు భాషాంతరీకరణ మనుటలో సందేహము లేదు. దీనియొక్క "పదునా అణాల యబద్ధము"ను గూర్చి యీవ్యాసము విన్నవింపఁగలదు. అసలు విషయ మేమనఁగా భారతవర్షమున నైదాఱువందల సంత్సరములనుండి సామాన్యముగఁ బ్రాచీన లిపి

యొక్క పఠన పాఠవము లాఁగిపోయినవి. ఆధునిక శిక్షితులు లిపి వేత్తలు హిమాలయ యాత్రలో నగపడరు. అందునను బ్రాచీన సామగ్రిని సంగ్రహించుటకై కష్టించువారెవరు? ఈ దుర్గమయాత్రలో రాని పోని పనినేల కల్పించుకొందురు? యాత్రలోఁ బ్రాచీన శాసనాదికములు కలవను వార్త మొదలే వినియుండుటవలనఁ బ్రతిబింబములను దీయుటకు నవసరములగు సాధనములను వెంట నుంచుకొంటిని. బరు వెక్కువగుటఁ జేసి వ్యయ ప్రయాసములకు గురియైన సంగతి నిక్కువమె కాని దీనిసాఫల్యముఁగూర్చి తర్వాత నందిన యానందమునకు మేరలేదు.

* * * *

పల్లెటూరిలోఁ గరణాలు పెద్ద దొరలుగా నుందురు. హిమాలయయాత్రలో మాబోటివా రెవరును నావత్సరమున రానందున దొరతనమును సాగించి కొన్ని పనులను జమత్కారముగ నొక్కించికొంటిమి. ఉత్తరకాశీవిశ్వనాథమందిరమును సహజగాంభీర్యధైర్యములతోఁ బ్రవేశించి శక్తిస్తంభమునఁ గట్టిన వస్త్రమును దీసివైచి సబ్బునీటితో "బ్రష్షు"వేసి యక్షరముల సందులలోఁ జిక్కిన మైలను సూదితోఁ దీయుచుండఁగా "పూజారి"మహానుభావుల యాగమన మయినది. వారు రక్తరంజిత నేత్రములతో "మీరీవస్తువులచే నీశక్తిస్తంభము పవిత్రతను బాడుచేసితిరి. ప్రాయశ్చిత్తసంస్కారమునకు వ్యయ మగు ద్రవ్యమును జెల్లించి తీరవలయును, లేనిచో, కోర్టులో వ్యాజ్యము వేసెద"నని గర్జించిరి. నేను ననేకవిధముల సంభాషించి యొక నాఁ డడవిభోజనమునకు సరిపోవు 'దక్షిణ'ను సమర్పించికొనిన తర్వాతను మావస్తువులయొక్క స్వదేశీయతను పారిశుద్ధ్యమును నంగీకరించిరి. ఎటులో మూఁడుగంటల కాలము పరిశ్రమింపఁగా నుత్తర కాశీనాథుని కృపవలనఁ బ్రతిబింబము పరిశుభ్రముగా లభించినది. ఆ మహాదేవునికృపకు సంతసించుచు వర్షములోఁ దడియుచుఁ బసకుఁ జేరితిమి. ఇచటికి సమీపమున నున్న స్వగ్రామమునకు మా కూలివాఁడు వెళ్లుట

వలన నుత్తరకాశిలో మూఁడురోజు లాఁగుట కవకాశము లభించినది. ఈలోపుగ నపుడపుడు లేఖను జదివి పాఠమును బూర్తి చేసితిని. నా ప్రథమ ప్రియత్నము సఫల మగుటచేతను మఱెచటను నీలేఖ ప్రకటితము కాలేదను నిశ్చయము వలనను దాత్కాలికముగ నానంద మనుభవించి తిని. తర్వాత ననేక పర్యాయము లేతద్విషయక వ్యాసమును బ్రకటింపఁ దలఁచియుఁ గారణాంతరములచే నింతవిలంబించితి నని వ్రాయ సంకోచ పడుచున్నాఁడను. టిహారీరాజ్యామాత్యులగు పం. హరికృష్ణ రతూడీగారు తమ "గఢవాల్ కా ఇతిహాస్" అను సుప్రసిద్ధహిందీభాషా గ్రంథమున నొక తెల్లదొరగారి యభిప్రాయానుసార మఁట యీశక్తిస్తంభలేఖను గూర్చి "ఇది ప్రాచీనపాలిలిపిలోఁ గలదు. చాలతప్పులును నున్నవి. సంవత్సరసంఖ్య యరిగిపోయినది. ఉత్తరకాశిని మాళవవంశరాజు యేలి నటులు తెలియుచున్నది. రాజు పే రుదారచరితుఁడు. ఆయన స్వపుత్రు నకు రాజ్యాభిషేక మొనర్పుసమయమున స్మారకముగ నీత్రిశూలమును స్థాపించియుండును. భాష చాలఁ దప్పులుగ నుండుటచేత రాజస్థానమున విశుద్ధసంస్కృతమును వ్రాయు పండితుఁడు లేకుండె ననవచ్చును" మున్నగు ననంబద్ధ విషయములను బ్రకటించినారు. లేఖను జదివించుటకుఁగాను శ్రీరతూడీగారు సరియైన ప్రయత్న మొనర్ప లేదని భావింపవలసియున్నది. కానిచో, నింత స్పష్టమైన లేఖనుగూర్చి యే ప్రాచీనలిపి వేత్తయైనను దప్పులకుప్పయను శుద్ధాబద్ధమును వచింపఁజాలఁడు. పాఠకులు శ్రద్ధతోడ నగ్రిమ పంక్తుల నవలోకించుచో నిజము దెలియఁగల దని నివేదించు చున్నాఁడను. శక్తిస్తంభ లేఖ మూఁడుపంక్తులలో నున్న దని వెనుక వ్రాసితిని. అది చాలఁ బొడవుగా నుండుటచేత దాని ప్రతిబింబముం బత్రికలో ముద్రించు తలంపుతోడ నొక్కొక్క పంక్తిని నాలుగు చరణ ములుగాఁ గావించి "డ్రాయింగు" చేసితిని. మొదటిబంతిలోఁ గొంచె ము చిన్నయక్షరములతో నొక శార్దూల విక్రీడితవృత్తమును, రెండవ బం

తిలోఁ బెద్దయక్షరములతో మఱొక శార్దూలవిక్రీడితవృత్తమును, మూఁడవ బంతిలో మఱియును బెద్దపెద్ద యక్షరములతో నొకస్రగ్ధరావృత్తమును వ్రాయఁబడినవి. సంపూర్ణలేఖ శుద్ధసంస్కృతములో సుందరాక్షరములతో స్పష్టముగా స్తంభముమీఁదఁ జెక్కఁబడినది. కవిత యమకానుప్రాసభూయిష్ఠమై సుగ్రాహ్యమై ప్రాచీన ప్రబంధరచనను విజ్ఞాపించుచున్నయది. ఇందు "ఆ ఇ ఓం క ఖ ఘ జ చ ఛ జ ఠ ణ త థ ద ధ న ప బ భ మ య ర ల వ శ ష స హ" అను నక్షరములును "క్ష జ్ఞ క్ర శ్చ స్వ" వంటి వాడుకలో నుండు సంయుక్తాక్షరములును గలవు. ఒకటి రెండక్షరములు మాత్రము సరిగాఁ దెలియనందున నర్థక్రమమును బట్టి పోలికతోఁ జదివినాఁడను. నా "డ్రాయింగు" ప్రతిబింబము [దిమ్మె]ల ననిందు వెంటఁ బ్రకటించుచు మూలపాఠము నీక్రింది వ్రాయుచున్నాఁడను.

( ౩౮ వ పుటలో చూడుడు )

౧ వ పంక్తి.

ఓం. ఆసీ ద్యః క్షితిపో గణేశ్వర ఇతి ప్రఖ్యాత కీర్తి న్నృపైః ।
చక్రే యేన భవస్య వేశ్మ హిమవచ్ఛృఙ్గోచ్ఛ్రితం దీప్తిమత్ ॥
కృత్వాను వ్వనజాధిప[ః] స్వకృపణైః సామాత్యభాగ్యశ్రియం ।
స్మృత్వా శక్రసుహృత్వ (త్త్వ) ముత్సుకమనా యాతః సుమేర్వాలయం ॥

౨ వ పంక్తి.

పుత్రస్తస్య మహాభుజో విపులదృక్పీనోన్నతోరఃస్థలః ।
రూపత్యాగనయైరనఙ్గధనదవ్యాసానతీతోద్గతః
నామ్నా శ్రీగుహ ఇత్యుదారచరితః సద్ధర్మధుర్యః సతాం ।
శక్తిః (౦) శత్రుమనోరథప్రమథనీం శంభోశ్చకారాగ్రితః॥

3 వ పంక్తి.

ప్రీతః ప్రీతమర్త్యాయాభై రురుభి రవిరలం శార్వరం ధ్మా(ధ్వా)న్తమాఘ్న।
న్నాలుంచం శ్చారుతారానికరపరికరోదారశారోదరత్వం॥
స్వం బిమ్బం చిత్రబిమ్బామ్బరతలతిలకం యావదర్కో విధత్తే।
తావత్కీర్తి స్సుకీర్తి శ్చిర మరిమథనస్యాస్తు రాజ్ఞఃస్థిరేయం॥ ౪॥

వీని సంగ్రహతాత్పర్య మిది:—"ప్రజానురాగి యగు గణేశ్వర నామకరాజు హిమాచల శృంగమువలె నత్యున్నతగోపురము గలిగి నట్టియును, బ్రకాశమానమునగు శివాలయమును గట్టించి, యమాత్య సమేతమగు రాజ్యలక్ష్మిని అణువువలె భావించి యింద్రునిమైత్రినిఁదలచి స్వర్గమునకు బ్రయాణించెను." వార్ధక్యము వలననో వ్యాధివలననో రాజు గతించియుండును. "శక్రసుహృత్త్వ" శబ్దము గణేశ్వరనృపాలుని పరాక్రమాధిక్యమును, "వనజాధిప" విశేషణము ఆటవిక రాజ్యపరిపాలనమును బోధించుచున్నది. అనఁగా నిప్పటియుత్తర కాశీపట్టణప్రదేశము నాఁడు శుద్ధాటవికుల నివాస మనియు నాయాటవికరాజు శివాలయమును మాత్రమే (శివలింగస్థాపనఁ జేసెననుటకు బ్రమాణము లేదు) నిర్మించెనని యూహింపఁదగును. మహాకవి కాళిదాసుండును * రఘు మహారాజు జైత్రయాత్రను వివరించుచు "కిరాతపార్వతీయ" శబ్దములతో హిమాలయప్రాంతపు జనులయొక్క యాటవికత్వమును సూచించినాఁడు॥ ౧॥

గణేశ్వరరాజతనూభవుండు శ్రీగుహుఁ డనునామమునఁ బ్రసిద్ధ కెక్కెను. ఆతఁడు దీర్ఘబాహుండును విశాలనేత్రుండును స్థూలోన్నత వక్షస్థలుండును నుదారచరితుండును ధార్మికధురీణుండును లావణ్యమున, దానశీలత, నీతికౌశలములలోఁ గ్రమముగా మన్మథకుబేర వ్యాసులను *నతిక్రమించిన వాఁడును నై యుండి శివునకు నెదురుగా శత్రుమనోరథవిధ్వంసి యనఁబడు నీశక్తిస్తంభమును బ్రతిష్ఠించెను." తండ్రియగు గణేశ్వరుఁడు మందిరమును గట్టించునంతలో గతించినటులును దరువాతఁ బుత్రుఁడగు గుహరాజు ధ్వజస్తంభమును జేయించినటులును విషయము స్పష్టపడుచున్నది. కాని, "శక్తి" స్తంభ మనుటవలనను "శత్రుమనోరథప్రమథనీ" విశేషణమునలనను నిది గుహునివిజయ చిహ్నమనియు భావించుటకు నవకాశముకలదు. ప్రస్తుతముభారత దేశ

---

* రఘువంశము ౪-౭౭ చూడుఁడు.

* దానమునఁ గర్ణునివలెఁ గుబేరుఁడును నీతిశాస్త్రమున శుక్రచాణక్యులవలె వ్యాసుఁడును నాఁడు ప్రసిద్ధు లనుకొనవలసి యున్నది.

మున నెల్లచోట్లులను లభించునట్టి యశోకచక్రవర్తి ధర్మస్తంభములను విజయ స్తంభములని కొందఱనుచున్నారు. ప్రాచీనకాలమున స్తంభ లేఖలలో విజయవార్తలను బ్రకటించుట గూడ నాచారమైనట్లులు తెలియవచ్చెడిని. కావ్యచిత్రకళాచార్యుఁ డగు కాళిదాస కవిగురుండును రఘుమహారాజుయొక్క విజయ స్తంభమును గూర్చి చమత్కారముగఁ •"త్రికూటపర్వతాంకమున వప్రక్రీడ నొనర్చుచున్న రఘుచక్రవర్తి మదగజములు కోరలతో గీచిన రేఖలు (అక్షరములు) పరాక్రమమును బ్రశంసించుచుండ నాత్రికూటాచలము రఘుమహారాజుయొక్క జయ స్తంభముగఁ బరిణమించె"నని చిత్రించెను. ఇందువలన జయస్తంభస్థాపనాదికమును చాలఁ బ్రాచీనములనుటకు సందేహము లేదు. ఇటులె యీశక్తి స్తంభము విశ్వనాథసామ్ముఖ్యమున ధ్వజమైనను గుహరాజు రాజ్య పరిపాలనమునఁ బదార్పణ మొనర్చిన తరువాత నుత్తరకాశివఱకు జైత్రయాత్రఁగావించి జయ స్తంభమును నెలకొలిపెనని యూహింపఁ దగును. గణేశ్వరుఁడు గుహుఁడు నేవంశమువారు? ఎచట నేకాలమునఁ బాలించిరి? అను ప్రశ్నములకు నుత్తరము లాధుని కేతిహాసములలో నెక్కడను గనుపింపవు. భారతవర్షేతిహాసమున నింకను విక్రమాదిత్యుని వంటి చక్రవర్తుల యితివృత్తము దృష్టిగోచరము కానపుడు గుహునిఁ బోలు నడవిరాజులనుగూర్చి వేఱ వ్రాయనేల? † లిపిపరామర్శముచేత మాత్ర మీరాజులు క్రీ. శ. 5 వ లేక 6 వ శతాబ్దమున నుండియుందురని భావించుచున్నాఁడను. ఏది యెటు లున్నను గుహరాజుయొక్క జయ స్తంభస్థాపనకార్య మితిహాసజిజ్ఞాసువులకు నత్యంతోపకార మొనర్చినయది. కాశి (బనారస్) వంటి సుప్రసిద్ధస్థలమున నొక ప్రాచీన చిహ్నమేని యగపడనపుడు నాటవికప్రదేశమగు నుత్తరకాశియందింత పురాతనలేఖ లభించుట కౌతుకాస్పదము. ౨.

---

• "మత్తేభరదనోత్కీర్ణ వ్యక్తవిక్రమలక్షణం, త్రికూట మేవ తత్రోచ్చైర్జయ స్తంభం చకార సః" రఘువంశము ౪-౫౯ చూడుఁడు.

† శివాలయనిర్మాణము శైవనామధారణముఁ జూడ వీరు శైవులుగఁ గన్పట్టెదరు.

"భగవంతుండగు సూర్యనారాయణుండు తన యరుణ కిరణము లచే గాఢాంధకారమును విధ్వంసమొనర్చి చారుతారా నికరముల చిత్రి చర్యలను బోఁదుడిచి యంబరఫలకమున స్వీయబింబరూపతిలకము నెంత కాలమువరకు నిడఁగలఁడో యంతకాలముదనుక శత్రుభీషణుండగు నీ గుహాన్నృపాలునియొక్క కీర్తి సుస్థిరమై వెలుఁగుఁగాక!" యను మంగళా శీర్వాదము మహాధ్రువమనుట నిక్కవము. ౧౭-౧౮ వందల సంవత్సర ములనుండి చెక్కుచెదరని యీ శక్తిస్తంభమింకను వేల సంవత్సరముల పర్యంతము స్థిరమగునేని యాశ్చర్యముకాదు* ॥3॥

ఇందలిలిపి గుప్తరాజుల కాలమునాఁటిదని పొడకట్టుచున్నయది. లేఖయొక్క యాద్యంతములలో "ఓం" "ఠ" అను నక్షరములు లిఖిం పఁబడినవి. మఱియు ననేకలేఖలలో నిటులగపడుచున్నవి. కావున నిద్దియుఁ బ్రాచీనపద్ధతియే యగును. నాయభీష్టమునెరవేర్చి కుశలముగ స్వదేశమునకుఁ బంపినందులకు నుత్తరకాశీవిశ్వనాథుని వినుతించి విర మించుచున్నాఁడ†.

(ఆ॥ సా॥ ప॥ నుండి)



* ప్రస్తుతమీ స్తంభమునకు నిత్యనైవేద్య దీపారాధన పూజలతోపాటు తైలగంధాది లేపనములును జరుగుచున్నవి, కావున టిహరీరాజ్యాధికారులు చెడకుండు నటులఁ జూడవలసియున్నది.

† ముందుఁ బ్రకటింపఁబడు కేదారఖండసర్వస్వ మను గ్రంథమున నీవ్యాస మొక యధ్యాయము,

# వి భూ తి

## విద్వాన్ కె. బి. కోటిలింగందేవరగారు

క॥ స్వస్తి విభూతికి, సుకవి
పరిస్తుతగుణభూతి, కాంధ్రరాష్ట్ర సముద్య
న్నిస్తుల సదాగతికి, వి
ధ్వస్తార్య జనాళిభేద తాంత్రిక మతికిన్ .

క॥ మత సాంఘిక సాహిత్య వి
తతశాస్త్ర కళావినోద ధర్మార్థములన్
గుతుక మెసగంగఁ బలుకుచు
నతులితగతి, నాంధ్రజగతి, నలరు విభూతీ !

క॥ సర్వాంధ్ర కళాంగనవై
దివ్యతర సమష్టిధర్మ తేజోన్వితవై
భవ్యమనః పద్మినివై
రవ్యబ్జులు వెల్గునటుకుఁ బ్రబలు విభూతీ !

క॥ గురుకులుఁడు సహజముగ, స
ద్గురుగుణుఁ, డఖిలార్థ తత్త్వకోవిదుఁ, డటుపై
వరవర్ణి, వీరభద్రుని
కరజనితవు, నీకు సుగతిగల్గు విభూతీ !

క॥ సార్థక జన్ముఁడు నీపిత
వ్యర్థపరిక్రియల నిన్నుఁ బలికించునె, స
త్యార్థము వెలయఁగ, లోక హి
తార్థము సార్థక సమాఖ్య నందు విభూతీ !



# సందేశము

## నిడుదవోలు వేంకటరావుగారు, బి. ఎ.

క॥ పరమ మహిమాస్పదము లగు
హరు నెనిమిది మూర్తులట్ల నలరెడు నష్టా
వరణముల దివ్యతేజః
స్ఫురితంబు విభూతి మీ 'విభూతి'నిఁ బోలుచున్.

సీ॥ వేదాగమపురాణ విపులార్థ సంయుక్తి
శైవసిద్ధాంత పరిశస్తిఁ దెలియ
కల్పసూత్రన్యాస ఘనమంత్ర వివరణ
శైవ ధర్మాచార సరణి వెలయ
సంస్కృత సాహితీ సంపత్కళావాప్తి
శివకవి మహిమంబు చెన్ను మిగుల
దేశభాషాకావ్య ధీవిలాసస్ఫూర్తి
శివభక్తి రససిద్ధి సిద్ధిఁ జెంద
చిరతరంబుగ భరతవర్షీయ భూము
లందు మతములకెల్ల ననాదియగుచు
నెలకొనిన శైవ సన్మతోజ్జ్వల విభూతి
పూర్ణతను జెందుఁగాత 'విభూతి' భూతి.



# విభూతి - వివేకము.

మహాకవి చివుకుల అప్పయ్యశాస్త్రిగారు



నేఁ డనేకజన్మార్జిత పాపలతాలవిత్రంబగు మహాశివరాత్రియగుటచేఁ బశుపతి ప్రీతిపాత్రంబును, పాశుపతవ్రతిశిరో ధార్యంబును విభూతి ప్రదంబునగు విభూతినింగూర్చి జన్మంబు ధన్యంబగుటకై వేదోక్తాంత ప్రశంసించి లిఖించిమిత్ర శైవాత్మకుని నూతన విభూతి పత్రికాప్రీతిఁ గోరి యందుఁ బ్రచురించు చున్నందుల కానందమందుచున్నాఁడను.

## విభూతి యననేమి?

విశేషముగాఁ గలుగునట్టిది విభూతియనంబడును. బ్రహ్మ విష్ణు మహేశ్వరాతీతుండును, ఓంకారశబ్ద వాచ్యుండునగు శ్రీ పరమేశ్వరుని సద్యోజాతమనెడి మొదటిమొగమునుండి పృథివి, దీనివలన నివృత్తి, దీనివలనఁ గపిలవర్ణయగు నందయనెడు గోవును, దీనిగోమయముచేత విభూతి జనించినది. [౨] ఆభగవానుని వామదేవమనెడి రెండవ ముఖము నుండి యుదకము, దీనివలనఁ బ్రతిష్ఠయు, దీనివలనఁ గృష్ణవర్ణయగు భద్రయనెడు గోవు, దీని గోమయముచేత భసితము జనించెను. [౩] ఆమహాత్ముని అఘోరమనెడి మూఁడవ వదనమునుండి యగ్నియు, దీనివలన విద్యయు, దీనివలన రక్తవర్ణయగు సురభియనెడు గోవును, దీని గోమయముచేత భస్మజనించెను. [౪] ఆమహాదేవుని తత్పురుష మనెడి నాల్గవ యాస్యమునుండి వాయువు, దీనివలన శాంతియు,దీనినుండి శ్వేతవర్ణయగు సుశీలయనెడి గోవును. దీని గోమయముచేత క్షారము జనించెను. [౫] మఱియు నామహామహుని "ఈశాన" మనెడి యైదవ యాననమునుండి యాకాశము, దీనివలన శాంత్యతీతయు, దీనివలనఁ జిత్రవర్ణయగు సుమనయనెడి గోవును, దీని గోమయముచేత రక్షయు జనించెను.

దీనింబట్టి తొల్దొల్త నోంకార శబ్దవాచ్యుండగు పరమేశ్వరుని సద్యోజాతాది పంచముఖములనుండి పంచవర్ణములుగల గోవులు జనించు

నట్లును, వాని గోమయములవలన విభూతి, భసిత, భస్మ,క్షార,రక్షలనెడి పంచనామముల విభూ విభూతి గలిగినట్లును తేలుచున్నది.

ఐశ్వర్యమునకుఁ గారణమైనందున విభూతి లేక భూతియనియు సర్వపాపములను రూపుమాపునదిగాన భస్మయనియు జ్యోతిః స్వరూపమై వెలుఁగునదిగనుక భసితమనియు ఆపత్తులను హరించునది గాన క్షార మనియు భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షసాపస్మారముల వలనఁ గలుగు నెల్లభయములను బాపి కాపాడునది కాఁబట్టి రక్షయనియుఁ జెప్పఁబడుచున్నది. ఈవిభూతిని నగ్నివీర్య మనియు నందురు.

## విభూతి యెట్లు నిష్పన్న మగును ?

వికటావయవములుగలదియు, నున్మత్తయు, దుష్టయు, మలి నయు, నశుభచిహ్నములు గలదియుఁ, దిరిగిపెయ్యగలదియుఁ, గృశించిన శరీరము కలదియు, దూడలేనిదియు, బొడుచునదియు,బాలు పితుకనిదియుఁ, దొ్రొక్కుడుగడ్డిని, వెండ్రుకలను, బట్టపేలికలనుఁ నెముకలను భక్షించునదియు, వెదగలదియు, నకాలమునఁ బాలు పితుకు నదియు నగు గోవుకాక యెల్లవిధముల మంచిగానున్న యావు (కపిల ముఖ్యము) యొక్క గోమయమును నేలపైఁబడకుండఁ బైనుండియే పట్టు కొని పదునాల్గు ముద్దలు గావించి సువర్ణ, రజత, తామ్ర పాత్రముల లోనో మృణ్మయ పాత్రములోనో యుంచి సూర్యకిరణ ప్రసారము బాగుగాఁ దగులు నట్లుండఁబెట్టి యవ్వానిని దివ్యాగ్నియందుఁ బుటము పెట్టి యాదినముననో మూడవ దినముననో నాల్గవ దినముననో తీసి భస్మ మొనరింపవలయును ఎల్లప్పుడు దీనిని బరిశుద్ధ పాత్రియందుంచి కాపాడు చుండవలెను.

## ఎవ్వాడెవ్వాడు విభూతి యెట్లుధరింపవలెను.

అట్లు నిష్పన్నమైన విభూతియందు చందనము, పచ్చకర్పూరము కుంకుమపువ్వు, వట్టివేరు, అగరుల చూర్ణమును గలిపి దానిని యథా, విధిగా శిరస్సునందు లలాటమునందును, వక్షస్థలమందును, భుజము

లయందున్ను, మఱియు సర్వాంగములందును ధరింపవలయును. ఈ విభూతిని స్నానానంతర పూజాసమయములందే కాక నిదురించి లేచిన పిమ్మటను, భుజించిన పిమ్మటను, బాలుతాగిన పిమ్మటను, నవసర కార్యాచరణానంతరమందును, స్త్రీని, నపుంసకుని, గద్దను, పిల్లిని, కొంగను, ఎలుకను, మఱియు నీ మొదలగువానిని దాకినప్పుడును ధరింప వలెను. ధరించినచో నాయాదోషములు మటుమాయమగును. మఱియు దీర్ఘసహితముగాఁ బుచ్చుకొనవచ్చును.

## విభూతి యెన్ని విధములుండును?

ఇది నాలుగు విధములు: (౧) విరజాదిహోమములచే వ్రేల్చబడిన యగ్నియందు జనించినది. దీనికి "అనుకల్ప" మని పేరు, (౨) అడవియం దెండిపడియున్న గోమయమును దెచ్చి కల్పోక్తవిధిగాఁ జేయఁబడినది. దీనికి "ఉపకల్ప" మని పేరు, (౩) అరణ్యమందెండిన గోమయమును జూర్ణి కరించి గోమూత్రముతోఁ గలిపి ముద్దలను జేసి యథాకల్పముగ సంస్కరింపఁబడినది. దీనికి "ఉపోపకల్ప"మని పేరు. (౪) శివాలయము నందుండునది. దీనికి "అకల్ప" మనికాని "శతకల్ప" మనికాని పేరు. ఈ నాల్గు విధములుగా నుండు విభూతులలో నేది ధరించినను సమస్త పాపములు నశింపఁజేసి మోక్ష మొసంగఁగలదు. మఱియు నీవిభూతి వైదికము, తాంత్రికములని రెండు విధములుగఁగలదు. ఇదిమరియొకచో ప్రస్తావింపఁబడ వచ్చును.

## త్రిపుండ్రమందలి రేఖలతాత్పర్య మేమి?

ప్రతిస్థలమందును మూఁడేసి రేఖల చొప్పున భస్మము ధరింప వలయును. ఈ రేఖలకు అకారోకారమకారాత్మత్వమును, సత్వరజస్తమోగుణాత్మకత్వమును గార్హపత్య, దక్షిణాగ్న్యాహవనీయ స్వరూపత్వమును, భూలోకాన్తరిక్షలోకద్యులోకాత్మకత్వమును, ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపత్వమును, వేదత్రయాత్మకత్వమును, ప్రాతస్సవన మాధ్యందిన సవన తృతీయ సవన స్వరూపత్వమును, త్రిమూర్తి స్వరూపత్వమును జెప్పఁబడినది. ఈ రేఖల ధరించినవాఁడు భగవదనుగ్రహ పాత్రుఁడు గాఁగలఁడు.

## విభూతి మహిమ

విభూతిమహిమను గూర్చి పెక్కు గాథలు పెక్కుపురాణము లలోఁ గలవు. అందు ముఖ్యములైనవాని నిట నుదాహరించుచున్నాను. ధనంజయుఁడను బ్రాహ్మణుఁడు వసిష్ఠవంశమందు జన్మించినవాఁడు. ఇతఁడు నూర్గురభార్యలఁ బెండ్లాడెను. ఇతనికిఁ గరుణుఁడను కుమారుఁ డుండెను. శుచిస్మితయను నొకకన్య యితనికి భార్య. ఈకరుణునకుఁ దన సహోదరునితో గొప్ప శత్రుత్వము కలిగెను. అప్పు డితఁడు స్వగృహ మును విడిచి భవానీ తీరమునందలి నృసింహక్షేత్రమునకుఁ జేరెను. అంతకుముందే యెవరో యక్కడ దేవునకు సమర్పించియున్న జంబీర ఫలమును వాసన చూడఁగా నది గన్నమహర్షులు వందయేండ్లు ఈగవు కమ్మని శపించిరి. కరుణుఁడంతట ఖిన్నుఁడై తనసతి కీయుదంత మంతయు, జెప్పి తనను జాగ్రత్తగాఁ గాపాడుకొనుమని వచించె అత్తఱి దాయాదులు మక్షిక రూపముతోనున్న యతనిని బట్టి నూనెలోఁ బడవేయ నది మృతిజెందెను. అత్తఱి నతనిభార్యగని త శవమును అరుంధతీదేవి సమీపమునకుఁ దీసికొనిపోయి వేడుకొనఁ నామె అగ్నిహోత్రమందలి విభూతితో నభిమంత్రించి బ్రతి చెను. ఈ ప్రకార మైదుమారు లతనిని జ్ఞాతులు చంపుటయు భస్మ ముతో బ్రతికింపఁబడుటయు నయ్యెను. ఆ కరుణుఁడే తుట్టతుదకు విభూ త్యభిమంత్రిణ మహిమచేతనే దధీచి మహర్షి యయ్యెనని గ్రహిం తురుగాక.

౨. దేవతలెల్లరు గౌతముని వివాహమునకేతెంచి జగదేక సుం దరియగు నహల్యనుజూచి కామాతురులైరి. ఆయపరాధముచేత వారు నష్టజ్ఞానులై మహాబుర్షివరేణ్యుఁడగు దుర్వాసుని కడకువచ్చి వేడుకొనిరి. అప్పుడవ్వారి దీనారవమాలకించి యామహర్షిపుంగవుండు దివ్యభస్మంబు జేకొని యభిమంత్రించి యతని శరీరముపై నలదెను. అంతఁ దత్పాప సంతాన మంతయు నంతరించెను.

ఒకప్పుడు మహాదేవుఁడు తనవక్షస్థలమందున్న విభూతిని విష్ణు వుపై వైచి ధ్యానింపుమని వచింప నాహరియు ధ్యానించి హరుని యను

మతిని భస్మస్నాన మొనరించి భస్మమును భక్షించి తన్మహిమంబున దన నల్లనిరూపు విడిచి దేదీప్యమానంబగు ముత్తెమువంటి వర్ణము బొంది యానందించి ప్రార్థించిన విభూతిధారణసంపన్నుండే నాకుభక్తుడని వచించెను. ఇంకను గాథలు పెక్కులుగలవు. విస్తరభీతిని విడిచితి.

### విభూతి ధారణమువలన ఫలమేమి ?

ఇది సమస్త పాపములను, కష్టములను, నష్టములను మాపు మాపును. మనోరథములను సిద్ధింపజేయును. ఆరోగ్యభాగ్యము గల్గించును. చర్మరోగంబులను నిర్మూలించును. శరీరమునకుఁ గాంతిసమకూర్చును. ఐశ్వర్యమును కలిగించును. పరమేశ్వరప్రీతి జేకూర్చును. వేయేల? ఐహికసుఖంబులన్నింటిం గల్గించి యాముష్మిక సుఖంబు లందజేయునని నిస్సంశయముగా నమ్మవలయును.

ఇంకను విభూతింగూర్చిన యంశములు పెక్కుగలవు. అవన్నియు విస్తరించి వ్రాయఁదగినవే, అయినను వ్యాసవిస్తరభీతిచే విడిచినందులకు మన్నింపుఁడు. ధర్మమును రక్షించి ధర్మంబుచే రక్షింపఁబడుడు.

---

---

(౪౭ వ పేజి తరువాయి)

ఐన నీ 'విభూతి' కీలకము (పోషణ) అంతయు రచయితలూ, పాఠకులూ అయిన ఆంధ్రసోదరుల చేతులలోనిదే ఐవుంది. వారిజయమే దీని జయమునుకూడాను. అందున దీనిఁ 'విభూతి' యభివృద్ధికి అఖిలాంధ్ర సోదరులు తోడుపడాలని, అఖిలభారతీయాంధ్రుల విభూతియే ఈ 'విభూతి' అయ్యేటట్టు చూడాలనీ, అఖిలాంధ్ర సోదర సోదరీమణులకు మా ప్రార్థన.

జి. వీరనాగేంద్రుడు

---

# విభూతి నామ సార్థక్యత



'విభూతి' యన్నమాత్రాన కొందరిలా భావించవచ్చు. 'శైవులు నొసట ధరించు భస్మమే' అని. ఇదియొక శైవపత్రికయనియు అనుకోవచ్చుకూడా. ఐతే మా ఆశయం. అది అంతమాత్రమే కాదని మా పాఠకులకు వెల్లడిపరుస్తున్నామ్. పైగా మతమతాంతరాల కలహాలచే విప్లవానికి గురియైన మన భారతీయులకు "భిన్నభిన్న స్వరాల భిన్న భిన్న రుచుల సక్రమ మేళనాన్నే సుశ్రావ్యగీతంగాని, సుస్వాదుపాకం గాని ఏర్పడుతుంది. అలాగే భిన్నభిన్న మతాల సక్రమ సామరస్యాన్నే మన మొకవిధమగు ఆనందామృతాన్ని వెలిపరుపగలుగుతాం" అట్టి అమృతాన్ని రుచి చూపించడమే ఈ 'విభూతి'యొక్క పరమలక్ష్యం. దానికొరకే ఇది నానావిధాల పాటుపడుతుంది; అంగరూపకంగా 'కళాపోషణ'లనుగూడ నిది స్వీకరిస్తుంది.

ఆయామతీయులనక సర్వులకు కావలసివుంది సంపత్తు. అటులనే ఈ పత్రికయు సర్వులకు కావలసినదిగా అయ్యేటట్టు ఆ భగవంతుడు కరుణించాలనే అదే విశిష్ట సంపదర్థాన్ని బోధించే విభవత్యున యేతి 'విభూతి' అని అసలు విగ్రహం "విభూతి" (విశేషేణభవతీతివిభూతిః) అనే నామకరణాన్ని పొందింది ఈ పత్రిక. సంపదలో విశిష్ట సంపదయన ఏలాటిదో తెలుసుకోవాలంటే భగవద్గీతయందలి 'విభూతి యోగాన్ని' కొంత చూడాలి. ఈ 'విశిష్టసంపద' యనేది ఆ భగవంతుని తేజస్సంభూతమే అయివుంది ఈ విషయాన్ని అదే భగవద్గీతయే బయలుపరుస్తూవుంది. 'యద్యద్విభూతిమత్ సత్వం శ్రీమ దూర్జితమేవవా తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్'అని. అట్టి విశిష్టరూపములగు సారస్వత ధార్మిక, నైతికాది ఆంధ్రవైజ్ఞానిక సంపదలతో సర్వాంగ సుందరంగా శోభిస్తుండాలనే 'విభూతి' యను సార్థక నామధేయముతో ఇపుడిపుడే ముందంజవైచుచు మీ కరకమలాల నధిష్ఠించగలిగింది ఈ పత్రికారాజము.

(౪౬ వ పేజీ చూడుడు)

# మహోదార చరితులగు
# శ్రీ మటికె నాగయ్యగారు



సికిందారాబాదు వీరశైవ దీక్షావంత భక్తకుటుంబములో మటికె వారు సుప్రసిద్ధులు. ఈవంశము నిరతాన్నదానపరోపకారసదాచారములకు పుట్టినిల్లు. జ్యేష్ఠుడైన మటికె రాజన్నగారికి సంతానము లేనందున తన సోదరుడగు మటికె చెన్నబసవప్పగారి పుత్రుడైన శ్రీమటికె నాగయ్యగారిని దత్తుపుత్రునిగా స్వీకరించెను. బాల్యమునందే నాగయ్యగారి సుగుణ గణము వెల్లడియగుచు వచ్చెను. నిరాడంబర జీవనము, కష్టసహిష్ణుత, పరోపకారము, గురుజనసేవ మున్నగు సులక్షణములు వారి స్వాధీనములు. తత్సిద్ధాంతములకు విరుద్ధముగ నెన్నడును ఆచరించియెరుగరు. చురుకైనచూపు, చక్కనిముక్కు, విశాలమైన ఫాలము నాగయ్యగారి సౌభాగ్యమును సూచించుచుండెను. వారు పెత్తండ్రిగారింట ప్రవేశించగనే చిల్లరవ్యాపారమున నాశాజ్యోతి ప్రజ్వలితమయ్యెను. కార్యదీక్షవలన కష్టములను సైతము లెక్కించక ఉదయ మూరుగంటలు మొదలుకొని రాత్రి ౧౦ గంటల దనుక గాఢముగ బరిశ్రమించ వలసియుండెను. పరమేశ్వరుడు తగిన ఫలము ననుగ్రహించకుండునా? కుటుంబ పరిస్థితులు చక్కబడుచు వచ్చెను. నాగయ్యగారి కుత్సాహము మెండయ్యెను. బస్తాలకొలది బియ్యమును స్వయముగవండి దీనులకు యాచకులకు అన్నదాన మమావాస్యనాడు చేయుచుండిరి. రానురాను వారిలో ధార్మికబుద్ధి వృద్ధియగుచువచ్చెను. ఈమధ్య నకస్మాత్తుగ కాశీక్షేత్రమున పండిత చిదిరేమఠము వీరభద్రశర్మగారి పరిచయము కలిగినదాదిగ నాగయ్యగారికి శాశ్వతముగనిలుచుధర్మకార్యమునొకటి గావించవలయుననుతలంపు మెండయ్యెను. సామాన్యమైన చిల్లర వ్యాపారముమీద లభించు ధనమని కాదు కేవల స్వకష్టార్జితమైన సర్వస్వమనబడు ఇరువదివేల రూపాయీల నిధిని సంపూర్ణముగ వ్రియపరచి రాత్రింబవలు స్వంతముగ బరిశ్రమించుచు సికిందారాబాదు సజ్జలాలు వీథిలో నొక చక్కని ధర్మనిలయమును నిర్మించిరి. దాని యుద్దేశ్యములు



రు ౨౦౦౦౦ లు వెలగల తమ ధర్మనిలయమును
వీరశైవుల యభ్యుదయమునకై సమర్పించిన
కీ. శే. మటికె నాగయ్యగారు



శ్రీ మటికె నాగయ్యగారి ధర్మనిలయమున
పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారిచే నిర్వహింపబడుచున్న
వీరశైవ గురుకులము

బాగుగ నెరవేరవలయు నన్నచో సమర్థులగువారికి సమర్పించకతప్ప దను సంగతిని వారుబాగుగ గుర్తెరింగి యుండుటవలన అన్నివిధముల తమకు విశ్వాసపాత్రులైనట్టియు మొదటినుండి ఈధర్మనిలయమునకై ప్రోత్సాహకులైనట్టియు పం॥ వీరభద్రశర్మగారినే తమ నిలయమున నిలుప పట్టుపట్టిరి. నాగయ్యగారి యనురోధమే గెలిచినది. వీరశైవుల సంస్కృత విద్యాభివృధ్యర్థమై తమ యమూల్యమైన ధర్మనిలయ మును మహాత్యాగముతో సమర్పించి రిజిష్టరు చేయించిరి. వీరభద్ర శర్మగారు యాదగిరి శంకర సంస్కృత కాలేజిలోని తమ ప్రిన్సిపాలు పదవిని వదలుకొని ఈ ధర్మనిలయముననే వీరశైవ గురుకులము నారంభించిరి. సుప్రసిద్ధమైన 'శైవభారతీభవన' గ్రంథాలయమును ఇట స్థాపింపబడెను. గొప్పయుత్సాహముతో కార్యవాహి జరుగుచుండెను. దీనిని నింతకంటె గొప్పసంస్థగా చేయవలెనని నాగయ్యగారు ప్రయత్నించుచుండిరి. కాని పరమేశ్వర విధానము వేరుగా నియమించు చుండెను. నాలుగైదు మాసముల దీర్ఘవ్యాధి క్షయగా మారి ధర్మవీరుండును వీరశైవకుల భూషణుండును నగు నాగయ్యగారు ధాత నామ సంవత్సర పుష్య బ॥ ౮॥ దినమున తమ యేబదిరెండేడ్ల ప్రాయముననే కైలాసవాసులైరి. వారు స్థాపించిన ధర్మనిలయము మాత్రము వారి కర్తితో బాటు శాశ్వతముగ నుండగల దనుటకు సందియములేదు.

కర్ణాటక వీరశైవులకు ననేక సంస్థలు కలవు. కాని ఆంధ్రవీరశైవులకు మాత్రము ఈ ధర్మనిలయ మొకటియే అన్నివిధముల నద్వితీయమై యున్నది. వీరశైవ గురుకుల కక్షలో విద్యార్థు లభ్యాస మొనర్చుచున్నారు. శైవభారతీ భవనమునకు నింక నెంతయోపని కావలసియున్నది, మన సుప్రసిద్ధ 'విభూతి' పత్రికయు ఇచటనే ప్రకటింపబడుచున్నది, ఇంక నెన్నియో కర్తవ్యములు కలవు. ఉదారమహాశయులు తమ తమ సహాయములను త్వరగాబంపి పండితుల పరిశ్రమను సార్థక పరతురు గాక యని నివేదించుచున్నాను.

ఆర్. శంకరయ్య,

---

# వ్యాఘ్రపాద మహర్షి

అనువాదకర్త:-బాదిడె మఠం మహాంతయ్యా



గంగానదీతీరమునం దొక గ్రామమున ప్రాచీనకాలమందొక ధర్మాత్ముడగు బ్రాహ్మణుం డొండు వసించుచుండెను. అతడు విద్వాంసుడు. అతనికి పుత్రు డొకడు జనించెను. ఆ బాలునియం దద్భుత శారీరిక మానసిక శక్తులుఁగలవు. తండ్రివలన శైశవమందే శివదీక్షఁ బొందెను. తండ్రి యొనరించిన బోధ పుత్రుని జ్ఞానాభివృద్ధికి హేతువైనది ఒకనాడు పితాపుత్రులకీ దిగువ సంభాషణ జరిగినది.

తండ్రి:—"వత్సా! నేనునీకొఱకు చేయఁదగిన మేలు కలదేనియడుగుము.

కుమారుఁడు:—"ఓ జనకా! నాకు పరమపదప్రాప్తిఁగలుగుట కేదేని మార్గముండినఁ దెలియజేయుము.

తండ్రి:—"కుమారా! పరమశివునిపై భక్తిగలిగినచో పరమపదము కరతలామలకముఁగదా"—కుమారుడు - "మహాత్మా ఆ దేవాధిదేవు నారాధించుటకు స్థల మేది" తండ్రి—బాలకా! శరీరమునం దేవిధముగ సర్వత్ర ఆత్మ వ్యాప్తమైయుండునో అదే విధముగ పరశివుఁడు సమస్త ప్రపంచమునందు వ్యాపించియున్నాడు. అయిననుకొన్ని విశేష స్థానములలో నతఁడావిర్భవించును. వానిలో దక్షిణదేశమందలి (తిలయ) ముఖ్యప్రదేశము అందొక దివ్యలింగము గలదు. అచట నీవొనరించు పూజను శివదేవు డవశ్య మంగీకరించును;—అంతే నాబాలయోగి తన మాతాపితృల ముద్దులుగైకొని శివారాధన నిమిత్తము దక్షిణదేశయాత్రకుఁ బయలుదేరెను. అనతికాలమున నతడొక సుందర సరోవరమును సమీపించెను. అందు మనోహరములైన కమలములు వికసించియుండెను. తత్సరోవర తీరమునందొక వటవృక్షముక్రింద ప్రాచీనశివలింగము స్థాపితమైయుండుట గాంచెను. మహదానందభరితుఁడై భక్తిభావసలతోఁ బ్రేరేపింపఁబడి ప్రతిదినము నియమపూర్వకముగ నాశివలింగమును నిర్మలజలముతో నభిషేకింపుచు కమలంబులతోఁ బూజింపుచుండెను. ఆ ప్రదేశమున కొంచుక దూరమునందే తనకొక పర్ణశాల నిర్మించుకొని యచట వేఱొక శివలింగమునుఁ బ్రతిష్ఠించెను. ఆ బాలునకు శివలింగద్వయ సమార్చనయందు కొంత కష్టము దటస్థించినది. ఏలయన అతని కామైదాన ప్రదేశమును.

ఉపవనమును సరోజములవలన సంతుష్టి గలుగదాయెను. ఆబాలయోగి ఉన్నత పర్వతశిఖరోపరిభాగస్థప్రచలిత వృక్షరాజిలోని వీథిధలతావితానములందలి యత్యంత మనోహర కుసుమావళిచే శివలింగార్చన గావింపవలెనని యతడభిలషించెడివాడు. అతఁడు ప్రత్యూషకాలమందు మేల్కాంచి శివపూజార్థము పుష్పాపచయమునకై గిరిశిఖరారోహణ గావించి యంధకారమునందే కుసుమ సంగ్రహణ మొనరించి పర్వతశిఖరావతరణ మొనరించును. క్రిందిభాగమున కాబాలుఁడు మిట్ట మధ్యాహ్నము వరకరుగు దెంచును. అతడు సంపాదించిన యర్ధకుసుమంబులు మార్తాండరశ్మిచే వాడిపోవుసు. యికనాడతడు తన దినచర్యగడపి స్వేచ్ఛగా శివపూజ పరిసమాప్తినందమి యత్యంతోదాసీన భావము గలవాడై పుడమిపైఁబడెను.

భగవానుఁడగు శివుని సహాయము నభ్యర్థించెను. అంతభక్తవశంవదుడగు పరమేశ్వరుఁడు ప్రత్యక్షమై దరహాసిత వదనారవిందుడై "వత్సా! వరముల నిచ్చెద కోఱుకొనుమని సెలవిచ్చెను." అంత నా బాలుఁడు సాష్టాంగ ప్రణామము లాచరించి "ఒదేవాధిదేవా! దీన బాంధవా! ఆశ్రిత చింతామణి! భక్తజన కల్పద్రుమా! శరణాగతరక్షణ బిరుదాంకితా! శరణు. నాపైఁ గరుణగలవాడవైతివేని వ్యాఘ్రమునకుండురీతి బలిష్ఠములగు హస్తపాదములును, నాకన్నులు తళ తళ మెఱయుచుండునట్లును వరముఁ బ్రసాదింపుము. పీనిమూలమున నే నత్యున్నత తరుబృందములనా రోహించుటకును చీకటిలోనే యత్యంతమనోహర సుమసమూహము సంగ్రహించి ప్రతిదినము నియమపూర్వకముగ నిన్నారాధింపగలను"

అటుపిమ్మట నాపరశివుఁడు 'తథాస్తు' అని యంతర్హితుడయ్యెను. ఆబాలయోగి యానాటినుండియే వ్యాఘ్రమును బోలిన హస్తపాదములు ప్రకాశమానములగు నేత్రములు పరశివుని వరప్రభావము వలనగలిగినవి. అందువలన నతనికి వ్యాఘ్రపాదుఁడను నామము ప్రసిద్ధమయ్యెను. సుప్రసిద్ధుడగు ఉపమన్యు మహర్షి యీ మహాభాగుని సుపుత్రరత్నమే!

ఈచిన్నకథవలన మనము నేర్చుకొనిన నీతియేమనగా? జ్ఞానచక్షువుచే పరమేశ్వరుని వీక్షించి భక్తిభావనలతో నారాధించిన యీ మానవునిజన్మ తరింపఁజేయుటకు శివదేవుడు సంసిద్ధుడు"

---

ఓం

# శివరాత్రి రహస్యము

## శ్రీ ప్రమథనాథ శివాచార్యులు



శ్లో॥ త్రైలోక్య సంపదాలేఖ్య - సముల్లేఖనభిత్తయే ।
సచ్చిదానందరూపాయ శివాయ బ్రహ్మణేనమః॥

భారతీయులు ధర్మప్రాణులు. స్వేచ్ఛాచారములు ప్రబలుచున్న నీకాలమున ధార్మికపర్వములను వ్రతోపవాసములను నిష్ఠతో కష్టమనక నాచరించువారు లక్షలకొలది గలరు. తక్కిన సంప్రదాయము లెటులున్నను నేడు మన దేశమున శైవ వైష్ణవ స్మార్త మతములే సుప్రసిద్ధములై వ్యవహారమున నున్నవి. ఇవియే వేదాగమ సదాచార బద్ధములు.

సామాన్యప్రలాపములకు లెక్కలేదుకాని గొప్ప గొప్ప శాస్త్ర వేత్తలనబడు నేటికాలపు దార్శనిక పండితులకుసైతము శివమతమును గూర్చి సరిగ దెలియదనుచున్నందులకు క్షమింతురుగాక! శివుని శైవ ధర్మమును అనార్యమనియు అవైదికమనియు శ్రీ డా॥ రాధాకృష్ణగారి వంటి మహోదయులు తమ భారతీయ దర్శనశాస్త్రమున (Indian Philosophy part I, L, 488-89) నసత్యము వ్రాయవలసివచ్చెను. దర్శనములలో పాండిత్య మున్నంతమాత్రమున శైవవాఙ్మయమును గాలించితిమనికాని శివునిగూర్చిపూర్ణముగ బరిశోధించితిమనికాని యనుకొనుచు కొన్ని పాశ్చాత్యసూత్రములపై నాధారపడి కొందరు మహా మహులును ఆపాత రమణీయప్రబంధముల నచ్చుగొట్టించుకొని మురి యుటదప్ప సత్యము కానరాదు. ఇంతకూ వ్రాయునదేమనగా శివవిష్ణు బ్రహ్మలను త్రిమూర్తులును ఆర్యులే. వైదిక దేవతలే. అందు మహా దేవుండైన శివుని మహత్త్వము వేదాదులయందు సుప్రసిద్ధము. వైదిక దేవుండగు శివుని మహా శివరాత్రి యుత్సవము వైదికులగు నిఖిలభారతీయులకును ఆచరణీయము. వారువైష్ణవులుకానిండు సౌరులు కానిండు శైవులుకానిండు శివరాత్రివ్రతము పాలించవలసియే యుండును. దానికి

సౌరో వా వైష్ణవో వాన్యో దేవతాంతరపూజకః।
న పూజాఫలమాప్నోతి శివరాత్రి బహిర్ముఖః॥
(నృసింహపరిచర్యా - పద్మపురాణే)

అను ప్రబల ప్రమాణముకలదు. శివరాత్రివ్రత బహిర్ముఖుడైన వైష్ణవునకును సద్గతిలేదు. మరియు "ఆచాండాల మనుష్యాణాం భుక్తి ముక్తి ప్రదాయకం" అనుటచేత నిఖిలమానవులకును నీ శివరాత్రి వ్రతము సద్గతిదాయకమనుటలో సందియములేదు.

శివపూజ మరియు, శివరాత్రివ్రతములో గొంత భేదముగలదు. వ్రతశబ్దముయొక్క అర్థవిచారమువలన మనకు జీవితమునందు వరణీయమగు; మరియు అనుష్ఠాన మనోవాక్కాయకర్మములచేత పొందదగినదియే వ్రతమని మనకు దెలియుచున్నది. కనుకనే ప్రతియొక వ్రతమునకును నొకగాథతో సంబంధముగలదు. ఈ గాథలతో మనజీవితమును పవిత్రవంతముగ జేసికొనుటకుఁ గావలసిన యుపదేశమంతయు నిమిడియుండును.

శివరాత్రి యనగా:—

మాఘ కృష్ణ చతుర్దశ్యా మాదిదేవో మహానిశి,
శివలింగతయోద్భూతః కోటిసూర్య సమప్రభః॥
తత్కాల వ్యాపినీ గ్రాహ్యా శివరాత్రి వ్రతే తిథిః॥

అను నీశాన సంహితా ప్రమాణమువలన మాఘకృష్ణ చతుర్దశియొక్క మహారాత్రియందు మహాదేవుడు శివలింగ స్వరూపముతో నవతరించెననియు, నాదినముననే శివరాత్రి వ్రతమును చతుర్దశీమధ్యరాత్రి వ్యాప్తమగు మహానిశియగునట్లుగా స్వీకరించవలయునని తేలుచున్నది. దీనినే లింగోద్భవకాలమనియు నందురు. ఇటగల మహానిశ శబ్దార్థము నవశ్యముగా దెలియవలసి యున్నది. "మహానిశా ద్వే ఘటికే రాత్రేర్మధ్యమ యామయోః" అనుటవలన రాత్రియొక్క రెండవజాము చివరను, మూడవజాము ఆదినిగల కాలమునే మహాశివరాత్రిగా తెలియవలయును. శివరాత్రి వ్రతకథయందు శివరాత్రి వ్రతాచరణమును బోలిన పుణ్యము మరియొకటి లేదనియు దెలుపబడినది.

నేటి కృత్యములలో ఉపవాసముగూడ గొప్పయంగమని మన

కందరకును దెలియును. అటులైనను రాత్రియొక్క నాల్గుజాముల యందు దధిక్షీర ఆజ్యమధు రసములతో క్రమముగా ఈశాన అఘోర వామదేవ మూర్త్యాత్మకమైన శివునిపూజించ వలయునని శాస్త్రవిధానము గలదు. ఇటులే నా దినకర్తవ్యము లన్నిటిని జెప్పబూనుచో నొక గ్రంథమే యగును గావున సంక్షేపముగ కొన్ని ముఖ్యమైన సంగతులు మాత్రమే యిట వ్రాయబడు చున్నవి.

కాశియందు పూర్వకాలమున నొక బోయవాడుండెను. అతడు ప్రతిదినమునందును అరణ్యమందలి జీవజంతువుల వేటాడియే తనపొట్ట బోసికొనుచుండెను. ఒకనాడు అకస్మాత్తుగా అడవిలో నాలస్యమగుట చేత జీకటిబడి ఘాతుకమృగముల భయమువలన నొకచెట్టునెక్కి రాత్రిని గడుపుటకు నాబోయవాడు నిశ్చయించెను. ఆదినము శివరాత్రి యగుటచేతను, ఆవృక్షము మారేడు అగుటవలనను, దానిక్రిందనే శివ లింగమూర్తి యుండుటచేతను, అడవిలో నానాడు దినుటకు ఆహారము దొరక కుండుటచేతను ఆబోయవానికి శివరాత్రి వ్రతమునకు గావలసిన లక్షణములన్నియు సమకూడి యుండెను. తన హస్తబాణసంఘర్షణ వలనను మంచుజలముచే దడిసిన బిల్వపత్రములు క్రిందనున్న శివలింగముపై బడుటజేసి ఆబోయకు లభించిన పుణ్యావిశేషమునకు మేరలేకపోయెను. అతడు భక్తవరులలో గణింపబడి చివరకు ముక్తియు సులభమయ్యెను. ఏమియు దెలియక స్వయంసిద్ధముగా జరిగిన ఈ యద్భుతమైన ఘటనవలన విద్యాగంధములేని బోయవానికే మహాలాభము గలిగినపుడు ఆడంబరమే కానిండు—శివరాత్రి వ్రతము నాచరించు భక్తులకును తప్పకముక్తిమార్గము సులభము కాగలదని నిస్సంశయముగ జెప్పవచ్చును. ఇక సంసార వాసనాపరిత్యక్తులైన శివభక్తులగు విరక్తులకు పరమముక్తి స్వతస్సిద్ధమైన హక్కని జెప్పవలయునా!

ఇటుపై దీనితత్వమునుగూర్చి కొంత విచారింతము. ఈవ్రతమునందు ఉపవాసముయొక్క ప్రధానత యెందుకుగలిగెను? రాత్రి జాగరణమ్మున కేమికారణము? చతుర్దశి అమావాస్యలమధ్య దీనికి యోగమేల కలుగ వలయును? మరియు పారణమనగా నేమి? అను ప్రశ్నములకు ముఖ్యముగా నుత్తరములను వెదకుకొనవలసియున్నది.

ఉపవాసమనగా నిరాహారమని "ఆహార నివృత్తిరుపవాసః" అను ప్రమాణమువలన దెలియుచున్నది. ఈ వ్యుత్పత్తియందే దీని తత్త్వమిమిడియున్నది. ఆహారమనగా [ఆ+హృ] ఏదైననొక పదార్థమును సంగ్రహించుటయని యర్థమైనది. అదినాలుకతోడ గర్భములోనికి గ్రహించిననే యాహారమనికాదు. చక్షురాదీంద్రియములతోడ ఆత్మానందమునకై గ్రహించునది యెల్లయు ఆహారమేయగును. మానసాది అంతఃకరణముచే గ్రహించునది సూక్ష్మమును, కరచరణాదులచే చేసినది స్థూలమును కావచ్చును. అంతియేగాని గ్రహణములో మాత్రము భేదములేదు. ఉపవాస శబ్దముయొక్క ధాత్వర్థము "ఒక వస్తువుయొక్క సమీపమునం దుండుట" అనియగును. కనుక యిచ్చోట శివునియొక్క సమీపమునందుండుట అను నర్థమే సహజముగ గన్పట్టుచున్నది. ఉపనిషత్తులయందు "శాంతం శివమద్వైతం యచ్చతుర్థం మన్యంతే" అను వాక్యముచేత ప్రతిపాదింపబడిన శివుని సామీప్యమును బొందినవానికి బాహ్యవస్తువుల గ్రహణమునందు గల ఆహరణబుద్ధి సహజముగనే నశించును. ఈఉపవాసముయొక్క ఆంతరంగికతత్త్వము బలముగానున్నపుడు బహిరంగతత్త్వము కొంతకొరవడినను దానివలన విశేషహానియుండదు. శివరాత్రి రాత్రియందే జరుగుటకు కారణమేమనగా రాత్రి దినముయొక్క ఖండప్రళయమని చెప్పవచ్చును. భూగోళచిత్రమునందు (Atlas) విశాలమైన భూమియొక్క యాకారము చాల చిన్నదిగానున్నను దానినిజూచిన మానవుడు తనకు గావలసిన ప్రదేశమంతయు తన హస్తములోనేయున్నటుల కొంతసేపటిదనుక నైనను భావించుచుండును. అటులే నిఖిలబ్రహ్మాండము నావరించియున్న మహాతమస్సును కొంతవరకైనను తన యధీనముగ భావించుట సహజమైనది. ఈస్వాధీన పరాధీనముల ననుసరించియే అహోరాత్రములకు సృష్టిప్రళయములని జెప్పబడినవి. పగలు మానవునియొక్క ప్రాణాదులు ఆత్మసమీపము నుండి బాహ్యజగత్తులోనికివచ్చి విషయానందమునందు నిమగ్నమైయుండును. రాత్రి బాహ్యప్రపంచమునకు వ్యాపృతి లేకుండుటవలన ప్రాణాదులు ఆత్మనే శరణమును బొందుటకై నిశ్చలములగుచున్నవి. క్షణికవికారముల ప్రసంగము యిట నప్రస్తుతము. కావున రాత్రియే వ్యష్టి

ప్రాణులు సమష్టినొందుటకు ప్రయత్నించుచుండునని చెప్పకొన వచ్చును. అందుననే ప్రకృతిసిద్ధమైన ఆత్మనివేదనమునకు అది ఉత్తమోత్తమమైనసమయము. భక్తిప్రేమలకు పరమసాధనమార్గము.

చతుర్దశీయోగమునకును కారణముగలదు. అమావాస్య యనగా కలిసియుండుట. అందు సూర్యచంద్రులు గలియుటచేతనే అట్టియర్థమేర్పడినది. ఈ యర్థము వ్యాకరణ జ్యోతిషశాస్త్రములకును సమ్మతము. ఇట సూర్యచంద్రులు పరమాత్మ జీవాత్మలని తెలియవలయును. కావుననే సమాధియోగమునందు జీవునకు శివత్వసంబంధము అమావాస్య యనియే చెప్పకతప్పదు. ఇదియ అద్వైతసారము. ఇచ్చట చతుర్దశీ తిథి యొక్క కేవల మధ్యకాలావస్థను జీవునియొక్క శివతావేశపు గురుతుగా దెలిసికొనవచ్చును. ఈశుభముహూర్తమే చతుర్దశియందు ప్రారంభమై అమావాస్యను జేరువరకు శివత్వమగుచున్నది. కనుకనే మరుసటిదినము వ్రతసమాప్తిసూచకముగా పారణజేయబడుచున్నది. ఇదియే పూర్ణతకు గావలసిన లక్షణము. ఇక మాఘమాసమునకు శివునకు నేదో యొక పూర్వచరిత్ర సంబంధమును మన పూర్వులు గురుతెఱింగిరి గనుకనే మానవునియందలి విషమతను బోగొట్టుటకై దానిని స్వీకరించిరి దేహరూపమగు బిల్వవృక్షముయొక్క త్రిగుణరూపమగు త్రిదళమును గుణాతీతుడగు శివుని మస్తకమునందు అర్పించినపుడు ఆసక్తిశూన్యుడై తామరాకున కంటని నీటిబిందువువోలె పూర్వకర్మవాసనలచేత బంధింపబడజాలడు. సాక్షిమాత్రమగు దేహాభిమానమును తొలగిపోవుట తడవుగా కైవల్యధామమునందలి పరమానంద రసానుభూతియే దానగును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.

అను సూక్తివలన సర్వసాధారణమగు జాడ్యమును పోనాడి ఇంద్రియములను స్వాధీనపరచుకొని జాగరణము గావించి అనగా తెలివి గలవాడైనచో నతడు యోగీశ్వరుడగుననియే యీ మహాశివరాత్రి సాదరముగ స్వాగతించుచున్నయది.

---




## అద్వైతము.

భర్త—ఏమోస్, ఇంకా వంటకాలే!

భార్య—పురాణంలో మీరే చెప్పలేదా
ఈజగమంతా అబద్ధమని,

భర్త-కడుపులో ఆకలిచేత మండుతుందీ!

భార్య—అదీకూడా మిథ్య, అబద్ధమే
నండీ!

## మేనేజిమెంటు.

మఠానికి ట్రస్టీగావచ్చిన ఒకాయన మఠమును పడగొట్టించియు, భావిని పూడ్పించి, పూజ నాపించి, నేరుగా తానే యొక స్వామి యనుకొని కాషాయవస్త్రాలు వేసుకోబోతున్నాడు. ఇంతమంచి మేనేజిమెంటు మీలో యెవరైన చేయగల్గుతారా?

లెక్క:—మాష్టరు – అబ్బాయీ! నీ జేబులో యివ్వాళ అయిదుపైసలున్నాయనుకో. నేనొక అయిదుపైసలు పడవేయిస్తాను. రేపటి కెన్నిడబ్బులగునో లెక్క చెప్పు.

బాలుడు—సార్! రేపటికి ఒక్కపైసగూడా మిగలదండి.

వంట—భర్త—నీవు వంట సరిగాచేస్తే నేను బాగా సంపాదించేవాణ్ణి.

భార్య—మీకు బాగా సంపాదించడం చేతనయితే యిదివరకు ఒకవంట
మనిషినే పెట్టుకునేవాళ్ళం.

* * *

ఖాతాదారు—నేనికమీద మీహోటలులో కాఫీతాగను.

అయ్యరు—ఎందుకు?

కా—నాకిష్టంలేదు.

అ—మీకు హోటల్లో తాగడం యిష్టంలేకపోతే యింటికి తీసుకవెళ్లి
తాగచ్చుగా!

స్త్రీ—డాక్టరుగారూ! నాకు నిజంగా యేరోగముందో దాపరం లేకుండా చెప్పాలి.

డా—(ఆమెను ఎగాదిగా బాగాచూచి) మొదలు మీతూకం కనిష్టం యాభైపౌన్లయినా తక్కువ కావాలి. పైగా సబ్బునీటి యుప యోగమింకా యెక్కువ చెయ్యాలి. అంటేనేను చిత్రకారుణ్ణండి డాక్టరుండేది ముందిల్లు.

మాష్టరు—అరే సుబ్బిగా! నీవొక్కడవే యిన్ని తప్పులు రాసావే?

బాలుడు—ఆలాకాదండిసార్. లెక్క సరిజేసేటప్పుడు మానాన్నగారు కూడ వున్నారండి.

బెజవాడలో పోలీసువాళ్ళు నిల్చొడానికి చౌకీలల్లో గొడుగుల సిష్టం యేర్పాటు చేశారు. రాత్రిళ్ళుదానిపైన దీపాలుగూడ ఉంటాయి. ఇంతకూ యీ పోలీసువాళ్ళంతా యమలోకం వెళ్ళినతర్వాత వీళ్ళ తో లూకు మనుష్యులు యెవరైనా మిగులుతారో లేదో అను సంశయంతో బ్రతికుండగానే తలమీది దీపాల అరేంజిమెంటు చేశారు! భలే బాగా వుంది.

*　　*　　*

సేవకుడు—సార్. తమర్ని చూడ్డానికి డాక్టరుగారు వచ్చారండి.

మేజస్ట్రీటు—(కోర్టులోవలె మైమరచి) అరేయి, నాశరీరంలో బాగా లేదుగనుక యిప్పుడు చూడ్డానికి వీల్లేదని చెప్పు.

మిత్రుడు—అయితే నీవు కాఫీతాగడం మరిచావన్నమాట. నీమనసు చాలా గట్టిదిరా!

మరొకడు—గట్టిమనసు నాదికాదు నాపెళ్ళాంది.

వకీలు—అరే జట్కా! కోర్టుకు పద.

బండివాడు—సార్ నేను కోర్టుకు రావడానికి యేం అపరాధము చేశా నండీ.

అల్లుడు—మామా! నీవు బహుమానంగా యిచ్చిన హార్మోనియం చాలామంచిది.

మామ—ఏం ! వాయించడం బాగా నేర్చుకున్నా వేంటి ?

అల్లుడు—అబ్బే కాదు! దాన్ని వాయించకపోతే మానాన్నగారు దినానికి ఒకడబ్బు చొప్పున బహుమానం యిస్తారు.

* * *

'విభూతి' బయలుదేరక మునుపే ఒకపత్రికలో "విభూతి యంటే మేమేదో దయ్యాలభూతాలకు సంబంధించిన భస్మం అనుకున్నాము. సరిగా చదివేసరికి పత్రికయని తేలింది" అంటూవ్రాశారు. నిజంగా మావిభూతి పత్రిక సామాన్యమైందికాదు. నిజానికి చాలమంది సంపాదకులకు శైవమంటే దయ్యంపట్టిన వారికిమల్లే చాలఆక్షేపణగా వ్రాస్తుంటారు. కనుక ఆలాంటివాళ్ళ భూతాల్ని దంచి విడపించడానికే విభూతి పుట్టిందంటే యేం తప్పు?

* * *

మాష్టరు—ఏనెల్లో ౩౮ దినాలున్నాయో చెప్పు?

బాలుడు—[బాగాయోచించి] సార్ అన్నినెలల్లో ౩౮ రోజులున్నాయండీ.

* * *

[మోటారు వెళ్లుతుంటే చెవులు వినపడక ఒక భాషణ ఈవిధంగా]

ఒకడు—ఇద్దేం గన్నవరమా?

ఇంకొకడు—అబ్బే యిది శనివారంకాదు. ఆదివారం.

మఱొకడు—ఫలహారం ముందు వ్రూళ్లోవుంటుంది.

రోగి—ఏమండీ! నాచికిత్సకు చాలాడబ్బు పడుతుందా?

డాక్టర్—అబ్బే! యేమిలేదు. నూటయాభై రూపాయలకంటె యెక్కువ కాదు.

* * *

మాష్టరు—అరే వెంకాయి! నీవు తెల్లవారుజామున సరిగా యెందుకు లేవ కూడదు?

బాలుడు—సార్! గడియారం సరిగా అలారం కొట్టదండీ. ఏలా లేవడం?



# ధర్మప్రచారము

## కవిరత్న లక్కన మల్లికార్జునుఁడుగారు



(ఆంధ్రవీధిలో ధర్మప్రచారుఁడు ప్రవేశము)

ధర్మ—

ఉ. శ్రీహిమనాథుడుబ్బుచు స♦శేషముదంబు కరంబునొంద, దా
సోహమటంచు దేవతలు ♦ చుట్టును గొల్వనుదీర పక్షిరా
డ్వాహుడు నమ్రుడై కొలువ ♦ పార్వతితోఁదగ గద్దెనెక్కు నా
మోహనమూర్తి శంకరుఁడు ♦ ప్రోచెడుగాత విభూతిపత్రికన్.

సీ. గమనించి హుంకించి ♦ ఘనరీతి నీతుల
బత్రిక బ్రచురించు ♦ భటుప్రిడితడు
జయమెంచి శ్రీవీర ♦ శైవంబు వికసింప
సంస్కారముంజేయు ♦ సాధువితఁడు
వేదవాక్యాది సద్విద్య ♦ లఁగని మించి
ధర్మరక్షణఁజేయు ♦ ధన్యుడితఁడు
నిష్పక్షపాతియై ♦ నిర్మలచరితుడై
నెరసుల సవరించు ♦ సరసుఁడీఁడు

గీ. ననగచిదిరేమతాఖ్య వం♦శాబ్ధి చంద్రుఁ
డైన శ్రీవీరభద్ర బు♦ధార్యవరుని
ప్రబల సంపాదకునిగాఁగ ♦ బడసినట్టి
వర 'విభూతి'ని నిలుపుడి ♦ ప్రమథులార!

(భోగపురుషుఁడు ప్రవేశించి) ఏమిటండీ? ఈప్రచారము.

ధర్మ—ఓహో! భోగపురుషులా? ఈప్రచారము మీకువినబడదు. మీ భోగములు మీ యధికార గర్వములు మీ నాటకములు మీ ప్రియకాంతలను విడువనంత కాలము;

భో—ఈ పుల్లవిరుపుమాటలకేమిగాని విషయమేమిటో చెప్పుడు.

ధర్మ—సరే. వినండి. ఆంధ్రదేశంబున వీరశైవము నామమాత్రావశిష్ట మైయున్నమాట తెలియునా ?

భో—అయితే.

ధర్మ—అయితేనా ? భక్తుల యజ్ఞానములు గురువుల దురహంకారములు పటాపంచలైపోయెడి రోజులు వచ్చినవి. మతము బాగుపడెడి కాల మాసన్నమైనది. ఏలనన గోముఖవ్యాఘ్రంబుల తుందుడుకు లాడించు గొప్ప తుపాకి, దుర్వ్యసనాంకురంబులకు కడంగరీయంబు. దుష్టవర్తనాంధకారంబునకు భానుబింబంబు. అజ్ఞాన మత్తేభంబులకు క్రొదమసింగంబు. హృదయాకర్షకములగు కథ కదంబులకు నికురంబు. ధర్మప్రబోధంబుల కునికిపట్టు నగునను భూతి చెలంగ విభూతి పత్రిక వెలువడుచున్నది.

భో—దానికి పంపాదకు లెవరు ?

ధర్మ—ఎరుగవా ? విను చిన్నప్రాయమునందె యున్నతధైర్యంబున గురుకులవాస మొనర్చి వేదకావ్య స్మృతి దర్శన తీర్థసాహిత్య విశారద ధర్మాచార్య విద్యానిధి విద్యారత్నాది బిరుదుల కర్హంబగు విద్య నార్జించి, ఐహికభోగంబులఁ ద్యజించి వీరశైవంబు నుద్ధరింప బద్ధకంకణులై సికిందాబాదున వీరశైవ గురుకులము స్థాపించి యవతారమూర్తియన జెల్లు పండితకాండీ ప్రశస్తమగు చిదిరేమఠాధి నాథులు.

భో—సరియే బాగున్నది. మతములులేవని యొకవంక. దేముఁడులేడని మరొకవంక. మా నడతలు మేము మార్చుకొనమను వా రొక వంక, భిన్నభిన్న యభిప్రాయములు వేరొకవంక, గర్వసంపన్ను లొకవంక. ఈర్ష్యాసంపన్ను లింకొకవంక చెలరేగెడి ఈకాలంబున వీరి కార్యక్రమంబులు నెరవేరుట దుస్తరము.

ధర్మ—కడుపుచుమ్మలు పడు కాంతకు కలకండ రుచించనియట్లు మత భ్రష్టులకు, మిాబోటిభోగులకు, గర్వులకు, చుప్పనాతులకు, ధర్మబాహ్యులకు, రుచించవు వారి కార్యక్రమము. కాని సదా

చారులకు, ధర్మజ్ఞులకు దైవభక్తులకు నమూల్యసంధి. అట్టివారే దీని నభ్యుదయమ్మునకు గొని తెత్తురు.

భో—అయితే ఈపత్రిక యాచంద్రతారార్కమలరుసట్లు దీవించెడ కాని, ఇక్కడనున్న వీరశైవమున భిన్నభిన్న నడతలు మతాంతర్గత యధికార భేదంబులు వ్యక్తి ద్వేషంబులు కుప్పతిప్పలుగా నున్నవి. అవి వీరెట్లు సమర్థించి నిలబడెదరో.

ధర్మ—సత్యమూర్తులైన ఈసంపాదకులు, కార్యదీక్ష, శాంతి, దీర్ఘాలోచన, ధీశక్తియుక్తి, ధర్మప్రసక్తుల, విజృంభింపజేసి సర్వము చక్కబెట్టగలడని సజ్జనుల నమ్మిక.

భో—వీరికి పత్రికా ప్రచురణకై ధనసహాయములు జరుగుచున్నావా?

ధర్మ—కొందరు వాగ్దానములు గావించిరి కొందరిచ్చిరి. మరికొందరీయ నుండిరి. ప్రతివీరశైవు లుదారసంపన్నులై తమ శక్త్యనుసారము సహాయము చేసెదరని నానమ్మకము.

భో—నీబోధవలన నామనస్సు భోగంబులపై వాంఛవిడనాడినది. నీతో పాటు నేను ప్రచారమునకు వచ్చెద ప్రచురణ పద్యంబుల దిక్కుల పిక్కటిల్లచాటుము.

ధర్మ—

కం. ముద్దులు నొలికెడి కథలును
దిద్దిన ధర్మములు పెక్కు • దివ్యపునడతల్
సిద్ధించెడి లేఖనములు
పద్దెము లెసగును విభూతి • పత్రికయందున్.

కం. నృతమై గురుజననుతమై
సతతంబున వీరశైన • సద్ధర్మములన్
ధృతిమీరగ గృతిసేయును
కుతలంబున నీ విభూతి • కొనుడిక సుజనుల్.

గీ. తగిన సాయంబులంగూర్చి • ధర్మమెంచి
మతముతోడుత ఘనకీర్తి • యుతములైన

ధర్మమార్గరహస్యంబు ♦ మర్మమరయ
వరవిభూతి పత్రికవేగ ♦ బడయరయ్య

(అనేక వీరశైవమత శ్రేష్ఠులు గుమిగూడి)

వీ—ధర్మ పరిచారకా! మాకు చాలా సంతసమైనది. జయ గీతములు పాడుకుంటూ విభూతి కొరకు పోవుదము పద—

ధర్మ—నే జెప్పెద మీరంద రనుడి. పదండి.

(ధర్మపరిచారకుండు చెప్పగా జనులందురు).

జయ్ జయ్ జయ్ జయ్ ♦ జయము విభూతికి
జయ్ జయ్ జయ్ జయ్ ♦ జయము విభూతికి
వీరశైవులకిది ♦ వేలుపుటావు
ధీరజనులకునిది ♦ దేవభూజమ్ము
ధర్మబోధనలకు ♦ తావగు నిద్ది
నిర్మల విధులకు ♦ నిధియగు నిద్ది
భక్తిపద్ధతులకు ♦ పరిబలెడి టెంకి.
ముక్తిపథంబుకు ♦ మూలకందంబు
సత్యము చాటెడి ♦ సచ్ఛీలః ంధి
నిత్యము కట్టడి ♦ నేర్పెడి యొజ్జ
మన పూర్వభాగ్యము ♦ మంచిదిగాదె ?
ఘనముగ దీనిని ♦ గాంచుటయెల్ల;
గురుకుల ముఖ్యుఁడు ♦ కోవిదవరుఁడు
నిరుపమ శీలుడు ♦ నిర్మలగుణుఁడు
వేదశాస్త్రంబులు ♦ వేడ్కఁబఠించి
యాదర మొసగుచు ♦ ననఘులకెందు
ధర్మ సంరక్షణ ♦ కర్మల శిక్ష
నిర్మల మార్గము ♦ నేర్పు దలిర్ప
వెలయఁగఁజేసెడి ♦ వీరవర్యుండు

(66 వ పేజి చూడుడు)




( విమర్శనకొరకు ప్రతులు రెండేసి పంపవలయును )

**వేదవేదాంగచంద్రిక**—కర్త మహాకవి చివుకుల అప్పయ్య శాస్త్రిగారు, ప్రకాశకులు చందా నారాయణశెట్టి జనరల్ బజారు, సికిందాబాదు, వెల రు ౧-౦-౦ పుటలు ౧౬౦ ముద్రణము బాగుగ నున్నది.

హిందువులకు నేడు పాఠశాలలలో లభించు జ్ఞానము పాశ్చాత్య సభ్యతను ప్రసాదించునేగాని భారతీయ నాగరికతాజ్ఞానమును లే మాత్రమును కలుగజేయుటలేదు కనుకనే నేటి మన విద్వాంసులు ఆర్యులమతమును గూర్చియు వేదాది శాస్త్రములగూర్చియు విప ముగా నాక్షేపించుటయే జరుగుచున్నది. వీనిని గూర్చిన సరియై జ్ఞానమేయుండుచో యిట్టి నిరర్థకమైన యాక్షేపణలు యెన్నటికిని బయలు దేరవు. ప్రస్తుతగ్రంథమునందు వేదమనగానేమి ? వాని స్వరూపము ఉత్పత్తి యెటులు ? అవి పౌరుషేయములా ? అందు బోధింపబడి దేవతాతత్త్వమేమి ? మానవునకు దాని యావశ్యకతయెటులు ? దీని వలన గల్గు లాభమేమి ? శిక్షాకల్ప వ్యాకరణ నిరుక్తఛందస్సు జ్యోతి శ్శాస్త్రములు మున్నగునవి సత్యములా ? అసత్యములా ? వీని యు యోగమేమి ? మొదలైన అనేక విషయములంగూర్చి తేటతెలుగులో సయుక్తికముగ నిరూపింపబడినవి. దీనిని యాస్తికులేగాక నాస్తిక లును చదివి యానందించవలసియున్నది. శ్రీ శాస్త్రిగారి పరిశ్ర ఉపయుక్తమైనదని వ్రాయుటలో సందియము లేదు.

**సప్తశతీసారము**—కర్త, శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, తెలుగు పండితులు, మహబూబ్ కాలేజి, సికిందాబాద్, పుటలు ౧౦౬ వెల ౧-౦-౦ ముద్దయిన అచ్చు కాగితములును.

ఆంధ్రులకు దెలియని, పరిచారములో లేని కావ్యరత్నము లెన్నియో సంస్కృత సాహిత్యమున బ్రజ్వలించుచున్నవి. అవి పాత పురాణములను భావనతో వాని సౌందర్యమునుసైతము గురుతెరుగక ఆంగ్ల సాహిత్యము వెంటనే పడినవారు కొందరుకలరు. కవిత్వమనగ నేమిటో ఆనందమన నెట్టిదో తెలియవలయునన్న గోవర్ధనాచార్యుని ఆర్యాసప్తశతిని తప్పక అవలోకింపదగును. అందుగల రత్నములన్నింటిని ఏర్చి కూర్చి 'సప్తశతీసారము'ను గ్రంథము నాంధ్రరసిక సోదరులకుగాను శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు మిక్కిలి సమర్థమైన ప్రతిభతో నను వదించినారు. వీరి సులక్షణమైన తెనుగు తేనెసొంపుగల శైలి స్వవిరచిత మైనంతటి యానందమును గూర్చుచున్నది. ఉదారణమునకై ఇంచుక—

అవ-నాయకుని ప్రేమాతిశయమును బడసి యభిమానవతియగు నాయికనుగూర్చి యొక సఖి ఇట్లనుచున్నది.

క. హరు శిరసెక్కి తినని తెగ
మురిసెదు శశిరేఖ! యట్లు మురియకు చండీ
చరణాబ్జధూళి దులిపెడు
తతి నెటిగెదు దీనిఫలము తడయు మొక త్రుటిన్.

శాస్త్రిగారు చిరకాలమునుండి జైన బౌద్ధ వాఙ్మయమందలి సుప్రబంధముల నభిమానముతో నాంధ్రులకు జవిజూపుచున్నారు. ఇంకను ప్రౌఢగ్రంథముల ప్రకాశింపజేసి యార్యవిజ్ఞానమును పరిపుష్ట మొనర్తురుగాక! ఈసప్తశతీసారమును రసికులందరు గ్రహించియే తీర వలెను.

**పుత్రశతకము**—కర్త, కవిరత్న లక్కన మల్లికార్జునుడుగారు, వల్లూరుపాలెం, పోస్టు. తోట్లవల్లూరు, తా॥ బెజవాడ, కృష్ణాజిల్లా. వెల 0—3—0 పుస్తకము, ముద్రణము, బాగున్నది.

ఆంధ్రభాషలో వేలకొలది శతకములు బైలుపేరినవి. అవి ప్రత్యేకముగ నొక్కొక్క యుద్దేశ్యముతో, వివిధముగ నున్నవి.

9

సుమతిశతకము మున్నగునవి బాలురకును పాఠశాలలో బోధింపబడు చున్నవి. కాని బాలకులకే కేవలముగ నుపయోగపడవలయునను తలంపుతో రచింపబడిన పొత్తములు కొలది మాత్రమే కలవు. కావు యువతీయువకులకు సంబంధించిన విషయములు లేకుండ అశ్లీలభావము జొరకుండ ధర్మము, శాస్త్రము, సత్సంగము, చదువు, సంపద, వి యము, వివేకము, అభిమానము, ధైర్యము, ఉపకారము, నియమము నీతి, దేశసేవ, దానము, సత్యము, పౌరుషము, మున్నగు చక్క విషయములు సరళమైన కందపద్యములలో నిమిడ్చబడినవి. అధికారు పొత్తమును బాలురకు పఠనీయముగా నియోగించి గ్రంథకర్తగారి ప శ్రమును సార్థక పరచ గోరుచున్నాను. మచ్చునకు ఒక పద్యము,

క. మనయాంధ్రభాష మీఁదను
మన యాంధ్రజనంబుమీఁద మహిమాస్పదమా
మన యాంధ్ర భూమి మీఁదను
మనుజున కభిమానముంట మంచిది పుత్రా.

'రాజహంస'

(తక్కిన గ్రంథముల విమర్శన ముందు సంచికలో వచ్చును)

---

63 వ పేజి తరువాయి)

కలిగెను మాకును ♦ ఘనతలు నమరె
వానికి పూజలు ♦ ప్రబలగ జేసి
మానక జేతుము ♦ మహనీయ నుతులు
జయ్ జయ్ జయ్ జయ్ ♦ జయ వీరశైవా
జయ్ జయ్ జయ్ జయ్ ♦ జయ వేదవేత్త
మంగళ ప్రదములు ♦ మహి వెలయు దాక
జంగమ పుంగవ ! ♦ శంకరుడిచ్చి
మిమ్ముల మనుచును ♦ మేదినియందు
నమ్మి చరింతుము ♦ నయమున మిమ్మ

(సశేషము)

# 'విభూతి' - పరివారము



ఈ మాసపత్రికను ఇంకను సుందరముగ ప్రకటించుచు చిరస్థాయి యొనర్చుటకును, అనేకములగు నుత్తమగ్రంథములను ప్రకటించుటకును గొప్పగా ధననిధి కావలసి యున్నదను సంగతి యెల్లరకును విదితమే, కావున దాదాపు రెండుసంవత్సరములనుండి ఈ విషయమై పాటుపడగా గొంతవరకు సఫలత కలిగినది, ప్రతిష్ఠాపకులు ౧౦౦౦, రు లును, మహారాజపోషకులు ౫౦౦ లును, రాజపోషకులు ౧౦౦ లును, సహాయకులు రు ౫౦ ల వరకును ప్రదానించవలయును, వీరిపేరులు పత్రికయొక్క ఉచితమైన స్థానములలో ప్రకటింపబడుచుండును. ఇదివర కత్యంతమైన ఉదారచిత్తముతో తమ చందాలను బంపిన మహాశయుల నామధేయముల నీక్రింద పొందు పరచుచున్నాము. ఆంధ్రమహాశయులును, వాగ్దానముల నొనర్చిన తక్కిన మహోదయులును, తమ సహాయమును త్వరగా బంపి 'విభూతి'ని, శాశ్వతపరచుటయె కాక అందటును క్రొత్త చందాదారులను జేర్చి ప్రచార మొనర్చవలెనని కోరుచున్నాము

---

# ద్రవ్యదాతలు



| రు. లు. | నామము | గ్రామము |
|---|---|---|
| ౨౦౦ | శ్రీ శ్రీ ముమ్మడి సిద్ధశంభు స్వాములవారి యనుమతిని శ్రీ మఠం నాగభూషణ దేవరగారు | చేబ్రోలు |
| ౧౦౦ | శ్రీమాన్ అందెల కోటివీరయ్యగారు | ,, |
| ౧౦౦ | ,, అందెల కోటినాగయ్యగారు | ,, |
| ౧౦౦ | ,, సిద్దాని అంకన్నగారు మ్యునిసిపల్ కమీషన్ | నర్సారావుపేట |
| ౫౦ | ,, అవధూత బసవరాజుగారు | నూజవీడు |
| ౫౦ | ,, చుక్కా పాపయ్యగారు | వల్లభాపురం |

| | | | |
|---|---|---|---|
| ౫౦ | శ్రీమాన్ | చిలువూరి శంభయ్యగారు | చిలువూరు |
| ౩౦ | ,, | చదువుల బసవశంకరయ్యగారు | నర్సాపురం |
| ౩౦ | ,, | పాలకొల్లు చెన్నబసవయ్యగారు | కనగాల |
| ౨౫ | ,, | పాలకొల్లు వీరభద్రయ్యగారు | తెనాలి |
| ౨౫ | ,, | అందెల కోటివీరనాగయ్యగారు | భగ్గేశ్వరం |
| ౨౫ | ,, | సిడపర్తి రామలింగయ్యగారు | గరుడాచలపాలెం |
| ౨౫ | ,, | చదువుల శంభయ్యగారు | పాపాయపాలెం |
| ౨౦ | ,, | ద్రోణాదుల కోటివీరయ్యగారు | కనగాల |
| ౨౦ | ,, | పరదా మల్లయ్య జానుమూలయ్యగారు | పాలకొల్లు |
| ౧౬ | ,, | పాలకొల్లు బాలనాగయ్యగారు | కనగాల |
| ౧౫ | ,, | ధూపం బసవకోటయ్యగారు | ,, |
| ౧౧ | ,, | చుక్కా చినబసవయ్యగారు | తెనాలి |
| ౧౦ | ,, | నేలపల్లి బసవయ్యగారు | కనగాల |
| ౧౦ | ,, | చుక్కా కుమారస్వామిగారు | తెనాలి |
| ౫ | ,, | చిలువూరి మునెయ్యగారు | చిలువూరు |
| ౫ | ,, | కంచెర్ల పిచ్చెయ్యగారు | ,, |
| ౫ | ,, | మారుజోళ్ళ బసవకోటయ్యగారు | భగ్గేశ్వరం |
| ౫ | ,, | చిలువూరి నాగబసవయ్యగారు | బెజవాడ |
| ౫ | ,, | డా॥ కంచెర్ల కన్నవీరయ్యగారు | ,, |
| ౫ | ,, | అందెల కోటయ్యగారు | పెనుగొండ |
| ౫ | ,, | కుంకులగుంట బసవయ్యగారు | దేవరపల్లి |
| ౫ | ,, | మఠం సిద్ధివీరయ్యగారు | డాకూరు |
| ౨౨ | ,, | నరసాపురం భక్తులు | ,, |
| ౧౭ | ,, | భగ్గేశ్వరం భక్తులు | ,, |
| ౧౧ | ,, | పాలకొల్లు భక్తులు | ,, |
| ౧౦ | ,, | దగ్గులూరి భక్తులు | ,, |

# విభూతి విజ్ఞప్తి



**పాఠకులకు**—మాకులభించిన సమయముననుసరించి శక్త్యనుసారము 'విభూతి' నీవిధముగ ప్రకటించితిమి. దీని గుణదోష విమర్శనలు సహృదయాధీనములు, త్రివర్ణ చిత్రమును ప్రకటించుటకై యెంతయో ప్రయత్నించితిమి కాని, బ్లాకులుచేయు కంపెనీవారి యాలస్యము వలన నిరపాయుల మైతిమి. ముందు సంచికలో దప్పక త్రివర్ణచిత్రము బ్రకటింప బడును. ఎక్కువ పేజీలును జేర్పబడును. ఈ మాసములోపుగ మీా సహాయద్రవ్యమును చందాయును రానిచో ముందు రెండవసంచిక వి. పి. గా పంపబడును. స్వీకరించుడు.

**వ్యాసకర్తలకు**—'విభూతి' తమ సంపూర్ణమైన సహాయము నపేక్షించుచున్నదని వేరుగా జెప్ప నవసరముండదు. ప్రతి మాసము పౌర్ణిమ నాటికి మాకు జేరునట్లుగా స్పష్టమైన యక్షరములతో కాగితమునకు నొకప్రక్క మాత్రమేవ్రాసి వ్యాసములను పంపగోరు చున్నాము.

**విషాదవార్త**—ఏతత్పత్రికా ప్రతిష్ఠాపనముకై గొప్పప్రోత్సాహకులగు డా॥ కందుకూరి అందెల వీరబసవయ్యగారును, నర్సారావుపేట కుంకుకలగుంట సంగయ్యగారును, అకాలమున శివలోకము నందుట వలన వీరశైవలోకమున కపార నష్టముకలిగినది. మొదటివారు సుప్రసిద్ధవైద్యులు, మతాభిమానముగలవారే కాక నిశితమైన కార్యనిర్వహణ కౌశలము వాక్చాతుర్యము, సదాచారములలో నద్వితీయులుగా నుండిరి. రెండవవారు గొప్పవిద్వాంసులు కాకపోయినను యద్భుతమైన తమ బుద్ధిశక్తివలన వకీళ్ళకును సలహానిచ్చుచుండుటచేత గుమాస్తా సంగయ్యగారనియే నామాంకితులైరి.

వీరి యాత్మలకు శాంతి నను గ్రహించుటకై శివుని బ్రార్థించి వీరి పరివారముతో సానుభూతిని ప్రకటించు చున్నాము.

సం॥ వి॥






12 సంవత్సరములనుండి ప్రఖ్యాతిగన్నవి.

ఇందు రసవిషాదులు చేర్పక కస్తూరి, బంగారు, హిమాలయ పర్వతము వనమూలికలు యోగీశ్వరులవద్ద గ్రహించి ముసలితనము లోకములో లేకుండ జేయుటకు, వీర్యపటుత్వము లేని వారికి శక్తి కలిగించుటకు, సంతానప్రాప్తిలేని స్త్రీలకు పుత్రభిక్ష పెట్టుటకు ప్రయత్నించి, ఈమహాయోగరాజము వెల్లడి చేయుటకు అవకాశము కలిగించితిమి. సందేహించక వాడి తీరుడు. గుణములేనిచో పైకము వాపసుచేతుము. అరగంటలో వీర్యము రాయివలెచేసి రమించుటకు ఉల్లాసము కలిగించును. వీనికంటె వెలగల మందులుసహితము గవ్వకయినాపనికిరావు. చూచెదరేల! నేడే కార్డువ్రాయుడు. ఆలసింపకుడు. గంటల కొలది రమించే శక్తి కలుగును.

30 మాత్రలు శాంపిల్ సీసా రు 3-0-0 పై రాగిచిటికి
60 మాత్రలు రు 5-0-0. క్యాటలాగు ఉచితము.
జననేంద్రియ రబ్బరు ట్యూబులు 6కి రు 2-0-0
,, ,, 12కి రు 3-0-0
స్త్రీలకమరునది 1కి రు 1-8-0

వలయువారు :- డాక్టర్ ఎ. ఎస్. మూర్తి,
చికాకోల్, గంజాంజిల్లా.

ఇంక నెప్డు చూతునో ప్రకట కాకతిరాజ
పాలిత సిద్ధేశ్వరాలయంబు
ఇంక నెన్నడు గాంతునో యే మొ భావ్య
కారమంగళరూపంబు కలవు దీఅ
నాకు సెలవిమ్మ 'యన్మకుండా'పురంబ!
దక్షిణపు బీరభూమికిఁ దరలు చుంటి.

ఉ. పాలకు లెన్నఁడో యడుగుబట్టిరి కాకతిపట్టణంబులో
నేలను డాఁగి యుండమని నిశ్చలదీక్ష వహించు మిమ్ము గ్రం
థాలయమందుఁ జేర్చి విడనాడితి 'నిర్మల' కేగుచుంటి నో
లాలితపూర్వశాసనశిలామణులార! యనుజ్ఞ యీయరే.

చ. పగటను బాఠశాలకడఁ బాఠములన్ జదివించి పోద్రుకుగ్రం
కఁగ భవదీయసేతువునఁ గాల్నడతోఁ జనువేళ శీతల
స్థగిత సుగంధవాతమునఁ దాపము బాపిన నీకు నెట్లు చె
ప్పఁగ నగు నాకృతజ్ఞతను బాలసముద్రిమ! పోయి వచ్చెదన్.

సీ. కాకతిపోరిలుఁ డిక్కడ వసించె నఁటంచు
బురుజుపైఁ దలవాల్చి మొక్కినాఁడ
పసినాఁడు రుద్రిభూపతికి ముప్పాంబ యు
గ్గిడె నిట నని జోత లెత్తినాఁడ
ఈ జైనమూర్తుల కేది దిక్కని యార్య
మతదౌష్ట్య మెంచి యుమ్మగిలినాఁడ
ఈ పుణ్యభూమిలో నేను వసించుట
పూర్వపుణ్య మటంచుఁ బొంగినాఁడ
ఇచటఁ బౌరుఁడనై తరియింతునంచు
శిథిలమందిర మొకటి యార్జించినాఁడ
అర్థలోభంబుచే నిపు డరుగుచుంటి
నిర్మలకు హన్మకొండ! మన్నింపు మమ్మ.

చ. నిరుపమదివ్యకీర్తిరమణీయులు కాకతిరాజపుంగవుల్
చరణము లిందు మోపిరి, ప్రశస్తగుణాకర నాదు తల్లి తా

మరణము నొందెనిందె యిది మామకపుణ్యపదం బటంచు ని
న్నరసియు నన్మకొండపురమా! విడనాడెద నన్ క్షమింపుమా. ౬

క. ఇది తెల్గుదేశమునకున్
సదమల మగు జీవగడ్డ సాహిత్యరమా
పద మిచట భుక్తిముక్తులు
నొదవంగల వంచు నెంచుచుంటి మనమునన్. ౭

సీ. దురదృష్టవశమునఁ దొలఁగి పోనున్నాఁడఁ
బురలక్ష్మి! నను మర్వఁబోకు మమ్మ
ఎపుడైన నీక్షింప నే తెంతు సిద్ధేశ్వ
రా! నీకు వేయి జోహారు లయ్య
అనుదినం బేను గన్గొనఁ జాల మిము జైన
మూర్తులారా! మీకు మ్రొక్కు లివిగో
దర్శనభాగ్య మెత్తఱిఁ గల్గునో వేయి
స్తంభాలగుడి! నమస్కార మమ్మ
అరుగు చున్నాఁడ మిము వీడి యాంధ్రరాజ
మకుటమణిభాసమాన సామ్రాజ్యముఖ్య
దైవతములార! నిర్మలోద్దామ గహన
యాత్రికున కాజ్ఞ యే సోదరాంధ్రులార! ౮

శా. సాంగంబై చెలువొందు 'నోర్గలు'పురీసౌభాగ్యమున్ సాహితీ
రంగంబందు విచిత్రభూమికలుగా రాజిల్ల మేల్కైతతో
శృంగారించు కవీశుఁ డిప్పుడు భవత్సేవావియోగవ్యథా
భంగస్వాంతముతోడఁ బోఁదొడఁగె నంబా! హన్మకొండాపురీ. ౯

గీ. కాకతీయపురాన నీగగఁ జనింతు
మరల జన్మం బొసఁగి పరమాత్మ! నన్ను
సాదరంబుగఁ గనుమి దుస్తరమహాంధ్ర
పట్టణ వియోగచింత నోర్వంగఁ జాల. ౧౦

ఉ. తిక్కనసోమయాజి శివదేవుఁడు సోముఁడు భాస్కరుండు శ్రీ
లక్కమసానిపుత్త్రుఁడు కళానిధిపోతన యాంధ్రభారతిన్

మక్కువఁ బూజ చేసిన రమానిలయం బగు నోరుగంటిపై
నెక్కువ ప్రేమ నాకుఁ, బరమేశుఁడు గూర్చె వియోగమక్కటా. ౧

శా. ఆ లెల్లన్ రమణీయశిల్పములు భూధ్రింబుల్ జయస్తంభ లీ
లాలోలంబులు, భూమి కాకతినృపాలశ్రీలకుం దావ, యీ
పోరే స్వర్గము నన్ను దైవ మిచటం బుట్టింపఁడే యంచు ని
న్నాలోకించి తలంతు నేఁ డెటులఁ బాయన్ నేర్తు నోర్గల్పురీ. ౧

చ. అలనాఁడొందిన వైభవంబును జరిత్రార్థిన్ విలోకించి నేఁ
డలమన్ సాగిన దుర్భరస్థితికి నత్యంతంబు శోకించి యో
ర్గలు వీక్షించిన వేళ నాహృదయ మాకంపించు భ్రాంతుండ నై
విలపింతున్ బలవింతు బాష్పఝరి కల్పింతున్ దృగంతంబులన్. ౧౩

సీ. ఈ మహాశిల కాకతీంద్రసువర్ణసిం
హాసన బలిపీఠ మని తలంచి
ఈ విగ్రహము రుద్రదేవీప్రతిష్ఠాపి
తాలయస్థం బని యనుమతించి
ఈ రాచబాట శ్రీ వీరప్రతాపరు
ద్రాధీశు ననుకృతి యని తలంచి
ఈ నెల వల్ల విద్యానాథకవి గృహాం
గణభూమిగా మది కాంక్ష సేసి
భావములతోడఁ గాకతీశ్వర మహాంధ్ర
నగరనిర్మాణ మొనరించి నాఁటి సొబఁగు
పద్యములలోనఁ జిత్రించు భాగ్యరేఖ
తొలఁగె దురదృష్ట జీవి కీ తెలుఁగుకవికి. ౧౪

గీ. కలువు దీఱంగ నొకమాఱు కలయఁ గాంచి
అరుగునెడ నొక్కమాఱు క్రిమ్మఱను గాంచి
కొసరి తిలకించి మరలఁ గన్గొంటి యోరు
గల్లు విడనాడఁ జేసె నా కర్మఫలము. ౧౫

[సహస్రపత్రమునుండి]

# నన్నిచోడ-నన్నియభట్టకవులు సమకాలికులే

శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు
( ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సభ్యుడు )



*ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు, ఆంధ్రసారస్వత చరిత్రరచనకు ప్రోత్సహించుచున్న సమయమున, నన్నిచోడదేవ కవిరాజు తన కుమారసంభవములో 'గూఢవస్తుమయకావ్యము'గా, వ్రాసిన 'ప్రబంధ' రచనా పరిసమాప్తికాలమును నాకు తోచినరీతిని ప్రకటించుట దోషముకాదుగదా!

## చాళుక్యరాజు - రాజరాజనరేంద్రుడా?

నన్నిచోడదేవుడు 'దేశిసత్కవుల సంస్తుతి'లో 'చాళుక్యరాజు మొదలగు పలువుర'కు నమస్కరించి యున్నాడని క్రమాలంకారము చెప్పుచున్నది. పరిశీలింపుడు.

(౧) 'ఇష్టదేవతా నమస్కారమ్ము చేసి:
(౧) 'సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి:
(౨) 'మదీయ గురుచరణారవిందంబు లభినందించి:
(౨) 'మద్గురు చరణారవిందములకుం దగ సన్నుతిఁజేసి:

---

* ఆంధ్రకుమార సంభవమును రచించిన నన్నిచోడ మహాకవి సుప్రసిద్ధుడగు నన్నియభట్టునకు సమకాలికుడని కంఠోక్తిగ నిర్ణయింపవచ్చును. సత్య మిట్టులున్నను, యాకవి, జంగమ మల్లికార్జునునకు శిష్యుడనియును జంగముడు బ్రాహ్మణుడేయని యును అందు నిర్వచించి యుండుటచేత నీ విషయములు గిట్టక మార్గాంతరముల నన్వేషించు నెపమున నాకవికి నాధునికత్వము నంటగట్టుచున్నారే కాని యందు సత్య మెంతమాత్రము లేదు. ఆకవి ప్రాచీను డనుటయే యుక్తిసమ్మతము. శ్రీ వేంకట కృష్ణారెడ్డిగారి పరిశోధన శ్రీ మానవల్లివారి ప్రాచీన సిద్ధాంతమునే బల పరచుచుండుట గమనింపదగియున్నది. అధునికత్వమును సాధించిన శ్రీపాద లక్ష్మీ పతిశాస్త్రిగారి "నన్నిచోడ కుమారసంభవ విమర్శ" యను గ్రంథముపై పరామర్శను కొన్నివ్యాసములుగా నీ పత్రికయందు ముందు బ్రకటించవలసియున్నది.-సంపాదకుడు.

(౧) ఇవియన్నియు కుమారసంభవము, ౧ వ ఆశ్వాసములోనివి.

(౩) 'వాల్మీకి వ్యాసాదులు చనిన జగతి:
(౩) 'క్రొల్చి వి_స్తరమతులం బురాణ కవి సంఘములర్:
(౪) 'కాళిదాస, భార (వి), వ్య (ఉ) ద్భట, బాణులు:
(౪) 'ఉ_త్తమ మార్గ సత్కవీశ్వరులకు, (సం_స్తుతిఁ జేసి):
(౫) 'దేశికవితఁ బుట్టించి, తెనుంగును నిలిపిరి - చాళుక్యరాజు మొద
లగు పలువుర్.'
(౫) 'దేశిసత్కవుల సం_స్తుతిఁ జేసి మనోముదంబునర్'

అని పోలిక కాన్పించుచున్నది. 'సురవరులం గ్రమంబున' అనే క్రమాలాంకారము 'దేశికవితఁ బుట్టించి (సృజించి-రచించిన 'చాళుక్య రాజు'ను 'దేశి సత్కవి'గా నిరూపించుచున్న దే గాని-'నన్నపార్యుఁజూచి 'మహాభారతబద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు (ఆంధ్ర మహాభారత. ఆదిపర్వము, ౧ ఆ ౨—౧౬ ప.)మనిన 'చాళుక్యుడు— 'రాజరాజనరేంద్రుడు'—కాడని స్పష్టమగుచున్నది.

కనుక నన్నియభట్టాంధ్ర మహాభారతపర్వత్రయమునకు తరువాత-చోడాంధ్ర కుమార సంభవ ప్రబంధము రచింపబడినదని విమర్శకులు పలువురు నిర్ణయించుట సాహసమని చెప్పవలసి వచ్చినందుకు చింతిలుచున్నాను.

## దిగ్విజయములు

తెనుగు చోడవంశ బిరుదులనుబట్టి నన్నిచోడదేవ దిగ్విజయాదులను నిర్ణయింపవచ్చునేమో? అని చర్చించుట వ్యర్థ ప్రయత్నము కాదు:

'నన్నిచోడ జనవిభుండ—ఒరయూరికధిపతి' నలఘు పరాక్రముఁడఁ దెంకణాదిత్యుండర్' అని యాంధ్ర కుమారసంభవములో వ్రాసికొన్నాడు. దీని కనుగుణ్యాముగా, నన్నిచోడదేవునికి తరువాతివాడు (అర్వాచీనుడ) తన కొణిదెనశాసనములో—'ఓపిలిసిద్ధివల్లభుజయోన్నతుం డేంకణచక్రవ_ర్తి నాజ్ఞాపరిరక్షితాఖిల దిశావలయు (౬)—'యొఱయూరి పురవరాధీశ్వర సూర్యవంశోద్భవ కాశ్యపగోత్ర తేంక్గణాదిత్య-

సమస్త ప్రశస్తిసహితంబు శ్రీమనుమహామండలేశ్వర మోపిల్లి సిద్ధన దేవ చోడమహారాజులు.' (శాసనపద్యమంజరి ౭౬-౭౭ పుటలు.) అని వ్రాసి కొన్నాడు. కాబట్టి, 'తేంకణచక్రవర్తి'—'తేంగ్గణాదిత్య' బిరుదులు సమానార్థద్యోతకములుగా నున్నట్లు తోచుచున్నది.

ఇంతేకాక, ఒరిస్సా (కళింగ) కటక ప్రాంతములలో—'ఢేంకనలు (Dhenkanal)' అనే స్వదేశసంస్థాన మున్నట్లు పత్రికా పాఠకుల కందరికి విదితమయ్యేయున్నది. కనుక, నన్నెచోడ జనవిభుండు 'ఢేంకణమును జయించిన కారణమువల్ల—అలఘుపరాక్రముఁడఁ * ఢేంకణాదిత్యుండన్.' అనే చారిత్రిక బిరుదమును తన కావ్యములో వ్రాసి కొన్నాడని తోచుచున్నది. దీని కనుగుణ్యముగా, 'సురారిదూత తొలి చెప్పిన యుద్ధావనిఁ గైకొని విడిసెను. దేవపతాకిని మహానదీతీరమునన్' (కుమార. ౨ భా. ౧౧ ఆ. ౫౯౦ ప.)అని కలదు. కథాసందర్భ మెట్లున్నను కవిరాజు కళింగ (ఒరిస్సా) రాష్ట్రమందలి 'మహానదీతీరము'లో తనసైన్యమును నిలిపి, 'ఢేంకణలు' సంస్థానమును జయించెనా? అని యుద్బోధకమగుచున్నది. విశ్లేషించి, కళింగరాష్ట్రమందలి 'నీలాచలము' (జగన్నాథము) (కుమార. ౨ భా. ౧౨ ఆ.౦౫౪ ప.) తో పలుసార్లు పోల్చి; చోడకవి తన దిగ్విజయచరిత్రను స్ఫురింపజేసినాడేమో? అని యాలోచించుట కవకాశము కాన్పించుచున్నది.

ఏది యెట్లయినను, కరికాల చోడవంశీకుల ప్రాచీనశాసనములలో 'తేంకణాదిత్య' అను బిరుదము మరియొకరికి కలదా? అని పరిశోధించినగాని, దీనిసత్యము బోధపడదని చారిత్రికులకు విన్నవించుచున్నాను.

### పాకనాటి రాజధాని

నన్నిచోడదేవకవిరాజు తన కావ్యావతారికలో— 'పాకనాఁటియం దిరువదియొక్క-వేయిటి కధీశుఁడు నాఁజను చోడబల్లికిం--శ్రీసతికిం

---

*ఢేంకణమనగా దక్షిణము, దక్షిణదేశమున విజయములనంది సూర్యునివలె ప్రకాశించుటచే ఢేంకణాదిత్య బిరుదము కలిగినది. దీనికిని ఢేంకనాలునకును సంబంధము కలదనుట సమంజసము కాదు. —సంపాదకుడు.

దనూజుఁడర్క. (కుమార. ౧ భా. ౧ ఆ. ౫౩ ప.) అని వ్రాసికొ
యున్నాఁడు. అతను పాకనాటి రాజధానిపేరును వాచ్యముగ చెప్పి
యుండకపోవుటయేగాక, తన్ను గూర్చి ‘ఒరయూరి కధిపతిఁ. (కుమా
౧ భా. ౧ ఆ ౫౪ ప.) అని వ్రాసికొనియున్నాఁడు. దీని సత్యము
కనుగొనుటకు పూర్వము, చోడకవిరాజు ‘గూఢవస్తుమయకావ్యము’గ
తన ‘పాకనాటి’ రాజధానిపేరును వ్రాసియున్నాఁడేమో? అని ప
శీలించుట దోషముకాదు.

ద్వాదశార్ధార్ధ నయను నాద్వాదశార్ధ
వదనుఁ డొగిఁ జుట్టి నిజభుజ ద్వాదశమున
నుదయదశశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు.

కుమార. ౨ భా. ౧౨ ఆ. ౯౯౩ ప.

అని ‘అఖిలభువనస్వామి కుమారుల దివ్యాలింగనమును చోడ కవిరాజు వర్ణించియున్నాఁడు.

ఈ గీతపద్య పూర్వార్ధమందలి సంఖ్యలన్నియు (త్రినయన, షణ్ముఖ, నిజభుజ ద్వాదశములన్నియు) కలిసి, ‘ఇరువదియొక్కటి’యగు చున్నవి. దీనిని యుత్తరార్ధమందలి (‘దశశత కిరణ’ములనే) ‘దశశతకర ముల’తో పెంచిన, ‘పాకనాఁటియం దిరువదియొక్క-వేయి’ గ్రామసంఖ్య లభించుచున్నది. ఇక, ‘ఇరువదియొక్క-వేయి’ సంఖ్యలోనున్న ‘అయ్యుద యనగము’——నెల్లూరు జిల్లాలోని--‘ఉదయగిరిరాజా ? (జ్యా) న పాక నాండు నెల్లూరుజిల్లా తిరువీదుశాసనము’ అని నిర్ణయించవచ్చును. కాన, నన్నిచోడదేవకవిరాజు తనతండ్రివలెనే, ‘అయ్యుదయ నగరమును (ఉదయగిరి)’ని ‘పాకనాటి’ రాజధానిగా నుంచుకొని రాజ్యపరిపాలన గావించినాడని గూఢవస్తుమయ కావ్యలక్షణము చెప్పుచున్నది. అయితే, కవిరాజు తన గ్రంథావతారికలో ‘ఒరయూరి కధిపతిఁ.’ అని వ్రాసిన చరిత్ర—ప్రాచీన చోడరాజధానీ గౌరవచిహ్నమేగాని, నిజచరిత్రకాదని పాఠకులు విశ్వసింపవచ్చును. తండ్రి ‘పాకనాటి కధీశుఁ’ డైనప్పుడు, కుమార నన్నిచోడుడు ‘పాకనాఁటి కధీశుఁడు’

గాక, ద్రావిడ దేశమందలి 'ఒరయూరి కధిపతి' యగుటయు, జాను తెనుగుకావ్యమును వ్రాయుటయు యస్వాభావికములని ప్రత్యేకించి చెప్పనక్కర లేదు.

## ప్రబంధ రచనాకాలము

నన్నిచోడ దేవ కవిరాజు తన 'గూఢవస్తుమయ కావ్య' మైన జాను తెనుగు కుమారసంభవములో, కుమారసంభవ రచనాపరిసమాప్తి కాలమును వ్రాసినాడేమో! అని పరిశోధించుట ముఖ్యావశ్యకము.

ఇట్లు ('కాలనేమి') శతముఖ దశశతకర పరిఘశోభితుండై య నేకవిధాయుధ వర్షంబులు గురియు (కుమార. ౨ భా. ౧౨ ఆ-౬౭౨ ప.) చుండఁగా

('నాఁటుదీఁటి, విస్ఫుర దవదాత ఖడ్గలత పూచెనో నా) జయ చైత్రసంపదన్.' కుమార. ౨ భా. ౧౨ ఆ ౯౬౧ ప.)

'విజయ ప్రశస్త శాసన లిఖితాక్షరంబు లయ్యెను.' (కుమార. ౨ భా. ౧౨ ఆ. ౯౭౦ ప.) అని 'సకలదిక్తటశిలాపట్టంబుల' కలదు.

ఇందలి 'జయచైత్రసంపద'తో శత + దశశత (౧౧౦౦) వర్షంబులు' సరిపోవుచున్నవా? అని పరిశీలింపగా, పదునొకండు (౧౧) విక్రమశక సంవత్సరములు తగ్గియున్నవి. కాని, గూఢవస్తుమయ కావ్యమును 'శతముఖదశ (న్నూటపది) + దశశత (పదినూర్లు)—వర్షంబులు' అని సంఖ్యావిభాగము గావించి; కూడినచో 'పదునొకండువందల పదియవ (౧౧౧౦) విక్రమశకగత వత్సర' మేర్పడుచున్నది. పంచాంగ ప్రకారము 'పదునొకండువందల పదునొకండవ (౧౧౧౧) విక్రమశక సంవత్సరములో 'జయచైత్రి' సంపద వచ్చుచున్నది గాన. విక్రమశక సంవత్సరమునకును, 'జయచైత్రి' సంపదకును మధ్యనున్న కొలది వ్యత్యాసమును సందేహించ నక్కరలేదు. ఇట్లు కానిపక్షమున, చోడ కవిరాజు గద్యములో 'ఇట్లు (కాలనేమి) శతముఖ ('దశశత' యనుటకు బదులుగా) సహస్రకర పరిఘశోభితుండై యనేకవిధాయుధ వర్షంబులు'

అని వ్రాసియుండవచ్చునుగదా? అని యాలోచించిన చో—'శతము
(=ముందటి)—దశ+దశశత—వర్షంబులు' అని విభజించుట గూ
వస్తుమయ కావ్య లక్షణాంగీకార మేమో? అని తోచుచున్నది.

ఇంతేకాక, నన్నిచోడ దేవ కవిరాజు 'విస్ఫురదవదాతఖడ్గల
పూచెనో నా జయచైత్రసంపదన్' అను 'గూఢవస్తుమయ కావ్య' కీ
కములో—సంవత్సర, మాస, పక్ష, తిథి, వారము లిమిడ్చియున్నాడ
సమన్వయము కుదురుచున్నది.

(౧) 'అవదాతము'—('తెల్లనిది.) శుక్లపక్షము.

(౨) 'జయచైత్రసంపద'—జయ సంవత్సర, చైత్రమాసమును
తెలుపుటయేగాక, 'జయ'తిథి, 'జయ' వారమును తెలుపుచున్నది.

(3) లెక్కప్రకారము 'జయ' తిథి—శుద్ధతదియ.

(౪) 'జయవారము—'మంగళ'వారములిమిడియున్నవని పంచాం
గము చెప్పుచున్నది. కనుక 'విక్రమశకగత వర్షము ౧౧౧౦—అగు
జయ సంవత్సర చైత్రశుద్ధ తదియ మంగళవారమునాటికి' సరియైన
తే 15-3-1054 ది 'జయ చైత్రసంపద' లో శక్తిధర (కుమార) ము
విజయ ప్రశస్త (తారకాసుర నామాంకురంబులు) శాసన లిఖితాక్ష
రంబులయ్యె' నని, నన్నిచోడ దేవకవిరాజు తన 'గూఢవస్తుమయ
కావ్యము'లో- వాచ్యముగా చెప్పియున్నాడు.

సమాప్తి

ఇక, రాజరాజనరేంద్రుడు తే 28-11-1053 ది 'సోమ గ్రహణ
నిమిత్త (ఆంధ్రకవుల చరిత్రము ౧ భాగ. 9—11 పుటలు. రెండ
కూర్పు) ముగా నన్ని నారాయణునకు దానమిచ్చిన నందమపూండి
శాసన 'కావ్యకర్త నన్నియభట్టు'— తే 28-3-1054 ది 'జయచైత్ర
సంపద' నాటికి తెనుగు కుమారసంభవ 'కావ్యకర్త' యైన నన్నిచోడ
దేవ కవిరాజ శిఖామణికి సమకాలికుడని ఖండితముగా చెప్పవచ్చును
కాబట్టి,

(౧) 'నన్నెచోడ దేవుఁడు—క్రీ. శ. 940 లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁడయ్యెను.

'ఈకృతి నన్నయభట్టుకంటె నూరేండ్లు పూర్వముది. (1909-ముద్రిత చోడకుమార సంభవము. ౧ భాగ. పీఠిక. ౧-3 పుటలు.)అనే శ్రీమానవల్లి రామకృష్ణకవి (యమ్. ఎ.) గారి సంపాదకీయ సిద్ధాంతముగాని,

(౨) పెద్ద చెరుకూరు శాసన ప్రచురణాధికారి 'రెండవమల్లి దేవుఁడు (శాలివాహనశకములకు బదులు క్రీస్తుశకములు వేసినాను) క్రీ. శ. 1218-వ సంవత్సర ప్రాంతమువాఁ డయినచోఁ (ఇతని కైదు తరముల పూర్వీకుడును, చోడబల్లి కుమారుడయిన ప్రథమ నన్ని చోడుఁడు క్రీ. శ. 1118- వ సంవత్సర ప్రాంతమువాఁ డగును. అనఁగా నన్నయ భట్టారకున కించుమించుగా నూఱేం డ్లిటీవలి వాఁ డగును...... ఎట్లుచూచినను నన్నిచోడుఁడు నన్నయభట్టునకును, తిక్కనసోమయాజులకును నడిమివాఁడని తేలుచున్నది. ఇదియే సిద్ధాంతము. (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. ౧3 సంపు. 3 సంచి. ౧౪౫ పుట.) అనే కళాప్రపూర్ణ శ్రీ జయంతి రామయ్యపంతులుగారి శాసనసిద్ధాంతము గాని,

[3] 'ఏవిధమునఁ జూచినను నన్నిచోడుఁడు తిక్కన్నకు సమీపస్థుఁడుగాను, నన్నయ్యకు దూరస్థుఁడుగాను గనబడుచున్నాఁడు. సర్వవిధములను గవితలో సాదృశ్య మెంతయో కలదు. [కుమారసంభవ విమర్శము(౧౯౩౭) ౧౩౪ పుట.]

మొదలగు నిదర్శనములవలనఁ దిక్కన కనంతరకాలమువాఁడని తేలుచున్నది. తిక్కన కనంతర మఱువది డెబ్బది సంవత్సరములవఱకుఁ జోడరాజుల శాసనములు గన్పట్టుచున్నవి గానఁ దత్ప్రాంత కాలమున [క్రీ. శ. ౧3-వ శతాబ్దములో] నన్నిచోడకవి వెలసియుండును. [౧౯౩౭ కుమారసంభవవిమర్శము ౨౦౭ పుట.]

అనే మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ ఆంధ్ర సహాయోపన్యాసకులు. శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి 'భాష నిదర్శన' సిద్ధాంతముగాని విశ్వసనీయములు గావని చెప్పవలసి వచ్చినందుకు చింతిలుచున్నాను.

ఇంతకు, 'నన్నెచోడకవిశిఖామణి నన్నయకు తరువాతివాఁడు కాలమునుబట్టి చూచిన సమీపస్థుడు. తిక్కనకుఁ బూర్వుఁడు. [రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. (౧౯౨౨) ౨౦౨ పుట.]

అనే ఆంధ్రవిశ్వ కళాపరిషదుపకులపతి, డాక్టరు, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి సిద్ధాంతము విశ్వాస పాత్రముగా నున్నది గాని ఇక్కడఁ బేర్కొనబడిన చాళుక్యరాజు-రాజరాజుగాని, ఇంకొకఁడను అసాధ్యమైన కార్యము. [రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక. (192 202 పుట.] అనే శ్రీ రెడ్డిగారి సిద్ధాంతభాగము 'దేశి సత్కవుల సంస్తుతి విరుద్ధమని చెప్పవలసి వచ్చినందుకు చింతిలుచున్నాను.

'దేశికవితఁబుట్టించి తెనుంగున నిలిపి (న) చాళుక్యరాజు'— దేవి సత్కవి యగునేగాని, నన్నయభట్టాంధ్రమహాభారత రచన ప్రోత్సాహకుడయిన రాజరాజనరేంద్ర 'చాళుక్యుడు' కాడని 'సు వరులం గ్రమంబున' అనే పద్యమందలి క్రమాలంకారము చెప్పుచున్న ది. గాన, వీరిద్దరిలో ఆదికవి మెవ్వరో? అని మరల పరిశీలింపవల యున్నదని మనవిచేయుచున్నాను.

మరియు, నన్నిచోడకవిరాజు తన గూఢవస్తుమయ కావ్య ములో - "జయచైత్రసంపద'' కనుగుణ్యమైన ౯౭౯ (మూడుసంవత్స రము లధికముగానున్నవి) శాలివాహన శకసంవత్సరమును వ్రాసియు న్నాఁడనియు, పెద్ద చెరుకూరు శాసనకాలము "జయచైత్రసంపద'' తో సరిపోవుచున్నదనియు మరియొక వ్యాసములో చర్చింపదలచి, విడి పెట్టినానని మనవిచేయుచున్నాను.

( ఆంధ్రభూమి నుండి )

---

# శుద్ధబోధిజాతకము

(పూర్వసంచికానువృత్తము)

**శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు**



కం. అతఁడు వసిష్ఠుఁడని, సా
ధ్వీతిలకము దా నరుంధతీదేవియుఁగాఁ
బ్రీతినిఁ దత్కాల జన
వ్రాతము గొల్వం దొడంగె వారి నిరువురిన్. ౨౦

గీ. అలరుచున్నను వారు గృహస్థ వృత్తి
వెలయుచుండిరి వానప్రస్థ వృత్తియందె
వనమునందున్న గృహమున వాసమున్న
నిర్విశేషంబ యీదృఙ్మనీషులకును. ౨౧

కం. ప్రతిబంధశూన్య మగు జీ
వితమింటను గడపుచున్న వృత్తికి సంపూ
ర్ణత రాదని కాఁబోలును
సతితో నతఁడాశ్రయించెఁ జని యొక్క వనిన్. ౨౨

సీ. ఉన్నతికిం బోవుచున్న గొబ్బిండుల
చెట్లమొత్తంబు నీక్షించుచున్నఁ
బండుల బరువుచే నిండి నేలకు వంగు
కొమ్మలుగల వృక్షకోటిఁ గన్నఁ
బరులకోసంబె జీవనములఁ దాల్చుచు
ననయంబుఁ బాఱు వాహినులఁ గన్నఁ
గంటకాదులు దమ్ముఁ గాడిన నిశ్చల
త్వమును మానని శిలాతతులఁ గన్న

గీ. మానవుని చిత్తమందు నేమాత్రమైన
జ్ఞాన ముండిన యెడల నశంకితముగ
సడలిపోదె? తనంత దోషప్రవృత్తి
పరులు బోధింప నక్కఱపట్ట కచట. ౨౩

చ. వలదనుమాట లే దెవరు వచ్చిన, నెన్నిదినంబు లున్న నో
బలికెడువారు లే; రొకరి వస్తువు లి వ్వను మాట లేద; య
న్నలుఁ జెలియండ్రుఁ దండ్రులు జనంబు లటన్ వసియించువార
జ్జ్వలముగ నందు దైవియగు సంపద తాండవమాడు నిచ్చలున్.

ఉ. కాయలఁ గందమూలఫల కాండములన్, భుజియించుచున్ దరు
చ్ఛాయలయందుఁ గాపురము సల్పుచుఁ దాల్చియు జీర్ణమైన కా
షాయపటంబు ద్వంద్వముల సైఁచియు నీ యువమానిదంపతుల్
సేయఁ దొడంగి రయ్యెడ బ్రసిస్థితులై తపముం ద్రిసంధ్యలన్.

ఆ. వె. చక్రవాకయుగము సరణి నన్యోన్యంబుఁ
బాసిపోక రేయుఁబవలు వారు
యోగసాధనానుయోగ తపఃక్రియా
చరణములను బ్రొద్దు జరుపుచుండ్రి.

కం. పసుపాడి యొక్కనాఁ డిం
పెసఁగంగా మడుఁగుఁ దాల్చి యెప్పటివలె నా
త్మసమీపారణ్యమునకుఁ
గుసుమాపచయార్థ మరిగెఁ గోమలియుఁ దగన్.

కం. ధనబలసురూప నవయౌ
వనమదముల మూసపోసె బ్రహ్మ యనంగాఁ
జనుదెంచెను దగి యొక్కఁడు
జననాథసుతుండు యువతిసహితుం డటకున్.

గీ. అతఁడు దశవత్సరప్రాయమందు మరగెఁ
జుంబనాలింగనక్రియాసుఖ మొసంగు
బాలికలఁ, గన్నుగీటెను బానిసలను;
దరుణుఁ డగువాని సంగతిఁ దడవనేల ?

కం. సందుల, గొందులఁ, జల్లని
పందిళ్లను, బూవుఁబొదల, వాపీవితతిన్
సుందరులఁ గూడి యాతఁడు
గందర్పారాధనంబుఁ గావించెఁ గడున్,

కం. సుదతి యొకతె వాయింపఁగ
మృదంగ, మొక్కరితె వీణ మీటఁగ, లయయుఁ
మదిరాక్షి యొకతె వేయఁగ,
ముదిత యొకతె సేయ లాస్యము, నతం డలరుఁ. ౩౧

సీ. పురుషవేషముఁ దాల్చి పొలఁతి యొక్కతె కూడు
యువతివేషముఁ దాల్చియున్న ప్రియుని
సవతివేసం బూని పువుఁబోఁణి యొకరిత
చెలువునిఁ గవయు మచ్చిక లొనర్చి
పందెంబు గెలిచి సపత్నులు తెల్లఁబోఁ
గొని చనుఁ బతి నొక్క కోమలాంగి
ఆర్తిని నటియించి యనుసరింపఁగ భర్త
యేకాంతమున కేగు నింతి యొకతె

ఆ. వె. ఒకరి మొఱఁగి యొక్క రొకరినిఁ గికురించి
యొకరు మోసపుచ్చి యొకరి నొకరు
అలరుఁబోండ్లు మొత్త మహామహిమకుఁ గూడి
తనిసి రతుల నతనిఁ దనుపుచుండ్రి. ౩౨

ఆ. వె. మదిరఁ బుక్కిలించు మదిరాక్షి యొకతె భూ
విభుఁడు దేవురించు వెలఁది యొసఁగ
నడిగినట్టి నిముసమందె యొసంగిన
వస్తువునకు గౌరవంబు గలదె? ౩౩

సీ. నిన్నుఁ బ్రతీక్షించు చున్నది సూ! ఋతు
స్నాతయై కుంతలనాథు కన్య
కాంచుచున్నది గవాక్షమునుండి మార్గంబు
వార మాట నవంతిపతితనూజ
నిర్బంధపఱచుఁ బన్నిదము గెల్చుటఁ జేసి
యంగదేశాధీశునను(గుబిడ్డ
విడియంబుఁ బంపించి వేచియున్నది నీదు
రాకకై యుత్కలరాజకన్య

ఆ. వె. అనుచు దాసి సేయు మనవుల నాలించి
ధూర్తుఁడయి యొకొక్క తోయజాక్షిఁ
గవసి సాకుఁ బన్ని కంఠగ్రహ మెడల్చి
దుస్సిపోవు నతఁడు దూరమునకు.

క. తెగఁదాఁవును దాఁవించును
మగువలఁ దేలించు రతుల మరిఁ దాఁ దేలున్
బగ లనక రేయి యనకయు
వెగటు గొనక యతఁడు మగలవెట్టి త్తంగన్.

క. కనకనలాడుచు మోహం
బనలం బనఁ గ్రొత్తక్రొత్త యంగనలను నిం
ధనముల వెదకుచు నుండును
దనివింగొని చల్లఁబడద తగ నాతనికిన్.

ఆ. వె. మచ్చుమందు సల్లి యిచ్చకంబులఁ బల్కి
కాంచనాంబరాశఁ గలుగఁ జేసి
యభినవాంగనాళి నర్దింతురి తారుపు
కత్తియలు తదంతికమున సతము.

క. లలనాసముదాయమునకుఁ
దల దువ్వను బూలు ముడుచుఁ దమమెయి దిద్దం
దిలక మలందును గంధముఁ
బులియు నతఁడు సందు సూచి ముద్దులు గొనుచున్.

గీ. అట్టి శృంగారి వసుధాధిపాత్మజుండు
వచ్చి పరివారనిర్మితపటకుటీర
కముల విడియించి రాణివాసమును, వెడలెఁ
దద్వనంబున విహరింపఁ దలఁపు వుట్టి.

గీ. పువ్వులం గోయుచున్న యాపుణ్యయువతి
కపుడు దక్షిణలోచనం బదరఁ దొడఁగెఁ
బెల్లిదంబుగఁ జిత్త ముద్విగ్న మయ్యెఁ
జాఱెఁ బువ్వులపుటిక హస్తముననుండి.

(స శే ష ము)

# విజయాదిత్యుని అమ్మణిగి శాసనము

వేదకావ్యస్మృతితీర్థ, ధర్మాచార్య,
పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు



ప్రాచీనశాసన ప్రశస్తి— పురాతన కాలమునందు రాజాధిరాజులు, సుప్రసిద్ధులగు కవి పండిత యతి పురోహితులకును మఠమందిరములకును గో భూ హిరణ్యాదులను దాన మొనర్చి వారి నతి శ్రద్ధతో సత్కరించుచుండిరి. కావుననే, మన సనాతన విద్యాధర్మములు నేటికిని జీవించుచు వచ్చెను. అయినను ఆ దానములు కేవలము వాగ్దానములే కాక శాశ్వతముగ నడువవలెనను యుద్దేశ్యముతో శిలలయందో రాగిరేకులయందో విశదముగ నుభయుల(ఇచ్చువారియొక్కయుతీసుకొనువారియొక్కయు) వంశపరిచయప్రశస్తిని వ్రాసి సూర్య చంద్రుల సాక్షిగా ప్రతిజ్ఞ యొనర్చి ఇచ్చుచుండిరి. ఈపద్ధతిని మన మహర్షులే యావిష్కరించిరనుటకు ధర్మశాస్త్రములే సాక్షి. యాజ్ఞవల్క్య స్మృతియందిటుల కలదు.

"దత్త్వా భూమిం నిబంధం వా కృత్వా లేఖ్యం తు కారయేత్
ఆగామి భద్రనృపతి - పరిజ్ఞానాయ పార్థివః॥ ३१८
పటే వా తామ్రపట్టే వా స్వముద్రోపరిచిహ్నితం।
అభిలేఖ్యాత్మనో వంశ్యా నాత్మానం చ మహీపతిః॥ ३१९
ప్రతిగ్రహపరీమాణం దానచ్ఛేదోపవర్ణనం।
స్వహస్తకాలసంపన్నం శాసనం కారయేత్ స్థిరమ్॥ ३२०"

అయినను ప్రాచీనాక్షరములు ఆధునికాక్షరములవలె నుండక 'ప్రకృతు'లై యుండుట జేసియు, మధ్యకాలమున శాసనములు చదువు పద్ధతి తప్పిపోవుటచేతను, ఆధునికులైన గొప్ప గొప్ప విద్వాంసులకు సైతము ఈ ప్రాచీన శాసనముల జదువుట అసాధ్యమయ్యెను. ఇటీవల ఆంగ్లప్రభుత్వ మారంభమైన పిదప క్రీ.శ. ౧౭౮౪ జనవరిలో కలకత్తా నగరమున నొక ప్రాచ్యసంశోధన సంఘము (Asiatic Socity)

స్థాపింపబడ్డెను. నాటినుండి ప్రాచ్యపాశ్చాత్యపండితు లనేకులు దృ
ముగ బరిశ్రమించుటచే భారతదేశపు ఇతిహాసమును, శిలాతామ్రశా
నాదిమహత్త్వ సామగ్రియును ప్రకాశమునకు వచ్చెను.

అమ్మణిగి శాసనవృత్తాంతము = బెలగాం చంద్రశేఖర మ
ధ్యక్షులును, ప్రియమిత్రులును నగు పండిత శ్రీ గురులింగదేవస్వామి
(ప్రస్తుతము హుబ్లి గంగాధర సంస్కృతకాలేజ్ ప్రిన్సిపాలు) గా
ద్వారా ఈ శాసనపు రేకొకటి లభించెను. "౨౦ సంవత్సరము
క్రితము వారి జన్మభూమియగు అమ్మణిగి గ్రామములోని పెద్దమఠము
నందు వారికీ శాసనము కంటబడెను. ఈ పెద్దమఠములోని పూర్వ
జులు శ్రీశైల సమీపమునందలి సుప్రసిద్ధమైన సారంగమఠమునకు
జేరినవారై యుండిరి. వారిలో గొప్పతపస్సంపన్నులును పండితులును
నగు మాహేశ్వరమూర్తులకు పండిత సత్కారమునందు సుప్రసిద్ధులై
పశ్చిమ చాళుక్య మహారాజులు మన్నించి యాశ్రియ మిచ్చినందు
అమ్మణిగికి వచ్చి నివసించిరి. చాళుక్యుల బాదామి రాజధానికీ గ్రామము
సమీపముగ నున్నది. వారి పూర్వికులకు భూదాననిమిత్తముగ నీశాస
నము పుట్టినది. పూర్వ మీ శాసనమున మూడురేకు లుండెడివి కాని
యిటీవల నీ మఠమునుండి తాటాకు గ్రంథములను తామ్రపత్రములను
కొందరు పండితులు సంగ్రహించుకొని వెళ్ళి యుండుటవలనను వృద్ధుల
యజాగ్రతవలనను లుప్తమైనవి" అని మిత్రుల వాఙ్మూలము.

**శాసనపఠనము:**—ఈ శాసనము హస్తగతమైన ముహూర్త
మెట్టిదోకాని చాంచల్యము దీని సహజగుణముగ నుండెను. దీనియం
దేమి కలదోయని మద్రాసు మైసూరు హైదరాబాదులలోని శాసన
పఠన పండితులకు బంపుకొనగా ౨-3 వత్సరములు తిరిగితిరిగి, పోయి
నటులే మరల మాకు (కాశిలోనుండగా) జేరినదే కాని పాఠ మెవరును
బంపి దయచూపించరైరి.

ప్రసంగవశమున బనారస్ హిందూయూనివర్సిటీలో ఇతిహాస పరి
శోధనాధ్యక్షులగు శ్రీ॥ శ్రీ॥ ఆర్. డి. బెనర్జిగారి కంటబడినపుడు, గపగపా
చదివి వేసిరట గాని యాపాఠమును శ్రీస్వాములు కాపీ చేసియుండలేదు.

తర్వాతనీ ,లిపిశాస్త్రమును మన మే యేల యభ్యసింపగూడదు? అను జిజ్ఞాస బైలుదేరెను. నిక్కముగ నీ శాసనమే నాలో నితిహాసప్రేమను శాసనపఠన శక్తిని యనుగ్రహించె ననుటలో సందేహములేదు. పైగా సంస్కృత భాషాభిజ్ఞులకు ప్రాచీన శాసన పఠము త్వరగా సాధ్యమగు ననికూడ తెలియవచ్చెను. ఎటులైననేమి కొంతకాలము గడిచిన వెనుక నీశాసన పాఠమును సటిప్పణముగ (వ్యాసముగా) ఆంధ్రసాహిత్య పరిష దధ్యక్షులగు శ్రీ పండితవర్య జయంతి రామయ్య పంతులవారికి బంపగా నది పొరపాటుచే కాబోలు వారిపేరుతో నచిత్రముగ బరిషత్పత్రికలో (నెనిమిది వత్సరముల క్రితము) ప్రకటితమయ్యెను. నేటికి స్వ 'విభూతి' లో సచిత్రముగ బ్రకటితమగుచున్నది.

**శాసనాకృతి:**—ప్రస్తుతము నాయొద్ద శాసనపత్ర మొకటిమాత్రమే కలదని వెనుక వ్రాసియుంటిని. ఈరేకు 9¼ అంగుళముల పొడవును, 4¾ అంగుళముల వెడల్పును గలిగియున్నది. రేకుకు రెండువైపులను తొమ్మిది తొమ్మిది పంక్తులు కలవు. రేకు నాల్గువైపులలో గల అంచు ఎత్తికొట్టబడి బొద్దుగానున్నది. ఒకచోట చివర కొంత తునిగిపోయినది. మొత్తముమీద రేకంతయు భద్రముగానే యున్నది.

**శాసనదాత:**—విక్రమాదిత్య సత్యాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర భట్టారకుని పౌత్రుడును వినయాదిత్య సత్యాశ్రయ మహారాజ పుత్రుడును నైన శ్రీ విజయాదిత్య సత్యాశ్రయ మహారాజు అందఱ నాజ్ఞాపించి ఘోషించుచుండుటచే ఈ శాసనము దానావసరమున పుట్టియుండవచ్చునని యూహింప నవకాశము గలదు. ఇందలి నామసామర్థ్యములచే శాసనదాత పశ్చిమ చాళుక్యులలో నొకడని దృఢపడుచున్నది. వీరందరును వెనుకటికాల మున వాతాపి (బాదామి) నగరమందు రాజ్యమేలుచుండినందున వీరికి వాతాపిచాళుక్యులను నామము ఐతిహాసికజగత్తునందు ప్రసిద్ధమై యున్నది. నామక్రమముచే ఈ విజయాదిత్యుడు ద్వితీయపులికేశి సత్యాశ్రయునకు ప్రపౌత్రుడును, ప్రథమవిక్రమాదిత్యునకు పౌత్రు డును నైయుంట సరియనియే తేలుచున్నది. ద్వితీయపులికేశి సోదరు

డగు కుబ్జవిష్ణువర్ధన మహారాజును, ఈతని కుమారులు పూర్వ (వేం అథవా ఆంధ్ర) చాళుక్య రాజ్యమును స్థాపించి పాలించుచుండెను. మ శాసనకర్తయగు విజయాదిత్యుని తండ్రియొక్కయు (వినయాదిత్యుని మనుమనియొక్క (కీర్తివర్మని)యు శాసనములు చిక్కియుండుటచేతను ఇతర శాసనావలోకనములచే విజయాదిత్యునికాలము క్రి. శ. ౬౯౬ నుండి 238 వరకని ఇతిహాసజ్ఞులు నిశ్చయించియున్నారు. విశేషసంగ తుల నెరుగగోరువారు "ఎపిగ్రాఫియా ఇండికా" ఐదవసంపుటమున దలి "Vakkaleruplats of Kirtivarma" యను లేఖను Indian antiquary" యొక్క ఆరవభాగమునందలి ముప్పదవలేఖను యవలో కించవలయును.

**ప్రతిగ్రహీత:**—శాసనము మొదటిపత్రములు పోయియుండు టచే ప్రతిగ్రహణముచేసినవారి నామ మెట్టిదియో నిశ్చయించుటకు నిర్భ్రాంతప్రమాణము లింకను చిక్కియుండుట లేదు. ఐనను బహు ప్రాచీనకాలమునుండి ఈ శాసనము అమ్మణిగి బృహన్మఠమునం దుండుటచేతను వారి ప్రాచీనాచార్యులు సుప్రసిద్ధులు, తపస్వి పండితు లును నై యుండుటచేతను, ఈ శాసనముతర్వాతిపత్రములలో ఆవ శ్యకముగ వీరశైవ స్వాముల కర్పించిన కాలమందలి దానవిశేషము లుల్లేఖింపబడి యుండవలయునని యూహింప నయ్యెడిని. ఎప్పుడైనను మిగిలిన పత్రములు చిక్కినయెడ వీరశైవేతిహాసమునకు మహోప కారమగుటలో సందేహముండదు. ఇంతకును ప్రాచీనములగు వీరశైవ సంబంధశాసనములు బెళ్గావి, కల్బురిగె, మొదలగు గ్రామములందు చిక్కియున్నవని 'రైస్' మొదలగువారి ఇంగ్లిషులేఖలచే తెలియవచ్చు చున్నది. అందున నీ శాసనము వీరశైవులకు దానమివ్వబడిన దనియే నిశ్చయము.

**శాసనకాలము:**—ఇందులో "చత్వారింశత్యుత్తర షట్శతేషు" శకరవర్షేష్వతీతేషు (అనగా శాలివాహన శకవత్సరములు ౬౪౦ గతించగా (క్రీ. శ. ౭౧౮) యను స్పష్టోల్లేఖనముండుటచే ఈ శాసనము పుట్టి నేటికి పండ్రెండునూర్ల యిరువది [౧ ౨-౨౦] వత్సరము లయ్యె

ననుట సిద్ధాంతమే! మరి దీనిలిపియూ, ఆకృతియూ ఏతత్ప్రాచీనతను చాటుచున్నది. కాలనిర్ణయ విషయమునం దిది ఇతర శాసనములకు, ఇతిహాసమునకును ఆదర్శప్రాయమను యభిమానము మన కుండ వలయును.

**సూచనా విశేషములు:**—ఇందలి యక్షరములు ప్రాచీనాంధ్ర కర్ణాటకలిపికి చేరినవి. శాసనపత్రిమందలి యొకవైపు యక్షరములు గుండ్రనివై మరియొకవైపునందలి యక్షరములు ఇందుకు కొంచెము భిన్నమై కన్పట్టుచుండుటచే దీనిని వ్రాసినవారిరువురై యుందురా? యనిపించును. అక్షరముల చెక్కనపల్లములందు ఏదోయొక కఠిన పదార్థము నిండియుండెను. మే మెంతప్రయత్నించినను యది నిశ్శేషముగా పోదయ్యెను. అందుచే నీయక్షరప్రతిబింబము అచ్చటచ్చట సరిగారా కుండుట తటస్థించినది. రెండవవైపు ఎచ్చుతగ్గులు విశేషముగా నుండుటచే దీనియచ్చు (బ్లాక్) స్పష్టముగా లేకున్నది. స్వరములందు ఇఏవర్ణములును, హల్లులందు కఖగఘఙ, చఛజఝఞ, టఠడఢణ, తథ దధన, పఫబభమ, యరలవ, శషసహ, క్షజ్ఞ వర్ణములును, అనుస్వార విసర్గలును వచ్చియున్నవి. స్వరమాత్రలందు 'ఊ, ఔ'ల విడిచి మిగి లినవన్నియు వచ్చియున్నవైనను ఈ కారము మాత్రము, ఇ కారము కంటెను భిన్నముగా కన్పట్టుటలేదు. హల్మాత్రలయందు "కగచఛ జటడ తదన భమ యరల వ శసహ"లు మాత్రము వచ్చినవి. అచ్చ టచట మహాప్రాణముల కల్పప్రాణములు ఉపయోగింపబడినవి. మొత్తముమీద లేఖనదోషము లల్పముగా నున్నవి; కొన్ని తప్పులను, విడిపోయిన యక్షరములను ( ) [ ] ఈ చిహ్నములందు చూపి యుంటిని. శాసనపత్రముచే నేను చదివిన ప్రకారముక్రింద మూల పాఠమును ప్రకటించియున్నాను. మూలశాసనము రెండు పడచ్చులు (బ్లాకులు)ను ఇందు ముద్రింపబడియున్నవి.

# అమ్మణిగి తామ్రశాసనము (మొదటివైపు)

పంక్తి.

౦ ధాన*ప్రివరతురఙ్గమేఖై కేనైవోత్సారితాశేషవిజిగీషోరవనిపతత్రితయాన్తరితా[ం] స్వగురో

౧ శ్రి(శ్రీ)యమాత్మసాత్క్రి(త్కృ)త్య ప్రిభావకులిశదలితపాణ్డ్యచోళకేరళకళభ్రిప్రిభృతిభూభృదదభ్రివిభ్రిమ

౨ స్యాననావనతకాఞ్చీపతిమకుటచుంబి(మ్బి)తపాదాంబు(మ్బు)జస్య విక్రిమాదిత్యసత్యాశ్రియశ్రీపృథు(థి)

౩ వీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరభట్టారకస్య ప్రియసూనో[ః] పితురాజ్ఞయా బాలేన్దుశేఖ(ఖ)

౪ రస్య తారకారాతిరివ దైత్యబలమతిసముద్ధతన్త్రైరాజ్యకాఞ్చీపతిబలమవష్టభ్య కరదీ

౫ క్రి(కృ)తకవేరపారసికసింహళాదిద్వీపాధిపస్య సకలోత్తరాపథనాథమథనోపార్జ్జి

౬ తోర్జ్జితపాళిధ్వజాదిసమస్తపారమైశ్వర్యచిహ్నస్య వినయాదిత్యసత్యాశ్రియశ్రీపృథి

౭ వీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరభట్టారకస్య ప్రియాత్మజశ్శైశవ ఏవాధి

౮ గతాశేషాస్త్రశాస్త్ర(స్త్రో) దక్షిణాశావిజయిని పితామహే సమున్మూలితనిఖలకణ్టకసంహతి రుత్త

*ఈ 'ధాన'శబ్దము వెనుక 'చిత్రికంఠాభి'యను శబ్దముండవలయునని ఇతరశాసనావలోకనముచే తెలియుచున్నది

## రెండవ వైపు

రాతిగజఘటాపాటనవిశి
౧ ఋత్తరాపథవిజిగీషోర్గురోరగ్రిత ఏవాహవవ్యాపారమాచరన్న
౨ య్యర్ణమాన(ణ)క్రి(కృ)పాణధార స్సమగ్రివిగ్రిహాగ్రేసరససాహసరసికః పరాము(జ్మ)ఖీక్రి(కృ)తశ
౩ తుర్మిణ్డల(లో) గంగాయమునాపాళిధ్వజపట[హా]ఢక్కామహాశబ్దచిన్హకమాణిక్యమతంగ(జ్గ)జాదీన్పిత్రృ(సా)
౪ త్కుర్వ్వప(న్ప)రైః పలాయమానైరాసాద్య కథమపి విధివశాదపనీతోప్రి ప్రితాపాదేవవిషయపిక్రోప *
౫ మరాజకముత్సారయన్వత్సరాజ ఇవానప(పే)క్షితపరసహాయకత(_స్త)దవగ్రహాని(న్ని)గ్గ్రత్య స్వభుజావష్టంభ
౬ ప్రిసాధితాశేషవిశ్వమ్భర[ః]ప్రభు రక(ఖ)ణ్డితశ_క్తిత్రయత్వ (త్వా)ఛ(చ్ఛ)త్రృమదభఞ్జనత్వాదుదారత్వాన్నిర
౭ వద్యత్వాద్వ్యస్సమ_స్తభువనాశ్రియ స్సకలపారమైశ్వర్యవ్య క్తిహేతుపాళిధ్వజాత్యుజ్వ(జ్జ్వలపా)జ్య
౮ రాజ్యవిజయాదిత్యసత్యాశ్రియశ్రీపృథివీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరభట్టారక స్సర్వ్వా
౯ నేవమాజ్ఞాపయతి విదితమస్తు వో (౭)స్మాభిచ[శ్చ]త్వారి[ం]శత్యుత్తరషట్ఛతేషు శకవర్షేష్వతీతేషు

* ఇచ్చటి యొక్క వాక్యార్థము సమంజసముగ తెలియదయ్యెను.

తాత్పర్యము:—చిత్రకంఠాభిధానముగల యొక తురంగముచేతనే యనేక వీరుల దూరీకరించి రాజ్యత్రియముచే సంపాదింపబడిన తనతండ్రి లక్ష్మిని యాత్మవశముగా వించుకొని, తన పరాక్రమమను పజ్రాయుధముచే పాండ్య,చోళ,కేరళ,కళభ్రాదిరాజుల భుజబలపర్వతముల భేదించినవాడును, ఎవరికిని లోనుగాకుండిన కాంచీరాజుచే పూజింపబడినవాడును నగు విక్రమాదిత్యసత్యాశ్రయ భట్టారకుని ప్రియపుత్రుడైన, తండ్రి యనుమతి మేరకు (శివునాజ్ఞచే కుమారస్వామి రాక్షస సైన్యమును బోలె) అత్యద్భుతమగు త్రిదేశ కాంచీరాజు సైన్యమును బంధించి కవేరపారసిక సింహళాది ద్వీపాధిపులచే కానుకల నందినవాడును. సమస్తోత్తరాఖండనాథులను మథించి పాళిధ్వజాది నిఖిల పారమైశ్వర్య చిహ్నముల సంపాందించినవాడుననగు వినయాదిత్య సత్యాశ్రియ పృథ్వీవల్లభ భట్టారకుని ప్రియపుత్రుడు సమగ్రాస్త్ర శాస్త్రము నధ్యయన మొనర్చి పితామహుడు దక్షిణ దిగ్విజయమునకు పోయినప్పుడు వివిధవిఘ్నములను విధ్వంస మొనర్చి ఉత్తరదేశ విజయాభిలాషచే ప్రయాణించిన తండ్రిగారి ఎదుటనే యుద్ధకార్యమును నెరవేర్చువాడయ్యు వైరిజనగజకుంభోద్భేదనముచే స్వఖడ్గధారలు చీలుచుండ యుద్ధాంత్యము వరకును సర్వాగ్రేసరుడై యుండుటవల్లనే సధైర్యరసికుడును, శత్రుసంఘమునే వెన్నంటినవాడు, గంగా యమునా పాళిధ్వజపదఢక్కా మహాశబ్దాంకితములైన మాణిక్య గజాదులను తండ్రిగారి కొప్పించినవాడును, శత్రువులు వెనుదిరిగి పరువిడునపుడు దుర్విధిచే బలత్కారమున పట్టుకొని తీసుకొని పోబడినవాడయ్యు స్వపరాక్రమముచేతనే "దేశమునందు త్పన్నమయిన ఆరాజక క్రోధమును పోగొట్టువాడై * వత్సరాజువలె ఇతరుల సహాయము నపేక్షించక శత్రుబంధనము నుండి విడువడి స్వభుజబలముచే నీ విశ్వమును వశపరచుకొన్నవాడును, ప్రభుమంత్రోత్సాహములను శక్తిత్రియ సంపన్నతచేతను, శత్రుగర్వ పరిహారణముచేతను, ఉదారతచేతను, నిర్మలత్వముచేతను సమస్తజగదాధారుడై యున్నవాడును నిఖిలపరమేశ్వరత్వకారణమగు పాళిధ్వజముచే

* ఈ వాక్యము మూలమందుననే సందిగ్ధమై యున్నది— (లే)

...త్యుజ్జ్వల సామ్రాజ్య విరాజమానుడును, ఇన విజయాదిత్యసత్యాశ్రియ మహారాజు ఎల్లరనుద్దేశించి యాజ్ఞాపించునదేమన? "ప్రజలారా! మీకిది తెలిసియుండుగాక మన మీ శకవర్షంబులు ఆరునూర్ల నలుబది (౬౪౦) గడచుచుండగా — అని ఇంతవరకు మాత్రమే పాఠముకలదు.

**అనుబంధము:** — శాసనభాగము అల్పముగా చిక్కియున్నను విజయాదిత్యుని పరాక్రమము నెరుంగ పర్యాప్తమైయున్నది. పశ్చిమ చాళుక్యులు కాంచీరాజు (పల్లవు) లచే కదనమునందు విజయమునంది కావేరీతీరమునందు మరియొక రాజధానిని నెలకొల్పిరని ఇతర శాసనము లచే తెనియవచ్చెడిని. పరాక్రమాభిమానమో, అధిక రాజ్యాశయో వారిని యుత్తరదేశ దండయాత్రకు పేరేపించినది. చాలమట్టుకు విజయమునందియుండినను శత్రువులు పరువిడునపుడు కోలాహలము నందు యువరాజైయుండిన విజయాదిత్యుని పట్టుకొని వెళ్లిరనియు, విజయాదిత్యు డొక్కడే స్వభుజపరాక్రమముచే శత్రువుల గొట్టి తిరిగి వచ్చి రాజ్యసింహాసనము నారోహించెననియు ఈ శాసనముచే తెలియ వచ్చెడి యద్భుతసంగతి చాళుక్యుల గత వైభవమున కొక ప్రమాణ మనున ట్లున్నది.

అప్పటి కాలపు రాజులందు గంగా యమునా పాళిధ్వజాది బిరుదులు అతిప్రసిద్ధములై యున్నట్లు కన్పట్టుచున్నవి. అందుననే మన విజయాదిత్యుడును ఉత్తరదేశపురాజులను కొల్లగొట్టి ఆ చిహ్నములను లాగుకొని తండ్రిగారి కొప్పించియున్నాడు. 'గంగా యమునా' యను నవి కలశాకృతిచే నదీద్యోతక చిహ్నములై యుండవచ్చును. పాళిధ్వజ మనునది జైనులసిద్ధాంతమువలె పరమేశ్వర (సార్వభౌమ)త్వ చిహ్నమై యున్నది. * శ్రీజినసేనాచార్యవిరచితమైన ఆదిపురాణము ౨౨ వ సర్గయందు ఇట్లు వివరింపబడినది.

> స్రగ్వస్త్రసహసానాబ్జహంసవీనమృగేశినాం ।
> వృషభేభేంద్రచక్రాణాం ధ్వజాః స్యుర్దశభేదకాః॥ ౧॥

---

* ఇది శ్రీ జయంతి రామయ్యపంతులవారిచే తెలిసినది.

అష్టోత్తరశతం జ్ఞేయాః ప్రత్యేకం పాలికేతనాః ।
ఏకైకస్యాం దిశి ప్రోచ్చాస్తరంగాస్తోయధేరివ॥ ౨॥

పవనాందోలితాస్తేషాం కేతూనామంశుకోత్కరః ।
వ్యాజుహూషురివాభాసి జినేజ్యాయై నరామరాన్॥ ౩॥

* * * * *

ఇత్యమీ కేతవో మోహనిర్జయోపార్జితా బభుః ।
విభోస్త్రిభువనేశత్వం శంసన్తోఽనన్యగోచరమ్॥ ౪॥
దిశ్యేకస్యాంధ్వజాః సర్వే సహస్రం స్యాదశీతి యత్ ।
చతసృష్వథ తే దిక్షు శూన్యద్వితిరికసాగరాః॥ ౫॥

"పుష్పమాల, వస్త్రము, మయూరము, కమలము, హంస, గరుత్మంతము, సింహము, వృషభము, గజము, చక్రము," ఈ చిహ్నములుగల ధ్వజములు పదివిధములై యున్నవి. ఒక్కొక్క విధమునకు నూటఎనిమిదిగా నిలిపిన వెయ్యెన్నెనుబదిధ్వజములగును. ఈ గుంపును పాళిధ్వజమందురు. నాల్గుదిక్కులం దిదేవిధమున నిల్పిన ధ్వజముల సంఖ్య నాల్గువేల మున్నూటగువదియగును. దీనికిని పాళిధ్వజమనియే పేరు. జినభగవంతుడు మొదలు మోహత్యాగ మొనర్చి త్రిభువనపతిత్వమును సంపాదించినపుడు పాళిధ్వజమున్ను ప్రభుత్వచిహ్నముగా గ్రహించియుండెననుటచే నాటినుండి రాజులెల్లరును దీనికి సామ్రాజ్య బిరుదులందు శ్రేష్ఠత నొసంగి యుండవచ్చును.*

---

*ఆంధ్రుల గృహములలోను వీరశైవుల యొద్దను ఇంకను ననేకముగ తాటాకు పుస్తకములు, రాగిరేకులు మున్నగు ఇతిహాస సామగ్రి మూలబడియున్నది. వారు దాచియుంచిన లాభములేదు. పంపించినచో పరిశోధించి ప్రకటించగలము. చిత్తగింతురు గాక! సంపాదకుడు.

# భారత దేశ భాషా సమస్య

సురవరము ప్రతాపరెడ్డి బి. ఎ. బి. ఎల్ గారు



శ్రీ కురుగంటి సీతారామయ్యగారు 'విభూతి' ప్రథమ సంచికలో వ్రాసిన భారత దేశభాషాసమస్యా విషయమున నాకు భిన్నాభిప్రాయముకలదు. సంపాదకులవారు హంసపాదు పెట్టి సూచించిన విషయము నను నాకు అభిప్రాయభేదమే. ఇప్పుడు చర్చనీయములు రెండు.

(౧) భాషాసమస్య.

(౨) లిపిసమస్య.

భారత దేశమున కొకేవ్యావహారిక భాష యుండవలెనా? ఉండవలసినచో అది ఇంగ్లీషా, సంస్కృతమా, హిందీయా, ఉర్దూనా, లేక హిందూస్థానీయా అను ప్రశ్న మొదటిది. భారత దేశములో వందలకొలది చిల్లరభాషలుండినను ప్రధానభాషలు సుమారు ౧౫ వరకున్నవి. ఈభాషలు మాట్లాడు జాతు లన్నిటికిని ప్రత్యేక సంస్కృతి, చరిత్ర, వాఙ్మయమునుకలదు. పైగా నానామతములుకూడ ఏర్పడి సమస్యను ఇంకను గందరగోళముగా చేసివైచినవి. ఇంచుమించు యూరోపు ఖండమంతటి దీభారత దేశము. యూరపుఖండములో సమానభాషా సమస్య పరిష్కృతమగుట యెంతకష్టమో భారత దేశములో అంతకన్న మించినకష్టము కలదు. ఏలన యూరపుఖండములో ప్రధానమైన ఒకే క్రైస్తవమతము, ఒకేలిపి, యుండుటచేతను ప్రతి దేశమందును నిరక్షరత, అవిద్య ఇంచుమించు నిర్మూలమైపోయినందునను, ఆ ఖండమందు మనకన్న ఎక్కువ సౌకర్యములు కలవు.

భారత దేశమును భాషాసమస్యకొరకై రెండు ముఖ్యభాగములుగా మనము విభజింపవచ్చును. ఉత్తర హిందూస్థానమునను, దక్షిణ హిందూస్థానమునను, ఈ రెండుభాగములందును భిన్నభిన్న భాషా పద్ధతులు కలవు. ఉత్తర హిందూస్థానమందు సంస్కృత ప్రాకృత జన్యము

లైన భాషలు వ్యవహారమందున్నవి. దక్షిణదేశమందు ద్రావిడభాష జన్యమైన భాషలు కలవు. తెనుగుభాషకు ప్రాకృతముకన్న ద్రావిడ భాషా కుటుంబముతోనే ఎక్కువ సంబంధ మని నాఅభిప్రాయము ఈ విషయమున పండితులు భిన్నాభిప్రాయులని నాకు తెలియును.

భారతదేశమునకు సంస్కృతము సామాన్యభాష కాజాలదు. అది యే3000 ఏండ్ల క్రిందటిమాటయో అయియున్నది. సంస్కృతము చాల క్లిష్టభాష. ఇప్పటిపండితులలో అనేకులు దానిని ధారాళముగా మాట్లాడజాలరు. దానిని సులభమగునట్లుగా సంస్కరించు అధికార మెవ్వరికినిలేదు. అట్లుచేయుట కొప్పుకొనువా రున్నారోలేదో? ఇక ఇంగ్లీషువిషయము: దేశభాషలకు మాతృస్థానమువహించిన సంస్కృత మునకే ఈయవస్థ యుండినప్పుడు మనకు సంబంధములేని ఇంగ్లీషుభాష భారతదేశ సామాన్యభాష యెన్నటికిని కాజాలదు. సామ్రాజ్యశక్తి యుండియు, ప్రపంచమంతయు వ్యాపించుకొనిపోయినదై యుండియు ౧౫౦ సంవత్సరములనుండి భారతీయులు దానిని అనేకోద్దేశములతో— ప్రధానముగా జీవనోపాధికై —సాధించుచుండియు, అది నూటికొక్కరి కైనను రాకపోవుటలో విశేషమున్నది. ఒకవిధముగా చూచిన ఇంగ్లీషుభాష సంస్కృతముకన్న కఠినమైనభాష. నాలుగైదువిధముల లిపులుకలిగి ఉచ్చారణాలోపము కలిగి యుండుటచే మన కది సులభ సాధ్యముకాదు. ఇంగ్లీషులో వ్రాయుటొకటి, ఉచ్చరించుటొకటి. బి. ఏ. వరకు చదివిన భారతీయులలో సహితము నూటికి ౯౦ పాళ్ళమంది సలక్షణమైనట్టి ఇంగ్లీషురచనలు వ్రాయజాలకున్నారు. ఇంగ్లీషువారు తమ మాతృభాషను మాట్లాడునప్పుడు విశేషముగా గ్రామ్యమును వాడుటయు, ఒక్కరొక్క రొక్కొక్క విధముగా నుచ్చరించుటయు, చూచుచునే యున్నాము. నేను కొన్ని ఇంగ్లీషుటాకీలను చూచినాను. అందలి పాత్రధారు లేమిమాట్లాడుదురో ఉచ్చారణ వైచిత్ర్యమువలన నా కొక్కపదమైనను అర్థమైనదికాదు. ఇంగ్లీషురానట్టి నామిత్రులు అందలి సంభాషణల కర్థము చెప్పుమందురు. నాకు తెలియదందునను. వారాశ్చర్యపడుదురు. నాకు సిగ్గేమియుకలుగదు. అది నామాతృభాష

కాదు. కొందరి ఇంగ్లీషువ్యక్తులతో నేను కొన్నిమారులు సంభాషించి నప్పుడు నాకు కొన్ని నిముషాలు వారి యుచ్చారణ ఏమియు నేటికిని బోధపడకుండెడిది.

ఇక హిందీ, ఉర్దు లేక హిందూస్థానీల విషయము చర్చింతును. ఇవన్నియు ఒకటిగానే కనుపించుచున్నవి. మాతృస్థానమన్నింటికిని ఒకటే; కాని హిందీకి పోషకము సంస్కృతమును, ఉర్దుకు అరబీ ఫార్సీభాషలునై యున్నవి. ఒకదానిలిపి దేవనాగరీలిపి; ఇంకొకదానిది అరబీలిపి. ఇందు చేత దినదినమూ రెండును దూరదూరముగా పోవుచున్నవి. హైదాబ్రాదు ఉర్దుభాష తెనుగు మరాఠీవారికి నేర్చుకొనుట చాలకష్టమై పోయినది. హిందూస్థానమందలి హిందువుల హిందీ ముసల్మానులకు సరిపడనే సరిపడదు. వీరిరువురును సమాధానపడినను "హిందూస్థానీ" భాష ఉత్తర హిందూస్థానములో ఒకవిధముగా సామాన్యభాష కా వచ్చును. దక్షిణములో దానికి స్థానములేదు. ఇంగ్లీషు ఎంత విదేశీయ మో, హిందూస్థానీకూడ దాక్షిణాత్యులకంత విదేశీయమే, అయినను రాజకీయ భాషాస్థానము హిందూస్థానీకి వచ్చిననాడే దాక్షిణాత్యులలో నిది ఇంగ్లీషుస్థానము నాక్రమించుకొనగలదు.

రెండవ యంశమగు లిపిసమస్యనుగురించి యాలోచించి చూచిన ఇది భాషాసమస్యకన్న కఠినసమస్యయైపోయినది. ఏది యెట్లున్నను ఇంగ్లీషులిపి అనగా రోమన్‌లిపి భారతదేశమునకు పనికిరాదు. ఎందుకన ఆలిపిలో మన భాషాధ్వనులు సగమువరకైనను వ్యక్తము కానేరవు. రోమనులలిపి సంపూర్ణముగా లోపభూయిష్ఠము. ఉర్దూలిపియు నట్టిదే. ఒకేధ్వనికి రెండుమూడక్షరములుండుట, ఒకే అక్షరము రెండుమూడు ధ్వనుల కుపయోగింపబడుట, వ్రాయుట ఒకతీరు, ఉచ్చరించుట ఒకతీరు, అక్షరముల క్రమము నియమరహితమై అర్థరహితమై యుండుట, ఇవన్నియు, మనల విముఖులనుగా చేయుటకు చాలియున్నవి. ఒక పాశ్చాత్యపండితుడు పాణినీయ వ్యాకరణమును జూచి యిట్లభిప్రాయమిచ్చెను. "పాణిని తర్వాత ౨౫ శతాబ్దములు గతించినను మేము మా అక్షరములనైనను సంస్కరించుకొనజాలనివారమై యున్నాము"

అయితే రోమనులిపిని మనము మన అవసరములకొలది సంస్కరించుకొనరాదా? అని ప్రశ్నించవచ్చును. ఇంగ్లీషుప్రభృతిజాతులేల సంస్కరించకపోయిరి? సంస్కారమే ముఖ్యమగుచో మన లిపులనే యేల సంస్కరించుకొనగూడదు? కావున రోమనులిపి మనకు పనికిరాదు.

మరి మన దేవనాగరలిపి పనికివచ్చునా అనిన అది అంతకును పనికిరాదు. ఇది సంస్కృతాభిమానులకు సరిపడని ముచ్చట. అయిన నేమాయె. చర్చచేయవలసినప్పుడు నిష్పాక్షికముగా నాలోచించుటలో తప్పేమియు లేదు. ఈ కాలములో — అనగా అచ్చు, టెలిగ్రాము, టైపు, షార్టుహ్యాండ్ మున్నగునవి ఏర్పడినకాలములో—ఏ లిపిలో వడి, పరస్పరాక్షర సమ్మేళనము, సౌకర్యము, వర్ణముల కనిష్ఠపరిమితి ఎక్కువగానుండునో అదియే గ్రాహ్యముగా నుండగలదు. సంస్కృతలిపిలో అక్షరములు ఎక్కువగా నున్నవి. అందు తగ్గింపుకు చాల వీలుకలదు. మహాప్రాణులైన "ఒత్తక్షరముల"కు ప్రత్యేకరూప మవసరములేదు. అచ్చులలోను అకారముతప్ప తక్కినవానికి రూపము లవసరములేదు. గుడి కొమ్ము ఇట్టి సంకేతములో హల్లులకెట్లో అచ్చులకును పనికివచ్చునట్లు చేయవచ్చును. మరియు దేవనాగరలిపి నెత్తిన గీటుండుటచేత ప్రత్యక్షరమును విడివిడిగా వ్రాయవలసియే యుండును. అది కాలహరణహేతువు. అందుచేతనే మరాటీవారు సౌకర్యార్థమై "మోడీ" వ్రాతను కనిపెట్టి ఉపయోగించుచున్నారు. నాగరలిపిలో ఎంత క్లిష్టతకలదో వాటిని వ్రాయునప్పుడు గమనించిన కనబడును. ఉదాహరణార్థము ఔ (औ) అను నక్షరమును చూడుడు. దానిని వ్రాయువరకు ఏడు మారులు కలమును ఆపి వ్రాయవలసివచ్చును. ఇట్లు వ్రాయుట సౌకర్య హేతువుకాదు. కావున అదియు అగ్రాహ్యమే.

ఇక ఉర్దూలిపి; అది పూర్తిగా పనికిరాదు. ఇంగ్లీషులిపిలో ఎన్ని లోపములున్నవో అన్నిలోపములు దీనిలోనుకలవు. ఒక తెనుగుపద్యమునుగాని సంస్కృత శ్లోకమునుగాని ఉభయభాషలు తెలిసినవారు ఉర్దూ లిపిలోవ్రాసి, కేవలము ఉర్దూ తెలిసినవారిచేతనే దానిని చదివించిన ఎంతటి వినోదముకలుగునో అది అనుభవైక వేద్యముగా నుండును.

అయితే ఏలిపియు పనికిరాకపోయెను. ఇక భారతదేశభాషలకు ఏకలిపి అవసరములేదా అనిన అవసరములేదను అపప్రచారమున కెవ్వరును బాధ్యులుగా నుండనొల్లరు. ఏకలిపి యుండుట తీవ్రమైన అవసరమే. కాని యేదియుండవలెను. ఇందులకు నా సూచనఏమన:—

ఉత్తర హిందూస్థానభాష యొకటి దక్షిణమునకు దిగివచ్చి దాక్షిణాత్యుల నెత్తిపై కూర్చొనగోరిన దాక్షిణాత్యులకును కొంత సౌకర్యముండవలెను. "గెలిస్తే తలనాది ఓడితే తోకనీదే" అనిన ఏమార్పు డొప్పుకొనును. వ్యవహారముచేసినను, సంబంధ బాంధవ్యము చేసినను, ఇచ్చి పుచ్చుకొనుట యుండును. "అంతయు నేనే పుచ్చుకుంటాను అంతయునీవే యియ్యవలసినది" అనిన బేరము కుదురనే కుదురదు. అదేవిధముగా భాషలలోను "అంతయు నా భాషనే స్వీకరింపుము. నేను చెప్పినట్లే వినుము. నా లిపియే సర్వశ్రేష్ఠము. నా లిపినే నేర్చుకొని తీరవలెను. నీభాష నాకువలదు. నీలిపి నాకుసరిపోదు. నీముచ్చటలే నాకునచ్చవు" అను సర్వం కల్ల సాగరం కల్ల—గాండ్లతో ఎవరు మాట్లాడ గోరుదురు? ఒక నగరములో ఒక హిందువు క్రైస్తవ మిషను ఆసుపత్రిలో మందుకుగాను పోగా ఫాదరీగారు తనమతాధిక్యమును గురించి ఒకగంటసేపు బోధించినాడట. పర్యవసానము. అంతసేపు నెమ్మదిగావిన్న హిందువు మందు చేతపుచ్చుకొని వెళ్లుతూ ఇట్లన్నాడట! "ఇదిగో, నీదినీకే బాగుంది, నాదినాకే బాగుంది."

అట్లేయున్నది ఈ భాషాలిపిసమస్య. "హిందూస్థానీ" వాదులందరును దాక్షిత్యులతో మాభాషను నేర్చుకొనుడు, మాలిపిని నేర్చుకొనుడు మీభాషలో మంచిదేమైన యుండిన మాభాషలోనికి మార్చుతాములే అను ధోరణిలో మాట్లాడుదురు. అది వారికి సహజమే. తన సంస్కృతిని ఇతరులపై మోపుటకు ప్రతివాడును ఇష్టపడును. కాని మోసుకొనువాడే తొందరగా దొరకడు. కావున నిజముగా తొందరగా భాషాసమస్య పరిష్కారము కావలెననిన మొదట లిపిసమస్యా పరిష్కారముకావలెను. ఆలిపిపరిష్కారము కావలెననిన దాక్షిణాత్య లిపులలో నొకదానిని సంస్కరించి పరిష్కరించి యావద్భారతమునకు సమర్పించవలెను. తెనుగు,

కన్నడ భాషలకు సమానమైన లిపికలదు. ఈ లిపిని సంస్కరించి యావద్భారత దేశ లిపిగా చేయుట భావ్యముగా నుండును. అయితే యీ మాట మా మాతృభాషా లిపియొక్క అభిమానముచే చెప్పుటకాదు. నిష్పక్షపాత బుద్ధితోను, విషయసమన్వయ కాంక్షతోను, శాస్త్రీయ చర్చాలోచనతోను వ్రాసినయంశము. దాక్షిణాత్యుల యితరభాషలైన తమిళ, మళయాళీ భాషాలిపులలో, అనేకాక్షరములు లేనందునను అరవవారు సహితము "గ్రంథాక్షరి" పేరుతో నీలోపమును తొలగించుకొన యత్నించియు విశేషముగా నేటికిని తెనుగులిపిలో ముద్రింపబడిన సంస్కృత గ్రంథములను చదువు నలవాటు కలవారై యున్నందునను నీ విధముగా నభిప్రాయ మియ్యవలసివచ్చినది. ఒకవేళ గ్రంథాక్షరినే పండితులు సంస్కరించి, సవరించి, సమర్పించు పక్షమున నా కేమియు నభ్యంతరము లేదు. ఇది ఉత్తర దక్షిణ భారతీయులకు నదీసంగమము వంటి "సంగమేశ్వరము"గా నుండగలదు. ఈ విధముగా భాషాలిపుల సమస్య పరిష్కృతముకావచ్చును. అయితే యీ తర్కము నెవరు విందురు. ముసల్మానులకు అరబ్బీలిపిపై యెంత పట్టింపో, ఉత్తర హిందూస్థాన హిందువులకును దేవనాగరలిపిపై యంత పట్టింపు. వీరిద్దరును తమభల్లూకపుబట్టును వదలనంతవరకు దాక్షిణాత్యులకుమాత్రము సముద్రమంతటి విశాలహృదయముతో నేమి యవసరము?

---

## మేఘదూతకథకు మూలమెచట?

'విభూతి' ప్రథమసంచికలోని 'మేఘదూతకథకు మూలము' అను వ్యాసములో కాళిదాసు డీకథను బ్రహ్మవైవర్తపురాణమునుండి గ్రహించినాడని వ్రాసితిని. పదివత్సరములకు పూర్వము వ్రాయబడియున్న ప్రాత వ్యాసపు కాగితముల ననుసరించి తొందరలో వ్రాసితి కావున నొక గొప్ప పొరపాటు కలిగినది. దాని నీ క్రింద వివరించుచున్నాను. కావున గ్రహించి మన్నింతురు గాక!

'మేఘదూత'కు సంబంధించిన హేమమాలి విశాలాక్షుల కథ పద్మపురాణ ఉత్తరభాగమునందలి ౫౨ వ అధ్యాయమున గలదు. ఈ పురాణము బొంబాయి ఖేమరాజ శ్రీకృష్ణదాసు కంపెనీవారిచే శ్రీ వేంకటేశ్వర ముద్రాలయమునందు ముద్రింపబడినది. (విద్యానిధి.)

# చింత చెట్టు

విద్వాన్, కవిరత్న, అష్టావధాని:

**మేదిపల్లి లక్ష్మీకాంతంగారు**

చిగిరించిన యంత మొదలంటఁ జిగురుకోసి,
పూచినంతట దోసిళ్ళఁ బూఁతదూసి
కాయమొద లిడ నామనకాయ లంచుఁ
ద్రెంచిన ఫలింతు వెంతటి తెగువ గలదో! ౧

కొట్టకొనకొమ్మ పట్టిన యట్టివాని
నైనఁ జారవిడువవు, నీ కాశ్రితులన
నెంత వాత్సల్యమో వచియింప నగునె!
నీకు సాటియె? యే ధరణీశుఁ డైన. ౨

ఆకు బెరడును గొమ్మలు నాదిగాఁగ
సర్వము హరించినను, నీవు సమసికూడ
నుపకరింతువు బొగ్గుగా, నపకృతుల కు
పకృతి సల్పుచు, జగతి, సద్వర్తనమున. ౩

"చింతయుడిగిన, పులుపు రవ్వంతయైనఁ
దగ్గ" దను గీర్తిగడియించి నెగ్గినావు
చిట్టచివఱకు నుసియైనఁ జింతబొగ్గ
శ్రేష్ఠతమ మను సత్కీర్తిఁ జెందినావు. ౪

ఏను ధనవంతులైన యాఁచింపఁ బోను,
గొప్ప యుద్యోగులైనను గొలువఁబోను

భూపతులనైన నుతియింపఁ బోను; కాని,
నిలువ నీడ యిచ్చిన నిన్ను నే స్మరింతు.

"కాలవశమునఁ గూలినఁ గాకమాది
పక్షిజాతుల కెవరిత్తు రక్షయంబు"
ననెడి చింతను సతతంబుఁ గనెదుఁ గతన
సార! యన్వర్థనామకుం డగుదు వీవు. ౬

చెక్కి, చీలికలుగ నిన్ను జీల్చి, తలుపు
గానొనర్చి, ద్వారముకడఁ గట్టివైవ,
జీర్ణమౌదాఁక యజమాని సేవసేతు
వెంత నమ్మిన బంటువోయీ! మహీజా!! ౭

గాలివానయు నెండ యేకముగ నిన్ను
గదసి, పిడుగు పిరంగులఁ గాల్చుచున్నఁ
బాదము గదల్పవు స్వదేశభక్తి తప్ప
రతఁ బుడమిఁబడియు విగతప్రాణమవఁబు. ౮

---

— విభూతి ప్రశంస —

ఆంధ్రవారపత్రిక (22-2-39) లో

గత మహాశివరాత్రినాడు నూతనముగా ఉదయము గాంచిన మాసపత్రిక.
సంపాదకులు పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు.
డెమ్మీసైజులో దాదాపు 70 పేజీలతో సచిత్రముగా వెలువడుచున్నది.
ఏడాది చందా రెండున్నర రూపాయలు. విడిసంచిక నాలుగు అణాలు
శైవసమయములు, శైవవాఙ్మయమును ఈ పత్రికకు ప్రధానలక్ష్యములు.
అ విజ్ఞానమే దీని యాదర్శము.
ఇతర విషయములకుగూడ తమ పత్రికయందు సమానస్థాన మిచ్చుచు
వీరభద్రశర్మగారు తమ సమదర్శిత్వమును ప్రకటించుచున్నారు.
వీరి ప్రయత్నము మిక్కిలి యాశాస్యమైయున్నది,
'చిర మభివర్ధతాం విభూతి రియం'

# వెర్రి శిష్యుడేనా!

## జి. వీరనాగేంద్రులు

వరంగలుజిల్లా శివపుర గ్రామంలో ఒక గొల్లవాడుండెను. పేరు వెర్రివాడు. నిజంగా పిచ్చివాడే! గొర్రెల మేకల కాయటమంటే వాడికి చాలా ఇష్టం. నిజాంరాష్ట్రంలో బహమనీరాజ్యం ఆరంభమైన సమయంలో జరిగింది కథ.

*　　　　*　　　　*

ఏటిమెడ్డున వెర్రివాడు మేకల మేపుతున్నాడు. ఆమేకలు గొర్రెలూ అన్నీ ఊరిదొరవారివి. అంబడీ కంబలీ ఇచ్చి నెలకు రెండు రూపాయిల జీతంమీద కొలువున్నాడు. అంటే ఆకాలంలో ఈజీతం సామాన్యంకాదు. వాడికి చదవడం రాయడం ఏమీరాదుకాని, చాలా గమ్మత్తుగా వుండేవాడు, అన్నీ చిలిపి చేష్టలే; వాణ్ణిలోకం వెర్రివాడనే అనుకుంది. ఇంకొక విశేషం ఏమిటంటే తనకు నచ్చి తెలిసింది ఏపనైనా సరే ఆసత్యంతోపాటు వాడు సారూప్యం పొందవలసిందే! దాన్ని వదిలే వాడుకాడు. చివరదాకా చీమవలె కరుచుకొనిపోయే స్వభావంవాడిది. అయితే సత్యాసత్యనిర్ణయం వాడికి చేతగాదు. కారణం సత్సంగం లేకపోడవడమే! సత్సంగం లేకపోతే మూర్ఖత చేరుకుంటుందంటారు. వారు ఇమ్మడి "శిరోమణు"లైనా సరే! లేక డబల్ "ఎం.ఏ".లైనాసరె! అంటే సత్యం అసత్యం, పాలూ నీళ్ళవలె లోకంలో కలిసిపోయాయి. దాన్ని తెలుసుకోవడానికి సత్సహవాసమనే రాజహంస కావాలి.

*　　　　*　　　　*

కొంత సేపటికి మామిడిచెట్టునీడన కూచోని వెర్రాడు కూనరాగాలు తీస్తున్నాడు. అదేసమయంలో చంకలో జోలె ఘంటా, మెడలో రుద్రాక్షలూ, కాషాయవస్త్రాలూ గడ్డమూ, వున్న మాహేశ్వరుడు జంగముదేవర, ఒకాయన చేరాడు. ఆనీడలోనే తనజోలె మొదలైనవీ పెట్టుకొని ఆనదిలో స్నానంచేసి మడికట్టుకుని చకిలముకిలంవేసి ముక్కుపట్టుకొని ధ్యానించి ఎడంచేతిలో మేకపెంటికవంటి దేమిటో పట్టు

కొని మెమేమోచేసినతర్వాత జోలెలోంచి సత్తుపిండీ ఉండఘలూతిని ! దాగి వెళ్ళడానికి సిద్ధమయాడు. అలాంటప్పుడు వారిద్దరికీ జరిగిన సం షణ—

వెర్రివాడు—అయ్యగారూ! దండమండీ!

జంగము—చల్లగా బ్రతుకు బిడ్డా!

వె—మీరెక్కడుంటారండీ?

జం—కొలనుపాక.

వె—ఎక్కడికి పోతున్నారు?

జం—పాల్కురికి శిష్యులింటికి.

వె—మీకు కోపము రాదంటే ఒకటి అడుగుతాను.

జం—కోపంతో ఏంపని! అడుగూ!

వె—అప్పుడు మీరు ముక్కుపట్టుకొని ఏంచేసారు?

జం—దేవుణ్ణి దర్శించి ధ్యానంచేసాను ఇంక శివపూ...

వె—మంచిది చాల్లెండి.

తర్వాత దేవరగారు తోవ బట్టారు.

* * *

వెర్రివాడినద్ద రెండవధోవతి లేనేలేదు. వాడు దిగంబరంగా ఏటిలో దుమికి స్నానంచేసి పైకిరాగానే ఆసనం బంధించాడు. కళ్లు మూసుకున్నాడు. ముక్కునూ పట్టుకున్నాడు కాని ఏమీకనబడకపోవడం వల్ల వాడు "అయ్యగారికి దేవుడు కనపడితే నాకు మాత్రం ఎందుకు కనపడడు?" అనుకొని ముక్కును ఇంకా గట్టిగా పట్టుకున్నాడు, గాలిని ఏమాత్రం బైటికి పోనివ్వలేదు. పాపం ఎంతసేపు అట్లా వుండగలడు! ఊపిరి సెలిపిపోతూవుంది. గొప్ప బాధ యేర్పడింది. అయినప్పటికీ "ప్రాణం వున్నాసరే పోయినాసరే దేవుడిదర్శనం అయ్యేదాక ముక్కు వదలను" అని వెర్రివాడు గట్టి పట్టు పట్టాడు, చాల యాతన జరుగు తూవుంది "ప్రాణాలు తీపే! నిజంగా దేవుడికంటే తీపికావు కదా?" అనుకొని ఇంకా బిగదీశాడు.

అసలు విచారిస్తే! ప్రాణాలసూత్రం దేవుడి సింహాసనానికి కట్టబడి వుంటుంది. కారణమేమిటంటే ప్రాణాలుకూడా సర్పాలలాగూ ...యపెడుతూనే వుంటాయి. ఆ సర్పాలను వాటివిషాన్ని శివుడు ధరించి ...ంచగలిగినాడు. కనుకనే వెర్రిగొల్లవాడి ప్రాణసూత్రం తేలిగ్గా ...వదేవుడి సింహాసనం దగ్గర అలారం (గంట) కొట్టింది. దేవుడు విచా ...ంచేసుకున్నాడు. వెర్రివాడిప్రాణం ముక్కుదగ్గరికి వచ్చిందని తెలుసు ...న్నాడు. అయితే వాడి మృత్యుకాలం ఇంకారాలేదే! అని చింతించి ...ప్పకుండా వాడికి దర్శనం ఇవ్వాలనుకున్నాడు. ఇంకేముంది భోళా ...ంకరుడు రుంయమని ఎట్లో గొల్లవాడిముందర వాలాడు.

దేవుడు—"కళ్లు తెరువు నేను వచ్చాను" అన్నాడు.

వెర్రివాడు—తాము ఎవరండీ ?

దే—నేను దేవుణ్ణి

వె—మీరు దేవుడని ఎట్లానమ్మకము ?

దే—నీయిష్టానుసారం పరీక్షించుకోవచ్చు.

వె—అట్లాఅయితే ఆ అయ్యగార్ని పిలుచుకవస్తాను. ఆయనచూచాడు కనుక సరిగా గురుతిస్తాడు. ఆయన చెపితే ఒప్పుకుంటాను. ఏమంటావు ?

దే—మంచిది.

వె—సరెకాని, నేనువచ్చేలోపల మీరెక్కడికైనా జారుకుంటే?

దే—లేదు లేదు. ఇక్కడే వుంటాను.

వె—తెలియనివారితో విశ్వాసమేమిటి ? పగ్గంతో ఈ మామిడిచెట్టుకు కట్టుతాను, సరేనా ?

దే—నీయిష్టంరా బాబు, కట్టుకో !

ఇంకేముంది ? తనయొద్దనున్న గొర్రెల వల పగ్గమూ త్రాళ్ళూ కలిపి వెర్రాడు బాగా పొడుగుచేశాడు. దేవుడు స్వంతంగా చెట్టుదగ్గరికి వచ్చి ఆనుకొని నిలుచున్నాడు. వెర్రివాడు లెక్కలేని చిక్కులతో దేవుణ్ణి బిగదీశాడు. తర్వాత దేవరగారు వెళ్ళినత్రోవబట్టి బాగాపరుగెత్తాడు. అరకోసులో అయ్యగారు కనపడ్డారు. "ఓ అయ్యగారండీ ! ఈ

యన మీా దేవుడేనా కాదా! చూసి చెప్పండీ నేను చెట్టుకు కట్టా
అని అరిచి చెప్పాడు. దేవర, గుండె గుబిల్లుమన్నది. వెనుకకుదిరిగిచూ
పోల్చుకున్నాడు. ఆమామిడిచెట్టువద్ద గలిసిన కుర్రివాడే! ఇంకేము
నాజోలెకొస్త కాజేయటానికి వచ్చాడేమో అని తొందరపడ్డాడు. కా
వెర్రివాడికి తనపనితప్ప మరేమీా తోచలేదు. "రాండీ తొరగారాండీ
అంటూ దేవరగారి చేతిని పట్టుకొని లాగుకున్నాడు. ముసలి జంగము
రాక తీరినదికాదు. మామిడిదగ్గరకు ఇద్దరూ చేరుకున్నారు.

వెర్రి—ఏమండీ దేము డీనేనా? అన్నాడు.

(దేవరగారికి చెట్టూ తాడూ తప్ప మరేమీా కనపడటంలేదు.

జం—"ఏడీ ఎక్కడ"? అన్నాడు.

వె—మీాకు పగలుకూడా కనపడదేమిటి? అదుగో కట్టిపెట్టాను.

జం—(దేవరగారి కిదంతా అల్లరిగా తోచింది, ఎట్లానైతేనేం వదిలించు
పోవాలనే ఉద్దేశంతో) 'ఔ'నన్నాడు.

వె—మీారు సరిగా చూడాలి, తర్వాతకాదంటే బాగుండదు.

జం—(దేవరగారికి దేవుడు ఏమాత్రిం కనపడటంలేదు అయినా) "అ
నవును ఈనే దేవుడు" అని చెప్పెను.

దేవరకు సెలవుదొరకడం ముఖ్యం, ఆయన తనతోవపట్టాడు
వెర్రివాడు దేవునికట్లు విడిచాడు, కాళ్ళుపట్టుక మొక్కాడు.

దేవుడు—ఆజంగమాడు నాభక్తుడుకాడు, పట్టి ఆడంబరం.

వె—అట్లయితే ఆయనకు మీారు దర్శనమిచ్చారుగా?

దే—నేను ఎన్నడూ వాడికి కనపడలేదు.

వె—రోజూ దర్శనంచేస్తానని అయ్యగారు చెప్పారుగా? ఇప్పుడై తే
నాయెదుటనే మిమ్ముల చూచారుగా?

దే—ఇదంతా పట్టి అబద్ధం, ఇవ్వాళా చూడలేదు, పూర్వంకూడా
ఎప్పుడూ లేదు.

వె—సరేకాని, అయ్యగారు అబద్ధమైనా, నన్ను సత్యందాకా ముట్టి
చ్చారు కావున, ఆయన నాగురువు.

దే—పోనీలే! నీకేంకావాలో అడుగు, నాదర్శనం అయిం తర్వాత వట్టిగాపోవడం ఆచారంకాదు.

వె—నేను స్నానంచేసి ముక్కుపట్టుకున్నప్పుడల్లా మీరు దర్శన మివ్వాలి.

దే—సరే! ఇస్తాను.

వె—ఇది మీ యిష్టంచొప్పునే ఒప్పుకున్నారు. ఇంకొకటి నాయిష్టం మీద ఒప్పుకోవాలి.

దే—ఆలాగే!

వె—అయ్యగారు ముక్కు పట్టుకొన్నప్పుడుకూడా ఆయనకు దర్శన మివ్వాలి.

దే—అయితే చాలా మోసంచేశావు, కానీలే! వాడుకూడా బాగు పడ్తాడు, నా దర్శనం పొందినవాడు ఇకమీద డంబాచారిగా ఎటులుండగలడు? వెర్రివాడా! నీవుమాత్రం మహాధన్యుడవు సుమా! నీవు నిన్నే కాకుండా నీ గురువునూ వుద్ధరించావు.

వె—దయవుంచి రక్షించాలి నే నెంతవాణ్ణి?

(దేవుడు అదృశ్యం అయినాడు).

* * *

ఒక సంవత్సరంతర్వాత వరంగల్లు ప్రాంతంలోని శిష్యసంచార మంతా ముగించుకొని దేవరగా రదేమార్గంగా వచ్చారు. వెర్రివాడు కూడా అక్కడే మేకల మేపుతున్నాడు. ఒకరినొకరు ఇద్దరూ తెలుసుకున్నారు.

వెర్రి—గురువుగారూ! సాష్టాంగ ప్రణామములు.

జం—గురువుగారూ! నమస్కారములు.

వె—దేవుని దర్శనమిప్పించితిరి కావున మీరు నా గురువులే!

జం—మీరును దర్శనము ననుగ్రహించితిరి కావున గురువులే!

వె—నేను గొల్లవాడను మీరు మాహేశ్వరులు!

జం—నీవే మాహేశ్వరుడవు, నేనే గొల్లవాణ్ణే.

వె—నేను మూఢుడను మీరు ప్రాజ్ఞుని చేసితిరి.

జం---నేను డంబాచారినై యుంటిని, నీవు భక్తునిజేసితివి.

వె---పోనిండు. మన మిరువురము ఒకరికొకరు గురువులము, శిష్యులము కూడాను, సరికదా!

జం---నేను నాయుద్యోగమును మానుకొన్నాను నీవును నీవృత్తిని వదలవలెను.

వె---అయితే ముందు కర్తవ్యము?

జం---లోకమంతటా శివభక్తి ప్రచారం చేతాము. నీవు తాళాలు వాయించు. నేను ఏకతార తీసుకుంటాను.

వె---ఇద్దరమూ ఎగురుతూ భజనచేతాము'

జం---అవును. శివభజనసుధాసాగరంలో మనం మునిగి లోకాన్ని ముంచివేతాం.

వె---అయితే పేరేం పెట్టుకుందాం?

జం---నీపేరు గురుదాసు, నాపేరు హరదాసు.

వె---అంటే?

జం---నేను గురువునై నీకు బోధించాను. నీవు హరుడవై నన్ను రక్షించావు.

వె---ఇది చాలాగమ్మత్తుగా వుంది. లోకం వెఱ్ఱి అంటారు.

జం---నీవు చిన్నప్పటినుంచీ వెర్రివాడివేకా?

* * *

నిజాం ప్రాంతపు అన్ని జిల్లాల్లోను ఇద్దరు సాధువులు తిరిగి తిరిగీ భజన చేస్తున్నారు. వారికి ఎక్కడలేని సంగీతశక్తీ మహత్తూ వున్నాయని లోకం సముద్ర తరంగాలవలె గుంపులు గుంపులుగాకూడి పూజించేవారు. గోలకొండ నవాబుగారుకూడా ఆ భజనపరులను గొప్పగా సత్కరించి బహుమానా లిచ్చారట. ఎక్కడ దొరకినది అక్కడే ఆ ఆసాధులు వినియోగించి అన్నదానంచేసేవారట, అప్పుడు లోకం భక్తిరసంలో మునిగిపోయిందట. ఈ కాలంలో ఎంతసేపటికీ ప్రశ్నలు వేయడమేకాని, ఇలాంటిశిష్యులుంటే చాలాహాయిగా వుండేది.

---

# నిమ్మపండు

ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు



క. హరువగు నొక్క యహంబున
నిరువురు విద్యాధరులు మహీయఃప్రజ్ఞా
కరులు మణిగ్రీవుండును
గరళగ్రీవుండు ననెడు కమ్రగుణాఢ్యుల్. ౧

తే. గీ. అన్నదమ్ములు వారు సౌహార్ద్రనిధులు
భువనములఁగను రహి నొక్క పుష్పకంబు
నెక్కిపోవుచుఁ గాంచిరి యొక్కరుచిర
తరులతాశోభితంబు నుద్యానవనము. ౨

క. అందున జంబీరతరుల
సుందరముగ విఱుగఁబండి సురభిళగంధ
స్యందము లైన ఫలంబులఁ
బొందుగఁగని తమ్ముఁడనియెఁ బూర్వజునకిటుల్. ౩

తే. గీ. అన్న కాంచితె నిమ్మ పండ్లెన్నరాని
తెవులులకుఁ గారణంబులు తీవ్రశైత్య
దోషకరములు నీకఁ బైత్యదోషకరము
లివియ పథ్యకరంబులం చిలఁ బ్రసిద్ధి. ౪

ఆ. వే. వీని బీజములను నేమము తేనెతో
బాలలోనఁ జెఱుకుపాలలోన
పంచదారలోన భావనచేసినఁ
జేదు పోదొకింత సిద్ధమిద్ది. ౫

క. వీనిరసంబును ద్రావం
గా నేర్పడుదప్పి దంతకాండము బులియున్ ,

జానగు రక్తము సెడు నే
మేనియుఁ గనరాదు గుణము హృద్యచరిత్రా!

క. అనఁగా నగ్రజుఁడనిమెను
విని తమ్ముఁన కిట్టులొగిరి వెట్టీ! వినుమీ
ఘనతర ఫలములరసములఁ
గొనికద సర్వౌషధములఁ గూర్తురు విబుధుల్.

తే. గీ. సర్వవస్తువులకు శుద్ధిసల్పు నిమ్మ
పండ్లరసము క్షయంబైనఁ బైత్యదోష
మందుఁ బైత్యముఁబుట్టించి మనుపు మఱియు
రుచినిఁ బుట్టించు జిహ్వకు రూఢిగాను.

క. వాతకఫంబులనడచును
నాతతకృమితతులఁ జంపు నాహారంబుల్
బ్రీతిగ బచనము సేయుల్
చేతమునకు సంతసంబు సేయుల్ గనుమా.

క. ఆనవము లరిష్టంబులు
భాసిల్లెడు పానకములు పలురకములతో
వాసిగఁ బొనరింతురు నే
బాసీ జంబీరఫలము సమ మిల గలదే. ౧౦

క. పచ్చళ్ళు నూరగాయలు
హెచ్చుగఁ జిత్రాన్నములను నేర్పఱచి కడుల్
మచ్చిక భుజింతు రీయది
మెచ్చఁ దగు ఫలముగాంచుమీ యనుజన్మా! ౧౧

(ఇందలి గుణదోషవిమర్శనము చరకబాహట మతానుసారవిరచితము.)

---



పండిత చి॥ మ॥ వీరభద్రశర్మగారి విద్యాభివృద్ధికి
సంపూర్ణ సహాయకులు, మహాదానధర్మాత్ములు, సుప్రసిద్ధులు
శ్రీ నిర్మల దేశముఖు బాపురావు గారు.

దానకర్ణులగు

# శ్రీ ని॥ దే॥ బాపురావు వకీలుగారు

ఆయుర్వేదభూషణ

**రావికోటి మఠము వీరభద్రయ్యగారు.**



నిజామాంధ్ర ప్రాంతపు ఆసఫాదు జిల్లాలో నిర్మలయను చిన్న పట్టణమొకటి కలదు. అచ్చట దేశముఖు అధికారము (ఒకవిధమైన జమీందారీ) కలిగినట్టి "శ్యామరావు కాశీబాయి" అను వీరశైవ దంపతులు సమస్త సంపదలతో దులదూగుచుండిరి. ఇంక నితర గ్రామములును వారి యేలికకు లోబడియుండెను. అందువలన నీకుటుంబమువారు "నిర్మల దేశముఖుల"నియును దొరలనియును నాడును నేడును రాజమర్యాదలతో బిలువబడుచున్నారు. ఆకాలమున ననగా సుమారు ౭౦ వ సం వత్సరములక్రింద దేశముఖులు మహానందముగ సుఖముల ననుభవించుచు ధానధర్మములతో గాలము పుచ్చుచుండిరి. వారికి రాజేశ్వరరావు అను పుత్రుడను గలిగెను. సామాన్యముగ గొంతవిద్య యబ్బిన తరువాత గంగాబాయి యను మరొక గొప్పకుటుంబము కన్యతో వివాహము జరిగెను కాని పుత్రసంతానము లేనందున *రాధాబాయి యను సుకన్యతో ద్వితీయ పరిణయము మహావైభవముగా నెరవేరినది. 'రాజేశ్వరరావు' 'రాధాబాయి' అను రెండునామముల యాదియందును దానధర్మబోధకమగు "రా" యను ఒకే అక్షరముండుటచే కాబోలు దంపతులు చాల నన్యోన్యముగ గృహధర్మముల బాలింపుచు అన్నదానమున మిన్నలై ప్రజల మన్నన లందుచుండిరి. రాధాబాయిగారికిని కొంత యాలస్యముగ నైనను సరియేకాని యొకసుముహూర్తమున దేదీప్యమానమగు పుత్రరత్న ముదయించెను. గర్భములో నుండగనే యనేక

*మహారాష్ట్రదేశమున వీరశైవులకును వైష్ణవ నామములు కలవు. పైగా దేశముఖులు మున్నగు "క్షత్రియ" వృత్తిగలవారింట మరియు నెక్కువ.

జ్యోతిష్కపండితులు సుప్రసిద్ధజాతకుని జననము కానున్న దనిరి "పండితవాక్యము రిత్తవోవునే" అది యటులే జరిగినది. ఆ బాలకుని "బాపురావ్" అను ముద్దుల నామమిడిరి.* ఇతడే మన కథానాయకుడని పాఠకులు గ్రహించియుందురు. బాలకుడు చాల వైభవముతో బ్రీతింపబడుచుండెనుకాని ప్రియమాతయైన రాధాబాయిగారు తమ పుత్త్రుని యారవమాసముననే కైలాసమును జేరినది. తల్లిలేని పసితనము దుర్భరమైనదే కాని శివాజ్ఞనుల్లంఘింప నేరితరము? కష్టమో సుఖమో గొప్పకుటుంబమునగల నొకబాలకుడు పోషింపబడుట లెక్కకాదుకాని బాపురావుకు ఎనిమిదేండ్లప్రాయము వచ్చునప్పటికే పాలివారితో రాజేశ్వరరావుగారికి వ్యాజ్యములేర్పడినవి. గొప్పగ దురంతములును జరిగినవి. ఈ యల్లరులలో తండ్రిపోషణకూడ తప్పి బాలుడు మరో చోట దూరముగ నుండవలసివచ్చెను. ఎటులైననేమి బాలుడు బాల్యము నుండియు అద్భుతమైన తెలివితేటలు గలవాడగుటచే ౧౮ ఏండ్లవయసు లోనే ఉర్దూ ఫారసీ అరబ్బీ మున్నగు నిజాంరాజకీయభాషల నవలీలగ నేర్చుకొని ౧౫వ సంవత్సరమున నిజామాబాద్ జిల్లా కచ్చేరిలో తహ శీలుదారుగారియొద్ద నుద్యోగము సంపాదించు మధ్యలో ననేకకష్టములు కలిగినవి. తర్వాత బాపురావుగారు స్వతంత్రించి వ్యవహర్తలగుటచే అదృష్టము రెండవతీరుగ మారిపోయినది. ఉద్యోగముచేయుచు మరొక వైపు వకీలు పరీక్షకై ప్రయత్నించి కృతార్థులైరి. అపుడు ఇంట ననుకూలము లేక రోడ్డుమీది దీపములయొద్ద రాత్రిజదివితినని స్వంతముగ వారే చెప్పెడివారు. ఈ మధ్యన రెండు వివాహములగుటయు తండ్రిగారు గతించుటయు హైదరాబాదున వకీలుగా బ్రవేశించుటయు మున్నగు గొప్ప ఘట్టములు చక్రము దిరిగినవి. వకీలు వృత్తిలో వారి బుద్ధికి మహత్తరమగు కీర్తియు అత్యధికమైన సంపత్తును నహజముగ

---

*మన తెలుగులోని 'బాబు' శబ్దము మరాఠిలో 'బాపు'గానుండును. నిర్మల దేశముఖులయింట మరాఠియే నాడు వాడ బడుచుండెను. దేశమున దెలుగును ఉండుటచే వ్యవహారములో దెలుగును వారికి బ్రియమైనది.

లభించినవి. వారుపట్టిన వ్యాజ్యములన్నియు సఫలము లైనపుడు ధనము నకు గౌరత యుండునా? వారి వకీలువృత్తి జాతరవలె సాగినది. ఖానూను విషయములు (లా పాయింట్లు) వారి జిహ్వాగ్రమున తాండవించెడివి. పరవాదికిని ఎదురు వాదించుటకు వీలుగలుగకుండెడిది. "ఒకే అవతారమగుటవలన వాదము సరసముగాలేదు. బాపురావుకు ప్రతిగ మరొక యవతారమును భగవంతుడిటు గల్పించరాదా?" యని జడ్జి యొకరు బల్కిరట! కేవలము వకీలు ఉద్యోగములోనే వీరు పదునాలుగు లక్షల రూపాయిల నార్జించిరనినచో వారి విద్యాపటిమయు భోగ భాగ్యరేఖయు లోకమునకు తెలియకపోదు.

ధనము నార్జించినంతనే గొప్పతనముకాదు. తానునుభవించకయు ఒరులకీయకయు పాపిష్ఠులపాలు గావించిన వారెందరోకలరు. బాపురావు గారు మహావీరవృత్తిగలవారు. యథేష్టముగ వారనుభవించి మహాత్యాగముతో దానధర్మముల గావించెడివారు. హిందు, ముసల్మాను, శైవుడు, శైవేతరుడు, స్త్రీలు, పురుషులు అను భేదములేకుండ యాచకు లెవరైనను సరియే సంతోషింపజేసి పంపించుటయే వారిపని. అన్నదాన మునకు వారిల్లు ధర్మసత్రము. ఎంతమంది నాదరించి, పోషించి, వివాహములొనర్చి, గృహములగట్టించి, విద్యనేర్పించి, భయములబాపి, వేతనముల నిచ్చి,రక్షించిరో లెక్కవేయలేము. అనేకజనులు వారిపేరుజెప్పుకొని బ్రతుకువారు నేడును కలరు. బాపుగారి స్వభావమెల్లపు డానంద ముగమందహాస్యము చేయుచుండెడిది. అందరితోడను సరళముగ సంతోషముగ సంభాషించువారు. కోపము వచ్చినచో సింహరాజములు సైతము భయపడవలసినదే! హైదరాబాదు నందంతటను గొప్పవారందరి లోను వారికి పలుకుబడి యుండెను. శ్రీ ఘ॥ నిజాంప్రభువుల కృపకును వారు విశేషముగ బాత్రులైయుండిరి. వారి జీవితకాలమున హైదరాబాదు వీరశైవులలో నుత్సాహము ప్రేమభావము తాండవించెడివి.

శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారికి వీరితో బరిచయము గత పింగళనామ సంవత్సరములో గలిగినది. తదాదిగ పదునారు సంవత్సర

ములలో బాపురావుగారు వేనకువేల ద్రవ్యమును శర్మగారి విద్యాభ్యా
సమునకై మహోపారముగ వ్రియమొనర్చుటయేకాక శర్మగారియం
పుత్రనిర్విశేషమైన వాత్సల్యమునుంచిరి. స్వంతముగ గాశికి వెళ్ళి వా
విద్యా బుద్ధి కీర్తులను పరామర్శించి మహానందమునందిరి. ఏ జన్మసూత్
నిమిత్తమో చెప్పలేముగాని శర్మగారియందు బాపురావుగారికి సమధి
మైన యభిమాన విశ్వాస గౌరవము లుండెడివి. హైదాబ్రాదున నొ
గొప్ప వీరశైవ విద్యాపీఠము నెలకొల్పి (శర్మగారి యాధిపత్యమున)
రెండులక్షల రూపాయల ధనమును సమర్పించు సంకల్పమును బాపు
గారొనర్చియుండిరి కాని, దుర్విధివిలాసము వికటముగ నుండినందున
భావనామ సంవత్సర మార్గ॥బ॥౧౨మంద వారమున (౨౨-౧౨-౧౯౩౪)
శివసాయుజ్యము నందిరి.

బాపురావుగారి జ్యేష్ఠభార్య (పెద్దగంగమ్మ) గారి గర్భమున
నాగభూషణరావుగారు జనించిరి. వీరు గొప్పవిద్యావంతులు. సీమకు
వెళ్ళి బ్యారిష్టరై వచ్చినారు. ప్రస్తుతము నాగపూర్ నగరమున వకీలు
వృత్తి నిర్వహించుచున్నారు. తండ్రిగారి కీర్తిని ప్రబల మొనర్చ
వలెనని వీరశైవలోక మెదిరి చూచుచున్నది. రెండవ భార్య
(చినగంగమ్మ)గారికి శారదాబాయియను ముద్దులకూతురు జనించెను.
ఈ యమ విద్యాబుద్ధులునేర్చి వివాహితయై పార్వతిబాయి యను
చక్కని కూతురును గని కైలాసమునందినది. ప్రస్తుతము శ్రీ
బాపురావుగారి ఇరువురు ధర్మపత్నులును, కొడుకు కోడలును, మనుమ
రాలును సుఖముగనున్నారు. శ్రీ బాపురావుగారి ఘనమైన చరిత్ర
మరొకమారు విపులముగ వ్రాయవలసియున్నది. కావున సంక్షేపించి
నాను, శ్రీవారి యాత్మకును వారి కుటుంబమునకు పరమేశ్వరుడు
దివ్య విభూతి ననుగ్రహించుగాక యని ప్రార్థించుచున్నాను.

---

# పతివ్రతామహిమకు ప్రత్యక్షప్రమాణము

**మహాంతుమఠము నాగభూషణయ్యగారు**



పతివ్రతలయొక్క అగ్నిపరీక్షలు మొదలయిన అద్భుత సమాచారములను మనము పురాణాదులలో చదువుచున్నారము కాని నేటి కాలపువారు వానిని నమ్ముటలేదు. పైగా ఇట్టిసంగతులన్నియు కపోల కల్పితములనియే నేటివారి విశ్వాసము. ఇదిఇటులుండ మొన్న క్రొత్తగా జరిగిన యద్భుతసమాచార మొకటి తెలిసివచ్చినది. ఇది ప్రత్యక్షప్రమాణము కావున నమ్మవలసియే యున్నది.

బిహారు ప్రాంతమునగల ముంగేర్ జిల్లాలోని "ఉలావు" గ్రామమున గోరఖ్‌పూరు ఒడ్డెవారు (రాళ్ళుపగులగొట్టుజాతి) కొన్ని నెలల నుండి నివసించుచు విసుర్రాళ్లు కొట్టుట మున్నగు నుద్యోగమును చేసుకొనుచుండిరి.

జయపాలుడనువాని కూతురును 'నథునీ' అనువాని భార్యయును అయిన "సుందరి" యను ముప్పదిసంవత్సరములుగల యువతి వారిలో నొకతె. ఆమెకు నిద్దరు చిన్నబాలకులును కలరు. ఇటీవల బాబులాల్ అనువాడు ఆమె భర్తతో "నీ భార్య నడువడి చెడిపోయినదనియును ప్రస్తుతమున్న గర్భముకూడ నీది కాదనియును" కొండెము చెప్పెను. ఈ సంగతి తెలిసిన తర్వాత ఈ దుర్వార్త వట్టి అబద్ధమనియును పరపురుషునితో నాకు సంబంధము లేదనియును వానితో నా యువతి వాదించెను. వాడు అటులయినచో నీవు సత్యవంతురాలవేని మన జాతిలో జరుగుచువచ్చిన అగ్నిపరీక్ష నివ్వమని కోరెను. అంతట ఆ తరుణి నవ్వుచు "ఓహో! ఇష్టమువచ్చినట్లు పరీక్షించుకొనుము" అనెను. దీని ననుసరించి గత డిసంబరు ఆఱవ (6-12-1938) తేదని పతివ్రతయైన యా తరుణియొక్క అగ్నిపరీక్ష ఈ క్రింద వ్రాసిన విధమున జరిగెను.

గ్రామమునకు దక్షిణమువైపున గలమఱ్ఱిచెట్టుక్రింద పేరుపిడకల గొప్ప రాశిగా బోసి వానికి నిప్పు నంటించి దానిలో రెండుసేర్ల బరువు గల ఇనుపసుత్తెను బడవైచిరి. అది ఎఱ్ఱగ కాగినపుడు ఆ తరుణిచే స్నానము చేయించి ఆమె రెండుచేతులను దోసిలిగా బట్టించి దానికి నెయ్యిని రాసి దానిపైన రెండున్నర రావిఆకుల నునిచి పూదారముతో దోసిలినికట్టిరి. తర్వాత కుమ్మిలోనుండి ఏడుఏఱుపిడుకలను దీసి అడు గున కొకటివంతున పొడవుగా బెట్టిరి.

ఆయువతియు అగ్నియొద్ద నిలవేయబడియుండెను. ఇంతలో తమ కులముపెద్దయొకడు చిమ్మటతో నిప్పులలోనుండి యెఱ్ఱటిసుత్తెను యెత్తుచు "నీవు నిర్దోషురాలవేని ఈసుత్తెను పట్టుకొని యేడడుగుల వఱకు నడువుము"అని చెప్పెను. అనంతరము ఆయువతి సూర్యునివైపు తన మొగమునుద్రిప్పి "ఓ భగవంతుడా! నేను నిర్దోషురాలనేని నాధర్మ మును రక్షించుము" అని ప్రార్థించి చాల సంతోషముతో ఆయెఱ్ఱటి సుత్తెను తన యఱచేతులలో పెట్టుకొని యేడడుగులు ముందుకు నడిచి దానిని భూమిపై వదలివేసెను. ఆసుత్తె పడ్డచోట పైగడ్డియేకాదు, రెండంగుళములలోతువరకు మట్టియు కాలిపడియుండెను. కాని భగవ త్కృపవలన యామెదోసిలిగాని రావియాకులుగాని దారముగాని యెంతమాత్రము కాలియుండలేదు--- అనుసంగతి యద్భుతమగు నాశ్చర్యమును గొలుపుచున్నది.

ఈ అగ్నిపరీక్షను జూచుటకై షుమారు రెండువందలమంది చేరియుండిరి.

అందుకొందరు ఒడ్డెజాతివారునుండిరి. అందరును పతివ్రతయొక్క సతీత్వమునుగూర్చి జయజయధ్వానము లొనర్చిరి. తదనంతరము ఈ పతివ్రతామూర్తిని శ్రీమతి సావిత్రిదేవిగారి మేడలోనికి నాహ్వా నించి పువ్వులు ఫలములు మిఠాయి మొదలగువానిచే సత్కరించిరి.

ఇట్లు, శివకరణ ఉపాధ్యాయ.

( 127 వ పేజీ చూడుడు )

# ఉపమన్యు మహర్షి

అనువాదకర్త:—

**బాదిదిమఠం మహంతయ్యగారు**



౧

శ్రీమంతంబగు నార్యావర్తంబున ప్రాచీనకాలమందు పరమ శివభక్తుడును, యశస్వియు, వేదవిదుడు నగు, శ్రీ వ్యాఘ్రపాద మహర్షి తన నశ్వర దేహమును త్యజించి శివసాయుజ్యమందెను. వారికిరువురు తన యులుగలరు. ప్రథముఁ డుపమన్యుఁడు, ద్వితీయుఁడు ధౌమ్యుఁడు - వ్యాఘ్రపాదమహర్షి శివలోకప్రాప్తి జెందు నప్పటికి వీరు పసిబాలురు. మాతృపోషణయందే కాలముఁ గడుపుచుండిరి.

౨

ఒకనాఁ డాబాలకిశోరద్వయంబు వనమ్మునఁ దిమ్మరుచు ఋష్యాదుల యాశ్రమంబుల కడకేగిరి - ఆబాలురగాంచిన మునిపుంగవులు, వారికిఁ గపిల గోక్షీరము నొసంగిరి. వారు పాలనుఁ దనివితీరఁ ద్రావి తిఱిగి స్వగృహాభిముఖులైరి. ఇంటనున్న తల్లినిఁజూచి "పాలకై బతిమాలిరి"— తల్లి " యింటపాలు లేకుండుటచేఁ దండులపిష్టమును నీటిలోఁ గలిపి వారికిఁ ద్రాగుట కొసగెను" వారింతకుబూర్వము బాలచవినెఱిగిన వారగుటచే (తల్లీ! ఇవిపాలుగావు) ఏల మాకొసగితివి అని ప్రశ్నించిరి — అంత వారిజనని యిట్లనియె! "పుత్రరత్నములారా! మనము నదీతీరములందును, గిరిగహ్వరము లందును, కాననసీమలందును, దపమాచరించు వారము. మనకు క్షీరమెక్కడినుండి వచ్చును. మనకు భగవానుఁడగు శంకరు డాశ్రయదాత కావున, నాతనిని మీరు ప్రసన్నునిఁ గావించు కొంటిరేని యాతడు మీకుఁ గావలసినన్ని పాలను ఆహారము ననుగ్రహింపఁగలడు. కావున మీరు శ్రద్ధాభక్తులు గలవారై యా పరమ శివుని శరణుఁజొచ్చి సఫలీకృత మనోరథులుఁ గండు—

౩

మాతృవాక్యముల నతిశ్రద్ధతో నాలకించి యుపమన్యుఁడు ముకుళిత కర కమలుఁడై యిట్లు ప్రశ్నించెను:— "జననీ ! శంకరభగవానుఁడనగా నెవరు ? వారెచట నుందురు ? వారి నెటుల దర్శింపవలెను? వారి రూపమెట్టిది?

తనయుని సరళములైన యమాయకపు బలుకు లాలకించి, తల్లి కనుదమ్ములనుండి యొక్కుమ్మడి అశ్రుధార ప్రవహింప సాగెను. ఉపమన్యుని మూర్ధ్నిఘ్రాణ మొనరించి యత్యంతానురాగ హృదయయై ప్రత్యుత్తర మొసంగెనను "ప్రియతనయా! శివుఁడెచటనుండు - విశ్వమంతయు శివమయము - అతడు సమస్త ప్రాణికోటికి హృదయాంతర్గతుడై యున్నాడు. భక్తులపైఁ గరుణగలవాడై యప్పుడప్పుడు వారికి దర్శనమొసగుచుండును - భక్తి విశ్వాసములు లేక నతనినిఁగాంచుట మిక్కిలి దుర్లభము. అతని యథార్థ చరిత్రము నెఱిఁగినవారేలేరు. అతఁడెవరిపై గరుణారసదృష్టిఁ బ్రసరింపఁజేయునో వారే ధన్యజీవులు. వారేయాతని నెఱుంగ గలవారలు. అతడు నిరాకారుఁడై సర్వత్ర ప్రకాశమానుండై యుండును. సాకారరూపుఁడై మహాకైలాసమున శాశ్వతముగ విరాజిల్లుచుండును. అతడు శుద్ధస్ఫటికదేహుడు. ఉత్తమాంగమున బాలచంద్రుని ధరించియుండును. ఫణి యజ్ఞోపవీతము గలవాడు. మనోహరమూర్తియగు నా శివభగవానుఁడు యజ్ఞవేదికయందును, యజ్ఞస్తంభమున, యజ్ఞాగ్నియందును విశేషముగ నతడు వసించును. ఆదిమధ్యాంతరహితుఁడు. జననమరణములులేనివాఁడు. అట్టి పరమాత్మస్వరూపుండగు శ్రీమహేశ్వర జ్ఞానము కేవల భక్తి ప్రపత్తులతోఁడనే కలుగుచున్నది. నీవతనికిభక్తుడవుగమ్ము. నీమానస మాతనియందు లగ్న మొనరింపుము. నిష్ఠఁగలవాడవై యతనిని శరణుజెందుము. భజింపుము. ఈచందంబున మెలగితివేని నీవాంఛిత మీడేరును.

౪

మాతృదేవి యుపదేశామృత ముపమన్యునికి వీనుల విందొనరించి నది. శివదేవునియం దచంచలభక్తి బీజము నాటబడినది. అతడు నాటి నుండియే తపమొనరించుట కొరకు విజనస్థలమున కేగెను. సహస్రదివ్య వర్షములవరకా బాలభక్తుఁడు దక్షిణపాదముయొక్క అంగుష్ఠాగ్ర భాగమున నిలిచి తపమొనరించి శివభగవానుని సంతుష్టి గావించెను. శివదేవు డుపమన్యుని దృఢభక్తిని బరీక్షింపదలచి యింద్రదేవతా స్వరూపుఁడై సాక్షాత్కరించి యతనితో నిట్లనియె. ఇంద్రుఁడు:— "వత్సా! నేను సంతోషితస్వాంతుఁడనై తిని. నీకువలయు వరంబెద్దియేని యున్న వక్కాణింపుము"—ఉపమన్యుఁడు:—"దేవేంద్రా! నీక నేక నమస్కారములు. నేను నిన్నేమియుఁ గోరను. నాకు నీస్వర్గమభిలషణీయము గాదు. నిన్ను గుఱించి నేదప మొనరింపలేదు. నేను శంకరకింకరుఁడను. వారు ప్రసన్నులగునంతవరకు నాతపస్సును విరమింపజాలను. త్రిభువనాధా రుండును, ఆదిపురుషుండును, అద్వితీయుఁడును, మృత్యుంజయుడగు సదా శివునిఁ బ్రసన్నుని గావించునంతవరకు నాకు శాంతియెక్కడిది? నా దుష్కృత్యముల వలన నాకుఁ బునర్జన్మసంభవించినను నాజన్మయందాత నిపై నాకక్షయ భక్తి గల్గియేయుండును. ఇది నిక్కవము"...ఇంద్రుడు:— ఉపమన్యుని పలుకులన్నిటిని సావధానుడై విని యిట్లనియె:—"బాలకా! నీవాక్యములన్ని యథార్థములే! కాని యాశివదేవుడున్నాడని నీకెట్లు విశ్వాసముఁగలదు"...

ఉపమన్యుడు:—"అతడవ్యక్తుఁడు, ఆదిపురుషుఁడు, బీజరూపుడు సమస్త దృశ్యమాన విశ్వమెవనియందు లీనమగునో! అతఁడే శివ స్వరూపుఁడు. మాయాతీతుఁడు జ్యోతిర్మయకారుఁడై యున్నాడు. తాము నిలిచియే యుండుఁడు. లేదా వెడలిపొండు. నేనితరుల వరములఁ గోఱు వాడనుకాను పరమేశ్వరుఁడే నాకువరంబొసగ సమర్థుఁడని యుపమన్యుఁడు చింతాక్రాంతచిత్తుఁడై భగవంతుఁడేల బ్రత్యక్షముగా లేదని మనంబున దలపోయసాగెను.

౫

అంతట గొంతసేపటికి దేవేంద్రుని వంకఁజేరి పారజూచె అద్భుతదృశ్యముఁ గాన్పించెను. ఐరావతము మహోక్షమైనది. భగవాను డుమాదేవిసహితుఁడై నావృషభేశ్వరు నధిష్ఠించియుండె ఆ దేవదేవుని శాంతిమయాకారము దివ్యతేజః పుంజమువలన సహ భానులొకేసారి యుదయించిరా! యనునట్లు కాంతి ప్రసరించె వారు వివిధభూషణాదుల ధరించియుండిరి. వారమూల్యశ్వేత వస బులఁ దొడిగియుండిరి. ధవళకుసుమహారంబుల గళమందు వేసికొ యుండిరి. శ్వేతచందనమును మస్తకమున లేపనముగావించిరి. ధవ మగు వృషకేతనము విరాజిల్లుచుండెను. తెల్లని జన్నిదము వేసికొ యుండెను. శుభ్రశశాంకుని మకుటంబున ధరించియుండెను. సుకుమా శిరీష కుసుమపేశల శరీరము వక్షస్థలంబున సువర్ణకమల మండితమై రత్నస్థగితహారముఁ బ్రకాశించుచుండెను. అట్టి దేవమునివందిత పాదా విందయుగళుడగు శ్రీ శంకరభగవానుని దర్శించి పరమానందకందళి హృదయాబ్జుడై యుపమన్యు లిట్లు ప్రార్థించెను.

౬

"హే! దేవాధిదేవా! నీకు ప్రణామంబు లర్పించుచున్నాను హే! వజ్రపాణే నీకభివందనములు; ఆసమయమున శంకరు డుపమన్యు నకు సుప్రసన్నుడై యిట్లనియె:—"కుమారా! ఉపమన్యూ! నీపై నాకు మిక్కిలి యనురాగముగలదు. నీభక్తిని యిందరరూపుఁడనై పరీక్షించితిని. నీవు దృఢభక్తుడవు. నీకు కావసిన దేమియో తత్క్షణము విచారింపుము. శంకరదేవుని కృపాపూరితవచన ములవిని యుపమన్యుని సంతోషమునకు మేరలేకుండెను.

గద్గదకంఠుడై యతని నయనములనుండి యానందాశ్రువులు స్రవింప నిట్లు ప్రార్థించెను.

శ్లో॥ యది దేయో వరో మహ్యం యది తుష్టోసి మే ప్రభో!
భక్తిర్భవతు మే నిత్యం త్వయి దేవ సురేశ్వర. (ఉపమన్యు)

"ప్రభువర్యా ! నేడు నాజన్మసఫలమైనది. దేవలతలకైన నీదర్శనము దుర్లభము. అట్టి నీవు మత్సుకృత విశేషంబున సాక్షాత్కరించి ప్రసన్నుడవైతివి. తాము వరమీయదలచినచో మీయందే నా కచంచలభక్తి గలుగున ట్లనుగ్రహింపు:డు."

ఉపమన్యు వచనంబులవిని శంకరభగవానుం డిట్లనియె. వత్సా! నీవు జరామరణరహితుడవు, యశస్వివి, తేజస్వివి, దివ్యజ్ఞానివి, నీ సమస్త దుఃఖములు దూరమైనవి. నీవు దివ్యసుందరుఁడవైతివి. అగ్నివంటి దివ్య తేజస్సు నీయందు గల్గియున్నది. "కల్పాంతమువరకు జీవించియుండి క్షీరాన్న భోక్తవై యుందువు. తదనంతరము కేవల శివసాయుజ్యమంది మోక్షముగాంచెదవు. నీకు నాయందు భక్తిగలిగియుండును. నన్ను స్మరించినమాత్రమున నీకుఁ బ్రసన్నుడనై యుందును" ఈ విధముగా వరములననుగ్రహించి యాపరమశివుడదృశ్యుడయ్యెను. ఈయుపమన్యు మహర్షియే శ్రీకృష్ణ భగవానునకు శివదీక్ష నొసంగిన మహాభాగుఁడు.

ఓం సర్వం శ్రీ పరశివార్పణమస్తు.

---

( 122 వ పేజీ తరువాయి )

హిందీభాషలో సుప్రసిద్ధమగునట్టియు సత్యవిషయముల నెల్లప్పటికి ప్రకటించునట్టియు గొప్పగా ప్రచారము గలిగినట్టియు "కల్యాణ" అను మాసపత్రికకు ఈవార్తను పంపగా దానికి సంపాదకులయిన 'సత్యసదాచారమూర్తియగు శ్రీ హనుమాన్‌దాస్ పోద్దార్,— అను మహాశయులు పై వార్తను పరీక్షించి సత్యమనియే ఈ మార్చి నెల సంచికయొక్క ౧౪౯౧ వ పుటలో స్పష్టముగా ప్రకటించియున్నారు.

నేటికాలమున అగ్ని కాలలేదనినచో నెవరును నొప్పుకొనరు. కాని పాతివ్రత్యశక్తిని అబద్ధమని చెప్పువారందరును దీనినుండి గుణపాఠము నేర్చుకొనవలసియున్నది. మఱియు హిందుధర్మముయొక్క గౌరవమగు ఈ సతీత్వము నెప్పటికిని తిరస్కరించకూడదు. చదువు సంధ్యలులేని పల్లెపిల్లలలోను ఇంతటి పతివ్రతలుండుట ఆర్యులకు గౌరవాస్పదమే. ఇట్టి గుణసుందరులే భారతవర్షము నుద్ధరించగలవారు.

సంపాదకుడు, విభూతి.




(విమర్శనమునకై రెండేసి ప్రతులను పంపగోరుచున్నాము.)

**రఘువంశకథనము**—కర్త; బండారు తమ్మయ్యగారు, అమలపురం, (గోదావరిజిల్లా). పుటలు ౨౫౦. వెల 1-8-0. ఆంధ్రలేఖకులలో బ్రసిద్ధులైన శ్రీ తమ్మయ్యగారు మహాకవి కాళిదాసుని సంస్కృత రఘువంశ మహాకావ్యము నీ పేరుతో నాంధ్రీకరించి తెలుగునాటివారి మిక్కిలి యుపకార మొనర్చిరని చెప్పక తప్పదు. ఆంధ్రభాషలో సంపూర్ణ రఘువంశము లేని కొరత యీ గ్రంథముతో తీరిపోయినది. గ్రంథకర్తగారు, సంస్కృతాంధ్ర భాషలలో బండితులగుటజేసి చక్కని తెలుతెలుగున నీ పొత్తము మింపునింపుచున్నది. ఆంధ్రభాషాభ్యాస మొనర్చు వారికిని విజ్ఞానప్రదముగ నుండుటచే దీనిని మద్రాసు యూనివర్సిటీవారును, ఆంధ్రవిశ్వవిద్యాలయము వారును తమ పరీక్షలకు బఠనీయ గ్రంథముగా నెన్నుకొని గౌరవించి తమ యుచితజ్ఞత నిదివరకే ప్రకటించినారు. సలక్షణమైన ప్రౌఢగ్రాంథిక శైలిలో గద్యకావ్యముగ రచింపబడుటచే నాంధ్ర ప్రబంధములందు నిదియు జిరస్థాయిగ స్మరింపబడు ననుటలో సందియము లేదు. కాళిదాసుడు సూచించిన చారిత్రిక స్థలములు మున్నగునవి నేటికాలపువారికి దెలియునట్లు ప్రత్యేకముగ నిందు వివరింపబడినవి. కావున విద్యార్థులకు విశేషోపయుక్తము. కాళిదాసుని భావమాధుర్య చమత్కారముల దెలిసికొను మక్కువగల యాంధ్రులందరీ గ్రంథము నవలోకించవలెను. శ్రీయుతులగు, మహాకాళి సుబ్రహ్మణ్యము, కోరాడ రామకృష్ణయ్య, జయంతి రామయ్యపంతులు, వడ్డాది సుబ్బారాయడు, ఉమ్మర్ అలీషా, చిదిరెమఠము వీరభద్రశర్మగార్లు మున్నగు సుప్రసిద్ధ విద్వాంసులును

నాగ్రంథమును గూర్చి పొగడియున్నారు. ఇదివరకే రెండుమారు లచ్చుపడి కీర్తిగాంచిన నీ గ్రంథప్రశస్తిని విశేషింప నవసరములేదు. సఫల ప్రయత్నులైన తమ్మయ్యగారి కృతిభూషణము లింకను తెలుగుతల్లికి లభించుగాక!

**వీరశైవరత్న**:—(కన్నడపుస్తకము) కర్త; పండిత శ్రీ కాశీనాథశాస్త్రిగారు. పంచాచార్యప్రభా ప్రెస్, మైసూరు. పుటలు 300 ముద్దులొలుకు ముద్రణము. మంచిగ్లేజు కాగితములు బైండు, ౨౫, మనోహరములైన వివిధశాసనాది చిత్రములు ఐదవ ముద్రణము. వెల ౨-౦-౦

కర్నాటక వీరశైవులలో సుప్రసిద్ధులగు పండిత కాశీనాథ శాస్త్రిగారి పరిచయ మాంధ్రవీరశైవులకును క్రొత్తగాదు. వారి వీరశైవరత్న మాంధ్రమునను కొంతయనువదింప బడినది. ప్రస్తుత పుస్తకము వీరశైవ-ఆధునిక వాఙ్మయమున రత్నమువలె బ్రకాశించు చుండుటజేసి 'వీరశైవ రత్నమ'ను సార్థకనామ కరణ మొనర్పబడినది. వీర శైవమతోత్పత్తి, జగద్గురు పంచాచార్యుల చరిత్రవిశేషము. వీరశైవ ప్రాచీనత్వ వైదికత్వములు, వర్ణాశ్రమ సదాచారవివేకము, శివయోగ శివాద్వైత సిద్ధాంతములు, మున్నగునవి వేదాగమోపనిషత్పురాణేతి హాసముల ప్రమాణాధార పూర్వకముగ విశదముగ నిరూపింపబడినవి. ఇంతటి గ్రంథము వీరశైవులలో ఎన్నటికైనను ప్రకటింపబడునని ౧౦ వత్సరములకు పూర్వమెవరు భావించి యుండలేదు కాని, కార్యదక్షులగు శ్రీ శాస్త్రిగారు మైసూరు రాజధానియందు ఏబదివేల రూపాయాల వెలగల 'పంచాచార్య ప్రెస్, కాశీనాథ గ్రంథమాల' యను గొప్ప సంస్థనేర్పరచి అనేక యుద్గ్రంథములను ఒక కన్నడ వారపత్రికను ప్రకటించుచున్నారు. వారికముందు నాంధ్రవీరశైవులకును నుపకారమ్ము జేయగలరని యాశకలదు. పై గ్రంథము సమగ్రముగ నాంధ్రభాషలోను ఆంగ్లమునను బ్రకటించవలెనని కోరుచున్నాము. ప్రతివీరశైవు డీ రత్నమును సంగ్రహించి భద్రపరచి గ్రంథకర్తగారి పరిశ్రమకు కృతజ్ఞత బ్రకటించుగాక!

**ప్రాథమిక స్వత్వములు:**—కర్త; సురవరము ప్రతాప రెడ్డి బి. ఏ. బి. ఎల్ గారు, ప్రకాశకులు: దేశోద్ధారక గ్రంథమాల, ఇమాంబాడ వీధి, సికింద్రాబాద్ డక్కన్, పుటలు ౫౦ వెల ౦-౫-౦.

ఈ గ్రంథమాలలో జనోపయోగకరములగు పొత్తములు ప్రకటింపబడుచున్నవి. తెలిసినంతవరకు నిజాంరాష్ట్రమున నీప్రయత్న మభూత పూర్వమనవచ్చును. పరాధీనములోనున్న ప్రజలకును సహజముగ కొన్నిహక్కులు నాగరిక దేశములలో పాటింపబడుచున్నవి. కాని భారత దేశమునను విశేషముగ నిజాంరాజ్యమునను ప్రజలు సరళముగ సంసారకృత్యము నెరవేర్చగలుగుచున్నారా? యను సందేహమును దీర్చుటకై ప్రసిద్ధులైన శ్రీ సు॥ ప్రతాప రెడ్డిగారు ఘనమైన భావముతో పరిశ్రమతో దీనిని రచించినారు. చరిత్రకందినమట్టుకు స్వపర దేశములకు సంబంధించిన స్వాతంత్ర్యచరిత్రను తల్లక్షణకారణములును సంక్షేపముగ వివరింపబడినవి. ఆంధ్రవీరులగు డా॥ పట్టాభిగారి పీఠిక యుత్సాహావర్ధకముగనున్నది. రాజకీయములు దెలిసికొనవలయునన్నచో ప్రథమపుస్తకమిదియనవచ్చును. ఈ పుస్తకము బాగుగా ప్రచారమునందుచున్నదని తెలియుచున్నది.

**చంద్రవంశజుల చరిత్ర:**—కర్త; టి. ఎ. ఆగయ్యావర్మగారు, పుటలు షుమారు, ౩౬౦, వెల రు ౨-౦-౦, దొరకుచోటు బూచ పాపయ్యగారి వీరయ్యశ్రేష్ఠి, బట్టలదుకాణం పత్తర్ గట్టి హైదరాబాదు. గ్రంథకర్తగారు విశేషముగ బరిశ్రమించినట్లుదానియాకారమే చెప్పుచున్నది. దీనికి 'వాహినీపతి వంశజుల చరిత్ర'యను నామాంతరమునుగలదు. పుస్తకము అట్టపైని ఆవరణపత్రముమీద "ఇందు బ్రాహ్మణ విశ్వబ్రాహ్మణ, సూర్యవంశ క్షత్రియ వైశ్య చాత్తాద వైష్ణవ ముదిరాజ యాదవ కురువ పద్మశాలీయ దరిజీవ గవండ్ల పాకనాటి పంటపత్తి మున్నూరుకాపు కమ్మ తోట చిట్టిపుకాపు మొదలైన వారి వంశోత్పత్తి చరిత్రాధారములతో సప్రమాణముగ నిరూపింపబడినది." అని ముద్రింపబడిన సూచనను జూచి చాల సంభ్రమముతో గ్రంథము సాంతముగా జదివితిమిగాని సంపూర్ణముగ నిరాశగలిగి నందు

లకు మా దురదృష్టమును విమర్శింప నవసరముండదు. గ్రంథకర్తగారు గొప్పగా పరిశ్రమించినమాట నిజమే కాని, అది యంతయు అస్థాన ప్రయత్నమని మనవి చేయుచున్నాము. కొండ త్రవ్వబడుట యటుండ నిండు, ఎలుక యైనను లభించలేదు. మున్నూరుకాపుల చరిత్రను పరిశోధించుట ముఖ్యమై యుండగా "బావులు, చెరువులు, సముద్రములు, ఆంధ్రాక్షరములు చాళుక్యులు, కాకతీయులు, ఆంధ్రదేశము" మున్నగు యప్రస్తుత విషయముల కొరకే విశేషభాగము వినియోగింపబడినది. పైగా నావిషయములన్నియు జర్వితచర్వణము. ఒక్క జాతివిషయ మైనను నిష్కర్షగా సప్రమాణముగ నిరూపింపబడలేదు. "మున్నూరు కాపు" లేక 'మున్నీరుకాపు' శబ్దమునకు తమిళభాషలోని "మున్నూరు వెళ్ళాళమై" శబ్దముగాని సంస్కృతములోని వాహినీపతి శబ్దముగాని పర్యాయముగ స్థిరీకరింప బడవలయు నను వారి తలంపు సఫలము కాలేదు. లోకమునగల రాజవంశము లన్నియు మున్నీరుకాపు వంశము నకు నంటగట్టవలయు నన్నచో నికముందు భగీరథ ప్రయత్నముతో సాధ్యమగునేమో కాని ప్రస్తుత గ్రంథము చాలియుండలేదు. ఇట్లని మున్నీరు సోదరులనుగూర్చి మాకునుదాసీనత గలదని భావింపగూడదు. వారి పరిశుద్ధమగు చరిత్రను, అభ్యుదయమును గోరుటలో మేమగ్ర దూతలము. శ్రీ ఆగయ్యగారు చాల నిపుణులని వినుచున్నాము. వారింకను పరిశ్రమించి సంగ్రహాత్మకముగ సప్రమాణమైన చరిత్రను ప్రకటించి సమాజమునకు నుపకారమొనర్ప గోరుచున్నాము.

"రా జ హం స"

---

## వి షా ద వా ర్త

సుప్రసిద్ధ సనాతన ధర్మాభిమానులును, సదాచారపరులును నగు విశాఖపట్నం నివాసులు

**పండిత శ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారు**

ఇదే నెల 21వ తేది పరమపదము నందిరని తెలిసి విచారపడుచు వీరి కుటుంబముతో సానుభూతిని ప్రకటించుచున్నాము?

---



# విభూతి వీథి

## విభూతి ప్రథమ సంచిక

పరమేశ్వరానుగ్రహమున గత మహాశివరాత్రిని మేము భావించి నటులే సకాలమునకు విభూతి ప్రథమసంచికను ప్రచురించగలిగినందులకు సంతసించుచున్నాము. గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా యలమందాచల శ్రీ కోటీశ్వరస్వామిమహాక్షేత్రమున చేబ్రోలు బృహన్మఠాధ్యక్ష ష॥ బ్ర॥ శ్రీ ముమ్మడిసిద్ధశంభుస్వాములవారి పవిత్ర కరకమలములతో నీ ప్రథమ సంచికకు ప్రారంభోత్సవము నెరవేరుట మరియును శుభసూచకము. మా ప్రథమ సంచికను స్వీకరించి తమ సదభిప్రాయమును వెల్లడించి ప్రోత్సహించిన ఆంధ్ర కవి పండిత మహాజనులకును పత్రికలకును, మరియు విశేషముగ, మా కరపత్రములను, వార్తలను, ప్రకటనలను ఔదార్యముతో ప్రకటించిన 'గోలకొండ,' 'ఆంధ్రవాణి' 'దివ్యవాణి' పశుసంరక్షిణి' 'హైదరాబాద్, బుల్లెటిన్' 'డక్కన్ క్రానికల్' మున్నగు పత్రికలకును తత్సంపాదకాధికారులకును కృతజ్ఞులము.

గతసంచికలోని సంపాదకీయములో నిజాంరాష్ట్ర ఆంధ్ర పత్రికలంగూర్చి వ్రాయు సందర్భమున 'దివ్యవాణి' యను వారపత్రికా నామమును (సుపరిచితమై యున్నను) విస్మరించినందులకు చింతిలుచున్నాము. పూర్వము 'శైవమణి' 'దక్కన్ కేసరి' యను మాసపత్రికలును ఉండెడివట. ప్రస్తుతము నిజాం ప్రభుత్వమువారి 'మద్యపాన నిరోధము'అను ఆంధ్ర మాసపత్రికయు "సందేశ"మను మరొక క్రొత్త వారపత్రికయు వెలువడుచున్నట్లు తెలిసినది. అయినను నిజామాంధ్ర మాసపత్రికలో మా 'విభూతి', సార్వజనీనముగ విశేషస్థాన మాక్రమించుచున్నదని పాఠకులకు సువిదితము.

## సూచనలు

పత్రికలోని సామగ్రిని అందరు ప్రశంసించి యున్నారుకాని ఆకారము మాత్రము ఇంకకొంచెము పెద్దదిగా నుండవలెనని కొందరనుచున్నారు. ప్రస్తుత పరిస్థితినిబట్టి కనీసము ఒక సంవత్సరము లేక ఆరుమాసముల దనుక నైనను ఆకారము మార్చుటకు వీలులేదు. చందాదారుల తక్కువగానే యున్నది. కావున, ఇంక నెక్కువ పుటలను జేర్చుటయు సాధ్యముకాదు. లేఖకులు, పాఠకులు, దాతలు, మిక్కిలి యభిమానముతో తమ తమ కర్తవ్యములను చక్కగ నిర్వహించినచో 'విభూతి' యింకను నవ్యభవ్య కళలతో విరాజిల్ల గలదని మనవి. సంపాదకులు శక్తివంచనలేక పాటుపడుచుందురనుటను విశ్వసింతురుగాక!—పత్రిక ఇకముందు ప్రతి ఇంగ్లీషునెల 22 వ తేదిని వెలువడవలసి యున్నది కావున, వ్యాసకర్తలు ఇంగ్లీషునెల మొదటివారములోపుగా మాకు నందునట్లు వ్యాసములను బంపుదురుగాక!

---

## ద్రవ్య దాతలు

గతసంచికలో నిదివరకు తమ వాగ్దానముల బంపిన మహనీయుల నామధేయములను బ్రకటించితిమి. ఈ నెలలో లభించిన సహాయమును వారి పేరులను ఇందు కృతజ్ఞతతో ప్రచురించుచున్నాము.

| రూ | | పేరు | ఊరు |
|---|---|---|---|
| ౧౦౦ | శ్రీ | చుక్కా శనగల కోటివీరయ్యగారు | కొర్రపాడు |
| ౨౦ | ,, | నేలవల్లి బాలకోటయ్యగారి కుమా॥ కోటివీరయ్యగారు | నర్సారావుపేట |
| ౨౦ | ,, | కుంకులగుంట సంగయ్యగారు | ఆల్లూరివారిపాలెం |
| ౧౫ | ,, | చుక్కా కోటివీరయ్యగారు గ్రామ మునసబు | కొర్రపాడు |
| ౧౦ | ,, | చుక్కా కోటివీరనాగయ్యగారు | రేపల్లె |
| ౫ | ,, | పెంజెండ్రికోటివీరయ్యగారు | నర్సారావుపేట |
| ౫ | ,, | చుక్కా కబ్బయ్యగారు | డిటో |
| ౫ | ,, | నేలవల్లి కోటివీరయ్యగారు | డిటో |
| ౫ | ,, | పిడపర్తి చినఅమరయ్యగారు | కనగాల |
| ౫ | ,, | చిలువూరి నాగయ్యగారి కుమా॥ మల్లయ్యగారు | పెనుమోలు |
| ౫ | ,, | బూసా కోటినాగయ్యగారు | లింగంగుంట |

## రావలసిన చందాలు

మా పత్రిక గ్రంథమాల ప్రెస్సు, మున్నగు వానికై ప్రయత్నములు చా కాలమునుండియే జరుగుచున్నవి. ఆప్రకారము ఉదారమహాశయులు చాల న్యుత్సా ముతో తమ తమ సహాయములను వాగ్దానము చేసియుండిరి. కొందరు త్వర పంపించినారు. కాని ఇంకను ఎక్కువమంది రేపుమాపనియును శర్మగారు యింటికి రావలెననియును మున్నగు ప్రతిబంధకముల జెప్పుచు నాలస్యము జే చున్నారు. మునుపటివలెగాక ప్రస్తుతము పత్రిక వెలువడుచుండుటచే ప్రతిమా మునను మిక్కిలి వ్యయప్రయాసలు గలుగుచున్నవను సంగతి వ్రాయనవసరముండ ఇప్పటికే చాల కాలయాపనమైనది. త్వరగా నందరు పరస్పరముగ బ్రోత్సహిం కొనుచు సహాయమును జెల్లించి యుపకరించగోరుచున్నాము. మరియు పత్రిక ప్రచారమొనర్చుటయు తమ కర్తవ్యమని యందరికి దెలిసియే యున్నది. ఇం సహాయమును పంపించవలసినవారి పేరుల నీక్రింద ప్రచురించుచున్నాము.

| | | | |
|---|---|---|---|
| ౨౦౦ | శ్రీ | శ్రీ ముమ్మడి సిద్ధశంభు స్వాములవారు | చేబ్రో |
| ౨౨౫ | శ్రీ | చదువుల పరదేశయ్యగారు | డిటో |
| ౨౫ | ,, | బెల్లముకొండ బాలకోటయ్యగారు | డిటో |
| ౫ | ,, | చిలువూరు శంకరయ్యగారు | డిటో |
| ౦౦ | ,, | కుంకులగుంట సంగయ్యగారి కుమా॥ బసవయ్యగారు | నరసారావుపే |
| ౩౦ | ,, | నేలపల్లి బాలకోటయ్యగారి కుమా॥ కోటివీరయ్యగారు | డిటో |
| ౫ | ,, | నేలవల్లి మహానంది వీరయ్యగారు | డిటో |
| ౧౦ | ,, | నేలవల్లి నాగయ్యగారు | డిటో |
| ౫ | ,, | నేలవల్లి కోటివీరయ్యగారు | డిటో |
| ౫ | ,, | బూసా కోటినాగయ్యగారు | డిటో |
| ౧౦ | ,, | నేలవల్లి మల్లికార్జునుడుగారు | డిటో |
| ౫ | ,, | బొందెలపాటి కోటయ్యగారు | డిటో |
| ౫ | ,, | { చందనము కోటయ్యగారు<br>బొందెలపాటి శివయ్యగారు } | డిటో |
| ౫ | ,, | చుక్కా కబ్బయ్యగారు | నర్సారావుపేట |
| ౧౦౦ | ,, | చుక్కా శనగల వీరయ్యగారు | కొర్రపాడు |
| ౧౦ | ,, | చుక్కా కోటివీరయ్యగారు గ్రామమునసబు | డిటో |
| ౧౦ | ,, | చుక్కా బుచ్చయ్యగారి కుమా॥ బసవకోటయ్యగారు | డిటో |
| ౧౦ | ,, | నేలవల్లి గురుపాదముగారు | డిటో |
| ౫ | ,, | కొలగాని చెన్న బసవయ్యగారు | డిటో |
| ౫ | ,, | చుక్కా పాపయ్యగారు | డిటో |
| ౫ | ,, | చుక్కా చిన పిచ్చయ్యగారు వగైరాలు | డిటో |

| | | | |
|---|---|---|---|
| ౧౦౦ | శ్రీ | శ్రీఘంటామఠం శాంత మల్లికార్జునస్వాములు | చింతలచెర్వు |
| ౫౬ | ,, | { కుంచాల బాలనాగయ్యగారు | కనగాల |
| | | { పాలకొల్లు చెన్నబసవయ్యగారు | డిటో |
| ౬౦ | ,, | రాచంశెట్టి లింగయ్యగారు వగైరాలు | డిటో |
| ౨౦ | ,, | నేలవల్లి కోటినాగయ్యగారు | డిటో |
| ౨౦ | ,, | చుక్కా నాగయ్యగారు | డిటో |
| ౨౦ | ,, | చుక్కా కోటయ్యగారు | డిటో |
| ౨౦ | ,, | చదువుల వీరనాగయ్యగారు | డిటో |
| ౨౦ | ,, | ధూపం కోటినాగమ్మగారు | డిటో |
| ౧౬ | ,, | శెట్టిభక్తుని కోటివీరయ్యగారు | డిటో |
| ౧౬ | ,, | పాలకొల్లు కోటయ్యగారు | డిటో |
| ౧౬ | ,, | పాలకొల్లు కోటివీరయ్యగారు వగైరాలు | డిటో |
| ౧౦ | ,, | నేలవల్లి బసవయ్యగారు | డిటో |
| ౫ | ,, | పాలకొల్లు కోటినాగయ్యగారు | డిటో |
| ౭ | ,, | ద్రోణాదుల కోటివీరయ్యగారు | డిటో |
| ౫ | ,, | ధూపం భ్రమరాంబగారు | డిటో |
| ౫ | ,, | పెదవర్తి చిన అమరయ్యగారు | డిటో |
| ౨ | ,, | శెట్టిభక్తుని కోటయ్యగారు | డిటో |
| ౨౫ | ,, | బెళిగిన కోటినాగయ్యగారు | నాదెళ్ళ |
| ౧౫ | ,, | మఠం మల్లయ్యగారు | మక్తపేట |
| ౧౦ | ,, | కుంచాల కోటయ్యగారు | రేపల్లె |
| ౨౦ | ,, | ధూపంకోటి వీరయ్యగారు | తెనాలి |
| ౫ | ,, | కుందులగుంట బసవయ్యగారు | డిటో |
| ౫ | ,, | చుక్కా పిచ్చయ్యగారు | డిటో |
| ౨౦ | ,, | కాజ గోకర్ణయ్యగారు | చిలువూరు |
| ౧౦ | ,, | కుందనాల కోటివీరయ్యగారు | డిటో |
| ౧౫ | ,, | చిలువూరి కోటినాగయ్యగారు | డిటో |
| ౩ | ,, | చిలువూరి సోమనాగయ్యగారు | డిటో |
| [illegible] | ,, | కంచెర్ల నాగయ్యగారు | డిటో |
| ౧౦ | ,, | చిలువూరి కుమారబసవయ్యగారు | డిటో |
| ౧౦ | ,, | గురవింకొండబసవమ్మ కంచెర్ల భ్రమరాంబగార్లు | డిటో |
| ౧౦ | ,, | చిలువూరి అంబమ్మగారు | డిటో |
| ౪౦ | ,, | నేలవల్లి గురుపాదముగారు | పెనుమోలు |
| ౫ | ,, | చదువుల పిచ్చయ్యగారు | డిటో |
| ౫ | ,, | చిలువూరి శంకరయ్యగారు | డిటో |

| | | |
|---|---|---|
| ౫ | శ్రీ | అందెల కోటినాగయ్యగారు |
| ౧౦ | ,, | పిడపర్తి పిచ్చయ్యగారు |
| ౧౦ | ,, | పిడపర్తి చినరామలింగయ్యగారు |
| ౧౦ | ,, | చిలుకూరి కోటినాగయ్యగారు |
| ౫ | ,, | పిడపర్తి కోటయ్యగారు |
| ౨౫ | ,, | గురప్రింకొండ కుమారస్వామిగారు |
| ౫ | ,, | బెందులూరి కోటినాగయ్యగారు |
| ౫ | ,, | కంచెర్ల శంభుదేవరగారు |
| ౫ | ,, | పుసులూరి నందయ్యగారు |
| ౨౫ | ,, | అందెల సోమయ్యగారు |
| ౨౫ | ,, | అందెల కోటివీరయ్యగారు |
| ౫౦ | ,, | పులకంటి సంగనబసవయ్యగారు |
| ౫ | ,, | ధూపం సంగయ్యగారు |
| ౨౫ | ,, | అందెల లింగయ్యగారు |
| ౨౫ | ,, | చిలుకూరి వీరనాగయ్యగారు |
| ౨౫ | ,, | యల్లమిల్లి చెన్నమల్లయ్యగారు |
| ౫ | ,, | సజ్జల నాగభూషణ దేవరగారు |
| ౫ | ,, | చదువుల కోటయ్యగారు |
| ౫ | ,, | మారుజోళ్ళ నాగమల్లయ్యగారు |
| ౫౦ | ,, | చక్కెర శ్రీగిరయ్యగారు |
| ౧౫ | ,, | చదువుల కోటినాగయ్యగారు |
| ౫ | ,, | చదువుల కోటివీరయ్యగారు |
| ౫౦౦ | ,, | దొడ్డ కోటయ్యగారి వీరన్నగారు |
| ౧౦౦ | ,, | నడిపూడి భవానయ్యగారు |
| ౧౦౦ | ,, | కురువమఠం నీలకంఠయ్యగారు |
| ౨౫ | ,, | కోమటిమఠం నాగేంద్రయ్యగారు |
| ౨౫ | ,, | ఖార్గుపల్లిమఠం శంకరయ్యగారు |
| ౧౦ | ,, | రామకొండ సోమయ్యగారు |

మనియార్డరు పంపవలసినచోటు—

మేనేజరు—"విభూతి"

౪౨౩౮ సజ్జలాల్ వీథి, సికింద్రాబాదు దక్క[ను]

౧౩

ఢిట
గుడాచలపా
ఢిట
ఢిట
పోలవ
చిల్కలూరిపే
అచ్చమ్మపే
మన్నెసుల్తాన్ పాలె
ఢిట
నిడనవో
క్రిష్టపా
వల్లూరిపాలె
దేవరప
భగ్గేశ్వర
ఢిట
ఢిట
ఢిట
ఢిట
ఢిట
దాసుల్లకొడవి
నరసాపుర
ఢిట
నల్లగొం
చేర్యా
కొలనుపా
ఢిట
ఢిట
ఢిట



శ్రీజగద్గురు రేణుకాచార్యులవారిచే
శ్రీ శంకరాచార్యులవారికి చంద్రమౌళీశ్వర లింగప్రదానము.



శ్రీ రంభాపురీ (బాళేహళ్ళి) వీరసింహాసనాధీశ్వరులగు
జగద్గురు శ్రీ శివానంద రాజదేశికేంద్ర శివాచార్య
మహాస్వాములవారు.



సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక


పుంఢ్రము ౧ | సికింద్రాబాదు
శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి
జ్యేష్ఠము | రేఖ ౪


# పట్టప్రదానము

వ్యాకరణశిరోమణి సి. హెచ్. రంగాచార్యులుగారు

మ. విపులాంధ్రావని నోరుగల్లు నెగడున్ విఖ్యాతవీర్యప్రభల్
వపువుం దాల్చినయట్టివాడ, సిరియున్ వాగ్దేవి మోదించి, యే
నెపము ల్లేక వసించు చోటు, సుకళానిర్హారికిం దావు, వై
రిపురీదాహకశక్తి కిక్కయయి, గౌరీనాథు ప్రోలుంబలెన్.

సీ. తెలుఁగుడెందము లోతుఁ దెలివిడు లివి నాఁ, న
గాధములైన యగడ్తలెచట
తెలుఁగుగట్టిదనమ్ముఁ దెలుపు మచ్చు లనంగ
గుండె లదరు కోటగోడ లెచట
తెలుఁగుభావగరిమ వెలుఁగొందు నిట్లు నా
విశదంబులగు రాజవీథు లెచట

తెలుఁగునొప్పదనంబు తొలినుండి యిల్లె నా
మిన్నుమన్నుగఁ జేయు మేడ లెచట

గీ. అద్ది తెలుఁగుకళాలత లారవిచ్చి
సౌరభంబులనింపిన సారభూమి
యాంధ్రసంస్కృతి తాండవ మందుచోటు
చారువిభవంబుతో నొప్పు నోరుగల్లు.

చ. ఒకయెడఁ దెల్గుశిల్పి మహిమోన్నతి మూకవిశాలభాషలోఁ
గకవిక లట్లు గీతికల గానముఁజేసెడి దేవళంబు లిం
కొకదిశ పిల్లజోదులకు నొల్లన నాహవశిక్ష నిచ్చు సం
ప్రకటితశస్త్రశాలలును రాజిలు నా పురి వేనవేలుగన్.

క. అప్పురి యంగడివీథుల
చొప్పరసిన నచటిమణులఁ జూచిన మటియే
బొప్పయుఁ దెలియఁడె? సందరిము
నప్పులపతి యనుట కుండునట్టి కతంబున్.

ఉ. ఈ విధి సర్వసంపదల కిల్లయి యింపులనింపు కాకతి
క్ష్మావిభురాజధాని, ఘనసారవినిర్జితభూమిజాని, సం
భావితరీతి, నాఁడు బహుభంగుల మోదము దేరి యుండె, నాఁ
డే విన నుండుట న్నరసురేశ్వరకీర్తి మహాప్రబంధమున్.

క. తమతమ పనులను చటచట
సమకూరుచుకొనుచు వికచసారసనేత్రల్
సుమహస్తలగుచు నిల్చిరి
తమకంబున నుత్సవంబు దగ నీక్షింపన్.

గీ. అపుడు మోసాలపై మ్రోగె నాలుగడియ
లవనినాథుని సౌధవాద్యంబు గీతి
శ్రుతులఁ గలిపెను జనఘోషతతులతోడ
సర్వసన్నాహ మయ్యె నుత్సవమువేళ.

సీ. జయజ్జయారావముల్ చదలుముట్టుచునుండ
మండలేశ్వరులు ముందుండి కొలువ
సకలసేనానాథ సాహిణిసోమన్న
వజ్రికవచమ్మయి వరలుచుండ
గన్నమనాయక ఖడ్గసంవాసిని
జయలక్ష్మి యారతి సంతరింప
నుక్కుతునకలైన యురువీరముష్టులు
కత్తులతోరణా లెత్తి కట్ట

తే. వివిధసామంత రాజన్య వీక్షణాబ్జ
పాళిచరణపూజ సలుప బయలువెడలె
కాకతీశ్వరచలమర్తిగండనృపతి
శ్రీప్రతాపరుద్రావనీశేఖరుండు.

సీ. సిగపూవువాడక శ్రీశుత్రితు లెవ్వాని
ధర్మపీఠికనుండి తగవు దీర్చు
పరిణతకవిరాజవాగ్లత లెవ్వాని
పొలమునఁ దొలి మలి పూతఁ బూయు
శిలల వలలుగొల్పు శిల్పన మెవ్వాని
పెరటినిధులఁ బైకి పెళ్ళగించు
మడిమ దిర్గని జోదు నడిదంబు లెవ్వాని
ధరణిపై నాణిముత్యాల నీను

తే. గీ. నతఁడు వేంచేసె నచ్చటి కాంధ్రజనస
మార్జితబహుసుకృతఫల మవనిభర్త
విమతరాజన్యకుల మహావిలయకర్త
రుద్రసమకీర్తి కాకతి రుద్రమూర్తి.

మ. మును మాహేశుల దీవనల్ వడసి యా భూభర్త వందారులా
, తన సంతానముబోని కూర్మిప్రజలఁ దన్నీభవత్పాణితో

మనసారంగను సైగ చేసి కవిసామ్రాజ్యాధినేతన్ మహా
ఘను వీరేశు నగస్త్యు బండితవరుం గన్సన్నలం బిల్చెదన్.

సీ. చిఱునవ్వు వెన్నెల చిలకరింపులతోడ
విశదఫాలవిభూతి వియ్యమొంద
మకరకుండలరత్న మంజురాగముతోడఁ
గాశ్మీరశాలువు గలసిపోవ
సింహాలలాటాగ్రసీత్కారములతోడఁ
గరనఖకాంతులు కయ్యమాడఁ
బసిమిమించినమేని పసదొంతరలతోడఁ
జందనచర్చలు చర్చసేయ

తే. గీ. సహజగాంభీర్యసంపత్తిసరణితోడ
రాజగౌరవభావంబు రాణ మెఱయ
విద్య రూపొంది యీమాడ్కి వెడలె ననఁగ
నవనినాథుని డాసె నా యవనిసురుఁడు.

మ. అటు డాయంగనువచ్చుఁ బండితు, విభుండానందమేపారఁ జెం
గటకుందీసి, ప్రియంబులాడి, సుకవీ! కర్పూరపూరంబు, త్వ
త్పటువాక్సారమదేల? పూర్వనృపతిప్రఖ్యాతవృత్తక్రియా
ఘటితంబై యలరార కిట్లు మలసెం గాంక్షించి మాబోంట్లపై.

గీ. అనిన చిఱునవ్వుతో ననె నా కవీంద్రుఁ
డరయ వాల్మీకి వ్యాసు లా యాదికవులు
నేఁడు కఱవయిరే కాని, నిర్మలాత్మ!
రామధర్మజులను మించు రాజు లేఁడె?

మ. అన రాజేంద్రుఁడు నవ్వి కేలుగొని పాన్నాందోళికం జేర్చ, నా
ఘనుఁ డా భూసురశేఖరుండు మెఱసెం గైలాసభూభృత్థలీ
కనదీశానసమానకాంతియుతుఁడై, కావ్యోజ్జ్వలత్పాణియై
జనతాగీతయశస్కుఁడై స్మితరుచుల్ సంధిల్ల నప్పట్టునన్.

"స్వామిద్రోహరగండ" సాహిణిగుండయ
వీరభద్రుల ముందు నెలయుచుండ
సైంధవాధ్యక్షుండు సాహిణీమారయ
హయబృందముల ముందు హొయలు మెఱప
నవలక్షకోదండనాథుఁడన్నయమంత్రి
సింధురంబుల ముందు చెన్నుగులుక
సకలసేనాపతి సాహిణిసోమయ్య
నీడయై వెంటన నిలిచియుండ

గీ. సచివశేఖరశివమంత్రి సన్నుతింప
వివిధవాద్యనినాదముల్ వేడ్కనింప
నందలముతోడఁ గవిరాజునందనుండి
మేదినీపతి పుర మేగె మిగుల దీప్తి.

సీ. జయ కాకతీశ్వర చలమర్తిగండ
జయ భువనతిమిరచండమార్తాండ
జయ రుద్రసమతేజ జయ వీరభద్ర
జయ వరాహధ్వజ సంచితముద్ర
జయ ముమ్మడాంబికాసత్తపఃఫలమ
జయ త్రిలిఙ్గాధ్యక్ష జయ సార్వభౌమ
జయ కీర్తికన్యకాసరసహృత్కామ
జయ వీరరాహుత్తజలనిధిసోమ
జయ వేదమతపునస్థాపనాచార్య!
జయ కళాపోషణ సత్కార్యధుర్య!

క. ఇటు ధాటీపంచకముల
పటుకంఠధ్వనులు చెలఁగ పదపడి భేరీ
పటలము మొరయఁగ మెరవణి
మెటకేలకు బయలుదేరె వీథుల వెంటన్.

గీ. స్వర్గ నింటింట నారతుల్ పట్టుచుండ
మురువుదనరెడు మగువలు పూలు గుప్ప
క త్తిసాములు వీరు లుగ్రతను సల్పఁ
గ్రమముగా ముఖ్యవీథులఁ గడచి తేని
చిత్రకూటము మెరవణి చేరె నంత.

గీ. ఉరుసభాస్థలిఁ బ్రిజలు గ్రిక్కిరిసి నిలువ
వేత్రహస్తులు నృపసభావిధులఁ దెలుప
దోసిలొగ్గుచు నరపతుల్ దొలఁగియుండఁ
గాకతీశుఁడు వేంచేసెఁ గవులతోడ.

గీ. సముచితస్థానములఁ గవీశ్వరుల నునిచి
పరమమాహేశ్వరాజ్ఞతో భద్రపీఠి
నింపుమెఱసె సుధర్మలో నిందుమాడ్కి
నాంధ్రభూనేత, యంతట ననియె మంత్రి.

మ. కవులున్నారలు వేనవే లుబుసుపోకం జెత్తలం గేకఁగా
భువి తాటాకులఁ బాడుసేయ విసువుంబుట్టింపఁగాఁ గాకథల్
కవితాకాంచనవారిఁ బోసి పొదుపంగా లాభమా వారితోఁ
జవులూరన్ దనజాతివీరచరితల్ శ్లాఘింపలే కుండుటన్.

గీ. వీరచరితంబులే గాన భారతాదు
లవని నిమ్మాడ్కి మన్నన లందుచుంట
నాంధ్రతేజము కాలమం దణఁగిపోక
వాఙ్మయంబున బింబించి వఱలు నేఁడు.

గీ. క త్తి ఘంటము లను రెంట ఘనుఁడితండు
రాజకార్యధురీణుఁడై రహి వహించు
నాంధ్రశౌర్యము. భువనము లావరింప
దేవభాషను జిత్రించె దివ్యశైలి.

గీ. తేనెలొలికించుఁ గవిచంద్రు తేఁటపలుకు
కన్ను లారఁగఁ గాంచిన కాకతీంద్రు

వీరచరితంబు వీనులవిందుగాఁగ
వినుఁడు సుదినంబుగద నేఁడు విజ్ఞులార!

అని శివదేవమంత్రి కవియాననముం దిలకింప సభ్యులా
నని కరతాళికాధ్వను లవారిగఁజేయఁగ తేనిమోముఁద
మ్మిని బిడియంపుఁజిన్నెలును మెల్లఁగఁ జేర నగస్త్యపండితేం
ద్రినవవలాహకం బమృతధారలఁ గోరిలఁగఁజేసె నివ్విధిన్.

శా. విద్యాకైరవకౌముదీం శ్రుతిశిరస్సీమ స్తముక్తామణిం
దారాన్ పద్మభువస్త్రిలోకజననీం వన్దే గిరాం దేవతాం
యత్పాదాబ్జనమస్క్రియాస్సుకృతినాం సారస్వతప్రక్రియా
బీజన్యాసభువో భవంతి కవితానాట్యైకజీవాతవః.

శా. వాణీవందన మాదియౌ కవిసుధావాగ్వీచికల్ శ్రోతృహృ
ద్వీణాతంత్రుల మీటి మూర్ఛనలలోఁ దేలింప నుప్పొంగు నా
క్షోణీనాథు సభాంతరంబు మిగులన్ జూపట్టె వైజ్ఞానిక
శ్రేణిక్ ముఖ్యుఁడెవండొ తీర్చెననఁగన్ జితాక్రుతిన్ జిత్రమై.

గీ. కాకతీశుఁడు సంతోషగరిమఁ దెలుప
నాసనంబును డిగి యా యవనిసురుని
పాదమునఁ దానె తొడిగెను బచ్చలుండు
గండపెండేరమును మఱి కౌఁగిలించి.

క. ఘనమగు "విద్యానాథుం"
డను బిరుదమునిచ్చె వేడ్క నప్పుడు జేజే
నినదము దిక్కుల నిండెను
తెనుఁగుల హృద్వీథి నొక్క తేజము మెఱసెన్.



# నన్నెచోడుని కాలము

బండారు తమ్మయ్యగారు

ఉ. తేజును జానుతెన్గునుడి తీరును, సంస్కృతసూక్తిబంధముక్త
రాజిలు కల్పనామలును గ్రాలఁగ శ్రీగురు పాదపద్మమం
దోజఁ గుమారసంభవసముజ్జ్వలకావ్యముఁ బూన్చు సద్గుణ
భ్రాజిని నన్నెచోడకవిరాజశిఖామణి సంస్మరించెదన్.

ఆంధ్రభాషాదేవి కమూల్యభూషణములయి వెలసిన కృతిరత్నములలో చో
దిత్య బిరుదాంకితుఁడగు నన్నెచోడ కవిరాజశిఖామణి కుమారసంభవ మొకటి
చెప్పకతప్పదు. ఇది భావమాధుర్యమునకుఁ బరమావధి. అర్థసంపదకుఁ బెన్నిధి. అ
కారముల కాలవాలము. జానుతెన్గునుడి పెక్కువకుఁ జక్కటి. అనల్పకల్పనలకు
కము. వర్ణనాచమత్కారమునకు మహార్ణవము. సరసత్వమునకు నిరుపమాశ్రయము
గుణగణములతో విరాజిలు నీ కావ్యరత్నము చిరకాల మాంధ్రవాఙ్మయ రత్నాకర
మం దడఁగి యుండి నా మిత్త్రులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి ప్రయత్నమున
1910, 1914 సంవత్సరములలో రెండుభాగములుగాఁ బ్రకటింపఁబడినది. ఇంతకా
మీ మహాకావ్యము విస్మృతమగుటకు ముఖ్యకారణ మాంధ్రదేశమున
రాను శైవమతవాఙ్మయముల దెసఁ బ్రబలిన నిరాదరణమని చెప్పవచ్చు
నన్నెచోడుఁడు శైవుఁడు. శివకవులు పలువురువలె నీతండు తన కా
మునఁ దనముందు వెలసిన యాంధ్రకవులను బేర్కొనఁడయ్యెను. ఇతని త
వాత వెలసిన శివకవులు గాని, కొందరు లక్షణకవులు తప్పఁ దదితరక
గాని యితనినిఁగూడఁ దమకావ్యములం దేకారణముననో పేర్కొనరయిరి. ఇ
కావ్యమును జదివి యీతనివర్ణనల ననుకరించినట్లు కానవగు జక్కన, పిం
సూరన, తెనాలి రామకృష్ణుఁడు మున్నగు నాంధ్రకవులుఁగూడ నీతనిఁ బేర్క
కుండుట యాశ్చర్యము. ఇందుచే నీ కవివర్యుని కాలము పలుసందియముల
మిచ్చుచు నిస్సంశయముగ నిర్ణయమగు నవకాశ మొసంగక యిప్పటికిఁగూడ నాం
వాఙ్మయ రంగమున వివాదగ్రస్తముగనే యున్నది.

చ. సరళముగాఁగ భావములు జానుతెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థములొత్తిగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వ రసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగన్.

అని నన్నెచోడుఁడు తన కావ్యమును బ్రశంసించుకొనినను దానియం దెచ్చటఁ గాని యిప్పుడు వాడుకనుండి వెడలిపోయిన ప్రాచీనపదములను రూపములను ద్రావిడ కర్ణాటభాషాపదములను నెక్కువగఁ బ్రయోగించియున్నాఁడు. ఇట్టి పదములను బట్టియు, అథర్వణప్రోక్తమని వినవచ్చు—

క. మగణమ్మ గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్కమండ్రు, మఱియఁడె
యగునని యిడి తొల్లి టెంకణాదిత్యుఁ డనిన్.

అను పద్యమును బట్టియు నన్నెచోడుఁ డాంధ్రవాఙ్మయమున నాదికవియని సామాన్యముగఁ దలంపఁబడు నన్నయ భట్టారకున కంటెఁ బ్రాచీనుఁడనియుఁ బదియవ శతాబ్దియందు వెలసి క్రీ॥ శ॥ 940 వ సంవత్సరములోఁ బాశ్చాత్యచాళుక్యులతోఁ బోరాడి రణరంగమున నిహతుఁడయ్యెననియు శ్రీ రామకృష్ణకవిగారు తమకుఁ దోఁచిన యుపపత్తులతో గ్రంథమునకుఁ దాము రచించిన పీఠికలోఁ దమ యభిప్రాయమునుఁ బ్రకటించిరి. అందుపయి నీ యూహను ఖండించుచు ననేకవాదోపవాదములు బయలు దేఱెను. క్రీ. శ. 940 వ సంవత్సరమున నన్నెచోడుఁడు యుద్ధమున నిహతుఁడయ్యెనని వ్రాయుటయే గాని యందుకుఁ దగిన శాసనాద్యాధారములు వేనిని రామకృష్ణకవి గారు ప్రకటింపరయిరి. గ్రంథావతారికలో నన్నెచోడుఁడు తన తండ్రి "పాకనాటి యం దిరువదియొక్క వేయిటి కధీశుఁడు" అగు చోడబల్లియనియు, తల్లి "హైహయాన్వయాంబర శశిరేఖ" యైన శ్రీసతియనియుఁ జేర్కొని, తాను—

క. కలుపొన్న విరులఁ బెరుఁగం
గలుకోఁడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘు పరాక్రముఁడఁ టెంకణాదిత్యుండన్.

అని వ్రాసికొనినాఁడు. తెలుఁగుచోడులు పాకనాటిని బరిపాలించుచుండఁగాఁ బ్రక్కనున్న పలనాటిని హైహయాన్వయులు పాలించుచుండిరి. ఇరుతెగలవారికి సంబంధ బాంధవ్యములు గలిగియుండెడివి. పలనాటి వీరచరిత్రమున వర్ణితులయిన నలగామరాజు మున్నగువారు హైహయాన్వయులే. తెలుఁగుచోడరాజుల పూర్వులు, పూర్వము దక్షిణదేశమును జయించి "దక్షిణదేశమునకు సూర్యుఁడు" అను నర్థమిచ్చు టెంకణాదిత్య బిరుదమును వహించుచుఁ గావేరీతీరమునఁ గల యొరయూరు రాజధానిగాఁ జాలఁగాలము దక్షిణదేశమును బరిపాలించినట్లు లైతిహ్యములు శాసనాద్యా

ధారములు గూడఁ గలవు. కావున నొరయూరు పురాధిపత్యము, వేంకటాదిత్య
దము మన కవిరాజు కులక్రమాగత మర్యాద ననుసరించి చెప్పికొనినదేగాని సప
సంధివరచనాకాలమునాటి కొత్తఁడు దక్షిణదేశమున నొరయూరు పరిపాలించు
నప్పుడనే గ్రంథమును రచించెననుటకు సాధకములు కాఁజాలవు. తండ్రి చోడబల్లి తె
దేశమునఁ బాకనాడు పరిపాలింపఁగా నన్నెచోడుఁడు తండ్రిరాజ్యమును గా
దక్షిణదేశమును పాలించెననుట సంగతముకానేరదు. కావున నన్నెచోడుఁడు నా
తండ్రి చోడబల్లియుఁ బాకనాడు పరిపాలించిన తెలుఁగు చోడుల సంతతివారన
కెట్టి సంశయమును లేదు. ఈ తెలుఁగు చోడుల శాసనములు చాల దొరికినవి. వాని
బట్టి చూడఁగా బల్లిచోడుఁడు, చోడబల్లి, నన్నెచోడుఁడు అను పేరులుగలవా
వేర్వేఱు కాలములలోఁ బలువురున్నట్లు తెలియుచున్నది. ఇందుచే నీ శాసనములుకూ
మన నన్నెచోడకవికాలమును నిర్ణయించుటకు సాధనములు కాఁజాలకున్నవి. శ్రీస
భార్యగా నన్నెచోడుఁడు కుమారుఁడుగా నున్న చోడబల్లినిగాని, శ్రీసతి చోడబల్లు
తల్లిదండ్రులుగా నున్న నన్నెచోడునిఁగాని పేర్కొను శాసనము లింతదనుక లభిం
లేదు. నన్నెచోడుఁడు తన కావ్యమును దన గురుఁడయిన జంగమ మల్లికార్జునయో
కంకితమొనర్చి గ్రంథమం దంతట నాతనియెడ ననన్యసామాన్యమగు భక్తిప్రపత్తు
బ్రదర్శించినాఁడు. గ్రంథావతారికయందును, అంకితాంకపద్యములందును నాతని
గూర్చిన విశేషణముల బట్టి యా జంగమ మల్లికార్జునుఁడు బ్రహ్మచారి యనియు
బ్రహ్మర్షియనియు, శమదమాది యమాన్వితుఁడగు పరమతపస్సంపన్నుఁడనియు వ్యక్త
గును. 'కమలభవకులతిల' కేత్యాది విశేషగుణములుగూడ నెడనెడ నాతని విషయుక్తము
లయినవి. కాని యాతని కాలమైనను నిస్సంశయముగ నిర్ణయించుట కుపకరించు
వర్ణనలయం దేమియుఁగానరావు. జంగమశబ్దము కులవాచకముగఁ గాక ప్రాచీ
వాఙ్మయమున, చరలింగ (జీవరూపమునఁ జరించు శివుఁడు = శివభక్తుఁడు) వాచక
ముగ వాడఁబడినట్లు కానవచ్చును - శబ్దమందలి వ్యుత్పత్త్యర్థముకూడ దానినే సూచి
చును. "జం భృశం గచ్ఛతీతి జంగమః" అని మల్లినాథుఁడు. మల్లికార్జున గురునకు
జంగమోపపదమును జేర్చుటలో నన్నెచోడుని భావమిట్టిదేయని యీ క్రిందివచన
ములవలనఁ దెలియనగును.

"సర్వజ్ఞజంగమలింగంబగు మల్లికార్జును సదాకల్యాణుఁ గీర్తించెదన్."
(అ 1. ప 15)

"కావునం బరమ శ్రీనగోత్తుంగమణిశ్రీసంగత మల్లికార్జున దేవతాకం
జగంబులఁ బ్రత్యక్షంబై, పవిత్రతల్లుట జంగమ మల్లికార్జునదేవుండై"
(అ 1. ప 58)

"మనుజాకార మహేశునకు" (ఆ 1. ప 66)

కుమారసంభవమునందలి పద్యములఁబట్టి నన్నెచోడుఁడు నాతని గురుఁడు మల్లికార్జునుఁడు పాశుపతమతప్రవిష్టులని తలంచుట కనేకావకాశము లున్నవి. లకు లీశము, కాలాముఖము మున్నగునవి పాశుపతములోని యవాంతర భేదములు. మహా వ్రతులనికూడఁ గాలాముఖులకు వ్యవహారము గలదు. సురాసంభస్థాపన, మండలార్చ నాదులు కాలాముఖాచారాంగములుగఁ గానవచ్చును. ఈ క్రింది యుదాహరణము లఁ బరికించునది.

మ. హరికంకాలము చేతిముద్ర దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార మంతకతనుక్షారంబు మైపూఁత పం
కరుహాసీను శిరఃకపాల ముఁ భిక్షాపాత్రిగా విశ్వసం
హరు వర్తించు మహావ్రతోపహతి సేయంబూన నీ పాత్రిత్రియే.

అంతనంద కొందఱు మధుపాన గోష్ఠికిం జొచ్చి మండలార్చన దీర్చి మూలజ వృక్షజ గిరుడ మధువిష్ఠ పసుపు వికారంబులగు సుగంధాసవంబులు కనక మణిమయా దీ కనక చషకాదుల న్నించి హర్షించి" (ఆ 9. వ 320)

క్రీస్తు శకము పది పదునొకండు శతాబ్దులం దాంధ్ర దేశమునఁ బాశుపతమతా చార్యులు, కాలాముఖాచార్యులు తూర్పు చాళుక్య రాజులకుఁ దెలుఁగు చోడరాజు లకు గురువులుగానుండి పాశుపత మత వ్యాప్తి యొనర్చుచుండి రనుటకు శాసనా ద్యాధారములు గలవు. తూర్పు చాళుక్యరాజు రెండవ అమ్మరాజు (క్రీ శ 945-970) రాజ్యకాలమున వెలసిన తాడికొండ శాసనము చూచునది (భారతి సం. 15. సం. 8.) కాలాముఖాచార్యులలో సుప్రసిద్ధుఁడు లెపోరాశి శిష్యుఁడునగు మల్లికార్జున యోగి దక్షిణదేశమునఁ గాలాముఖ మతస్థాపన మొనర్చి, క్రీ. శ. 950 ప్రాంతమున నుండిన విక్రమకేసరియను చోడరాజుచేఁ బూజింపఁ బడినట్లు కొడుంబాలూరు శాసనము వలనఁ దెలియు చున్నది. ఈతఁడే కుమారసంభవ కృతిపతియని శ్రీ రామకృష్ణ కవి గారు తలంచిరి. నన్నెచోడుఁడు కూడ నీ కాలమువాఁడని బలవత్ప్రమాణములచే నిర్ణయమయినప్పుడీయూహ చాల సంగతముగానుండునుగాని పుట్టి యాధారములు లేనప్పుడది యదమిత్థమని నిర్ణయింపరాదని నాయభిప్రాయము. మల్లికార్జునుని కాలా ముఖమతము మొదట దక్షిణ దేశమున స్థాపిత మయినను దరువాత నది వనవాసి దేశమందలి బలిగ్రామమునకుఁ దరలింపఁ బడినట్లును, అలంపురి. శ్రీశైలము మున్నగు తావులందుఁగూడఁ దచ్ఛాఖా మతములు నెలకొని నట్లును శ్రీ రామకృష్ణకవిగారే వ్రాసియున్నారు.

కాకతీయగణపతి చక్రవర్తికి సామంతుఁడుగా నుండిన రెండవ మల్లి
చోడుఁడు క్రీ. శ. 1260 ప్రాంతమున వెలయించిన పెదచెఱుకూరు శాసనము
బట్టి యాతని పూర్వులలో నాతని కాఱవ తరమువాఁడగు నన్నెచోడుఁడొకఁడు
నట్లును, ఆనన్నెచోడునితండ్రి చోడబల్లియనియుఁ దెలియుచున్నది. ఈశాసనము
బట్టి యిందుఁ బేర్కొనఁబడిన చోడబల్లి నన్నెచోడులు క్రీ. శ. 1120–11
ప్రాంతమువారగుదురు. మఱియు. క్రీ, శ. 1115 వ సంవత్సరమునఁ గామచోడు
పుత్రులు కన్నరచోడుఁడు చోడబల్లియును సోదరులు వెలయించిన కొప్పవరశాస
మును బట్టి పాలూరు నివాసియు, కాలాముఖ వ్రతస్థుఁడు నగు నొక మల్లికార్జు
యోగివారిచే సంభావితుఁ డయినట్లు కానవచ్చుచున్నది. ఉపలబ్ధములయిన చోడశా
నములలో నివియే నన్నెచోడుని కాలనిర్ణయమునకుఁ గొంత సంగతములుగా నుం
టచే రెండవ మల్లిదేవచోడున కాఱవతరమువాఁడగు నన్నెచోడుఁడే కుమారసంభ
కర్తయై యుండుననియు, కొప్పవరశాసనమున నుదాహృతుఁడయిన మల్లికార్జు
డేతత్కృతిపతియగు జంగమమల్లికార్జునుఁడై యుండుననియుఁ బలువురిప్పుడు తలం
చున్నారు. *కుమారసంభవ కృతిపతి యీ మల్లికార్జున యోగులలో నెవ్వఁడయిన
నాతఁడు తప్పక నన్నెచోడుని సమకాలికుఁడేయని తలంపనవసరము లేదని నాయ
భిప్రాయము. అట్లే నిర్ణయింపవలె ననుటకుఁ దగినన్ని యవకాశములు గ్రంథమునఁ గా
రావు. నన్నెచోడుఁడు తరువాతి కాలమువాఁడయినను సుప్రఖ్యాతుఁడు మొదటి కాలా
ముఖాచార్యుఁడునగు క్రీ. శ. 950 ప్రాంతపు మల్లికార్జునునకే యాతనియందలి భ
గౌరవములచేఁ దనగ్రంథ మంకితమిచ్చియుండునని తలంచుటలో నసంగతమేమియు
నుండరాదు. అద్వైతమతస్థు లెవరైన నేఁడొక గ్రంథమును వ్రాసి యాదిశంకరు
నందలి భక్తిచే దాని నాతని కంకితమీయరాదా! పాల్కురికి సోమనాథుఁడు బస
వేశ్వరునకు సమకాలీనుఁడు గాకున్నను నాతనియందలి భక్తిపారవశ్యముచేఁ ద
పండితారాధ్య చరిత్రము నాతని కంకితమిచ్చియుండెనుగదా! నన్నెచోడుఁడు మల్లి
కార్జును నెడ నుపయోగించిన "అదిమునీశ్వరుండు" (ఆ 2. ప 241) మున్నగువిశేషణ
ములు పైయభిప్రాయమునకు సాధకములు గాకపోవు. శ్రీ వంగూరి సుబ్బారావుగారు
తమ శతకకవులచరిత్రలో బసవేశ్వరునకు సమకాలీనుఁడగు మల్లికార్జున పండితా
రాధ్యుఁడే యీజంగమ మల్లికార్జునుఁడు కాఁగూడదాయని శంకించిరి. ఇది
కేవల మసంగతము. మల్లికార్జున పండితుఁడు గృహస్థుడు - వీరశైవ మతప్రవ

---

* ఇందుఁగూర్చిన చర్చలకయి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము 14
సంచికలు 1,2 చూచునది.

డు- నన్నెచోడుని గురువు-బ్రహ్మచారియని యాతని వర్ణనలవలన విస్పష్టమగును.
నిలో మల్లికార్జున పండితునకుఁ దగిలివచ్చునవేమియుఁ గానరావు. నన్నెచోడుఁడు
తని గురువు కాలాముఖ శైవు డనుటయే సత్యసమ్మతము.

పూర్వోక్త కారణములచే నిర్బాధకముగ నిస్సంశయముగ నన్నెచోడుని
కాలము నిర్ణయింపఁదగిన బలవత్ప్రమాణములు లభింపనప్పుడు గ్రంథమందలి
అంతరంగిక సాక్ష్యము నుబట్టియే దానినిఁ నిర్ణయింపఁబూనుట సరియగు మార్గము
కాకపోదు. నన్నెచోడుఁడు తన కావ్యమున సంస్కృతకవులలో వాల్మీకి, వ్యాసుఁడు,
కాళిదాసు, ఉద్భటుఁడు, భారవి, బాణుఁడు అను నార్వురనుమాత్రమే పేర్కొ
నెను. వ్యాస వాల్మీకులు చాలఁ బూర్వకాలమువారు. కాళిదాసుని కాలము క్రీ. శ.
పూర్వము 56, క్రీ. శ. 600 మధ్యనూఁగులాడుచున్నది ఉద్భటుఁడు క్రీ. శ. 780-
10 ప్రాంతమునఁ గాశ్మీరదేశము నేలిన జయాపీడుని యాస్థానకవి. భారవి క్రీ.శ.
50-620 ప్రాంతమువాఁడని చరిత్రజ్ఞుల యభిప్రాయము. బాణుఁడు క్రీ. శ. 650
ప్రాంతమునఁ గన్యాకుబ్జముఁ బాలించిన హర్షవర్ధనుని యాస్థానకవి. వీనిని బట్టి
నన్నెచోడుఁడు క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దికిఁ దరువాతివాఁడని చెప్పుట కెట్టి
యాటంకమును లేదు. ఇఁక దేశికవులలో నన్నెచోడుఁ డుదాహరించినవారు గాని
లక్షణకవులుఁ తప్ప నాతనిని పేర్కొనినవారు గాని కానరారని మొదటనే మనవి
చేసితిని. కాని గ్రంథావతారికలో—

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించె తెనుం
గు నిలిపి రంధ్రవిషయమున
జనసత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్.

(తెనుంగును నిలిపి రంధ్రవిషయంబునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలు
వుర్ - అను పాఠాంతరము గూడఁ గలదు)

అను పద్యమును వ్రాసి యటుతరువాత నీక్రింది పద్యమును నన్నెచోడుఁడు
ఖించెను—

చ. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి, మ
ద్గురుచరణారవిందములకున్ దగ సమ్మతిఁ జేసి కొల్చి, వి
స్తరమతులం బురాణకవి-సంఘము నుత్తమ మార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతి చేసి మనోముదంబునన్.

ఈ రెండు పద్యములకు నడుమ మఱికొన్ని పద్యము లుండియుండునని కొ
వానిలో నన్నెచోడుఁడు దేశికవులఁ గొందఱ నుదాహరించియుండుననియుఁ గొంద
తలంచుచున్నారు. కానిదొఱకిన వ్రాఁతప్రతిలో నట్టిపద్యము లేనియుఁ గానవచ్చుటలేదు
పయిపద్యమునఁ బేర్కొనఁబడిన చాళుక్యరా జాంధ్రమహాభారతమును నన్నయభట్టు
రచియింపించి కృతినందిన రాజరాజనరేంద్రుఁడనియే పలువురు పండితులభిప్రా
పడుచున్నారు. ప్రత్యక్షప్రమాణముగఁ గానవచ్చు నన్నయభారతమును బట్టియు
దేశమునఁ జిరకాలమునుండియు వచ్చుచున్న ప్రతీతినిబట్టియు నీయభిప్రాయ మస
గత మనుటకు వీలులేదు. కాని నన్నెచోడుని నన్నయకంటెఁ బ్రాచీనుఁడో దే
తత్సమకాలీనుఁడో యని తలంపనెంచు కొందరిందుకు విపరీతార్థమును దీయఁ బ్ర
త్నించుచున్నారు. దీని తరువాతి పద్యములోనున్న వరుసను దేశికవిస్తృతి కడపటనున్న
కావున "మునుమార్గకవిత" యనుపద్యము దేశికవిస్తుతిపరముగానే గ్రహింపవల
ననియు, అందలిసత్యాశ్రయాదులగు చాళుక్యరాజులు దేశికవితా పోషకులుగఁగా
దేశికవులుగనే గ్రహింపఁదగుననియు శ్రీదేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు "విభూతి
౨ వ సంచికలో "నన్నెచోడనన్నియభట్టులు సమకాలమువారు" అను వ్యాసము
వ్రాసియున్నారు. సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపు లందఱును దేశికవులేనా
దేశికవులనే నన్నెచోడుఁడు పేర్కొన్నచో నందఱను రాజకవులనే యుదాహరిం
చెనా? "పుట్టించి" అను ప్రేరణక్రియను "రచించి" యనియే యర్థముచెప్పవల
యునా? రాజరాజుమనుమలలో నొకఁడు వెలయించిన శాసనము లొకదానిలో
నాతఁడొనరింపఁజేసిన మహాభారతకృతిని బ్రశంసించుటలో "ఆంధ్రీచకార" అను
ప్రయోగమును బట్టి మహాభారతకర్త రాజరాజనరేంద్రుఁడేగాని నన్నయభట్టు
కాదను వింతవాదమును గొంత కాలమయి యొకరు ప్రకటించిరి. కాని సహృదయు
లెవరు దాని నంగీకరింపలేదు, పయిసంగతులనెల్లఁ బర్యాలోచింప దేశికవితా ప్రా
రంభమునకయి చాళుక్యరాజు లొనర్చిన కృషిని బ్రశంసించుటకే పయిపద్య ము
శింపఁబడెననియు నటుతరువాత దేశికవులను వారినామములతోఁ బేర్కొనదలచి
నన్నెచోడుఁడు సాముదాయిక దృష్టితో "దేశిసత్కవుల సంస్తుతిచేసి" అని వ్రా
యుండుననియుఁ దలంచుటయే సంగతముగా నుండును. ఇంతకు నీరెండుపద్యము
నడుమ దేశికవులను గుఱించిన కొన్నిపద్యములుండి యుండుననియు, అవి మన
దొరకిన ప్రతిలో లోపించియుండుననియు నాయనుమానము. ఒండు రెండుప్రతులు
తెలిసినను నిక్కమాలోచింప మనకీ గ్రంథమునకు దొరకినది తంజావూరు సరస్వ
మహాలునందలి యేకప్రతియే గదా!

గ్రంథావతారికలో—

"అన్యతారకవితతుల నాదరించి
వెలయు సత్కవిబుధగురుబలమువడసి
యొనరు దైవజ్ఞునట్లు శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ" (అ 1. ప 34)

అనుపద్యమును బట్టియు, కథామధ్యమునఁ దారకాసురయుద్ధసందర్భమునం దున్న "తారక విరచిత కృతిగుం దారక విరచిత వికృతియుఁ దానడఁగు సదాచార కవిబుధాళికి సువిచార కవిబుధాధినాథు షణ్ముఖుఁ గనినఁ (అ 16. ప 518) అను పద్యమును బట్టియు నన్నెచోడునకుఁ బ్రత్యర్థి తారకుండను నొకఁడుండెననియు వాఁడే యిందు దాహృతుఁడనియుఁ గొందఱు తలంచిరి. మఱికొందఱీ ప్రత్యర్థి జాను తెనుంగు రచనకుఁ బ్రతికూలుఁడగు నన్నయభట్టే యనియు, ప్రతారము వంచనము, దాని నొనర్చువాఁడు తారకవి యను నర్థముతో నన్నెచోడుఁడాతనినే యుద్దేశించెననియు వ్రాయు సాహసమునకుఁగూడఁ గడంగిరి. పదియవ యాశ్వాసమునందలి దారిద్ర్య విద్రావణ స్తవములోని "శ్రీరామేశగవీశ్వరా మలెద నీ శ్రీపాదముల్ భక్తితో నారాధించి సమస్త లోక సముదాయాధీశులైరన్న..." అను పద్యమున "గవీశ్వర" శబ్దము ప్రమాదమున "కవీశ్వర" అని లిఖింపఁబడి ముద్రింపఁబడుటచే శ్రీరామేశ కవి యను నాతఁడుకూడ నన్నెచోడుని కాలముననుండెనని కొందఱు తలంచిరి. ఇవియన్నియు నత్యూహలు. ఈ యభిప్రాయము లన్నిటికి శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు నన్నెచోడుఁడు తిక్కన కేతనాదులకుఁగూడఁ దరువాతివాఁడను నభిప్రాయముతోఁ బ్రకటించిన "A Critique on Nannechoda Deva's Kumara sambhavam" నన్నెచోడకవి కుమార సంభవ విమర్శము అను గ్రంథములోఁ జక్కని సమాధానములు వ్రాసియున్నారు. నన్నెచోడుని గ్రంథములో అనవసర శ్లేషలకు, గూఢభావములకుఁ దావులేదు. "సరళముగాఁగ భావములు..." అని గ్రంథావతారికలో ఘంటాపథముగ నాతఁడు చెప్పికొనిన పద్యమిందుకు నిదర్శనము. మనయూహలను బలపఱచుటకు, సిద్ధాంతముల నిల్వరించుటకు గూఢత్వము నారోపించి యాతని పదప్రయోగములకు విపరీతార్థములు చెప్పఁబూనుట యాతని కపచార మొనర్చుటయే యని నా యభిప్రాయము. పయిపద్యములలో; అన్యతారక వితతులనఁగా శుభేతర నక్షత్రగణములనియే సహజార్థము. ఇతరులను వంచించు కుకవిసమూహము లను వ్యంగ్యార్థముగూడ గ్రహింపవచ్చును. రామకృష్ణ కవిగారు సూచించినట్లు వితతు లను పాఠమును వికృతులుగా మార్పనక్కఱలేదు. మన

యూహలకొఱకుఁ బాతములనుగూడ మార్చివేయుటయా? తారక విరచిత కృతియ
నక్షత్రములచేఁ గూర్పఁబడిన కార్యము అనఁగా రాత్రియనుటయే సహజ
రెండవ పాదములో విక్కృతియనుటకుఁ బొరపాటున "సుకృతియు" అని లిఖింప
ముద్రింపఁబడినట్లు తోఁచుచున్నది. సదాచారులయిన విబుధులకు (పండితు
దేవతలకు) సువిచారక విబుధాధినాథు (సూర్యుని) షణ్ముఖుఁగనినంత నే చీకటి
గూడిన రాత్రియు తారకాసురునిచేఁ గలిగిన బాధయు నడగునని పద్యార్థ
శ్రీరామేశ గవీశ్వరాదులనుచో (శ్రీరామేశ = లక్ష్మీకాంతాప్రాణేశుఁడు=విష్ణు
గవీశ్వర=వాగీశ్వర= బ్రహ్మ;) విష్ణువు బ్రహ్మ మొదలయినవారనియే యర్థ
పరమేశ్వరు నారాధించి సమస్తలోకపాలకత్వాది సంపదలందిరి వారే గాని కవ
రును గాదు. పయి పద్యములలో నన్నెచోడుఁడు మిత్రులను గాని శత్రులను గాని
సమకాలిక కవుల నెవరిని సూచింప లేదనియే నా నిశ్చితాభిప్రాయము.

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు నన్నెచోడుని గ్రంథమును గూఢవస్తు
మయ కావ్యమని యెంచి గ్రంథరచనా కాలమును దన రాజధాని నామమునుగూ
నాతఁడు కావ్యములో గూఢముగఁ జెప్పెనని తమ పూర్వోక్త వ్యాసములో
గొంత చిత్రప్రదర్శన మొనరించిరి. నన్నెచోడుఁడు తనగ్రంథము గూఢవస్తుమ
కావ్యమని యెచ్చటను జెప్పికొనలేదు. అది యట్టిదే యయినచో నింకను దనగూ
గాఢనిద్రావస్థనుండి తెల్వినొందక లోకమున కందక పూర్తిగ నశించియే యుండె
నేమో! సంస్కృతకవులలో నుద్భటునిఁ బ్రశంసించు సందర్భమునఁ జెప్పిన "క్రి
మున నుద్భటుఁడు కవిత్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకారము గూఢవస్తు
మయ కావ్యముగా హరులీలచెప్పి హరు మెచ్చించెఁ" అను పద్యమును సరి
నర్థము చేసికొనక, ఉద్భటుని కుమారసంభవమునకో హరలీలాస్తవ కృతికో నన్నె
చోడుఁ డుపయోగించిన గూఢవస్తుమయ కావ్యవిశేషణమును శ్రీ కృష్ణారెడ్డిగారు
నన్నెచోడుని స్వంతగ్రంథమునకే యతికరించుట మిక్కిలి శోచనీయము. ఉద్భ
టుఁడు సంస్కృతమునఁ గావ్యాలంకార సంగ్రహమను నలంకార గ్రంథము రచి
చెను. అది ముద్రిత మయినది. దానిలోని లక్షణములకు లక్ష్యములుగా నుండుటకయి
కుమారసంభవ కథలోని యొక దేశమగు పార్వతీపరిణయ సందర్భ మందలి హరుని
వటువేషధారణలీలను గథావస్తువుగఁ గైకొని రమారమి నూఱుశ్లోకములను రచించి
నాఁడు. లక్ష్యలక్షణశ్లోక సమన్వితముగ నే యలంకార గ్రంథము కూర్పఁబడినది.
లక్ష్యశ్లోకములలోఁ గథావస్తువుకూడ గూఢముగనున్నది. వీనిలోఁజాల శ్లోకములను
శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగా రుదాహరించినారు. కాళిదాస కుమారసంభవ శ్లోకముల

లెనే నన్నెచోడుఁ డుద్భట కావ్య శ్లోకములఁగూడఁ గొన్ని తనగ్రంథమున ననువ
దించినాఁడు. నన్నెచోడుఁడు పూరోక్త పద్యమునఁ బయివిషయములనే ప్రశంసించి
యుద్భటుని కుమారసంభవైకదేశమునకు గూఢ వస్తుమయ కావ్యవిశేషణము నుద్దేశించె
ని శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు తమ యభిప్రాయమును బ్రకటించిరి. అది సరియని
మే యంగీకరింపవచ్చును కాని మల్లికార్జున పండితుని శివతత్త్వ సారమందలి.—

క. హరలీలాస్తవరచనా
స్థిర నిరుపమ భక్తిఁదనదు దేహముతోడన్
సురుచిర విమానమున నీ
పురమున నుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా.

అను పద్యమును బట్టి యుద్భటుఁడు హరలీలాస్తవమను ప్రత్యేక కృతిగూడ
నొకటి రచించినట్లు గోచరించును. నన్నెచోడుని పద్యమందలి క్రమమునుబట్టి గూఢ
వస్తుమయ కావ్య విశేషణము హరలీలతో నన్వయించుట సమంజసముగాఁ గాన
వచ్చును. పయి కారణములచే నీ విశేషణము ఉద్భటుని కావ్యములలోఁ గుమారసంభ
వమునకో, హరలీలకో చెల్లునుగాని నన్నెచోడుని గ్రంథమునకుఁ గాదు. ఇంక రెడ్డి
గారి చిత్రప్రదర్శన మించుక పరామర్శింతము.

1. తారకాసుర సంహారానంతరమున శివుఁడు కుమారస్వామి నానందముతో
నెచ్చి యెత్తుకొని లాలించు సందర్భమున—

గీ. "ద్వాదశార్ధార్ధనయను నా ద్వాదశార్ధ
వదనుఁ డొగిఁజుట్టె నిజభుజ ద్వాదశమున
నుదయ దశశత కిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టి దశశత కరములఁ జుట్టినట్లు" (అ 12, ప 993)

మూడుకన్నుల వానిని (శివుని), ఆఱు మోముల వాఁడు (కుమారస్వామి) తన
పదిరెండు చేతులతోడను, వేయి కిరణములుఁగల యుదయభానుఁ డుదయాద్రిని దన
వేయి కరముల (కిరణముల)తోఁ బొదివినట్లు కౌఁగిలించెనని దీనియర్థము. అనుప్రాస
మను శబ్దాలంకారము, ఉపమయను నర్థాలంకారముతప్ప దీనిలో మఱేయలంకార
ములుగాని శ్లేషార్థములు గాని లేవు. మొదటి రెండు పాదములలోని సంఖ్యలను
గలిపి (3+6+12 = 21) దానిని మూఁడు నాలుగు పాదములలోఁ గానవచ్చు వేయి
(దశశత) యను సంఖ్యతో గుణించిన ఇరువదియొక్క వేయి యగునుగాన నట్టిసంఖ్య
గల గ్రామములను గలిగిన పాకనాటికి దా నధిపతిననియు నందలి యుదయనగముఁ
ఉదయగిరి - తన రాజధానియనియు నన్నెచోడుఁడు గూఢముగాఁ జెప్పెనని రెడ్డి
గారిప్రదర్శనము గ్రంథావతారికలోనే తన తండ్రి పాకనాటియం దిరువది యొక్క
వేయిటి కధీశుఁడని తేటతెల్లముగఁ జెప్పిన నన్నెచోడునకు మరల నావిషయమునే జెప్ప

టకీ డొంకతిరుగుడు మార్గమేల? రాజధానినిగూడఁ జేర్చ-నవలె ననెడి తలఁ
యాతనికిఁ గల్గినచోఁ బయిదానితోపాటు దానిని మొదటనే చెప్పియుండఁడా?

2. (విష్ణు కాలనేములయుద్ధవర్ణనా సందర్భము)

వ. కాలనేమి యిట్లు శతముఖ దశశతకర పరిఘుశోభితుండై యనేకవి
యుధవర్షంబులు గురియుచుండెరల నెత్తివచ్చుటగని శార్ఙ్గపాణియు వానికిం బ్రతి
టించి నిలిచిన. (అ 12. వ 872)

3. (షణ్ముఖ తారకుల యుద్ధవర్ణనము)

చ. కరిశిరమాడ షణ్ముఖుఁడు గైపున వ్రేయుడుఁ గుంభమాక్తికో
త్కరమసిధారఁ బొల్పెసఁగెఁ దారకుభంగము సూచి నవ్వ సం
గరజయకాంతకాంతరద కాంతియొ కాదని నాటుదీరి వి
స్ఫురదవదాత ఖడ్గలత పూచెనొ నా జయ చైత్ర సంపదన్.

(అ. 12. ప 961)

4. (తారకాసురుఁడు యుద్ధమున నిహతుఁడైనప్పుడు)

వ. ఇట్లప్రతిహతశౌర్యుండును ననివార్యవీర్యుండును నఖిల భువన భవనా
శ్వరుండును, సకల జగద్భయదానియు నామరణాంతపరిత్యక్తాభిమానియు నగు తా
కాసురనామాక్షరంబులు సకలదిక్తట శిలాపట్టంబుల శక్తిధరముఖవిజయ ప్రశస్తి
శాసన లిఖితాక్షరంబు లయ్యెనంత. (అ 12. వ 970)

వీనిలోఁ గుమారసంభవరచనా పరిసమాప్తికాలమును నన్నెచోడుఁడు గర్భి
తముగాఁ జెప్పినాఁడని శ్రీ రెడ్డిగారి యభిప్రాయము.

అవదాత, జయ, చైత్రశబ్దములలో సంవత్సర, మాస, పక్ష, తిథి, వారములిమి
యున్నవఁట. జయసంవత్సర చైత్రమాసములో అవదాత (శుక్ల)పక్షములో జయతి
(శుద్ధ తృతీయ)తోఁ గూడిన జయ (మంగళ) వారమునాఁడు గ్రంథసమాప్తి యయ్యె
నఁట. పంచాంగముల గాలించినచో విక్రమ శకము ప్రకారము పదునొకండు
వందల పదు నొకండవ సంవత్సరము (1111) జయ సంవత్సరమగు నఁట. దీనికి
దోడగుటకయి 872 వ వచనములోని శతముఖ దశశతపదములను గూఢవస్తుమగు
కావ్య లక్షణాంగీకారముగ 'శతముఖ దశ+దశశత' అని విఱిచికొని యన్వయము
చేసికొనవలెనఁట. అప్పుడు 110+1000=1110 సంఖ్య యేర్పడునఁట. ఇప్పటికిని స
పోవని వ్యత్యాసము 1111 Minus 1110 స్వల్పమనఁగా నొక్క-వత్సరమే కావు
దానిని బరిహరించుకొనవలెనఁట. ఇట్లు తంటాలు పడి పడి విక్రమ శకగత వర్షము
1110 అగు జయ సంవత్సర చైత్రశుద్ధ తృతీయా మంగళవారమునకు సరియగు క్రీ.శ
15-3-1054 తేదీని కుమార సంభవ రచనము పూర్తి యయ్యెనని నన్నెచోడుఁడు
వాచ్యముగాఁ జెప్పినట్లు తలంపవలెనఁట. పాఠకులు పయివచనముల మధ్యనున్న వ్యా

ని నెడమును గమనింపవలెను. 872-961 మధ్య రమారమి నూఱుపద్యముల యెడ యున్నను మనయూహల నిలువఁబెట్టుటకయి ముడిపెట్టి యిచ్చవచ్చినట్లు విఱువవలసిన దేనా? తెలుఁగు నాట శాలివాహనశకము పరంపరాగతముగ వ్యవహరింపఁ బడుచుండ విక్రమశకము నేల యెరువు తెచ్చికొనవలెను. తారకాసురు నామాక్షరంబులు శక్తి ధరముఖ విజయ ప్రశస్తశాసన లిఖితాక్షరంబులైనవి; యనఁగా నేయుగమునందో యెప్పుడో జరగిన తారకాసుర సంహారముకూడఁ బూర్వోక్త జయచైత్రమునందే సమాప్తమయ్యెనని తలంపవలసినదేనా? తాముద్దేశించిన గూఢ భావమే లేకున్నచో 872 వ వచనములో శతముఖదళశత అనుచో 'దళశత'కు మాఱుగా 'సహస్ర' అనుట సరిపోవునప్పుడు 'దళశత' యనియే నన్నెచోడుఁడేల వ్రాసెనని శ్రీరెడ్డిగారు పెద్ద యుపపత్తినిగూడఁ జూపిరి. నన్నెచోడుని రచనములలోని యనుప్రాస లబ్ధత్వము మీరు గుర్తింపలేదు కాఁబోలు.

అనుప్రాసకొఱకే యాతఁడు శతముఖ,దళశత శబ్దములఁ బ్రయోగించెను గాని వేఱొక భావమునఁగాదు. 961 పద్యమునకు షణ్ముఖుఁడు తారకాసురుని గజమును గుంభస్థలము వ్రక్కలగునట్లు బలంబుతోఁ దన ఖడ్గమున వ్రేయంగా నందుండి యా ఖడ్గధారవెంబడి వెడలెడు ముత్తెముల మొత్తమా రాక్షసుని భంగపాటునుజూచి నవ్వెడి సంగ్రామ జయలక్ష్మి మనోహరదంతకాంతియో లేక షణ్ముఖుని విజయ మనెడి వసంత సంపద కలిమిచే నాతని ధవళఖడ్గలత పూఁచిన పూఁతయోయన మిగుల నొప్పారెనని సహజార్థము. ఇందెట్టి గూఢతకును నవకాశములేదు. ఇందలి జయ చైత్ర శబ్దముల మాతఁగాఁగొని గ్రంథమున మఱెచ్చటనో యున్న శతముఖ దళశత శబ్దములతో వానికి సంబంధమును ముడిపెట్టి శ్రీరెడ్డిగారాకాశహర్మ్యము నిర్మింపఁ బూనుట యాశ్చర్యము. ఇట్లే పూనుకొన్నచో నిచ్చవచ్చినట్టు లేగ్రంథమునుగూర్చి యైనను నెట్టి సిద్ధాంతములనైనఁ జేయవచ్చును. ఇట్టి వినోదపద్ధతులు చరిత్రకారుల మాటిదారు లెన్నటికిని గానేరవు. ఆముష్మిక దృష్ట్యేక పరులగు పూర్వకవులకుఁ జారిత్రకదృష్టి చాలఁదక్కువ. నన్నెచోడునకు గ్రంథరచనాకాలమును దనరాజ ధానిని బేర్కొనవలెననెడి తలంపేకల్గినచో వానినాతఁడు సహజసరళ సక్రమమార్గ ములనే చెప్పియుండును. గూఢత్వము నెడనే యాతఁడు దృష్టిఁబఱపినచోఁ దలి దండ్రుల నామములను స్వనామమునుగూడ నిగూఢములే చేసియుండును. గురుని గూర్చి యన్నివిశేషవర్ణనము లొనర్పకయే యుండును. చక్రబంధాది పద్యములలోనే యెట్టి గోపనము చేయనివాఁడు కథాసందర్భ ప్రయుక్తములగు గ్రంథమధ్యస్థసాధా రణ పద్యములలో నసంగతములగు నిట్టి గూఢభావముల నిమిడ్చియుంచెనని తలంచుట కెట్టియవకాశమును లేదు.

ఇఁక నన్నిచోడుని గ్రంథమునఁ గానవచ్చు ప్రాచీన శబ్దములనుబట్టియే కేవలమతఁడు నన్నయకంటెఁ బూర్వుఁడని చెప్పరాదని నాయభిప్రాయము. లోకో భిన్నరుచిః; పలువురదృష్టి పలువిధములుగానుండును. కొందరకు వాడుకనుండి నన్న

గిల్లిన ప్రాకృతమాటలపయి రోఁత జనింపక వానిపయి నే యెక్కువ మక్కువ య
వచ్చును. అట్టిఁడు, తొట్టి, నెట్టన, పొంచె మున్నగు ప్రాచీన రూపములను నిష్
గూడఁ దమ గ్రంథములలో నుపయోగించువారు లేకపోలేరు. కావున నన్నె
డుఁడు ప్రాకృతపడ్డమాటల నెక్కువగ నుపయోగించినచో నది యాతని కందుక
గల మక్కువనే సూచించును. నన్నెచోడునిగూర్చి కాకపోయినను నిట్టివారిని
దరిఁ గూర్చియే కాఁబోలు; తిక్కన నిర్వచనోత్తర రామాయణములో "పట
పొందులేక రసభంగము సేయుచుఁ బ్రాకృతపడ్డ మాటలఁ దమనేర్పు సూపుచు.....
అని వ్రాసియున్నాఁడు. పాల్కురికి సోమనాథుని గ్రంథములందును, నన్న
తిక్కనల భారతములందునుగూడ వెదకిచూచిన నిట్టిశబ్దములు పరిష్కృతములుగ లభి
గలవు.

నన్నయభారతమును, నన్నెచోడుని కుమార సంభవమును సవిమర్శముగఁ
కించిన రెంటికిని గల వైలక్షణ్యము గోచరింపకపోదు. శైలిలోను రెంటికిని భేద
గలదు. మొదటిది పురాణ శైలిలోను రెండవది కావ్యప్రబంధ శైలిలో నున్న
గర్భబంధ కవిత్వములు గూడ నన్నెచోడుని గ్రంథమునఁ బ్రదర్శితము లం

నన్నయకాలమునాఁటికిఁ దెలుఁగు రచనలలోఁ బ్రబంధ శైలివాసనలు నెల
నట్లు కానరావు. నన్నయ భారతమును మన కుపలబ్ధములయిన తత్పూర్వశాసనము
దిలకించినచో సీసపద్యరచనమున నప్పటికొకవిధమయిన యతినియమము ఉన్న
కానవచ్చును. తనకాలమునాఁటి కా చ ర ణ ము లో నున్న యా నియమ
లను నన్నయ తన సీసపద్య చరణములలో లెస్సగాఁ బాటించుటయే గ
మఱికొన్ని విశేష నియమములను గూడఁ బ్రదర్శించినాఁడు. నన్నెచోడుని సీస
లలోఁగాని నన్నయతరువాతి బయలుదేఱిన మఱి యేయితర కవులసీసములలోఁ
యిట్టి నియమములు కానరావు. మఱియు నన్నయ కాలమునాఁటికి సీసపద్య పా
లెచ్చటి కచ్చటికిఁ దెగిపోవునట్లు రచించు నాచారమంతగాఁ బ్రచారమందున్న
కానరాదు. ఈసంస్కారము తరువాతిఁ దరువాతఁ గ్రమక్రమముగ నేర్పడి నెల
నొందినది. తిక్కన కాలమునాఁటికిఁగూడ నది సంపూర్ణ సౌష్ఠవము నందలే
పాల్కురికి సోమనాథుని యనుభవసార చతుర్వేదసారములలోనిట్టి సంస్కా
ప్రారంభమై తరువాతివారికది మార్గదర్శక మైనది. ఇట్టి సంస్కారము నన్నె
డుని సీసములలోఁగూడఁ జాలవఱకుఁ గాననగును. నన్నయ కాలమునాఁటికి గ్ర
రంభము సంస్కృత శ్లోకములతోఁ బ్రారంభించు నాచార మున్నట్లు కానన
నిర్వచనోత్తర రామాయణములోఁ దిక్కన గూడఁ దానిని బాటించెను. కాని
వాత గ్రంథాదినుండి కాక చతుర్థపర్వముతోఁ బ్రారంభించి రచించిన భారతమ
దానిని మానివేసెను. కాని తిక్కనకు బూర్వుఁడయిన పాలకురికి సోమనాథు
యీ మార్గమును బరిహరించెను. అతని యనుభవ సార గ్రంథారంభము తెలుఁగు
ములోనే యున్నది. నన్నెచోడుని కావ్యముకూడ నిట్లేయున్నది. కావున స్థూలదృ

లాచువారికిఁగూడఁ బయి కారణములఁ బట్టి నన్నయ ప్రాచీనత, నన్నెచోడుని యర్వాచీనత గోచరింపక పోవని నాయభిప్రాయము. షష్ఠ్యంత రచనమును మొదటఁ దిక్కనయే ప్రారంభించెననియు నన్నెచోడుని గ్రంథములోఁగూడ నిట్టి రచన ముండుటకూడ నాతఁడు తిక్కనకుఁ దరువాతివా డనుటకు నిదర్శనమని శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు వ్రాసినారు, కాని యిదియొక గొప్పసంగతికాదు. తిక్కనకుఁ బూర్వము వెలసిన కొన్ని శాసనములలోని పద్యములలో షష్ఠ్యంతము లుండుట శాస్త్రి గారే యంగీకరించిరి.

ఇఁక ననుకరణములు గూడఁ గవుల కాలనిర్ణయమునకుఁ జాలవఱకు సాయము కాకపోవు. కాళిదాసోద్భటుల కుమారసంభవములను నన్నెచోడుఁడు పలుతావుల ననుకరించినాఁడని మొదటనే వ్రాసితిని. వారి నాతఁడు పేర్కొనుటవలనఁగూడఁ దద్గ్రంథముల నాతఁడు చదివి యనుకరించినాఁడనుట విస్పష్టము. కాళిదాసుని కుమారసంభవములో మొదటి యెనిమిది సర్గలుమాత్రమే కాళిదాస రచితము లను వాదము చాలఁగాలమునుండి మనదేశమునఁగలదు. ఎనిమిదవ సర్గతోనే కుమారోదయము పూర్తియైనది, తరువాతఁ దారకాసుర వధాంతమువఱకుఁగల కథ కూడఁ గాళిదాస రచితమేయనినచోఁ గుమారసంభవమను నామము కావ్యమున కుచితముగా నుండదని కొందఱి యాక్షేపము. అదియొక గొప్పవిషయముకాదు. అట్లేయయినచో నది మన నన్నెచోడుని గ్రంథమునకుఁగూడ వర్తించును. కాని సంస్కృత కుమారసంభవము మొత్తముగ్రంథము కాళిదాసుపేరనే. యున్నను దొమ్మిదవసర్గ మొదలు చివరఁబదునేడవ సర్గవఱకుఁగల కావ్యశైలికిని మొదటి యెనిమిదిసర్గలలోని శైలికిని భేదమున్నదనియు నీతరువాతిభాగములో మహారాష్ట్రదేశమందు వాడుకలోనుండు కొన్నిరూపములు కానవచ్చుటచేఁ బదిరెండవ శతాబ్దిప్రాంతమున మహారాష్ట్రదేశస్థుఁ డెవరో కాళిదాసుపేర నీకథాభాగమును వ్రాసియుండుననియుఁ గొందఱు తలంచు చున్నారు. నన్నెచోడుని గ్రంథమున సంస్కృత కుమారసంభవమందలి యీ తరువాతి భాగములోని కొన్ని శ్లోకములకుఁగూడ ననుకరణము లున్నవనియు నిందువలనఁ గూడ నాతఁడు పదిరెండవ శతాబ్దికిఁ దరువాతివాఁడని యేర్పడుననియు శ్రీ శాస్త్రి గారు వ్రాసినారు. క్రీ. శ. 13, 1 శతాబ్దులందుండిన సుప్రసిద్ధసంస్కృత కావ్య

(సశేషము)

# త్రిశూలమా!

కె. సాంబసిద్ధయ్యగారు, ఉపాధ్యాయులు



ఉ. బాలశశాంకమౌళిమృదుపాణితలంబున ముద్దు లొల్కగా
కాలముబుచ్చుచుండి కలకాలము నాతనియాన ధర్మమున్
బాలన సేయగా దనుజవారిరుహాక్షుల దివ్యమంగళ
శ్రీల హరింప నీవు మునుజేసిన పుణ్యమెదో త్రిశూలమా!

ఉ. కాలుడు గర్వభారమున కన్నులగానక శైవచింతనా
లోలు మృకండుసూతి బుధలోకనుతున్ వడి హింససేయ నా
బాలునిగావ శంకరునిపన్పున చయ్యన కాలుగర్వమున్
దూలిచి శర్వుపాదవినతున్ నొనరింపవె మున్ద్రిశూలమా!

చ. నలువ సమస్తలోకము లవారతమున్ సృజియించుచుండ నీ
వెలమిని కాలచక్రగతి నీశ్వరునాన దలంధరించి వే
పొలయగ సేయకున్న నిక భూమిని ముందు సృజించువానికి
నిలువగ చోటుగల్గునొకొ నీవె వచింపుము ఓ త్రిశూలమా!

ఉ. బాలిశవృత్తి లోకమున పైపడుపాటు లెరుంగలేక దు
శ్శీలత ఘోరపాపములజేయుచు సాధుజనమ్ముగుండెలో
గాలమ్ములై చరించు పలుగాకులు నీదగు దర్శనమ్ము నే
త్రాలకు దోచినంతటనె మ్రాన్పడిపోదురుగా ద్రిశూలమా!

చ. తలప నమోఘమయ్యుమ్మగద తావకశౌర్య ప్రతాపశక్తులన్
దలచిన మేరుపర్వతము తల్లడమందు గ్రహాధినేత సం
చలనము మాను దారకలు జల్లునరాలు ధరిత్రిపైన నీ
బలము కపాలిహస్తమున భాసిల నీకొదవెన్ ద్రిశూలమా!



# శ్రీ జగద్గురు రేణుకాచార్యులు

తర్కరత్న, కావ్యతీర్థ శ్రీ వృషభలింగ శివాచార్య స్వాములవారు



శ్రీమచ్ఛివాచారవిచారదక్షం స్వశిష్యసత్ప్రీణన పూర్ణపక్షం
దుర్వారకామాదివిదారదక్షం భజామ్యహం రేవణకల్పవృక్షం.
(శ్రీకరభాష్యే)

శివాగమముల ననుసరించి శ్రీ రేణుకాచార్యుని యవతారము పరశివుని సద్యోజాత ముఖమునుండి యైనట్లు తెలియుచున్నది. అటులే ప్రతి యుగాదియందును శ్రీమదాచార్యుడు అవతారమునంది వీరశైవ మతమును స్థాపించుచు ఆవశ్యకతానుసారముగా మధ్యమధ్యను భూలోకమున ప్రత్యక్షమైనట్లు ఐతిహ్యమువలన తెలియుచున్నది. యుగభేదమునుబట్టి యాచార్యపాదుల నామము లనేకముగనున్నను రేవణ, రేవణసిద్ధ, రేవణారాధ్య, రేణుక, రేణుకాచార్య, రేణుకగణాధీశ్వర మున్నగునవి ప్రసిద్ధములు. కలియుగాదియందు రేణుకుని యవతారమాంధ్రదేశపు కొలనుపాక (నిజాం ఆలేరు స్టేషన్) క్షేత్రమందలి శ్రీ సోమేశ్వర లింగమూర్తినుండి యైనది.

శ్రీమద్రేవణసిద్ధస్య కుల్యపాక పురోత్తమే
సోమేశలింగాజ్జనన-మావాసః కదలీపురే॥
(స్వాయంభువాగమే)

అథ త్రిలింగవిషయే కుల్యపాకాభిధే పురే
సోమేశ్వర మహాలింగాత్ ప్రాదురాసీత్ స రేణుకః॥
(సిద్ధాంతశిఖామణౌ ౪-౨)

శివుని ముఖమునుండియు సోమేశ్వరాది లింగములనుండియు అవతరించుట సంభవమా? మున్నగు లౌకిక ప్రశ్నములకు ప్రత్యేకముగ మరొకవ్యాసమున సమాధానమీయబడును. అష్టాదశ వర్ణములకు నష్టాదశ మతములు గురుత్వమును నిర్వహించుటకయి కొలనుపాకలో రేణు

కునిచే స్థాపింపబడినవై నేటికాలపు విపరీతావస్థయందు సైతము దృగ్గోచ
మగుచు నీరశైవుల ప్రాచీన వైభవమును వెల్లడించుచున్నవి. అవతా
స్థాన మిదియైనను అగస్త్యమహర్షి సంబంధము మున్నగు కారణము
వలన రేణుకాచార్యుడు తన జగద్గురు పీఠమును మలయాచలము
రంభాపురిలో (మైసూరుదేశములోని బాళేహళ్ళి లేక బాళేహ
న్నూరు) స్థాపించెను. ఈ రహస్యమును సరిగ గమనించలేక కర్నాటక
లేఖకులు కొందరు రేణుకుడు కర్నాటక దేశీయు డనియును, పీఠస్థాప
డనియును శిరివాళ గ్రామస్థుడనియును వెర్రిగా వ్రాయుచున్నారు. ఇటీవ
"రేణుక" యను నామము గలవారు చాలమంది కన్పించుటవలన అ
భ్రమ సహజముగ గల్గి యుండవచ్చునుగాని, పీఠస్థాపకుడై జగద్గు
త్వము నందిన రేణుకాచార్యుడు ఆంధ్రదేశీయు డనుటయే స
ప్రమాణ సమ్మతమును, అఖండనీయమును నై యున్నది. శివాచార్యు
లలో రేణుకుడు సర్వప్రథముడును, మహాప్రబలుడును నగుటవల
నీ మహనీయుని మహిమలీలలను బోధించు గ్రంథము లాంధ్రసంస్కృ
కర్నాటక భాషలలో ననేకములు గలవు. వానిలో సిద్ధనాథకృతమగ
"రేణుకవిజయము" (మైసూరు వెస్లియన్ మిషన్ ప్రెస్సు ముద్రితము
అత్యంత ప్రాచీన మగుటజేసి (విక్రమశక. ౧౦౧౭) దీని నాధారముగా
గొనియే ఈ వ్యాసము వ్రాయబడుచున్నది. ఆచార్యుని ముఖ్యమైన
లీలలు మాత్రమే యిట సంక్షేపముగ వివరించుచున్నాను.

మతస్థాపకులనగా నిటీవల కొందరు ప్రస్థానత్రయము (బ్రహ్మ
సూత్ర-దశోపనిషద్-గీత)లను సభాష్యముగ బ్రవచన మొనర్చినవా
రని యభిప్రాయ పడుచున్నారు. ఈ పూన్కి ప్రాచీనమనియు
అనివార్య మనియును సిద్ధాంతించుటకు ప్రమాణములు లేవు. శైవ
శాక్త గాణాపత్యాది మతస్థాపకులైన యాచార్యులును మహర్షులును
ఇట్లు స్థాపించలేదు. కాని ద్వైతాద్వైత విశిష్టాద్వైత తత్త్వము
చర్చలుమాత్రము ప్రాచీనకాలమునుండి జరుగుచునేయున్నవి. శంకరా
చార్యులనాటికి ప్రస్థానత్రయమను గట్టిపట్టుదల ఇంచుమించుగ నేర్పడి
యుండునేమో కాని నిశ్చయింపజాలము.

ప్రాచీన పరిపాటిననుసరించి వీరశైవమతమును స్థాపించి శక్తి విశిష్టాద్వైతమునుబోధించి గోత్రసూత్రములను ప్రవర్తించిన కారణమున, శ్రీ రేణుకాచార్యుడు జగద్గురు పదవాచ్యుడయ్యెను. వీరిచే ప్రవర్తింపబడిన ఉపాచార్యులును గలరు. ప్రస్తుతమిట్టి శాఖామతములు వేనకువేలుగలవు. వీరందరు శివాచార్యులు మాత్రమే! జగద్గురువులుకారు. శ్రీమదాచార్యపాదులవారి సూత్రభాష్యము కలదనియును అది "రేణుకభాష్య" మను పేరిట సుప్రసిద్ధమనియును వీరశైవలోకమున గొప్ప కింవదంతి యొకటికలదు. సికిందాబాదు నివాసులు శ్రీమార్కండేయ శాస్త్రిలవారు తమ ప్రాచీనగ్రంథ సూచియందు "రేణుకభాష్యము" కలదని ముద్రించినారు. ఆంధ్రదేశపు శైవ వీరశైవ మాహేశ్వరుల గృహములలో గొన్నియేని రేణుకభాష్య ప్రతులుండును. జర్మన్ దేశపు పరిశోధకు డొక గ్రంథమును వరంగలు జిల్లానుండి కొంపోయెననియును ఒకరు వాకుృచ్చిరి. జర్మన్ దేశపు బర్లిన్ మహాగ్రంథాలయ సూచికలో "రేణుక కారికా" యను గ్రంథ మొకటికలదు. అది యెట్టివిషయమునకు జెందినదో పరిశోధింపబడలేదు. ఇటులే రేణుకభాష్యమును పశ్చిమదేశమున కెగుమతి యైనదేమో? సంగరెడ్డిజిల్లాకు జేరువగానున్న యొక స్వాములవారి యొద్దనుండి ౯-౧౦ సంవత్సరములకు బూర్వ మొక పరమతీయపండితుడు చదివి యిత్తునని విశ్వాసము బుట్టించి రేణుకభాష్యమును సంగ్రహించుక వెళ్ళెనని యొక నమ్మదగిన మిత్రుడు చెప్పుచున్నాడు. శైవ ప్రపంచమున వ్యాపించియున్న విపులమైన ప్రవాదమునుబట్టి రేణుకభాష్యమున్నటులే సహజముగ భావించవచ్చును. కాని యవతారమూర్తియును అష్టసిద్ధి సంపన్నుండును నగు రేణుకాచార్యుడు వ్యాససూత్రములపై భాష్యమును రచించవలసిన యవసరముండదు. పైగా వీరశైవమతము శివాగమ బోధితము కావున ఆగమములును ప్రత్యక్ష ప్రమాణములైనందున అంతటి ప్రాచీన కాలమున సూత్రభాష్యము రచించుసట్టి పరిస్థితులు లేవని మిత్రులొకరు సూచించిరి. ప్రాచీన కాలమున రేణుక భాష్య ముద్భవించకపోయినను శంకరాచార్య

సమకాలికుడగు రేణుకాచార్యు డొకడు చరిత్ర ప్రసిద్ధుడే కావు
నప్పుడైనను రేణుక కృతసూత్రభాష్యము లోకగోచరమై యుండును
నేడును సికింద్రాబాదున శ్రీ పం॥ మార్కండేయ శాస్త్రులవా
ఆరోగ్యముగ నున్నారు కావున తమయొద్దనున్న భాష్యమునుగూర్చి
విశదముగ వివరింతురుగాక!

భాష్యచర్చ యెటులున్నను రేణుకాచార్యుని "సిద్ధాంత శిఖా
మణి" యను మహాగ్రంథము వీరశైవలోకమున సుప్రసిద్ధమై బహు
ప్రచారము నందియున్నది. కృష్ణుడర్జునునకు బోధించిన గీతాశాస్త్ర
మును వ్యాసుడు సంగ్రహించినటులే రేణుకు డగస్త్యునకు నుపదేశించి
శివసిద్ధాంత శాస్త్రమును శివయోగి శివాచార్యుడను జంగమ పుంగవుడు
సంగ్రహించి దానికి 'సిద్ధాంతశిఖామణి' యని సార్థకముగ నామకరణము
గావించెను. వీరశైవులకీ గ్రంథరాజము సంపూర్ణముగ ప్రమాణమును
సరళగంభీరమును, సర్వసత్యసమర్థమును అగుటచేత మహోపకారిగ
నున్నది. శివాగమముల తరువాత ఈ గ్రంథమును సరిబోలు గ్రంథము
మరొకటి వీరశైవ విశ్వమున లేదని భేరీనినాదముతో జాటవచ్చును
ఈగ్రంథమును గీతవలె వీరశైవులందరును అవశ్యముగ కంఠపాఠము
జేయవలెను. కాని యిట్టి మహోత్తమగ్రంథ మిదివరకు నాంధ్రమున
బరిశుద్ధముగ దాత్పర్యవిశేషములతో బ్రకటింపబడకుండుట శోచనీ
యము. *

ఇట్టి మతధర్మ గ్రంథరాజములు కనపడనందుననే పరమతీయులు
వీరశైవుల ధర్మపుస్తకము బసవపురాణమని గీచివైచిరి.

రేణుకు డగస్త్యునకుపదేశించెననుటతో గొంతవాదము బయలు
దేరవచ్చును. అగస్త్యుడెచ్చోట ? రేణుకాచార్యుడెక్కడ ? వీరిరువురికి
సమకాలము కుదురునా ? యని యింగ్లీషు పద్ధతితో ప్రశ్నలు వేయ
వచ్చును. కాని భారతీయుల చరిత్రలలో నిట్టి ఘట్టములు పెక్కుగలవు.
ఏని స్వదేశ పద్ధతితో విచారించవలయునుగాని అణిమాద్యష్టసిద్ధిశక్తులను

---

* ఈసిద్ధాంతశిఖామణి యను మహాగ్రంథమును ప్రచురించుటకై మాకార్యా
లయము ప్రయత్నించుచున్నది. — సంపాదకుడు:

యోగవిద్యా రహస్యములను ఒక్కచిటుకలో నెగురగొట్టి నేటి కాలాను భవమునే బలముగాఁగొని చర్చించుట పొరపాటనియే మామతము. రేణుకాగస్త్యు లిరువురును సిద్ధపురుషులు కావున వారిని గూర్చిన యసంభవవాదమునుచేయ వీలులేదు. సరిగ ముక్కునైన బట్టుకొన జాలని నేటి బాలకులు ప్రాణాయామ తత్త్వములను, అణిమాద్యాకాశ గమనములను, దీర్ఘజీవిత్వమును తెలిసికొనజాలరుగదా? అట్టి మహాను భావులును నేడు లేకపోలేదు. అస్తు! చరిత్రాత్మకముగ నేమైన ప్రమాణములు వాఙ్మయములో నగస్త్యరేణుకుల సంబంధమును సూచించుచున్నవా యని మాత్రము దెలియవలసియున్నది.

అగస్త్యునకు శైవముతో నెక్కువ సంబంధమున్నటుల తేలు చున్నది. 'సిద్ధాంతశిఖామణి, 'రేణుకవిజయ' 'వేదాంతసార వీరశైవ చింతామణి' మున్నగు వీరశైవ గ్రంథములలో రేణుకు డగస్త్యునకు శివసిద్ధాంతము నుపదేశించినట్లు స్పష్టముగనున్నది. ఈ యుపదేశము నందిన పిదపయే అగస్త్యుడు బ్రహ్మసూత్రములమీద "శైవవృత్తి"ని రచించి యుండనోపునని యొకయనుమానము కలుగుచున్నది. ఈవృత్తి ననుసరించి శ్రీపతి పండితారాధ్యుడును సుప్రసిద్ధమైన శ్రీకరభాష్య మును రచించెననుట కా గ్రంథమే ప్రమాణము.

అగస్త్యమునిచంద్రేణ కృతాం వైయాసికాం శుభాం।
సూత్రవృత్తిం సమాలోక్య కృతం భాష్యం శివంకరమ్॥
(శ్రీకరభాష్యే)

శైవగ్రంథములను శైవేతరులు ముద్రించుటవలన గలిగెడు విపరీతములు నేటి శివపురాణాదులయందును ప్రత్యక్షమే కావున ప్రస్తుతకాలపు "అగస్త్యవృత్తి"లోను అనేక విషయములు పరివర్తింపబడుటలో నాశ్చర్యములేదు. అగస్త్య రేణుకుల సంబంధ మునుగూర్చి మరియొకప్రమాణమును కలదు. శివదీక్షాసంస్కారకాల మున పంచకలశస్థాపన జేయవలసియుండును. రేణుకాచార్యుని పూర్వ (సద్యోజాత) కలశమును స్థాపించి యర్చించుటకై ఋత్విక్కులు గావ

లసియుండ్లురు. ఈపరంపరలో "రేవణ, రుద్ర, నీలముని, ఘంటాసి సారంగ, వృద్ధాగస్త్య" అను వంశస్థులలో నెవరేని కావలసియుండు ఈవిషయము సుప్రసిద్ధమైన "శివతత్త్వరత్నాకరము" * అను గ్ర ము వలన (కల్లోలము ౬, తరంగము ౭) తెలియుచున్నది. 'వీరశై చార కౌస్తుభ'మను గ్రంథమును పైవిషయము నుద్ధరించియున్న సుప్రసిద్ధ వ్యాకరణ విద్వాంసుడగు భట్టోజి దీక్షితుడు "తంత్రా కారి నిర్ణయ"మను గ్రంథమును రచించినాడు. దాని నేబది సు త్సరములకు బూర్వము (విక్రమ ౧౯౪౫) ద్రావిడ వీరేశ్వర శాస్త్రి గారు కాశీక్షేత్రమందలి రాజేశ్వరీ ముద్రాక్షరశాలలో బ్రకటిం నారు. ఆగ్రంథము ౫౭ వ పుటలోని "తేనాత ప్తతనూరజ్ఞ" ఇత్యా దినా 'దీక్షయా సహితః సాక్షాదాప్నుయాల్లింగము త్తమ' మిత్యంతే నాగస్త్యం ప్రతి రేణుకేన పవిత్రశ్రుతి లింగధారణపరయా వ్యాఖ్యా నా త్తథా చాయమర్థః."—

అను వాక్యమువలన రేణుకాగస్త్యుల సంబంధము స్వమతీయు లోనే కాక పరమతీయులలోను సువిశ్రుతమని చెప్పనచ్చును. అగస్త్యుని గూర్చి యావిర్భవింపబడిన సుమధురమైన ఉపదేశామృతమును "సిద్ధాంతశిఖామణి" యను గ్రంథమునుండియే క్రోలవలెను.

శ్రీమదాచార్యులవారు విభీషణుని ప్రార్థనానుసారము లం కేగి ఒకే సమయమున త్రికోటిగురురూపములను ధరించి త్రికోటి శి లింగములను బ్రతిష్ఠింపజేసి రావణుని యంతిమేచ్ఛను నెరవేర్చి యద్భుత విషయములును "రేణుకవిజయ" గ్రంథమునుండి తెలియ చున్నవి. ఇవి యన్నియు పురాణాతీత కాలమందలి విషయము కావున నంతగా ప్రసక్తిలేదు. ఇటీవలి కాలమున రేణుకాచార్యు సంబంధము జూడవలసి యున్నది.

ఆర్యధర్మోద్ధారకుడును, అద్వైత మతసంస్థాపకుడు నగు శ్రీశం

---

* దీనిని నాగరాక్షరములలో "B. M. Natha & Co., Vepery Madras వారు ప్రకటించినారు. వెల 20-0-0. — సంపాదకుడు

ాచార్యుల నామమును వినని హిందువుండడు. శంకరాచార్యుని
త్త్వము కేవలాద్వైతము. కేవల జ్ఞానము చేతనే ముక్తియనియును
ానకర్మములు పరస్పర విరుద్ధము లనియును అనేక విధముల వ్రాసిన
పప ఆత్మప్రత్యక్షవిషయమున శంకరునకును శంక బాధించకపోలేదు.
దపనోదనార్థమై శ్రీశైలమున తపమాచరించుచుండ శివుడు ప్రత్య
క్షుడై "రేణుకాచార్యునివలన ఇష్టార్థము నెరవేరగల"దని వరమిచ్చెను.
దనుసారము శంకరాచార్యులు మలయాచలమున పరిభ్రమించుచుండ
రేణుకాచార్యుని యాశ్రమదర్శనము కలిగెను. బ్రహ్మతేజోవిరా
తుండును స్వయంసిద్ధుండును నగు శ్రీ రేణుకాచార్యులగాంచి-

"భద్రాంకురాయ భజతా మభయంకరాయ
మోహాంధకారరవయే కవయే మనూనాం
కైవల్యకల్పతరవే గురవే గురూణాం
శ్రీ రేణుకాయ గణపాయ నమోఽస్తు తుభ్యం."
(రేణుకవిజయే 3-౧౮.)

ఇటులు శంకరాచార్యులు వినుతించి యెక్కువగ సంభాషించి
జ్ఞానకర్మసిద్ధాంతములనుగూర్చి తత్త్వము ప్రత్యక్షమైన వెంటనే "చంద్ర
మౌళీశ్వరలింగము ని"మ్మని ప్రార్థించెను. (తథా యయాచే ముదితాం
తరాత్మా శ్రీ చంద్రమౌళీశ్వరనామలింగం 3-౨౨) రేణుకుడును,
సుపాత్రమునరసి, సాత్విక కర్మస్వరూపమును, భక్త్యుపాసనా తాదా
త్మ్యమును, జ్ఞానసవిషయకత్వమును నిరూపించి-

"అంధపంగువదన్యోన్యే సాపేక్షే జ్ఞానకర్మణీ
జ్ఞానేనాచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః॥"
(సిద్ధాంతశిఖామణౌ)

అను స్వసిద్ధాంతప్రకారము జ్ఞానకర్మసముచ్చయ తత్త్వమును
బోధించి యత్యంతమగు ప్రేమతో చంద్రమౌళీశ్వర లింగము ననుగ్ర
హించెను. శంకరాచార్యులు చారిత్రకపురుషులు కావున కేవల రేణుక
జయ గ్రంథము ననుసరించియే యిట్లు స్థిరపరచుట సరికానేరదు.

ప్రమాణాంతరములచే నుపబృంహణము కావలసియుండును. పరీక్షింప చూతము. నంజణాచార్య విరచితమగు "వేదాంతసార వీరశైవ చింతామణి" యను గ్రంథముయొక్క ఆదియందును శంకరాచార్యులకు రేణుకాచార్యులు లింగము ననుగ్రహించిన విషయము స్పష్టముగా గలదు.

"శంకరాచార్యసన్నామ యోగీంద్రాయ మహోజ్జ్వలం
చంద్రమౌళీశ్వరం లింగం దత్తవానితి విశ్రుతః.
శ్రీ రేణుకగణేశాఖ్యం రేవణం సిద్ధదేశికం
వీరశైవమతాచార్యం వందేహం తం జగద్గురుం"

కాని మరొక సందేహమున కవకాశ మిట గలదు. శంకరాచార్య నామముగల వ్యక్తు లెందరో ప్రాచీనకాలముననుండిరికదా! ఆది శంకరులే ననుటకు బ్రమాణమేమి? యని ప్రశ్నింపవచ్చును. సమాధాన మీ క్రింద వివరింపబడుచున్నది. శృంగేరి పీఠాస్థాన విద్వాంసులు పండిత లక్ష్మణశాస్త్రి గారిచే విరచితమగు "గురువంశకావ్యమును" శ్రీరంగం, వాణీవిలాసగ్రంథమాల వారు తమ ౧౨ వ పుష్పముగా ప్రకటించినారు. దాని తృతీయ సర్గలో శంకరాచార్యులు స్వశిష్యుడగు విశ్వరూపాచార్యునకు రేవణసిద్ధునివలన లభించిన చంద్రమౌళీశ్వర లింగమును రత్నగర్భగణనాథమూర్తిని ఇచ్చి వీనిని చిరకాలమర్చించుమని యాజ్ఞాపించినాడు.

"శ్రీచంద్రమౌళీశ్వర లింగమస్మై
సద్రత్నగర్భం గణనాయకం చ
స విశ్వరూపాయ సుసిద్ధదత్తం
దత్త్వా న్యగాదీ చ్చిర మర్చయేతి". 33

ఇట మూలమున "సుసిద్ధదత్తం" అను శబ్దముకలదు కాని రేవణసిద్ధ శబ్దము లేదని మరియొక ప్రశ్న రావచ్చును. గురువంశ కావ్యమునకు స్వంతముగ గ్రంథకర్తగారే సంస్కృత వ్యాఖ్యానము రచించియున్నారు. అందు "సుసిద్ధేన రేవణసిద్ధమహాయోగినా దత్తం" అని

సుస్పష్టముగనుండుటచేత నీసంశయమునకును జోటులేదు. లక్ష్మణ
శాస్త్రిగారైనను ఈ గురు వంశకావ్యమును స్వకపోలకల్పితముగ
రచించినదికాదు. ప్రాచీనైతిహ్యామునుబట్టియే సంగ్రహించిరి. పైగా
వారు శృంగేరి యాస్థానపండితులు కావున "ప్రాచామసమ్మతం నైవ
లిఖ్యతేఽత్రినచాధిక"మ్మను వారి ప్రతిజ్ఞను విశ్వసించవలసియున్నది.
మరియు మైసూరు మహారాజాస్థాన ధర్మాధికార పండితులగు విద్యా
విశారద శ్రీ కుణిగల్ రామశాస్త్రిగారిచే పరిశోధింపబడి గురువంశ
కావ్యము ముద్రింపబడినది. కావున నింకను దీని ప్రాశస్త్యము ద్విగుణిత
మగుచున్నది. "శివతత్త్వ రత్నాకర" మను పూర్వోక్త గ్రంథమునను
(౧౦౫ పుటలో) ఈవిషయము ఇంచుక విస్తారముతో వచ్చినది. అది
యిట్లు కలదు:—

"తతః స రేవణాసిద్ధ సంప్రదాయ ప్రవర్తినాం ।
రేవణా సిద్ధసంప్రాప్తం చంద్రమౌళీశమప్యదాత్ ।
అభ్యర్చ్యానేన లింగేన తవాభీష్టాప్తి రిత్యపి॥ "

ఈ మహాగ్రంథము మదాసులో మహామహా విద్వాంసుల
పర్యావధానమున ముద్రింపబడినది. వారిలో నాంధ్రులకు సుపరిచితు
లగు శ్రీమానవల్లి రామకృష్ణకవి. ఎం. ఏ, గారును నొకరు. మదాసు
ప్రభుత్వమువారి పురాతత్త్వ శాఖాధ్యక్షులును సుప్రసిద్ధ పరిశోధకులు
ను నగు రావుబహద్దుర్, హెచ్. కృష్ణశాస్త్రి బి. ఎ. గారీ శివతత్త్వ
రత్నాకరమునకు బీఠికను వ్రాసినారు. అందొకచోట—

"One very interesting point, which must be particularly drawn attention to in the story of Vidyaranya as given in the 12th Taranga of the 4th Kallola, is the రేవణసిద్ధ సంప్రదాయ which the ఆచార్యా S. of the శంకరాచార్య line that initiated our విద్యారణ్య were then practising at శృంగేరీ. The లింగ of చంద్రమౌళీశ్వర which is still worshipped as the chief deity by the ఆచార్యా s. of శృంగేరిమఠ is also said to have been presented to విద్యారణ్య by this direct

Guru. రేవణసిద్ధ we know is a well-known Saiva teach whom the Lingayats still claim as one of their earli ఆచార్యా s. The Keladi chiefs, who were mostly follower of the Lingayat creed, were devoted adherents of th శృంగేరి-శంకరాచార్యామఠ, perhaps also for this same reas viz, that the శంకరాచార్య s were followers of the రేవణసి సంప్రదాయ. This explains perhaps why in the అద్వైతమ of శృంగేరి there is still a greater bias towards Saivis and Saiva worship than towards Vaishnavism and Krishn worship, though the founder, the great శంకరాచార్య, wa no respector of creeds nor of any distinction between శి and విష్ణు."

(శివతత్త్వరత్నాకరము నాల్గవ కల్లోలము ౧-౨ వ తరం మందలి విద్యారణ్యచరిత్రను వివరించు సందర్భమున, విద్యారణ్యులకు సన్న్యాసమునిచ్చిన ఆకాలపు శంకరపీఠాధిపతులు రేవణసిద్ధ సంప్ర దాయము ననుసరించుచుండి రను అంశము నెల్లరును గమనించదగి యున్నది. శృంగేరిపీఠమందు నేటివరకును ఆ పీఠాచార్యులచే ముఖ్యో పాసనామూర్తిగా పూజింపబడుచున్న శ్రీ చంద్రమౌళీశ్వరలింగము విద్యారణ్యులకు వారి గురువులచే ననుగ్రహింపబడిన దని చెప్పబడి యున్నది. రేవణసిద్ధుడు శివసిద్ధాంత స్థాపకు డగుట సుప్రసిద్ధము. వారు వీరశైవ మతాచార్యులలో నొకరని వీరశైవు లనుచున్నారు. శంకరాచార్యులు రేవణసిద్ధ సంప్రదాయము ననుసరించుచున్నందుననే వీరశైవు లగు కెళదిరాజులు శృంగేరి మఠమునకు శ్రద్ధగా నడుచు కొనుచుండిరి. శ్రీ శంకరాచార్యులు శివవిష్ణువులందు భేదబుద్ధిగలవారు కాకపోయినను, ఇప్పటికిని అద్వైతమఠ మనబడు శంకరపీఠమునందు లింగపూజాదులకే ప్రాశస్త్య మెక్కువగా కలదని ఈ కారణమువలననే తెలియవచ్చును.)

చూచితిరా ! వీరశైవేతరుల గ్రంథములలోను, వారి వ్రాతల లోను ఇంతవిశదముగ నీ విషయములు ప్రచురింపబడినవి. రేణుకా

ర్యుడు ఆంధ్రుడైనను శంకరాచార్యుడు కేరళదేశీయుడైనను ఇరువు
ను కర్నాటక దేశమున నొక్కచోట తమ పీఠములను స్థాపించుట జూడ
దేదో రహస్యమున్నట్లే తోచుచున్నది. రేవణుని పీఠమగు బాళే
ళ్ళి (రంభాపురి)కిని శంకరుని పీఠమగు శృంగేరికిని ౧౫ మైళ్ళ
రము మాత్రమే కలదు. శంకరుని పీఠమున నేటికిని గురుపరంపరగ
ంద్రమౌళీశ్వరలింగపూజ జరుగుచుండుట సుప్రసిద్ధము. ఈసమయమున
బోలు రేణుక పీఠమున నొక స్తంభమందు శంకరాచార్య లింగ
ధాన చిత్రము చెక్కబడి నేటికిని వెలసియున్నది.

శంకరాచార్యుని కాలము గూర్చియు రేణుకాచార్యుని కాల
మునుగూర్చియు చర్చలు సాగుచునేయున్నవి. క్రీ.శ. రెండవ శతాబ్దము
ముదలు ఏడవ శతాబ్దము వరకను విషయములో గొప్పగొప్పవారికే
వాదములు రహితముకాలేదు. మద్రాసు బి. సూర్యనారాయణ
రావు B. A. M. R. A. S. గారి విజయనగర చరిత్రలో శంకరా
చార్యుని కాలము ఒకటవ శతాబ్దమని నిర్ణయింపబడి యున్నది. రేణుక
విజయమందును రేణుకుడు విక్రమ మహారాజునకు ఖడ్గమునను గ్రహిం
న యితివృత్తమునుజూడ నీకాల నిర్ణయమును సరిపోవుచున్నది.

స్మార్తాచార్యుడు శైవాచార్యునినుండి లింగమును వడసి
పూజించుట సహజముగాదని నేటివారికి గొందరికి దోచవచ్చును. కాని
ప్రాచీనులలో నిట్టిభావము లుండెడివికావు. ఏయే విద్య లెవరినుండి
సాధించిన సమగ్రముగా లభించునో అట్టి యాచార్యులనుండి యాయా
జ్ఞానమును సంపాదించుట సంప్రదాయసిద్ధమే! పరకాయప్రవేశ
మునర్చి కామశాస్త్రమునుదెలిసికొనిన అద్భుతమూర్తియగు శంకరుడు
శైవాచార్యులనుండి శివరహస్యము నందుకొనిన-చో వైరుధ్యమేమియు
ను.

"లింగస్య ధారణాదేవ శివోఽయం జీవతాం వ్రజేత్ ।
లింగనాశే శివస్యాస్య జీవతావేశతా కుతః॥ ౭౩॥"

అని "యద్వైతానుభూతి"లో లింగధారణమును విమర్శించిన
శంకరుడు శివలింగమును స్వీకరించుటయు పూజించుటయు పొసగదని

కొందరు వివదించవచ్చును. ఇట గొంత దెలియజెప్పవలసియున్న
అద్వైతానుభూతిలో జగన్మిథ్యాత్వమును జెప్పు సందర్భమున పై
శ్లోకము వచ్చినది. ప్రకరణానుసారము ఆశ్లోకమునకు "నిర్మలుడై
శివుడు జీవత్వకారణమును భావించి యంటుకొనుచో జీవుడే య
చున్నాడు. అట్టి కారణలింగము (జీవచిహ్నము) నాశము పొందినప్పు
జీవత్వభానమెక్కడిది?" అనిసహజముగభావము చెప్పుకొనదగు. అంతియే
కాని శైవులుధరించు ప్రాణలింగవిమర్శ ఇచ్చట యెంతమాత్రము లే
నుట విద్వద్వేద్యము. అటులగాక "ఓనమాలు" (అక్షరార్థము) మాత్రమే
చదువుకొనిన బాలకులు పైశ్లోకమునకు "లింగమును (అనగా నే
శైవులవలె) ధరించినందువలననే శివుడు జీవత్వమును పొందును" అన
పూర్వభాగమును మాత్రమే శైవవ్యతిరిక్తముగ నుపన్యసించుచో
స్వవచనవ్యాఘాతమును శంకరాచార్యుని కంటగట్టవలసి యుండును?
కొన్ని డజనుల పూర్వపక్షములు బైలుదేరగలవు. పై శ్లోకమున కంటె
మొదటను తర్వాతను—

జీవేశ్వరాది భావేన భేదం పశ్యతి మూఢధీః
నిర్భేదే నిర్విశేషేఽస్మిన్ కథం భేదో భవేద్ధ్రువం॥ ౭౧
శివఏవ సదాజీవో జీవఏవ సదాశివః
వేత్త్యైక్య మనయో ర్యస్తు స ఆత్మజ్ఞో నచేతరః॥ ౭౩

శంకరాచార్యులే జీవేశ్వరులకు భేదము లేదనియును శివజీవు
లేకమే ననియును సెలవిచ్చి యున్నారు. భేదము లేనపుడు లింగము
శివుకు జీవుకు, అను పదార్థము లేమిటి? శివజీవాతిరిక్తమైన లింగము
మరొకటి కలదా? లేక దానిని శివలింగమనియో జీవలింగమనియో
అర్థము చెప్పవచ్చు నన్నచో భేదమేలేని శివజీవులకు ప్రత్యేకలింగము
లెచ్చటినుండి కలిగినవి? అంతయు నిర్విశేషమైయుండ శివుడు లింగ
మును ధరించి జీవుడయ్యెనను భ్రాంతి (సవిశేషము) యే మూఢునకు
గలిగినది? శివుడు జీవలింగమును ధరించి జీవు డగుచున్నాడనుచో
జీవుడు శివలింగమును ధరించి శివుడేల కాజాలడు? శివజీవు లేక
మంటివికదా? లింగము నశించి జీవత్వము పోవుటెట్లు? సవి

శేషులు వివాదపడుచున్నందున పుక్కిటి పురాణము జెప్పితి నందువేమో ? సవిశేషులభ్రాంతి నిర్విశేషుల యనుభవమున కెట్లు వచ్చినది? ఇదంతయు మిథ్యయను నీవాదమునే పురస్కరించుకొనినచో నీవు సవిశేషముగ పెనుగులాడు నిర్విశేషవాదముకూడ మిథ్య యేల కాదు? మున్నగు విషయములను సమన్వయించుటకు కొరవితో తల గోకుకొనవలసియుండును. కావున నిట లింగధారణ నిందాపరముగా నీ శ్లోకమును గ్రహించక ప్రకరణాంతర విషయమని తెలియవలెను. లింగమును హస్తపీఠమునధరించి పూజించుట స్మార్తులలోను సదాచారమే కావున లింగధారణనింద యప్రస్తుతమే యగును. వీరశైవులు పూజాకాలమునందేకాక యెల్లపుడును ధరింతురని యాక్షేపణచేయ వీలులేదు. ఇదియే సంప్రదాయవిశేషము. వేదాగమాదులలో బోధింపబడిన ధర్మసామాన్యవిశేషములు అధికారి తారతమ్యమునుబట్టి సంప్రదాయముల సమన్వయించుచుండు ననుసంగతిని సమర్థుడైన గురువు నాశ్రయించి గ్రహించవలసియుండును. స్వసమయానుభవమేలేని దురాగ్రహులకు మనము జెప్పవలసి యుండదు.

రేణుకాచార్యునిగూర్చి "కాంచీవిష్ణుశిరఃకంపస్తంభనము" "యక్షదంపతీదమనము" "గోరక్షగర్వహరణము" మున్నగు కథలును ఆ యా కథలకు సంబంధించిన వివాదతత్త్వనిరూపణమును వేరొక ప్రత్యేక గ్రంథమున బ్రకటింప బడవలసియుండును. ఆ యా ఘట్టములకు దగిన చిత్రములును కలవు. ప్రస్తుతము శ్రీ శంకరాచార్యలింగప్రదానమునుగూర్చిన చిత్రము ఈ సంచికలో ముద్రింపబడినది. శ్రీ జగద్గురు రేణుకాచార్య భగవత్పాదుల వారికి సంబంధించినగాథ చాల విపులమై సమర్థముగనున్నది. ఈ చరిత్రయంతయు వెల్లడియైన పిదప వీరశైవేతిహాసమునకు మహోపకారముగా నున్నది. తచ్చరిత్ర రచనమున కొకరు పూనుకొనియున్నారనియును, దానికి నితిహాసాంశములతో గొప్ప పీఠికయు జేర్పబడుననియు తెలియుచున్నది. ఇట్టి ధర్మకార్యమును పుణ్యాత్ములు నెరవేర్తురుగాక !

[234 వ పేజీ చూడుడు]

# శారదాదేవీ!

బాలకవి అల్లమరాజు నారాయణరావుగారు.



గీ॥ శ్రీకరంబగు నీదయ్యన్ లోకమాత
నిన్ను సేవించు నాపైని నింపుమమ్మ
బాలకవినమ్మ! బొబ్బిలి వాసమమ్మ
శారదాదేవి! నీకున్ జోహారులమ్మ!

గీ॥ కవి గణంబుల పాలింటి కల్పవల్లి
ప్రాజ్ఞ నికరంబుఁగరుణఁ గాపాడుతల్లి
పరమ పావని! కమలసంభవుని రాణి!
శారదాదేవి! నీకున్ జోహారులమ్మ!

గీ॥ సర్వవేదంబులకును శాస్త్రంబులకును
విమల సంగీత సాహిత్య విద్యలకును
అఖలశక్తుల కాధారమయి వెలుంగు
శారదాదేవి! నీకున్ జోహారులమ్మ!

---

[233 వ పేజీ తరువాయి]

శ్రీ రేణుకాచార్యుల పీఠమునకు ప్రస్తుతాధిపతులైన శ్రీ సద్గురు శివానంద రాజదేశీ కేంద్రులవారు వ్యాకరణతీర్థ ధర్మభూషణ బిరుదాంకితులు, వీరశైవమతాభివృద్ధికై వివిధముగ బ్రయత్నించుచున్నారు. కర్నాటకమున ౧౮ సంవత్సరములనుండి సంచరించుచు వైభవమును మరల హస్తగతము గావించుచున్నారు. మైసూరు రాజధానియందు శ్రీమహారాజాగారి యంతఃపురసన్మానమును, బహిరంగము పురప్రవేశమహోత్సవమును పొంది యాధునిక వీరశైవాచార్యులలో మున సర్వశ్రేష్ఠులై విరాజిల్లుచున్నారు. శ్రీవారి సంస్కృత కళాశాల యొకటి బెంగుళూరు నగరమున ప్రారంభింపబడినది. శాంతి శమదమాద్యనుష్ఠాన పరిపూర్ణులైన శ్రీవారి దర్శన భాగ్య మాంధ్రవీరశైవులకు నేత్రాంజనము. శ్రీజగద్గురువుల ఛాయాచిత్రము నిందువెంటగలదు. ఇటులే వీరశైవవాఙ్మయేతిహాసము లీ 'విభూతి' యందు ప్రత్యక్షమగుచుండుగాక!

గీ॥ తల్లి ! భవదీయ కరుణామృతంబుఁ గ్రోలు
కాంక్షతో దీక్షతో మునుల్ కవులు సురలు
నిన్నుపాసించు చున్నారు నిఖిలశక్తి !
శారదాదేవి ! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ అరయఁ బదియు రెండేండ్ల ప్రాయంబునుండి
జిలిబిలి హొరంగుపల్కులన్ జెన్నుమీఱి
మించి నాచేతఁ గయితఁజెప్పించి ప్రోచు
శారదాదేవి ! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ ధరణియందు సప్తాదశాబ్దములనుండి
నీదు మంత్రోపదేశంబు నే గ్రహించి
దీక్ష నెరవేర్చుచున్నాఁడ దివిజవినుత !
శారదాదేవి ! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ మోహలేఖలు, నాటకంబులును, ఖండ
కావ్యములు స్తోత్రములు శతకంబు లాది
వెన్నో నాచేతఁ జక్కఁవ్రాయించినావు
శారదాదేవి ! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ వింటి వల్లమరాజు వారింటిపేరు
సింహబలుఁడు వరాహ నృసింహమూర్తి
కన్నజనకుండు; పేరమ్మ కన్నతల్లి
శారదాదేవి ! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ ధరణిసురుఁడను మరియుఁ దోటలవ నేను
ప్రకటముగ నారాయణ రావటంచుఁ
బిలిచెదరు నన్ను లోకులు ప్రేమతోడ
శారదాదేవి ! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ వారిజానన! షోడశవత్సరంబు
వీడువేళను మన్మాత యెటులో నాకుఁ
బరిణయము జేసి బాంధవ ప్రణుతులొందె
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ !

గీ॥ నేనుపుట్టిన యేడాదిలోన తండ్రి
స్వర్గమున కేగెనంచు మావారలిప్పు
డనుకొనఁగ విందు నే కాని అది యెఱుంగ
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ అమర తరువును గచ్చచెట్టలము కొన్న
కర్మమున నాకుఁ జేకూఱె ధర్మపత్ని
ప్రేమలేకుంట నాయమ్మఁ విడిచినాఁడ
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ కూతులుండిన నేమి? లేకున్న నేమి?
అడవిఁగాచిన రేయెండ యట్టులాయె
గోవుతోఁగూడ లేగలుబోవకున్నె?
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ పూజితాత్ముండు బొబ్బిలి పురము నేలు
రావు శ్వేతాచలపతి శ్రీరంగరావు
దయను బోషించి నాకు విద్యలనొసంగె
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ కేతవరపు వంశాంబుధి శీతకరుఁడు
ధీరవజ్రి వేంకటశాస్త్రి దేశికుండు
నీవు నాతండ్రు నాతోడు నీడనుండు!
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ కాపురంబంట మును పీఠికాపురంబు
చేరినారంట బొబ్బిలి క్షితితలేంద్రుఁ
డెదియొ మావారి కుద్యోగ మిచ్చుకతన
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి నుల్లమందు
నెంచకయె గ్రంథమెదియు రచించనమ్మ!
కోరితిని వాని మా కులగురువు గాను
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ నాకు నిరువదినాల్గేండ్ల నాఁడుతల్లి
ముద్దుగాఁ బెంచునది నాకమునకుఁ జనియె
అదిమొదల్నాకు దిక్కెవ్వరైన లేరు
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ గోకులానందము కులాబ్ధి కుముదహితుఁడు
శ్రీవరాహ నృసింహము శీలగుణుఁడు
మన్ననముసేయు నాకు జామాతకాన
కూర్మిఁ గాపాడు నా యక్క కొమరుఁడౌట
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ అయ్యొ! మామయ్య దిక్కులేనట్టివాఁడు
అయ్యనే! యంచు నిత్య దుఃఖాశ్రువులను
నిండుగాఁ గార్చు నా భగినీతనూజ
విమల వేంకటరమణాంబ వెక్కియేడ్చు
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ కలరు మిక్కిలి జుట్టముల్ కఠినమతులు
ఉర్వి నా పచ్చ నెయ్యెడ నోర్వలేరు
ద్రోహమే నాకుఁ దలఁపోయు తులువలిస్సి
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ నన్ను వెంటాడు మిత్రబృందంబుకూడ
నను ఫకీరునిఁగాఁ జేసి చనెడువారె
కాని నామేలుగోరుట కల్ల నమ్మ
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ॥ చేసినారెందరో నాకుఁ జెడ్డ మివుల
కాని నీదయ నాపైఁ బ్రకాశమైనఁ
గానకుందురె రిపుల దుర్గతుల నిచట
శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ! (సశేషము)

# గ్రంథాలయములు ద్యూత గృహములా?

# విజ్ఞాన నికేతనములా?

## ఆంధ్రవ్యాస నిపుణ, అవ్వారి సుబ్రహ్మణ్య శర్మగారు



పరికృత భారతమున మహాసంక్షోభముగ, బీభత్సముగ హృ-
య విదారక దృశ్యములు నేత్రగోళములకుఁ గన్పట్టుచున్నయవి. ఎ-
మెడలఁ దానమై భారతీయుల కుత్తుకలఁ దుంప నశాంతి దేవత త-
మిధిమినాట్యధ్వనులతోఁ గూరిరముగ నృత్యమొనరించుచున్నయవి.
అశాంతిదేవత నాట్యధ్వనులకుఁ బ్రోత్సాహకరంబులగు తళతళ మె-
యు వాఁడికత్తులు తాళముల వాయించుచున్నవి. చూచినంతన గుండెలు
పటిల్లుమని బ్రద్దలుచేయు మరఫిరంగులు భరతమును మ్రోయిం-
చున్నవి. విప్లవకారుల వక్రమార్గప్రచార భయంకరారుణ క్రో-
వహ్నిజ్వాలలు కాళ్ళగజ్జియల మ్రోతలరీతి యార్తనాదములఁ బుట్టి-
చు చున్నయవి. పాలకుల ఫీంకారములు దిశలఁ బొబ్బరిల్లుచున్నవి.
స్వార్థపరుల దుష్టప్రళయ తాండవధ్వనులు దిక్తటముల నిండుచున్నవి.
కడుపుల నింపుకొనుటకు దరిగానక నేడ్చుచున్న పేదజీవుల
మొఱ్ఱలు భూనభోంతరాళముల మారుమ్రోయుచున్నవి. అనేకుల
జీవములు ప్రేక్షకస్థానముల వహించుచున్నవి. దుర్మార్గులవలన నమా-
యకజీవము లాహుతులగుచున్నవి. వారి శరీరములంగల రక్తనాళ-
ముల పీల్చి, పిప్పిచేసి, దుమ్మురీతిగ నెగురగొట్టఁబడుచున్నయవి. వారి
హృదయగ్రంథులఁ బెకల్చి, ఆశాయుధములతో జీవితనౌకను భగ్నము
గావించుచున్నారు.—ఇంతయేల? స్వార్థపరులగు రాక్షసుల పదతాడన
ములక్రింద పాటకజనము, భారతదేశము నలిగి ధూళియగుచున్నదనినం
జాలును.

భయంకరారుణసమస్య లిట్టులుండ భారతీయులు సనాతనాచార ధర్మములు కల్పితములనియుఁ గుక్షింభరులగు స్వార్థపరులచేఁ గల్పింపఁ బడినవనియు భావించుచున్నారు. తీవ్రవాదవర్త్మమును పరంపరగఁ బ్రతిపించుచున్నారు. జంకులేనిపట్టుదల వహించినారు. భీతిమెఱుంగని వీరులని చాటుచున్నారు. ప్రతివిషయమునందు సంస్కరణము లత్యావశ్యకములని ముక్తకంఠముల ఘోషించుచున్నారు. అందు కార్యశూరత్వమును చూపుచున్నారు, ముందంజ వేయుచున్నారు. విజయోత్సాహములను లోకమునకుఁ జూపుచున్నారు.

భారతీయసోదరుల దృష్టిపథమునకు గోచరించిన సంస్కరణములలో గ్రంథాలయములఁ బ్రతిష్ఠించుట యొకటని యాబాలగోపాలము నకుం దెలియనిదికాదు. "ప్రాచీనకాల మహాపురుషులే గ్రంథాలయములు. వారిహృదయములే విజ్ఞాన నికేతనములు. వారి శరీరములే సారస్వతజీవగఱ్ఱలు. వారినుడువులే సుభాషితము"లని యిప్పటి నాగరక సంఘయులెల్లరు నొప్పుకొనుచునేయుండిరి. అట్టి సారస్వత శరీరధారులు కానందుననే విజ్ఞానము నార్జించుకొన గ్రంథాలయముల ప్రతిష్ఠించుటకుఁ బూనుకొనిరి. గ్రంథాలయ స్థాపనము సర్వవిధముల శ్రేయోదాయకమని యాసేతు హిమాచల పర్యంతము నెల్గెత్తి విజ్ఞాన కేంద్రముల స్థాపింపుఁడని ప్రచారము సేసిరి. ఎట్టకేలకు నిందుఁ గృతకృత్యులై సేతు శీతనగమధ్య ప్రదేశమునం దెల్లయెడలఁ బ్రోత్సాహకరంబులై — జ్ఞానదాయకములై — ముక్తిసౌధమునకెక్కెడి సోపానములై — గమ్యస్థానములఁ జేర్చెడి నౌకలై — రసాశ్రియభాండారములై — చిక్కి శల్యావశిష్టులై ప్రాణముల విడుచుటకు సిద్ధమగనున్న కుమారుల జీవితముల రక్షించుటకు సంజీవిఘుటికలై — దేశదాస్యవిమోచమునకు నూతగఱ్ఱలై — జీవగఱ్ఱలై వెలయు సరస్వతీ భాండాగారములను వేనవేలు ప్రతిష్ఠించిరి.

ప్రతిష్ఠింప, భాండాగారములలోఁ గొన్ని ప్రోత్సాహములు లేక పుబ్బలో పుట్టి మఖలో మాయమైనవి. మఱి కొన్ని జీవచ్ఛవములుగ వెలయుచున్నవి. వేరొక కొన్ని దారి గన్పింపక దివాంధ

ఘూకముల రీతిగ నెలయుచున్నవి. వేరింకొక కొన్ని, వ్యక్తులచే
సంఘములచేతను పోషింపఁబడుచున్నవి.

ఇట్లు వ్యక్తులచేతను, సంఘములచేతను పోషింపఁ బడుచు
గ్రంథాలయములు విజ్ఞాన ప్రచారము సేయఁజాలక పోఁగా వి
మిక్కిలి భావదాస్యప్రచారమునకు దుర్వినియోగమునకుఁ గేంద్ర
ములుగ మారుచున్నవనిన నతిశయోక్తి గానేరదు.

ఏవిజ్ఞానము నార్జించుకొన విజ్ఞాన నికేతనములు ప్రతిష్ఠిం
బడినవో యట్టి యాశయమును నవీన కుమారులు మరచిరి. భావదా
మున మునిఁగిపోయిరి. వారి శరీరమునంగల ప్రతిరక్తబిందువును దా
మును పురికొల్పుచున్నవి. వారి సంకల్పములశక్తి తగ్గి విఫలీకృత మ
రథులఁ జేయుచున్నవి. ఇంతియగాక, గ్రంథ భాండాగారోద్దేశ్యము
సంపూర్ణముగ మార్పుజెందించుటకు ప్రయత్నించుచున్నది.—స
సన్నగ మార్పు చెందించుచున్నది.

"గ్రంథాలయోద్దేశ్యములు మారుటలేదు; దుర్వినియోగ కేం
స్థానములుగ విలసిల్లుటలే"దనుచో గ్రంథాలయముల నీపేకాటలేల
చదరంగపుబల్లలేల ? ధూమపాన పిశాచీ నాట్యధ్వనులేల ? కేకిసలిం
లేల ? హాస్యరస ప్రవాహమేల ?

కుమారా ! ఇట్టి పనులు విజ్ఞాన కేంద్రముల నాచరింపవచ్చునా
ఇట్లుచేయుట మహాపరాధముకాదా ?—అగునని . నీ కన్నులకుఁ గో
రించుటలేదా ? నీ హృదయకుహరమునందీసమస్య సంక్షోభింపఁజేయు
లేదా ? నీకర్ణములందీ ధ్వనులుమారుమ్రోఁగుటలేదా ? ప్రతిక్షణమ
నిన్నీ సమస్య బాధించుటలేదా ? ఏగ్రంథాలయమునందు చూచిన
చదరంగపుబల్లలే కానవచ్చును. మూవురో నలువురో యాబల్లచుట్టు
జేరి రాళ్ళను కొట్టుకొనుచుందురు. గ్రంథాలయములకు వచ్చువారిలో
ముప్పాతికమంది నీయాటల నాఁడుకొనుటకే వచ్చుచుందురు. శేషించి
పాతికమందిలో మూఁడువంతులవారు కాఫ్రులను సవరించుకొను
కబుర్లు చెప్పుకొనుచుందురు. ఇక యొకవంతు వారు మాత్ర

త్రికలను, చదువుచుందురు. నూటిలో తొంబదిమంది ఇట్లు
ోగా శేషించిన పదిమందిలో తొమ్మండుగురు నవలలను
ంతురు. ఒకఁడు మాత్రము విజ్ఞానగ్రంథములను పఠించును.
నికొఱకే బీరువాతలుపు తెరువంబడుచున్నది. ఇతఁడును లేని-వో
రువాలలోనున్న గ్రంథములు క్రిమికీటకముల కాహారములై, బూజు
ట్టి యందే యణఁగిపోవును. ఇట్టి స్థితి విజ్ఞానమూర్తులమని విఱ్ఱవీఁగు
ారిచే నడుపఁబడుచున్న గ్రంథాలయములకును, పెద్దపెద్ద గ్రంథా
యములని పేరుచెందిన వాటికిని సంభవించుచున్నది. గ్రంథాలయ
ిపాలకు లిట్టి దుష్టమార్గ ప్రచారముల నరికట్టుటకు మాఱుగ
ప్రోత్సాహ మిచ్చుచున్నారనిన కడు చింతాకరము, విషాదకరము.
ిమలపవిత్రమాత భారతమాత విలాపపరంపరయును.

భారతీయసోదరా! చదరంగమాఁడుట ప్రాచీనాచారములలో
ొక్కటి. కాని, దీనిని సనాతనులు కడు హైన్యముగ వర్ణించి, నిషేధ
మొనరించిరి. ఇద్దానివలన నలుఁడు, ధర్మజుఁడుగాఁగల ప్రాచీనవీరులు
సహ్యమై, తుచ్ఛమై, హైన్యమైన నికృష్టస్థితి ననుభవించిరని నీకుఁ
దెలియును. ఇయ్యది దాస్యమునకుఁ బ్రథమ సోపానమనియు నంగీక
ింతువు. అట్టిపట్ల సర్వానర్థములకు మూలకందమైన చదరంగముల
విజ్ఞానదాయకములగు నికేతనములందా యాడించుట; ప్రోత్స
హించుటలు.

ప్రతిక్షణము సనాతనాచారముల నిషేధమొనర్ప ప్రచారము
సేయుచున్న నీవు దుష్టకర్మ ప్రచారమై, నీచాతినీచముగ పరిగణింపఁ
బడిన చదరంగముల, ధూమపాన పిశాచీనాట్యధ్వనుల, చీట్లయాఁటల,
కేకిసలింతల, హాస్యరస ప్రవాహముల గ్రంథాలయమునందు జరుగ
కుండునటుల ప్రయత్నింపుము. బోధించుము. వినని పక్షమున భీకర
కఠోర శాసనముఁ గావింపుము.—?—

ఇంతటి స్వల్పపనిఁ జేయలేని వాఁడవు, పరభయంకర శత్రు
మస్తక విదళన కుఠారమై వెలయు బ్రిటీషు హస్తమునుండి స్వదేశ

స్వాతంత్ర్యమును సంపాదింపఁగలవా? మూర్తీభవించిన వీరరుద్రమూ వని చాటించుకొనఁగలవా? విజ్ఞానమూర్తివై వెలయఁగలవా?—

నీపరితాపము, శౌర్యము, తేజస్సు గృహములనున్న మగువల జూపుటకే వినియోగమగునుగాని, నిట్టి వకరిపరిచారములకు వినియో మగుట కష్టము. కష్టమనుటయేగాదు. కష్టాతితరమనియు ననవచ్చు

కుమారా! ఇపుడైనను మించినదిలేదు. గతజలసేతువునకు రింపకుము. దుష్టమార్గ పరిచారముల నరికట్టుము. గ్రంథాలయము విజ్ఞాన నికేతనములుగఁ జేయుము. తన్మూలములన భారతమా విలాపముల నాలకించి, కన్నీటి కెరటములంజూచి దేశదాస్యవిమో నమునకుఁ బాటువడుము. ప్రాణమునర్పించుము. ప్రాక్ప్రతీచీభ ములందు భారతీయ వీరతేజమును ప్రదర్శింపుము. చిరస్థాయిగ భవ వీరనామము చరిత్రస్థానమునం దుండునటుల ప్రయత్నించి కృతకృత్యు వగుము. రానున్నకాలమువారికి మార్గదర్శకత్వమును ప్రకటించుము.

గ్రంథాలయములందు ప్రస్తుతము జరుగుచున్న యన్యాయ లను రూపుమాప మరియొకసారి హెచ్చరించుచు నింతటితో విరమిం చుచున్నాను.

---

## 'విభూతి'—సహాయకులు



ఇదివరకు ముప్పదిరూపాయీల నొసగిన నరసాపురం శ్రీ చదల బసవశంకరయ్యగారు తక్కిన ఇరువది రూప్యముల నొసంగి స యకులగుటయే కాక 'విభూతి' ప్రచారము నభిమానముతో సాగిం చున్నారు. తక్కిన ప్రచారకుల యుపకార విశేషములను నామముల ముందుపత్రికలో ప్రకటించగలము. —సంపాదకుడు.

# విదేశీయ 'దేవ' శబ్దములును వేదమునుండియే వెడలినవి

తేవతియ రామపాలసింగు, బి. ఏ. ఎల్. టి. గారు

---

ప్రపంచమున నేడుపలబ్ధ భాషలలో వేదములే యత్యంత ప్రాచీనము లనియును, మరొక భాషాగ్రంథ మింతటి వెనుకటిది లభించ లేదనియును, ఇతిహాస పరిశోధకు లంద రంగీకరించియున్నారు. పరిశోధన సాగించినకొలదియు సమస్తవిజ్ఞానము వేదమునుండియే పుట్టినదను ప్రాచీనుల సిద్ధాంతమును నవీనులుసైతము ఒప్పుకొనవలసి వచ్చుచున్నది.

దేవుడొకడు కలడా లేడా ? యను వివాద మెటులున్నను దేవుడను వ్యవహారమునందుపయోగించు వివిధభాషల శబ్దములును వైదిక శబ్దములనుండియే పుట్టినవనుటకు సయుక్తికమైన సాధనములు కన్పట్టుచున్నవి. దేవార్థము నిచ్చునట్టి శబ్దములు అరబ, ఫార్సీ, యహూదీ, లాటిన్ మున్నగు భాషలలో నున్ననను సర్వజనవిదితము. వానిలోని కొన్ని శబ్ద స్వరూపముల విచారించి వేదములోని శబ్దములకు పోలిక కనుగొనవలసియున్నది. ప్రస్తుతము అల్లా (Allah) జెహోవా (Jehovah) గాడ్ (God) ఆమీన్ (Amen) ఖుదా (Khuda) బాగ్ (Bog) ఉర్మజ్ద్ (Ormuzd) ఇబ్రాహిమ్ (Ibrahim) మున్నగు శబ్దముల నిరుక్తిని మాత్రమే యిట జూపుచున్నాను.

ఋగ్వేదము (౧౦-౧౦-3) లోని—

ఆజుహ్వాన ఈడ్యోవంద్యశ్చాయాహ్యగ్నే వసుభిః సజోషాః ।
త్వం దేవానామసి యహ్వహోతా స ఏనాన్యక్షీషితో యజీయాన్ ॥

వైదికమంత్రములకు దేవతలుండుట సంప్రదాయము. ఈ మంత్రమునకు దేవత "ఈల" ఈ యీలశబ్దమునకు "స్తుతియోగ్యుడు"

అనియే యౌగికముగ నర్థము కలదు. .కురాను షరీఫులో ఇలా (Ilah) అల్లా (Allah) శబ్దములు, ఈ యీలశబ్దమునకు రూపాంతరములనియే చెప్పవచ్చును. సెమిటిక్ భాషలలోని ఈల, ఇలోహ, ఈలోహిం; అను ఈశ్వరవాచక శబ్దములును ఇటులే బైబులు యుండును. ఈల ధాతువునకు "స్తుతిప్రేరణాదీప్తిజ్ఞానగమన ప్రాప్తిషు యను షడర్థములుగలవు. భాషా నియమానుసారము ప్రాయశః "ఈల్ ఈల్, ఈర్, ఇల్, ఇడ్, ఇర్" అను ధాతువులన్నియు నొకేధాతువునకు జెందియున్నవనవచ్చును. కొందరనుకొనినట్లు సంస్కృతభాషలోని అల్ల శబ్దములోనుండి అల్లా శబ్దము అరబ్బీకి వచ్చినదనుట పొరపాటు. అరబ్బీభాషా సంప్రదాయము నెఱిగినవారీ విషయము నంగీకరించజాలరు. మనలోని అకారములు ఇకారముగాను, ఇకారములు అకారముగాను మారుట యీ భాషలోని వైశిష్ట్యము. అరబీలోని అల్లా శబ్ద మొక సంయుక్త శబ్దము. అల్ (ఇంగ్లీషులోని డెఫెనిట్ ఆర్టికల్ The యని దీనికర్థము) మరియు ఇలా (సంస్కృతములోని ఈలధాతు రూపాంతరము) అను రెండు అరబీశబ్దములు గలిసి అల్లాయైనది. కావున దీనికి కేవలము ఈశ్వరుడనియును (God) అల్లా శబ్దమునకు పరమేశ్వరుడనియును (The God) అల్+ఇలా=అల్లాఅనియు అరబీసంధిని గమనింపవలెను. ఫ్రెంచ్ భాషలోను ఈ "అల్ ఆర్టికల్" యొక్క రూపాంతరమే "లా, లీ, లే, ల" లుగా మారినది. దీనియర్థము ఇంగ్లీషులోని The యని మాత్రమే గ్రహించదగును. సంస్కృతములోని "భూషణ సామర్థ్య పర్యాప్తి వారణా" ర్థముగల అల్ ధాతువునుండియే యిది పుట్టినది.

పై మంత్రమున "యహ్వాహోతా" యను చోటగల యహ్వ శబ్దమునుండియే యహూదుల జెహోవా శబ్దము (Jehovah, Also Yahoweh) పుట్టినట్లు నాకు దోచుచున్నది. "యజ్ దేవపూజా సంగతికరణదానేషు" ధాతువునకు ఔణాదిక 'వన్' ప్రత్యయముదవిలి నిపాతనమువలన జకారమునకు హాకారమగుచు 'జహ్వాః' యగుచున్నది. మహాయజమానుడని దీని కర్థము. (Almighty Lord) ఈశ్వరుడే

ాంతుడు (Almighty) అతడే విశ్వమునకు యజమానుడు (Lord)
మంత్రిమందలి "హోతా" శబ్దమునుండియే ఇంగ్లీషులోకి God
ప్పనదని భావించుచున్నాను. జెంద్ అవెస్తాలో హోతా శబ్దము
ోతా (Zaota) గా మారి, జఓతా రూపము గాథిక భాషలోనికి
ా (Gutha) గాను గుథ్ (Guth) గాను రూపాంతరమును బొంది
ర్మనీభాషలో గాత్ (Gott) గా పరిణమించినది. మరియు నీ గాతే
గ్లీషులోని గాడ్ (God) గా స్థిరమైనదని నొక్కి వ్రాయ నవసరము
నుకొందును. ఈ యీాల యహ్వ హోతృశబ్దములు వైదిక సూక్త
ులలో ననేకచోట్ల ప్రయుక్తములైనవికాని ఒకేమంత్రమున కను
టకొరకై యీ మంత్రిమునే ఉదహరించితిని.

ఓం శబ్దమునకు ప్రాయికముగా బర్యాయ పదమైన ఓమన్
బ్దమునుండి అరబీలోకి ఆమీాన్‌గాను ఇంగ్లీషులోకి (Amen) గాను
ారినది. ఋగ్వేదమున (౧-౬౫-౪) నీ యోమన్ శబ్దము ప్రయుక్త
ునది. (ఓమనా = అవనేన) ఇది రక్షణమున్నగు ౨౧ అర్థములు
ల 'అవ్' ధాతువునకు మన్‌ప్రత్యయము జేరగా సిద్ధించినది. ఓంకార
ును మనము మంత్రాదియందును ఒకప్పుడంతమున నుచ్చరింతుము.
మీాన్ శబ్దమును కురాన్-ఇంజీల్ మతస్థులు అంత్యమునందే యుచ్చ
ింతురు. ష్వద్ ధాతువునుండి సిద్ధమైన స్వధా-వికారమే వారి ఖుదా
ునదని నిస్సందేహముగ జెప్పవచ్చును.

ష్వప్ ధాతువునుండి ఫార్సీలోని 'ఖ్వాబ్' శబ్దమును, స్వతః
ుండి 'ఖుద్' శబ్దమును పుట్టినటులే సంస్కృతమందలి స్వధాయే ఖుదాకు
ూలమని లెస్సగ దెలియవచ్చును. ఋగ్వేదమున (౧౦-౧౨౯-౨౫)
నికి నాధారము కలదు. వేదాదులలో స్వధయనగా ప్రకృతిలేక బ్రహ్మ
క్తి యను నర్థమున్నను అద్వైతవాదులు స్వధకు బ్రహ్మార్థమునే చెప్పి
ున్నారు. కావున మరి మతాంతరులు దానినే భగవంతునిగా దల
ుటలో నాశ్చర్యములేదు.

స్లైవిక భాషలో ఈశ్వరార్థమున బాగ్ (Bog) శబ్దము ప్రయో

గింపబడుచున్నది. భగః భగవాన్ శబ్దములు మనలో సుప్రసిద్ధము
కావున (భజ్యతే సేవ్యతే భోగార్థిభిరితి భగః) నీభగయే బోగ్‌కు కా
ణమని వేరే వ్రాయనక్కరలేదు. పారసీభాషలోని 'ఉర్మజ్ద' (ormuz
శబ్దము అహురమజ్ద (Ahuramuzd) శబ్దమునుండి యుద్భవించినది.
మన "అసురమహద్" శబ్దమునకు రూపాంతరమే. వేదమున న
మారు లీ శబ్దము ప్రయుక్తమైనది. అసురమహద్‌కు మహాదేవ,
మేశ్వర, యను నర్థములు కలవు. కేవల ప్రాచీనవైదిక కాలమ
అసురశబ్దము కూడ దేవార్థములోనే ప్రయోగింపబడుచుండెను. ప్ర
కముగ మహద్‌శబ్దమును ఈశ్వరార్థమున వచ్చుచుండుట య
రెరింగినదే. మహత్ మహతీశబ్దముల రూపాంతరములే ఆంగ్లమం
might, mighty, Almighty, శబ్దములై యున్నవి. మన మహా శ
మువలె వారి Almighty, శబ్ద మొక్కటియే ఈశ్వరవాచక
యున్నది. మరియు నిటులే మహదసుర (మహాదేవ), లేక అసు
మహద్, మహాసుర, శబ్దములును; ఫార్సిలోని అహురమజ్ద, హుర్మ
ఉర్మజ్ద; శబ్దములును పరమేశ్వర వాచకములని తెలియవలెను. ఋ
దమున (౨-౧-౬) "అసురః మహః" అనియును అథర్వమున (౫-౧౧-
'మహే అసురాయ' అనియును మహేశ్వరార్థమున నగుపడుచున్న
సుప్రసిద్ధమైన బ్రహ్మశబ్దమునుండి అరబీలోని ఇబ్రాహిమ్ వచ్చి
దనుట సర్వసామాన్యము. ఇటులే వైదికభాషలో సరిగ వెదకిన
నేడు విశ్వమందలి మానవుల వివిధభాషా వ్యవహారములో నుండె
దేవవాచకశబ్దములకు మూలము లభించక పోదని ఈ చిన్ని వివేచ
మున ప్రయత్నింపబడినది. *

---

* అల్లాశబ్దము వైదిక అర్హా శబ్దమునుండియు, గాడ్ god శబ్దము వైది
గోదః (ఇచ్చువాడు ఋ-౧-౪-౨) శబ్దము నుండియు ఖుదాశబ్దము 'శుద్ధ' శబ్ద
నుండియు నుద్భవించిన దనియును కొందరు విద్వాంసుల యభిమతమై యున్నది.

—సంపాదకుడు.

# పసిపిల్ల పరాక్రమము

## ఆర్. శంకరయ్యగారు



తుమ్మపూడి కొక దొమ్మరివాడు వచ్చాడు. వాడి యద్భుత
క్రియలన్నీ లోకం తల్లీనంగా చూస్తు ఆశ్చర్యపడుతూంది. వాన్ని పిలి
పించిన చౌదరిగారుమాత్రం ఆటలను లక్ష్యపెడుతూన్నట్టు కనపడలే.
గాని చక్కని కూతురునే గురిగా చేసుకొని చౌదరి లోకాన్ని మరచి
పోయాడు. ఆట ముగిసింతర్వాత జనం కబుర్లు చెబుతూ ఇంటిదారి
పట్టారు. చౌదరిగారు దొమ్మరివానికి బహుమానంగా ఐదు రూపాయ
లిస్తూ—

"ఈవేళ నీవెక్కడుంటావ్ ? మా మిత్రుడొకడు రేపు రా
బోతున్నాడు. ఆయనే గనకా నీయాటనుచూస్తే కావలసినంత బహు
మానం ఇస్తాడు"

"చిత్తంబాబు. రేపు వస్తానండి"

"ఇక్కడుంటేమాత్రం నీకు నష్టమేమి ? ఆటలన్నీ అయిం
తర్వాత పోవచ్చుగా ?"

సరే ఎటులో దొమ్మరివాడంగీకరించాడు. సావిడిదగ్గరి కొట్టంలో
వాడికి స్థల మిచ్చారు. చౌదరిగారు ఇలా అన్నారు.

"ఒరేయ్! ఇదిగో ఒకమాట చెప్పాలనుకొన్నాను; ఎంతసేపటికీ
ఈ పాడుదేశాన్ని ఎండా వానా అనక తిరుగుతూ ఈ సుకుమారమైన
పువ్వుని కమిలివేస్తున్నావ్. ఈపిల్లని ఇక్కడే వదిలేస్తే నీవడిగినంత
ఇస్తాను ఏం, ఏమంటావ్ ?"-

ఆ అమ్మాయి నవ్వుతూ "ఏమండి దొరగారండి నాకు పెళ్ళి
చేస్తారా ?" అంది.

చౌదరి—ఆ ! తర్వాత చేస్తాను.

అమ్మాయి—అలాయితే ఇప్పుడేంచేస్తారు? నేను ఒకరింట్లో ఉండను కూడాను. అసలు నాకు పెళ్లే అక్కరలేదు. మా అమ్మ పోయిన తర్వాత మా నాయిన నన్నే కనిపెట్టుకొని బతికాడు. ఆయన్ని విడిచి నే వెల్తానా? అన్నది.

చౌదరికి చాలా ఉడుకుపుట్టింది. "ఈ ముండే, శ్రీరంగనీతులు కక్కుతూంది. ఇద్దర్ని తగిలిస్తే రోగం ఒక క్షణంలో కుదురుతుంది" అనుకున్నాడు. పైకి మాత్రం "ఒసేయి! నీ మంచికోసం చెప్పాను గాని నాకేంలాభం? నీ మాటలన్నీ వెర్రిగా ఉన్నాయి" అని జవాబిచ్చాడు.

అమ్మాయి—సరే వెర్రిదాన్నే లేండి, మీ జాతిలో మీరున్నట్లు మా వాళ్ళల్లో మాకూ గౌరవం వుందండి. మా చేతిఅన్నం మీ రుచ్చుకుంటారా?

చౌదరి—నీలాంటి చక్కటిచుక్క వంటచేయడమేమిటి? నా దగ్గరుంటే అంతా ఆనందమే!

అమ్మాయి—మాకు సుఖం అక్కరలేదండి. ఆడటం, ఎగరడం మా విద్యలు. ఇందులో కష్టం కళిబిళీలేదు. ఒకరి దగ్గర ఉండటమే మాకు ఆక్షేపం.

చౌదరి---ఇందులో మాత్రం ఏమాక్షేపం?

అమ్మాయి—అదంతా ఎందుకు? మేమ్మాత్రం యింట్లో పుట్టలేదా?

ఇద్దరిమొఖాలు వెరబిడ్డాయి. దొమ్మరివాడికి అక్కడఉండడం గిట్టిందికాదు. తండ్రీబిడ్డా లేచారు. సామానంతా గాడిదమీద వేసుకొని, తోవబట్టారు.

౨

చౌదరికి రాత్రి నిద్రపట్టిందికాదు. చాలా ఆలోచన చేస్తున్నాడు. "వీళ్ళు సామాన్యంగా వినరు. రెండుబాదితే తోవకు వస్తారు.

వాళ్ళని పోనివ్వడమే నాతప్పు. అయితే ఇప్పుడుమాత్రిం తప్పించుకొని యెంతదూరం వెళుతారు? రేపే పన్నాగం పడుదాం" అనుకున్నాడు. తెల్లవారి లేవగానే ముఖం కడిగాడో లేదో, భార్యకూ గుమాస్తాలకూ చెప్పకుండానే బట్టలు వేసుకొని చక్కగా ఊరువెలుపలికి దొమ్మరి గుడిసెలదగ్గరకు జేరుకున్నాడు. వాడు వాడికూతురూ ఎక్కడ వెళ్లారని చాలామందిని ప్రశ్నించితే "ఎక్కడికోగాని వాళ్ళు రేత్రి వెళ్ళిపోయి నారు. ఏమైనా పనుందండి?" అని అడిగాడు ఒకడు.

"పనేం లేదుకాని, వాళ్ళ ఆట బాగుంది. మామిత్రుడికి చూపించాలిసుంది" అని చౌదరి చెప్పాడు. వీళ్ళు మాట్లాడుతూవుండ గానే మధ్యన మరొక దొమ్మరి కుర్రవాడు వచ్చాడు. "వాళ్ళా అండీ! మా బాబా అక్కాయి ఇద్దరూ మంగళగిరి అడవిలో చెరువుకట్ట దగ్గర డేరా వేసుకున్నారు. నేను అటునుండే వస్తూచూచాను" అన్నాడు.

చౌదరికి అండదొరికింది, కుర్రవాడికి కొంత ఆశపెట్టి వానితో పాటు తొమ్మిది గంటలకల్లా వాళ్ళదగ్గరకు చేరుకున్నాడు. మనస్సుకి కళపుట్టింది.

3

అమ్మాయి ఒకవైపు మట్టిపిడతలో వంటకావాలు చేస్తూవుంది. మరొకవైపు గుడిసెముందర కసువు చిమ్ముతూ నీళ్లు చల్లుతూవుంది. చౌదరిగారిని చూడగానే ఆశ్చర్యంతో "ఏమండీ! మీరిలా దయచేసా రండీ!" అంది.

"ఆఁ! ఏమీలేదు, మిమ్ములను పిలవటానికనే వచ్చాను. నిన్న చెప్పానే మావాడువచ్చాడు. మీసంగతంతా వూరివాళ్ళతో తెలిసింది కావాలు, మీయాట చూడాలని చాలాసర్దాపడుతున్నాడు. రాత్రి మీ దగ్గరకు మనుషిల్ని పంపితే లేరని తెలిసింది. ఉదయమిలా తోటలోకి వచ్చేసరికి మీ జాడ తెలిసింది. వచ్చాను". అని చెప్తున్నాడు చౌదరి. అమ్మాయి—"ఇంత భాగ్యానికే మీరు రావాలండీ? మీ దాసులం,

మనిషినిపంపితే హాజరుకామండీ?'' అంది.

చౌదరి—ఆలాయితే పద.

అమ్మాయి—ఇప్పుడెలా వెళ్ళడం ?

చౌదరి—ఏం ఎందుకు ?

అమ్మాయి—మానాన్న వూళ్ళోకి వెళ్లాడండి.

చౌదరిగారి కిది తెలియగానే సౌజన్యం మారింది. ధైర్యం
ఇష్టమొచ్చిన మాటలన్నీ అన్నాడు. అమ్మాయికి విన బుద్ధికాలేదు
నిరొత్సాహమాటంగా "ఇఖ నీ మాటలక్కరలేదు. వినవలసినవన్నీ విన్నాను
ముందు ఒక్కశబ్దమైనా పల్కవద్దంది.

దొమ్మరిముండ కింత గర్వమాఅంటూ చౌదరి మండిపోయా
డు. 'వెధవా! నీవు నన్ను భయపెట్టడంకూడానా?' అంటూ ఒరల
నుండి కత్తి దూసాడోలేదో ఆ పిల్ల చండివలె భయంకరమైన ధ్వని
చేస్తూ చౌదరిరొమ్ముముందర అమాంతంగా వాలి కత్తి నూడబె
క్కుంది. ఈ దుర్మార్గుడు యే అవయవాన్ని తాకాడో ఆపిల్ల ఒక్క
దెబ్బతో చౌదరితలకాయను మొండెంనుంచి వేరుచేసివేసింది.

క్షణంలో లోకమంతా వ్యాపించిం దీ వార్త. పోలీసులూ
జనమూ వేలు మూగారు. సాయంత్రంలోపల బెజవాడ జనమంతా
అక్కడేవుంది. తన పిల్లనూ చౌదరిపీనుగునూ పోలీసువాళ్ళు పట్టుకు
వెళ్ళే సమయంలో వచ్చాడు దానితండ్రి. కూతురి పరాక్రమాన్ని
మెచ్చుకున్నాడు. ఇలాంటి వీరబాలికకు తండ్రినైనందుకు ధన్యుణ్ణి
అనుకున్నాడు. "కాని బీదవాణ్ణి ఏంచేయను ? పోనీ మనకుమాత్రం
దేవుడు లేడా ?'' అని వెంటబడ్డాడు.

౪

కోర్టులో ఇవ్వాళ్ళటి జనం ఎప్పుడూ రాలేదన్నారు. దొమ్మరి
గుంపులూ చాలా వచ్చాయి. అందరూ నఖముఖాలా చర్చిస్తున్నారు.
"ఆడపిల్లలు ఇంటెనిండావుంటే లాభంలేదు. దేశానికంతా ఇలాంటి వ

అమ్మాయి చాలు. మానసంరక్షణకోసం చేసిన సాహసం సరిగా నేవుంది. మనమంతా తాళిబొట్టు (పుస్తె) అమ్ముకున్నా సరేకాని ఈపిల్లకు సహాయంచేయాలి. ఊరూరు భిక్షమెత్తాలి'' అంది ఒక అమ్మగారు.

"ఈ జడ్జీలకు అసలు రహస్యం తెలిస్తేగా? పైగా డబ్బుకాశించి శ్రీమంతుల కనుకూలం చేశ్శేవాళ్లూ కొందరుంటారు. ఇలాంటి బిడ్డ తమ దేశంలో వుందంటే మాత్రము వారికి గౌరవంకాదా? ఇంతకూ దాని అదృష్టం యెలావుందో మరి'' అంది మరొకమ్మగారు.

మొత్తంమీద అక్కడున్న హృదయాలన్నీ కొట్టుకుంటూనే వున్నాయి. ఇంతలో పోలీసువాళ్ళు ఆ పిల్లను బోనులోకి దెచ్చి జడ్జీగారి యెదురుగా నిలువజేశారు. ఆ మొఖం ఆ కళ్ళూ ఆ కాంతీ ఆ సంతోషమూ చూచి జనమంతా ఉప్పొంగిపోతున్నారు. క్షణములో శిక్ష ఇస్తారన్నమాట అందరూ మరిచిపోతున్నారు. న్యాయం దయా పాలించి మీ బిడ్డను బ్రతికించండిబాబూ అంటూ దొమ్మరి వాళ్ళు గొల్లుమన్నారు. తక్కనజనమంతా ఔనండీ అన్నారు. పెద్ద అల్లరిగావుంది.

౫

జడ్జి—కనికీ! నీవు చంపింది సత్యమేనా? ఎందుకు చంపావ్?

కనికి—నా మానం కోసం అలాచేశానండి క్రోధంలో.

జడ్జి—చౌదరిగారు నిన్నుకొట్టారా?

కనికి—వారికత్తీ కోపమూ సాక్ష్యమండి.

జడ్జి—ఈ కత్తి చౌదరిగారిదేనని సాక్ష్యమిస్తావా?

కనికి—అక్కడ వున్నదే మేమిద్దరమండి, మూడోమనిషి సాక్ష్యం ఎలా తేనండి? వారింటిముందర మాఆటజరిగినప్పుడే ఆయన నీచంగా మాట్లాడారండి, ఆవూళ్ళోనుండక భయమేసి ఇక్కడ చేరు కున్నామండి. ఇక్కడకూడా చాల అన్యాయంగా మాట్లాడుతూ కత్తిదూసివెయ్యబొయ్యే సమయంలో నేనూ వళ్లుమరచి ఏమేం

చాశానో మీాకే తెల్సండి? మీాచిత్తం వచ్చినట్టు చెయ్యం
అంది అమ్మాయి.

జడ్జి—నీమాటలు పనికిరావు అన్నాడు.

చౌదరిగారి పెద్దగుమాస్తాను పిలచి నీసాక్ష్య మివ్వమన్నా గుమాస్తా చాలా సత్యవంతునిలాగా ముందుకువచ్చి "అయ్యా అవ్వాళ్ళ ఆటకాగానే సాయంత్రము మాయింట్లోనే ఉన్నారు. మధ్యరాత్రి కావాలు ఉక్కపోతవల్ల చౌదరిగారు తమ రూం కె పడుకున్నారు. ఇంకేముంది? వీళ్ళు అందులో జొరబడి రత్నాల యారం చైను ఎత్తివేసి ఆరాత్రి అడివి జేరుకున్నారు. చౌదరిగా తెలివితో వెంటబడి పోరుపెట్టేసరికి ఇదంతా జరిగింది. దీనికి కావలసిన సాక్ష్యంవుందండి చిత్తగించాలి''అన్నాడు. ఇంతలో ఆ జనస్తోమంమ నుంచి ముసుగువేసుగున్న మనిషి ఒకామె ముందుకువచ్చి—

''అయ్యా! కనికి నన్ను విధవనుచేసినమాట వాస్తవమే కా దొంగిలించినమాట కేవల మబద్ధము. ఇందులో కనికి యపరాధ మాత్రము నాకు తోచటంలేదు. ఆ పిల్ల తన మానాన్ని కాపా కొనేకోసం అలాచేస్తే అపరాధం దాందికాదు. దాన్ని ప్రశంసించవ సిందేను" అని ఉచ్చస్వరంతో అన్నది.

జనమంతా మహాసంతోషంతో కనకమ్మకు జయంజయం అ కేకలువేశారు.*

---

*శివరాణీ (ప్రేమచందు) గారి హిందీకథను అవసరమైన మార్పులతో తె గించాను. ఘటన ఎక్కడజరిగినను సత్యం అనుకోండి - ఆర్. ఎస్.




(విమర్శనకు ప్రతులు రెండేసి పంపవలెను.)

**శ్రాద్ధములెందులకు బెట్టవలెను?**—కర్త, గర్గభాగవతాది గ్రంథ ర్తలును, దివ్యవాణి-పత్రికాసంపాదకులును ప్రసిద్ధులును నగు చివుకుల ప్పయ్యశాస్త్రిగారు. ప్రకాశకులు, శ్రీరామాబుక్ డిపో, మార్కెట్ ్రీట్, సికింద్రాబాదు. పుటలు ౧౩౦. వెల 0—6—0.

హిందువులు తమ పెద్దలనుగూర్చి శ్రాద్ధాయుక్తమైన సమారాధ లు గావించుట సనాతనాచారమై యున్నది. ఆధునికులు దీని క్షేపించుచు విలక్షణమైన వాదమును గావించుట జూచుచున్నాము. ్రాద్ధమనగానేమి? పితరులెవరు? పిలచుటయెటులు? ఇదివారికి ట్టుటెటులు? బ్రాహ్మణభోజనము పితరుల కందునా? ఈ ర్మలోని లౌకిక పారమార్థిక విజ్ఞాన మేమి? శ్రాద్ధము చేయనిచో పము కలదా? మున్నగు శ్రాద్ధసంబంధమైన సర్వ విషయములు స్థూల ూక్ష్మముగ నీగ్రంథమున వివరింపబడినవి. సనాతనాచారములను స్కారణముగ నాక్షేపించు సోదరు లీ పొత్తమును చిత్తగించ వలసి యున్నది. ఆంధ్రభాషకు నూత్నరత్నాభరణ మనదగు నీగ్రంథమును చించిన గ్రంథకర్తగారి నభినందించక తప్పదు. హిందువులందరీ శ్రాద్ధ హస్యమును అత్యావశ్యముగా దెలిసికొన వలెనని కోరుచున్నాము. శ్రీ రుగంటి సీతారామయ్యగా రనినటుల దీని పేరును మార్చి "శ్రాద్ధ జ్ఞానము" మున్నగు నామకరణ మొనర్చిన బాగని తోచుచున్నది.

**హైందవధర్మవీరులు:**— కర్త, సురవరము ప్రతాపరెడ్డి బి.ఎ., బి.ఎల్. గారు. ప్రకాశకులు, దేశోద్ధారకగ్రంథమాల, ఇమాం బావి వీథి, సికింద్రాబాదు. పుటలు 80 వెల 0-6-0. కాగితము రఫ్.

గ్రీసుదేశములో ప్రాచీనకాలమున "లియోనిడాస్" అ నతడు థర్మపోలి యను కొండ కనుమయొద్ద యొంటరిగ ఘోర సంగ్రా మము నొనర్చి యత్యద్భుత శౌర్యపరాక్రమముల ప్రదర్శించెనట తదాదిగ నట్లెవ రొనర్చినను వారందరికి పాశ్చాత్యులు థర్మపోలీ (Thermopylae) లని నామకరణము గావించుచు దేశమునఁ బ్రసిద్ధి దెచ్చిరి.

మన హిందూదేశమున నిట్టివారొకరు కాదుకదా! వందలకొలఁ కలరను నంశమును గమనించి శ్రీ సు॥ ప్రతాపరెడ్డిగారు చక్కని ప శ్రమతో గొంతమంది వీరుల చరిత్రనుకూర్చి దానికి హైందవ థర్మ పోలీలను నామకరణమొనర్చినారు. ఈ రెండవ ముద్రణమున నీ గ్రం థముపేరు హైందవ ధర్మవీరులని సంస్కరింపబడినది. పుస్తకముచిన్న దే కాని "అంతా నుసిబారని కణకణలాడు నిప్పుకణమే. ఇం దభివర్ణితము లైన వన్నియు రక్తము నుడుకెత్తించు వీరకథానకములు" కలదై బ్ర తుకదలచినవారును, హిందూదేశ గత పరాక్రమమును దెలియదలచిన వారును ఈపొత్తమును తప్పక నవలోకించవలెను. వెల నించుక తగ్గించ వలెను. ఉపయుక్తమైన పుస్తకము.

**శివస్తుతిచింతామణి:**— కర్త, శ్రీ విశ్వనాథేంద్ర సరస్వతీ స్వాములవారు. ప్రకాశకులు; పళ్ళె సేతునారాయణరావు పంతులు గారు. ఆనందతీర్థ ముద్రాలయము, రామచంద్రపురము, గోదావరిజిల్లా. పుటలు ౫౧౮. వెల 0-4-0. డాక్టరు శాంతి కోటయ్యగారిద్వారా మా కార్యాలయమునకు జేరినది.

శ్రీ స్వాములవారు అద్వైత సిద్ధాంతమునను సంస్కృతభాష లోను గొప్ప వైదుష్యము కలవారు. కావున శివునిగూర్చియు శివ తత్త్వమును గూర్చియు, కల్యాణమార్గమును గూర్చియు సంస్కృత

...ములో వివిధముగ స్తుతించి యున్నారు. పరతత్త్వమును ప్రత్యక్ష... మొనర్చుటకు భక్తియే మూలకందము. భక్తి యలవడవలెనన్న ...త్రములు ముఖ్యము. కావున కేవల భక్తులు కంఠగత మొనర్చుట..., విద్వాంసులు భావించి తెలిసికొనుటకును నీ స్తోత్రము లుప...క్తముగ నున్నవి. తదధికారు లీ గ్రంథము నవశ్యముగ స్వీకరించ...లెను.

శివస్తుతి యనబడు నీ పొత్తమున తారకరామ కీర్తన యను ...భాగము పానకమున పుడకలాగున నీరసముగా నున్నది. అది ...గ్రంథకర్తగారిది కూడ కానట్లున్నది. కీర్తన ఛందోభంగముగ ... కుంటువడి పోయినది. శ్రీ స్వాములవా రెవరో, ఎచటనున్నారో? ...న్నగు విషయములు తెలుపుచు నొక చిన్న పీఠిక గ్రంథాదియం ...డవలసి యుండెను. పునర్ముద్రణమున గమనింతురుగాక !

**వేంకటేశ్వరవిజ్ఞప్తి:—కర్త;** మహాకవిశిరోమణి చివుకుల ...ప్పయ్య శాస్త్రిగారు, ప్రకాశకులు, శ్రీరామా బుక్ డిపో, మార్కెటు ...టు. సికిందాబాద్, ద. అచ్చుకాగితములు అందముగా నున్నవి. ...టలు-70. వెల 0-4-0.

సనాతనధర్మపక్ష రక్షణ విచక్షణులగు కవిగారు 'వేంకటేశ్వరా' ...ను మకుటముతో, జాతులు, యజ్ఞము, జంతుబలి, శ్రాద్ధము, ...వ్యావిక్రియము, రజస్వలా వివాహములు, స్త్రీవిద్య, అస్పృశ్యత, ...ంగ్రెస్సు, హిందీభాషాప్రచారము, ధార్మికప్రబోధము మున్నగు ...షయములలో నుండెడు బాగోగులను విమర్శించుచు ధార్మిక నైతిక ...వములు ప్రబలునట్లు సరసమైన పద్యములలో నీ పొత్తమును ...ర్చినవారు. ధార్మికులు కంఠపాఠము నొనర్చి సమయానుసార ముద...రించుటకు దగియున్నది. ఇది రెండవ కూర్పగుటవలన నిదివరకే ...ంధ్రజనామోదము నందిన దని చెప్ప నవసరముండదు. మచ్చున...క పద్యము—'విగ్రహారాధన నుండి—

చ. నరు లల విగ్రహార్చన మొనర్పఁగఁగూడ దటంచుఁ బల్కు
ర్వరులె స్వవిగ్రహార్చనముఁ బ్రిత్యహమున్ బొనరించుచుండ
'చరిచి'లు 'మస్జిదుల్' 'దరగ' సన్నుతిగేహములందుఁజేరి
పరము నుతింపరే, తెలియఁబాటుపడన్వలె వేంకటేశ్వరా!

**కమాలుపాషా జీవితము—** కర్త; ఖండవల్లి బాలేందుశేఖర
గారు, బి. ఎ.; ప్రకాశకులు, దేశోద్ధారక గ్రంథమాల; సికింద్రాబాదు
రెండు భాగములలో సంపూర్తి, ప్రతియొక భాగమున పుటలు ౧౬
ఒక్కొక భాగము వెల 0-6-0, అచ్చు అందముగా నున్నది.

ఈగ్రంథమాలలో నిదివరకు గొన్ని పుస్తకపుష్పములు ప్ర
నవి. కాని ప్రస్తుత పుష్పముయొక్క సుగంధముతో నాంధ్రజనా
రాగ మెక్కువ కాగలదని తలచుచున్నాము. భాషాశైలి, విష
వివేచనము, ముద్రణము మున్నగునవి యిందుకు సాక్షి. ధైర్యసాహ
ములను బోధించు గ్రంథమాల (నిజాంరాష్ట్రమున) ఇది యొక్కటియే
ఆధునిక ప్రపంచవీరులలో కమాల్ పాషా యొక యగ్రగణ్యు
నిస్స్వార్థమైనసేవచే తురుష్కదేశము నుద్ధరించి అఖండయశమునార్జి
మొన్ననే కాలవశము నందినాడు. ఈ మహానుభావుని సమగ్రమై
చరిత్ర నేటి కాంధ్రభాషలో నగుపడుట యభినందనీయము. గ్రంథమ
పఠించునపుడు కొన్నియెడల కమాలుకు సంభవించిన విపత్తులు అత
చూపిన యద్భుతశక్తి పరాక్రమములు కన్నుల గట్టినటు లుండు
రాజకీయమే పరమావధిగ నమ్మబడుచున్న యీకాలపు యువకులెల్ల
కమాలు చరిత్రనుండి గ్రహించవలసిన యంశములు పెక్కుగలవు. ఇ
యుత్తమచరిత్రను రచించిన ఖండవల్లివారు ప్రశస్తతములు. దేశోద్ధా
గ్రంథమాలవారు తమ గ్రంథములలోని ప్రూఫ్-ఉద్ధరణమును శ్రద్ధగ
జేయించగోరుచున్నాము.

**దివ్యవాణి—** (ఆంధ్రవారపత్రిక) సంపాదకులు చివుకుల అప్పయ
శాస్త్రిగారు, ఇమాంబావివీథి, సికింద్రాబాదు. పుటలు ౧౬. సంవత్స
చందా 3-0-0. ప్రతిసోమవారము వెలువడును.

సుప్రసిద్ధులైన సంపాదకు లిద్దానిని మెనిమిది మాసములనుండి ప్రకటించుచున్నారు. ధార్మిక సారస్వత రాజకీయ ఔద్యోగిక వ్యాస ములు పండితులచే సవిమర్శగ వ్రాయబడుచున్నవి. సనాతన ధర్మ మర్యాదా రక్షణమున కయ్యును ఈ పత్రిక నిర్భయముగ రచనల ప్రక టించుచున్నది. సంపాదకీయ విభాగమందు ఆంగ్లభాషాకోవిదులును న్నారు. ప్రతివారము నిందు ప్రచురింపబడుచున్న "తోచినట్లు" అను విమర్శనా వ్యాసము ప్రతిభాపరిపూర్ణమై విజ్ఞానాభివృద్ధిని గలిగించును. ఇప్పటి కప్పుడే యాంధ్రదేశమున బ్రచారమునందిన నీ "దివ్యవాణి" నభినందించుచు ఆంధ్రమహాశయులందరు నాదరించ గోరుచున్నాము. ఇకముందు పత్రిక స్వాంతముద్రణాలయమున చక్కగ వెలువడి నయ నాభిరామతను గూర్చుగాక!

**ప్రమాథివత్సర గంటల పంచాంగమ్**—కర్త, గొట్టిముక్కల సుందరరామ శాస్త్రిగారు. ప్రకాశకులు, రాజవైద్య గూడూరు వియ్యన్నగారు. మృత్యుంజయఫార్మసి, గాంధినగరం, బెజవాడ. పాకెటు సైజు, పుటలు ౧౨౦. వెల వ్రాయబడలేదు.

ఇందు గడియలకు మారుగా నేడు వాడుకలోనున్న గంటలను నిమిషములను తెల్పినారు. ఫలాని నక్షత్రము తిథి ఇన్ని ఘంటలవర కుండునని సులభముగా తెలిసికొనవచ్చును. నేడు ఘడియ విఘడియలను దెల్పు ఘటికా యంత్రములు లోపించినవి కావున ఘంటలను ముద్రించు కొనుట సుకరము. అయితే పట్టణవాస్తవ్యుల కుపయోగించునటుల యిది పల్లెటూరివారికి బని యీయజాలదు. ఇందు పండ్రెండుమాస ముల పంచాంగముతో బాటు ప్రపంచ ఫలితములు, వర్ష యోగములు, గ్రహసంచారము, శకునములు, గౌరీపంచాంగము, గ్రహదృష్టి ఫల ములు, మున్నగునవి విశదముగా వ్రాయబడినవి. ప్రయాణికులకు మిక్కిలి యుపయుక్తము.

"రాజహంస"

---

# విభూతిని గూర్చి అభిప్రాయములు

(1) దక్కన్ వైశ్య-(నెల్లూరు 5-4-39) లో—

## విభూతి

"ఇయ్యది సారస్వత ధార్మిక సచిత్రమాసపత్రిక. సంపాదకులు సుప్రసిద్ధ పండిత శ్రేష్ఠులగు శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మ గారు. ఇయ్యది సికింద్రాబాదునుండి ప్రతినెల 22 వ తేదిన వెలువడును. మా కార్యాలయ మలంకరించిన ద్వితీయసంచికయందు పండిత ప్రవరు లగు వ్యాసకర్తలచే వ్రాయబడిన ఉత్తమవ్యాసములు, నవరసముల విరజిమ్ము పద్యరత్నములు గలవు. ఆకృతి, ముద్రిణ అపరిమితానంద మును చేకూర్చుచున్నవి. దీనిగాంచిన ప్రతి ఆంధ్రహృదయ ముప్పొంగు ననుట తథ్యము. ఈ పత్రికా రాజము నిత్యవిభూతితో దినదినాభివృద్ధి గాంచుగాక యని యాశించెదము."

(2) దివ్యవాణి (సికిందాబాదు 24-4-39) లో—

"దీని రేఖలు రెండు మా కార్యస్థాన మలంకరించినవి. ఇద్దానికి ప్రఖ్యాత పండితులు శ్రీ చిదిరె మఠము వీరభద్ర శర్మగారు సంపాద కులు. ఇందు ధార్మిక, శైవమతములకు సంబంధించిన విషయములేకాక భాషాసమస్యలు, ప్రాచీనశాసన పరిశోధనము, చరిత్రలు మున్నగు వానికి సంబంధించిన యితరసంగతులు సయితము చర్చింపబడుచుండును. ఆంధ్రులకందఱకిది యాదరణీయముగా నున్నది. దీని ప్రతిరేఖయందలి మృత్యుంజయ చిత్రము చేతఃప్రీతి గల్గించుచున్నది. ఇందు మంచి విమర్శనములుగూడ నప్పుడప్పుడు వెడలుచుండును. ముందుముందింకను సనాతన వర్ణాశ్రమ ధర్మరక్షణము గావించుటయందు దగిన శ్రద్ధజూపి వృద్ధిబొంది ధర్మదేవతానుగ్రహ పాత్రురాలు గాగలదని, విశ్వసించు చున్నాము."

(3) సందేశము (హైదరాబాద్ 30-4-39) లో—

"శ్రీ పండిత చిదిరెమఠం వీరభద్రశర్మగారి సంపాదకత్వమున
లువడుచున్న చక్కని మాసపత్రికకు స్వాగత మీయకుండా ఏ
జాంరాష్ట్ర నివాసియు నుండజాలడు. నిజాంరాష్ట్ర జనసంఖ్యలో సగ
మునకు మించి తెలుగువారైనను, ఇక్కడ ఒక్క సారస్వత పత్రికయును
కపోవుట శోచనీయము. ఒక దేశముయొక్కగాని ఒక జాతియొక్క
ని నాగరికతను అక్కడి సాహిత్యము కళలు చూపును. ఈ విషయ
మున తెలంగానా ఎంతయో వెనుకబడియున్నది. అందుచే సారస్వత
వ చేయగోరు ఎట్టి పత్రికకైనను స్వాగత మియ్యవలసినదే. అందు
లోను బహు భాషా విశారదు లగు శ్రీ పండిత వీరభద్రశర్మగారి
టి పండితులు సారస్వత పత్రికా నిర్వహణము చేయగోరుట నిజాం
రాష్ట్రవాసుల అదృష్టమే యనవచ్చును. విభూతి ఉత్తమ సారస్వత
త్రికయై, చిరాజిల్లగల దనియే మా ఆశయము.

మొదటి 2 సంచికలును మంచి సారస్వత వ్యాసములతో నిండి
యున్నవి. కురుగంటివారు, సురవరమువారు, సన్నిధానమువారు, రచి
యించిన గద్యపద్య వ్యాసములు హృదయంగమముగ నున్నవి. శ్రీ
శర్మగారు, శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు, రచించిన పరిశోధక
వ్యాసములు పత్రికకు అమూల్యాలంకారములు. కన్నడము మున్నగు
భాషలనుండి గొప్ప గొప్ప వ్యాసరాజములను గూడ అనువదించి
ప్రకటించి యున్నారు. 3 వ సంచికలో "నిజాంరాష్ట్రమున ఆంధ్ర
పత్రికలు" అను వ్యాసము చాలా ఉపయోగకరమైనది. శ్రీకర
భాష్యమును చక్కగ సంస్కరించి ప్రకటించి యున్నారు. వీరశైవ
సంప్రదాయ భాష్యములు ఇదివరకు ఆంధ్రమున ప్రకటింపబడి
యుండలేదు. ఈ విషయమున శ్రీ శర్మగారు చేయుచున్న కృషి
ప్రశంసనీయము. సంస్కృత మూలమునకు ప్రక్కనే ఆంధ్రానువాదము
గూడ ప్రకటించిన బాగుండెడిది."

(4) ధర్మరాజ్యము (ధారవాడ - ఏప్రిల్) లో (కన్నడపత్రిక)

"తెలుగుదేశపు ఉద్దామ కవి-లేఖకుల మహత్త్వమైన వ్యా
ములును, స్వతః విద్యానిధులవారి విచారార్హమైన శ్రేష్ఠ లేఖ
కలవు. 'విభూతి' నామ సార్థక్యము బాగుగా వివరింపబడినది.
వైపు వ్యాసకర్తలును, ఇంకొకవైపు సకలభాషాకోవిదులును, మ
వైపు ఉద్దామపండితులైన విద్యానిధులవారి (పం॥ వీరభద్రశర్మగా
సంపాదకత్వమున వెలువడు 'విభూతి'ని ప్రత్యేకముగఁ బాగడవలయు
తెలుగు నరయువారు మొదలిద్దానిని గొనవలయును. కర్నా
ల్లెల్లరు సహాయప్రోత్సాహముల నీయవలయు. పత్రిక ముద్ర
నచ్చగుచున్నది. చిత్రములును కలవు. అపుడే అనేకులు ప్రతిష్ఠ
కులు, రాజపోషకులు, సహాయకులు, కూడియుంట 'విభూతి' యో
త్యమునకు సూచకము. 'విభూతి' సమస్త జనాదరణము వడసి యాం
మున నాదర్శపత్రిక యగునని యాశించుచున్నాను."

(5) గృహలక్ష్మి (మద్రాసు - మే 1939) లో

1/8 డెమ్మీసైజులో చక్కగా ఉన్నది. ఇందు సారస్వత, ధార్మి
చారిత్రాత్మక పరిశోధనాసంబంధమైన ఉత్కృష్ట విషయము
కాకుండా చక్కనికథలు, గీతాలు, మొదలగువాటితో మనోహరం
ఉన్నది. 'విభూతి' విభూతితో విలసిల్లి, భాషాసేవ యను భాగ్యము
బహుకాలము భువివెలయ పరమేశ్వరు డనుగ్రహించుగాక!

ాయోపాశబద్ధజీవలక్షణత్వాత్. నిర్విశేషచిన్మాత్రబ్రహ్మణస్తద్భిన్న
ాయోపాధిత్వం కథముపపద్యతే? "యస్సర్వజ్ఞస్సర్వవిత్" (ముం.
౧-౯) "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతిషు తస్య సర్వజ్ఞత్వ ప్రజ్ఞాన
్వాదిధర్మోపదేశాన్న జీవవదజ్ఞత్వాదిధర్మప్రసంగః. తస్యాఽవిద్యాంగీ
ారే బ్రహ్మత్వభంగప్రసంగః. తస్యావిద్యాసత్త్వే అవిద్యైవ మాన
ితి చేత్ అన్యోన్యాశ్రయదోషః.

కించ—"అప్రాణో హ్యమనాశ్శుభ్రః" (ముం. ౨-౧-౨)
ిశ్రుతౌ తస్య మనఃప్రాణసంబంధాభావదర్శనాత్తద్విహీనస్య భ్రమః
థముపపద్యతే? కిం చ జీవవత్తస్యాజ్ఞత్వస్వీకారే తదజ్ఞాననివర్తక
్రహ్మాంతరమవశ్యమంగీకర్తవ్యం. తథాచేదనవస్థాప్రసంగః. బ్రహ్మ
ణః స్వస్వరూపతిరోధాయకమజ్ఞానమస్తి చేత్, తస్య తతోఽ
్కత్వేన మిథ్యాత్వం నోపపద్యతే. "ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూత
యోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్" (కైవల్య ౧-౭) "తమేవ
విదిత్వాఽతిమృత్యుమేతి" (శ్వే. 3-౮) బ్రహ్మవిదాప్నోతి పరం"
(తై. ఆనం. ౧) ఇత్యాదిశ్రుతిషు తస్య తమఃపరత్వం, తద్జ్ఞానస్య
జీవానాం ముక్తిహేతుత్వం చోపదిశ్యత ఇతి న తద్యుక్తం.

శుక్తిరజతవత్తస్య జీవత్వం భ్రాంతిమాత్రమితిచేన్న, సర్వత్ర
పదార్థచతుష్టయసద్భావే భ్రాంతిః సంభవతి. అతః బ్రహ్మేతరవస్త్వ
భావాన్న భ్రాంత్యుపపత్తిః, వస్త్వంతరాంగీకారే హ్యద్వైతహానిః,
అనంగీకారే భ్రాంత్యనుపపత్తిః, న స్వప్నవత్ ప్రపంచస్య మిథ్యాత్వం,
అర్థసిద్ధక్రియాసిద్ధిదర్శనాత్. విధినిషేధరూపశాస్త్రార్థాచార్యోపదేశా
దీనాం కర్తవ్యత్వాయోగేన బుద్ధమతప్రవేశాపత్తేశ్చ.

"నాభావ ఉపలబ్ధేః" (బ్రహ్మసూ. ౨-౨-౨౭) "వైధర్మ్యాచ్చ

2

చ్చ న స్వప్నాదివత్" (బ్రహ్మసూ. ౨-౨-౨౮) ఇతి ద్వితీ
ధ్యాయే స్వప్నేంద్రజాలవత్ ప్రపంచమిథ్యాత్వవాదో బహుధానిర

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరం।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహేతుకమ్॥ ౮॥
ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥ ౯॥

(గీతా. అ. ౧

ఇత్యాదినా కృష్ణగీతాయాం చైతన్మతం బహుధా నిరస్తం.

కించ—"లక్షణప్రమాణాధీనా హి వస్తుసిద్ధిః" ఇతిన్యాయే
నిర్విశేషబ్రహ్మసత్త్వే కిం మానం? శ్రుతిరస్తి చేత్, తస్యా జగదం
పాతిత్వేనమిథ్యాత్వాత్ తత్ ప్రతిపాద్యస్య బ్రహ్మణోఽపి మిథ్యాత్
స్యాత్; వేదసత్యత్వాంగీకారే అద్వైతహానిః; అసత్యత్వే తు బ్రహ్మస
సత్ప్రమాణాంతరాభావాత్ వంధ్యాపుత్రాదేరివ బ్రహ్మణోఽపి మిథ్యా
త్వం స్యాత్.

కించ—అధ్యాసానంగీకారే ముక్తేర్బాధకాభావః, తదంగీకా
స్వాభావికత్వేన సర్వశ్రుతీనాం సమన్వయాయోగః. నచాధ్యా
అవిద్యైవ మానం, స్వప్రకాశత్వభంగప్రసంగాత్. నచ అవిద్యావిశిష్ట
చైతన్యమితి వాచ్యం, అన్యోన్యాశ్రయ ప్రసంగాత్. "జీవోఽహం—
మనుష్యోఽహం" ఇత్యాదిభ్రమప్రత్యయస్యాపి పరమేశ్వరాధీనత్వాత్
"ఏష ఏవ సాధు కర్మ కారయతి". (కౌషీ. ౩-౯) ఇత్యాదిషు ప
మేశ్వరస్యైవ సర్వకర్మకారయితృత్వోపదేశాత్.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

(గీతా. ౧౮-౬౧

కృష్ణగీతాయాం తథైవోపదేశాత్.

"వాచారంభణం వికారో నామధేయంమృత్తికేత్యేవ సత్యం" (ఛాం. ౬-౧-౪) ఇతి శ్రుతావపవాదదర్శనాదధ్యాసో గ్రాహ్య ఇతి చేన్న, వాచారంభణాదిశ్రుతీనాం శివోపాదానత్వాత్ ప్రపంచస్య తత్తాదాత్మ్యబోధకత్వం విధీయతే; న మిథ్యాత్వబోధకత్వం.

వాచారంభణవాక్యాని తదనన్యత్వబోధనాత్.
న మిథ్యాత్వాయ కల్పంతే జగతశ్శివరూపతః.

ఇతి స్మృతేశ్చ. అత ఏవ భగవతా వ్యాసేన జగన్మిథ్యాత్వవారణాయ "తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః" (బ్ర. సూ. ౨-౧-౧౪) ఇతి సూత్రే తజ్జన్యప్రపంచస్య తత్స్వరూపత్వం నిర్దిష్టం.

అధ్యారోపస్తు తస్య? తదన్యస్యవా? నాద్యః—బ్రహ్మణ ఇంద్రియాదిశూన్యత్వాత్. న ద్వితీయః— 'సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" (ఛాం. ౬-౨-౧) ఇత్యాదౌ సృష్టేః ప్రాక్ ద్వితీయవస్తు నిషేధదర్శనాత్; తదన్యస్వీకారే శుద్ధాద్వైతభంగప్రసంగాచ్చ. తమః ప్రకాశవద్విరోధాభావాద్భేదాభేదో యుక్తః. ద్వైతాద్వైతాత్మక శరీరశారీరపరమాత్మనాం తాదాత్మ్యభావే వ్యవహారాయోగాదద్వైతినామధ్యాసాసంభవాత్.

న చ బ్రహ్మజ్ఞానపర్యంతమేవ ప్రపంచస్య సత్యత్వం, తదూర్ధ్వమపి క్షుత్పిపాసాదిద్వైతకర్మద్యోతనాత్. న చైకపక్షో యుక్తః— అభేదస్వీకారే "ద్వా సుపర్ణా" (ము. 3-౧-౧) ఇత్యాదిభేదశ్రుతి విరోధః; భేదస్వీకారే "తత్త్వమసి" (ఛాందోగ్య. ౬-౮-౭) ఇత్యాద్యభేదశ్రుతివిరోధః. ద్వైతాద్వైతస్యైవ స్వాభావికత్వేన సర్వశ్రుతి సమన్వయాత్, శ్రుతిసంకోచే మానాభావాత్, యత్కించిచ్ఛ్రుతి ప్రామాణ్యాంగీకారే బౌద్ధాదివద్వేదబాహ్యత్వప్రసంగాత్, "యతోవా"

(తై. భృ. ౧) ఇత్యాదినా ద్వైతాద్వైతాత్మకప్రపంచబ్రహ్మణో కార్యకారణత్వదర్శనాత్, "ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః" (బ్రహ్మసూ. ౧-౪-౨౦) ఇత్యాది సూత్రత్రయేణ భేదాదిమతత్రయస్యైవా విక్షితత్వాత్, "ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్" (బ్రహ్మసూ. ౩-౨-౨౮) ఇతిసూత్రేణ భేదాభేదస్యైవావిరోధిత్వేన నిర్దిష్టత్వాత్ "భేదాభేదస్తథా భేదో భేద ఏతే మతాస్త్రయః" ఇతి సూతసం తాయాం, "ధ్రువం కశ్చిత్సర్వం సకలమపరస్త్వధ్రువమిదం ప ధావ్యాధ్రౌవ్యే" ఇతి మహిమ్నస్తవాదిషు చ భేదాదిమతత్ర స్యైవ నిర్దేశాచ్చ. "యతో వాచో నివర్తంతే" (తై. ఆ. ౯- ఇత్యాదిశ్రుతీనాం గురుకటాక్షరహితప్రాకృతజీవపరత్వం; నో చేత్ — "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి" (తై. ఆ. ౯ ఇత్యుత్తరవాక్యవిరోధః, తన్మాహాత్మ్యజ్ఞాపనపరత్వం వా, అన్యార్థ "బ్రహ్మవిదాప్నోతిపరం" (తై. ఆ. ౧) బ్రహ్మవేద బ్రహ్మైవభవతి (ముం. ౩-౨-౯) ఇత్యాదిబ్రహ్మానుభవవిధాయకబహుశ్రుతివిరోధశ్చ

కించ-"నావేదవిన్మనుతే తం బృహంతం" (తై. బ్రా. ౩-౧ ౨-౯- "నైషా తర్కేణ మతిరాపనేయా" (కఠ ౧-౨-౯) తంత్వౌపనిషద పురుషం పృచ్ఛామి" (బృ. ౩-౯-౨౬) "శాస్త్రయోనిత్వాత్" (బ్రహ్మసూ. ౧-౧-౩) ఇత్యాదిశ్రుతిసూత్రేషు బ్రహ్మణో మానాంత నిషేధదర్శనాచ్చ సర్వశ్రుతిసమన్విత భేదాభేదబ్రహ్మమీమాంసారంభో యుక్తః.

అత్రాథశబ్దేనానంతర్యార్థో వివక్షితః. "అథ శబ్దానుశాసనం "అథ యోగానుశాసనం" (యోగసూ. ౧-౧) "అథైష జ్యోతిరథైష విశ్వజ్యోతిః", ఇత్యాదావివాథశబ్దస్య నాధికారార్థత్వం; జిజ్ఞాసాయ అనధికార్యత్వాత్. నను జిజ్ఞాసాపదస్య విచారలక్షకత్వాత్ విచారస్య

వ ప్రత్యధికరణం వర్తిష్యమాణత్వేన అధికృతత్వసంభవ ఇతిచేన్న — నంతర్యాభిధానముఖేన విధ్యపేక్షితాధికారివిశేషసమర్పకత్వేన సాధత్వం విధీయతే; తదనపేక్షితాధికారార్థకత్వస్యాయోగాత్. "అథశబ్దాశాసనం" ఇత్యాదేర్విధిమూలకత్వాభావాన్నాధికార్యపేక్షితృత్వం.

మంగలస్య జిజ్ఞాసాయామన్వయాసంభవాన్న మంగలార్థః; పూర్వాచార్యానుచారస్థాపనార్థం వర్ణధ్వనిమాత్రేణ మంగళార్థకత్వం.

ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।
కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగలికావుభౌ ॥

ఇతి స్మృతేః. "అథాతశ్శేషలక్షణం" (పూర్వమీ. ౩-౧-౧) ఇతివన్న పక్షాంతరం; పూర్వమేకస్యాప్రకృతత్వాత్.

అదీక్షితస్య మలత్రయవిధ్వంసాభావాన్న సాధనచతుష్టయానంతర్యం.

నచ అనియతభోజనగమనాదివత్ యత్కించిత్పూర్వవృత్తత్వం; నియమవిధిదర్శనాత్. యత్పూర్వభావిత్వం నియమనియతప్రయోజకతయా ముముక్షూణాం మలత్రయవిధ్వంసనే విధీయతే తత్పూర్వకత్వం బ్రహ్మవిచారశాస్త్రస్యేతి నిర్ణీయతే. అస్య విషయః శ్రూయతే తైత్తిరీయశాఖాయాం—బ్రహ్మమేధాకామస్య తత్ప్రాప్తిసాధనం కిమిత్యాకాంక్షాయామాహ— "యశ్ఛందసామృషభో విశ్వరూపః, ఛందోభ్యోఽధ్యమృతాత్ సంబభూవ, స మేంద్రో మేధయా స్పృణోతు, అమృతస్య దేవధారణో భూయాసం, శరీరం మే విచర్షణం, జిహ్వా మే మధుమత్తమా, కర్ణాభ్యాం భూరి విశ్రువం, బ్రహ్మణః కోశోఽసి మేధయాపిహితః, శ్రుతం మే గోపాయ" ఇతి (తై. శిక్షా౪).

అస్యార్థః—యః శివః, ఛందసామృషభః - సర్వవిద్యాప్రభుః, "ఈశానస్సర్వవిద్యానాం"(మహానా. ౪౭-అను.) ఇతి శ్రుతేః. విశ్వరూపః

ప్రపంచమయః, "సర్వో హ్యేష రుద్రః" (మహానా. ౧౬-అను.) శ్రుతేః-యః ఛందోభ్యః-ఆమ్నాయేభ్యః, అమృతాత్ అధిసంబభూవ వేదోపనిషదాగమాదీనామనుమృతరూపత్వాత్ తత్ప్రతిపాద్యః, వచ వ్యత్యయశ్ఛాందసః, స ఇంద్రః—పరమైశ్వర్యశాలీ శివః మా—మా మేధయా—ప్రజ్ఞయా, స్పృణోతు—ప్రీణయతు, బలయతు వా తద్విజ్ఞానార్థం ప్రజ్ఞాబలం హి ప్రార్థ్యతే. అమృతస్య— మోక్షాయ, దే ధారణః— దేవస్య లింగరూపశివస్య ధారణం యస్య సోఽహం దేవధా రణః, భూయాసం—భవేయం, చిచ్ఛక్తి ప్రకటీకృతపరశివేష్టలింగధా భూయాసమిత్యర్థః. అతః మే శరీరం విచర్షణం — కిల్బిషరహితః భూయాదిత్యర్థః, మే జిహ్వా, మధుమత్తమా—మధుమతీ, అతిశయేన మధురసంభాషిణీ భూయాత్, కర్ణాభ్యాం— శ్రోత్రాభ్యాం, భూ విశ్రవం — శివజ్ఞానయోగ్యకార్యకారణసంఘాతరూపో భూయాస మిత్యర్థః. తన్మేధా చ తదర్థమేవ ప్రార్థ్యతే. బ్రహ్మణః—శివస్య కోశోఽసి — అసేరివోపలబ్ధ్యధిష్ఠానమిత్యర్థః. మేధయా — లౌకి ప్రజ్ఞయా, పిహితః—ఆచ్ఛాదితః, సామాన్యప్రజ్ఞయా అవిదితస్త్వ ఇత్యర్థః. "నావేదవిన్మనుతే తం బృహంతం" (తై. బ్రా. ౩-౧౨-౯-౭ "నైషా తర్కేణ మతిరాపనేయా" (కఠ. ౧-౨-౯) ఇతి శ్రుతేః. శ్రుతం—శ్రవణపూర్వకం భక్తిజ్ఞానాదికం, మే—మమ, గోపాయ— రక్ష; తత్ప్రాప్త్యవిస్మరణాదికం కుర్వితి భావః.

దేవధారణో భూయాసమిత్యత్ర బాహ్యలింగధారణం? అంత ర్లింగధారణం? ప్రణవధారణం వా ? ఇతి సందేహః. "తం దైవతానాం పరమం చ దైవతం" (శ్వేతా. ౬-౭) "తస్మాద్దేవశ్శివః స్మృతః "దేవ్యా యుతం దేవతనుం యువానం" ఇత్యాదౌ దేవశబ్దస్య పరశి పరత్వేన బహుశః ప్రయోగదర్శనాత్, అన్యదేవధారణకర్తవ్యతా విధాయకశాస్త్రాదర్శనాదాచారాభావాచ్చ ధారణశబ్దస్య కర్త

బ్యడంతత్వేన దేవం ధరతీత్యర్థే సిద్ధే సతి, అమృతస్య—ముక్త్యర్థం దేవధారణో భూయాసం, కస్మాత్ మాం మేధయా స్పృణోతు—సంయోజయతు ఇత్యాదినా లింగధారణప్రతీతేః, భూయాసమిత్యత్ర లిఙోఽపి సత్త్వేన విధ్యర్థోపపత్తేశ్చ బ్రహ్మమేధాకామస్య లింగధారణావశ్యకత్వం ప్రతీయతే.

కించ "యశ్ఛందసామృషభో విశ్వరూపః" ఇత్యాదినా ప్రణవపరత్వమపి సూచితం. "యో వేదాదౌ స్వరః ప్రోక్తః"(మహానా. అను. ౧౦)ఇత్యనేన ఛందోవృషభత్వం,"ఓంతత్సర్వం",(మహానా. అను. ౨౮) ఇత్యాదినా విశ్వరూపత్వాదికం, "బ్రహ్మణః కోశోఽసి" ఇత్యత్ర పరబ్రహ్మాధిష్ఠానత్వం చ తస్యైవోపపన్నమితి అంతర్ధారణవిధాయకత్వపరత్వమపి సూచితం. యమాద్యష్టాంగయోగేషు వైదికానామంతర్ధారణస్య విధేయత్వాచ్చ.

పూర్వపక్షస్తు—విశ్వరూప ఇతి బ్రహ్మలింగస్య నిరుపపదబ్రహ్మపదస్య చ పరిచ్ఛిన్నలింగపరత్వాయోగాత్, దేవధారణఇత్యత్ర "దేవ" ఇతి పదచ్ఛేదాభావే గోపాయేత్యన్వయస్యాసంభవాత్, భూయాసమిత్యత్ర ఆశీర్లిఙ్త్వేన విధ్యర్థకత్వాసంభవాత్, "లింగేషం చ క్రిణం దృష్ట్వా" ఇత్యాదినా బాహ్యలింగధారణస్య నిషిద్ధత్వాత్, "లింగమధ్యే జగత్సర్వం" "ప్రాణేష్వంతర్మనసో లింగమాహుః" "జ్యోతిర్లింగం భ్రువోర్మధ్యే నిత్యంధ్యాయేత్సదాయతిః""లింగంబ్రహ్మైవ కేవలం" ఇత్యాదిషు శివస్య పరబ్రహ్మణః లింగరూపత్వోపదేశాత్, తైత్తిరీయకైవల్యాదిషు "దహరం విపాపం పరవేశ్మభూతం" (మహానా. అను. ౧౦) "హృత్పుండరీకం విరజం విశుద్ధం" (కై వ. ౧-౬) ఇత్యాదినా ఽంతర్లింగధారణస్యైవ నిర్దిష్టత్వాత్, శాఖాంతరేష్వపి బాహ్యలింగధారణాదర్శనాత్, న బాహ్యలింగధారణస్య వైదికత్వం సిద్ధ్యతి.

నను—"విశ్వాధికో రుద్రో మహర్షిః" (మహానా. ౧౦ అ
"త్వం దేవేషు బ్రాహ్మణః" "త్వం దేవానాం బ్రాహ్మణానా
పతిః క్షత్రియాణా మధిపతిర్విష్ణుః" ఇత్యాది శ్రుతి ష్వద్వితీయ
శివస్య విశ్వాధికత్వ - బ్రాహ్మణత్వ - బ్రాహ్మణాధిపతిత్వదర్శనా
తత్ప్రణీతకామికాదివాతులాంతాగమవిరుద్ధమన్వాదిస్మృతి పురాణా
మానత్వాభావాత్, యజుర్వేదసంహితాయాం త్రిపురసంహారే—
"తేషామసురాణాం తిస్రః పుర ఆసన్" ఇత్యారభ్య "సోఽబ్రవీద్వ
వృణా అహమేవ పశూనామధిపతిరసాని" (తై. సం. ౬-౨-
ఇత్యాదినా బ్రహ్మవిష్ణ్వాది దేవేషు పశుత్వస్య శివే పశుపతిత్వస్య తే
శివలింగభస్మరుద్రాక్షాదిశైవలాంఛనధారణస్యచ శ్రూయమాణత్వా
లోకే ఆరాధ్యారాధకప్రభుభృత్యయో స్తథాదర్శనాత్, "సర్వలింగ
స్థాపయతి' ఇత్యాదిభిశ్చ బాహ్యలింగధారణస్య విధేయత్వదర్శనాత్,
రాగద్వేషాదిపాశబద్ధానాం పశుభావమాపన్నానాం ముముక్షూణా
భక్తానామస్మాకం పతిలాంఛనాత్మక పరశివేష్టలింగధారణం కిమ
వక్తవ్యం? ఇతి చేన్న.

శివోక్తకామికాద్యాగమానాం యావజ్జీవలింగధారణవిధాయ
త్వాత్, "న హికర్మణి కర్మాంతరారంభః" ఇతి న్యాయేన నిత్యోపా
నాదిపౌండరీకాంతశ్రౌతస్మార్తకర్మణాం నిరవకాశత్వాత్, దీక్షితస
సూతకాదినిషేధదర్శనేన సాపిండ్యాద్యుత్తరకర్మణాం వైయర్థ్యప్రస
గాత్, శైవదీక్షానంతరం జీవత్వపేతత్వాభావేన స్వజాత్యాశ్రిత
ధర్మాణాం ప్రయోజనాభావాత్, "న కుర్యాన్నిష్ఫలం కర్మ" ఇ
న్యాయేనవిధినిషేధనిరవకాశత్వేన వేదబాహ్యమతప్రవేశాపాతాత్, వ
ష్ఠాది బ్రహ్మనిష్ఠానాం ముక్తాత్మనామపి జ్యోతిష్టోమాదిసర్వకర్మారం
శ్రవణాత్, "యద్వై కిం చ మనురవదత్తద్భేషజం" (తై. స
౨-౨-౧౦-౨) ఇత్యాదిశ్రుతౌ మన్వాదిస్మృతీనామౌషధవద్విధేయత్



విధ్వంసమైన శ్రీ సౌరాష్ట్ర సోమనాథాలయము

( ద్వాదశజ్యోతిర్లింగముల వ్యాసము చూడుడు )



సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక


సికింద్రాబాదు

పుంధ్రిము ౧ | శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి ఆషాఢము | రేఖ ౪


# శివభక్తిమహిమ

## తెనాలి రామలింగకవి ప్రణీతము



ఉ. వాలుక లెన్నవచ్చు నుడువర్గము లెన్నగవచ్చు భూరజో
జాలము లెన్నవచ్చు నతిచంచలవార్ధివికీర్ణ వీచికా
మాలిక లెన్నవచ్చు బుధమండలకర్ణ పుటామృతంబు లౌ
బాలశశాంకశేఖరుని భవ్యచరిత్రము లెన్న శక్యమే?

ఉ. అంగద యోగసిద్ధికిఁ బ్రయాసముఁ బొందఁగ నేల సంశయా
బ్ధిం గడు ముంపుచున్న బహుభిన్నపథంబులఁ బోవనేల భ
క్తింగనఁజాలి యా వృషభకేతనుఁ బ్రస్తుతి సేయుచుండినన్
దంగెటిజున్నుగాదె హిమధామకిరీటుఁడు భక్తకోటికిన్.

ఉ. ఆకులఁ గందమూలముల నంబుఫలంబులఁ గూరగాయలన్
జేకొని ప్రాణరక్షణముఁ జేసి మహాటవిలోనఁ దీవ్రని
ష్ఠాకలనన్ శరీరము కృశంబుగ నుండిన ముక్తి గల్గునే
ప్రాకటమైన భక్తిఁ బురభంజనుఁ బూజ యొనర్పకుండినన్.

సీ. మ్రొక్కు నెవ్వాఁ డష్టమూర్తికి నలవోక
బలెనాతఁ దమరుల ప్రణతి యందుఁ
జల్లు నెవ్వాఁడు ధూర్జటిమీఁదఁ బుడిసెడు
జలము లాతఁడు సుధాజలధిఁ దేలు
నుతియించు నెవ్వాఁడు శితికంఠు నేకవా
రం బాతఁ డల వచోరమణి నేలు
నిలుపు నెవ్వాఁ డీశు నిమిషమాత్రము మనం
బున నాతఁ డా మీఁది పొడవుఁ గలియుఁ
గీ. గాన మ్రొక్కఁగ నభిషిక్తుఁగా నొనర్ప
వినుతి సేయంగఁ దవిలి భావింప నెందుఁ
దగిన దేవాదిదేవుఁ డాతండు సూవె
భుక్తి ముక్తు లపేక్షించు భక్తులకును.

ఉ. వాసన లేనిపూవు రసవర్ణన లేని కవిత్వరేఖ య
భ్యాసములేని విద్య జలజాప్తుఁడులేని దినంబు చంద్రికో
ల్లాసములేని రాత్రి కమలస్థితిలేని కొలంకు చూవె కై
లాస నివాసు నాత్మలఁ దలంపని మూఢుల జన్మ మారయన్.

గీ. చూడఁ దగదే వివేకించి సుజనులకును
జంద్రరేఖావతంసుని చరణయుగళి
యెంత చక్కనిదో, రమాకాంతుఁ డంత
వాఁడు నందును దన కన్ను వైచె మున్ను.

గీ. శైవులగువారు చెప్పిన జాడయందు
నడువనేరరు మూఢుల గడుసుబుద్ధి

వానపై వాన గురిసిన నాను నొక్క
సహజ కాఠిన్య ముడిగి పాషాణకులము.

సీ. శివ పదాంభోరుహా పవిమలోదక పాన
సిద్ధి నాలుక చవిఁ జెలఁగ దేని
శంభుదాసాంగైక సంస్పర్శనంబున
నెమ్మేను పులకల నిలుప దేని
త్రిపుర దానవవైరి దివ్యలింగస్ఫూర్తి
కన్నులారఁగఁ జూడఁ గలుగ దేని
దర్పకధ్వంసి యాదలనిడ్డ పూవుల
తావిపై నాసిక దవుల దేని
గీ. కాలకంధరు సత్కథాకర్ణనంబు
కర్ణపుటవీథి నందంద కదియ దేని
వాని జన్మంబు జన్మమే వాని బ్రతుకు
బ్రతుకె హరదూరుఁడగువాఁడు పశువు దెలియ.

క. శివలింగ దర్శనంబును
శివపూజా వైభవంబు శివసద్గుణ సం
శ్రవణంబు మానవులకును
భవనీరద పటల చటుల పవమానంబుల్.

(ఉద్భటారాధ్య చరిత్రమునుండి)



# నన్నెచోడుని కాలము

(వెనుకటి సంచిక తరువాయి)

**బండారు తమ్మయ్యగారు**



వ్యాఖ్యాతలు అరుణగిరినాథుఁడు, మల్లినాథుఁడు పూర్వోక్త లయిన 9-17 సర్గలకు వ్యాఖ్యాన మొనర్ప లేదనియు, అరుణగిరినాథుఁ కుమారసంభవనామ సామంజస్యమును గూర్చికూడఁ గొంతచ యొనర్చెననియు నందుచే నీగ్రంథభాగము పదుమూఁడవ శతాబ్ది బూర్వము రచింపఁబడలేదనియు లేదా దక్షిణహిందూస్థానమునఁ బ్రచా రము నొందలేదనియుఁ దలంపవచ్చుననికూడ శ్రీ శాస్త్రిగారభిప్రా పడిరి. తరువాత కథలోనున్న గ్రంథభాగ మప్పటికి లేకున్నచో నరు గిరి నాథునకు గ్రంథనామకరణమును గూర్చిన చర్చ యొనర్పుటకు దగిన కారణమే కానరాదు. ఆగ్రంథభాగము రచితమయ్యు నప్పటి మనదేశమునఁ బ్రచారమొందక పోవుటచేతనే యా వ్యాఖ్యాతలు దానికి వ్యాఖ్యాన మొనర్పలేదని తలంచినచో నది శాస్త్రిగారి సిద్ధాం తమునకు బాధకమే యగును. అట్టిసందర్భమునఁ బదునాల్గవ శతాబ్ది వాఁడని శాస్త్రిగారు తలంచు నన్నెచోడుఁడుమాత్ర మా గ్రంథ భాగమును జూచి యందలి శ్లోకముల నెట్లనుకరింపఁ గలఁడు? కావున నీగ్రంథభాగ మప్పటికేయుండి కాళిదాసీయము కాదను తలంపు తోనే వ్యాఖ్య మొనర్పక విడువఁబడెనని తలంచుటయే సమంజసముగా నుండును. ఇంతకు నీగ్రంథభాగ స్థశ్లోకానుకరణము చాల స్వల్పముగా నున్నదని శాస్త్రిగారే యంగీకరించిరి. ఆగ్రంథభాగ రచనా కాలమే నిర్వివాదముగ నిర్ణీతముకానప్పుడు దీనినిబట్టి నన్నెచోడుని కాలనిర్ణయ మొనర్పఁబూనుట సరియగుమార్గముకాదు. ఇఁక నాంధ్రకావ్యములందలి యనుకరణములఁగూర్చి విచారింతము. కీ॥ శే॥ శ్రీ దేవరాజసుధీమణి గారు "భారతకవులు - నన్నెచోడుఁడు" (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం 1 సం 1) అనువ్యాసమున నన్నయ తిక్కనల భారతముతో నన్నె

చోడుని కావ్యమును బోల్చి చూచి దొరకిన శాసన సామగ్రిని బట్టి నన్నెచోడుఁడు నన్నయ తిక్కనల మధ్యకాలమున నుండి యుండు నని యంగీకరించుచుఁ గవితాపరిపాకమునఁ దిక్కనకంటె మెఱుంగులు చూపియుంటఁ దిక్కనకుఁ దరువాతివాఁడు కూడ నగునేమో యను ననుమానమును సూచించిరి.

దీని నూఁతగాఁగొని శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు తిక్కన భారతములో ద్రోణ కర్ణ పర్వములందలి కొన్ని యుద్ధవర్ణనా పద్యములను జూచియే నన్నెచోడుఁడు తన యుద్ధవర్ణనముల రచించెనని యుక్తి సహముగ నిరూపించిరి. మఱియుఁ దిక్కన కంకితమీయఁబడిన కేతన దశకుమారచరిత్రమందలి కొన్ని పద్యములఁబట్టి కేతనను గూడ నన్నెచోడుఁ డనుకరించెనని వారు లిఖించిరి. నన్నయ పద్యముల నన్నెచోడుఁ డనుకరించెననుటకుఁ గూడ వీరు కొన్ని యుదాహరణముల నొసంగిరి. ఈ యనుకరణములఁబట్టి యెవరి నెవ రనుకరించిరో యిద మిత్థమని నిరూపించుట కొంతవఱకుఁ గష్టసాధ్యమే. ఉదాహృత పద్యములకయి వారి గ్రంథమును జూచునది. తిక్కన పద్యములు కొంతవఱకుఁ మూలానుసరణములయిన సంస్కృత శ్లోకాంధ్రీకరణము లవుటచేతను, నన్నెచోడునిపద్యము లంతకన్న స్వతంత్రరచనములవుటవలనను తిక్కన పద్యములే నన్నెచోడుని పద్యములకు మాతృకలను నభిప్రాయము సమంజసమే యగును కాని యీ సందర్భమునఁ దమ సిద్ధాంతమునకు బాధకమయిన యొక ముఖ్యవిషయమును శాస్త్రిగారు విమర్శింపక విస్మరించుట శోచనీయము. నన్నెచోడుని కుమారసంభవ కళావిలాసములనుండి పద్యముల నుదాహరించిన లక్షణగ్రంథములలో అథర్వణచ్ఛందము ప్రాచీనతమమని శ్రీరామకృష్ణకవిగారు తమ పీఠికలో వ్రాసియున్నారు. నన్నెచోడుని మరణమును దెలుపు "మగణమ్ము మొదియ రగణము" అను పద్యముకూడ నందులోని దనియే వారు వ్రాసిరి.

నన్నెచోడుని కాలమువలెనే యథర్వణుని కాలముగూడ నిర్వివాదముగ నిర్ధరింపఁ బడకుండుట శోచనీయము. అథర్వణచ్ఛందము

నేఁటివఱ కముద్రితమే. ఇదిగాక యథర్వణుని పేర భారతము. త్రి
శబ్దానుశాసనము, వికృతివివేకమను నామాంతరముగల యథర్వణ
కావళి యను గ్రంథములు వినవచ్చుచున్నవి. వీనిలోఁ గడప
మాత్రమే ముద్రితమయినది. అదిచాల నూతనమని అప్పకవికి సమ
లీనుఁడయి క్రీ॥ శ॥ 1700 ప్రాంతమున వెలసిన ప్రభంజనము అహ
బలపతి (గాలినరసయ్య)యే వానిని వ్రాసి యథర్వణుని పేరు వాని
పించెనని పలువురుపండితులయభిప్రాయము. అథర్వణనామమే కల్పి
మని కొందఱి తలంపు. ఏదియెట్లున్నను మొదటికే మోసము తెచ్చు
తగినపనికాదు. అథర్వణచ్ఛందము తరువాతిలక్షణగ్రంథములుగొన్ని
లో నుదాహృతమయినది. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నా
ములో నన్నెచోడుని పద్యములు, అథర్వణ భారత పద్యములుగూ
నుదాహృతము లయినవి. అథర్వణ భారతము తిక్కనభారతము కం
బూర్వపుదని కొందఱి యభిప్రాయము. కావున అథర్వణచ్ఛందమ
నన్నెచోడుని పద్యము లుదాహృతములయినమాట వాస్తవమే యు
నచో అథర్వణుని కాలమును నిశ్చయించి యాతఁడు తిక్కనకుఁ 
వాతి వాఁడని నిరూపించిననేగాని శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారి సిద్ధాంత
నిలువనేరదు. ప్రాచ్య లిఖితపుస్తకాలయములో అథర్వణచ్ఛందః ప్ర
లున్నచో వానిని బరిశోధించి శాస్త్రిగారిందుఁగూర్చి చర్చింతురుగా
చిత్రకవి పెద్దనకూడఁ దన లక్షణసార సంగ్రహములో నన్నెచోడ
పద్యముల నుదాహరించెనని శ్రీరామకృష్ణకవిగారు వ్రాసినారు. ఆం
సాహిత్యపరిషత్పత్రికలో లక్షణసార సంగ్రహము ముద్రిత మగు
న్నది. పరిషత్తువారి కొకప్రతియే యీగ్రంథమునకు లభించినది. పెద్ద
తానుజెప్పిన లక్షణములకు లక్ష్యములుగా స్వపద్యములనే హను
దంకితములుగా రచించి యుదాహరించినాఁడు. నన్నెచోడునిగ్రంథ
నుండిగాని మఱియేయితరకావ్యములనుండిగాని పద్యములేమియు నాత
గయికొనలేదు కావున శ్రీరామకృష్ణకవిగారు మఱొక లక్షణగ్రం
థము దేనినయినఁ బేర్కొనుటకు మాఱు పెద్దన లక్షణసార సంగ్ర
మని పొరపాటున వ్రాసిరాయనుట విచారణీయము. అథర్వణచ్ఛం
మునుగూడ వీరు సరిగాఁ బరిశోధించిరో లేదో!

పాల్కురికి సోమనాథుఁడు నన్నయ తిక్కనలకు మధ్యకాలమున క్రీ॥ శ॥ 1160—1240 మధ్య జీవించియుండెనని యస్మదాదుల మొనర్చిన కాలనిర్ణయమునుబట్టి పలువురిప్పుడు నిర్వివాదముగ సంగీకరించుచున్నారు. అనుకరణములనే చూచినచో సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందును, నన్నెచోడుని కుమారసంభవమునందును సన్నిహిత సాదృశ్యముగల సంవిధానములు చాలవఱకుఁ గాననగును. శ్రీలక్ష్మీపతి శాస్త్రిగారు తిక్కన కేతనాదుల గ్రంథములనుండి చూపిన యనుకరణము లింత సాదృశ్యముగలవి కావు. సోమనాథ నన్నెచోడుల కావ్యములోఁ గృత్యవతరణికయందు గద్యయందుకూడ ననుకరణములే. ఇరువురును శివకవులే. ఒకరి గ్రంథమును రెండవవారు చూచి యనుకరించిరనుట నిర్వివాదము. ఈ క్రింది సంవిధానములఁ జూడుఁడు. సోమనాథుని కావ్యములు భక్త్యావేశముతో రచించిన స్వతంత్ర గ్రంథములు - అవి వేనికి నాంధ్రీకరణములుగాని యనువాదములుగాని కావు. మహామహావేగముతో హిమవద్భూధరగుహాగ్రములనుండి దుమికివచ్చు గంగాప్రవాహమునుంబోలు నీ మహామహుని సహజ మహితవాక్ప్రవాహమున కితర కావ్యానుకరణములకుఁ జోటు ప్రసక్తియే కలుగనేరదని కొందఱు విజ్ఞుల యభిప్రాయము. ఇత్యాదికారణములచేతను, సోముని ద్విపదపంక్తులనే సులువుగాఁ బద్యములోఁ బెట్టి నన్నెచోడుఁడు 'నేలయు నింగియు' ననుపద్యమును వ్రాసియుండునని తోఁచుటచేతను "సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అను కాళిదాసోక్తినిబట్టి, ఆంధ్రపత్రిక దుందుభి (1922) సంవత్సరాది సంచికలో పాలకురికి సోమనాథునిఁ గూర్చి వ్రాసిన వ్యాసములో నన్నెచోడుఁడు పాలకురికి సోమనాథున కంటె నర్వాచీనుఁడను నభిప్రాయమును బ్రకటించితిని. దీనిపై నా మిత్రులు కీర్తిశేషులు శ్రీ నడకుదుటి వీరరాజుగారు "కవిరాజ శిఖామణి కాలనిర్ణయము" అను వ్యాసములోఁ గుమార సంభవమునందలి ప్రాఁతపదములఁబట్టి నన్నెచోడుఁడు నన్నయకంటెఁ బూర్వుఁడను తమ నిశ్చయమును దెలియఁబఱచుటచే, నా వ్రాఁతలకు సమాధానముగా సోమనాథుఁడే నన్నెచోడు ననుకరించెనని వ్రాసిరి. నన్నె

చోడుఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడో లేక సమకాలీనుఁడో
బలవత్ప్రమాణములచే నిర్ణీత మయినప్పుడు శ్రీ వీరరాజుగారి
ప్రాయము నామోదించుట కెట్టి యభ్యంతరమును లేదు. అట్లు
నప్పుడు నన్నెచోడ సోమనాథు లిరువురిలో నెవరు ప్రాచీనులను
సందిగ్ధవిషయమే యగును. పూర్వోదాహృతమైన రెండవ మల్లిచో
పెదచెఱుకూరు శాసనమునఁ బ్రసక్తుఁడైన మొదటి నన్నెచోడు
మన గ్రంథకర్తయైనచో నాతని కాలము క్రీ. శ. 1170 ప్రాం
మగును. అప్పుడు నన్నెచోడ సోమనాథు లించుమించుగ సమకా
లగుదురు. ఉభయులు వేర్వేరు ప్రాంతములం దుండినవారు. ఇరువు
మధ్యఁ దగినంత కాలవ్యవధి లేనిచో వారి గ్రంథములు వ్యా
మగుటకు నొకరి కావ్యము మఱొకరు చూచుటకు నవకాశము క
గునాయనికూడ విచారింపఁదగును. కావున నిదమిత్థమని నన్నెచో
కాలము నిర్ణీతమగువఱకు సోమనాథుఁడే తిక్కనకువలె నీతనికిఁ గూ
నలువది యేఁబది సంవత్సరములు ముందుండెనేమోయని నేను దల
చెదను.

## సాదృశ్యములు

కృత్యవతరణిక

బసవలింగము కృతిపతియటె కృతియు
రసికతఁ బండితారాధ్యచరిత్ర
మఁటె పాల్కురికి సోమనార్యుఁడు సుకవి
యఁటె కథాశ్రోత్ర సూరామాత్యుఁడట్టె
కృతిపతి కృతికవి కృతికథాశ్రోత్ర
క్షితిఁజెప్ప నొప్పదే శివభక్తసభల.

(సోమనాథుఁడు)

చ. రవికులశేఖరుండు కవిరాజశిఖామణి కావ్యకర్త స
త్కవిభువి నన్నెచోడుఁడఁటె కావ్యము దివ్యకథంగుమార సం
భవమఁటె, సత్కథాధిపతి భవ్యుఁడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థ యోగధరుఁ డట్టె విసం గొనియాడఁజెల్లదే.

(నన్నెచోడుఁడు

ద్య

ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య
పదపద్మ సౌరభ భ్రమరాయమాణ.

( సో మ నా థు ( డు )

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జున దేవ దివ్య శ్రీపాద పంకజ భ్రమ
రాయమాణ ... (నన్నెచోడుఁడు)

శ్యమాత వర్ణన

( మ ల్లా ణు ని క థ )

నెట్టన నేలకు నింగికి సూత్రి
పట్ట మోఁకాళ్ళును బట్టతలయు
ముడివెట్టుతనసీడఁ గడవంగఁబాఱి
వడినెండమావుల కడకాళ్ళగట్టఁ
బాయక రెండుగాఁ బాఱెడు నీరు
వ్రేయఁబుల్లున్న గోరోయని యమ్మ
జానార మొలువఁ జటాత్రితిపైఁగుత్రింక
నేనుంగు పురుడోయ నిసుకతాత్రిడ్వెన
లలిగొన దిశలు తాలములు వాయింపఁ
జెలఁగుచురోకటఁ జిగురులుగోయ
గలివెన్నవుచ్చఁ గొండలు దొంతిఁబేర్చ
నిలమంచుఁ గుంచాలఁ గొలువరే వగలు
సేయనాయకసమునఁ జిత్రిహూపములు
వ్రాయ వాయువుబట్ట వడగండ్లగుళ్ళు
గట్టి వెన్నెల గుంపుగాఁ జేయఁబుట్టి
పుట్టినప్పుడ నేర్చు బుద్ధులఁపోక
కోలాసక త్తియ గొనములపోత్రిడ
యాలంజెతల్లి దా మల్లునిఁజూచి.

( సో మ నా థు ( డు )

సీ. నేలయు నింగియుఁ దాలముల్ వాయింప
నెండుమావులఁబట్ట బండుతలయు
మోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జటాశ్రితిపైఁ గుశ్రింకనిడుపు
లేకచిత్రిమువాశ్రియ నాకాశమునఁ దాఁప
రము లిడ మంచుఁ గుంచములఁగొలువ
నేనుంగు పురుడోయ జానారఁ గొనగాలి
గంటెడ నిసుమునఁ గట్టుదాల్ప
గీ. నీరినడుము దెశ్రింప నేలఁ దెన్నుండిచే
వెల్పఁగలియుఁ దశ్రిచ్చి వెన్నగొనఁగఁ
గడవ నేర్పుగలిగి కందువు మానెఁడై
కత్తిగొంటులయిన యత్తగంతు.

(నన్నెచోడుఁడు ఆ 8 ప 15...

ఇఁక భంగివోలె, కరణివోలె మున్నగు సోమనాథుని ప్రయోగములు నన్నెచోడుని గ్రింథమున విరివిగఁ గానననగును. క్రియావిశేషములలోఁ గర్తృర్థమునఁ గర్మార్థకములనుపయోగించుట సోమనాథునకుఁ జాలఁబరిపాటి. మచ్చున కొక యుదాహరణము చూడుఁడు. "నమస్కృతభావ పరంపరావసాన మహింతదేశ" (అక్షరాంకపద్యము నుండి) ఇచ్చట నమస్కరించు అను నర్థమున నమస్కరింపఁబడు అను నర్థమిచ్చు "నమస్కృత" అను కర్మార్థకరూప ముపయోగింపఁబడినది. ఇట్టి ప్రయోగములు చేయుటలోఁ గూడ నన్నెచోడుఁడు సోమనాథు ననుకరించినాఁడు. చూడుఁడు.

అఖిలసుధీలోకానందిత కల్పానోకహుఁడు, (ఆ 3 ప 244)

నిఖిలకులాచలప్రిభావ విజిత రజత శిఖరిశిఖరమణి రమ్యాహర్మ్య తలాలంకృతోత్తుంగ సింహాసనాసీనుఁడు. (ఆ 3 ప 245)

సీసపద్యరచనమునందువలెనే కందపద్యరచనమునఁ బ్రతిపాదమునకుఁ బదము లెచ్చటికచ్చట విడిపోవునట్లు కూర్పుచేయు సంస్కారము

డ సోమనాథుని యనుభవసారమునఁ బ్రారంభ మయ్యెనని *"పాల
కి సోమనాథకవి—అనుభవసారము" అను వ్యాసమున వ్రాసియుం
. నన్నెచోడుని కందములలోఁగూడ నీ సంస్కారానుకరణము
క్తమగును. ఇఁక నన్నెచోడుని కర్ణాటక కావ్యానుకరణములనుగూర్చి
పాలింతము. "హరహాసాకాశగంగాత్యమలజల..." అను నన్నెచో
ని యంకితాంకపద్యము (ఆ 4 ప 475) క్రీ. శ. 1124 లోఁ త్రైలోక్య
ల్లుఁ డొక జైనమఠమున వెలయించిన కన్నడశాసనములోని పద్య
న కించుమించుగఁ బ్రతిబింబముగా నున్నది. క్రీ. శ. 1100-1150
ప్రాంతమందుండిన నాగచంద్రుని మల్లినాథపురాణము, రుద్రభట్టుని
న్నాథ విజయము నను కర్ణాటక కావ్యములఁ దిలకించినచో నన్నెచో
ని పద్యములు కొన్నిటికి మాతృక లనఁదగినపద్యము లందుఁ గాన
చ్చుచున్నవి. నవమాశ్వాసమందలి "కరలతలందంద కామపాశంబుల
టికు బంధించుచున్నట్లు బిగియ" (ప 348) అను పద్య మిందుకు
దృష్టాంతము. జైనులు శబ్దార్థ చౌర్యమునకు నెఱవరనియు నన్నెచో
ని పద్యములఁబట్టియే యా కర్ణాట కవులు తమ పద్యముల రచించి
నియు శ్రీరామకృష్ణకవిగారు వ్రాసిరి. పూర్వకవీంద్రారాధనరూపక
ము లగు నిట్టిస్వల్పపద్యభావానుకరణములఁబట్టి కవులకు గ్రంథచౌర్య
దోష మారోపించుట సరిగాదని నా మనవి. తెలుఁగువచ్చునా రాదా
యని సందేహింపఁదగిన రుద్రభట్టాది కర్ణాట కవులే నన్నెచోడుని
గ్రంథమును జదివి తమ పద్యముల వ్రాసి రనుటకంటె ద్రావిడ కర్ణాట
కావ్యపరిజ్ఞానముగల నన్నెచోడ కవిరాజశిఖామణియే కర్ణాటక గ్రంథ
ములనుండి యా భావములఁ గైకొనెనని తలంచుటయే సమంజసమని పలు
వురు సహృదయుల యభిప్రాయము.

పూర్వోక్తమయిన నాయభిప్రాయమునకు సాధకముగా నిదివ
ఱకు విమర్శకులు తడవియుండని కొన్ని నూతనాంశముల నిప్పుడు ప్రక
టించుచున్నాను. నన్నెచోడుఁడు తనగురువు జంగమ మల్లికార్జునునకు
శివునకు నాశ్వాసాద్యంత పద్యముల నభేదాధ్యవసాన మొనర్చుటయే

* (ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక)

గాక కథామధ్యమునఁగూడ నాతనిని జిత్రముగఁ బ్రవేశపెట్టుట పా
లెఱుంగనిదికాదు. పార్వతీ కళ్యాణమహోత్సవ సందర్భమందలి యీ
క్రింది పద్యములఁ జూడుఁడు.

చ. .........విభ్రమగతివచ్చి చూచెనొక భామిని జం
గమ మల్లికార్జునున్ (ఆ 8 ప 6

గీ. మగువ జంగమ మల్లయఁ దగిలిచూచి (ఆ 8 ప 6

ఇట్లే యీ వివాహవైభవ వర్ణనాదికములలో నాకాలమునకు
జెందని నవనాథ సిద్ధులనుగూడ నన్నెచోడుఁడీ క్రిందిపద్యమునఁ బ్రవే
పెట్టినాఁడు.

మ. శివు గౌరీసహితంబు సన్మనములన్ జింతించి మ్రొక్కించి భై
రవయోగీంద్రులఁగొల్చి యోగినుల వీర వ్రాతమున్ దన్పి యా
నవనాథాదులనాదిసిద్ధులకు నానందించి విందిచ్చి యా
సవపాత్రల్ సతులర్థి నెత్తికొని యాస్వాదించి మోదించుచున్.
(ఆ 9 ప 3

ఈనవనాథులెవరు? ఎప్పటివారు? అనువిషయముల విచారిం
నచో నన్నెచోడుని కాలనిర్ణయమునకుఁ గొంతయవకాశము దొర
నేమోయని నాయాశయము. గౌరనామాత్య విరచితమగు నవనా
చరిత్రమను ద్విపదకావ్యమును నూతనముగా మదరాసు విశ్వవిద్యా
యమువారి నడుమఁ బ్రకటించియున్నారు. ఇది శ్రీశైలమందలి
శైవభిక్షావృత్తి మఠమున కధీశ్వరుఁడగు ముక్తికాంత భిక్షావృ
యతీశ్వరుని యాజ్ఞానుసారముగఁ గ్రీ॥ శ॥ 1430 ప్రాంతమున రచిం
బడినది. శ్రీగిరి కవి రచితమగు పద్యకావ్యమునుబట్టి తానీ ద్విప
కావ్యమొనర్చితినని గౌరన చెప్పికొనినాఁడు. ఈ శ్రీగిరి కవి యెప్ప
వాఁడో సరిగా నిర్ణయింప రాకున్నది. శ్రీగిరి రచితములని మఱిరెం
గ్రంథములు శ్రీగిరీశ శతకము, శ్రీరంగ మాహాత్మ్యము, లక్షణగ్రంథ
దులలో నుదాహృతములయినవి. పాలకురికి సోమనాథునకుఁ బ్రత్యర్థి
నుండి తరువాత నాతనికి శిష్యుఁడయి వీరశైవమును స్వీకరించిన చె

పాణి రంగనాథుఁడే మొదట శివదూషణవలనఁ గనులు పోయినప్పుడు "నయన రగడ" "శ్రీగిరీశ శతకము" మున్నగు కృతులలో శ్రీగిరిని వర్ణించి నేత్రములు వడసిన తరువాత శ్రీగిరి నామమును వహించె నేమో యని నా యనుమానము. ఇది పరిశోధింపఁదగిన విషయము. నేనెఱిఁగినంతవఱ కాంధ్రకవులలోఁ బాలకురికి సోమనాథుని మొదట స్తుతించినవాఁడు పదునాల్గవశతాబ్ది పూర్వార్ధమునందుండి శివయోగ సారమును రచించిన కొలని గణపతిదేవుఁడు.

క. అసమ శివభక్తిరసమా
నసుఁడగు పాల్కురికి సోమనాథునిఁ గవిరా
జసమున్నత యశు సద్యః
ప్రసాది యను చక్రపాణి రంగనఁ గొలుతున్.

అని యొక్క పద్యమునందే సోమనాథ రంగనాథుల నాతఁడు స్తుతించినాఁడు. కాని నన్నెచోడుని నాతఁడు గూడఁ బేర్కొనలేదు. గారన తనగ్రంథమును కేవలము శ్రీగిరి కావ్యమునుబట్టియే రచించినట్లు కాన్పించును. శ్రీగిరిగ్రంథమునకు వేఱొకమూల మున్నట్టు లాతఁడు చెప్పలేదు. నవనాథుల కాలమును చారిత్రకదృష్టితో నిర్ణయించుటకుఁ గొన్ని యాధారములు గౌరనగ్రంథమునఁ గలవు. వారు సాధించిన సిద్ధవిద్యను బట్టి చిరజీవులై యీ నవనాథు లెల్లకాలములం దుండిన నుండవచ్చుననెడి వాదముతో మనకుఁ బ్రసక్తిలేదు. వారు కేవల కల్పితపురుషులే కాని చారిత్రకపురుషులు కారను మిథ్యావాదులతో నంత కంటెఁ బ్రసక్తి లేదు. గ్రంథస్థాధారములఁ బట్టియు నితరప్రమాణము లను బట్టియు మనము వారి కాలమును నిర్ణయింతము. ఈ నవనాథ సిద్ధులలోఁ బ్రథముఁడు ప్రసిద్ధుఁడు నయినవాఁడు మీననాథుఁడు. ఇత నికే మత్స్యేంద్రనాథుఁడని మఱియొక పేరు. నవనాథులలో నితనికిఁ బ్రియశిష్యులయిన సిద్ధులు (1) చౌరంగి (రాజరాజనరేంద్రుని పుత్రుడు సారంగధరుఁడు) (2) గోరక్షుఁడు వీ రిరువురు మాళవదేశమువారని యే గ్రంథమునఁ గలదు. సారంగధరకథ ఈ దేశమునకుఁ జెందినట్లే యందు వర్ణితమయినది. మీననాథుని శిష్యాగ్రగణ్యుఁడగు గోరక్షుని ప్రశంస

క్రీ. శ. 1165 ప్రాంతమువాఁడని కొందఱు క్రీ. శ. 1430 ప్రాంతము వాఁడని మఱికొందరు తలంచు, చామరసు రచించిన కన్నడ ప్రభు లింగలీలయందును దాని కనువాదమగు పిడుపర్తి సోమనాథుని తెలుగు ప్రభులింగలీలయందును గూడఁ గలదు. సిద్ధవిద్యయం దెంతే యుక్తుఁ డయినను మాయను గెల్చు మోక్షవిద్య నాతఁడు అల్లమ ప్రభునివలన గ్రహించి తరించినట్లు లా గ్రంథములలో నున్నది. ఈ యల్లమ గోరక్షుల సంవాదము మార్పంతగా లేకయే నవనాథ చరిత్రమున గూడఁ గూర్పఁబడినది. అల్లమప్రభువు క్రీ. శ. 1168 ప్రాంతమున వెలసిన వీరశైవ మతోద్ధారకుఁడగు కల్యాణ బసవేశ్వరునకు సమ కాలీనుఁడయినట్లు బసవపురాణప్రభులింగలీలలవలన వ్యక్తమగుచున్నది. మఱియు నవనాథచరిత్రమున వర్ణితుఁడయిన వ్యాళిసిద్ధుఁడను మరి యొకసిద్ధుని కథలో నాతఁడు తన సిద్ధవిద్యా ప్రకటన సందర్భమున గళ్యాణపట్టణమేలు * బల్లహుఁడను రాజొనర్చిన ద్రోహము కతన బ్రాణములు గోల్పోయి ప్రాణావసాన సమయమున నా బల్లహుఁడు నాతని సంతతియు నిర్వంశముగ నశింతురు గాకయని శపించినట్లు చెప్ప బడినది. కల్యాణపట్టణము నేలిన యీ బల్లహుఁడు బసవేశ్వరుని యేలికయగు బిజ్జలుఁడే (1145-1168) యని వేఱ చెప్పనక్కఱలేదు. సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రమందలి యీ క్రింది పంక్తులవలన నది వ్యక్తమగును.

"వీరు వారనకెల్లవారునుగూడి ధారుణీశ్వరు సభాస్థలి కేఁగి మ్రొక్కి
బల్లహా! వినుము నీ పట్టణంబునను బ్రిల్లదుండొకచాకి బత్తుండనను"

(బసవపురాణము - మడివాలు మాచయ్యకథ)

కల్యాణమున కభిగమనంబు సేయఁ గల్యాణమున భక్తి గజిబిజిపుట్టె
బల్లహు బిజ్జలు భంజించిరంత బల్లిదుల్ జగదేవ మల్ల బ్రహ్మయలు

(పండితారాధ్య చరిత్ర - మహిమ ప్రకరణము)

---

* గ్రంథ ప్రకాశకులు దీనిని "బల్లవ"యని ముద్రించినను దప్పొప్పుల పట్టికలో "బల్లహ" అను పాఠము నొసంగిరి.

సోమనాథుఁడు బసవ పురాణమున బిజ్జలుఁడు శివద్రోహకారణమున బసవేశ్వరునిచేఁ ద్యజింపఁబడి యాతని శాపానలమునకు గుఱియై తత్ఫలముగ ననతికాలములో సపుత్రికముగ నశించెనని చెప్పియున్నాఁడు. సోమనాథునకు సమకాలీనుఁడో యించుక తరువాతివాఁడో యగు శ్రీగిరికవికూడఁ దన నవనాథ చరిత్రమున బిజ్జలుని వంశ నాశనమునకు నేకొక సిద్ధశాపమునుగూడ సిద్ధపఱిచెనని తెల్లమగుచున్నది. కావున నవనాథచరిత్రమును బట్టి యాసిద్ధులలోఁ గొందఱయిన క్రీ॥ శ॥ పదిరెండవ శతాబ్ది యుత్తరార్ధమున బసవేశ్వరుని కాలమున వెలసినట్లు కానవచ్చుచున్నది. క్రీ॥ శ॥ 1275—1296 ప్రాంతముననుండి "దీపిక" యను సంస్కృత గ్రంథమును రచించిన జ్ఞాననాథుఁడు గురుపరంపరనందు వర్ణించుచు మత్స్యేంద్రనాథునకుఁ దనకు మధ్య గోరక్షనాథ, గగననాథ, నివృత్తినాథు లను మువ్వురను జేర్కొనినాఁడు. మత్స్యేంద్రుఁడను మీననాథున కితఁడయిదవతరమువాఁడని యిందువలన వ్యక్తమగును. దీనినిబట్టిగూడ మీననాథ గోరక్షనాథులు క్రీ॥ శ॥ 1150-1170 ప్రాంతమువారగుదురు. నవనాథచరిత్రమున వర్ణితులయిన వారుగాక శైవసిద్ధులగు నవనాథులు మఱెవరును గానవచ్చుటలేదు. మహారాష్ట్రభాషలో నొకనవనాథ చరిత్రమున్నదనియు నందలిసిద్ధులు వైష్ణవ సంప్రదాయమువారనియు వారు తరువాత వెలసినవారనియుఁ దెలియుచున్నది. శైవసిద్ధులే మొదటివారనియు ప్రమాణ బుద్ధిగలవారు నిర్ణయించుచున్నారు. ఈవిషయముల నెల్ల నాలోచింప శ్రీగిరినవనాథచరిత్రమును జూచియే సన్నెచోడుఁడు పయిపద్యమున నవనాథసిద్ధులను జేర్కొనియుండుననియు దీనినిబట్టికూడ నాతఁడు పాలకురికి సోమనాథునకు శ్రీగిరికవికిఁ దరువాతనే వెలసియుండుననియుఁ దోఁపకమానదు. విజ్ఞులీ విషయమును లెస్సగాఁ బరిశోధించి సత్య నిర్ణయ మొనర్తురుగాక! అధర్వణుఁడు కూడఁ దన త్రిలింగ శబ్దానుశాసనమునఁ గ్రీ॥ శ॥ 1170 ప్రాంతమందు శబ్ద శాసనమును రచించిన హేమచంద్రునిఁ బలుమాఱులు స్మరించుటచేఁ బాలకురికి సోమనాథునకుఁ దరువాతివాఁడగుటవిస్పష్టము. అతఁడు భారతమును విరాటపర్వమునుండి

రచించుటచేఁ దిక్కనకు సమకాలీనుఁడో లేక యించుక పూర్వు
యగు ననెడు నానుడియేగాని యందుకుఁదగిన ప్రమాణములు కా
రావు. అతఁడు తిక్కనకంటె నర్వాచీనుఁడే యని యేర్పడుచో నాతఁ
రచించిన ఛందమున నన్నెచోడుని పద్యములును, "మగణమ
గదియ రగణము ..." అను పద్యమును గానవచ్చినను, శ్రీ లక్ష్మీ
పతి శాస్త్రిగారు తలంచినట్లు తిక్కన యుద్ధవర్ణనములందలి యనుకర
ములఁబట్టి నన్నెచోడుఁడు తిక్కనకుఁ దరువాత సమీపకాలము
నుండెనని తలంచుటకూడ సమంజసమే యగును. పాలకురికి సోమనా
నకుఁ దిక్కనకు మధ్య విశేషకాల వ్యత్యాసము లేదు. కాకతీయ
గణపతిదేవుని సభకుఁ దిక్కన యేఁగినపుడు సోమనాథుడప్పటి
వృద్ధుఁ డయ్యు దానుగూడ నచ్చటికే తెంచినట్లు కొన్ని ప్రమాణ
లున్నవి. ఇది నిజమయినను గాకున్నను నిరువురు సమీపకాలస్థు ల
టకు సందియము లేదు.

మహాశయులారా! నన్నెచోడుఁడు నన్నయాదులకుఁ దరువా
వాఁడైనంతమాత్రమున నాతని గౌరవమునకు భంగములేదు. మ
మాతనిని బూజించునది యాతని కవితాతత్త్వమునుబట్టియేగాని కా
తత్త్వమునుబట్టికాదు. "పురాణమిత్యేవ న సాధుసర్వం, నచాపికావ్య
నవమిత్యవద్యం" అని కవికులగురుఁడు ఘోషించినాఁడు. "కాలో
హ్యాయం నిరవధిర్విపులా చ పృథ్వీ" సత్య మెన్నటికయిన బయల్పడ
మానదు. మాయ యెంత యావరించినను దానిని జీల్చికొని తన నిత్య
సహజతేజమును బ్రసరింపఁజేయుటయే దాని నైజము. కావునఁ బం
తులు కేవలము చారిత్రికదృష్టితో సత్యముదెసనే మనముఁ బఱ
యదార్థనిర్ణయమునకై యత్నింతురుగాక యని సవినయమునఁ బ్రార్థించు
చున్నాను.

---

# నన్నెచోడకవి కాలనిర్ణయము

(విభూతి—సంపాదకులు)

దాదాపు ఇరువది సంవత్సరములనుండి ఆంధ్ర కుమారసంభవ కర్తయగు నన్నెచోడ మహాకవి కాలమును గూర్చి పలువురు విద్వాంసులు భిన్నభిన్నాభిప్రాయముల బ్రకటించుచున్నారు. ఇంతవరకును నిక్కమైన నిగ్గును తేల్పగలిగినవారు లేరు. కాని ఇటీవల శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు "కుమారసంభవ విమర్శనము"ను విరచించి, యందు విపులమైన చర్చతో నన్నెచోడుని కాలమును క్రీ. శ. ౧౪-వ శతాబ్ది వరకు నీడ్చుకొనివచ్చిరి. ఆగ్రంథము వారి పాండిత్య ప్రకర్షకును, గాఢమైన పరిశ్రమమునకును సాక్ష్య మిచ్చుచున్నను, అనేకములైన పూర్వపక్షములకును అవకాశము కలదు. వారి విమర్శమీాద మరియొక పరామర్శ గ్రంథమును సిద్ధము చేయవచ్చును. వారి ముఖ్యమైన ఖండనములకు నీ విధముగ సమాధాన మీాయబడుచున్నది.

(౧) మహాకవి కాళిదాసుని కుమారసంభవములోని యుత్తర భాగము అప్రామాణికముగా నుండుటవలనను, అది ౧౨-వ శతాబ్దిలో నొక మహారాష్ట్రపండితు విరచితమై ప్రక్షిప్త మగుటవలనను తదనుసారియగు నాంధ్ర కుమారసంభవ కావ్యము ౧౨.వ శతాబ్దికి దరువాయ బుట్టినదను నూహ సహజముగ గలుగుచున్నను ఇది సరికాదు.

కుమారసంభకథ శివపురాణము, స్కాందపురాణము, శివరహస్యము. (ఇదియొక మహాభారతమువంటి గొప్ప ఇతిహాసము) శివాగమములు మున్నగు ననేక ప్రాచీన గ్రంథములలో గలదు. కాళిదాసుని కుమారసంభవ కావ్యమునకు నివియే మూలము. శివపురాణమునుండి పంక్తులకు పంక్తులను, శ్లోకములకు శ్లోకములను కాళిదాసుడు గ్రహించియున్నాడు. నన్నెచోడ కృతియందును శివపురాణాది ప్రాచీన గ్రంథములనుండి గ్రహించబడిన సామగ్రియుండుట సహజమే. ఈ విషయ

మున బరిశ్రీమ మింతవర కే వ్యాసకర్తలును జేయ లేదు. కావు
శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు చూపిన పోలికలు మున్నగునవి హేత్వా
భాసములు కావచ్చును.

(౨) కన్నడభాషలోని యాధునికశబ్ద ప్రయోగములు నన్నె
చోడుని గ్రంథమున గల వనుటయు సరికాదు. అవి ప్రాచీనగ్రంథము
లలోను ప్రయుక్తము లైనవి. ప్రాత కన్నడ శబ్దములను గనిపట్టు
కొంకను నిఘంటువులు వెలువడలేదు కావున కొందరు పండితులు కేవ
మూహించినటులే యాశబ్దములు నూతనములు గావు,

(3) షష్ఠ్యంతములు, కొన్ని వృత్తములు, మంగళాచరణప
తులు మున్నగు విషయములకు శ్రీ శాస్త్రిగారి యూహాలే ప్రమాణ
ములు కాజాలవు. వానికి విరుద్ధముగను పెక్కు ప్రమాణములున్నవి.

(౪) ౧౨ వ శతాబ్దము యంత్యమునగాని ౧౩ వ శతాబ్దము
గాని కాపాలికమతస్థులగు జంగములు ఆంధ్రదేశమున నున్నట్లు
హాస ప్రమాణములు లభించలేదు. అటులే నన్నెచోడుని గురుడగు
జంగమ మల్లికార్జునుడు కాపాలికుడనుటయు పొసగదు. నన్నెచోడు
క్షత్రియత్వము ననుసరించి మండలార్చన సురాగోష్ఠి మొదలగు ప్ర
గములు సహజముగ వచ్చినవికాని వానికిని జంగమ మల్లికార్జునునకు
నే సంబంధము లేదు. అతడు వేదాగమ బోధానుసారము సదాచా
మైన శివదీక్షాసంపన్నుడగు నొక మహాయోగి, మరియు మల్లికార్జు
డును నన్నిచోడుడును సమకాలికులే కాని భిన్నకాలికులు కారు. ఆత
ప్రత్యక్షకటాక్షమున దీక్షితుడై పాండిత్యమును వడసి నన్నెచో
డీ గ్రంథమును రచించె ననుటయే యుక్తిసహము.

(౫) నన్నెచోడుడు పాల్కురికి సోమనాథుని బసవపురాణా
గ్రంథముల నవలోకించి యనుకరించెననుటయు నప్రామాణికమే. సో
నాథుని రచనలన్నియు బసవేశ్వర విషయకములని వేర వ్రాయనక్క
లేదు. ఆతడు బసవ బసవ యని నాకొనుచు వీరశైవ వాఙ్మయమున
తన్మయముగావించెను. ఈ కృతుల నవలోకించినవానికి బసవవిస్మృ

స్వప్నమునందును కలుగదనుట నిర్వివాదము. పైగా శైవుడగునట్టియు, జంగమ మల్లికార్జునునకు శిష్యుడగునట్టియు నన్నెచోడునకు బసవేశ్వరుని విషయమే తెలిసియున్నచో బసవనిగాని తద్వాఙ్మయ బ్రహ్మయొక్కగాని నామములను తన కుమార సంభవమున తప్పక స్మరించియే యుండును. అటులు జరుగలేదు. సోమనాథుని జాను తెనుగు భూయిష్ఠతను గమనించిన శైవుడు తదను సారముగ గ్రంథమును రచించును కాని సంస్కృత భూయిష్ఠముగ, ప్రౌఢమైన ప్రబంధశైలిని విరచింపబడిన ఆంధ్ర కుమారసంభవము సోమనాథుని యానంతరకృతి కానేరదు. మీదుమిక్కిలి నన్నిచోడుడు సోమనాథు ననుసరించలేదు. సోమనాథుడే తనకు ప్రాచీనుడైన నన్నెచోడ మహాకవి ననుకరించి నూతన ఫక్కిని జాను తెనుగు తేనియ సోనలొలుక బసవపురాణమును ప్రకటించి యున్నాడు. కుమార సంభవ శైలియు కాఠిన్యమును ప్రాచీతను వెల్లడించుచున్నది.

ఈ మొదలైన కారణములవలన సోమనాథునికంటె బ్రాచీనుడైన నన్నెచోడమహాకవి దాదాపు మహాకవి నన్నయ భట్టునకు సమకాలికు డనుటకును, ఇదియే సత్యమనుటకును, మున్ముందు నొక విపులమైనచర్చ యిందు బ్రకటితము కాగలదు. సాహిత్యశిరోమణి ఈయుణ్ణి సీతారామాచార్యులు బి.ఏ గారి యొక దీర్ఘమైన వ్యాసమున శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారి సిద్ధాంతములు ఖండింపబడుచున్నవి. బెంగళూరు సెంటు జో॥ కాలేజి యధ్యాపకులగు శ్రీ వేంకటరాఘవశర్మగారు కుమారసంభవమునుగూర్చి ౬౦౦. పేజీల మహాగ్రంథమును సిద్ధపరచినారు. కావున నన్నెచోడుని యాధునికత్వమును నిరూపించు వ్యాసములవలన నిప్పటి కప్పుడే యా సిద్ధాంతమును విశ్వసించ నక్కరలేదు. మీద పేర్కొనబడిన వ్యాసములు త్వరగా ముద్రింపబడగలవని యాశించుచున్నాము.

# ఆమలకఫలము

(ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు)

కం. అనవుఁడు ద్వితీయుఁడవులకుఁ
జని పరిణత ఫలవితానసాంద్రామలకా
వనిజములఁగాంచి జ్యేష్ఠున
కనియెను దోషగ్రహణపరాయణుఁడగుచున్.

తే. గీ. అన్న! ధాత్రీఫలంబుల నరసితే, ల
వంబు గుణమిందు లేదు శైత్యంబుఁగూర్చు
కాసఁబుట్టించు నామ్లం బొగరురసములు
నాల్కయలరదు భోజనానర్హములివి.

కం. అనుఁడు మణిగ్రీవుండి
ట్లనియెఁ గనిష్ఠునకు బాలిశాగ్రణి! విను నీ
వనినట్లు లవము లేదిం
దున, గుణము ఘనంబునీకుఁ దోఁచకపోయెన్.

తే. గీ. అమృతసమమామలకము పథ్యంబు ప్రబల
పైత్యదోషఘ్న ముష్ణతాప్రశమనంబు
పుష్టికరములలో మేటి పుష్టికరము
ఆథ్యజీవనమైన రసాయనంబు

తే. గీ. ఆమలకఫలములఁ గషాయామ్లరసము
లే నుడివితివి మాధుర్య మెందుఁ బోయె
త్రిరసమీఫలమను జన్మ! త్రివిధదోష
హరము విశదంబొనర్చెద నాలకింపు.

# భక్తజనాబాయి*

(నాటకము)

అష్టావధాని: విద్వాన్, కవిరత్న
**మేడేపల్లి లక్ష్మీకాంతంగారు**

## ప్రథమాంకము

### నాంది

శా. శ్రీ రాధా హృదయారవింద సరసస్స్నేహోజ్జ్వలస్వాంత మా
యా రామామణులందుఁ బ్రోదిగని, యాయాతియ్యనా నేళ్ళతోఁ
బారావారముకాఁగ రంజిలుడుఁ గుబ్జన్ గాంచి మిన్నంది నా
నారమ్యాకృతులం జరించుఁ దమిఁ గృష్ణబ్రహ్మ మీక్షించెదన్.

(ప్రథమరంగము—పండరిపురవీథి)

భక్తులు—(భగవంతునిఁగీర్తించుచుఁ బ్రవేశించి దేవాలయమునకరుగు
చుందురు)

౧ వ అనుబంధము

౨ వ అనుబంధము

విఠోబా, జనాబాయి—(ప్రవేశించును)

జనా—తండ్రీ! పండరిపురి కరుదెంచితిమి. శ్రీ రుక్మిణీకాంతు నాలయ
మున కేగుట కింకెంత తడవగును? (పరికించి) అరుగో! భక్త
లెల్లరు శ్రీహరినామ సంకీర్తనమునఁ దన్మయులై కోవెల కేగు
చున్నారు. మనమును వీరినిఁ గలిసి సకల దుఃఖఘ్నమగు విష్ణు
కీర్తనమున స్వామిని దర్శింతము.

---

* ఇది యొక భగవద్భక్తిని నిరూపించు చక్కని నాటకము. ఇందు వైష్ణవభక్తి
ప్రతిపాదితమైనను ఆయా స్థలములలో శివనామములను శైవులు భావించవలెను.
సంపాదకులు.

విఠో—(జనాబాయితో నడుచుచు) అమ్మా! చూడు పదియే గ
రము! అల్లదియె కోనెల! ఆ కనంబడునదియె భక్తగోష్ఠి.

తే. గీ. పండరీనాథు భక్తిహృత్పద్మమునను
నిల్పి, తన్మయులై, కడు నిశ్చలాత్మ
నామదేవాదిభక్తు లనవరతంబు
సేయు భజనామృతము గ్రోలు చెవులు తనియ.

భక్తులు—(పాండురంగని గుడిలోఁ బ్రవేశింతురు)

జనా, విఠోభా—(సింహద్వారమునుదాటి గుడిలోఁ బ్రవేశింతురు)

జనా—ఆహా! ఏమీ లక్ష్మీవల్లభు నాలయము! ఏమీ తాళమ్మ
గాది సంకీర్తననిస్వనము!! రమాకాంతా! ఆద్యంతహీన
త్రిగుణాతీతా!!

కం. తనువాఙ్మనఃక్రియల నిను
ననయము భజియించి తనియ సబలలకై సర
గన నొండుతలఁపు గలుగునె?
మునినుత! లక్ష్మీశ! విబుధపూజ్య! ముకుందా!

భక్తులు—(వీరిని దర్శింతురు)

౧ భ—ఆహా! ఏమీ తన్వీభక్తిపారవశ్యము! పదునాఱేండ్ల లేఁ[బ్ర]
యమున నింతభక్తి నార్జించి వేదవేదాంగాది సమస్తగ్రంథ
ముల నెఱిఁగిన దీనారీరత్నము భక్తశిరోమణి. ఆనందము. పరమా
నందము.

భక్తులు—(వీరికి నమస్కరింతురు)

జనాబాయి, విఠోబా—(పునరభివాదము గావింతురు)

౨ వ భ—అయ్యా! తమ నామంబులఁ బవిత్రములైన వర్ణముల ని[న]
గోరెదము.

విఠో—అయ్యా! నాపేరు విఠోబ. ఈమె నా కూతురు జనాబాయి

3 వ భ—తల్లీ! మీతోడ మేమును హరినిభజింతుము. పాండురం[గ]
సంకీర్తనమున మమ్ము ధన్యులఁ గావింపుఁడు. భక్తిమార్గము
నెలకొల్పుఁడు.

నా— భక్తులారా ! రండు. భగవత్సాన్నిధ్యమునుజేరి హరినీగీర్తింతము. (౩ వ అనుబంధము) (అందఱుగలిసి పాడుదురు)

నా—(స్వామికి నమస్కరించి) హా ! జగద్రక్షకా ! ఆపదుద్ధారకా !!

తే. గీ. ఎల్ల పౌరాణికాళిచే నెఱిఁగినటుల
విమలభక్తాళిపొందున విన్నటుల, స
కలశుభాకార ! రుక్మిణీకాంత ! నీదు
మంగళాకార దర్శన భాగ్యమబ్బె
నేత్రయుగ్మంబుకలిమికి నెగడెఫలము.

తో బా—శ్రీ పాండురంగా ! పండరీనాథ !! రక్షింపుము.

బ్రాహ్మణుఁడు— అమ్మా ! మన యిల్లువాకిలి విడిచి చాలదినములయినవి. గొడ్డు గోద పైరు పంట లేమాయెనో ! పాండురంగని దర్శించితిమి. పావనులమైతిమి. ఇఁక పోవుదము రమ్మ.

నా—తండ్రీ ! ఎక్కడికి ?

తో బా—అమ్మా ! అటు లనెద వేమి ?

నా—జనకా !

తే. గీ. ఏ స్థలంబును జేర మునీశ్వరులు పవి
విమలచిత్తానువృత్తులై వేలవర్ష
ములు తపంబుసేసెద రధోముఖముకాఁగ
నట్టి పరమపదవి వీడు టెట్టితగవు ?

తో బా—కుమారీ ! సకలపవిత్రముల నోనర్చి నీజనని తన పశ్చిమ వయసున నిన్నుఁ గని పురి టిల్లైనను విడువక మునుపే దివంగత యయ్యె. నాఁటినుండి యీ నాఁటివఱకు నీవ నా కేడుగడయని యల్లారుముద్దునఁ బెంచుకొనుచుంటిని. నీ ముద్దులెల్లఁ దీర్చుచుంటిని. నీ కోరిన కైవడిఁ బండరికిని దోడ్తెచ్చితిని. అట్టి నీ తండ్రిని విడుచుట తగవుకాదు. పసిబిడ్డవు. కసికందువు. అమ్మా ! జనాబాయి ! నామాట వినుము. నా ప్రేమబంధమిపు డీవు వదలుమన్న వదలునా !

జనా—అయ్యా!

ఉ. ఎవ్వారు తల్లిదండ్రులిఁక, నెవ్వరుసోదరు లేరు చుట్టముల్
ఎవ్వరు స్నేహితుల్ తలప?, నెవ్వని కెవ్వఁడు? మిథ్యసర్వముల్
ఇవ్వసుధన్ ఋణంబు నశియించెడుదన్కనె ప్రేమబంధముల్
చివ్వునఁ బాండురంగవిభుసేవఁ దొలంగు సమస్తబంధముల్

విఠో—కుమారీ! ఏల యిట్టి యనర్థవాక్యము లాడెదవు? నీకుఁ దగి వరుని గొనితెచ్చి యిల్లటముంచుకొని మీ ముద్దు ముచ్చటలను ముచ్చటగాఁ జూచి మురియనున్న నాకీయాశాలతను వమ సేసెదవా? కట్టా! జాయావియోగానల సంతప్తహృదయము కీ సంతాన వియోగమును గోరుచుట్టుపై రోఁకఁటిపోటు బాధించుచున్నదే? పుత్రీ! "మాతృదేవోభవ, పితృదేవోభవ" యను సూక్తి నెఱుఁగవా?

జనా—జనకా! ధర్మశాస్త్రములు పరస్పర విరుద్ధములు కావు! కా అగాధములు. కించుజ్ఞుల కగ్రాహ్యములు. సర్వజ్ఞులగు మీ బోంట్ల కే నేమని చెప్పఁగలను? కరుణించి నన్నిట వదలుఁడు.

శివ భ—అయ్యా! ఈ బాలిక నేల సంసారసాగరమునఁ బడఁద్రో దిక్కుగానక పరితపింపఁజేయుదురు? పురాకృత వశమున నిం పిన్నవయస్సునన నిట్టి విరాగిణియగుట నెంతయు ధన్య. ధన్యు లో ధన్య. ఇట్టి యుత్తమాంగన హృదయమును నొప్పిం కుఁడు. భక్తులు తపించిన భగవంతుడు బాధచెందును. సర్వా తర్యామి సర్వేశ్వరుఁడు మీబిడ్డను దనబిడ్డవలె రక్షించుకొను మామనవి నాలించి మమ్ము క్షమింపుఁడు.

విఠోబా—(దీర్ఘముగా నాలోచించి నిట్టూర్పు విడిచి) హా! పాండురంగా పండరీనాథా!!

తే. గీ. నీదు వరలబ్ధ బహుముగ్ధ, నీదుభక్తి
పరవశంబున నెగడొందు భక్తురాలు,
నాదునేకైకపుత్రిక, నీదు పాద
సేవనాకాంక్ష నెటులఁ బోఁ్రచెదవొ దేవ!

పుత్రీ! పాండురంగఁడు నిన్ను రక్షించుగాత! (నిష్క్రమించును)

నా—(దైన్యముతోఁ దండ్రిని వీక్షించి భక్తులను దిలకించి) భాగవతోత్తములారా! ఇఁక నిశ్చింత నీ పాండురంగస్వామిని భజించి తరించెను.

వ భ—అమ్మా! అచిరకాలంబున భగవత్ప్రసాదపాత్ర మయ్యెదు గాత! మే మిఁకఁ బోయివచ్చెదము.

(భక్తులతో సర్చకుఁడును నిష్క్రమించును)

నా—(౪ వ అనుబంధము పాడుచుండును)

నుదేవుఁడు—(౫ వ అనుబంధముతోఁ బ్రవేశించి స్వామికి నమస్కరించును.) పుండరీక వరదా! పురాణపురుషా!!

తే. గీ. కమలదళనేత్ర! రుక్మిణీకాంత! చక్రి!
కౌస్తుభమణిభూష! దనుజకంఠలుంఠ
నావిహార! యో సచ్చిదానందరూప!
భవ్యసందర్శనంబిమ్ము పాండురంగ!

(విగ్రహమును బరికించి) ఏమీ! భక్తావనుఁడగు నా దేవుఁడు పలుకకుండుటకుఁగలకారణ మేమి? రుక్మిణీలోలుఁడైయున్నను నా ప్రార్థన వినినంత నట్టె యురికివచ్చునారంగఁడు నాకు నేనై తన యాలయమునుజేరి మొఱపెట్టుకొన్నను బ్రత్యుత్తరమీయఁ డేమిపాపము! (ఆలోచనముతో విగ్రహమును బరిశీలించి) ఆ! తెలిసినది. రంగా! ఏ రక్కసుఁడు నీ భక్తున కిక్కట్లొనగూర్చె? ఏతన్వి నిన్నుఁ దనహృత్పద్మమున బంధించి మమ్ము గాఢాంధకారమునఁ ద్రోసె. నాకింత జ్ఞానజ్యోతి నొసఁగితివా యేతన్మయూఖస్పర్శనమున నా సారసామృతమును గ్రోలి తనియ నినుఁజూడఁగందును. హా!రంగా!!రంగా!!(ధ్యాన మొనర్చి, జనాబాయిని దిలకించి) ఈ బాలామణి యెవ్వరో! అఖండతేజః పరిభాసినియై వెలుఁగుచున్నది. సమస్తకల్యాణగుణంబుల కాటపట్టై, నిర్వికారయై, నిశ్చలతత్త్వంబునఁ జెన్నారు పరమానంద

స్వరూపిణి తానై భగవన్నివాసమున కాలయమైనది. "అన్న
న్మని సర్వాత్మా విష్ణురభ్యర్చితో యయా" అను రీతిని నీ బాలి
సర్వశరీరి యగు విష్ణువును బూర్వజన్మమునఁ జక్కఁగా నా
ధించి యుండనోపు. కాకున్న నిట్లు భగవత్సన్నిధినిగూర్చు
భగవద్ధ్యాన మొనర్చి తనకు వశ్యునిగా నొనర్చుకొనఁగలు
(డాసి, శాంతగంభీర స్వనమున) బాలామణీ! భక్తశిరోమ
వలెఁ గన్పట్టు నీ వెవ్వరైవు? నీ తలిదండ్రులెవరు? నీపేరేమి

జనా—ఆర్యా! నాపేరు జనాబాయి.

తే. గీ. పండరీనాథుఁడే తండ్రి, పరమ పావ
ని యగు రుక్మిణియే జనని, అఖిలహరి
భక్తులే బంధువర్గంబు, పాండురంగ
నామభజనామృతమె జీవనామృతంబు.

నామ—ధన్యోస్మి! ధన్యోస్మి!! నారీరత్నంబవగు నిన్ను గాంచ న
కెంతయు నాహ్లాద ముదయించుచున్నది. "సత్సంగత్వే నిస్సం
త్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" కాన నాతోడి ప్రసంగమున నీకు
నాకును మేలయ్యెడిని. జ్ఞానాన్వేషణమునకుఁ దానయ్యెడిని
భక్తిజ్ఞానమున నీ మనోరథం బీడేరును. నీ జన్మము ఫలించును
మీబోఁటి భక్తగోష్ఠిని నేను సర్వదా యాసింతు. నాయిం
నుండుము రమ్మ. నన్ను నామదేవుడందురు.

జనా—చిత్తము.

నామ—
జనా—
} (స్వాటుకిఁ బ్రదక్షిణించి వెళ్లుదురు.)

౫ వ అనుబంధము) (యవనిక వ్రాలును)

ప్రథమాంకము సంపూర్ణము.

# ద్వాదశ జ్యోతిర్లింగములు

**బి. ఎం. మహంతయ్యగారు**



శ్రీ పరమేశ్వరుఁడు, జగత్కల్యాణార్థము, పుణ్యతీర్థములలో, లింగాకృతిగ్నావసించునని, శైవపురాణాదులయందు ల్లేఖింపఁబడియున్నది యే పుణ్యస్థలములయందు, భక్తశిరోమణు లా దేవదేవు నర్చించిరో యా స్థానములలో సత ఆవిర్భూతుఁడై, జ్యోతిర్లింగాకారమున శాశ్వతముగ నిలిచియున్నాడు. ఈవిధముగా భక్తు లర్చించిన లింగము లన్నియు జ్యోతిర్లింగములని భ్రిమపడరాదు. కోటానుకోటి లింగములలో బ్రిధానములైనవి శివపురాణము ననుసరించి యీ దిగువ నుదాహరింపఁబడుచున్నది.

శ్లో॥ "సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాల - మోంకార మమలేశ్వరే
కేదారం హిమవత్పృష్ఠే - ఢాకిన్యాం భీమశంకరం
వారాణస్యాం చ విశ్వేశం - త్ర్యంబకం గౌతమీతటే.
పరల్యాం వైద్యనాథం చ - నాగేశం దారుకావనే
సేతుబంధే తు రామేశం - ఘుశ్మేశం చ శివాలయే
ద్వాదశైతాని నామాని - ప్రాతరుత్థాయ యః పఠేత్
సప్తజన్మకృతం పాపం - స్మరణేన వినశ్యతి
యం యం కామ మపేక్ష్యైవ - పఠిష్యంతి నరోత్తమాః
తస్య తస్య ఫలప్రాప్తి ర్భవిష్యతి న సంశయః
ఏతేషాం దర్శనాదేవ - పాతకం నైవ తిష్ఠతి.
కర్మక్షయో భవే త్తస్య - యస్య తుష్టో మహేశ్వరః
(శివపురాణము")

తాత్పర్యము:—(౧) సౌరాష్ట్రప్రిదేశము (ఘూర్జరము) నందు శ్రీ సోమనాథ జ్యోతిర్లింగము (౨) శ్రీశైలమునందు మల్లికార్జున స్వామి (౩) ఉజ్జయనీనగరమునందు శ్రీ మహాకాలలింగము (౪) ఓంకారమునందు ఓంకారేశ్వరుఁడు లేక అమరేశ్వరుఁడు (౫) హిమాచ్ఛాదిత కేదారఖండమున శ్రీ కేదారనాథుఁడు (౬) డాకినీయను ప్రిదేశము (నిజాం) నందు శ్రీ భీమశంకరుఁడు (౭) వారాణసీ (కాశీ) నగరమున

శ్రీ విశ్వనాథుఁడు (౮) గౌతమీ (గోదావరీ) తీరమున శ్రీ త్ర్యం
కేశ్వరుఁడు (౯) పరళీక్షేత్రమున శ్రీ వైద్యనాథుఁడు (౧౦) దారు
వనమునందు శ్రీ నాగేశ్వరుఁడు (౧౧) సేతుబంధమున శ్రీ రామే
శ్వరుఁడు (౧౨) నిజాంరాష్ట్రములోని ఔరంగాబాదు సమీపమున
మైళ్ళ దూరమునందలి (ఎల్లోరా) యనుచోట ఘుశ్మేశ్వరుఁడు
పండ్రెండును జ్యోతిర్లింగములు. వీనిమహిమ లత్యద్భుతములు.
ఏని భక్తులు ప్రాతఃకాలమున నీ నామావళిని పఠించెదరో
వారి సప్తజన్మములందొనరించిన పాపము క్షయమగును. ఏ యభీ
ష్టమునుగుఱించి యే పురుషపుంగవుఁడు యీ నామావళిని పఠించు
యతని కోరిక సఫలమగును. ఈ విషయము సందేహమాత్రము సం
దేహము లేదు. ఈ దివ్యలింగముల సందర్శించినమాత్రముననే పాపహా
మైనచో పఠించినవారికి కామితార్థములు గలుగుననన్న సందేహమేమా
త్రము లేదు. శివపురాణమునందేగాక రామాయణ, మహాభారతము
యందును ప్రాచీన ధర్మగ్రంథములందును జ్యోతిర్లింగ సంబంధమై
వర్ణనలుఁగలవు. స్కాందపురాణాంతర్గత కాశీఖండ సేతుబంధఖండ
రేవాఖండ, అవంతీఖండ, కేదారఖండములలో కాశీ, రామేశ్వర, మహా
కాల, కేదారనాథాది తీర్థములవర్ణన విస్తారముగ నున్నది. అయినను
ఒక్కొక్క జ్యోతిర్లింగమునుగుఱించి విశదీకరింపఁబడును.

## శ్రీ సో మ నా థ లిం గ ము

కాఠియావాడయందలి శ్రీ ప్రభాసక్షేత్రమున, శ్రీ సోమనాథ
జ్యోతిర్లింగముఁగలదు. ఈ ప్రదేశముననే లీలామానుష విగ్రహుఁ
డగు. శ్రీకృష్ణభగవానుఁడు, యదువంశ సంహారమును, గావింపఁజేసి
జరా యను పేరుగల వ్యాధునిబాణముచే తన పాదపద్మమును ఛేదింపఁ
జేసికొని యవతారమును సమాప్తిగావించుకొనియెను. మఱియు సోమ
నాథుని పౌరాణికగాథ సంక్షేపముగా వ్రాయఁబడుచున్నది.

పూర్వకాలమునందు దక్షప్రజాపతి తన ౨౭ గురు కన్యకలను
చంద్రునికొసగి వివాహముఁగావించెను. కాని వారిలో రోహిణియందు
మాత్రమే మిక్కిలి ప్రేమగలిగియుండెను. ఈ కారణమున తక్కిన
౨౬ గురు భార్యలకుఁ గష్టము సంప్రాప్తమయ్యెను. వీరు చంద్రుని

...విషయమును తమ జనకుఁడగు దక్షప్రజాపతితో నివేదించిరి.
...డు చంద్రునికి హితోపదేశమొనరించి సమదర్శివై యుండుమని
...పెను, కాని యద్దాని ఫలితము శూన్యమైనది. తుదకు దక్షుని కాగ్ర
...ముగలిగి, చంద్రుని క్షయవ్యాధిగ్రస్తుఁడవుఁ గమ్మని శపించెను.
...లితముగ చంద్రునికి క్షయవ్యాధి సంప్రాప్తించినది. సుధాకరుని
...శానర్ష ములేకపోయినది. ప్రపంచమంతయు నాహాకారములు చెల
...గెను. చంద్రుని ప్రార్థన ననుసరించి ఇంద్రాది దేవతలు, వసిష్ఠాది
...షులు చంద్రుని క్షయవ్యాధి నివారణకే యుపాయము గానక
...హ్మదేవుని చెంతకేగి ప్రార్థించిరి. అప్పితామహుఁడు వారితో నీవిధ
...గా సెలవొసఁగెను. 'మీరందరును కలిసి చంద్రునితోఁ బ్రభాస
...మునమృత్యుంజయు నారాధింపఁజేయుఁడు. ఆ పరమేశ్వరుఁడు ప్రసన్ను
...య్యేనేని యతనివ్యాధి నిర్మూలమగును' పరమేష్ఠివాక్యముల నాల
...చి యతని యాదేశానుసారము యింద్రాది దేవతలును, వసిష్ఠాది
...షులును ప్రభాసతీర్థమునకు చంద్రునిదోడ్కొని వెడలిరి. చంద్రుఁడు
...ృత్యుంజయ భగవాను నర్చించుట కనుష్ఠాన మారంభించెను. మృత్యుం
...య మంత్రోపాసనచే, పూజయు, జపమును, గావింపసాగెను. ౬
...లలవరకు ఘోరమగు తపస్సుచేసెను. దశకోటిమంత్ర జప మొనరిం
...ను. అప్పుడా శంకరభగవానుఁడు సంతుష్టుఁడై ప్రత్యక్షమయ్యెను.
...ప్రదానము గావించెను. మృతతుల్యచంద్రుఁ డమరత్వముగాంచెను.
...సమయమునఁ బరమేశ్వరుఁడు "ఓయి సోమా! నీవు విచారమువద
...ము. నీకు కృష్ణపక్షమున బ్రతిదిన మొకకళ క్షీణించును. శుక్లపక్ష
...మున ప్రతిదిన మొకకళ వృద్ధిఁజెందును. ప్రతి పూర్ణిమనాడు నీవు
...పూర్ణ కళలచే విరాజిల్లెదవు. అని వర మొసగెను. ఇవ్విధముగ కలా
...నుఁడగు కలాధరుఁడు కల్పాయుక్తుఁడయ్యెను. సమస్త ప్రపంచము
...ధాకరసుధాకిరణములచే జీవనాధారమైనది. తదుపరి చంద్రాదుల
...త్రపారములచే భవానీసహిత శంకరుఁడు భక్తజనోద్ధరణార్థము
...్యోతిర్లింగరూపమున శాశ్వతముగ నిలిచెను. శ్రీ మహాభారతము,
...శ్రీమద్భాగవతము, స్కాందపురాణాది పుణ్యగ్రంథములయందు నీ
...ప్రభాసక్షేత్ర మహిమాభివర్ణనము గావింపఁబడినది. పావన ప్రభాస

క్షేత్రి ప్రవహితపూత సలిలసరస్వతీసంగమసందర్శనమున పాపపు[illegible]
లన్ని పలాయనమగునని పురాణాదులయందు చెప్పఁబడియున్నది.

ప్రాచీన సోమనాథ మందిరము క్రీస్తు శకము ౧౦౨౪ సం[illegible]
మున, మహమూద్‌గజనవీయను బాదుషాచే ధ్వంస మ్మొనరింపబ[illegible]
అది యిప్పటికిని సముద్రతీరమున భగ్నావశేష రూపమున [illegible]
నగును. శివలింగము భగ్నము గాకుండుటచే మందిరమున మహమ[illegible]
గజనవీ భీషణాగ్నిని రగుల్కొల్పెను. ఇంద్రనీలమణిస్థగిత [illegible]
స్తంభములయందమూల్య మణిరాసు లపహరించుకొనిపోయెను. [illegible]
తర్వాత భీమదేవుఁడు శ్రీ సోమనాథుని పునః ప్రతిష్ఠ గావించె[illegible]
సిద్ధరాజ జయసింహులు (౧౦౯౩ క్రీస్తు మొ॥ ౧౧౪౨ వరకు) [illegible]
పునః ప్రతిష్ఠకు గొప్ప సహాయము గావించిరి. ౧౧౬౮ క్రీ[illegible]
విజయేశ్వర కుమారపాల మహారాజు ప్రసిద్ధులగు హేమచంద్ర [illegible]
యను జైనమతాచార్యుల యుక్తము సోమనాథ యాత్ర గా[illegible]
మందిరమునకు సహాయ మొనరించిరి. సౌరాష్ట్ర పతియగు శ్రీ [illegible]
రాయలు మందిరాభివృద్ధికి పాటుఁబడిరి. అయినను మహమ్మదీయ[illegible]
దండయాత్రలు క్రమక్రమముగా సాగుచునేయుండెను. ౧[illegible]
క్రీ॥ శ॥ సుల్తాన్ అలాయుద్దీన్ ఖిల్జీ మందిర విధ్వంసన గావించె[illegible]
పిమ్మట యతని సేనాధిపతి, మఱియు ౧౪౧౩ క్రీ॥ శ॥ సుల్తాన్ [illegible]
మదుషా సోమనాథ మందిర నిర్మూలన గావించెను. ఆ మందిరము[illegible]
దిప్పుడు శివలింగము లేదు. అయినను ప్రాచీన శిల్పము జీర్ణమై [illegible]
మైనను పూర్వవైభవమును చాటుచున్నది. సోమనాథయాత్రకు రె[illegible]
విధముల ప్రయాణము సాగింపవచ్చును (౧) సముద్రయానము [illegible]
అయోమార్గము

ఈ కాలమందలి సోమనాథమందిరము (౧౭౩౧) క్రీస్తు [illegible]
మున మహారాణి అహల్యబాయి నిర్మితము. సముద్రతీరమున గా[illegible]
క్వారు రాజుల పరిపాలన ప్రదేశమందున్నది. సోమనాథ జ్యోతిర్లింగ[illegible]
గర్భగృహమందలి యొక గుహయందు ౨౨ సోపానముల నవతరిం[illegible]
కానఁబడును. అచట దీపము బ్రకాశించును.—ఓం తత్ సత్

(పత్రిక మొదట సౌరాష్ట్రసోమనాథాలయ చిత్రముకలదు)

# కౌశాంబి

ఓగిరాల సుబ్బారావుగారు



మ. శ్రీమద్భూరివిశేషరత్నమయ రాశీభూత సంపన్మహో
ద్దామస్ఫూర్తి విశేషకీర్తి ప్రచలత్పాపౌఘవిధ్వంసనా
క్షామప్రాభవపుణ్యదీప్తిమయ కౌశాంబీపురం బొండు సు
క్షేమంబై యల భారతోత్తరమహీసీమన్ విరాజిల్లుచున్.

మ. నానాపత్తనవాసినేత్రయుగళానందప్రదై కాగ్ర్యమై
వీణాతాళమృదంగ ముఖ్యతత వైపీదత్తగాంధర్వసు
స్థానంబై యల వత్సరాజ్యమున కాధారంబునై వేదగీ
తానాదార్భటవిప్రరాడ్గణ గృహస్థానావళీ ప్రాజ్యమై.

సీ. ఆ వియత్పర్యంత మావిర్భవించిన
ధవళాయమానసౌధములతోడ
దేవాంగనాహాసద్భావాంతరంగ నా
ట్యప్రభాగణికామహంబుతోడఁ
గాబేరదిగ్భాగ కలహాయమానసం
పన్మహావాసక ప్రతతితోడ
నిత్యదేవార్చన నియతప్రసక్త హృ
త్కమల దీక్షితభక్తగణముతోడ

తే. గీ. సనృతవాక్యప్రవర్తనాహారకంస
సక్తహృదయానుదగ్ధభాసకులతోడ
నపరనాకంబువోలె నిరంతరంబు
దినదినప్రవర్ధితమునై తేజరిల్లె.

ఉ. పున్నమనాటిచంద్రుఁ డొక పూర్ణసమస్త కళావిశేషసం
పన్నుఁడె మచ్చలేనిమగవాఁడె యటంచుఁ దదీయబింబమున్

గన్నను గొప్పసేయ రలకాంతలు వారి మనోవిహార వి
ద్వన్నత నల్ల భాస్యహిమధామపు బింబములానుచుండుటల్.

ఉ. మారుసితూపు లాసురసమాన సతీపురుషాళి నింతయున్
భీరులఁజేయఁజాల వొకవేళనువైచిన వారితూపు లా
మారునిగెంటుఁ దత్సతిని మాని యొకండుగవచ్చుచుంట స
వ్వారలు నొండొరుల్ సతముబాయక కాలము బుచ్చుచుండుటల్.

ఉ. ఆ పురి నేలుచుండు మకరాంకమృగాంకవిదగ్ధమూర్తి, యుం
డాదిపరశౌర్యశాలి, పరరాజవిదారణబుద్ధివర్తి సం
తాపవిచారణాది శిఖతాంతవిలాసమనోజ్ఞభాషి, శో
భాపరిపాలకోదయన పార్థివచంద్రుఁ డనంతకీర్తిమై.

ఉ. "భూవరుఁ డేమిసేయు నను? భూవరుకంటెను బెద్దమూర్తినే
నే! వచియింప" నంచుఁ దను, నెమ్మదిఁ దోచినరీతిఁగాల్రి, "నా
రా! వినదా! మదీయవచనం బిది" యంచు నృపుండు దానిఁ ద
గేవలశాస్త్రిసేయఁగ విశీర్ణపు రోదన సచ్ఛలంబుమై.

తే. గీ. సంద్రి మాతని ధారుణీచక్రమునకు
శత్రులెవ్వరు రాకుండ సరణిదానిఁ
పటకయనఁ జుట్టుకొని మహాభయదమైన
ఘోషఁజేయుచు నృపుదయఁ గోరుచుండు:

ఉ. వాసవదత్త నాపయి నవారితభక్తియు భాత్రితాగుణా
వాసముఁజూపు, నాపలుకు బ్రాహ్మ్యమటంచుఁ దలంచుఁగాని, నే
నేసని యీయుదంతము వచించుటకంటెను నామె భార్తచే
నా సరసీరుహేక్షణకు నంతయుఁ దెల్లము సేయు టొప్పగుర్.

వ. నావిని వసంతకసంజ్ఞామాత్యుండు, తరంగితహర్షోత్కర్షంబున, నో
యమానమానసుండై, భక్తజనరక్షణవ్రతకంకణవర్ధితాభయహ

యగు నా మహిషాసురమర్దనీ కృపాకటాక్షవీక్షణాసవిపదమృత ధారాపాతంబున నిప్పని సాంతంబుగాఁ గొనసాఁగి యచిరకాలంబు ననే, శుభోదయం బగుఁగాపుతమని నెమ్మనంబున నా యౌగంధ రాయణ భావిపస్థానంబునకుఁ బాత్రములయిన మంగళమంత్రవచ నంబులఁ బఠించుచు, నతనికిం బ్రణమిల్లి, యనుమతి వడసి మంద మందగమనంబులఁ బ్రచరించు మదగజంబుల నపహాసించుచుండె నాఁ జనుచు, నల్లనల్లన నిజావసథంబునకుం జనియె నంత.

మన తేఁడు వ్యసనుడై మసలుచుండుటఁ జేసి
ధారుణీ రాజ్యంబు తఱుఁగు నింక
తఱుఁగుట యేకాక తదితరనృపు లంద
ఱేకమై కప్పంబు లీరు సరిగ
నీయకుండుటె కాక, నితనిపై దండెత్తి
రాఁజాలు కాలమరయుచునుందు
యరయుచుండుటె కాక, నధమాధములనుగా
మనలఁ జేతురు శత్రుమంత్రులంత
తే॥ గీ॥ వాని నన్నింటి నణగించి వసుధనింకఁ
బ్రబలు విధిసేయనూహాను బన్నినాడ
దానికీవును, రాజ్ఞితాఁ బూనునట్టు
లొప్పఁ జెప్పంగవలె నిప్పుడో సుధీంద్ర!

గీ. శత్రువిజయార్థమై తన శక్తిఁ గూడఁ
దోడునీడగ నృపునితో నాడనిడెనో
యనఁగ నుష్ణాంశుఁ డాత్మీయమైనకాంతి
నల్లనల్లన విడనాడి యరుగుచుండె.

పదఁపడి వత్సరాజ్యమహీపాలుఁడు యుద్ధముసేయ శత్రుకో విమలకు నిందుపైన నొకబెత్తెడు సీమయుగూడ నుండఁబో దధి యొకవేళ నున్నఁ బ్రభుతాజ్ఞకుఁలోఁబడియుండ నొప్పు శత్రుదిన సమాప్తియోయన బ్రతిపూర్ణ ముఁగాఁదినముగా జెనమ్యోర్క.

5

చ. కులజుఁడు వత్సభూపుఁడిఁక కొన్నిదినాల సర్వధర్మైక పాలనా
చలవహుఁడౌనటంచు సరసంబుగ ముందరుఁ దెంచు మంగళం
బుల జనకోటికిం దెలుపు పూన్కినటన్ జనుదెంచు సూచకో
జ్వలుఁ డోయనంగనాదెసను జల్లని చందురుఁడొప్పె నత్తరిన్

సీ. ధన్యాస్మియనినేఁడు తగఁజెప్పవలెఁగదా
భవదీయ దర్శనోత్సవముచేతఁ
బుణ్యాస్మియనినేఁడు పొంగఁగావలెఁగదా
తావక పాదసంధాన కలన
మాన్యాస్మియనినేఁడు పల్కఁగావలెఁగదా
త్వత్కృతాశీర్వాద ఘనముకతన
నభయాస్మియనినేఁడు ననఁగావలెనుగదా
భవదాదరణగీః పరిభావగరిమ

గీ. కాని వీరలతోడ నేకాంతవనముఁ
జేరనరుదేర హేతువుఁగోర నాదు
హృదయమెంతయు నురియాట నెయ్యసాఁగె
విప్రి మెచ్చించి ధన్యఁగావింపుమయ్య!

(స్వవిరచిత పద్మావతీపరిణయ ప్రబంధమునుండి)

---

# సుభాషితము

(ఒక సరసకవి)

ఉ. భావములేని కావ్యము, విభావములేని రసంబు, శంభుసం
భావనలేని దీక్ష, రతిభావమెఱుంగని నాతిపొందు, సం
భావిత తన్మయీభవనభాసురయోగ్యతలేని బుద్ధియున్,
భావనసేయ జీర్ణ తృణభావమునొందవె లోకమందునన్.

(ఈ పత్రిక ముద్రింపఁబడునప్పుడు విరచితము)

# ప్రేమ దర్పణము

కె. సాంబసిద్ధయ్యగారు - ఉపాధ్యాయులు.

అది వేసవికాలము. మధ్యందినమార్తండుడు నభోమండలమందు -వి కిరణములను సూటిగా బరపుచుండెను. ప్రపంచమంతయు -రతాపము సహింపలేక తహతహ లాడుచుండెను. వేడివాయువులు -డబడలికచే దమతమ సంచారములు మాని తరుచ్ఛాయల విశ్ర-ంచుటకై పోవుచుండెను. ఉష్ణాధిక్యతవలన తటాకోదకము మసలుటచే -లు మరుగువారుచుండెను. వేడిమి సహింపలేక పక్షులు తమ శిరము -చెట్ల యాకులమధ్య దాచుకొనుచుండెను. పాంథులు ప్రయాణ-లు నిలిపి చెట్లనీడల సేద దీర్చుకొనుచుండిరి.

అట్టి సమయమున నొకవ్యక్తి అశ్వారూఢుడై యరణ్యమునం-బోవుచుండెను. ఆ యాజానుబాహువులు, ఆ విశాలనయనములు, ఆ -సురామణీకపు, ఆ కటిప్రదేశమున వ్రేలాడు భీకరఖడ్గము, శిరముపై -ంచిన నవరత్నఖచితమైన తురాయి, యాతని రాజలాంఛనములను -ప్పక చెప్పుచుండెను. అతని వదనాంభోజము రవికరస్పర్శచే వాడియుం-ను. ఆపాదమస్తకము స్వేదమున దడిసి ముద్ద యయ్యెను. దప్పిచే -లుక పొడివడుచుండెను. ఎంచేని దేటజలముం గ్రోలి దప్పిదీర్చుకొను-కై నలువైపుల జాల దూరమువరకు దృష్టిని సారించెనుగాని యెందును -మీపమున జలాశయము గానరానందున నింకను ముందునకు బోవు-చుండెను.

౧

-తురు—అమ్మా! మనమింక నెన్నినాళ్ళు ఈ కారడవిలో పట
కుటీరావాస మొనరించుచు కష్టము లనుభవింప వలయును?
మన జీవితకాలమంతయు నిడుములతో నడవులయందు గడప
వలయు ననియేనా భగవంతుని యుద్దేశ్యము?

తల్లి—కుమారీ! అట్లు యెన్నటికినీ గాదు. భగవంతుడు కరుణా
మయుడు. ప్రతివ్యక్తి నెల్లప్పుడు సుఖముగానుండవలయుననియే
ఆతని యుద్దేశ్యము.

కూతురు—అటులే యయినయెడల నందరివలె మనలను ధనవంతుల
నేల సేయలేదు ? మనకును దివ్యభవనములను, సర్వసౌఖ్య
లను యేలప్రసాదించి యుండలేదు ?

తల్లి—బిడ్డా ! తెలియక భగవంతునిపై నింద మోపు చున్నావు
యది సరికాదు. మానవులకు గష్టసుఖములు వారి యొ
పూర్వజన్మ సంస్కారములను బట్టి సంభవించు చుండును. వా
ననుభవింపక తప్పదు. పామరులు ఈ సూత్రమును గ్రహి
లేక సుఖమునందు సంతోషవీచికలలో నేనెరుంగక నిమ
తురు. కష్టములు సంభవించినప్పుడు మాత్రము యవి భ
త్సంకల్పములని దూరుచుందురు. అదియునుగాక కష్టము లే
సుఖము లేగాని నిత్యములుగావు. అవి చంచలములు. ఓడ
బండ్లు అగును. బండ్లుఓడలగునురాజాధిరాజు భిక్షువు గావచ్చు
భిక్షువు రాజాధిరాజు గావచ్చును. ప్రాజ్ఞులు ఈ రెంటియం
తమయొక్కచిత్తమును బోనీయక నిత్యసంతోషులుగా నుందు

కూతురు—అమ్మా ! మనల నలముకొనియున్న కష్టతిమిరము బ
పోయి ఎన్నటికేని సుఖోదయము కలుగునా ?

తల్లి—తప్పక కల్గును. ఆ ఈశ్వరుని దయచే సర్వశుభములు చేకు
వచ్చును.

కూతురు—తల్లీ ! మరియొకటి.

తల్లి—బిడ్డా ! ఆగుము. ఎవ్వరో పిలుచుచున్నారు. ద్వారము చెంత
చూడుము.

ఆ బాలిక పరుగు పరుగునబోయి ద్వారము దెరచెను. ఎ
దివ్య సుందరపురుషుడు అశ్వారూఢుడై ప్రత్యక్షమయ్యెను.

బాలిక—(వినయముగా) అయ్యా ! మీా రెవరు ?

పురుషు—బాలికా నే నెవరైననేమి ? వేటబడలికచే మేనుసొమ్మ
పోయినది. దప్పిచే నాల్క తడబడుచున్నది. ఎక్కువ
మాటాడుటకు శరీరమందు శక్తి చాలకున్నది. పానముచే
టకై కొంత తేటజల మొసంగుము.

బాలిక—జలమున కేమి కొదువ? తాము ముందశ్వమునుండి యవరో హింపుడు, లోనికి విచ్చేయుడు. యథాశక్తి మేమిచ్చు నాతిథ్యమును స్వీకరించి మమ్మానందింపజేయుడు.

పురుషుడు—అమ్మాయీ! మీ కింత శ్రమ యేల? జల మొసంగిన చాలును.

బాలిక—ఇది మాకు శ్రమ కాదు. పరమసుఖదాయకము. సకాలమునకు వచ్చిన యతిథుల సత్కరించుట మా విధియై యున్నది. ఒక్క మేమే యననేల? భారతమాత గర్భమున జీవించిన పక్షిసంతానములు సహితము యతిథి పోషణార్థమై ఆత్మశరీరములను సమర్పణ చేయుచుందును.

ఆ బాలికయొక్క సరళవాక్యములను విని, యా పురుషు డేమి యోజించెనో గాని తల యూచి అశ్వముడిగ్గి దాని నొక వృక్షచ్ఛాయను గట్టివైచి, యా బాలిక ముందు బోవుచుండ తానును నెనువెంట గుటీరములోని కేగెను. ఆ బాలిక త్వరగా లోని కేగి యొక పరిశుభ్రమైన పాత్రిలో నిర్మల జలము గొనివచ్చి పాదప్రక్షాళ నార్థమునిచ్చి కూర్చుండుటకై తగిన యాసనములు లేవని చిరిచాప పరచుటకై సందేహించుచుండెను. ఆపురుషుడు బాలికయొక్క యుద్దేశ్యము గ్రహించి "బాలా! రత్నమణిమయాసనములందు శుష్కాడంబముతప్ప మరియేమియులేదు. ప్రేమపూర్వకముగా గౌరవము సల్పు నీచిరిచాపయందు గూర్చుండుటయే నాకు వేయిమడుంగులు సౌఖ్యావహము" అని చెప్పెను. ఆబాలిక యపరిమితానందముతో లోనికేగెను. ఆపురుషుడు చిరిచాపపై కూర్చుండి ఈశ్వరుని సృష్టివై చిత్ర్య మోచనాతరంగ మాలికలలో విహారము సల్పుచుండెను. ఇంతలో నాబాలిక యొక పరిశుభ్రమైన పళ్ళెరమునం గొంతవరి యన్నమును,ఒకగిన్నెలో పెరుగును, ఒక పాత్రిలో జలమునుదీసికొనివచ్చి "అయ్యా! చాల పొద్దైనది. భోజనము సేయుడు." అనెను ఆతడు బాలిక యొసంగిన యాహారమును సంతోషముతో స్వీకరించి భుజించుచుండెను.

ఆసరళహృదయమైన బాలిక లోని ద్వారము చెంతనిలచి తే
దృష్టితో నాపురుషుని గమనించుచుండెను. ఆబాలికయొక్క దృష్టి
పురుషుని యొక్క హస్తాంగుళీయకముపై నిలచెను. తోడనే
బాలిక బిరాన లోనికి బోయి తల్లితో "అమ్మా! ఈమహాత్మునియం
తండ్రిగారు నిర్దేశించిన లక్షణములన్నియు గాన్పించుచున్నవి.
వేలియందు రాజముద్రాంగుళీయకము మెరయుచున్నది" యనె
తల్లియు బయటికివచ్చిచూచి సందేహము బాపికొని లోనికేగెను.

ఆ పురుషుడు భోజనానంతరము విశ్రాంతి దీసికొనిన
గమనోన్ముఖుడై కృతజ్ఞతా పూర్వకముగా సెలవుగోరెను. బా
యొక్క తల్లి "కుమారీ! ఈకాగితము నా మహాత్మున కందీయ
మనెను ఆ బాలిక ఉత్తరమును వినయముగా సమర్పించెను. అత
దానిని విప్పిచదువుకొని కన్నీరునించెను. మృదుమధురస్వరమున వారి
"గడచిన దానికై మీరు చింతింపకుడు? భగవంతుని దయవలన మీ
గష్టములన్నియు నేటితో దీరిపోయినవి. మీరు నా వెంట పయన
గండు" అని చెప్పెను. ఇంతలో రాజదర్శన చిహ్నమగు "కాహళము"
బడెను. అదివిని యాతడు బయటికి వచ్చిచూచి కాహళను ఊదినది త
సేనాపరివారమేయని గ్రహించి లోనికేగెను. పరివారము సమీ
చెను. స్త్రీయు బాలికయు తానును సపరివారముగా గృహోన్ము
లయ్యిరి.

## 3

ఢిల్లీ రాజభవనములో నొక సుందర విదుషీమణి నవరత్న ఖచి
మణి మయాసనముపై సుఖోపవిష్టయై యుండెను. ఆమె శరీరము శిరీ
కుసుమ పేశలము. వదనము వికసించిన తామర పుష్పము. కన్నులింద
నీలోత్పలములు. కురులిందిందిరములు కరములు తామరతూడులు,
సర్వాంగసుందరియొక్క తనూ విలాసము యెదుట నచ్చర మచ్చెక
టులయొక్క సౌందర్య తేజో విశేషముదిగదుడుపునకైనను బనికిరాదని
తోపజేయును. అట్టిజగదేక సౌందర్యవతియగుటచేతనే కాబోలు "నూ
హాను" అను నన్వర్థనామమును బడసియుండెను. ఆమె కిరుప్రక్క

నిరుపుగుశరదిందుముఖులు నిలచి వింజామరంబుల వీచుచుండిరి. తక్కుంగల సఖీజనముయథోచితోపచారములు సలుపుచుండెను. అప్పుడాలావణ్యరాశి యొక చెలి నుద్దేశించి, మృదుమధురస్వరముతో "చెలీ! జహాఁపనాఃగారు నేడేలనో యింత ప్రొద్దయినను విచ్చేసియుండలేదు. కారణ మేమైయుండునోకదా!" అనియెను. ఇట్లు చెప్పుచుండగనే "మొగలు సామ్రాజ్య పట్టభద్రులగు జహాంగీరు సార్వభౌములకుజై" అనువందిమాగధకై వారములు మిన్నుముట్టెను. సార్వభౌముడు విచ్చేయుచున్నాడని తలంచి యందరును లేచి నిశ్శబ్దముగా నుండిరి. సార్వభౌముడును అతని వెంట నొక బాలికయు స్త్రీయు లోనబ్రవేశించిరి. నూర్జహాను పట్టమహిషి యెదురేగి సార్వభౌముని దోడ్కొనివచ్చి సుఖాసీనుజేసి తాను వినయముగా నిలచియుండెను.

సార్వ—"ప్యారీ! ఏల నిలచెదవు? నీవీ యాసన మలంకరింపుము" అని చెప్పి బాలికను స్త్రీని గూర్చుండ నియోగించెను.

నూర్జహాను—జహాఁపనా! మృగయావినోదములో నేడు యింత ప్రొద్దేల తడసితిరి? ఈ బాలిక, స్త్రీయు నెవరు?

సార్వ—ప్యారీ! నేడు మృగయావినోదములో నొక విచిత్రమైన సంఘటన జరిగినది. ఈ యుత్తరమును ఆ మూలానుగ్రముగా జదువుకొనిన సర్వమును బోధపడగలదు" అనిచెప్పి తన జేబులోనుండి యొకయుత్తరమునుదీసి పట్టమహిషి చేతికిచ్చెను. ఆమె దాని నిట్లు చదువదొడంగెను.

"మొగలు సామ్రాజ్యాధినేతయగు జహాంగీరు సార్వభౌముల కరకమలములందు బిజాపూరునివాసియగు నొక బీదబ్రాహ్మణుడు వినయ పూర్వకముగా సమర్పించు మనవి యేమనగా! అయ్యా! నేను జ్యోతిషము జెప్పుకొని జీవించువాడను. కొన్ని కారణములచే నేను నగరమువదలి కుటుంబసహితముగా నరణ్యావాసము సేయుచున్నాను. ఇప్పుడు నాకు అవసానకాలము సమీపించినది. మరణశయ్య నలంకరింపబోవుచున్నాను. ప్రపంచసుఖముల నారితేరిన నాకు మరణము సంతోష

దాయకమే గాని యవివాహితయగు నాకుమారి విషయమై యనా
యగు నాభార్య విషయమై చింతిల్లుచున్నాను. మీా కెప్పుడేని నా
కుటుంబమును వీక్షించుట గలిగెనేని వారిని యాదరించి, నాకుమా
విధ్యుక్త వివాహము నొనరించి నాయాత్మకు శాంతి గలుగజేయుడ
ప్రార్థించుచున్నాను. మీాయొక్క దర్శనమగు వరకు నాకుటుంబము
యరణ్యమందే నివసించును.

ఇట్లు,
బీదబ్రాహ్మణుడు,
"బి జా పూ రు ని వా సి"

ఉత్తరముచదివి పట్టమహిషి ఆ బీదవ్యక్తులవైపు దయాపూ
దృక్కులను బరపుచుండెను. అంతట సార్వభౌముడు "ప్యారీ! నేటినుం
ఈబాలిక మనకు దత్తపుత్రికయైనది. భగవంతుడు అప్రియత్నముగా
దయ జేసి యున్నాడు. బహుజాగరూకతతో పెంచుచుండుము. ఈ
బాలికయొక్క తల్లిని అతిగౌరవముతో పోషింపుము." అని వారిరువు
పట్టమహిషి చేతనుంచెను. పట్టమహిషి "మహాప్రసాద"మని శిరమ
వంచెను. నాటినుండి వారిరువురిని జాగ్రత్తతో బెంచుచుండెను.

౪

ఆదినము ఢిల్లీ పట్టణమంతయు మిక్కిలి శృంగారముగా నలం
రింపబడి యుండెను. ఏవైపుజూచినను సంతోషము తాండవమాడు
చుండెను. జనులు తండోపతండములుగా నూత్నాంబరధారులై అత్యు
త్సాహముతో రాజమందిరమువైపు బోవుచుండిరి. నిముసకాలములో
భవనమంతయు జనసమ్మర్దముచే గిజగిజలాడుచుండెను. సామంతరాజులు
ఉన్నతోద్యోగులు, సైన్యాధికారులు, మొదలగువారందరు కల్యాణ వే
కకు నొకవైపున యర్హాసనముల నలంకరించియుండిరి. మరియొకవైపు
భూసురబృందము క్రిక్కిరిసియుండెను తక్కుంగల గౌరవనీయులగు పౌరు
లందరు యథోచితస్థానములందుండి కల్యాణోత్సవమును జూచుచుండిరి.
"సుముహూర్తము సమీాపించుచున్న"దని భూసురులువార్తనంపుటయే
తడవుజహాంగీరు చక్రవర్తిగారు తనదత్తపుత్రికను కాబోవు జామాతను

ోడ్కొని కల్యాణవేదిక ప్రవేశించిరి. అందరు నిశ్శబ్దముగా లేచినిలి
రి. చక్రవర్తిగారుచేసన్నచే వారిని గూర్చుండనియోగించి తానును
క యాసనముపై గూర్చుండెను.

కల్యాణమారంభమయ్యెను. మంగళవాద్యధ్వనులు, భూసురుల
యొక్క మంత్రఘోషలు భూనభోంతరాళముల భేదించుచుండెను.
న్నముల నొసంగు సమయమున వధూవరులు సుఖముగా జీవించుటకై
అనేక గ్రామము లగ్రహారములుగా నొసంగిరి. మణిమయ భూషణం
లు, చీనిచీనాంబరములు చక్రవర్తిగారు కూతునకు జామాతకు నమి
ముగా నొసంగిరి. పరిచర్యలు సలుపుటకై లెక్కకు మించిన దాస
ాసీజనంబుల నొసంగిరి. కల్యాణము శుభకరముగా ముగిసెను.

౫

వివాహానంతరము పుత్రికను జామాతను చక్రవర్తిగారు పెక్కు
నములు తనయింటనే యుంచుకొనెను. ఒకనాడు ప్రియపుత్రికను చేర
లచి "అమ్మాయీ! నిన్ను పెంచి పెద్దజేసి నీకుల గౌరవమునకును
యసౌందర్యమునకును తగిన వరుని విచారించి వేదోక్త ప్రకారము
వాహమొనరించితిని. ఎంతటి రాజాధిరాజుల పుత్రికలైనను అత్త
ారింటికి వెడలి భర్తయొక్క సుఖ దుఃఖములందు పాల్గొని
ాపురముసేయక తప్పదు. పెంచిన ప్రేమచే నేనొక్కవిషయమును
ోధించుచున్నాను. అది నీకు క్రొత్తవిషయముకాదు. ప్రతిహైందవ
దుహీమణికి పతిభక్తియు, ప్రతిహైందవునకు దేవగురుస్వామిభక్తి
మును గలిగి యుగ్గుపాలతో బోసిన సహజగుణములు. వానినే నీకు నేను
మరల జ్ఞాపకము సేయుచున్నాను.

నీవును నీభర్త నతిభక్తితో సేవించుచు, సూర్యుని వెనువెంట
ండు ఛాయవోలె,పుష్పమును వెన్నాడియుండు తావిమాడ్కి, చంద్రు
ననుసరించియుండు చంద్రికకైవడి, మేఘమాల నంటియుండు మెఱపు
గొని వర్తింపుము. చక్రవర్తి దత్తపుత్రికనని యేమాత్రము గర్వింప
ము. సంసారవిషయములందు మగ్నవై పెంచిన తల్లితండ్రులగు

మమ్ము మరచిపోక అప్పుడప్పుడు స్మరింపుము. నీకు భగవంతుడు మే
జేకూర్చుగాక" అని యాశీర్వదించి జామాతను రప్పించి తగు సు
ము లిచ్చి వధూవరుల నిరువుర సగౌరవముగా వీడ్కొల్పె
ఆ బాలికయొక్క తల్లి తన యిష్టప్రకారము కూతురు యింట
చక్రవర్తిగారి యింటను నివసించుచుండెడిది. తర్వాత నాబాలిక య
డప్పుడు హైందవమతాచార ప్రకారము పండుగల సమయములం
మాతృగృహంబునకు నాహ్వానింపబడుచుండెను. మరియు సబహ
మానముగా వీడ్కొల్పబడుచుండెను.

పాఠకులారా! ఇది పూర్వపు హిందూ మహమ్మదీయు
సఖ్యత కుదాహరణము. *

* ఉర్దూ పత్యగ్రంథములోని పద్యవ్యాసమున కనువాదము.

---

# శ్రీ కుంకులగుంట బసవకవి కృతులు *

## శ్రీ కోటీశ్వర నవరత్నములు

౧. శ్రీమచ్ఛైలవరాత్మజాహృదయసత్త్వం కేజపుష్పంధయం
శంభుం రుద్రమఘౌఘదావజలదం మృత్యుంజయం శంకరం
బ్రహ్మోపేంద్రసురేంద్రముఖ్యత్రిదివౌకఃపూజితాంఘ్రిద్వయం
వందేఽహం మునిమందశైలభవనం కోటీశ్వరస్వామినం॥

౨. భక్తవ్రజేష్టఫలసంచయదేవభూజం
కాలాంతకం శివమహం ప్రణతోస్మ్యజస్రం
సృష్టిస్థితిప్రళయకారణమద్రిచాపమ్
కోటీశమేవ మునిమంద మహేంద్రవాసం॥

---

* ఈ పండిత కవీశ్వరుడు డెబ్బది సంవత్సరములకు పూర్వము గుంటూరు
జిల్లా తెనాలి తాలూకా ఈమని గ్రామమున నివసించిన సుప్రసిద్ధ వీరశైవుడు.
లబ్ధమైన పద్యములు ప్రకటింపబడినవి, ముందు వీరి విపులమైన చరిత్రను సంపా
దించు తలంపు కలదు. సంపాదకులు.

౩. శ్రీయల్లమందవసుధాభృతదివ్యకాయం
గాంగేయసత్కలశసంపృతదివ్యగేహం
సింహాసనస్థమఖిలేష్టఫలప్రదైక్షం
కోటీశమీశమభవం ప్రణమామి నిత్యం॥

౪. వేదా యస్య హయాః పయోనిధిచయస్తూణో విధిస్సారథి
ర్బాణశ్చక్రిధరో రథో వసుమతికార్మోర్వీ భుజంగాధిప
శ్చక్రే సూర్యసుధాకరౌ ధనురభూదాదిత్యగోత్రాధర
స్తం వందే మునిమందగోత్రనిలయం కోటీశ్వరస్వామినం॥

౫. ప్రత్యబ్దమాఘకలితాహ్వయమాసకృష్ణ
పక్షే చతుర్దశదినే పరివర్తమానే
హైయంగవీనకృతదీపకభృత్సమీపం
కోటీశమీశ్వరమహం సతతం భజామి॥

౬. యో గంధమాదనహిమాలయరాజతాద్రి
మందారమాఖ్యకుభృతః పరివర్జ్య సత్యః
శ్రీయల్లమందధరణీభృత ఊర్ధ్వభూమౌ
తిష్ఠంతమంతకహితం మనసా స్మరామి॥

౭. తటాకైర్వాపీభిః కమలకుముదామోద మధురైః
ప్రవాహైశ్చాశ్రాంతైః సరసితసుధాకల్పసలిలైః
వసంతం చోద్యానైః స్సుమితఫలితానేకతరుభి
ర్భజేఽహం కోటీశం కలితమునిమందక్షితిధరే॥

౮. నానావిచిత్రితతరవస్త్రవినిర్మితాభి
రాత్మప్రభావిజితతిగ్మకరప్రభాభిః
భాస్వత్ప్రభాభిరభితః పరిపూరితాంతం
కోటీశ్వరం భజ మన! శ్శివవాసరే త్వం. వ/

౯. వృషభపతి తురంగం వ్యోమగంగోత్తమాంగం
ద్యుమణిశశిరథాంగం భూతధాత్రీశతాంగం
కమలభవముకుంద ప్రార్థితం యల్లమంద
క్షితిధరవరగేహం కోటిలింగం భజేఽహం॥

౧౦. శ్రీయల్లమందగిరిమందిరకోటిలింగ
నామ్నః శివస్యరచితాం నవరత్నమాలాం
యో మానవః పఠతినిత్యముషఃప్రదోషే
భక్త్యాహ్యా సౌఖ్యపదశమ్భుపదం సయాతి॥

## దశముఖి చన్న బసవేశ్వరస్వామి స్తోత్రము

౧. శ్రితజనపరిపోషం శ్రీమదుగ్రాక్షభూషం
విజితమదనదోషం వీరభద్రైకవేషం
యతిసముదయతోషం వీతరాగాదిదోషం॥
చనబసవగరిష్ఠం హృద్భజైకాంతనిష్ఠం॥

౨. షడురురుచివిదూరం సంతతానందపూరం
విమలగుణవిహారం వేదితామ్నాయసారం
త్రిమలతిమిరసూరం సూనృతోక్తప్రచారం
చనబసవగరిష్ఠం హృద్భజైకాంతనిష్ఠం॥

౩. ఫలితసుజనహేలం భాసురానంతశీలం
ధరితకుముదజాలం ధార్మికౌఘైకపాలం
శమితదురితమాలం సర్వసౌఖ్యైకమూలం
చనబసవగరిష్ఠం హృద్భజైకాంతనిష్ఠం॥

౪. దశముఖకులజాతం దైన్యజీమూతవాతం
భవజలనిధిపోతం భక్తసంఘైరుపేతం
రజతమయశిఖీతం రమ్యకీర్తిప్రభూతం
చనబసగరిష్ఠం హృద్భజైకాంతనిష్ఠం॥

౫. బసవకవివరేణ్యాస్యాస్తకారుణ్యదృష్టిం
సమధికగురుశాస్త్రప్రాణినా స్ఫీతవృష్టిం
నుతమనుజమహోద్యత్త్వా కాసారపుష్టిం
చనబసవగరిష్ఠం హృద్భజైకాంతనిష్ఠం॥

## చేబ్రోలు శ్రీ ముమ్మడిసిద్ధ శంభుస్వామి స్తోత్రము

శ్రీమద్ద్వీపాసురాజనము విసర్జించి
కాషాయ వసనసంఘము ధరించి
ద్విరసనాభరణముల్ నిరసించి దిగ్వస్త్ర
చక్షురుద్భవహారసమితి దాల్చి
చతురానన కరోటిశయమును వర్జించి
భక్తావనాభయ పాణి దాల్చి
ఫాలస్థితానలజ్వాలనేత్రము డాచి
కరుణాకటాక్ష వీక్షణత బూని
గీ. సంచరించెడి ప్రచ్ఛన్న శంభుమూర్తి
తావక పదాబ్జముల్ శిరసా వహింతు
కఠినరిపునాశ చేబ్రోలు మఠనివేశ
జన్మకర్మాటవీదావ శంభుదేవ.

సీ. నీ సత్కృపాదృష్టి నిఖిల భక్తానీక
కల్మష ఘోరాగ్ని కమలవృష్టి
నీదర్శనము సర్వనీలకంధరభక్త
హృదయపుష్కర భాస్కరోదయంబు
నీ ప్రబోధము శిష్య నిచయాత్మసంచయ
గాఢతమస్సుధాకరమరీచి
నీ యనుగ్రహమె శిష్యాయ తేష్టార్థౌఘ
ఫలసంచయ సుపర్వపాదపంబు
గీ. గాన భవదంఘ్రికోమలకమలయుగ్మ
సేవజేయుచునుందు నా భావమునను
కఠినరిపునాశ చేబ్రోలు మఠనివేశ
జన్మకర్మాటవీదావ శంభుదేవ.

సీ. కాషాయవసన ప్రకాశ సమూహాసం
ధిజిత బాలారుణ విభ్రమంబు
వృషభధ్వజాంశుక పృషదశ్వసంఘసం
చలితధరాధర సంచయంబు.

తురగరింఖాహతోద్ధూత రజఃకర్ద
    మీకృత గగనధునీకులంబు
కమనీయదుందుభీ కాహళనిర్ఘోష
    బధిరీకృతాష్టదిగ్భాసురంబు
  గీ. నంజలీకృతహస్త భక్తాగ్రగణ్య
  మైన భవదీయ కరుణాకటాక్షపాత్రి
  కఠినరిపునాశ చేబ్రోలు మఠనివేశ
  జన్మకర్మాటపీదావ శంభుదేవ.
సీ. అభ్రిపాదప హిమదభ్రిమరాళ వ్రి
    జాభ్రిముసీర శుభ్రాంబుజముల
సిందురాహిత దుగ్ధసింధు చందనచంద్రి
    కుందసంక్రందన ఘోటకములు
నారద పారదహీరధరానీక
    శారదాశారద నీరజముల
శరపుష్పడిండీర చక్రి రాజవృషేశ
    తారకాతార కర్పూరములను
  గీ. గేరి మీరిన ఘనభవత్కీర్తిశోభ
  గగనభూమితలాష్టదిగ్వలయములను
  కఠినరిపునాశ చేబ్రోలు మఠనివాస
  జన్మకర్మాటపీదావ శంభుదేవ.

హస్తిని మతస్వామిస్తోత్రము

సీ. శ్రీమత్స్వకీయవిస్తృతతనూదీధితి
    లలిత సౌదామినీలత యనంగ
నతులితచతురంతయానవిలాసంబు
    పరికటితశక్రచాపం బనంగ
పృథుతరంబుగ మ్రోయు భేరికా కాహళ
    ధ్వానముల్ గర్జిత ధ్వను లనంగ
పరశిష్య సంవిదంకుర బోధ జాతంబు
    సంతతాసారవర్షం బనంగ

గీ. రమ్యఘన చిహ్నములు యథార్థముగ నీకు
తాత్త్వికములయ్యె సమృత ప్రదాయివగుట
హత్తిని మఠాధిరాజ బాలార్క తేజ
సిద్ధలింగేశ దేవదాక్షిణ్యభావ.

ఏమహామహు దివ్యనామ మజ్ఞానాంధ
తమసరాకాసుధాధామకాంతి
యేవరదుని కటాక్షావలోకనము పా
క్తన కర్మజలధర గంధవాహ
మేశరణ్యు మహోపదేశంబు సంశయా
రణ్య సందోహ పరశ్వథంబు
ఏదయాకరు సుప్రసాదంబు సకల శి
ష్యవ్రజ జన్మామరౌషధంబు
గీ. నట్టిగురుదేవసత్కోమలాంఘ్రియుగ్మ
వారిజముగొల్తు మన్మనస్సరసినిల్పి
హత్తిని మఠాధిరాజ బాలార్క తేజ
సిద్ధలింగేశ దేవ దాక్షిణ్యభావ.

## గోకర్ణస్వామి స్తోత్రము

శ్రీమన్నిజోత్తుంగ శిఖరసందర్శనా
సక్తజంత్వపవర్గసౌఖ్యదంబు
కేతనస్తంభ సంకీలిత ఘంటారవా
ఘశబ్దగుణీకృతాంబరంబు
శతగోపురాగ్ర నిర్మిత మృగాధిప భయా
కుల నిర్జరాధిప కుంజరంబు
సాల సౌవర్ణ పాంచాలి కేందుముఖీభ్ర
మానిమిషీకృత మానసంబు
గీ. ధారిణీ రథపూజన ధ్యానతర్ష
సకల దేశాగతాశ్రిత జనసమూహ

పాదఘట్టన భుగ్నాహిపతి ఫణంబు
లీల గోకర్ణలింగేశ్వరాలయంబు.

సీ. సర్వాగమోపనిషత్ప్రబోధితభస్మ
ధారణుం డంహోవిదారణుండు
ఉత్తమాంగాదికాంగోన్నత రుద్రాక్ష
భూషణుం డాశ్రిత పోషణుండు
మహిత షడక్షరీ మానస జపనిధి
ధ్యానను డతులపద్మాసనుండు
కరపద్మసంగత ఘనలింగ చిత్తసం
ధ్యాయకుం డమృతప్రదాయకుండు
గీ. వరచిదానంద పరవశభావనుండు
దివ్యగోకర్ణమఠమణిదీప్తికోటి
మధ్యవెలసెను దేదీప్యమానమూర్తి
సిద్ధవీరేశ దేవ దేశికవిభుండు.

సీ. తన తనూదీధితి తపనీయతటిదంకు
రప్రభావళుల దిరస్కరింప
తన కిరీటస్థ రత్నద్యుతుల్ తరుణాబ్జ
సఖమరీచులను హాస్యంబు సేయ
తన శైవపేటిసూత్రచ్ఛవి పూర్ణార
విందవైరిని వ్రీడ నొందజేయ
తన హస్తవలయరుక్తతి ఫణామణివిభా
స్వరహారీశ్వరులను తలంపజేయ
గీ. మహిత సద్భక్త సంస్తూయమానుడగుచు
నతులగోకర్ణ మఠమంటపాంతరంబు
నను విరాజిల్లు ధర్మమున్నతముగాగ
సిద్ధవీరేశ దేవదేశిక విభుండు. *

---

*వ్రాతప్రతులలో ననేక తప్పులుగలవు. కావున యథాసాధ్యముగ సంస్కరింపబడినవి. —సంపాదకుడు.

# శారదాదేవి

(వెనుకటిసంచిక తరువాయి)

**బాలకవి అల్లపురాజు నారాయణరావుగారు.**



గీ. నన్ను వంచించి చుట్టలుర్ నాదుచెలులు
కనకసౌధంబులేమైనఁ గట్టినారె?
అంతియేకాని నేఁ జెడునదియులేదు?
*శారదాదేవి! నీకుఁ జోహారులమ్మ!

గీ. నాకు ఖడ్గంబులేదు; బాణంబుసున్న
త్రాడిడు నొడిసెయు నేతోడునీడలేదు
ధనము పూజ్యంబు; నీయాయుధములె దిక్కు

గీ. దేవతలు దిక్కు పత్రికాధిపులుదిక్కు
ప్రత్తిపాటి శ్రీరాములాపైనిదిక్కు
అక్కకొడుకొక్క దిక్కు నీ వసలుదిక్కు

గీ. పద్మదళచారునయన! నాపైనినింత
ప్రకటంబగు నీదయలేకయున్న
నాఁడె యుసురుల నెడబాయువాఁడఁగాదె?

గీ. ఏటికీ దరిద్రుని నింక నిన్నినాళ్లు
లోకమందుండఁజేసె దోలోకజనని
చీడపుర్వెన్నినాళ్ళున్నఁ జేయునదేది!

గీ. గగనసీమ నెగురు విహంగమునకైన
నిజము తలచాచుకొనఁ జెట్టునీడకలదు
మొండనుండ నీడకుఁ బిల్చె దెవరునన్ను?

గీ. ఇంతకాలంబు నినుఁగొల్చి తేదొ పెద్ద
రతనముల కొండ నాదు శిరంబునందు
నంతు వను నాశ తుదకదియుర్ వాలెక్క

*ఇకముందీ గీతముల యుత్త్యమున నీచరణమ్ము ననుకొనవలెను.

గీ. మానవుని కెంత మాత్రింబు మామకీన
రచిత గ్రంథంబుఁ గృతి నీయరాదటన్న
పట్టుదలనుంటి నింక నావశముగాదు

గీ. ఇంతదనుక నినుం గొల్చు టిహసుఖంబు
లనుభవించుటకే కదా? యదియు లేక
తీవ్ర బాధ లెచ్చిన నాదు దీక్ష లేల?

గీ. బిచ్చమెత్తి జీవించంగ బిడియమెచ్చు
ఒరులకుఁ దాసుఁ డగుటాత్మ యొప్పుకొనదు
శిష్టమార్గంబుఁ జూపి రక్షింపరాదె?

గీ. దారులంగొట్టు దోపిడితనము రాదు
చేరి చాడీలు సెప్పుటల్ చేతకాదు
యెవరినైనను వంచించు టెఱుఁగనింత
నీవు గనకున్న నాపొట్ట నిండుటెట్లు?

గీ. పూర్వ మా పోతనామాత్యుఁ బ్రోచినట్లు
దయను పినవీరభద్రునిం దనిపినట్లు
మించి యగణిత కవుల రక్షించినట్లు
క్షిప్రగతివచ్చి నన్నుఁ బోషింపలేవె?

గీ. వైదికపు వృత్తికిం దగువాఁడఁగాను
దేశ సేవఁజేయంగ శక్తియునులేదు
భక్తిమార్గంబు దక్క యే పథ మెరుంగ

గీ. ఆదరంబున నీ మరియాద నెంచి
నయముగాఁబిల్చి భద్రాసనంబొసంగి
కవులఁబోషించు రాజు లొక్కరును లేరు

గీ. ఉర్విపతి యెవ్వఁడేనియు నుండవచ్చు
నుండినన్ లాభమేమి? తా నుంచుకొన్న
ముండలకు మంత్రులకు లొంగిపొమ్మనుగద

గీ. అవని శ్రీకృష్ణదేవరాయలనఘాగ్రి
మునకునైనను సాటిరాఁబోవు మేటి

క్ష్మాతలాధిపుఁ డొకఁడైనఁగానరాఁడు
ఆంధ్రకవితా వధూ తేజ మడఁగెఁదల్లి !

గీ. సాధ్వియగు వనితామణిన్ సంతరించి
నాకుఁ దగులాటముం జేయలేక నీవు
భువనమందున నిర్భాగ్య యువతి కుమతి
కాంత కవితావధువు మెడఁ గట్టినావు

గీ. భ్రాంతిలోమున్గి యేమొ సంపదగడింప
నినుగ్రహించినవాఁడెవ్వఁడును సుఖంబు
లొందెనే ? దరిద్రనరక మొందెఁగాని
కీర్తి యేకాని, నీకు లక్ష్మికిఁ బగకద

గీ. మొదలు మాలోన నెట్టులో ముద్దుగాను
జొచ్చి వేరొండు సల్పంగఁ జొరఁగ నీవు
ధ్యానమన్యథా నీయందె తగులఁ జేసి
పొమ్మటంచును తఱిమినన్ బోవుపిదప.

గీ. జనకుఁడగు ధాతతోఁడ విజ్ఞప్తిఁ దెలిపి
కొద్దిగా వ్రాలుమార్పించుకొందమనిన
సంగనాచివి నీవుండునాళ్లుగాదు

గీ. అత్త రమయైన, మామ శ్రీహరియునైన
సృష్టికిన్ గర్త నీహృదయేశుఁడైన
ఆ సురల్ నీకు దాసానుదాసులైన
అబలవీవౌట చూఁడ నత్యద్భుతంబు

గీ. హాలికుఁడ నాటకుం బూర్వికార్జితంబు
లైన క్షేత్రంబు లెవ్వియుం గానరావు
సంన్యసించుటకున్ సాహసంబు నాస్తి

గీ. ధాత్రిలో నెందరో దేవతల్ గలారు
సర్వ విద్యాధనముల నొసంగుదువని
వారి నెల్లఁ విడి సరస్వతి వటంచు
నిన్నుఁ బూజింపఁగాఁ గల్గె నిందు సున్న
శారదాదేవి నీకున్ జోహారులమ్మ.

(సశేషము)

# మూఢభక్తి, ప్రౌఢభక్తి.

డా. కాజ కోటినాగేశ్వరప్రసాద్‌గారు



భగవద్భక్తియే ముక్తికి గారణమని చిరకాలమునుండియు ప్ర
వించిన యనేక సంఘటనలవలన దేలుచున్నది. శుష్కములైన ద్వైత
ద్వైత వేదాంతచర్చలు ఎటులున్నను, సరసమైనది భక్తి యొకటి
కావున భక్తినిగూర్చి యథామతి యిట గొంత వివరింపబడుచున్న

గురువు దేవుడు తల్లి తండ్రి మున్నగు పూజ్యుల విషయమ
నుండు ప్రీతియే భక్తి యనబడును. అది మూఢభక్తి యనియు
ప్రౌఢభక్తి యనియును ఇరుతెరంగుల నున్నది. చెప్పినదానిని అంతి
యని గట్టిగ నమ్మి అమాయికముగ నాచరించుటయే మూఢభ
విచారపూర్వకమైన యాచరణమే ప్రౌఢభక్తి. శివపురాణాది ప్రా
గ్రంథములందును బసవపురాణాది నవీన పుస్తకములలోను,
యుభయ విధములగు భక్తచరిత్రలును కలవు. వారిలో జాలవర
లింగధారణ విరహితులైన భక్తులే ముగ్ధ (మూఢ) భక్తులు
నున్నారు. ఒక ముగ్ధ సంగయ్యగారు తప్ప వీరశైవు (లింగధా
లైన భక్తు లందరును ప్రౌఢభక్తులే. వీరశైవుల కిదియే యాదరణీ
మనుటలో సందియములేదు. పురాతనులను పేరుతో, నిటీవలి వీరశై
గ్రంథములలో తిరునీలకంఠ బేడకన్నప్ప దీపదకళియాన్ నాట్య
మిత్తండి రుద్రపశుపతి కొడకూసు మొదలైనవా రందరును మూ
భక్తులై యున్నారు. వీ రెవ్వరును లింగధారులు కారు. వీ
వీరశైవులనుగా కొందఱు తలచుచున్నారు. కాని యది పొరపాట
మరియు మానకంజార సంగాయక్క రసి యేణాదినాథ మొదలై
సామాన్య భక్తులును కలరు. వీరందరును ప్రాచీన కాలమున నుండు
జేసి పురాతన శివభక్తులనియును శరణులనియును పేర్కొనబడిరి. శర
లనగా భక్తులని యర్థము. వీరందరిని శివభక్తియను తత్త్వము నన
రించి వీరశైవు లాదరించిరిగాని స్వమతీకు లను నభిమానముచేత కాద

వీరశైవునకు అష్టావరణ పంచాచార షట్స్థలము లనునవి
ముఖ్య ధర్మములు. మరియు ముప్పదియారు తత్త్వములును ముఖ్య

నియందు పృథివ్యాది పంచవింశతి తత్త్వములు అశుద్ధ తత్త్వములని
యును, కాల కళ నియతి రాగ మొదలైన యారు తత్త్వములు మిశ్రి
తత్త్వములనియును, విద్య మొదలైనవి శుద్ధ తత్త్వములనియును, పేర్కొన
కినవి. ఇదియునుగాక అంగతత్త్వ లింగతత్త్వ మనియును ద్వివిధము.
నివృత్తి ప్రతిష్ఠ విద్య శాంతి శాంత్యతీత అనునవియే అంగతత్త్వములు.
కర్తృసాదాఖ్య కర్మసాదాఖ్య మూర్తసాదాఖ్య అమూర్త సాదాఖ్య
శివసాదాఖ్య మహాసాదాఖ్య అనునవియే లింగతత్త్వములు. సాధారణ
ముగా పంచవింశతి తత్త్వములు లోకవాడుకలోను గలవు. వానికంటె
అశుద్ధతత్త్వములును వీనికం శుద్ధతత్త్వములును మిక్కిలి సూక్ష్మము
లై యున్నవి. వీనియందు సామాన్యమైన పంచవింశతి తత్త్వముల
జ్ఞానము సహితము ముగ్ధభక్తులకులేదు. అట్టివారికి సూక్ష్మములైన
తత్త్వములయొక్క విచార మెక్కడిది? వీరశైవుడు మొదటనుండి
క్రమముగా యీతత్త్వములను విచారించి శివతత్త్వస్వరూపమును తెలిసి
కొనవలసి యుండును. ఉపాసనా పరిభావముతో సామరస్య జ్ఞానమును
పొందనిచో శివసాయుజ్యముక్తి లభించ నేరదు. అలింగులైన శివభక్త
ులను సామాన్యులైన విష్ణుభక్తులును ముగ్ధులైతత్త్వ విచారము
లేనివారు కావున సాలోక్య సామీప్య ముక్తులను మాత్రమే పొంద
గలిగియున్నారు. వారు కోరినను సాయుజ్యముక్తి లభించనేరదు. వీర
శైవుడన్ననో ప్రౌఢుడు కావున సాయుజ్య ముక్తినే పొందుచున్నాడు.

భక్తి పారమార్థికమైనది కావున భక్తిగలవాడు దుఃఖనివృత్తి
పూర్వకమైన యానందమును పొందుచున్నాడు. ఆ యానందము నిత్య
మైనచో నదియే ముక్తి. ఆనందమునందును తారతమ్యముగలదు. ఎటు
లనగామనుష్యునకునాలుక యొక్కటి యైనను వివిధములైన రసములనుభ
వించునపుడు అనగా:— బెల్లమును అల్లమును వేరువేరుగా తినునపుడు
పరస్పర విరుద్ధములైన రుచులను చూచుచున్నది. మరియు నొక్కొక్క
రసములోనే అనగా - మామిడి పనస అరటిపండ్లు ఒకేతియ్యనిజాతికి
జెందియున్నను అనుభవము వేరే యగుచుండును. అటులే ఒక్కొక
విధమైన భక్తిచేతను ఆనందతారతమ్యమునుబట్టి వివిధములైన ముక్త
ులును గలుగుచున్నవి. అటులే కేవలము లింగము ధరించిన మాత్రము

ననే శివసాయుజ్యముక్తి యగుననుట సమ్మదగినది కాదు. వా
ఆయా తత్త్వముల కనుగుణముగా సాలోక్య సామీప్య సా
సాయుజ్య అను చతుర్విధములగు ముక్తులను క్రమముగా బొం
యుండును. పందెములో నెక్కువ సాహసము చూపించినవాడే
నట్లు కాల కామ మాయాదులను జయించినవాడే శివయోగి య
బిరుదము నందుచున్నాడు. యోగులలో మంత్రయోగి లయయో
హఠయోగి రాజయోగి శివయోగి అని పంచ విధములు గల
అష్టావరణాది సిద్ధాంతముల నరసి తత్త్వమును సాధించినవాడే
యోగి. స్వరూపలక్షణాదులను దెలిసికొని చిత్తము దుర్విషయముల
ప్రవేశించనీక నిరోధించుటయే యోగము.

ఇది యటుండగా అత్యంత పవిత్రమును మహాఫలదాయకము
అగు వీరశైవ తత్త్వములు ఆచరణకు కఠినములై యుండుట స
జమే. లింగధారులందరును శివప్రోక్తములగు వర్ణాశ్రమ ధర్మ సం
దాయములను మతాచారములను చక్కగ దెలిసికొనక విచ్చలవి
వాకొనుటయు తత్త్వముల నాక్షేపించుటయుజరుగుచున్నపుడు, పూ
వస్తువులను సైతము తిరస్కరించుచున్నపుడు, సామాన్యములైన ధ
ధాన్య సంతానారోగ్య విద్యలలో వీరశైవులు నానాటికి వెనుకబ
చుండుట యాశ్చర్యకరముగాదు. సామాన్యముగా శివస్వరూపము
గురులింగ జంగములను పూజించువారెల్లరును శివభక్తులనియు
భక్తులనియు వ్యవహారము గలదు. వారేజాతియందైనను
యుండవచ్చును. వానికి కావలసిది ముక్తి కావున పరంపరా ప్రసి
డగు మఠస్థలాది లక్షణములుగల సద్గురువు నాశ్రయించి శివదీక్షా పు
స్సరముగ సాధనములనరసి తత్త్వములను వివేచించుచు ప్రాభమై
భక్తితోడను అనుపమమైన యనురక్తితోడను సేవించి గురు లిం
జంగమములలోని శివకళా స్వరూపమెట్టిది? వాని లక్షణ స్వరూపమ
లెవ్వి? ఆరాధించు క్రమమెద్ది? అని ప్రశ్నలను పురస్కరించుకొ
శుద్ధ విజ్ఞానమును సంపాదించవలయునేకాని గురుడా! నీయొద్ద న
దేశము దీసికొందును. నేను భుజించిన విస్తరిని తీయగలవా? నీకన్నా
మా కియ్యగలవా? నీ యెక్కువతనమెట్టిది? మున్నగు విపరీత లౌకి

...సముగ వినదించుకొనుచు భక్తితత్త్వమునకే తిలాంజలినీయుట శక్తి ...యకము యుక్తిసహమును కానేరదు. పరంపరాచారములలో భక్తి ...త్త్వములకు విరుద్ధములైన విషయములు ప్రచారము నందినపుడు ...పూర్వకముగ వానిని నివారించుటయు తత్ప్రయత్నములను విజ్ఞుల ...వాసమువలన తెలిసికొని శాంతముగ ప్రయోగించుటయు నెంతయు ...ఖ్యములు. అధికుడని ప్రచారమందిన గురుజంగమాదులకును గురువులు ...రు కావున వారును తమ తమ గురువులయందు పూజ్యులయందు ...పమానమెన ప్రౌఢభక్తిగలిగి తన యాశ్రమమునకు దగిన శక్తిని ...పాదించిననేతప్ప శిష్య హృత్తాపము నపహరింపజాలడు.

జీవునకును శివునకును గల తారతమ్యమె గురు శిష్యులలోను ...ను. తన గురువును తాను సామాన్యమానవునిగా దలచునపుడు ...ను గూడ తన శిష్యుడు సామాన్యమానవునిగానే తలచుచున్నాడను ...నము తనకుండవలదా? తానొనరించుచున్న శివపూజాద్యనుష్ఠా...ము తన శివసాయుజ్యసిద్ధికి మర్థమై భక్తోద్ధరణకు పాత్రమై యుండ ...నినుట నిర్వివాదము. ఈతత్త్వము నెరయక మదపుటేనుంగులవలె ...చ్ఛలవిడిగ సంచరించు గురు సంప్రదాయకులకు దిరస్కారములే పుర...స్కారములగుచుండుటలో ననుపపత్తియేమి గలదు? గురుడగువాడు ...సమర్థుడై దురాచారములను ఖండించి సదాచారములను స్థాపించు...న్నపుడే ప్రౌఢభక్తిలతామంజరికి అమృతాభిషేచనము కాగలదు. ...ంతముగ మూఢుడగువాడు శిష్యుని ప్రౌఢతకెట్లు కారణము కాగ...డు? ప్రౌఢభక్తి లేకనే వీరశైవుల లింగాంగ సామరస్య మెట్లుకుదు...ను? సామరస్యము లభించకయే సాంబుని సాయుజ్యము సఫలమెట్లు ...గలదు? పరమేశ్వరానుగ్రహమున సమర్థుల హస్తమునుండి వీరశైవ ...ప్రపంచమునకు నేటికి "విభూతి" లభించుచుండుట మహానందదాయ...ముగదా! ఇత్తరినైనను శివసంప్రదాయకులు మేల్కాంచి స్వశక్తి...ంచనలేక తను మనోధనములచే పరమైశ్వర్య స్వరూపమగు విభూతి...నారాధించి పరశివానుగ్రహమునకు పాత్రులై యభ్యుదయ నిశ్శ్రే...యసముల చేపట్టెదరు గాక యని సూచించి విరమించుచున్నాను.

---




లలిత—కర్త; శ్రీరాముల. సచ్చిదానందశాస్త్రిగారు, ప్ర కులు. సావిత్రీ గ్రంథమండలి, పూర్ణానందంపేట, బెజవాడ. తొమ్మి యంకముల నాటకము, పుటలు ౨౦౦. వెల 1-0-0. కాగితము అచ్చు బాగుగనున్నవి.

సులలితమైన ఈ చక్కని నాటకరత్నము నవలోకించ గలిగి దులకు పరమేశ్వరునకు వందనములును, గ్రంథకర్తగారికి ధన్యవా ములును సమర్పించుచున్నాము. అధార్మికములైన విపరీతాచా విచార రోగములు ప్రబలుచున్న నీకాలమున కీ నాటకరాజము దివ్యౌ షధము. సామాన్యముగ నైతిక పౌరాణిక నాటకములు విరివిగా ప్రచా రము నందియున్నవి కాని, ఆంధ్రభాషలోనేకాదు మాకు దెలిసిన వరకు హిందీ, గుజరాతీ, మరాఠీ, కర్నాటక భాషలలోను గే ధార్మికమై యింతటి సమర్థమైననాటకము వెలువడలేదని చెప్పవచ్చు

ప్రాచీన సంస్కృత వాఙ్మయమందలి మృచ్ఛకటిక ప్రకర మున చారుదత్తుని చరిత్రలో గొంత ధార్మికత గన్పట్టును గాని కే ధర్మాచార నిర్వహణ మగపడదు. కావున నీ నాటక మపూర్వ ధారాళముగ జెప్పవచ్చును. ఇందు ప్రధాన కథానాయకుడగు మాధ శర్మ జీవిత మత్యద్భుత ధర్మవీరత్వమును బ్రకటించుచు బ్రాహ్మణ మహాత్యాగ తత్త్వమును పవిత్రతను బోధించుచున్నది. కుమతులు ప్రభుత్వమువారి ధర్మాదాయ వ్యవస్థాపకులును సాగించు దుండగ లకును, కష్టపరంపరలకును గురియై సర్వస్వమును త్యజించిన మాధవశ చివరకు మహాయోగివలె జీవితమును గడపుచు లోకము నుద్ధరించ జా

ాను. సీమకు వెళ్ళివచ్చిన మురహరి విపరీత దుర్ఘటనలపాలై, భార్య
యగు లలితయొక్క మహాత్యాగ సౌశీల్యముల వలన పశ్చాత్తాపము
ంది ఘాధవు ననుసరించి కుదుటపడెను. విద్యావతియై పతివ్రతయై
తురయై లలిత నిర్వహించిన నిష్కలంక జీవనము లోకైక మోహ
ము. అత్తకోడండ్రగు రాధ, తులసి గారల అతిథిసేవ, భగవద్భక్తి
భావములు నిరుపమానములు; కృష్ణశర్మ గురుకుల వాసము, యోగా
భ్యాసములు మార్గదర్శకములు.

ఈవిధముగ నీ నాటకమున నార్యధర్మబోధ సయుక్తికముగ
ూపింప బడినది. ఆంధ్రులందరు శ్రద్ధతో బఠింపదగిన గ్రంథము.
సులవరపు కంపెనివారిచే నభినయించబడు సావిత్రి నాటకమును రచించి
ప్రసిద్ధి నందిన శ్రీ సచ్చిదానంద శాస్త్రిగారి కీర్తి యీగ్రంథముతో
ద్విగుణీకృత మగుచున్నది. విజ్ఞులిద్దానిని పఠింప నారంభించినచో మధ్య
ముని విడువనే విడువరు. శైలి నిర్దుష్టమై ధారాళముగ నుపన్యాస
ద్ధతితో సుబోధముగ నున్నది. మచ్చున కొక పద్యము:—

. ధవుని యుద్యోగంబు తలపు వచ్చెడువేళ
దులసిపూజలమాట దలప నగునె?
మోటారు వాకిట మొరయు చుండెడువేళ
దేవుడున్నాడన్న తెలివియున్నె?
జడ్జీలు మున్సిపుల్ సరసనుండెడు వేళ
జన్మకర్మంబులు జ్ఞప్తి యున్నె?
పూదండ లర్పింప బొంగిపోయెడువేళ
బరులు స్వీయులటన్న సరణి యున్నె?
గీ. వేషభాషలు గలవారు వింతవారు
ధనికు లుద్యోగులుం దక్క దక్కువారు
కనియు బెంచినవారేని కంటబడిన
బనులగతి దోపకుందురే భావమునకు?

సనాతనధర్మప్రచారకు లీ నాటకము నాంధ్రభూమిలో నెల్లెడల
ప్రవర్తింపజేయుట కర్తవ్యమని భావించుచున్నాము.

కిన్నెర—ప్రకాశకులు ఆంధ్రవాఙ్మయ సేవాసమితి బా
పాడు, వయా డోర్నకల్ నైజాం. పుటలు ౧౬౦. అచ్చుకాగితము
బాగుగనున్నవి. ఆకృతి డబుల్ క్రౌన్. వెల 1-0-0.

నిజాంరాష్ట్రపు ఆంధ్రులలో సారస్వతప్రచారము మృగ్యమ
నున్నది. ఎన్నియోపత్రికలు, గ్రంథమాలలు, బైలుదేరి అన్ని
లములలో నింటింట బ్రచారము గావలయునన్నచో మిక్కిలి
దలతో వ్యయప్రయాసల లెక్కించక ప్రయత్నించవలసియున్న
అపుడు మాత్రమే యుద్బోధ కలుగుననవచ్చును.

ఇట్టి సదుద్దేశ్యముతోడనే కిన్నెరయను సారస్వతసంపుటి చక్క
నలంకరించుకొని ఆంధ్రజానపదులకు దన మంజుళవ్యాస తంత్రీనినా
ముల వినుపించి తనిపింప నుద్యుక్తయైనది. ప్రయత్నము సుశ్లాఘ్యమ
ఇది పత్రిక కాదు. వారి కనుకూలము గలిగినపుడెల్ల నిట్టి సంపుటము
కొన్ని ప్రకటించదలంచి యున్నట్లున్నది. ప్రస్తుతపుస్తకమున నలు
వివిధవిషయములకు సంబంధించిన వ్యాసములుకలవు. దాదాపు వ్యా
కర్తలందరును పేరెన్నిక గన్నవారే! గద్యవ్యాసములలో "ఆంధ్ర
వాఙ్మయసేవ, శాసనములు, ఆంధ్రకవిత్వము, వేదవాఙ్మయము, తిక్క
త్యాగరాజాభిమతం మతం కిం? విమర్శవివేకము నాదోపాసన, పట్టు
దొంగ, అనుగమనము, రామరాజ భూషణుడు" మున్నగునవి ప్రతి
విశేషద్యోతకములై చక్కగనున్నవి. పద్యములలో "కిన్నెరా, కిన్నె
కన్నె, ఆంధ్రజ్యోతి, తెనుగుతల్లి, నిశి, ఆమె, వీడుకోలు, అశ్రుతర్పణమ
సుఖజీవి, తెలుగుదైన్యము." అనుమకుటములుగల వ్యాసములును ఇం
నింపుచున్నవి. - ప్రస్తావన - నివేదనము అనువ్యాసము చిట్ట చి
నో మొట్టమొదటనో ముద్రింపబడిన బాగుగనుండెడిది. అటులే మా
రాజపోషకులు, సమాలోచన సంఘము, గౌరసభ్యులు మున్న
వారి నామములును ఒకచోట ప్రత్యేకముగ నుండవలెను. మా॥ శ్రీ
విక్రమదేవవర్మగారి యాశీస్సు లోపలి ముఖపత్రమున బిక్కటిల్లు
అందము కొరతవడినది. మున్ముందు సంపుటములలో గమనించగో
చున్నాము.

బూర్గంపాడువంటి గ్రామటికనుండే కిన్నెరను మీటినవారును ...హోత్సాహకార్యనిర్వాహకులును నగు శ్రీ కొ. వెం. రా. ల. నా. ...గారి ప్రయత్నము అభినందనీయ మనుటకు సందియము లేదు.

**శ్రీమధ్వాచార్యచరిత్రము:**—కర్త:- మారేమండరామారావు ...ు ఎం. ఏ. బి. ఇడి. పుటలు 112 వెల 1-0-0.
...కాశకులు:- ద్వైతప్రచారిణీ గ్రంథమాల, ఇన్నీసుపేట, రాజమండ్రి

మధ్వ శంకర రామానుజు లను ఆచార్యత్రియము ద్వైతాద్వైత ...శిష్టాద్వైతములను ప్రస్థానత్రియభాష్యపురస్సరముగ స్థాపించిరనుట ...ప్రసిద్ధము. అందు శంకరుని కాలము వివాదాస్పదముగ నున్నది. ...రామానుజ మధ్వాచార్యుల కాలములు నిశ్చితములైయున్నను వీరి మత ...వాఙ్మయము సుపరిష్కృతమై యాంధ్రమున బ్రచారము నందలేదు. ...ప్రసిద్ధులైన గ్రంథకర్తలు మాధ్వమతస్థులు కావున ద్వైత ...ప్రచారిణీ గ్రంథమాల నీ యాచార్యచరిత్రతో బ్రారంభించినారు. ...ము ద్వైతమతస్థాపకులగు మధ్వాచార్యులచరిత్ర, 'బాల్యము, సంన్యా...ము, దిగ్విజయములు, కృష్ణప్రతిష్ఠ, బదరీయాత్ర, శిష్యులు, ...ద్ధాంతము అను శీర్షికలలో ధార్మిక పౌరాణికముగను 'కాలనిర్ణయ' ...ను శీర్షికలో చారిత్రకముగను నిరూపింపబడినది. ఈ గ్రంథరచనకు ...సంస్కృత మధ్వవిజయకావ్యము మాతృక. సరళముగ నున్నది. ...మాధ్వమతస్థులెల్ల శాదరింపదగిన గ్రంథరాజము. వెల తగ్గించవలెను.

**రాణీదుర్గ:**—కర్తలు, బుద్ధిరాజు హనుమంతరావు, దేవళ్రాజు ...సూర్యనారాయణరావుగార్లు, ప్రకాశకులు, ప్రేమలతా గ్రంథమాల, ...ప్పరమెట్ల, అకిరిపల్లిపోస్టు, కృష్ణాజిల్లా పుటలు 80, సచిత్రము.
వెల 0—8—0.

ఇది యొక కల్పితగాథ గల నవల. ఇందు రాజపుత్రులయు వీర ...నారీమణులయు ధైర్యసాహసములు వర్ణింపబడి ఘటన పెంచబడి సుఖాం...తముగ రచింపబడినది. గ్రంథమాల 'ప్రేమలత' పేరు కలదికావున ...ందునను ప్రేమానురాగబంధములే ముఖ్యాంశములు. ౧౨ ప్రకరణ

ములలోఁ గథ కంచికి వెళ్ళినది. భాష లలితముగ నున్నది. కథానా...
క్షులు ఆంధ్రులే కావలసి యుండెను.

**నందనార్:**—కర్త, బాలకవి అల్లమరాజు నారాయణరావుగా...
బొబ్బిలి, ప్రకాశకులు, ఆంధ్రవాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.
పుటలు, 70 వెల 0—8—0 రఫ్ కాగితము...

ద్రవిడ దేశపు నంత్యజులలో నందనారను శివభక్తశ్రేష్ఠుడొ...
ప్రాచీన కాలమున నుండెను. నేడస్పృశ్యుల యాందోళన ముండు...
ననుకూలమగు నీకథ హరికథాది రూపములతో విశేషముగ బ్...
రము నందుచున్నది. బాలకవిగారీ కథనే ప్రస్తుత పుస్తకమున ...
కావ్యముగా వ్రాసినారు. కవిత్వము ధారాళముగ దొరలినది. తెలుగు...
నిది యపూర్వము కావున బ్రశంసనీయము.

రచనమున వీరింకను శ్రద్ధబుచ్చుకొన గోరుచున్నాము, మొ...
మొదటయే "యశో కారణ"మను నశుద్ధి గ్రథించబడినది. ఇది య...
కారణమేనా? శబ్దదోషములు పలుచోట్ల గలవు. యతి ప్రాస...
విశేషముగ ననావశ్యక శబ్దములును అపశబ్దములను రాకుండ జూ...
లెను. ప్రథమ ప్రకరణమున వ్యర్థముగ అగ్రజనింద చేయబడినది. న...
నారుని సమకాలికు లట్టి యసదాచారులు కారని కవిగారే ము...
జెప్పినారు. ఆర్య ధర్మ రహస్యముల నెరుగనివారిచే బ్రసరింప బడుచు...
"బ్రాహ్మణ బ్రాహ్మణేతర కలహము" నిస్సారముగ నున్నది. గు...
వంతులకు నాడును నేడును గౌరవము కలదు. ఇది కవిగారికి తెలియ...
కాదు.

ఇష్ట దేవతా ప్రార్థన కృతిసమర్పణల తరువాత త్యాగశీలు...
పంచరత్నము లసందర్భముగా నున్నవి. బాలకవిగారి యుత్సా...
రచనా ప్రాచుర్యముల గాంచినచో వీరి లేఖినినుండి ప్రౌఢ కవిత...
లంకారములును ఆంధ్రవాణికి మున్ముందు లభింపగలవని యాశిం...
చున్నాము.

"రా జ హం స"

# ద్రవ్యదాతలు

ఈ క్రింద నుదాహరింపబడిన మహాశయులు తమతమ చంద్రా
ద్రవ్యము నొసంగి మా కృతజ్ఞతకు పాత్రులైరి. వాగ్దాన మొసఁగి
ంతవరకు ఆలసించినవారును త్వరగా తమ సాహాయ్యద్రవ్యము
పగలరని నిరీక్షించుచున్నాము.

## చిలువూరినుండి

రూ. | పేరు

౦ శ్రీ కంచెర్ల భ్రమరాంబ గురింకొండ బసవమ్మగార్లు
౫ ,, చిలువూరి అంబమ్మగారు (౨వ సారి)

## వల్లూరుపాలెమునుండి

౫ శ్రీ పులకంటి సంగన బసవయ్యగారు
౫ ,, లక్కన వీరభద్రయ్యగారు
౫ ,, లక్కన మల్లికార్జునుడుగారు
౦ ,, చలవాది శరభయ్యగారి కు॥ రాచయ్యగారు
౦ ,, లక్కన వీరయ్యగారి కు॥ బసవయ్యగారు
౦ ,, లక్కన రాజయ్యగారి కు॥ బసవయ్యగారు
౦ ,, చుక్కా రాచమ్మగారు
౫ ,, చలవాది అన్నమ్మగారు
౫ ,, చుక్కా కోటివీరభద్రమ్మగారు
౨ ,, చలవాది శ్రీశైలంగారి కు॥ రాచయ్యగారు
౨ ,, లక్కన సంగనబసవయ్యగారు
౨ ,, చుక్కా శివయ్యగారు
౨ ,, రాచం శెట్టి కోటయ్యగారు
౨ ,, లక్కన బచ్చయ్యగారు
౨ ,, చుక్కా లింగమ్మగారు
౪ ,, (౧) చలవాది కోటయ్యగారి కు॥ రాచయ్యగారు
(౨) గణవరపు మల్లయ్యగారు (౩) చలవాది పిచ్చమ్మ
గారు (౪) లక్కన సిద్దయ్యగారి కు॥ బసవయ్యగారు
౧౦ ,, బండి సత్యనారాయణగారు
౧౦ ,, పాశము నారయ్యగారు
౫ ,, మద్దాలి వేంకటేశ్వరరావుగారు

విభూతి ౧-౫

౫ శ్రీ పాశము కుటుంబయ్యగారు
౫ ,, గుళ్లపల్లి వేంకటరత్నముగారు
౫ ,, బండి పిచ్చయ్యగారు
౪ ,, అన్నె నాగభూషణముగారు
౪ ,, గుళ్లపల్లి సీతారామమ్మగారు
౪ ,, వల్లెపల్లి సుబ్బయ్యాయగారు
౩ ,, బండి చినకోటయ్యగారు
౨ ,, అన్నె శరాబందిరాజుగారు
౨ ,, ఆచంట పెదకోటయ్యగారు
౨ ,, అన్నె శివలింగంగారు
౨ ,, ఆచంట చినకోటయ్యగారు
౨ ,, యార్లగడ్డ వేంకటరామయ్యగారు
౨ ,, అన్నె బసవయ్యగారు
౨ ,, చిగురుపాటి శేషమ్మగారు
౪ ,, (౧) లొల్ల బాలకోటేశ్వరరావుగారు (౨) చెరుకూ
చంద్రిమౌళిగారు (3) కోడే రాఘవయ్యగారు (౪
పాశం మంగమ్మగారు

**చాగంటిపాడునుండి**

౨ ,, బత్తుల రాచయ్యగారు, బత్తుల వీరబసవయ్యగారు

**దేవరపల్లినుండి**

౧౦ శ్రీ కుంకులగుంట వీరయ్యగారు
౫ ,, కుంకులగుంట చినసంగయ్యగారు
౧ ,, చుక్కా కోటయ్యగారు
౪౫ ,, వీరశైవ సంఘమువారు (కుంకులగుంట పె॥ సం॥ కు॥
కోటయ్యగారు, కుంకులగుంట కో॥ కు॥ సంగయ్యగారు
ధూపం సంగయ్యగారు, కుంకులగుంట అ॥కు॥ కోటయ్య
గారు, కుంకులగుంట మల్లయ్యగారు, బూసా పరమయ్య
గారు, ధూపం పార్వతమ్మగారు కుంకులగుంట అ॥ మ॥
సంగయ్యగారు, కుంకులగుంట వీరమ్మగారు లక్కన
చెన్న బసవయ్యగారు, కుంకులగుంట చినసంగయ్యగారు)

౮ శ్రీ చిమిరాల చంద్రశేఖరయ్యగారు
౯ ,, చిమిరాల కోటివీరయ్యగారు
౩ ,, (చిమిరాల పెద బసవయ్యగారు (౨) చిమిరాల వీర బసవయ్యగారు (3) చిమిరాల బసవయ్యగారు

సూచన

(దేవరపల్లి కుంకుల గుంటబసవయ్యగారి ౫ రుల సహాయము ముదలే అందినది. కాని పొరపాటువలన మరల బాకిలిస్టులో పడినది.)

రావలసినచందాలు

౧౦ ,, చిలుపూరి బసవకోటయ్యగారు చేబ్రోలు
౧ ,,చలవాది కోటయ్యగారి కు॥ రాచయ్యగారు వల్లూరుపాలెం

మాసహాయకులు

ఈ క్రింది పేర్కొనబడిన మహానుభావులు మా ప్రచార కార్య క్రమమునకు ఘనముగా దోడ్పడుచు మిక్కిలి పరిశ్రమించుచున్నారు. చందాదారులను పోగుచేయుట, సంచారకార్యక్రమము సాగించుట, చందాదారుల జేర్చుట మున్నగు విధానములలో ననేక కష్ట నిష్ఠురములను సహించవలసి యుండును. కేవల పరోపకారబుద్ధితో వీరందరు చేయుచున్న పరిశ్రమకు మేము హృదయపూర్వకముగ కృతజ్ఞతను వెల్లడించుచు వారి సుప్రసిద్ధనామములను ప్రకటించుచున్నాము.

శ్రీమాన్ శ్రీమఠం నడిపూడి నాగభూషణ దేవరగారు చేబ్రోలు
,, చదువుల బసవశంకరయ్యగారు నర్సాపురం
,, బాదిడిమఠం సిద్ధివీరయ్యగారు డాకూరు
,, చిత్తారు మల్లయ్యగారు నల్లగొండ
,, రావికోటిమఠం వీరభద్రయ్యగారు హైదరాబాదు
,, చిలుపూరి నాగబసవయ్యగారు బెజవాడ
,, డా॥ కంచర్ల కన్నవీరయ్యగారు ,,
,, శెట్టిభక్తుని బొరయ్యగారు కనగాల
,, పులకంటి సంగన బసవయ్యగారు వల్లూరుపాలెం
,, క॥ లక్కన మల్లికార్జునుడుగారు ,,
,, లక్కన వీరభద్రయ్యగారు ,,
,, లక్కన (ఫ్యాక్టరీ) బసవయ్యగారు ,,




సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

| | | |
|---|---|---|
| సంపుటము ౧ | సికింద్రాబాదు<br>శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి<br>శ్రావణము | రేఖ ౬ |

## సుబోధ

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

గీ. పాపభూయిష్ఠమగు నీ ప్రపంచకమున
బుట్టఁ జచ్చును గ్రమ్మఱఁ బుట్టఁ జచ్చుఁ
బుట్టుచావులు వెండియుం బొందు కొనుచుఁ
జక్రనేమిక్రమంబున జనుఁడు తిరుగు.

ఆ. వె. పూఁతపసిఁడివోలెఁ బొదిగి చక్కెరతోడ
మాటినట్టి విసపు మాత్రపగిది
నైహికంపు సౌఖ్య మాపాతహృద్యంబు
తుదికిఁ దద్రహస్య మెదకుఁ దెలియు.

వి భూ తి ౧-౭.

కం. గిరిఁ ద్రవ్వి యెలుకఁ బట్టిన
కరణి వ్యయపఱచి యమూల్య కాలంబెల్లన్
నరుఁ డణుతరసుఖమునకై
పరిశ్రమించుచు వహించు బహు దుఃఖములన్.

ఆ. వె. కుడితిఁ బడ్డ యెలుక వడువునఁ, బెనరొంపి
గూలఁబడ్డ యేన్గు గున్నభాతి
ముండ్లకొమ్మఁ బడ్డ పుట్టంబునై జనుం
డైహికములఁ జిక్కి యలఁతఁ గాంచు.

మ. మలభాండంబగు నీ శరీరమును సన్మానించి కై సేసి భూ
షలఁ జీనాంబరరాశి సేబవ లిదే స్వర్గం బిదే మోక్ష మం
చలరుంబోడులఁగూడి మానవుఁడు నాట్యంబాడుచున్ బాడుచు
గులుకుంబంగరుతూఁగుటుయ్యేలలఁదూఁగున్, దత్వసమ్మార్గ

శా. మేడల్ మిద్దెలు దొడ్డు తోఁటలును నిర్మింపన్ వలెన్, గొ
డ్లాడంగావలె యావతంబును, నమూల్యంబైన భూషాదులన్
వాడంగాఁగొనఁగావలె న్ననుచుఁ జింతల్ సేయుఁగానీ నరుం
డేఁడున్ వార్ధక మందునేని విడఁ డిస్సీ! తృష్ణ యావంతయున్.

క. తనజీవితలక్ష్యం బే
మని, దానిని డాయుమార్గ మది యే మనియున్
అనుకొన డే కోశమునను
మనుజుం డొకపరియు మోహమగ్నత్వమునన్.

ఆ. వె. ఆత్మలక్ష్యరోధు లగుచున్న యాంతర
శత్రువులఁ జయింపఁజాల కిస్సి!
బాహ్య శత్రుగణము పయి కేల దండెత్త?
నింట గెలిచి రచ్చ కెక్కఁ జెల్లు.

క. మొల్కకెత్తి యెడదమూలను
మెలమెలఁగా సాగి యాక్రమించి కెలంకుల్
బలముగ నల్లు విషయశా
ఖల నాశాలతిక త్రెంపఁగాదు నరునకున్.

క. ఒక విషయము సిద్ధింప మ
ఱొక విషయముపైకిఁ బ్రాకు నొడవిన నదివే
ఱొక విషయమునకు సాగును
సకలం బీవరుసఁ దృష్ణ జగ ముల్లుకొనున్.

తే. ఆశవలనఁ గ్రోధ మద్దానఁ బాపంబు
దాన నరక మీ విధముగ సతము
ఆశవేరు దన్ని యజ్ఞానముం బెంచి
భవపరంపరలకుఁ బనుచు జనుని.

క. సరిరాదం డ్రిహసుఖముం
బరలోకసుఖంబుఁ గోటిపాలున కేనిం
బురుషుని మనసున కాశను
బరిమార్చుటవలనఁ గలుగు పరసుఖమునకున్.

గీ. అంటుకొన్నఁ దగిలి తంటసం బనలాగు
విషయసంగమంబు వీడిపోక
అడుసుఁ ద్రొక్కనేల యడు గేల కడుగంగ ?
సన్యసించి తపము సలుపుకొందు. *



(* "జాతకకథాగుచ్ఛ"మందలి క్షాంతివాదిజాతకమునుండి)

# సరస్వతీ బ్రహ్మభార్యయా!

**ఒక వినోద విమర్శము**

**( విద్యానిధి )**

శ్లో॥ "శరదిందుసుందరరుచి శ్చేతసి సా మే గిరాం దేవీ
అపహృత్య తమస్సంతత మర్థా నఖలాన్ ప్రకాశయతు".

ఇది విమర్శాయుగము. పరబ్రహ్మ ప్రత్యక్షమైనను సరిగ శోధించిన తరువాతనే ఔనని స్వీకరింతురు. నా విమర్శ నిరా ముగ, కేవల మూహాగానముగ నుండదు. సాధ్యమైనంతవరకు ప్ర రణముగ సప్రమాణవాదమే ఇందు చేయబడును.

8—10—30 తేదిని కాశీ విద్వన్మిత్రగోష్ఠిలో సర గూర్చి కొంత వినోదముగ చర్చజరిగినను చివరకు నిష్ఠురోక్తు హేత్వాభాసములదనుక దిగినది. తర్వాత నీ వాదము కేవ శుష్కముగ నంతమగుట సరికాదని తత్త్వబోధకొరకు మరుదిన వక్తృత్వ కలోత్తేజకసంఘము దశమాధివేశనమున సప్రమాణ నుపన్యసించిన విషయమే నేటికి వ్యాసరూపమును దాల్చుచున్నది.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తుల నాశ్రయించి వాణీరమా పార్వతు లను శక్తిత్రయమును రాజిల్లుచుండుట ప సిద్ధము. అయినను ప్రస్తుతము ఈ క్రింది చర్చవలన బ్రహ్మకు సర భార్యగా నిలుచుటకు వీలులేకున్నది. ఇంతమాత్రమున నన్ను కులు నాస్తికునిగా దలంపవలదు. కేవల మొకపద్ధతి నాశ్రయించి యిట్లు వినోదార్థము వ్రాయబడినది కాని, ఆస్తికులను నొప్పించు గాదని యెఱుంగునది.

దాదాపు రెండువేలసంవత్సరముల క్రితము విరచితమైన అ కోశమునందు సరస్వతికి—

"బ్రాహ్మీ, భారతీ, భాషా, గీః(ర్), వాగ్, వాణీ, సరస్వ

అను నేడు పేరులు కనుపడుచున్నవి. అమరకోశమునకు "బుధ మనోహరా" టీకను రచించిన మహాదేవవేదాంతి "బ్రాహ్మీగౌర్భా రతీభాషా" యను పాఠాంతరమునుజూపి సరస్వతికి "గౌః" అను మరొక పేరు కలదని సూచించియున్నాడు. అసలు అమరకోశకారుడే నానార్థ వర్గమున "స్వర్గేషు పశువాగ్వజ్రి......గౌః"అని సరస్వతికి గోత్వము నంగీకరించినాడు. ఇక విశ్వమేదినీ కోశకారులును వాక్కుకు గౌః అను నామాంతరమును చెప్పియున్నారు.

శారద యను మఱొక పేరు సరస్వతికి లోకమున సుప్రసిద్ధమై యున్నది కాని అమరకోశాది ప్రసిద్ధ గ్రంథములందు గానుపించకుండు టకు గారణము తెలియదు. "త్రికాండశేషము"నందు మాత్రము 'శారద' యగుపడుచున్నది.

"శారద స్సప్తపర్ణేస్యాత్ । సరస్వత్యాంతు శారదా".

మొత్తము ఈ తొమ్మిది నామములును సరస్వతికి వాచకము లుగా (వాక్కు అను నర్థమునందు) వ్యవహరింపబడుచున్నవి. ఈ నామము లెందులకు బుట్టినవో (వ్యుత్పత్తిని) తెలిసికొనిన గాని బ్రహ్మభార్యాత్వవాదము తేటపడజాలదు.

౧-వ పేరు బ్రాహ్మి. బ్రహ్మచేత సృష్టింపబడుట వలనను, ప్రసరింప బడుటవలనను ఈ పేరు కలిగినది. "బ్రహ్మణః ఇయం = బ్రాహ్మీ" యను విగ్రహము (సమాసము) నకు బ్రహ్మభార్య యని కొందరర్థము చేయుచుందురు కాని యది సరికాదు. బ్రాహ్మీ యని మఱొక ఓషధి (సరస్వతియాకు) కలదు. అక్కడను సమాస మిటులే చేయవలసి యుండును. ఆ యాకును బ్రహ్మకు భార్యయేనా ? కాదు. కావున నిక్కడను బ్రహ్మ భార్యయను నర్థములేదు· "మృడస్యపత్నీ= 'మృడానీ'' యన్నటుల "బ్రహ్మణః పత్నీ=బ్రహ్మాణీ'' యనుట సయుక్తికమే కాని ఆ యభిప్రాయమే యున్నచో అమరకోశమున 'బ్రహ్మాణీ'' యను రూపము ప్రయుక్తము కావలసి యుండెను. (స్పష్టతకొరకు). అట్లుకాక బ్రహ్మ సంబంధార్థమును దెలుపు

సామాన్యమైన బ్రాహ్మీ రూపము వాడబడినది. కావున నిస్సందే
ముగ బ్రాహ్మీశబ్దము సరస్వతియొక్క బ్రహ్మభార్యాత్వమును సి
పించుటలేదు. పైగా అగ్రిమచర్చవలన కోశకారుడగు అమరసింహ
నకు సరస్వతిని బ్రహ్మభార్యగా నంగీకరించుటకు నిష్ట మేమాత్రము
లేదని తెలియవచ్చెడిని. దీనికి గారణ మాకాలమున అట్టి ప్రసిద్ధి లే
పోవుటయే యని యూహించవచ్చును.

౨. వది 'భారతి' భరతమునిచేతఁ దేబడుటవలన నీపేరు క
గినది. ఇక్కడను "భరతస్యఇయం = భారతీ" యను సమాస
కలదు. అక్కడ బ్రహ్మ భార్యయని యర్థము చేసినచో నిక్కడ భ
తుని భార్యయనియును చెప్పవలసి వచ్చును. ఈ యిర్వురికిని సరస్వ
భార్యకాదు కావుననే సాభిప్రాయముగ నొక్కచోటనే ఈ రెం
శబ్దములను అమరసింహుడు ప్రయోగించినాడు. భరించునది కావు
భారతి యని మఱియొక సమాసము. "బిభర్తీతి భారతీ". భరత
కూతురొకతెభారతి కలదు. అచ్చోటను సమాసమునకుసంబంధార్థము
జేయవలెను. బ్రాహ్మి యనునపుడును బ్రహ్మ సంబంధురాలు లే
పుత్రికయని భావించుటయే సుసంగతము.

౩. భాషా,మాట్లాడబడునది (భాష్యతే) కావున భాష. ౪ గీ
పలుకుదురు కావున (గృణంతీతి) గీర్. దీనికి 'గిరా' యను రూపాంత
మొండు కలదు. ౫ వాక్. (ఉచ్యతే) చెప్పబడినది. ౬ వా
(వణ్యతే) దీనికిని పై యర్థమే. "వాణీ" యని ఇకారాంతరూపము
కలదు. ౭ సరస్వతీ,ఎల్లెడల ప్రసరించునది కావునను (సరః అస్యాః అ
సరస్వతి, సరస్వతీనది ఇట ప్రస్తుతముకాదు. ౮ గౌః; చలించున
(గచ్ఛతి).

౯ శారదా. ఈశబ్ద వ్యుత్పత్తిని సరస్వతీ స్వభావమునకు మ
పెట్టుట సుగమముగాలేదు.శరత్కాలమున బుట్టినది కావున (శరదిభవా
శారదయని చెప్పుట సులభమేకాని సరస్వతి శరదృతువున బుట్టినట్ల
ప్రాచీన ప్రమాణములు కలవా ? ఆశ్వయుజ శుక్లపక్షమున సరస్వ
నాహ్వానించి పూజించుట యాచారమై యున్నది. ఇదియు నొక కారణ

మైనచో నపుడు యుక్తి (శరదిపూజ్యతే) సరిపోవును కాని, సత్య మనుటకు ప్రమాణము చాలదు.

"శరత్కాలే పురా యస్మా న్నవమ్యాం బోధితా సురైః
శారదా సా సమాఖ్యాతా పీఠే లోకే చ నామతః"

శరత్కాలమున నవమియందు సుర లాహ్వానించి పూజించిరి కావున శారద నామము రూఢమైనదని పై శ్లోకమున జెప్పబడినది. ఈ శ్లోక మెక్కడిదో నాకు జ్ఞాపకములేదు. కంఠస్థమై యుండుట వలన నుదాహరింపబడినది. ఇట్టి పూజ పార్వతికిని శరన్నవరాత్రములందు జరుగుచున్నది కాన నామెను శారద యని పిలువ వీలు లేకున్నది. సుప్రసిద్ధమైన ఈశారదాశబ్దమునకు సుసంగతమైన వినిగమకము గోచరించుటలేదు.

సరస్వతికి శారద యను నామము ప్రాచీనకాలమున నుండలేదేమో? అమరసింహు సంతతి వాడు (వ్యాకరణ మహాపండితుడు) ఈ శబ్దమును పైగా ఇది సుప్రసిద్ధమై యున్నచో వదలి పెట్టునా?

ఈ విధముగ సరస్వతీవాచకములైన ఈ తొమ్మిది శబ్దముల లోను బ్రహ్మభార్యాత్వము గోచరించుటలేదు.

ఇక నమరకోశమున విష్ణునామములలో "కేశవోమాధవః" అని సుస్పష్టముగ విష్ణువుకు లక్ష్మీభర్తృత్వము చెప్పబడినది. (మాయనగా లక్ష్మి, ఆమెకు ధవః=భర్త) శివనామములలోను "స్థాణూరుద్ర ఉమాపతిః" అని శివునకు పార్వతీపతిత్వము సుస్పష్టము.

మఱియు లక్ష్మినామములలో "కమలా శ్రీ ర్హరిప్రియా" అని లక్ష్మియొక్క విష్ణుభార్యాత్వమును, పార్వతీనామములలో "శివా భవానీ రుద్రాణీ" అని పార్వతియొక్క శివపత్నీత్వమును అమరకారునిచే సూచింపబడినవి.

పైగా శివుని నామముల తర్వాత శివునిపరివారమగు కుమారస్వామి, గణపతి, పార్వతిమున్నగు వారి నామములును, విష్ణునామముల తదనంతరము విష్ణు పరివారమగు బలభద్రుడు, మన్మథుడు,

గరుత్మంతుడు, లక్ష్మిముస్నగు వారి పేరులును పేర్కొనబడి ఇ
ఇంద్రి చంద్రి సూర్యాదుల నామములును ఔచిత్యము ననుస
వరుసగా పరివార మంతయు నొక్కచోట గూర్పబడినది.

ఇక మన బ్రిహ్మ సరస్వతుల సంబంధమును జ్ఞాతము.
వర్గమున దిరిమూర్తుల నామములలో మొదట బ్రిహ్మనామ
గలవు. అవి "బ్రిహ్మ ఆత్మభూఃసురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః హి
గర్భః లోకేశః స్వయంభూః చతురాననః ధాతా అబ్జయోని, ద్రుహి
విరిఞ్చిః కమలాసనః స్రిష్టా ప్రిజాపతిః వేధాః విధాతా విశ్వ
విధిః" యని యిరువది యనుట సుప్రిసిద్ధము. ఇంక నధిక పా
పేరితో "శతానందః, శతధృతిః విరించః అజః విరించనః నాభి
అండజః పూర్వః అనిధనః కమలోద్భవః సదానందః రజోమూ
సత్యకః హంసవాహనః" అని మఱియును పదునాలుగు నామము
యిటీవల బ్రిహ్మకు లభించినవి. ఇన్ని నామములుండ
నొక్క పేరైనను బ్రిహ్మ సరస్వతికి భర్త యని సూచించుటలే
మీాదు మిక్కిలి బ్రిహ్మనామావళి స్వర్గవర్గములో నుండ
నాయన భార్య యనుకొనబడు సరస్వతి వాగ్వర్గములో నున్నది. (
పరివారములో జెప్పబడలేదు. ప్రాచీన వాఙ్మయమున వేదా
యందును సరస్వతికి బ్రిహ్మ భార్యగా జెప్పబడలేదని, (నాకు జ్ఞా
మున్నంతవరకు) స్మరించుచున్నాను. ఋగ్వేదమున:

"పావకానస్సరస్వతీ వాజేభిర్వాజినీవతీ" ౧-3-౧౦
"చేతంతీ సుమతీనాం యజ్ఞం దధే సరస్వతీ" ౧-3-౧౧
"మహో అర్ణః సరస్వతీ" ౧-3-౧౨

ఇట్లు కొన్ని సార్లు సరస్వతినామము వచ్చినది. అట సరస్వ
యొక్క గుణములు, బలజ్ఞానవిద్యాదాత్రిగాను, బుద్ధి ప్రిదా
గాను విశాలమైన దానిగాను నిరూపింపబడినవేకాని బ్రిహ్మ భార
లక్షణములు కనుపించవు.

ఇందుకు విపరీతముగానమరమున దిగ్వర్గములో "గీష్పతి, వా
స్పతి" శబ్దములతో సరస్వతి (వాక్) యొక్క భర్తృత్వము బృహస్ప

స్పష్టముగ జెప్పబడినది. వాక్పతి యనగా బృహస్పతి స్ఫురించును గాని బ్రహ్మార్థము గోచరించదు.

బ్రహ్మకు సరస్వతి పుత్రి యనియు, ఆమెను బ్రహ్మ వరించె ననియు, ఆమె మఱొకప్పుడు విష్ణువుకును భార్య యయ్యె (పద్మపు) ననియును పౌరాణికవాదము కలదు. మహాకవి శ్రీహర్షుడును సరస్వతిని విష్ణు భార్యగా తన నైషధకావ్యమున (౧౧-౬౬) వర్ణించినాడు. ఆంధ్రమహాకవి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడును "వాణి నారాణి" యన్నాడు. ఈ విధముగ జూచినచో బ్రహ్మకును సమస్త విద్వాంసు లకు వారి వారి తారతమ్యానుసారము సరస్వతి వశవర్తిని కావచ్చును గాని నేను పురాణకథల నూతగా గొనక కేవల మమరకోశమును మాత్రకంటె ప్రాచీన వాఙ్మయమును దృష్టియందుంచుకొని యిట్లు సూచించినాడను. కావున నీ దృష్టితోడనే విచారించు సహృదయ వ్యాసముల నిరీక్షించుచుందును.

సరస్వతీతత్త్వమునుగూర్చి మఱొక వ్యాసమున ముచ్చటింప గలను. సరసులు చిత్తగింతురుగాక!



2

## శ్రీ జగద్గురు రేణుకాచార్యస్తుతిః

అండెల కోటీశ్వర శాస్త్రిగారు

---

శా. శ్రీమచ్ఛాంభవయోగ సౌఖ్యభరితం సోమేశలింగోద్భవం
కుంభోద్భూత విబోధకం త్రిభువనాచార్యం గురూణాంగురుం
కాషాయాంబరభూషితం పరిలసద్రుద్రాక్షభస్మాంకితం
శ్రీ కోటీశ్వర వాంఛితార్థ ఫలదం శ్రీ రేణుకేశం భజే.

శ్రీమత్కాంచి పురోల్లసద్వరదరాట్ శీర్ష ప్రకంపస్థిరం
మాయావాది నగాధిరాజ కులిశం చోళేంద్రతత్త్వప్రదం
లంకాధీశ విభీషణేష్టవరదం ఫాలాక్షసంరాజితం
శ్రీ కోటీశ్వర వాంఛితార్థఫలదం శ్రీ రేణుకేశం భజే.

శ్రీమంతం నృపసేవితం పరమతాంభోజాతదంతిప్రభం
వీరాద్యాగమశోభితం భవహరం కందర్పవిధ్వంసకం
గోరక్షాది ఖల ప్రగర్వహరణం సిద్ధాంత చంద్రోజ్జ్వలం
శ్రీకోటీశ్వర వాంఛితార్థఫలదం శ్రీరేణుకేశం భజే.

శ్రీవాణీ శచిభి ర్ముకుందవిధినా కేశాదిభిః పూజితం
విద్యాశంకరలింగదాన నిపుణం పంచాక్షరీబోధకం
సద్భక్తౌఘమనోంబుజాతతరణిం కైవల్య కల్పద్రుమం
శ్రీకోటీశ్వర వాంఛితార్థఫలదం శ్రీరేణుకేశం భజే.

శ్రీరంభానగరాలయం యతిలలామం తిర్యగాందోళికా
రూఢం రత్నకిరీట మండనచయై ర్ద్వాసప్తతి ప్రోజ్జ్వలైః
భ్రాజంతం సుకవీశరమ్య కవితాపాత్రం శివానందదం
శ్రీకోటీశ్వర వాంఛితార్థ ఫలదం శ్రీరేణుకేశం భజే.

## బృహన్మఠం లింగయ్యగారు

శ్రీకరరేణుకేశ శశిశేఖర దివ్యకటాక్షవీక్షణా
స్తోకకవిత్వసుస్థిరత శోభిల సంస్తుతిజేతు నిష్ఠమై
నాకమునీంద్రవంద్యము వినశ్వరశీలము శైవధామమర్థి
లౌకికరాజమార్గము నలౌకిక తావకపాదకంజమర్థి. ౧

మీపాదనఖరేఖ భూపాలజనఫాల
భాగంబులకు దివ్యఫలకమయ్యె
ప్రణవస్వరూపమై పరగుటచే గదా
బ్రహ్మాదులకుఁ బ్రాప్యవస్తువయ్యె
శ్రీమన్నిరంజన చిద్రూపమగుటచే
శ్రీశాదిదివిజ పరిసేవ్యమయ్యె
లింగాంగసమరస లీనమై తనరుట
శివుడు తానేకమై చెలువుఁ గాంచె

గీ. అవని కంథాకమండలు కక్షపాల
దండకౌపీనములఁదాల్చి ధర్మమూర్తి
పరమహంసపరివ్రాజ ప్రభువ రేణ్య
సకలగుణసాంద్ర రేణుకసంయమీంద్ర! ౨

మాలిని. శివకరశివరూపం జ్ఞానముద్రాకలాపం
గిరిశభజనలోలం గీష్పతిస్తోత్రపాత్రం
విరతివిభవకోశం మల్లికామందహాసం
భజ భజ గురునాథం రేణుకేశం చరేశం. * 3

* ఈ సంస్కృతాంధ్రస్తోత్రములు 5-3-1939 లో శ్రీరేణుకాచార్యుల జయంత్యుత్సవ సందర్భమున సురాండు గ్రామములో చదువబడినవి.

# వీరశైవమత విశిష్టత

జి. వి. యస్. శర్మ

ఇతర శైవులవలెగాక నీ శైవులకు విశిష్టార్థబోధకమగు
విశేషణ మొసగబడినది. ఇది సార్థకమా? లేక నామమాత్రమ
సార్థకమేమైన శాస్త్రదృష్టినా? లౌకికదృష్టినా? 'శైవభేదమ
అను వ్యాసమున నీ వీరశైవవిషయకములగు లక్షణములు, తదుత్
తకు నగు నిదర్శనములు కొన్ని నిరూపింపబడియుండెను. అవి
యేనా? అవాంతరలక్షణములు, ప్రబలతరనిదర్శనములు మరి
గలవా? ఇత్యాది విషయముల నిట కనుగొందము.

1 'వి'శబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్యబోధినీ ।
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తు తే మతాః॥
(సిద్ధాంతశిఖామ

2 'వి'శబ్దోత్రి వికల్పార్థో రశబ్దో రహితార్థకః ।
వికల్పరహితం శైవం వీరశైవమితి స్మృతమ్॥
(ఉత్తరవాతులతంత్ర

3 ఏకమేవాద్వితీయం య దవికల్పం పరంపదమ్ ।
త ద్వీరశైవ మిత్యుక్తం నేతరం సవికల్పకమ్॥ ఉ. వా. తం

4 శంకయా భక్షితం సర్వం త్రైలోక్యం సచరాచరమ్ ।
సా శంకా భక్షితా యేన సవీరో భువి దుర్లభః॥ ఉ. వా.

5 ఏకఏవాయ మేతస్మా త్సర్వస్మిన్ జగతీతలే ।
విశిష్ట ఈర్యతే యస్మా ద్వీర ఇత్యభిధీయతే॥ ఉ. వా. తం

తాత్పర్యము:—1 'వి' యన శివజీవైక్యమును బోధించెడు
అట్టి విద్యయందు క్రీడించుచుండుటచే నీ శైవులు వీరశైవు లనబ

[ఇట్టి క్రీడచేనగు ఫలము శివజీవైక్యత. ఇదియే 'ఏకమేవాద్వితీయం' యను పరమపదము. ఇట్టి స్థితియందు మనసు తనగుణములనుండి విడి వడి యుండుట సహజము. ఇదియే 'నిర్వికల్పస్థితి'యని యనబడుట.]

2 ఈ శైవము వికల్పరహితమైన దగుట, నా వికల్ప, రహితార్థ బోధకము లగు వి, ర, శబ్దముల యోజనచే నైన 'వీర' విశేషణముతో గూడి 'వీరశైవ'మనబడినది.

౩ ఏకమేవాద్వితీయమును నిర్వికల్పమును నగు పరమపదమేదియో అదియే 'వీరశైవము'. ఇతరమగు సవికల్పకశైవ మట్టి వీర విశేషణము నందజాలదు. [ఒకటవ శ్లోకపు వివరణభావ మీ రెండు శ్లోకములందు స్పష్టీకృతమై యున్నది. శుద్ధశైవుడు లింగము లోపించిన ప్రాయశ్చిత్తమునైనను బొందవచ్చుననుట వికల్పమనియు, ప్రాణముల త్యజించుటయతప్ప వీరశైవు డట్లు బొందకుండుట నిర్వికల్ప" మనియు కొంద రభిప్రాయ పడుచుండిరి. ఈ రీతినైనచో లింగలోపము సంభవించిననే అవికల్పమునకు స్థానము దొరకునది. అవికల్పశైవమే వీరశైవ మైనపుడు బంధన లేకయే ముక్తి, సంగ్రహములేకయే త్యాగము, సిద్ధింపనట్లు లింగలోపము సంభవింపనిదే వీరశైవముసిద్ధింపదనవలసి వచ్చును. కాన ఇటు లూహించుట యసమంజసము. శివ జీవైక్యతచే మనసు నిర్గుణమాటయే అవికల్పము. ఇట్టి యవికల్పస్థితి యందే ముందటి ప్రమాణమందలి 'శంక' నిర్మూల మానది.]

4 స్థావర జంగమాత్మకమగు నీ ప్రపంచమంతయు శంకచే భక్షింపబడినది. ఇట్టి శంకయు నెవనిచే భక్షింపబడుచున్నదో వాడే 'వీరు' డనబడుచున్నాడు. అట్టి వీరుడు దుర్లభుడు [అవికల్పుడగు నీ శైవునందు ఆ శంక స్వభావముననే నిర్మూలమై యుండుటచే నితడెంతయు 'వీర' పదమునకు దగియుండెను. అందుననే ఇతడు 'వీరశైవు' డనబడుట]

5 ఈ కారణమున నీశైవుడు సర్వ జగత్తునందును విశిష్టుడుగా గణింపబడుచుండుట 'వీరు' డనబడుచున్నాడు.

ఈ ప్రమాణములచే నీ 'వీర' విశేషణము శాస్త్రదృష్టి
సార్థకమైనదియేగాని నామమాత్ర మెంతయును కాజాలదు. అ
లౌకిక దృష్టిలోను నిది సార్థకమైనదియే!

ఒక డొక సైన్యశాఖయందు చేరియున్నాడనుకొందము. అం
మాత్రమున వానిని మనము వీరు డనుచుండుటలేదు. వాడు రణరం
మున తన వైరితోఁ బోరుచు తన యుద్దిష్టలక్ష్యము (శత్రుమారణము
నుండి ఏమాత్రమును చలింపకుండవలయును. ధనదారాదికముల,అం
ఆత్మప్రాణములగూడ తృణమువలెనైనను గణింపక కర్తవ్యవిముఖ
దూరుడై యుండవలయును. రణరంగమున తన శత్రువును చం
వలయును; అట్లుగాని యెడ తాను చావవలయును. కా
వెనుకంజ వేయగూడదు. అప్పుడే మనము వానిని వీరుడ
చుందుము. ప్రాణమందలి తీపిచే ఏదోనెపమున యుద్దిష్టలక్ష్య
మును ముట్టజాలక కర్తవ్య విముఖత (పారిపోవుట)కు అలవడిన వాని
మనమట్లు వీరుడనజాలము. అట్లే నీవీరశైవుకును ఏదోయొక శైవశా
యందు చేరినవాడు మాత్రమేగాక తనయుద్దిష్టలక్ష్యము (లింగాం
సామరస్యము)న కగు విధ్యాచరణయందు గడంగి యావిధి (కర్తవ్య
హానిని సహింపనివాడై యుండవలయును. అట్లు సహింపక, లింగాం
సామరస్యమునంది తీరవలయును. అటుగానియెడ ప్రాణములను త్యజిం
తీరవలయును. ప్రాణహానికిని సుఖమున నోర్చుకొన దగును కా
కర్తవ్యహానికే తీరునను యోర్చుకొనగూడదు అను వీరవ్రత మాతని
యుండుట నీశైవుడు వీరశైవుడనబడుచున్నాడు. ఇట్లుగాక ప్రా
శ్చిత్తమను నెపమున వ్రతహాని కోర్చుకొనుట కలవడిన ఏశైవులును
'వీర'విశేషణమున కర్హులుగారనుట లౌకికదృష్టి (లౌకికన్యాయము)న
మనము గుర్తించగలుగుచుంటిమి. అందుచే నీశైవుని వీరవిశేషణ
శాస్త్రదృష్టినే గాక లౌకికదృష్టిలోను సార్థకమైనదనుట కెంతయు
తగియున్నది.

శైవభేదములందీ 'వీరశైవ' మనున దొకటని మనమిదివర
తెలిసికొనియుంటిమి. ఇట్టి వీరశైవమునందును

'ఆదౌ త్రిధామయా ప్రోక్తం వీరశైవం మహేశ్వరి
సామాన్యం ప్రథమంప్రోక్తం విశేషంచ ద్వితీయకం ॥
నిరాభారం తృతీయం స్యాత్ క్రమాల్లక్షణముచ్యతే
(సూక్ష్మాగమము అధ్యాయము 7)

సామాన్య, విశేష, నిరాభారము, లని మూడు అవాంతర భేదములు గలవు. అవి ఎట్టివన ? సామాన్యవీరశైవము:—గురువు తన మస్తకమునందు హస్తము నుంచి భస్మధరింప శివదేహుడై పిమ్మట గురుదత్తశివలింగమును శివమంత్రపూర్వకముగా శిరస్సు, కంఠము, వక్షము, ఈ ప్రదేశములం దేదనైనను నాభిస్థానమునకు క్రిందుగాకుండునట్లు ధరించుచు నియమముచే మూడు, అథవా రెండు కాలములందును, అట్లునుగానియెడ ఏకకాలముననైనను శివలింగమును పూజించుచు గురు, లింగ, జంగములయందు భక్తిగలిగియుంట సామాన్య వీరశైవలక్షణము.

విశేషవీరశైవము:-గురువుచే విధ్యుక్తమగు సాంగికశివదీక్షనంది ఆణవ, మాయా, కార్మికము లను త్రిమలములనుండి విడివడి గురూపదిష్టము లగు అష్టావరణ, పంచాచారము లందలి నిరతిచే యావజ్జీవము నిత్యశివపూజావ్రతము ననుష్ఠించుచు లింగాంగసామరస్యజ్ఞానానుసంధానాసక్తుడైయుండుట విశేషవీరశైవలక్షణము. [సామాన్యవీరశైవునకుండని షడధ్వశోధనాదివిశేషసంస్కారము లీతనికుంటయే వీని విశేషత్వమునకు కారణము.]

నిరాభారి వీరశైవము: —విశేషవీరశైవునందలి సర్వసంస్కారములు గలిగి గృహోచితములగు సర్వసంసార సౌఖ్యముల త్యజించి ఆజీవ బ్రహ్మచర్య వ్రతమును పురస్కరించుకొని శమదమాది సద్గుణములు గలిగి జితేంద్రియత్వమున లింగాంగసామరస్య మను శివానందాంబుధిని తేలియాడుచుండుట నిరాభారి వీరశైవలక్షణము. ఇట్టి త్రివిధవిభజనయు క్రమవిభాగతత్వమునందలి వీరి నిపుణతను, వ్యక్తము జేసెడిని.

ముందీ వీరశైవ మతసిద్ధాంతముల కొన్నిటిని దెలిసికొని తన్
మునను ఈమత విశిష్టతా నిదర్శనముల కొన్నిటిని కనుగొందమ

వీరశైవమతమునకు 'శక్తివిశిష్టాద్వైతము' 'విశేషాద్వైతమ
అను పర్యాయ నామములుగలవు.

'తే ధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం'
(శ్వే. అ 1 మ 3)

[జగత్కారణ జిజ్ఞాసచే ధ్యానాను సంధాన పరాయణుల
మునులు స్వప్రకాశ చిదాత్మకమగు పరశివశక్తి (పరమశివునం దన్
గుణములచే నొప్పెడు చిచ్ఛక్తి)ని జూచిరి]

ఇట్లను ఉపనిషత్ప్రమాణముచే జ్ఞాన క్రియాత్మకమగు శ
ఈశ్వరుని స్వభావమనియు, అది ఈశ్వరునిచే వేరై యుండక, అద్వై
తులు చెప్పినట్లు మిధ్యగాక సత్యమైనదనియు,

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి'
(ముండక 3. ఖ 1

[సూక్ష్మశరీరసంజ్ఞక వృక్షము నాశ్రయించి జీవేశ్వరుల
రెండుపక్షులుగలవు. అందున జీవరూప పక్షి పురాకృతకర్మచే నిష్పన్న
మైన సుఖదుఃఖాత్మక ఫలమును భక్షించుచుండ, రెండవపక్షి (ఈశ్వ
రుడు) యందంతకును సాక్షియై నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావము
నందుచుండును] యను ప్రమాణముచే జీవేశ్వరులు మొదలు పరస్పరము
భిన్నులయ్యు పిమ్మట అంత్యమున 'బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి
[బ్రహ్మ నెరింగినవాడు బ్రహ్మయే యవుచున్నాడు] యనునట్లు ఏక
స్వరూపులే యవుచుండిరి. ఈయభిప్రాయముతో కూడినదే 'శక్తివిశిష్టా
ద్వైత' మనబడుచున్నది. అద్వైతమతము జీవేశ్వరుల కభేదమును
ద్వైతమతము జీవేశ్వరులకు భేదమును, ఎల్లపుడు సిద్ధమని చెప్పు
చుండును. ఇట్లుగాక కేవల మద్వైతమునే ప్రతిపాదించు మతము ద్వైత

రూపక శ్రుతివచనములకును, ద్వైత ప్రతిపాదక మత మద్వైత
రూపక శ్రుతి వాక్యములకును విరుద్ధములై యుండుట నా మతములు
ద్వైక దేశ వచనావలంబకములే గాని సర్వవేదసమంజసములు కాజా
వు. శక్తివిశిష్టాద్వైత మట్లుగాక ద్వైత నిరూపక వేదవచనములకు,
ద్వైత నిరూపక వేద వచనములకును అవిరుద్ధమై యున్నది. ఎటులన?

"అంశో నానావ్యపదేశాత్"

(బ్ర. సూ. 22. 17. 43)

'మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః' (భ. గీ)

[అనాది మాయాసంబంధముచే ఈశ్వరుని యంశలు 'జీవ' నామ
మును బొంది దేవతిర్యఙ్మనుష్యాది జాతులందు స్పష్టమవుచున్నవి.
ఈ యన్ని జీవులకును ఈశ్వరుడు సాక్షిరూపమున [వేరకుడై యుండును.]
అని యుండుటచే నిట్టి మల కర్మ మాయాది పాశబద్ధు లగు జీవులు
సంసారస్థితియందు ఈశ్వరునికంటెను భిన్నులై యుండియు, గురుకృపచే
శివాభేదజ్ఞానము నార్జించి భ్రమరకీటక న్యాయమువలె శివస్వరూపాను
సంధానబలముచే శివైక్యత నందుచున్నారు.

ఇట్లు భేదాభేదముల రెంటిని యొప్పుటయు, మరియు నీ వెనుక
చెప్పినరీతిన సర్వజ్ఞత్వ, సర్వ కర్తృత్వాదిరూప శక్తి విశిష్టమైనదే పర
బ్రహ్మమని యంగీకరించుటయు, జ్ఞానకర్మలు రెండును ముక్తికి సాధన
ములను * సమసముచ్చయమే ఇష్టమైనదిగా నుండుటయు ఈ మతము
యొక్క విశిష్టతను వ్యక్తపరచెడిని.

---

* శ్రీశంకరాచార్యులు గీతాభాష్యముయొక్క ఆరంభమందు తమకు పూర్వమే
గీతకు జ్ఞానకర్మ సముచ్చయపరముగ వృత్తిని వ్రాసియుండిన ఆచార్యుల అభిప్రా
యము సరియైనదికాదని, తమ యభిమతము (జ్ఞానోత్తరసమయమున కర్మావశ్యకత
యుండ దను విషయప్రాశస్త్యము) ను నిర్దేశించియుండిరి. ఇందుచే ప్రాచీనకాలము
నుండియు తన సిద్ధాంతానుగుణముగ జ్ఞానకర్మ సముచ్చయమును విడువక వ్యవహార
మునం దుంచుకొని, ముందును తద్విషయమై సప్రమాణముగ సిద్ధపరచుచు వచ్చిన
వీరశైవమతము అద్వైతమత ప్రాదుర్భావముకంటెను మొదలే ప్రౌఢావస్థయందుండె

మరియు నీ మతమునందలి ముక్తివిధానమును అధికారిభేదమ
సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యము లని నాల్గువిధ
నిరూపింపబడియున్నది. శివసమానతా రూపమగు సాయుజ్యమే
తర ముక్తి యని వీరి సిద్ధాంతము. అల్పకర్తయు అల్పజ్ఞుడును
జీవుడు మాయామోహితుడై యుండియు, జ్ఞానయోగ సాధ
అనాది మలవాసననుండి విడువబడి, శివానుగ్రహమునకు, ముంద
గురుకరుణకును పాత్రుడై, శివదీక్షనంది జ్ఞానక్రియలును, అ
కంగరూపమున అష్టావరణాద్యుత్తమాచరణమును గలిగి లింగ
సామరస్య జ్ఞానముచే 'శివస్వరూపోభవతి శివస్వరూపోభవతి' 
వృద్ధజాబాలోపనిషద్వాక్యమువలె శివాభేద శివసాయుజ్య అ
శివైక్య రూప పరతరముక్తి నందుచున్నాడు.

పైన ప్రయోగింపబడిన 'లింగాంగసామరస్య'మను ప
బ్రహ్మాత్మైక్యబోధకమైయున్నది. ఎట్లులన? 'లింగంబ్రహ్మసనాతన
యను వాక్యముచే లింగమన పరబ్రహ్మమనియు, 'అం=పరమాత్మ
గచ్ఛతీతి - అంగమ్' అను వ్యుత్పత్తిచే అంగ మన ఆత్మయనియు,
లింగాంగముల సామరస్యమే బ్రహ్మాత్మైక్యమనియు స్పష్టమవుచున్న

వెనుక అష్టావరణములని మనము పేర్కొనియుంటిమి.
యావరణము లన అష్టవిధములగు ఆధ్యాత్మికాచరణములకీ మతశా
మున యొసగబడిన సంజ్ఞ. ఇట్లొసగబడుటయు నీమతకర్తల (ఆచార
విచక్షణతను వ్యక్తీకరించెడిని. యోధుడు స్వయముగ శూరుడై
డియు శత్రువులవలని యాయుధములచే భేదింపబడుటకై తనశరీ
నకు అభేద్యమగు కవచమును ఆవరణముగా నిర్మించుకొనుచున్నా
అటులనే మల కర్మ మాయాది శత్రుపీడకు లోనుగామికి ఏర్ప

---

ననుట కే యభ్యంతరమును లేదు. సరిగదా! ఇటులుండియు కొందరు జ్ఞానకర్మ
చ్ఛయాధిక్య వర్ణనావసరమున విరాజమానము, శిష్టసమ్మతమును నగు వీరశైవమత
డియు, అన్యదేశీయుల విచారముల పదేపదే ముందుకేసి చెప్పుచుంట ఆశ్చర్య
కలుగజేసెడిని.

నబడిన ఈవీరశైవుని గుర్వాద్యాధ్యాత్మికవిషయములును కవచమువలె
వరణములై యుంటఁ 'అష్టావరణము'లన నెంతయు నొప్పియున్నవి.
వాభేద సద్భావమునకు ముఖ్యహేతువులు, వేదాగమశిరోభాగ ప్రతి
దితములును నగు నీ నివృత్తిరూప యష్టావరణాచరణచే శివస్వరూపు
వు వీరశైవులు అప్రాకృత జీవులనియు, ప్రకృతి కార్యములగు కలా
కించిత్కర్తృత్వము ), నియతి ( కర్మఫలావశ్యభోక్తృత్వము ),
ద్యా (సాంసారికవిషయ పదార్థములమాత్రము తెలిసికొనగల్గు కిం
ద్జ్ఞత్వము), రాగ (వనితాది విషయములందలి యాసక్తి), కాల
భూతభవిష్యద్వర్తమానములనువ్యవహారహేతుభూతమగు సమయ విశే
ము), లను పంచకంచుకంబులచే నావృతులై (బద్ధులై), దేహేంద్రియ
ణాద్యనాత్మల యాత్మ లని భ్రమించి, అనిత్యసుఖముకై జ్యోతిష్టో
మాది, యజ్ఞ, కృచ్ఛ్రచాంద్రాయణాది కామ్య (ప్రవృత్తిరూప) కర్మ
చేసుఖదుఃఖాది ద్వంద్వములచే నిటికికొన్న ఇతరులు ప్రాకృతజీవు
నియు, నిగమాగమము లుద్ఘోషించుచున్నవి. ఇట్టి వీరి యప్రాకృతత్వ
మును 'వీరశైవవిశిష్టత' ను బలపరుప నెంతయును సమర్థమైయున్నది.

(ముందుసాగును)



# "సిద్ధులు" అనగా ఎవరు?

శిలిగం జగన్నాథముగారు



నిజాంరాష్ట్రమునుండి వలస వచ్చి కృష్ణాజిల్లా కొ
తాలూకా జంగారెడ్డిగూడెము వద్దనున్న 'తిరుమలాపురము'ల
తూర్పు గోదావరిజిల్లా రామచంద్రాపురము తాలూకా 'కొంక
లోను, విశాఖపట్నంజిల్లా ఎలమంచిలి తాలూకా 'దార్లపూడి' ల
భద్రాచలము తాలూకా 'కూనవరము'లోను, వరంగల్ జిల్లా పా
తాలూకా 'రుద్రంకోట'లోను గొందరు "సిద్ధులు" అను జాతి
నివసించు చున్నారు. వీరు యీ ప్రాంతములలోనేగాక నైజాం
మందలి యిల్లందు, సిరిసిల్ల, లచ్చపేట, సిద్ధిపేట, మున్నగు ఏ జి
గ్రామములందు మాత్రమే గ్రామమునకు రెండుమూడు గృహ
వారు మాత్రమే యున్నట్లు తెలియుచున్నది. కాని యింత
యితర ప్రాంతములలో నున్నట్లు యెంతమాత్రమును తెలియ
కున్నది.

వీరు అకుంఠిత శైవదీక్షా పరులై శైవాచార తత్పరులై
గారి, శిలివేరు, శిలిగం, పరశురాం, జొన్నల, మకరం, గడ్డం, భాగ
మున్నగు గృహనామములతో గ్రాలుచున్నారు. వీరు పూ
శైవాచారసంపన్నులై యుండి లింగధారణ, స్నాన సంధ్యాద్యనుష్ఠా
లతో యొప్పారుచు భూతదయాపరులై యుండెడివారట. గాని వర్తమ
కాలమందీ జాతీయుల ఆచారవ్యవహారము లత్యంత శోచనీయావస్థ
దున్నవని తెలుపుటకు మిక్కిలి విచారమగుచున్నది.

ఈ విశాల ప్రపంచములో ననేక జాతు లేర్పడి అత్యంత
వృద్ధిలో నుండగా ఈ జాతివారు మాత్రము అతి స్వల్ప సంఖ్య
లుగ మొత్తము ఏపది పదిహేను గ్రామములలో మాత్రమే యుం

మిక్కిలి అసంభవమగు విషయము. అట్లెన్నటికిని గానేరదు. కాని ఏ దూరదేశమందో ఏజాతీయులుగనో ప్రచ్ఛన్ననామములతో పరిగణింపబడుచు నుండి యుందురని భావింపవలసియుండును.

ప్రస్తుత మీజాతివా రతి స్వల్పసంఖ్యగనుండుటచే (వీరిలో వీరు) పరస్పరవైవాహికాది క్రియల గావించుకొనవలసివచ్చినప్పుడు (కుల) గోత్రములను, బాలవృద్ధ భేదములను, ప్రజ్ఞాప్రాభవములను పరిగణించుట కవకాశమే లేదు. అట్లు పరిగణింపవలసియే వచ్చు నెడల చాలమంది అవివాహితులుగనే యుండవలసివచ్చుననుట సత్యేతరము గాదు. పలుపలుకు లేల ? వీరిలో అసమవివాహ పిశాచ కరాళ దంష్ట్రాంకుర బాధితులయ్యును, అనుపలబ్ధకన్యకు లగుటచే ఆజన్మాంత మవివాహితులయ్యును, పెక్కు యిక్కట్టులకు బాల్పడు చున్నా రనుట ముమ్మాటికిని నిజము.

ఇటీవల వీరిలో సంస్కరణాభిలాషు లగు గొందరు యువకులు బయలుదేరి మదరాసు రాజధానిలోని నర్సారావుపేటయో లేక నర్సాపురంలో గాబోలును గొంద రీ జాతీయు లున్నట్లు విని అటకేగి గనియున్నారు. ఆచార వ్యవహారము లొకేరీతి నున్నను గృహనామములును, గోత్రనామములును భేదించినవట. వారక్కడ విద్యా వినయ సంపన్నులై, ధన కనక వస్తువాహన సమృద్ధితో నున్నను యాచనా వృత్తితోడనే జీవయాత్ర గడపుచున్నారట. పురుషులేగాక స్త్రీలును విద్యావతులై వరలుచున్నారట. అందుచే నట కేగిన వారు వారితో పరస్పర సంబంధ బాంధవ్యముల విషయమై సంప్రదించగా వారతి ప్రమోదముతో వారల యామోదమును దెలిపినారట. తత్కారణము వల్ల వారలతో సంబంధ బాంధవ్యముల జరిపి అసమ వివాహాది ఘోర బాధలనుండి విముక్త లగుటకు (సిద్ధులు) యువకులు ఉత్సహించుచున్నారు.

ఈ 'సిద్ధుల'యొక్క వర్ణోత్పత్తి యెట్టిదియో ఏ య్యే ప్రాంత
లలో నివసించి యున్నారో సకారణముగ జెప్పెడి వారింతవరకును గ
పించుటలేదు. ఈమధ్య శ్రీశైవవాఙ్మయ పరిశోధనాధ్యక్షులును,వీరశై
గురుకుల విద్యాలయాచార్యులును, 'విభూతి' పత్రికా సంపాదకు
అగు వేద, కావ్య, స్మృతి, దర్శనతీర్థ, ధర్మాచార్య, విద్యా
విద్యారత్నేత్యాది బిరుదాభిరాములగు పండిత చిదిరెమఠము
భద్రశర్మగారు 'సిద్ధేశ్వరపటము' ను విరచించినారని విని అమందాన
మును బొందితిని. దీనినిబట్టి "సిద్ధులచరిత్ర" శ్రీవారివల్ల సా
ముగ నెరుగబడు నను దృఢవిశ్వాసముతో నున్నాను.

శ్రీ శర్మగారి విఖ్యాతపాండిత్య ప్రాగల్భ్యమును, అకు
శైవవాఙ్మయ పరిశోధనాదక్షతయును వీరు శ్రీ కాశీలో విద్యా
సము గావించునప్పటినుండియును పత్రికాముఖమున నెరింగియేయున్నా
ను. వీరు ఇటీవల సికిందరాబాదులో నెలకొల్పిన శ్రీ వీరశైవ గు
కులము శైవభారతీ గ్రంథాలయము, విభూతిపత్రిక మున్నగు సత్ప్ర
స్థాపనముల విషయమునుగూడ నెరింగియున్న వాడనగుటచే మన
రథము సిద్ధించుట కేమాత్రమును సంశయము లేదని తలంచుచు మిక్కి
యానందాక్రాంతహృదయుడనై యున్నాడను. కాన విస్మృతవాఙ్మ
మున విలీనముగానున్న "సిద్ధులచరిత్ర" ను సహేతుకముగ సమ
ముగ పరిశోధించి ఏతత్పత్రికాముఖమున బ్రకటించి పూర్వోక్తరీతి
స్వల్పసంఖ్యాకులుగ నుండుటచే వైవాహికాదిక్రియలలో అత్యంత క
నష్టములకు లోనగుచున్న 'సిద్ధు' లకు ప్రచ్ఛన్ననామములతో
గుచు బహుళసంఖ్యాకులుగ నున్న అన్యప్రాంతీయ సోదర సంఘము
లతో సమ్మేళనమయి అఖిల సౌఖ్యానందముల బొందునట్లు గావిం
భారము శ్రీవారిపై గలదని వినమ్రుడనై విన్నవించుచున్నాను. శ్రీవా
గాక మరెవ్వరయినను సరే 'సిద్ధుల' విషయమై తెలిసినవారెల్లరు
ఏతత్పత్రికాముఖమున బ్రకటించి ఈ సంఘాభివృద్ధికి దారిజూపిన
వారికి సంఘమంతయు కృతజ్ఞతాబద్ధమైయుండగలదు. ఏతద్విషయ

ప్రమురింపబోవు వ్యాసరాజములకై చంద్రచకోరన్యాయముగ ప్రతీక్షించుచుండును. *

* అత్యంత ప్రాచీనకాలమున 'సిద్ధ' సమూహమొకటి హిమవత్ప్రాంతమున శివపూజాకైంకర్యముల నొనరించుచు ప్రసిద్ధి నందినది. విశ్వావసు మున్నగువారు సిద్ధ కులమునకు జేరినవారని పెద్దలు వచించిరి. శ్రీ జగద్గురు రేవణసిద్ధ మరులసిద్ధాదిమహాచార్యులు మాత్రము వీరశైవమత మూలస్థాపకులుగ శివాంశ సంభూతులుగ సుప్రసిద్ధులైయున్నారు. కాని విశ్వావసువులతో సంబంధమున్నట్లు తెలియదు. రేవణసిద్ధాములు మొదలుకొని నేటివరకును తద్వంశీయగురుపరంపరలోని మఠాధికారులగు మాహేశ్వరులు వీరమాహేశ్వరుల మనియును జంగములమనియును వ్యవహరించుచున్నారు. కాని సిద్ధులమని చెప్పుకొనుట కని విని యెరుగము. సిద్ధుడనగా సామాన్యమైన శివయోగసాధనలను వశపరచుకొని నిరామయుడై స్వతంత్రముగ నుండువాడు. ఈ సిద్ధశబ్దము జాతివాచకము కాదు. మేము ప్రకటించిన పటము సహజసిద్ధులగు రేణుకాది పంచాచార్యులకు జెందినదై వీరశైవ గురువంశ పరంపరాదులను దెలుపు "గోత్రసూత్రపటము" అయ్యున్నది కాని "సిద్ధులని" చెప్పబడు యాధునిక జాతీయులను గూర్చి కాదు.

ఇక వ్యాసకర్తగారు చర్చించిన "సిద్ధులు" ఎవరో చాల పరిశోధించినగాని తెలియుటకు వీలు లేదు. నర్సారావుపేట వైపునను నాకు దెలిసినంతవరకు "సిద్ధులు" లేరు. సత్తెనపల్లితాలూకా పరిసర ప్రాంతములందు "మందులవారు" అను తెగయొకటి కలదు. వ్యాసకర్తగారు పేర్కొన్న లక్షణములు కొన్ని వీరి యందుగలవు. మందులను చేయుట విక్రయించుటలో వీరి నైపుణ్యము సుగణ్యము. వీరిలోగొందరు జోలెవేసి యాచించుటయు కలదు. వీరుశివమతస్థులై చిరకాలమునుండి లింగధారులై జంగమ మఠాధీశ్వరులవలన శివదీక్షల నందుచుండుట ప్రసిద్ధమే కాని వీరి ప్రస్తుతాచారములు కడు విపరీతముగనున్నవి. గరుడాచలపాలెము మున్నగు గ్రామములలోని కొందరు కొంతమట్టుకైనను శివమతాచారములు గలిగి యింకను అభిమానము గలిగియుండుట గాంచనగును.

తూర్పుగోదావరి చివర నర్సాపురమువైపునను "సిద్ధులు" నాకు గన్పడలేదు.

కర్నాటకదేశమున సిద్దరు (సిద్ధులు) కలరు. వారచ్చముగా శివభక్తులేకాని యుగ్రజాతీయులుకారు. వారి వంశమువారు కొందరు ఆంధ్రదేశమునకు వచ్చినట్లు తెలియుచున్నది. మహారాష్ట్రప్రాంతమున "సిద్ధీ" గుసాయీలును, ఉత్తరదేశమందలి "సిద్ధియా"లును ఎవరో ఎటులు పెరిగిరో వాఙ్మయమేమో తెలిసికొనవలెనన్నచో గట్టిగా వ్రియప్రయాసలకు వెనుదీయక పరిశ్రమించవలసియున్నది. ఆయా జాతీయులు బద్ధకంకణులైననాడు పండితులు పాల్గొనక మానరు.

—సంపాదకులు, విభూతి.

ఓం.

# ఏకలవ్యుడు

కె. సాంబసిద్ధయ్యగారు

ఉపాధ్యాయులు.



తే. గీ. తప్పు యిదికూడ దిది సేయు టొప్పటంచు
బలుకుటకు నోరులేని యా ప్రతిమచెంత
నద్వితీయ శస్త్రాస్త్రవిద్యను ధరిత్రి
నేర్చుటలు యేకలవ్యుడా! నీదె సొమ్ము.

ఉ. ఎంతపరిశ్రమమ్ము సలిపి యీవు గడించిన యస్త్రవిద్య నీ
కింతయు లాభకారి యయి యేర్పడకుండెను పైనిపెచ్చు నీ
కెంతయు నష్టకారియయి యేర్పడె నీదగు చేతివ్రేలు పో
గంతికు మూలమయ్యెగద? గాండివమ్ము ధరియింపకుండగా.

ఉ. స్వార్థపరాయణుండయిన వాసవసూను యభీప్సితార్థమ్ము
సార్థక మొందసేయుటకు సల్పెను ద్రోణుడు యుక్తి, దానిలో
నర్థమెరుంగకుండగ సమర్పణజేసితి ద్రోణుచిత్తప్రీ
త్యర్థము నీదుయంగుళిని దక్షిణగా నిటు లుండనేర్చునే?

చ. కటకట నీదుచేతిపయి గాయమునుండి తదేకధారగా
సొటసొట జిమ్ము రక్తమును జూడ గిరాతున కైనకంటిలో
దటుకున నీరు గ్రమ్మ పరితాపమనస్కునిజేయు కుంభజుం
డెటువలె నీదు దక్షిణగ్రహించుటకై దలపోసియుండెనో.

చ. పొలుపుగ బ్రాహ్మణుం డగుచు బుట్టగనేమి? సమస్తశాస్త్రచ
ర్చలు సలుపంగనేర్చినను సార్థక మేమి? దయార్ద్రబుద్ధిలో
దలపని రాతిగుండెగల ధర్మవిదూరుడు ద్రోణుకన్న నీ
దలఘుతరంపుజన్మ వసుధాతలమందున నేకలవ్యుడా!

తే. గీ. అస్త్రవిద్యను నీకు నధ్యాపనమ్ము
సేయకుండుటెగాక నీ చేతివ్రేలు
దక్షిణనెపమ్ముచే వితథ మ్మొనర్చి
పార్థు బరితృప్తి నొందింప ఫల మదేమొ?

ఉ. గాండివికోర్కి దీర్చుటకు గాన్మక దేశికుడిట్లొనర్ప దా
పాండవ కౌరవాన్వయము పజ్జన జేనెడు పొట్టకూటికై
యుండిన మేలునే దలచియుండెనుగాని తలంపడయ్యె బ్రి
హ్మాండము ముందు దూరునని మానసమందున సుంతయేనియుఁ.

క. నీవును పార్థుడు నాతని
కే వగ గనుగొన్న శిష్యులేకద తలపఁ
యీావిధి నిను వంచించుట
కే విధి దలపోసె న్యాయ మే నది ద్రోసెఁ.

చ. ఎవనికి మేలుగూర్చుటకు నెంచెనొ యాతనిచేత ద్రోణు డా
హవమున దీవ్రబాణనిచయమ్మున నొచ్చెను వ్రాలె ధాత్రిపై
నెవడొనరించు పాపఫల మెన్నిభవంబులకైన వడ్డితో
నవనినివాడెపొందవలె న్యాయము యెన్నటికేని దప్పునే?

తే. గీ. కుట్రచే నాత్మలాభము గోరి నిన్ను
వంచనము సల్పినట్టి కుంభజునికన్న
నీకు శస్త్రాస్త్రవిద్యల నేర్పినట్టి
ప్రాణరహితమౌ ద్రోణుని ప్రతిమ మేలు.

క. అడిగియు నడుగకమునుపే
తడయక నీచేతి వ్రేలు దఱిగి ముదముచే
నిడినట్టి త్యాగమూర్తి వి
పుడమిని నినుబోలు పుణ్యపురుషులు గలరే?

తే. గీ. నీదు మృదుహస్తరక్త మీా నేలపైన
బారి నీరును యెరువుగా మారుకతన
నీ యశోలత పుడమిపై నేటివరకు
లలితమౌ జీవకళలచే నిలువనేర్చె.

ఉ. నీ గురుభక్తి లోకమున నిల్చెను శాశ్వతరూపుదాల్చి నీ
త్యాగసుశీలతఁ గని సుధాంధసు లందరు మెచ్చుచుఁ నభో
భాగమునుండి దివ్యసుమవర్షమునఁ నినుముంచి యెత్తగా
సాగిరి నీవు ధన్యుడవు జన్మతరించెను యేకలవ్యుడా!

# ఆత్మోద్ధారము

లోకమందలి ప్రతిమనుష్యుడును తానీ దేహమును ధరించుటకు కారణమేమో? ఎట్లుండిన తాను పరిశుద్ధుడౌనో? విచారించుచుండ వలయును. పరమ కృపాళు వగు శ్రుతిదేవి ఆత్మోద్ధారమునకై నానా విధములగు ఉపాసనలను మనకు చూపించియున్నది. భగవదంశీభూతులగు ఆయా మతాచార్యులు ఆ యుపాసనలం దొక్కొక దానినే బలపరచుచు అనేక ఆత్మల నా యుపాసనామార్గమున నడపి ఎన్నడును చెడని సౌఖ్యమును కలుగజేసియుండిరి.

ముఖ్యముగా మానవులకు రెండుమార్గములు కల్పింపబడి యున్నవి. ఒకటి శ్రేయోమార్గము, మరియొకటి ప్రేయోమార్గము. ఈరెండు మార్గములు జీవుని తమతమ వైపు ఈడ్చుకొను చుండుటవలన చాల బలిష్ఠమార్గములై యున్నవి. పుణ్యాపాపానుగుణముగ ఆత్మ అనేక దేహముల ధరించుచు,ఆ దేహములందలి క్షణికములగు నింద్రియ సుఖముల ననుభవించుచు ఐహిక సుఖమే మనుష్యుని ధ్యేయమని నమ్మి ప్రపంచానుభవ మొనర్చుచు సంసార చక్రమున దిరుగుచుండుటయే ప్రేయోమార్గము. స్రక్చందనాది విషయసౌఖ్యము లన్నిటియందును హేయబుద్ధి గలిగి ఆత్మ యొక్కటియే నిరతిశయ ప్రేమకు ఆస్పదము గాని మరియొండే పదార్థమును ప్రీత్యాస్పదము కానేరదను దృఢ నిశ్చయబుద్ధితో పరమాత్మని నుపాసింపుచు జ్ఞానాగ్నిచే జన్మహేతు వగు పాపరూప తృణరాశిని కాల్చి బూడిదజేసి దేహావసానమందు నదులు సముద్రమును జేరునట్లు పరమాత్మనిజేరి సుఖ పరిణామి యౌటయే శ్రేయోమార్గము.

ఈ రెండు మార్గములందు ప్రేయోమార్గము ఆత్మను బలాత్కారముచేతను, ఆపాతతః రమణీయమగు పదార్థజాలముచేతను, తన వైపున కీడ్చుకొని సంసారకూపమున ముంచుచున్నది. శ్రేయోమార్గము

త్మను వెంటదీసికొనివెళ్ళి విరజానదియందు స్నానముజేయించి
టముపేసి తీసిన బంగారమువలె, రాహువుచే విడువబడిన చంద్రుని
లె పరిశుద్ధమొనర్చి స్వర్గమును జేర్చుచున్నది. ఇట్లీ రెండు మార్గ
ములు ఆత్మను తమవైపున కీడ్చుకొనుచున్నవి. ఈ బిగింపునందు ఏ
హాత్మ ధైర్య, గాంభీర్య, ఔదార్యాది సద్గుణములచే నొప్పి గురు
పకు పాత్రమవుచున్నదో అట్టి ధీరాత్మ ప్రేయోమార్గమును మర
చి శ్రేయోమార్గముననే ప్రయాణమును సాగించుచున్నది. ఇట్లు
క విషయలంపటకు లోనైన మందాత్మ అపథ్యమునే కోరు రోగివలె
్రేయోమార్గమును వదలి ప్రేయోమార్గముననే ప్రయాణము గావించు
న్నది. ఈ యిగ్గులాటనుగురించియే.

"అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవప్రేయస్తే
ఉభే నానార్థే పురుషం సినీతః।
తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి
హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే।
శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతస్తౌ
సంపరీత్య వివినక్తి ధీరః।
శ్రేయోహి ధీరోఽభి ప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమా ద్వృణీతే॥"

అని కఠోపనిషత్తు ఈ శ్రేయః ప్రేయోమార్గ స్వరూపముల
బాగుగా వర్ణించియున్నది. ఆత్మను ప్రేయోమార్గమున అడుగిడకుండు
నట్లు అడ్డు పెట్టుటయు, శ్రేయోమార్గమున ప్రవర్తించునట్లు ఆచరించు
టయు ప్రతియొక మతాచార్యుల ధ్యేయమై యున్నది. ఇందుకై అనేక
ముపాసనలు జగత్తునందు ఏర్పడియున్నవి.

వీరశైవ మతస్థాపకులగు శ్రీ రేణుక భగవత్పాదాచార్యులు
ఆత్మలను ఈ ప్రేయోమార్గమునుండి మరల్చి శ్రేయోమార్గమును
బట్టించుటకై లింగోపాసనను కనిపెట్టి యున్నారు. ఎవడీ లింగోపాసనను

యొనర్పడో వాడు రాగద్వేషాదులతో గూడిన ప్రేయోమార్గ
పట్టునేగాని శ్రేయోమార్గమును పట్టజాలడు. ఈ లింగోపాసన
హిరుపాసన, అంతరుపాసన, యని రెండువిధములు. ఈరెండు ఉపా
యందు ఎవడు పరిణతు డవునో వాడు.

'అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖా
ప్రముచ్య ధూత్వా శరీరం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవా

లింగోపాసన నొనర్చిన యోగి గుఱ్ఱము వెండ్రుకలను వి
నట్లు వెనుక జేసిన పాపరాశిని విదల్చుకొనును. చంద్రుడు రాహ
నుండి విడివడి పోవునట్లు ఈ మాయాశరీర సంబంధమునుండి వి
కృతకృత్యుడౌనని ఛాందోగ్యమునందు జెప్పరీతిగ శ్రేయోమార్గ
ప్రవేశించి భ్రమర కీట న్యాయానుసారముగ లింగాంగ సామ
సిద్ధిని పొందుచున్నాడు. ఇట్టి శ్రేయోమార్గసాధన మగు లింగోపా
నొనర్పనివాడు,

'శివార్చన విహీనో యః పశురేవ న సంశయః
స తు సంసారచక్రేఽస్మి న్నజస్రం పరివర్తతే.

ఎవడు బ్రహ్మపదవాచ్యమగు శివలింగము నుపాసించుటలే
వాడు పశు వనిపించుకొనును. ఇది నిశ్చయము. మరియు ఉపా
శూన్యుడగు మానవుడు జరామరణములతో గూడిన సంసారసాగ
సుడియందు పడి కొట్టుకొన వలసి వచ్చునని శివాగమ ముద్ఘోషి
చున్నది. ఇట్టి శ్రేయోమార్గ సాధనమగు శివలింగోపాసనయు,

'అంతర్యాగో బహిర్యాగో ద్వివిధం తచ్ఛివార్చనమ్ ।
ముఖ్యాచాఽఽభ్యంతరీ పూజా సాచ బాహ్యార్చనోదితా.'

జ్యోతిర్లింగోపాసన, బహిర్లింగోపాసన, యని రెండువిధము
వీనియందు జ్యోతిర్లింగోపాసనయే ముఖ్యమైనది. బాహ్యలింగోపా
అందుకు సహాయమైనది.

'యే ధారయంతి హృదయే లింగం చిద్రూప మైశ్వరం
న తేషాం పునరావృత్తి ర్ఘోరసంసార మండలే ॥

అని శ్రీ రేణుక భగవత్పాదాచార్యులు హృదయాకాశమున శివలింగమును విడువక ఉపాసించు శక్తిని ఎవడు పొందియున్నాడో వాడు సంసార సాగరమునుండి దాటు నని అనుజ్ఞ యొసగి, ఇట్టి అంత ర్లింగోపాసనయొక్క అభివ్యక్తి కొరకై

'అంతర్ధారయితుం లింగ మశక్త శ్శక్త ఏవవా ।
బాహ్యంచ ధారయే ల్లింగం తద్రూపమితి నిశ్చయాత్ ॥

గురునిచే సంస్కార పూర్వకముగా ననుగ్రహింపబడిన ఇష్టలింగ మును జ్యోతిర్లింగ స్వరూపమని ధ్యానించుచు, పూజసేయుచు వచ్చిన అంతర్ధారణ శక్తియు వృద్ధినంది మాయికమగు జీవభావము క్షయించుచు శివభావము స్థిరపడును. హేయమగు ప్రేయోమార్గముచే వెనుదిరిగి ఉపాదేయమగు శ్రేయోమార్గమున ప్రయాణము గావించిన,

'ఆత్మన్యేవ విలీయంతే సరిత స్సాగరే యథా'

అని శ్రీ రేణుక భగవత్పాదులు ఉపదేశించినట్లు సముద్రము నందు నదులన్నియు కలిసిపోవునట్లు జగద్వ్యాపారము లన్నియు పర శివలింగము నందైక్యమై సర్వము శివమయమై కన్పడును. అందువలన శ్రేయోమార్గమే జీవాత్మ నుద్ధరించ జాలియున్నదనుట నిర్వివాదము.

(పంచాచార్యప్రభనుండి)

# ఈశ్వరా!

ఇంద్రగంటి వేంకటరమణమూర్తిగారు.
(ఆంధ్రవాఙ్మయ సేవాసమితి)



శ్రీరజతాద్రి కందరసుశీత హిమోపలజాత, వాహినీ
తీరవిహార, శాణనవదీధితి రత్నవితర్ది, సౌరభా
పార మరందగంధవహపాటల మల్లిక బిల్వచంపకో
దారకుడుంగ ఛాయల విహార మొనర్తువుగాదె ఈశ్వరా!

మంగళజాహ్నవీ ప్రణయమానస దర్పణబింబిత ప్రకా
శాంగ మనోజ్ఞమూర్తివి విశాలజగత్త్రయ దీనరక్షణా
పాంగ కృతార్థకర్ముఁడవు భక్తిసుధారసపాన మత్తచి
త్తాంగనిరోధన క్రమనిదర్శుఁడ వౌదువుకాదె ఈశ్వరా!

కనులర మోడ్పఁగ నిన్ను గైకొనుటకై గాఢాంధ నేపథ్యవీ
థిని పద్మాసన చంద్రచూడ విలసద్దీవ్యద్భుజంగాంగభూ
షణ పంచానన జాహ్నవీమకుట వజ్రవ్యాఘ్రచర్మాంబరా
వనహాసాంచితువై గనంబడుదు వాప్యాయంబునన్ ఈశ్వరా!

లసదాకాశవిశాలరంగమున కైలాసమ్ము కల్పద్రుమ
ప్రసవౌఘాంచిత వాయుపూతమగు దేవస్థానము న్నద్రిరా
జ సుతాభాసితదివ్యలింగమును విజ్ఞానప్రభావ ప్రకా
శ సముత్కీర్ణమనీషినై నిలిపి పూజల్ సేతు నిన్నీశ్వరా!

మానవజన్మమెంత యసమాన్యమొ బుద్ధిగ్రహింప లేని య
జ్ఞాన తమమ్ముద్రోయుము ప్రశాంతమునిల్పుము మానసాబ్జరే
ఖా నిలయమ్మునందు నను బ్రహ్మపదార్థము గుర్తెరుంగు వి
జ్ఞాన విశేషమిమ్ము ధిషణమ్ము వినిశ్చల మొంద నీశ్వరా!





శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర

శ్రీ జగద్గురు నాగలూటి భిక్షావృత్తి శివాచార్య మహాస్వాములవారు

( శ్రీశైల మల్లికార్జున వ్యాసము చూడుడు. )



శ్రీశైల మల్లికార్జున దేవాలయము

(ద్వాదశజ్యోతిర్లింగములు)

# ౨ శ్రీశైల మల్లికార్జున జ్యోతిర్లింగము

**మఠంసిద్ధి వీరయ్యగారు ఉపాధ్యాయులు ***



శ్రీ చెన్నపురి రాజధానిలోనున్న కర్నూలు మండలమునందలి కృష్ణానదీతీరమున శ్రీశైల పర్వతము సుప్రసిద్ధము. దీనికి దక్షిణ కైలాసమని ప్రతీతి. మహాభారతము, శివపురాణము, పద్మపురాణాదుల యందు యీనగ ప్రశంసగలదు. శ్రీ నగమునకేగి శివలింగ పూజ సల్పించినవారికి, అశ్వమేధ యజ్ఞ మొనరించిన పుణ్యము లభించునని, మహాభారతమున వ్రాయఁబడియున్నది. మఱియు, శ్రీశైల శిఖరసంద ర్శన మాత్రమున, సర్వకష్టములు దూరమగుటయేగాక, మరణానంత రము, శాశ్వతసుఖము ప్రాప్తమై జనన మరణాదులు లేక,ముక్తిగాంచు రని, ధర్మగ్రంథములలో.

శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే-దుఃఖం హి దూరతో యాతి। సుఖమాత్యంతికం లభేత్-జననీగర్భసంభూతం కష్టం నాప్నోతి వై పునః.

ఈ స్థాన సంబంధమగు పౌరాణిక యితిహాస మొకటికలదు:— శంకర భగవానుని సూనులలో శ్రీగణేశుఁడును, శ్రీకార్తికేయుఁడును వాహార్థమ్ము వాదులాడ దొడగిరి. గణపతి నావివాహము ప్రథమమున జరుగవలెననియు, కుమారస్వామి తనవివాహమే మున్ముందు జరుగవలె ననియు పలుకుచుండిరి. చిట్టచివరకు శ్రీభవానీశంకరులు యీవిధముగ సమ్మానించిరి. "యిద్దరు తనయులలో నెవరు మొదట పృథ్వీ ప్రదక్షిణము నొనరించెదరో వారి వివాహము ప్రప్రథమమున గావించగలను" ఈ సమ్మాన మాలకించినతోడనే కార్తికేయస్వామి భూప్రదక్షిణార్థము

---

* విషాదవార్త:—విభూతి పత్రికలో నిదివరకు వ్రాయుచుండిన మహర్షి, ద్వాదశజ్యోతిర్లింగములు మున్నగు వ్యాసముల ప్రకటించిన బి. ఎం. మహంతయ్య గారు చిన్నప్రాయమున గతించిరను ఘోరవార్తను దెలుపవలసి వచ్చినది. సిద్ధి వీరయ్య గారి చిరంజీవుఁడే యీ వ్యాసకర్త. పుత్రుని యవశిష్ట కార్యమును నిర్వహింపవలసిన వృద్ధ జనకునకు సంభవించుట విపరీతముకదా! శివాజ్ఞ. —సంపాదకులు.

ప్రియాణోన్ముఖుఁడయ్యెను. శ్రీ గణేశస్వామి తన స్థూలకాయము
నడువలేక నిలిచెను. ఎట్లుపరుగెత్తగలడు? అయినను అతని శరీ
స్థూలమైనదే కాని బుద్ధి స్థూలమైనదికాదు. తత్క్షణమయొకయు
వారి బుద్ధికి పొడసూపినది. తన మాతయగు పార్వతీదేవిని పిత
మహేశ్వరులను నాసనము నుపవిష్టులగావించి సప్తపర్యాయము
ప్రదక్షిణ మొనరించి విధిప్రకారము పూజించెను.

"శ్లో॥ పితోశ్చ పూజనంకృత్వా । ప్రక్రాంతిం చ కరోతియః
తస్య వై పృథ్వీజన్యం ఫలం భవతి నిశ్చితం॥
(సంభవ ఖండము ౪ అ ౧౯ శ్లో॥)

ఉపర్యుక్త శ్లోకానుసారము పృథ్వీప్రదక్షిణ పుణ్యమ
పొందుట కర్హుడు శ్రీ గణాధిపతియయ్యెను. కార్తికేయస్వా
భూప్రదక్షిణ మొనరించి స్వస్థానము జేరెను. అంతకు పూర్వమే
రూప ప్రజాపతి, కుమార్తెలలో సిద్ధి, బుద్ధి, యను కన్యలతో
గణేశుని వివాహము జరిగినది. మఱియు సిద్ధియను కన్యయందు క్షే
యను పుత్రుడును బుద్ధియను కన్యయందు లాభమను పుత్రుడును
గిరి. కలహభోజనుఁడగు దేవర్షి నారదుఁడు కార్తికేయస్వామికి జరి
వృత్తాంతమంతయు నివేదించెను. అంత శరజన్ముఁ డాగ్రహోదగ్రు
పితృసందర్శన మొనరింపకయే యలుకతోఁ గ్రౌంచపర్వతమున కే
శ్రీ భవానీశంకరులు నారదమహర్షి నంపి రాయబారములు జరి
కాని నారదుని సమాధానవాక్యములకు కుమారస్వామి తుష్టుఁడు
పోయెను. చివరకు మాతృమూర్తి హృదయవ్యాకుల మతిశయించె
శంకర భగవానునిఁ దోడ్కొని జగన్మాతయగు పార్వతీదేవి క్రౌం
పర్వతమునకుఁ బయనమయ్యెను.

మాతాపితరుల యాగమనవార్తనుఁ దెలిసికొని షడాననస్వా
యటనుండి పలాయన మొనరించి మూడు యోజనములదూరమ
నివాస మేర్పరచుకొనియెను. శ్రీ శంకరభగవానుడు పార్వతీయుక్తు
క్రౌంచపర్వతమున జ్యోతిర్లింగాకారమున విరాజమానుఁడయ్యె
నాటినుంటి శ్రీ మల్లికార్జున జ్యోతిర్లింగ మను పేరఁ బ్రఖ్యాతిగాంచె

రెండవ యితిహాసమును శ్రీ మల్లికార్జున జ్యోతిర్లింగ సంబంధ మును యీ దిగువ నుల్లేఖింపఁబడుచున్నది.

ఒకానొక సమయమునం దీ క్రౌంచపర్వత సమీపమున చంద్ర గుప్త మహారాజుగారి రాజధానియుండెను. రాజుగారి కుమార్తె యేదో విశేష విపత్తునుండి తప్పించుకొనుటకై పితృమందిరమును వదల వలసి వచ్చెను. పర్వత విపినములే యా కన్యకు శరణ్యములయ్యెను. అచటి గోపాలకులే బంధుమిత్రులైరి. వారివలనఁ గందమూల ఫలాదులచేతను గోక్షీరముచేత నుదరపోషణఁ గావించుకొనుచు కాలక్షేపమొనరించు చుండెను. గోపాలకు లామె కొక సుందర కపిలధేనువును స్వాధీన పరచి యుండిరి. కాని గోక్షీరములు మాత్రము మెవరో రహస్యముగా పిదికి కొనువారు. ఒకనాడు ధేనుదుగ్ధముల గైకొను తస్కరుని దైవవశమున యా కన్యగాంచెను. దొంగను పట్టుటకై పరుగెత్తి చూడ నద్భుత దృశ్యము గాంచెను. తస్కరునికి మారుగా శివలింగ మచట నయన గోచర్యమొనరించెను. రాజకుమారి యా శివలింగమున కొక మందిరము నిర్మింపజేసెను. ఈ లింగమే మల్లికార్జున లింగమని ప్రఖ్యాతమైనది. మందిర నిర్మాణమును గుఱించి శిల్పకళల ననుసరించి పురాతత్త్వవేత్తలు మందిర నిర్మాణ కాలము ద్విసహస్రవర్షములకు పూర్వమేనని నిర్ధారణ చేసినారు. ఈపవిత్ర క్షేత్రమునకు గొప్ప గొప్ప రాజాధిరాజులు దర్శ నార్థ మరుగుదెంచెడివారు. ఇప్పటికి (౪) వందల సంవత్సరములకు పూర్వము విజయనగర సమ్రాట్ శ్రీకృష్ణదేవరాయలవారు విజయ మొనరించి స్వర్ణశిఖర యుక్త సుందర మండప నిర్మాణము గావించి యుండిరి.

అతని యనంతరము ౧౫౦ సంవత్సరముల పిమ్మట హిందూ మతోద్ధారకులు ఛత్రపతి శివాజి మహారాజు శ్రీశైలేశ్వర సందర్శ నార్థము విచ్చేసి ఒక ధర్మశాల నిర్మించి తనపేర నొక లింగప్రతిష్ఠ గావించినారు. శివరాత్రి సందర్భము నం దిచట గొప్ప తిరునాళ్ళ జరు గును. అరణ్యము, కొండలు జనాకీర్ణమై మహదానంద సంధాయకమై యలరారును. శ్రీ మల్లికార్జునస్వామి ఆలయ సమీపమున జగదంబ

యగు పార్వతీదేవ్యాలయమున్నది. ఈ మహాదేవిని "శ్రీశై
భ్రమరాంబ" యని వ్యవహరించెదరు.

శ్రీశైలము జేరుటకు తూర్పుదేశస్థులు బెజవాడ గుంటూ
మీదుగను, నిజాంప్రాంతీయులు హైదరాబాదు మహబూబునగరు
కర్నూలునుండియును, పశ్చిమదేశస్థులు గుంతకల్ ద్రోణాచలం మా
మునను, నంద్యాలస్టేషనుకు లేక ఆత్మకూరుకు చేరవలసియుండు
తర్వాత ౨౦ మైళ్ళు మోటారుద్వారా ఆత్మకూరును, అట
యెద్దులబండిమీద నాగలూటిని జేరవలెను. ఇచ్చోట శ్రీ మహా
వీరభద్రస్వాముల దర్శించి ముందు ౩౧ మైళ్ళు కొండలమార్గము
మిట్టపల్లముల నరణ్యమును దాటుచు దొంగలకు జంకుచు మధ్యమధ్య
మజిలీలలో విశ్రమించుచు కష్టతమముగ శ్రీశైలమునకు జేరవలసి
డును. ప్రస్తుతము తస్కరబాధ తగ్గినది. కొన్ని చోటులలో జల
దొరకుచున్నది కాని సరియైన యనుకూలములేనందున ఆత్మకూ
నుండియే కొందరు జలాదులను గొంపోదురు. శ్రీ మల్లికార్జుని సన్ని
నుండి యైదుమైళ్ళు క్రిందికిదిగి పాతాళగంగా (కృష్ణానదీ) స్నానమా
రించి శ్రీ మహాశివరాత్రి పవిత్రదినమున శ్రీ మల్లికార్జునిపూజ
తరించుభాగ్యము పుణ్యాత్ములకేకదా లభించుట?

[వీరశైవ మతాచార్యుడును జగద్గురు శ్రీ పండితారాధ్యు
యవతార స్థానమగుటవలనను వీరశైవ సద్భక్త మహనీయు లిచ్చో
నివసించి తపమాచరించుట వలనను శ్రీ శైల మహాక్షేత్రము వీరశై
లకు ముఖ్యాతిముఖ్య మైనది. శివరాత్రినాడు ఇచ్చోట జేరెడు
శైవుల సంఖ్య మరేక్షేత్రమునను గానుపించదు. పండితారాధ్య
సూర్య సింహాసన పీఠాధిపతుల కీ క్షేత్రము మొన్నటివరకును నివా
భూమియైయుండెను. రాజాధిరాజులచే పాదపూజలనంది మహాశై
వముగ శ్రీశైలక్షేత్ర సార్వభౌములవలె వెలింగిన వీరమాహేశ్వ
శివపూజా తపోనుష్ఠాన గరిష్ఠత నేడు వెలవెల వారుచున్నది. నా
లూటి, ఆత్మకూరు, నంద్యాలలో సైతము, శ్రీగిరిరాజ సూర్యసిం
సనము వారి పండితారాధ్య శాఖామఠములు సుప్రసిద్ధములై ని
హానుగ్రహముల గావించుచుండెడివి. ఇటీవల భవులగు పరమలీయ

రాక్రమణమే కాదు. ప్రభుత్వము వారి (బోర్డువారి) స్వంతానుభవము
గాక సైతము శ్రీశైలక్షేత్రము వచ్చినదట. ఇక హరిజనప్రవేశము
అన్నగు సంస్కారములతో గాబోలు బోర్డువారు మందిరము నుద్ధ
తురట! ఎన్నియో కష్టములపాలై మఠమందిర క్షేత్రాదులను
సంపాదించు కొనినవారును, తద్వంశీయులును. అన్నాహారములకు
సైతము నోచుకొనలేదు. బోర్డువారికి నేరుగ సులువుగ మఠమంది
రాముల ఔరసత్త్వము లభించినది. "బలాచ పృథ్వీ" కదా!

శ్రీశైలగిరిరాజ సూర్యసింహాసన పీఠాధిపతులు నేటికిని పరం
పరగ అవిచ్ఛిన్నముగ నా పీఠాధిపత్యమును వహించుచు సురక్షితముగ
న్నారు. ఆపీఠము క్రమక్రమముగా కొలదికాలమునుండి గుంత
ల్లున నెలసియున్నది. ప్రస్తుతాధిపతులు శ్రీజగద్గురు నాగలూటి
ప్రవృత్తి శివాచార్య మహాస్వాములవారను పేరు నందియున్నారు.
వారు జితాక్షులై మాయాదూరులై శిష్యోద్ధరణ సమర్థులై
యున్నారు. నేటి డెబ్బది సంవత్సరముల ప్రాయమునను వజ్రకాయు
లైన శ్రీవారిదర్శన మాంధ్ర వీర శైవులకును చాల స్వల్పముగ
లభించినది. వీరశైవుల పంచ పీఠములలో నిది వృషభగోత్రమునకు
చెందినది. శ్రీశైల మల్లికార్జున మందిర చిత్రమును శ్రీజగద్గురువుల
వారి చిత్రమును ఈ సంచికలో మరొకచోట ప్రకటింపబడినవి.
వానిని పాఠకులవలోకింతురుగాక !

సత్య మిటులుండగా మన తెలుగు దేశములోని యారాధ్యులు
శ్రీశైలపండితారాధ్యపీఠము తమదనియు వీరశైవులాక్రమించిరని
యును కొందరు భ్రమ గల్పించుచున్నారు. ఇది శుద్ధాబద్ధము. వీర
శైవాచార్యునికి గల యారాధ్యశబ్దమును పరిశోధించి తెలిసికొనజాలక
యిట్లు పొరబడుచున్నారు. శ్రీశైలపీఠముతో తెలుగునాటి యారా
ధ్యులకు వంశసంబంధము లేదనుట సుస్పష్టము. మున్ముందు ప్రకటింప
బడు "ఆచార్యపండితుడు - ఆరాధ్యపండితుడు" మున్నగు వ్యాసము
లలో నీ విషయములు సప్రమాణముగ చర్చింపబడగలవు.

—సంపాదకులు, విభూతి.

# భక్తజనాబాయి

విద్వాన్ కవిరత్న మేడేపల్లి లక్ష్మీకాంతంగారు



## ద్వితీయాంకము

(ప్రథమరంగము)

(నామదేవుని గృహమున రాధాబాయి గుడ్డలు కట్టుకొను చుండు

రాధా—కట్టా! ఈ దారిద్ర్యము మమ్మెన్నడు బాయునో
సకల దురితములకు మూలము లేమిడి యని నీతికోవిదు
వక్కాణింతురు. అరుగో! బాలు రాఁకలి కల్లలాడుచున్నా
పశుపక్ష్యాదులు సహితము తమ బిడ్డల క్షుద్బాధను దీర్పఁగ
చున్నవి. కాని, నాబోఁటి తల్లి పక్షికన్న నన్యాయముగదా
పతియో! ఎల్లప్పుడుఁ బాండురంగని వలలోఁ దగుల్కొని త
యుఁడై యున్మాదునివలె నుండును. అదేమన? "మాతానా
పితానాస్తి, నాస్తిబంధు స్సహోదరః, అర్థంనాస్తి గృహంనా
యని యేమేమో యుపన్యసించి, పుట్టించినవాఁడు పోషిం
నేరఁడా నీకేల యీచింత? నీవేల యీ యీషణత్రయము
మునిఁగెదవు? పురాకృత ఫలము నితరు లనుభవింతురా! ఏ
వారిదే. ఈ సంసార సాగరమునుండి దరిఁజేరుటకు శ్రీమత్పండ
నాథుని నామ సంస్మరణమే నావ, దిక్కు, ముక్తి అని మైమ
కో వెలచేరును. ఎట్లో లభ్యమైన దానితో నీపూట గడుపు
మన్నను, భక్తగోష్ఠి, గార్హస్థ్యధర్మమని, యావేళ కీవేళ క
రెవరినో తోడ్తెచ్చును. పేదవానికిఁ బిల్లలు, తద్దినానికిఁ గూరలు
అయ్యో! నేనేమిచేతు,

కొడుకులు వేళతప్పటను గూటికిన్నై వెతచెంది నిత్యముర్
నుడినడ నేడ్చినర్ గడకు సొజ్జెయు గంజియు నీయనట్టి నా
కడుపు ఫలింపకున్నఁ బరకాంతల బిడ్డల నాదరించుచుర్
ముడుపులు గట్టు భామలకుఁ, బుట్టఁగ నేర్తురె పుత్రులెవ్విధిర్.

అడుగో! నా నాథుఁ డూరకే వచ్చుచున్నాఁడు. నేనేమి చేయు దును? పాండురంగా! నీవెదిక్కు.

రామ—
జనా— } (ప్రవేశింతురు).

రాధా—(లేచి సాదరముగా నమస్కరించును)

రామ—సతీ! రాధాబాయి! నాకీదినమున నొక రత్నము లభించి నది.

రాధా—నాథా! రత్నమా! అటులైన నిఁక మన దారిద్ర్య మీడే రును.

రామ—ఒక మన దారిద్ర్యమేకాదు. ఈ రత్న దీపికచేత మన యజ్ఞా నాంధకారము సయితె మడుగంటును. (జనాబాయిని జూపించి) ఇదియేరత్నము, నారీరత్నము భక్తరత్నము. నా భాగ్యవశమున నాకీ సుశీలతోడి సద్గోష్ఠి లబ్ధమయ్యెను. భగవద్భక్తులు తన్ను సంకీర్తన మొనర్చుచోట కమలాకాంతుడు కాపురము సేయును. ఇఁక మనకేమి కొదువ.

రాధా—(ఆశాభంగముతో) మంచిది. అపరాహ్ణమైనది. చంద్రభాగ నదినుండి మంచినీళ్ళబుంగ యొక్కటి తెచ్చితిని. తండులములే తక్కువ.

రామ—వెఱ్ఱిదానా! నన్నడిగెద వేల? శ్రీమత్పాండురంగని నడిగి తెచ్చుకొమ్ము. పొమ్ము.

రాధా—చిత్తము. (జనాబాయిని జూచి) అమ్మా! యీ చాపపైఁ గూర్చుండుము. (నిష్క్రమించును.)

జనా—(కూర్చుండును.)

నామ—(సుఖాసీనుఁడై) జనాబాయీ !

తే॥ గీ॥ పిల్లుపీచర పల్లేరు బీడువోలెఁ
గామ క్రోధ లోభాది సంగతులు లేని
కేవలానంద సారహృత్క్షేత్రమందు
భక్తి బీజంబునాటి తత్ఫలము గందు.

జనా—మహాత్మా! తావక కృపావిశేషంబున ననుగ్రహింపఁబడితి

నామ—నీకు జ్ఞానమార్గమును, భక్తిమార్గమును బోధించెద విను

జనా—స్వామీ! భక్తియననేమి?

నామ—నిర్గుణ బ్రహ్మస్వరూపము సామాన్యజనులకు దుర్బోధ
శ్రద్ధయు, బుద్ధియు, జ్ఞానప్రాప్తికి సాధనములు. ఈరెం
బరస్పరాపేక్ష కలదు. శ్రద్ధచేఁ బరమేశ్వరజ్ఞానము కల్గినను ని
హకము గానేరదు. అదిమనస్సునకుఁ దెలియుటకయి, ని
శయము, నిర్హేతుకమునగు ప్రేమచేఁ బరమేశ్వరుని జింతిం
యును. దీనినే భక్తియందురు.

జనా—గురువర్యా! గ్రహించితిని.

నామ—అమ్మా! "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్ర
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" ఇ
ధర్మముల నన్నిఁటిని వదలి నన్నొక్కనినే శరణుపొందుము. న
నిన్ను సర్వపాపములనుండి విముక్తునిగావింతును. దురపిల్లకు
భగవద్గీత నుడువుచున్నది. మఱియు నీ గీత భగవద్భక్తుల
నాలుగు విధములుగా విభజించెను. వారిలో నర్థార్థి క్రిందిమె
లోనివాఁడు. వెండియుఁ బరమేశ్వరుని దెలిసికొనుటచే సం
దించు కొనవలసిన దేదియు లేక పోయినను నారదులవలె జ్ఞా
యితర నిష్కామకర్మల నాచరించునట్లు, కేవలకర్తవ్య బుద్ధిచే
బరమేశ్వరుని నెవఁడు భజించునో వాఁడే సర్వభక్తులలో
శ్రేష్ఠుఁడు. ఇదియే భాగవతపురాణమునందు, "శ్రవణం, కీ
నం, విష్ణోః, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, ధ్యా

నఖ్యమాత్మనివేదనం॥ అని తొమ్మిదివిధములుగాఁ జెప్పఁబడి యున్నది.

నా—గురువర్యా! సగుణోపాసన నిర్గుణోపాసనములం దెయ్యది యుత్తమోత్తమము? కొందఱు విగ్రహారాధన కూడ దందురేల?

గామ—

శ్లో॥ అక్షరావగమలబ్ధయే యథా స్థూలవర్తులదృషత్పరిగ్రహః
శుద్ధబుద్ధపరిలబ్ధయే, తథా దారుమృణ్మయశిలామయార్చనం.

అక్షరములను దెలిసికొనుటకై బాలురకు గుండ్రని ప్రాతి ముక్కల నక్షరములుగఁ జెక్కి చూపించు విధమున, శుద్ధబుద్ధ పరబ్రహ్మ జ్ఞానము కలుగుటకొఱకు, కొయ్యలు, మన్ను, ఱాలతోఁ జేయఁబడిన విగ్రహముల స్వీకరించుచున్నారు. కాన, విగ్రహారాధన మవశ్య మాచరణీయము.

నా—మహాత్మా! వ్యక్తోపాసన, అవ్యక్తోపాసనకుఁ గల భేదమేమి?

గామ—వ్యక్తోపాసనమనఁగా భక్తిమార్గము. అవ్యక్తోపాసన మనఁగా జ్ఞానమార్గము. ఇవి రెండు నన్నదమ్ములవలెఁ బూర్వాపరములై నడచి వచ్చుచున్న సాధనములు. ఈ రెంటిలో భక్తి యను సాధన మధికసులభము. మూలమునందు "ఏకమేవాద్వితీయమ్" అయిన పరబ్రహ్మము, ప్రేమయు, శ్రద్ధయు, మొదలుగఁ గల్గిన మనోమయములగు నయనములచే మనుజులకు గోచరమగును. ఈ స్వరూపమునే వేదాంతశాస్త్రమందీశ్వరుఁ డనుచున్నారు. ఒక హరియే అంతటను వ్యాపించినవాఁడుగను, సర్వసముఁడుగ నున్నాఁడు. అయినను భక్తులకొఱకు భగవంతుఁడు కొద్దివాఁడగు పాండురంగమూర్తి యగుచున్నాఁడు. "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే" "వాసుదేవస్సర్వమితి, స మహాత్మా సుదుర్లభః" ఒకసారి భక్తిమార్గము నవలంబించినపిదప నీజన్మముసఁగాకపోయినను మఱుజన్మమునను, ఆజన్మమున కానిచో మరుసటి జన్మమునను

నొకప్పుడు కాకపోయినను మఱియొకప్పుడైనను, ప
వాసుదేవాత్మకముగనే యున్నదను బరమేశ్వర స్వరూ
యొక్క సత్యమగుజ్ఞానము మనుజునకుఁ గల్గును. ఆ జ్ఞా
నతనికి ముక్తిలభించును.

జనా—మహాత్మా! భాగవతశ్రేష్ఠుఁ డెట్టివాఁడు

నామ— శ్లో॥ సర్వభూతేషు యః పశ్యే । ద్భగవద్భావ మాత్మన
భూతాని భగవత్యాత్మ । న్యేష భాగవతోత్తమః

నేను వేఱు భగవంతుఁడు వేఱు, లోకులు వేఱను బుద్ధిని
స్సున నుంచక, నేనును భగవంతుఁడును నొకటియేయను భావన నే
సర్వభూతములయం దుంచుచున్నాఁడో, సర్వభూతములు భగవం
యందును, దనయందును నున్నవని తెలిసికొనుచున్నాఁడో వా
భాగవతులలో శ్రేష్ఠుఁడు కాన, నో బాలామణీ!

"కాయేనవాచా మనసేంద్రియైర్వా। బుద్ధ్యాత్మనావా ప్ర
స్స్వభావాత్ । కరోమి యద్యత్సకలంపరస్మై । నారాయణా
సమర్పయే తత్" అని శ్రీకృష్ణపరమాత్మ నుడివియున్నాఁడు. పరమే
నకు స్త్రీయైనను, బురుషుఁడైనను, బ్రాహ్మణుఁడైనను, చండా
డైనను సమానులే. భగవంతుఁడు భావమును నాఁకలికలవాఁడు కా
ప్రతీకమునకు సంబంధించినవాఁడుకాఁడు కాన,

తే. గీ. పురుషుఁడైన శూద్రుండైనఁ • బాలఁతియైన
డాపనేటికి? కడకు చం • డాలుఁడైన
భావమర్పించి, భజియించు • భక్తుఁడైనఁ
బొందు సుస్థిరమైనట్టి • మోక్షపదము.

జనా—మహాత్మా! ధన్యురాలను ధన్యురాలను.

నామ—అమ్మా! నీవిటనుండుము. నేను నదికేగి వచ్చెదను (నిష్
క్రమించును)

జనా—చిత్తము. (గృహము లోనికేగును)

(యవనిక వ్రాలును)

# ద్వి తీ య రం గ క ము

[దేవాలయవీథి]

ధా—(ప్రవేశించును) దివారాత్రివిభాగములేక సదా భగవద్భక్తి సాగరమగ్నుఁడై యుండిన సంసారకార్యము లెట్లు జరుగును? నా పతివంటి భగవద్భక్తు లనేకులు లౌకిక వైదిక కార్యముల రెంటను సమర్థులై యుంటలేదా? ఈ స్థితిమాత్రము వేఱొక విధముగా నున్నది.

తే. గీ. పట్టెడన్నంబు పొట్టకుఁ ♦ బుట్టకున్కి
కట్టఁబుట్టంబునొక్కటి ♦ కలుగకున్కి
కన్నవాండ్రక బిడ్డలు ♦ గాసిపెట్టు
నింటిలోఁ బోరు చెప్పుటఁ ♦ కెంతొ సిగ్గు.

అదియునుగాక,

. బిుతుకష్టంబుల కెల్ల నోర్చి యటవి ♦ న్నేప్రొద్దు శుష్కాంగినై
సతతంబొప్పు కుటీరవాసమున నౌ ♦ సౌఖ్యంబుతోఁ బుత్రిలుఁ
బతియుం దానును గందమూలములనే ♦ భక్షించు చుండ్రు ప్తయౌ
సతికన్నం గొఱమాలినట్టి సతికిఁ ♦ సౌఖ్యంబుఁ కేమున్నదో.

పట్టణవాసినినైనను, బండితునర్ధాంగినైనను, మాయదారికృష్ణుని లోఁజిక్కిన మగనాలినగుట నాబ్రతుకు గహనాంతర వర్తినియగు నిపత్నికన్నఁ గష్టమయ్యెను కట్టా!

తే. గీ. పతియె హరియని నమ్మిన ♦ పడఁతినైనఁ
బ్రేమతో లాలనముసేసి ♦ ప్రియములాడ
నోపక, సుతులఁ బోషింప ♦ నోగిరం బొ
సఁగమిఁ గోరదే పరలోక ♦ సంగమంబు.

ఇంతకు నీ రంగఁడే కారకుఁడు. నీకు కావలసినవన్నియు నీతఁ చ్చునని నన్నంపె. ఇదే వెళ్ళి చూతును. [నిష్క్రమించును.]

యవనిక వ్రాలును.

## తృ తీ య ర ం గ క ము

[పాండురంగని గుడి]

రాధా—(ప్రవేశించి స్వామికి నమస్కరించును) రంగా! భవభం
కరుణాంతరంగా!!! నా మొఱనాలింపుము. నన్నుఁ గృపఁగ
నాపతి సర్వదా నీధ్యానమునం దేలి మమ్మాదరించుట
నాఁడు. అనాధనాధుఁడవగు నీవు మమ్మిట్లిడుమలఁగ
నగునా? నీ సేవఁజేయుచుంటిని. నీ యడుగులకు మడుగు
చుంటిని. నాపతిని నాయందనురక్తునిగా నొనర్పుము. రం
మాట్లాడవేమి? నే నిదుగో నిజము చెప్పుచున్నాను. నా
నాయందనురక్తుఁడు కాఁడా? కానిచో—

తే. గీ. తల్లిదండ్రులఁ గొల్వని ♦ తప్పిదంబు
తరుణినిం బ్రేమఁ జూడని ♦ తప్పిదంబు
తనయులనుగాచకుండిన ♦ తప్పిదంబు
నిక్కముగ వచ్చి పడును నీ ♦ నెత్తిమీఁద.

ఏమి? నేననునది తప్పిదమనుకొంటివా? బెదరింపనుకొంటి
లేదు. సత్యమును వక్కాణించితి. (విగ్రహమును బరిశీలించి) ఆహా! న
కల్యాణగుణసంపన్నుఁడగు నీ రుక్మిణీకాంతుఁడు కళావిహీనుఁడై కన
చున్నాఁడే! స్వామినడిగి తండులములు దెచ్చుకొమ్మని నా పతి న
టకనిపె. ఇఁక నే నెవ్వరి నడుగుదును! హా! దైవమా! నిజమువిచా
నీ భక్తులు నీకు దాసులుగారు. నీ భక్తులకే నీవు దాసుఁడవు. అయో
వేళ యతిక్రమించుచున్నది. ఈ విగ్రహముకడ మొఱపెట్టుకొ
నేమిలాభము? ఇప్పుడే వెళ్ళి నీ దేవుఁడే భిక్షాటనమున కేగెనని మొ
గింతును (నిష్క్రమించును)

యవనిక వ్రాలును

## చ తు ర్థ ర ం గ క ము

[నామదేవుని గృహము]

ధా—(ప్రవేశించును) కట్టా! నేనేమిచేతు? నాపతియెందరిగెనో! పాండురంగఁడిచ్చునని పరులనింట నాతిథ్యమున కుంచినాఁడు. ఇఁక నేనెట్లు వారికతిథిసత్కారమొనర్తును?

—(ప్రవేశించును) అమ్మా! ఎవరో యొక వర్తకుఁడరుదెంచి తాను నామదేవులవారి కాంతరంగికుఁడనని సమస్త సంబారరముల నిచ్చి చనినాఁడు. అప్పటినుండి మీరాక కెదురుచూచుచున్నాను.

ధా—(ఆశ్చర్యముతో) ఆ—వర్తకుఁడిచ్చినాఁడా! హా! రంగా! పాండురంగా!! నీవవధూతవు. నిష్కళంకుఁడవు. నీకేపంకిలమంటును? పరాత్పరుఁడవు. నేనపరాధిని. వ్యర్థురాలను. నాతప్పు క్షమింపుము. నన్ను మన్నింపుము. అబ్బా! నిన్నెన్ని నిష్ఠురోక్తులాడితిని? ఎట్లు సహించితివయ్యా! దేవా!! నానాలుక వ్రియ్యలుగాను.

తప్పుక్షమింపుమన్న, విదితంబుగ నీభజనామృతంబె, త
న్నిప్పుడుఁబోఁ చునంచుమది నెన్ను చునుండు మదీయభర్తకుఁ
ముప్పుఘటిల్లునంచు నతిమూర్ఖతనిన్నటు తూలనాడితిఁ
ఎప్పగిదిఁ గృపంగనెదో! యీశ్వర! యీకలుషంబు త్రుళ్ళగఁ.

· దైవమా! దాసుల తప్పు దండముతో సరియండ్రుగదా! నా ప్పు క్షమింపుము. నన్ను మన్నింపుము. నా యజ్ఞానము నేటితో ించినది. జగద్రక్షకా! ఆపద్బంధూ!! నీవు తప్ప మఱెవ్వరు న్యులు? అమ్మా! జనాబాయి! నీవు ధన్యురాలవు. పరాత్పరునిఁ ండురంగనిఁ గంటివి.

జనా—అమ్మా! ఆ వర్తకుఁడు పాండురంగస్వామియా ?

రాధా—ఔను, అతని నిజాకారమును గాంచలేకున్నను నాటేని
చ్ఛన్న వేషము నైనను గంటివి. నీవే ధన్యవు. అచిరకాలఁబ
స్వామి నీకు సాక్షాత్కరించును. నీ జన్మము ఫలించును.

జనా—భగవత్కృప.

రాధా—మంచిది. ఇఁక మనము లోనికేగి పచనము చేతము, రమ

(ఇరువురు నిష్క్రమింతురు)

(యవనిక వ్రాలును)

ద్వి తీ యాం క ము సం పూ ర్ణ ము.






విమర్శనకు ప్రతులు రెండేసి రావలెను.

**త్రిపురాంతకోదాహరణము:**— కర్త రావిపాటి త్రిపురాంతక మహాకవి. పరిష్కర్తలు:—నిడుదవోలు వేంకటరావుగారు. B. A సూర్యారావుపేట, కాకినాడ. పుటలు 80. వెల 0-12-0 అచ్చుశుద్ధముగా నున్నది. క్రౌన్ సైజు.

శ్రీశైలమునకు ప్రాగ్ద్వారక్షేత్రమున సుప్రసిద్ధుడైన త్రిపురాంతకేశ్వరునిగూర్చి నేటి కారువందల సంవత్సరముల క్రితము మహాకవి యని పేరుకాంచిన రావిపాటి త్రిపురాంతకుడు (తిప్పయ్య) ఈ యుదాహరణమును రచించినాడు. ఇదియొక ఖండకావ్యము, శివస్తుతి.

ఒక్కొక్క విభక్తితో నొక్కొకపద్యముగా సప్తవిభక్తులను రచించి వానికి దరువాత రగడనో ఉత్కళికనో చెప్పవలెను. ఈ విధమైన రచనకు ఉదాహరణ మనిపేరు. ఈ యుదాహరణ కావ్యమును మొదట నాంధ్రమున రచించినవాడు శివకవియగు పాల్కురికి సోమనాథుడు. రెండవకవి ఈ త్రిపురాంతకుడు. ఇది మొత్తము ౨౮ పద్యములు గల లఘుకావ్యమే కాని ప్రాచీనమగుటం జేసియు, ఉదాహరణ మనబడు నపూర్వ వాఙ్మయమునకు జెందియుండుటం జేసియు, ఆంధ్ర భాషావిశేషముల నరయుటకు రత్నఖండమని చెప్పవచ్చును. శ్రీ మా॥ రామకృష్ణకవి గారు వెనుక నెప్పుడో ప్రకటించిన యీ పుస్తకము ప్రస్తుతము దొరకుటలేదు కావున భాషావిశారదులును శైవవాఙ్మయ నిపుణులును నగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు కడు శ్రద్ధతో సంస్కరించి పద్యములకు వివరణమును జేర్చి,

ఏబది పుటలకు మించిన పరిశోధనాత్మకమైన గొప్ప పీఠికతో ౹
మరల ముద్రించి యాంధ్రలోకమునకు సమర్పించి ధన్యులైనా
ఉదాహరణమును రచించిన కవికంటె పీఠికను గూర్చిన వేంకటరా
గారి పరిశ్రమమే గాఢమని నిస్సంశయముగ జెప్పవచ్చును. సార్థకమై
వారి పాండిత్య పరిశ్రమలనుగూర్చి మేమభినందించుచున్నాము. శివమ
స్థులేకాదు. సమస్తాంధ్రులును ఈ గ్రంథమును తప్పక యాదరించి
యింకను ఏతాదృశ గ్రంథోత్పత్తికి కారకులు గావలెనని సూచించు
చున్నాము. పుస్తకమును 0-8-0 లకు నమ్మిన బాగుండునని మా
తలంపు.

పరిష్కర్తలు ప్రస్తుతము తూర్పుగోదావరిజిల్లా రామచంద్ర
పురం ఇంపీరియల్ బ్యాంకులో నున్నారు కావున వలయువారు ఇచ్చ
టికే వ్రాయవలెను.

శరచ్చంద్రునకును కళంక మున్నట్లు ఈ గ్రంథము పీఠికలో
నొక గొప్పదోషము దొరలినది. శ్రీ ని. వేం. రావుగారి దృష్టిలో
నిది యల్పమే కావచ్చును కాని మా దృష్టిలో నిది పెద్దతప్పు. "వీర
శైవమత సంస్థాపకుడగు బసవనకు" అని రావుగారు వ్రాసిరి. వారు
పరిశోధకులు గదా! బసవపురాణమున గాని లేక ప్రభులింగలీలాది
గ్రంథములలో గాని సంస్థాపన విషయము బసవేశ్వరునకు నిరూ
పింప బడినదా? బసవడు స్మార్తమును తిరస్కరించి సంగమేశ్వర
గురునిచే వీరశైవదీక్షనంది వీరశైవ మతమును స్వీకరించి యప్పటికే
వేనవేలుగానున్న గురులింగ జంగమ భక్త మాహేశ్వరులను పూజించి
ధన్యతను మాన్యతను సంపాదించినవా డనుట సుప్రసిద్ధమయియుండ,
నీతడే వీరశైవమతమును స్థాపించెననుట "ఇంట దిని మూలవాసము
లెన్నిన" దానికంటె నద్భుతముగానున్నది. వీరేకాదు, మఱికొంద
ఱును స్థాపకత్వము బసవన కంటగట్టిరి. అవి యన్నియును అజ్ఞాన
మూలకము లనుటయే యుక్తిసంగతము.

బసవపురాణమును తమ యబద్ధపు పీఠికతో వెలువరించిన శ్రీ
ప్రభాకరశాస్త్రిగారి వ్రాతలను సప్రమాణముగ ఖండించి యనే

న్యాసములను శ్రీ బండారు తమ్మయ్యగారు ఆంధ్ర సా॥ ప॥ పత్రిక, సుదర్శిని మున్నగు పత్రికలలో ప్రకటించియేయున్నారు. తమ్మయ్యగారి యునికికి సన్నిహితమగు కాకినాడలో నివసించియు నీ కోలాహలమును మన వేంకటరావుగారు గమనించకుండుట శోచనీయము. పునప్రచారావసర మబ్బునేని యీ కొండంతదోసగును దొలగింతురుగాక!

ప్రత్యూషము:—కర్త కొమరవోలు వేంకటసుబ్బారావుగారు B.A. తాలూకాఆఫీస్, రాజమండ్రి. పుటలు ౧౩౦. వెల 1–0–0 ముద్రణకాగితములు మంచివి. డెమ్మీసైజు.

ఇది యొక నూత్న ప్రబంధమేకాదు. ఆంధ్ర భాషాయోషకు మూల్యాలంకారము. కవిగారి ప్రాయము "అణోరణీయాన్" అనుటను, ప్రతిభ "మహతోమహీయాన్" అనుటకును కావ్యము సాక్ష్యమిచ్చుచున్నది. ఇరువదిసంవత్సరముల వయసున నింతటి ప్రౌఢకావ్యమును నిర్మించుటజూడ "కవిర్జాయతే నతుక్రియతే" అను సూక్తి సత్యమగుచున్నది. కవితాధార గభీరమై మనోహరమై శ్రీపాద కవీంద్రులన్నట్లు పెక్కుస్థలములలో బులకాంకురముల నొదవించు ననుటలో సందేహములేదు. చదువుచున్నపుడు సంస్కృతాంధ్రభాషా పాండితీప్రవీణతగల వృద్ధమహాకవియే దీనిని రచించెనని తోచుచుండును. ఆ ప్రాగల్భ్యము, ఆ భావమాధుర్యము, ఆ కల్పనా స్వాతంత్ర్యము, గ్రంథకర్తను మహాకవిగా సూచించుచున్నవి. ఇట్టి ప్రతిభాశాలియగు యువకవి యే మహారాజాస్థానముననో "కప్పురవిడెమాత్మకుపయిన భోజనము" లతో నానందముగా గాలము గడుపవలసియుండగా తాలూకా ఆఫీసులో నుద్యోగమును భరించుట జూడ చిత్రముగానున్నది. "తేహినోదివసాగతాః". శ్రీనాథుడు పల్నాటిసీమలో "కుసుమాస్త్రుండైన జొన్నకూడేకుడుచున్" అని చెప్పినాడు. ఇప్పటి యాంధ్రదేశమంతటను "కవియైనను లెక్కవ్రాసి కాలముగడపున్" అని చెప్పవలసియున్నది. ఇది కాలమహిమ.

రామాయణ భారత పురాణాదులలోనుండి కాక, ఇందలి కథ స్వకల్పితమై యంతయు ప్రకృతికి రమణీయముగ ముడిపెట్టబడినది.

వ్యక్తులకు సంబంధించినది కాదు. కావ్యము పేరు ప్రత్యూషము (ప్రా
కాలము). రాజుపట్టణము రోదసి (పృథివ్యాకాశములు) నాయకు
అరుణుడు (ఎరుపు) నాయిక రజని (రాత్రి), విఘ్నకారి తమోఽసుర
కలహము, తమః ప్రకాశతత్త్వములకు, (జ్ఞానాజ్ఞానములకు) పరి
మము పేమవిజయము (ప్రత్యూషము) మొదలగు కమ్మనికల్పనలతో
నొక క్రొత్త పద్ధతిని నీయాంధ్రకావ్య మవతరించినది. పండితులు
ఆంధ్రభాషాభిమానులును, కవులును ప్రత్యూషము నవశ్యముగ నవలో
కించవలెను. ఆంధ్రవిశ్వవిద్యాలయము వారీ గ్రంథము నిదివఱకే పు
స్కరించి నట్లు తెలిసి సంతసించితిమి. ఇట్టి కావ్యము లెక్కువగా
బ్రచారమందవలెను. రచన సరళమే కాని, భావము గంభీరము
నున్నది. ఇట్టి ప్రౌఢకావ్యములలో నారికేళపాకము తప్పదుకదా! పద్య
ములన్నియు హృద్యములుగానే యున్నవి. అందునను వీరి గీత పద్య
ములు మహామనోహరములని నాతలంపు. మచ్చునకొకటి రెండు.

గీ. అటులఁగాక మనోనిగ్రహమ్ముఁ గలిగి
యర్థముల బందిగొన్న సంయమి మనస్సు
ఘననివాతస్థ దీపముకరణి నచల
మై తనర్చు జీవన్ముక్తు డగును వాఁడె.

గీ. అనలశిఖలను బొగగప్పి నట్టు లెల్ల
కర్మములఁజుట్టియుండు నఘమ్ము స్వస్వ
భావజన్యమ్ములగు కర్మపటలి వలెనె
కర్మదోషమ్ములకును నగ్గమగు జనుడు.

కవిగారికి కమ్రమైన కవితాశక్తియే కాక విజ్ఞాననిలయమగు
వేదాంతశాస్త్రమును వెన్నంటెనదని సులభముగ దెలిసికొనవచ్చును
తత్త్వబోధాత్మకములగు శతాధిక పద్యములిందు గలవు. కవిగారింకను
దర్శనశాస్త్రములను దఱచి యాంధ్రభాష కొక యపూర్వమైన మహా
కావ్యము నీయగోరుచున్నాను.

గీ. అచటి తనువులె యాత్మమయంబులగుట
నోలమున వెల్వలను తేజముంట నచట

జనన మొందిన పరమాణువునకు నైన
నీడగల్గుట మనకు గన్పింపరాదు.

ఇట బరమాణువునకు నీడలేదనుమాట అపార్థముగానున్నది. రమాణువునీడ లోకప్రసిద్ధమే కాదు. శాస్త్రములందు తదూర్ధ్వపాదు ఇంద్రియములసి కదా నిర్వచనము! ఏభావముతో దీనిని రచించిరో బోధముగాలేదు. "ఏను పతినిష్ఠితమ్మగు హృదయమునను" అను ట "పతినిష్ఠమగు" నన్న చాలును. "స్ఫూర్జధు హేప్రపా మేఘజ్యోతి" హేప్రపాశబ్దమధికము. బడబాశ్వ ఘోషయనుటకు నది వివరింపబడ ను. ఇట్టివి పష్పులోనుప్పువలె చాలకొలదిగాగలవు. కావ్య మైదాశ్వా ములలో ముగిసినది.

వననిధిఁ ద్రవ్వి యెత్తినది వారిరుము త్తెము పాపరేని నె
త్తిన బ్రహారించి తెచ్చినది తెక్కలిము త్తెము వేణువాటికఁ
గొనినది క్రొవ్వు త్తాయి కవికోమలసుందరభావశుక్తి మొ
ల్చిన తెలిము త్తియమ్మిది మలిమ్లుచ మ్రుచ్చిలు మేది శక్యమో!

ఇట్టి యనర్ఘరత్నముల నావిష్కరించు శ్రీ కొమరవోలు కట సుబ్బారాయకవిగారి యితోప్యధికాభ్యుదయము నభిలషించు న్నాము.

**రాజా బహద్దరు వేంకట రామారెడ్డి ఓ. బి. ఇ. = కర్త:**—సుర ము ప్రతాపరెడ్డిగారు, బి. ఎ. బి. ఎల్; ప్రకాశకులు; బాలికల స్తతపాఠశాలకమిటీ, నారాయణగూడెము. హైదరాబాద్ ద. పుట ౬౦ ఫెదర్ వేటు కాగితముల ప్రతి వెల 0—12—0, మామూలు తి 0—6—0, ౧౬ చిత్రపటములుగలవు.

నిజాంరాష్ట్ర ప్రభుత్వశాఖలో నుద్యోగమును నిర్వహించుచు జనప్రియులైన వారిలో శ్రీ రాజా బహద్దర్ వేంకట రామారెడ్డి రు సుప్రసిద్ధులు. మొదలు ౧౨ రుల యుద్యోగమున బ్రవేశించి దరాబాదు నగరభటాధ్యక్షపదవి ( ౨ వేల రు.ల వేతనము) వరకు

7

నెక్కిన శ్రీవారి ప్రజ్ఞావైభవము వర్ణనాతీతము. వీరు అటు ప్రభుప్ర
సంపూర్ణ ప్రేమకును, ఇటు సర్వజనానురాగమునకును పాత్రులై
మహానుభావులు. ఇందుకు గారణము హిందూమహమ్మదీయుల వి
నిష్పక్షపాతమైనదృష్టి, పరోపకారబుద్ధి, అవిశ్రాంతపరిశ్రమ, న్యా
వర్తనము, ప్రభుభక్తి, విద్యాప్రేమ లని సహజముగా జెప్పవచ్చు
ఉద్యోగగర్వములేక నిరాడంబరముగ జీవితమును గడపుటయే
లక్షరూపాయీల వ్యయముతో రెడ్డి బోర్డింగు బాలికోన్నత పాఠశా
మహాగ్రంథాలయము మున్నగు సంస్థలను సంస్థాపించి యవి చిరస్థా
యగునట్లు కట్టుదిట్టములొనర్చి నేటికని పాడుచున్నారు. హైదరాబా
హిందువులలో విద్యాభిమానాది ప్రజాహితాందోళనములు గలు
టకు సుప్రసిద్ధమైన ఈ రెడ్డి బోర్డింగును కారణమని నిస్సంశయము
జెప్పనచ్చును. శ్రీరాజాబహద్దురుగారు ప్రభుత్వశాఖలోను మహా
గావించి ఘనత నొందినారు. ఇట్టి సుప్రసిద్ధపురుషుని చరిత్ర తో
నాంధ్రభాషలో వెలువడుట ముదావహము. ఇది యింగ్లీషు ఉర్దూభా
లలోను పరివర్తింప బడవలెనని మా యాశయము.

ఈ గ్రంథమును రచించిన శ్రీ సు॥ ప్రతాపరెడ్డిగారు సు
సిద్ధులు. సదవకాశమును సార్థకపరచువారిలో సురవరమువారు సుని
బుద్ధులు. ఎప్పు డెద్దానిని యోజించి కార్యరంగమున బడవేతు
సామాన్యముగ దెలియదుకాని మహోద్దేశ్యము మాత్రము స్పష్టమ
చునే యుండును. రాజాబహద్దురుగారి సహవాసమును పురస్కరించు
యింతటి యుపయుక్త గ్రంథమును బ్రచురించు చాతుర్యమును రె
గారు దక్కించుకొనిరి. ఆరెడ్డిగారి చరిత్రను ఈరెడ్డిగారు విరచిం
టెంతయు సమంజసము.

గ్రంథముశైలి సరళమైన దేశీయ గ్రాంథికము. రాజాబ
ద్దురుగారు పోలీసు శాఖాధికారులు కావున నీచరిత్రయంతయు అపరా
పరిశోధక నవలవలె మనోరంజకముగా నున్నది. చదువ నారంభించిన
ముగించు వరకు విడువ మనస్సుబుట్టదు. ఇట్టిరోచకమైన శైలిత
ముగిసిన దీగ్రంథము. బాల్యము మొదలుకొని నేటివరకు గడచిన రా

హద్దురుగారి జీవితములోని ఘటనలన్నియు నిందు జర్చింపబడినవి.
జామాంధ్రులును రెడ్డి మహాజనులును తప్పక పఠించవలసిన ప్రశస్త
మైన పుస్తకము. శ్రీ రాజాబహద్దరు గారింకను నారోగ్యముగ దీర్ఘా
యుష్మంతులై ప్రజాహితముల నొనర్చు మరియొక యుత్తరభాగ
చరిత్రరచనకు గారణము గావలెనని యాశించుచున్నాము.

**జాతకకథాగుచ్ఛము**=కర్త:- శిరోమణి సన్నిధానము సూర్య
నారాయణశాస్త్రిగారు. ప్రకాశకులు; ఆంధ్రకావ్యమాల గోకులము.
(ర జీరా కంపౌండు) సికిందరాబాదు. ద. పుటలు. ౧౧౨ అచ్చు
ముద్దులు మూటగట్టుచున్నది. అందమైన మందపు కాగితములు. వెల
లియదు. ఒక రూపాయి దక్షిణగా నీయవచ్చును.

సత్యము, దయ, అహింస, పరోపకారములను బోధించు బుద్ధావ
తారపు జాతకకథలు పాళీభాషలో విరివిగా గలవు. హిందువుల పురాణ
కథలవలె బౌద్ధుల జాతక కథలును కొన్ని కడుంగడు సుందరముగా
న్నవి. అవి వ్యవహారములేని పాళీభాషలో నుండుటచే దరువాతగొన్ని
టిని సంస్కృత భాషలో సంగ్రహించి యార్యశూరకవి "జాతకమాల"
రచించెను. ఈ జాతకకథలు చాల రమ్యముగా నుండుటవలన వీని
ప్రచారము విరివిగా జరిగినది. ఇంగ్లీషుభాషలోను అనువాదములుకలవు;
ఇటీవల హిందీ బంగాళా భాషలలోను వెలువడినట్లు తెలిసినది. ఆంధ్ర
మున నవిలేని లోపమును శ్రీ సూ. నా. శాస్త్రులుగారు తీర్చినారు.

చాలకాలమునుండి శ్రీ శాస్త్రిగారీ ప్రయత్నము గావించు
చున్నట్లున్నది. తక్కిన కథలనుగూడ పూర్తిచేయగలరేమో! ప్రస్తుత
గా గుచ్ఛమున నైదుకథలు పద్యరూపముగ విరచించినారు. అనేక
కృతులతో నిదివరకే వన్నెకెక్కిన శాస్త్రిగారి కవిత్వమునుగూర్చి చెప్ప
వలసినపనిలేదు. భాష నిర్దుష్టము. భావము సరళము. రచన సొంపుగా
నున్నది. ఇది యనువాదమువలె నుండక స్వతంత్ర గ్రంథముబోలె
చక్కని శయ్యతో విరాజిల్లుచున్నది. ఈ చక్కని కృతి యాంధ్ర పాఠ
శాలలలో బఠ్యముగా జేయుటకు నెంతయు దగియున్నది.

ఇందు బౌద్ధుల మతచర్చలు గలవేమోనని పొరపడవ
కేవలము అహింస, పరోపకారము, దయలే ఇందు హృదయదా
ముగ వర్ణింపబడినవి. "క్షాంతివాది, వ్యాఘ్రి, శిబి, విశ్వంతర,
బోధు"లకు సంబంధించిన యైదు జాతకము లిందుగలవు. శుద్ధ
జాతక మిదివరకే మన "విభూతి"లో గొంత బ్రకటింపబడినది. క్షా
వాది జాతకములో నుండియును గొన్ని పద్యము లీ పత్రికారంభ
ముద్రింపబడినని. దీనినిబట్టి యీ కథలోని భావము లెంత హృ
ములో పాఠకు లూహింతురుగాక! ధర్మ నీతి సదాచార పోషక
నిట్టి గ్రంథమును విరచించిన శాస్త్రిగా రభినంద్యులు. మున్ముం
గ్రంథము అఖిలాంధ్రాదరముబడసి చిరస్థాయి కాగలదని భా
చున్నాము.

**శ్రీ నిరంజన విజయము:**—ఉభయభాషాప్రవీణ కొండూరు
రాఘవాచార్యులు, దొరకు చోటు; వాశిలి పార్వతీశాచార్యు
కొప్పల్లిపోస్టు, తెనాలి. జి. గుంటూరు. అచ్చు స్వచ్ఛము. కా
ములు సామాన్యము. పుటలు ౧౦౦, వెల పావలా.

దుగ్గిరాల గ్రామనివాసులైన శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగా
గూర్చిన చరిత్రయిది. శాస్త్రిగారు సంస్కృతాంధ్రభాషా పండితు
యనేక ప్రబంధములను విరచించి పలుపాట్లుపడి స్వసమాజసే
గావించి విశ్వకర్మలలో సుప్రసిద్ధులైన వారు. ఇట్టి మహాపురుషుని జీ
మాంధ్రులకు దెలియుట పరమావశ్యకము కావున వీరరాఘవాచా
లిద్దానిని సరళమధురమైన నిర్దుష్టభాషలో గద్యకావ్యముగ రచి
నారు. నిరంజనశాస్త్రిగారి బాల్యాదారభ్య పరమపద పర్య
మందలి ఘటనలన్నియు జక్కగ వివరింపబడినవి. నిరంజనుని శివభ
విధానములును శైవులకు బ్రమోదావహములు. విశ్వకర్మసంఘీ
లెల్ల నీ గ్రంథము నవశ్యముగా బఠింతురుగాక! ధార్మిక గ్రంథమ

**జాతీయ గీతములు** కర్త:— మంత్రిప్రగడ వేంకటేశ్వరరా
గారు, ప్రకాశకులు; కేశవపల్లి కేషన్సు అండ్ బుక్ స్టాలు్స, గాలి

ము. హైద్గరాబాద్. డ. పుటలు 30 వెల 0-2-0 కాగితములు.
మాన్యము.

గ్రంథకర్త గారు నిజామాంధ్ర దేశమున జాతీయతా ప్రచార
ు. అనేకపల్లెలలో సైతము సంచరించుచు ప్రబోధము గావించు
ందురు. ప్రజలకు కొన్ని విషయములు పాటలలో జెప్పిన రుచించు నని
ికి తమ యనుభవము వలన దెలియును. కావున నిట్టి పాటలను
న్నిటినల్లి సంగ్రహముగా దీనిని ప్రకటించినారు. ధర్మప్రేమ సదా
ర స్వాతంత్ర్య ధైర్యముల నిందు బోధించినారు. ఇవి చురుకుగాను
సముగాను నున్నవి. తెలుగుపద్ధతి ననుసరించి యీ పాటలలో
న్నిటికి యతిప్రాసలుగలవు. అన్నిటికిని యతిప్రాసలు సమమాత్ర
వశ్యకమని మాతలంపు. ఇది సర్వాంధ్రజాతీయము కావలె నన్నచో
కరరామానుజ రేణుక మధ్వబసవాది మహనీయులందర సందేశములను
మ్మానించవలసియుండును, ఒక దయానందులే కావలసినచో నది యార్య
మాజజాతీయగేయమగును. ముస్ముందీ విషయమును కర్తగారు గమ
ంచగోరుచున్నాము. జాతీయవాదులు చదువదగిన పొత్తము.

"రాజహంస"






## వీరశైవులు: 'లింగాయత' శబ్దము.

### ( నిజాం ప్రభుత్వము వారికి సూచన )



"వీరశైవులనియు లింగాయతులనియు చెప్పబడు మతము
తమ మతనామములను పలువిధములుగా చెప్పుచున్నారు. ఏ
మైనదో ఎటులు వ్రాయవలెనో ఆ సమాజ ప్రముఖులు ప్రకటి
వలెను" అను నభిప్రాయముతో నిటీవల నిజాం ప్రభుత్వమువా
ప్రకటనను గావించియున్నారు. దానిని "సందేశ" పత్రికలో జ
నాము. ఇది ముఖ్యమైన సమస్యయగుటవలనను, 1941 వ సంవ
మున జనపరిగణన (మర్దుంషుమారీ-సెన్సస్) యుండుటవలనను
విషయమైన చర్చ యవసరమైనది.

చాల ప్రాచీనకాలమున నీమతమును పంచాచార్యులు స్థా
నారు. వీరి పంచపీఠములు, బాళేహొన్నూరు (మైసూర్ స్టే
ఉజ్జయినీ (బళ్లారి) కేదారము (హిమాలయము) గుంతకల్లు (
మఠము) కాశీ, (బనారస్) అను క్షేత్రములలో నేటికిని పరంపరగా గు
త్వమును గల్గియున్నారు. ఈ మహాచార్యులకు ఉపాచార్యులన
పట్టపుదేవరలు, చరమూర్తులు, దేశికులు అను స్వాములును వీరి మ
ములును కర్నాటక మహారాష్ట్రాంధ్రదేశములలో కొన్ని వేలుకల
ఇట్టి మఠాధికారులచేత లింగధారణ శివదీక్షాది సంస్కారముల
హావ్యకవ్యములను నిర్వహించుకొనువారే వీరశైవులని పిల్వబ
చున్నారు. వీరి శాస్త్రమునందును ఈ వ్యవహారమేకలదు. వీ

...లకు, వేద-ఆగమ - ఉపనిషత్ - పురాణాదులును, సిద్ధాంతశిఖా..., క్రియాసారము, కౌస్తుభము, అన్వయచంద్రిక, సదాచారసంగ్రహ...ము, ఆచార ప్రదీపిక, ధర్మశిరోమణి మొదలగు ధర్మశాస్త్ర గ్రంథ...లును శ్రీకరభాష్యము, శివాద్వైత కల్పలతిక, శివాద్వైతమంజరి, ...విజ్ఞానము మున్నగు తత్త్వశాస్త్ర గ్రంథములును ప్రమాణములై ...న్నవి. ప్రాచీనకాలమునుండి కడచిన క్రీ. శ. ౧౯ వ శతాబ్దము ...లో విరచితములైన సమస్త ధర్మ గ్రంథములందును ఈ మతము ... వీరశైవమను నామమే కన్పడుచున్నదికాని మఱొక పేరులేదు. ... పంచాచార్య పీఠాధిపతులును, సదాచార సంపన్నులును, స్వాము...లు, విద్వాంసులును ఈ మతమును వీరశైవమనియేవ్రాయుచు ...చుచున్నారు. ఇదియే శాస్త్రీయమైన సిద్ధాంతము. దీనిని తిరస్క...రించుటకు నేమాత్రమైన ప్రమాణములేదని ఘంటాఘోషగా నిర్ణ...యింపవచ్చును.

## 'లింగాయత శబ్దము' పుట్టుక

వీరశైవము అనునది ఒకమతము (తత్త్వము) పేరు. జాతి ...కాదు. వైష్ణవమతమునందువలె వీరశైవమతస్థులగువారియందును ...నేకజాతులు కలవు. కర్నాటకదేశమునందలి వీరశైవులలో జంగమ, ...ణిగ, పంచమసాలి, శీలవంత, గాణిగ, బళిగార, సింపిగ, ఒక్కలిగ, ...గార, జీర, కుంబార (కుమ్మరి), అగస (చాకలి), దడపద (మంగలి) ...తెరద, (బోగము) చలవాది (మాలజంగము) డోహర (డొక్కలి - ...రజ) అను పేరులతో అగ్రవర్ణము మొదలు అంత్యజులవరకు ...నేకశాఖలుగా నేటివరకునుగలరు. వీరిలో మొదటి కొన్నిజాతుల ...కే సపంక్తి భోజనము కలదు. కారణమేమనగా వీరు ...మొదటినుండియు అష్టావరణము గలవారై దీక్షాది సంస్కారములు ...లిగి ద్విజులై యుండుటవలన నీ వీరశైవ ద్విజులందరును సపంక్తి ...భోజనము గలిగియున్నారు. ఇది వీరశైవ శాస్త్రమునకే కాక ...స్మార్త వైష్ణవ ధర్మశాస్త్రములకును అవిరుద్ధము. మీాద నుదాహరించిన

శాఖలలో వివాహాది శరీరసంబంధము సదాచారముగా లేదు. ఇ
యింక గొన్ని వీరశైవ శాఖలు మహారాష్ట్రములోను గలవు.
యిందులో గొన్ని శాఖలవారి యాచారములు సరిగా లేవు
మహారాష్ట్రమునం (పీష్వాకాలమునం)దలి యితర మతస్థులు
"లింగానా, ధింగానా" యనియు "లింగాడీ లింగ్యాఈ" అని
చివరకు "లింగాయీత్" అనియును పిలువసాగిరి. ఈ శబ్దము మొ
షోలాపూర్, సతారా, బెళగాం, విజాపూర్ జిల్లాలలో క్రమము
వ్యాపించి దాని రూపము "లింగాయత"గా నిలిచెను. (మహారాష్ట్ర
ప్రాంతములో కొన్ని చోటులలో నింకను "లింగాయీత" అను వా
కలదు) అప్పుడు మైసూరు దేశమున "శివాచారదవరు, శివమత
లింగవంతరు" అను రూపములే వాడుకలో నుండెనుగాని క్రమము
మైసూరు ప్రాంతముననను లింగాయత శబ్దమెగ్రబాకెను. తరువాత ని
అటు బళ్లారి మార్గము నుండియు ఇటు గుల్బర్గా మార్గమునుండి
నిజాం దేశము నీ శబ్దము ప్రవేశించెను. ఏబదిసంవత్సరములకు పూర్వ
ఆంధ్రదేశపు కృష్ణా గుంటూరు గోదావరి వరంగలు నల్లగొండ
నగరము నిజామాబాదు మెదక్, సంగరెడ్డి జిల్లాలలో నివసించు
శైవుల కెవ్వరికిని యీ లింగాయత శబ్దము తెలియదు. ౧౫-
సంవత్సరములనుండి ఈ శబ్దమాంధ్రదేశమందునను ప్రచార మం
చున్నది. ఇప్పటికిని పల్లెటూరి యాంధ్రవీరశైవులకు నీ లింగాయ
శబ్దము సరిగ దెలియదని చెప్పవచ్చును. మొట్టమొదట హే
బుద్ధితో బిలువబడినట్టియు, అశాస్త్రీయమైనట్టియు, "లింగాయతమ
వీరశైవమతమునకు పేరెన్నటికిని కానేరదు. మరాఠి భాషకూడ ఉ
హిందీభాషలవలె కొన్ని నియమములతో "జిరాయత్ బాగాయత్
శబ్దముల జతకు "లింగాయత్" శబ్దమును వాడుకలోకి తెచ్చినది. అం
మాత్రమున అది వీరశైవమతీయులకు ముఖ్యముగా వాడవలెనను
దుర్వాద మేయగును.

బ్రాహ్మణులకు "బ్రహమణ, బామ్మణ" అనియును నై
లకు "బఖాల్" అనియును మహమ్మదీయులకు "తురుకలు, తురకోళ్లు

ముసల్‌మాన్, సాహెబులు సాబులు" అనియును ఇతరమతస్థులు బులుచుందురు. రానురాను పామరజనము తమకు తామే "తురు కోళ్ల" మనియు చెప్పుకొనుచుండును. ఇంతమాత్రమున మహమ్మదీయ మతమునకుండు "ఇస్లామ్" నామము వెనుకకు దోయబడి సాబులని గాని తురకలనిగాని ముఖ్యముగా వ్యవహారము చేయవలసియుండునా?

వీరశైవసోదరులలో కొందరు తెలియకను కొందరు దురాగ్రహ ముచేతను లింగాయతులమని చెప్పుకొనుచున్నారు. పైగా "లింగాయత" శబ్దము "లింగముకలవాడు" అను నర్థము నిచ్చుచున్నది. కావున నదియే చాలుననియును, "లింగ+ఆయత" అను రెండుశబ్దములు సంస్కృతములే యనియును దుర్వాదము చేయుచున్నారు. ఇది యంతయు తృణప్రాయము. ఎన్నటికిని నిలువజాలదు.

వీరశైవులకు "లింగ, రుద్రాక్ష, భస్మ"ము మొదలగు ఎనిమిది యావరణములును ముఖ్యములే. శివదీక్షయు, షట్‌స్థలములును ముఖ్యములు. అప్పుడు 'లింగాయత' అన్నట్లు "భస్మాయత, రుద్రా క్షాయత, దీక్షాయత, మంత్రాయత" అను పేరు లన్నియును వ్యవహా రములే కావచ్చును. "లింగాయత"కు "లింగము కలవాడు" అను అర్థము మాత్రమే యుండగా "దీక్షామంత్ర భస్మాదిరహితుడు" అను భ్రష్టా ర్థము సైతము స్ఫురించును. కావుననే ఈ యష్టావరణము మున్నగు నన్ని ధర్మములుకలవాడు వీరశైవుడని చెప్పబడినాడు. ఇదియే, శాస్త్రీ యమును, సదాచారమును, సయుక్తికమును అయ్యున్నది. కావున ప్రభుత్వమువారు రాగల జనపరిగణనలో ఈమతీయులను వీరశైవు లనియే వ్రాయవలయును. "లింగాయత్" అనుట యెంతమాత్రము సరికాదు. లింగాయత శబ్దము వీరశైవులకు తగునని సిద్ధాంతముచేయు వారికి, నూట పదహార్లు బహుమాన మీయబడునని నొక్కి చెప్పు చున్నాము. అట్లుగాక కుయుక్తిచేత "లింగాయత" శబ్దము సంస్కృత మని సాధించుచో "గాడిద, కుక్క, పంది" శబ్దములును సంస్కృత మని విచిత్ర వ్యుత్పత్తులతో భ్రమింపజేయవచ్చును. ఈ దుర్మార్గమును

వదలి అనాదినుండియు సుప్రసిద్ధమైన వీరశైవ శబ్దమునే ఆశ్రయించు
శ్రేయస్కరము.

## వీరశైవులు హిందువులే

వైదికులగు షణ్మతస్థులు భారత దేశమునగలరు. ఈ యన్నిమ
ములకును సంకేతమగు ఒకే పేరు ప్రాచీన కాలమున వ్యవహారములో
నున్నట్లు దోచదు. అయినను వేదాగమస్మృతుల ననుసరించువా
దరికిని వైదికు లనియును ఆస్తికులనియును, సనాతనులనియును
వ్యవహారము సహజముగా వచ్చుచున్నది. ఇది యిట్లుండగా "హిం
వనగా నెవడు?" అను విషయము విపరీతముగ చర్చకు వచ్చిన
నిష్పక్షపాతముగ జెప్పవలయు నన్నచో హిందూశబ్దము "వై
కాస్తికులు" అను నర్థము నిచ్చుటలేదు. దీనిని మహమ్మదీయుల
పారసీకులో మొదలు వ్యవహరించి యుండిరనుటయే యుక్తిసంగతము
వేదాగమోపనిషత్తులలోను ముఖ్యముగ మన్వాదిధర్మశాస్త్రములలో
హిందు శబ్దము కానుపించదు. మేరు తంత్రములోను భవిష్యోత్త
పురాణము నందును కనుపడు హిందుశబ్దము ప్రక్షిప్తమనియైనను లే
మరియొక విధముగనైనను పరిహారము చెప్పుకొన వలసి యుండు
ఇది ముఖ్యమైన శబ్దమేఅయినయెడల మనుయాజ్ఞవల్క్య పరాశరాదుల
వదలి వేయవలసిన యగత్యముండదు. సత్యమిట్లున్నను వేరొకశ
మింతవ్యాపకముగ నుండక పోవుటచేత వైదికాస్తికు లందరును హిందు
శబ్దము నంగీకరించి వ్యవహరించుచున్నారు. కావున షణ్మతస్థు లంగీ
రించినట్లు వీరశైవులును హిందువులేయనుటకు నెంతమాత్రము
సందేహావకాశము లేదు.

కొందరు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చతుర్వర్ణమ
లలో వీరశైవు లెవరు? అని మహాట్టహాసముతో ప్రశ్న వేయుచుందురు
ఇదియొకమహామూర్ఖప్రశ్న. వీరశైవ మనునది జాతి పేరుగాదు; మతము
పేరు. అటులే స్మార్తము, వైష్ణవము అను నవియు మతనామములు
ఒక మతమునకు చెందినవారిలో ననేకజాతు లుండవచ్చును. మతమున
కును జాతికిని ఐక్యసంబంధములు లేవు. జాతియనునది జన్మకు సంకే
ము. (జాయతే పుట్టుచున్నాడు) మతము అనునది ధార్మిక శాస్త్రీయ

ం కేతము. కనుకనే స్మార్త మతీయులలో బ్రాహ్మణుడు మొదలు
గొని అంత్యజుని వరకును వివిధజాతులు కలవు. అటులే వైష్ణవమత
మునందును వీరశైవ మతమునందును వివిధవర్ణములు, జాతులు, శాఖా
భేదములు కలవు. వీరశైవులలో పీఠాచార్యులు మొదలుకొని యంత్య
జులవరకు మొదటినుండియు నేటివరకు శాఖాభేదములు వ్యవహారములో
నున్నవి. వీరశైవులలో జాతిభేదము లేదనియును వాదించువారు కొం
దరుకలరు. అట్టివారు ఇతర హిందువులగు స్మార్తవైష్ణవులలోను
నున్నారు. జాతి, జన్మచేతనా కర్మచేతనా? అను వాదమిప్పు డన్నిమత
ములలోను చెలరేగినది. ఇతర మతస్థులలోను జాతులు నశించులోపుగ
వీరశైవులలోను జాతులు నశించవచ్చును. కాని వ్యవహారముననుసరించి
వివిధజాతులున్నవనుటయే సత్యము. కర్నాటక, మహారాష్ట్ర, ఆంధ్ర
దేశముల వీరశైవుల జాతిశాఖా భేదములను కూర్చి పది సంవత్సరముల
క్రితము "ఆంధ్రవీరశైవరు" అను కన్నడభాషా వ్యాసమున చర్చించి
యున్నాను. అది విజాపూర్ శివానుభవ పత్రికలో ప్రకటింపబడినది.

వీరశైవులకు జాతకర్మ లింగధారణ శివదీక్షా వివాహాది సంస్కా
రములన్నియు వేదమంత్రములతో జరుగును. యజుర్వేదరుద్రాధ్యాయ
మందలి పంచాక్షరీ మహామంత్రరాజమే వీరశైవులకు గురుమంత్రము.
హిందువుల త్రిమూర్తులలో నొకడగు శివుడే యుపాస్యదైవము.
కావున నీ సనాతన వైదికాచారమును బట్టి వీరశైవులు హిందువులే
యనుట భేరీనినాదము.

ఇటీవల కొందరు "వీరశైవులు (లింగాయతులు) వేదాదులను
మన్నించరనియును, సిక్కులు, జైనులు, బౌద్ధులవలె వీరును హిందు
వులు కావచ్చును లేక కాకపోవచ్చును" అనువాదమును ప్రసరించు
చున్నారు. ఈదురభిప్రాయమును తీవ్రముగా ధిక్కరించుచు ప్రతి
ఘటించుచున్నాము. జైన సిఖ్ బౌద్ధమతములలో నెక్కడను వేదమం
త్రములతోడను వైదిక దేవతలతోడను సంబంధములేదు. వీరశైవ
మట్లుగాక వేదాగమోపనిషత్పురాణప్రతిపాదితమైన సుప్రసిద్ధ హిందూ
మతము.

నిజాంప్రాంతము బీడుజిల్లా పరళీవైద్యనాథక్షేత్రమున వీర[శై]
లకును స్మార్తులకును వైదికత్వమును గూర్చిన గొప్ప వ్యాజ్యమొ[కటి]
కడచిన క్రోధననామసంవత్సరమున సంభవించినది. ఈ వాద[మ]
నుభయమతీయులగు మహా విద్వాంసులు ప్రాల్గొని ప్రభుత్వము
చేర్పరచిన కమిషన్ ఎదుట నాల్గు మాసములు చర్చించిరి. వీరశై[వు]
తమ వైదికత్వమును సప్రమాణముగ నిరూపించి మహావిజయము[నం]
సమాచారము జగత్ప్రసిద్ధము. సత్య మింత సుస్పష్టమైయుండ [.]
సంప్రదాయముల నెరుగని పామరు లెవరైన వేదమును తిరస్క[రిం]
మాత్రమున సిద్ధాంతము కాజాలదు.

నిజాం ప్రభుత్వమువారి "ధరమ్‌శాస్తర్" అను ఉర్దూ పు[స్త]
ములో "లింగాయత్ శూదర్ హై" అని వ్రాసి యున్నదట! అ[జ్ఞా]
విలాసమునకు నిదియు నొక యుదాహరణము. శూద్రశబ్దము [జా]
వాచకముకదా! "లింగాయత్" అనునది మతముపేరు. అ[ట్టి]
జాతితో సంబంధములేని లింగాయతశబ్దము శూద్రజాతికి నెట్లుచెం[ద]
ఆ పిచ్చి గ్రంథకర్త చెప్పవలసియుండును. "స్మార్తులు శూద్రు[లు]
వైష్ణవులు శూద్రులు" అను వాక్య మెంత యశుద్ధమో "లిం[గా]
యతులు శూద్రులు" అను మాటయు నంతయసంగతము. [ధ]
శాస్త్రమువంటి బాధ్యతగల గ్రంథమును ఇచ్చవచ్చినట్లు అచ్చుగొ[ట్టిం]
చుట పొరపాటు. ప్రభుత్వమువారి మతశాఖలో ఆయామతము[ల]
జెందిన పండితులతో ఆచార్యులతో పరిశోధనగావించి విషయము
సంగ్రహించుట కర్తవ్యము. అట్లుగాక మతధర్మశాస్త్రములు [.]
యని యేవకీలుసాహెబుగారినో ఏ పరమతీయునో అడిగినచో విష[.]
విషయములు గలుగుననుట ముమ్మాటికి సత్యము.

ప్రభుత్వశాఖలో సైతము లింగాయతులు హిందువులా ! య[నే]
సందేహమును కొందఱు కలిగియున్నారు. వారి తీర్మానములుగూ[డ]
కొన్ని వ్యాజ్యములలో ఘోరముగనుండును.

ఇటీవల కర్నాటక మరాఠీప్రాంతములకు జెందిన లింగాయ[త]
ప్రముఖుల మనుకొనువారు కొందరు శ్రీ శ్రీ హైదరీ మహామంత్రిగా[రి]

ముద్దకు ఒక సంఘముగావెళ్ళి తమది ద్రావిడసంస్కృతి యనియును తాము వైదిక హిందువులము కామనియును ప్రభుత్వములో ప్రత్యేక ములు కావలెననియును ఏమేమో విచిత్రముగా చెప్పికొన్నారు. తెలివికి సంతసించవలసిన దేకాని, అసత్యమునకు శాశ్వత విజయము కూరజాలదు. వీరశైవులది ద్రావిడ సంస్కృతి యనుట, హిమాలయ ంతటి గొప్ప యసత్యమని మిత్రులు తెలిసికొందురుగాక. ఈ విష యము మున్ముందు 'విభూతి'లో విశదముగ నిరూపింపబడగలదు. ప్రతివాద పురస్సరముగ దీనిని సిద్ధాంతించుటకు మేము సదా సన్నద్ధు లై యుండగలము.

సహృదయులగు స్వమతీయులు వీరశైవమనియును హిందూ మతాంతర్గతుల మనియును నిరాతంకముగ వ్యవహరింతురుగాక!

న్యాయైక నిరతులగు శ్రీ.శ్రీ నిజాంప్రభుత్వము వారును చక్కగ లోచించి యశ్రమ కార్యక్రమమును నిర్వహించవలెనని కోరు న్నాము.

సికిందాబాద్ 15-7-39 } 'విభూతి' - సంపాదకులు.

---

# ద్రవ్యదాతలు

మావిభూతిపత్రికకు రాజపోషకులుగా నుండుటకై శ్రీమాన్ శరణార్థిగౌరయ్యగారు సబ్ రిజిస్ట్రార్, తాడేపల్లిగూడెం (౨) డాక్టర్. రుద్రప్పగారు L. M. S. హైదరాబాద్ గారలు అంగీకరించినందు కై మాకృతజ్ఞతను వెల్లడించు చున్నాము. ఈమాసమున లభించిన సాయమిది.

౧౧| శ్రీమాన్ శరణార్థిగౌరయ్యగారు. B. A. సబ్ రిజిస్ట్రార్, తాడేపల్లిగూడెం.

౫౦ ,, ధూపం కోటివీరయ్యగారు తెనాలి

౫౦ ,, చుక్కా నాగయ్యగారు కనగాల

ణనాత్, బ్రహ్మాదీనాం లింగధారణదీక్షావిధాయకశ్రుతిస్మృత్యాగమ
పురాణోపబృంహణాభావాత్, "శ్రద్ధాభక్తి ధ్యానయోగాదవేహి"
(కై వ. ౧-౨) ఇతి కైవల్యే శ్రద్ధాభక్త్యవచ్ఛిన్నధ్యానయోగస్యైవ
మోక్షసాధనత్వేనోపదేశాత్, "తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ" (శ్వే. ౩-౮) "జ్ఞాత్వా తం
మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే" (కై వ. ౧-౯) ఇత్యాది
శ్రుతిషు మోక్షస్య జ్ఞానహేతుకత్వోపదేశాత్, "ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛే
న్మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" ఇత్యాదినా జనార్దనస్యైవ మోక్ష
దాతృత్వశ్రవణాత్, "సర్వలింగం స్థాపయతి" ఇత్యత్ర లడంత
త్వేన విధ్యభావాత్, అనేకవిధానే వాక్యభేదదోషాచ్చ. స్థాపయతీతి
శ్రుత్యర్థేన స్థావరలింగస్థాపనపరత్వ ద్యోతనాత్, 'తచ్చ లింగం
పాణినా అభిమంత్రితం పాణిమంత్రిం' ఇత్యర్థలాభాచ్చ, నిర్మలాంతః
కరణస్య బాహ్యకర్మాచరణే ప్రయోజనాభావాత్, రాజనిష్ఠశ్వేతచ్ఛ
త్రాదిలాంఛనానాం భృత్యేష్వదర్శనాత్, పరమేశ్వరనిష్ఠగరలభక్షణ
నాగభూషణాదిధర్మాణాం భయహేతుత్వేన ధర్తు మశక్యత్వాత్,
లింగలాచరణవన్నామ్నాభావేఽపి నిఖిలవైదికశిష్టాచారాభావాత్, సగు
ణోపాసనస్య నిర్గుణసాక్షిచైతన్య ప్రాపకత్వాభావాత్, కామికాదీనా
ముత్సవమోత్సవప్రతిష్ఠాద్యంశేష్వేవ ప్రమాణత్వాత్, ప్రత్యక్షిక
శ్రుతిస్మృత్యాచారవిరుద్ధస్య లింగధారణస్య స్మృత్యనవకాశన్యాయేన
బాహ్యస్మృతివన్న విధేయత్వం, ఇతిచేత్ —

అత్ర బ్రూమః- ప్రత్యక్షికశ్రుతిస్మృత్యాగమపురాణేతిహాస
సిద్ధత్వేన లింగధారణస్యాగ్నిహోత్రాదివద్వైదికత్వం సిద్ధం, తస్మా
దీక్షానంతరం బ్రహ్మజిజ్ఞాసా విధీయతే. "యశ్ఛందసామృషభో విశ్వ
రూపః" ఇత్యత్ర శివస్య భక్తోపాసనార్థం పరిచ్ఛిన్నత్వం యుక్తం,
నారాయణీయే - "నిధనపతయే నమః" (మహానా. అను. ౧౪.) ఇత్యా

దినా లింగస్యసర్వాత్మకత్వ ముక్త్వా 'సర్వలింగం స్థాపయతి' ఇ
తస్యైవ పరిచ్ఛిన్నలింగధారణవిధాయకత్వదర్శనాత్,

సర్వాననశిరోగ్రీవ స్సర్వభూతగుహాశయః,
సర్వవ్యాపీ స భగవాం స్తస్మాత్సర్వగత శ్శివః. (శ్వే. ౩-

"ప్రాంచః ప్రత్యంచోఽహం" (అథర్వశిరః ౧) ఇత్యాది శ్వే
తరాథర్వశిరఃప్రభృతిషు శ్రవణాచ్చ, "ప్రాణేష్వంతర్మనసో
మాహుః" "లింగే సుషుప్తిః" "లింగం బ్రహ్మ సనాతనం"
థర్వశిరో హంసోపనిష ల్లింగపురాణాదిషు నిరుపపదబ్రహ్మ
హ స్తకరపాణిశబ్దవ ల్లింగపర్యాయత్వేన నిర్దేశాత్, "అమృతస్య
ధారణో భూయాసం......శ్రుతం మే గోపాయ" ఇతివాక్యే
పదవిభాగే అపరిమితాధికరణన్యాయేన సన్నిధిశ్రుతధారణశబ్దా
పరిత్యజ్య వ్యవహితే గోపాయేత్యత్ర అన్వయాయోగాత్, బ్రహ్మ
కోశోఽసీతి సన్నిహితబ్రహ్మపదస్యైవ విభక్తివిపరిణామేనాన్వయ
వాత్, ధారణశబ్దస్య సంయోగార్థకత్వేన అమృతపదవాచ్యస్య మో
అన్యథాఽయోగాత్,

లింగాంగసంగినో వత్స! పునర్జన్మ న విద్యతే,
యుగపజ్జ్ఞానసిద్ధిస్స్యా త్తతో మోక్ష మవాప్నుయా

ఇతిశంకరసంహితావచనేన తస్యైవ మోక్షోపదేశాత్, "శ
మే విచర్షణం" ఇత్యాదినా బాహ్యపదార్థఫలవిశేషవిధానా
"అత్యాశ్రమస్థస్సకలేంద్రియాణి" (కై వ. ౫) "అత్యాశ్రమీ సర్వ
సకృద్వా జపేత్" (కై వ. ౨౪) "వ్రతమేతత్పాశుపతం పశు
విమోక్షాయ" (అథర్వశిరః ౫) వ్రతమేతచ్ఛాంభవమ్ సర్వే
వేదేషు వేదవాదిభిరుక్తం భవతి తస్మాత్ తత్సమాచరేన్ముముక్షు
పునర్భవాయ" (కాలాగ్ని ౧) తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదే
(ముం ౩-౨-౧౦) తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మ

...(౬-౨౩) ఇతి కైవల్యాథర్వశిరః కాలాగ్నిరుద్ర ముండక శ్వేతా
...తరాదిషు పాశుపతవ్రతస్యైవ బ్రహ్మవిద్యాధికారిత్వోపదేశాచ్చ
...గధారణదీక్షితస్యైవ బ్రహ్మవిద్యాధికారిత్వం సిద్ధం.

నను—"కైవల్యశ్వేతాశ్వతరాద్యుపనిషత్సు లింగధారణవిధా
...కవాక్యాదర్శనాత్ పాశుపతవ్రతస్య భస్మధారణపరత్వమేవ"
...చేన్న, పాశుపతదీక్షితస్యైవ లింగిన స్తదంగత్వేన భస్మధారణ
...ధాయకత్వోపదేశాత్,

లింగాంగసంగినాం చైవ పునర్జన్మ న విద్యతే,
ఏష పాశుపతో యోగః పశుపాశనివృత్తయే.

సర్వవేదాంతసారోఽయ మత్యాశ్రమ ఇతి శ్రుతిః,
పరబ్రహ్మాభిధం లింగం పశుపాశవిమోచకం.

యో ధారయతి సద్భక్త్యా స పాశుపత ఉచ్యతే,
శరీరత్రితమే భక్త్యా లింగం పరశివాత్మకమ్,
యో ధృత్వా విచరేద్భూమౌ స పాశుపత ఉచ్యతే,
లింగం శివో భవేత్ క్షేత్ర మంగం సంయోగ ఆశ్రయః,
తస్మాల్లింగాంగసంయుక్తో యస్తు సోఽత్యాశ్రమీ భవేత్.
బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థో యతిస్తు వా,
యస్తు లింగాంగసంయుక్తః స ఏవాత్యాశ్రమీ భవేత్.

ఇత్యాదిత్యలైంగస్కందకూర్మపురాణేషు పాశుపతాత్యాశ్రమి
...బ్దయో ర్లింగధారిపర్యాయత్వేన నిర్దేశాత్ తత్పరత్వమేవేతి సిద్ధం.
...ంచ, సామజైగీషీయశాఖాయాం సదానందోపనిషది—

అంతర్ధారణశక్తో వా హ్యాశక్తో వా ద్విజోత్తమః
సంస్కృత్య గురుణా దత్తం శైవం లింగ మురస్థలే
, ధార్యం విప్రేణ ముక్త్యర్థ మేవం వేదవిదో విదుః॥

ఆథర్వణే ఐశ్వర్యశాఖాయాం—

యో వామహస్తార్పితలింగమేకం పరాత్పరం ధారయతే
సతతం విప్రః క్షత్రియోవా। తస్యైవ లభ్యః పరమేశ్వరో
సౌ నిరంజనః పరమం సామ్యముపైతి దివ్యం.

ఇత్యాదిమంత్రేషు పరమేశ్వరధ్యానధారణ మేవ ముముక్షూ
విధేయ మితి శ్రూయతే. రుద్రాధ్యాయే—

"అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యోభిషక్" ఇత్యనేన
శివస్యైవ జననమరణప్రవాహరూపసంసారరోగనివారకత్వం సూచి
అత ఏవ వేదపురుషేణాపి లింగధారణస్యైవ పశుపాశవిమోచక
ఋగ్యజుస్సామాదిషూపదిశ్యతే. ఋగ్వేదే—

"అయం మే హస్తో భగవానయం మే భగవత్తరః, అయం
విశ్వభేషజోఽయం శివాభిమర్శనః, అయం మాతాయం పితా
జీవాతురాగమత్, ఇదం తవ ప్రసర్పణం సుబంధవేహి నిరీహి
(౮-౧-౩౫) ఇత్యనేన వేదపురుషస్య పాణిలింగధారణం నిర్దిష్ట
"శివాభిమర్శనః" ఇత్యత్ర స్థావరలింగస్పర్శో వివక్షిత ఇతి చేత్-
శివ మభిత స్సర్వదా స్పృశతీత్యర్థలాభాత్ సార్వకాలిక స్పర్శాన్య
నుపపత్త్యా నాన్యార్థో యుక్తః. ఏతదేవ వాతూలే శ్రూయతే—

'ధారయేద్యస్తు హస్తేన లింగాకారం శివం సదా,
తస్య హస్తస్థితం విద్ధి మత్పదం సంపదాం పదం' ఇతి.

అగ్న్యవచ్ఛిన్నాయఃపిండస్య తన్నిష్ఠదాహకత్వప్రకాశకత్వా
శవత్ లింగధారణేనైవ తత్కరస్య భగవత్తరత్వ - విశ్వభేషజత్వా
పరమేశ్వరధర్మాః ప్రతిపాద్యంతే. తథా కామికే—

అయం మే హస్తో భగవానితిమంత్రేణ సర్వదా,
పాణిలింగధృతిర్వేదపురుషస్య సమీరితా॥ ఇతి.

యజుర్వేదే—

యా తే రుద్ర శివా తనూ రఘోరాఽపాపకాశినీ
తయా నస్తనువా శంతమయా గిరిశంతాభిచాకశీహి॥
(తై. సం ౪-౫-౧-౧)

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం,
ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మామృతాత్.
(తై. సం. ౧-౮-౬-౧౧)

సోమారుద్రా యువమేతాన్యస్మే విశ్వా తనూషు భేషజాని ధత్తం,
అవస్యతంముంచతం యన్నో అస్తితనూషు బద్ధం కృతమేనో అస్మత్.
(తై. సం. ౧-౮-౨౨-౪౨)

ఇత్యాదిమంత్రాణా ముపబృంహణం శ్రూయతే. లైంగే—

యా తే శివా తనూ రుద్ర లింగం మంగలదాయకం,
లింగం శివా తనూః ప్రోక్తా మూర్తి ర్ఘోరా తనుః స్మృతా.
అపాపేషు చ భక్తేషు తయోర్మధ్యే శివా తనూః,
కాశతే పరమేశస్య శిష్టాస్తే లింగధారిణః.
తయా శంతమయా సౌఖ్యకారిణ్యా లింగరూపయా,
అభిచాకశీహి తన్వా గిరిశంతాభిరక్ష మాం.
త్రియంబకం విరూపాక్షం లింగం బ్రహ్మ సనాతనం,
యజామహే ధారయామః సుగంధిం పుష్టివర్ధనం.
ఉర్వారుకం యథా బంధా న్మృత్యో ర్ముక్షీయ మామృతాత్.
ప్రథమాష్టే యజుర్వేదే ప్రశ్నే చరమసంజ్ఞకే,
లింగధారణ మాఖ్యాతం వేదపుంసాం మహాత్మనాం.
సోమారుద్రా యువామేతాన్యస్మే అస్మభ్యమేవ హి,
విశ్వాని భేషజానీష్టప్రాణభావాత్మకాని చ.

తనూషు దేహాశ్రితయే బద్ధం మాయామలాత్మకం
కృతం యదేనో దురితం మనోవాక్కాయకర్మజం.
తదస్మదస్మత్రస్తూర్ణం ముఖ్యకోఽవస్యతం యువాం,
ముంచతం కృపయా సమ్యక్ పరిమోచయతమీశ్వరౌ. ఇతి.

సోమారుదా౹-సోమారుద్రౌ, "దేవతాద్వంద్వే చ" (పాణి
సూ. ౬-౩-౧౨౧) ఇతి పూర్వపదస్య దీర్ఘః, "సుపాం సులుక్"
(పాణిని సూ. ౭-౧-౩౯) ఇత్యాదినా ఆత్ప్రత్యయః తత్రైవ పరమే
రస్య మూర్తిద్వయం శ్రూయతే. "రుద్రోవా ఏష యదగ్నిస్తస్యై
తనువౌ ఘోరాఽన్యా శివాఽన్యా" ఇతి. తస్మాత్సోమరుద్రశబ్దాభ్యా
ఘోరాఘోరమూర్తిద్వయముక్తం. యువం - యువామిత్యర్థః విశ్వా
విశ్వేతి టాబంతమేతత్; విశ్వానీత్యర్థః. ఏతాని భేషజాని - భవరో
హరాణి ఇష్టప్రాణభావసంజ్ఞకాని, అస్మే - అస్మభ్యం, "సుపా
సులుక్" ఇత్యాదినా శే ఇత్యాదేశః. తనూషు-శరీరత్రితయే, ధత్తం
ధారయతం, నః తనూషు బద్ధం-అనాద్యవిద్యావాసితం, అత ఏవ కృతం
ఏనః - దురితం, యదస్తి, తత్, అస్మత్ - అస్మత్తః, యువాం అ
స్యతం ముఖ్యతః, ముంచతం - మోచయతం "ఉమాసహాయం ప
మేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం" (కై. ౧
ఇత్యాదిష్వద్వితీయస్య శివస్య పరబ్రహ్మణో మూర్తిద్వయ ప్రతిపాదన
దత్ర "సోమారుద్రా" ఇతిమంత్రే తద్వదుభయం నిరూపితం. ఉమయా
సహితః సోమః - పంచోపనిషన్మయదివ్యమంగల విగ్రహః, రుజం
భక్తసంసారదుఃఖం ద్రావయతీతి రుద్రః, యువామేతావుభౌ అస్మ
చ్ఛరీరేషు ఇష్టాదిలింగస్వరూపాణి ధారయిత్వా అస్మచ్ఛరీరావచ్ఛిన్న
మలత్రయాత్మకకిల్బిషం నాశయతమిత్యర్థః.

"విశ్వేదేవం (?) విదుషా వేదితవ్యం శైవం లింగం ప్రభృతి
సర్వదేవైః, తదాత్మసిద్ధే ర్మునిభి ర్ముక్తికామైః కంఠే హస్తే మస్త

ా భవతు ధార్యం." ఇతి సామవేదేఽపి అత ఏవ భవభేషజాత్మక
వలింగధారణాదికం ముముక్షూణా మావశ్యకం.

"పవిత్రం తే" (ఋ. ౭-౩-౮) ఇతి ఋగ్వేదమంత్రస్య—

ఋగిత్యాహ పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే,
తస్మాత్ పవిత్రం తల్లింగం ధార్యం శైవ మనామయం.
బ్రహ్మేతి లింగమాఖ్యాతం బ్రహ్మణస్పతి రీశ్వరః,
పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కా త్తనుః శుచిః.
అత స్తతను రజ్ఞో వై హ్యామ స్సంస్కారవర్జితః,
దీక్షయా రహిత స్సాక్షా న్నాప్నుయా ల్లింగ ముత్తమం.
(సి. శి. పరి. ౬)

ఇతి సిద్ధాంతశిఖామణౌ శ్రీరేణుకాచార్యేణ లింగధారణపర
స్యేన నిర్దేశాత్,

భక్తస్యాభిభ్రతో లింగం యావత్ప్రాణవిధారణం,
శ్వమాంసభక్షణం తావ దన్నేన రచితం భవేత్.
లింగస్య ధారణం యస్య స్థూలదేహే న విద్యతే,
తద్దేహం నిష్ఫలం జ్ఞేయం జీవత్యక్తశరీరవత్.
తస్మాత్తద్ధారణం ప్రోక్తం యావజ్జీవాగ్నిహోత్రవత్,
యథా శ్మశానగం కాష్ఠ మనర్హం సర్వకర్మసు,
తథా లింగవిహీనస్తు సర్వకర్మబహిష్కృతః.

ఇతి వాతూలస్కాందలైంగాదిషు సంధ్యావందనాదివదకరణే
త్యవాయదర్శనాచ్చ లింగధారణస్య నిత్యత్వం సిద్ధం.

కించ—భూయాసమిత్యత్రాపి "మేధావీ భూయాసం" "బ్రహ్మ
ర్చస్వీ భూయాసం" "అహమేకః ప్రథమమాసం" ఇత్యాదిష్వివ
ద్ధ్యర్థోపపత్తేః, దేవతాంతరధారణవిధాయకప్రమాణాచారాదర్శనాత్,
క్షాఽకరణే శరీరత్రయగతాణవాదిమలత్రయధ్వంసాభావాత్,

వైదికత్వం యథా వహ్నేః సర్వవేదప్రమాణతః,
తథా వేదైకసిద్ధత్వా ద్వైదికం లింగధారణం.
వేదవేదాంతశాస్త్రేషు పురాణేష్వాగమేషు చ,
బ్రాహ్మణస్య సమాఖ్యాతం లింగధారణముత్తమం.
ఇత్యారభ్య,
వేదోత్తమే యజుర్వేదే తైత్తిరీయే విశేషతః,
మోక్షార్థినాం ముక్తిహేతుర్లింగధారణ మీర్యతే.
ఛందోభ్య స్సర్వవేదేభ్యో హ్యమృతాత్సంబభూవ హి,
ఇంద్రస్తు పరమైశ్వర్యశాలీ సాంబస్త్రిలోచనః.
మాం మేధయా ప్రజ్ఞయా చ స్పృణోతు ప్రీణయత్వథ,
అమృతస్య మోక్షలాభాయ సర్వదేహేషు సర్వదా.
దేవస్య లింగరూపస్య శివస్య పరమాత్మనః,
ధారణం తద్ధృతిర్యస్య దేవధారణ ఇష్యతే.
తస్మాచ్ఛరీరం మే లోకే విచర్షణ మకిల్బిషం,
జిహ్వా మే రసనా భూయా న్మధురాలాపభాషిణీ.
కర్ణాభ్యాం శ్రోత్రియుగ్మేన భూరి వ్యశ్రవమస్త్వహం,
బ్రహ్మణః పార్వతీశస్య కోశోఽధిష్ఠానమేవ హి.
అసేరివ యథా లోకే ప్రజ్ఞయా మేధయా వృతః,
శ్రుతం తచ్ఛ్రవణాదీని మే గోపాయ ప్రయత్నతః.
ఇత్యాదినా లైంగే ఏతదుపబృంహణశ్రవణాత్,
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రహరేదితి,
ఇతిహాసపురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్.
వేదార్థో యః స్వయం జ్ఞాత స్తత్రాజ్ఞానం భవేదపి,
ఋషిభిర్నిశ్చితే తస్మిన్ కా శంకా స్యా న్మహాత్మనాం.
ఇత్యాదిస్మృతౌ స్వతంత్రతయా వేదార్థనిరూపణనిషేధదర్శ
నాచ్చ నాన్యార్థో యుక్తః. "లింగినం చక్రిణం దృష్ట్వా" ఇత్యా

విభూతి-౧-౭



శ్రీ ఉజ్జయినీ మహాకాళేశ్వరలింగము

శ్రీకర గోపబాలకుడు



సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

| | | |
|---|---|---|
| గ్రంథము ౧ | సికింద్రాబాదు<br>శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి<br>నిజశ్రావణము | రేఖ ౨ |

ఓం

# సామరస్యము

## ఇవటూరి సుందరయ్యగారు

సీ॥ శ్రీవినూతన శోభావిశేషగరిమ, ప్రకృతియందంతటను ననిర్వాచ్యమగుచుఁ
దోఁచెఁ; దరులతాగుల్మ సందోహమందుఁ, జారురక్త ప్రవాళమంజరులు వొడమెఁ
జిరులకొమ్మలఁ గూర్చుండి చివురు మెసవి, కమ్రకలకంఠకులము లుత్కంఠ మెఱయ
విరహిజనకర్ణపుటసముద్భేదనముగఁ, గుహుకుహూరావములతోడఁ గూయఁదొడఁగెఁ
బాంథ బృందంబు వేటాడఁ బయనమైన, ప్రసవబాణుని ములుకులు పదను వెట్టి
మొనలు గన్పింప నింపిన పొదులనంగఁ, గొనలునిగుడించి నిలుచుపూగొలలతోడి
మావిగున్నలు దనరారె; మధుపకులము, కలితసుకుమార కేసరాగ్రములు గలిగి
యంటినను గందు పూగుత్తులందు వ్రాలి, మధువులానుచు మత్తిలి మసలఁ దొడఁగె

మలయ సానుతటంబులఁ దలయఁదిరిగి, త్రిపుటఁ బొదరిండ్ల రతికేళిఁ దేలియుబ్బి
యంబుదముక్రింద సాంధ్యరాగంబుమీద, నమరచందురులఁ బోలుచు నలకమా
దనరుమోములు రక్తహస్తములఁజేర్చి, నిదురఁజెందినచెంచు కన్నియలచెక్క
దోయిఁ బొడమిన ఘర్మబిందువులఁదడిసి, కమ్మపుప్పొడి వాసనల్ గడలుకొ
బిల్లతెమ్మెరకూనలు వీవఁదొడఁగె, నిట్టలంబుగఁ దమిహెచ్చ నిట్టివేళఁ
గటితటంబునఁ బులితోలు కరము మెఱయ, నలుత రుద్రాక్షమాలిక లమరుచు
గంబుగళమున గరళంబు గ్రాలుచుండ, ఫాలతలమునఁ దిగకన్ను పరగుచుండ
విమల శశిరేఖ మౌళిపై వెలుఁగుచుండఁ, జల్లవారుణ ఘనజటాపటలి మెఱయ
శారదస్వచ్ఛ చంద్రికా చారురుచుల, యోగముద్రా నిరూఢితో నొక్క
జాహ్నవీతోయశీకరాసారపూత, విధుశిలాతల నిర్మల వేదియందు
భువికి దివికిని నైక్యంబు పొందుపడఁగ, గొంతతడ వట్లుకను మోడ్చి కూరుచుండి
కన్నులను విప్పి దెసలెల్లఁగలయఁజూచి, యిప్పుడీ చిత్తవికృతికి హేతువేమి
యంచుఁదలపోసి, కనుగొంటి నక్కటకట, సతినిగోల్పోయియున్న నాచందము
చిత్తసంభవుఁ డరీతిఁ జేయనోపు, వీని నూరక యుండిన విల్లువీగి
యనదలను బాధపెట్టెడు నంచు నెంచి, నొసటి కంటిని దెఱవంగ నసమశరుడు
నిలువు నీఱయ్యె; నంతట నీలగళుఁడు, సతియుదంతము తలపోసి మతికలంగి
దక్షునింటికిఁ బోవంగఁ దగదటంచు, బెక్కు తెఱఁగులఁ జెప్పిన వినకయేగి
తనువుఁ దొఱఁగెను నాసతీ తరళనయన, యేమి సేయుదు విరహాగ్ని నీదుటెట్లు
నంచుఁ జింతించి చింతించి యంతలోన, మోదమందుచు నెంతటి మోసమయ్యె
నింతి గోల్పోవు టన్నది వింతగాదె, "పృథ్వి నేనాదు గంధంబు పువ్వుబోడి
జలము నారూప మింతియె చల్లఁదనము, హోత్రి నేనాదు నామెయే హోత్ర
చందురుఁడను నేనునామెయే చంద్రికయగు, ధరణి నేనాదుఁ దరుణియే తాప
నగ్ని నామూర్తి యుష్ణత యబలగాదె, పవనుఁడను నేను వ్యాపనపటిమయ
పదము నేనాదు నందలి ధ్వనియె లలన, చిగురు నేనాదుఁదావియే వెలది య
మధువు నేనాదు నింతియే మధురిమంబు, ఫలము నేనాదు రుచి యిందువదన
పలు పలుకులేల? సకలమౌ వస్తుచయము, నేన యగుదును దచ్ఛక్తియే లతాం
కనుక నామెకునాకును గలదె? వేరు?, నాదుమూర్తిని విడిచి యానాతియున్నె
యంచుఁ దనదేహమెల్ల వీక్షించునంత, తలను నొకదెస కేశముల్ నలుపు నెం
గజ్జలం బొక్కకంటను గానవయ్యె, శ్రవణమొంటను గర్ణపూరంబుదోచె
సగము మెడయందుముత్తెపుసరులు బరఁగెఁ,గంకణము లొక్కకేలను గ్రాలఁ జొ
గటిని సామున రక్తాంశుకంబు మెఱసె, వేయునేటికి వామంబు వెలదియయ్యె
నంత వెఱఁగంది దరహాసమాచరింప, బిల్లతెమ్మెరకూనలు మెల్లజాఱె
షట్పదంబుల ఝంకృతుల్ సన్నగిల్లెఁ, జాతకళికలు చిటికలో సురిగిపోయె
గమ్రి కలకంఠరుతములు కడలువట్టె, రక్తపల్లవజాలంబు రహిదొలంగె
ప్రకృతిసౌభాగ్యమంతయుఁ బాసిపోయె, దనరుపులితోలు రుద్రాక్షదామకము

...పభూషలు గరళంబు చంద్రరేఖ, కర్ణపూరంబు కన్నునఁ గాటుకయును
...హారంబులును పైడికంకణములు, కటిని విలసిల్లుచుండెడు కావిచీర
...యమయ్యెను జితిమా మహిమలోడ, చంద్రికాస్వచ్ఛ రుచిరతేజంబు మాటి
...శుక్లప్రభావిమిశ్రింబు నగుచు, చంద్రసూర్యానలద్యుతిశబలమగుచు
...ప్రికర్త్యంబు దుర్నిరీక్ష్యంబు నగుచు, త్రైపురంబగు తేజంబు దశదిశలను
...డి వెలుఁగుచు నిత్యమై నిలిచియుండె. విశ్వమోహన శృంగార విలసనంబు
...విచ్ఛేద వైరాగ్యభాసురంబు, ధ్యానగమ్యంబు దుఃఖవిదారకంబు
...లభ్యంబు సచ్చిదానందదంబు, ప్రకట శివశక్తి సమరసత్వంబుఁ దెలుపు
...ప్రకాశంబు వర్ణింపఁ జాపలమున, సాహసించితిఁ గావున సరసులార!
...ధురంబయి యిందున్న భావపురసి, కృపను గుణమునె గొనుచు వీక్షింపరయ్య!

---

# వాంఛితము

## బి. ఎస్. కృష్ణారావుగారు

విలసితామరనదీ వీచికావళితోడ
పల్లవారుణ జటాపటలితోడ
భూరి పాండురభూతి భుజగభూషలతోడ
నెలవంకపూరెక్కవలపుతోడ
తిలకంబు పావకదీప్త తేజముతోడ
సామేన గట్టురాచానతోడ
పటుతరగజచర్మ వసనంబుతోడుత
కేలమువ్మొనగల వాలుతోడ
త్రిజగదభిరాముడైన యా ద్విజశిరుండు
కరుణవెదజల్లు చల్లని కన్గవలను
పద్మముఖమాసపత్రిక బహులభంగి
అంచితస్ఫూర్తి వెలయ రక్షించు గాత. *

---

* ఇకముందు ఆధునికుల కేవల ప్రశంసాపద్యములుగాని స్తోత్రములుగాని ప్రకటింపబడవు.

— సంపాదకుడు.

# (3) శ్రీ ఉజ్జయినీ మహాకాళేశ్వరలింగము

మఠం సిద్ధవీరయ్యగారు ఉపాధ్యాయులు



శ్రీ మహాకాళేశ్వర జ్యోతిర్లింగము, మాళవ దేశాంతర్గత క్షిప్రానదీ తీరస్థ ఉజ్జయినీనగరమునందుగలదు. దీనికి అవంతికాపురి యను నామాంతరము. భారతవర్ష మందలి సుప్రసిద్ధమైన సప్తపురులలో నిదియొకటి:—"శ్లో॥ అయోధ్యా మథురా మాయా
కాశీ కాంచీ హ్యవంతికా
పురీ ద్వారవతీచైవ
సప్తైతా మోక్షదాయికాః."

స్కాందపురాణమందలి యవంతికాఖండమున నీ యవంతికా నగరసంబంధమైన విపులమగు వర్ణనగలదు. మహాభారతము, ... పురాణములయందును నవంతికా నగర మహిమాభివర్ణన గావింపబడియున్నది. "క్షిప్రానదియందు స్నానమొనరించి బ్రాహ్మణ భోజనముఁ గావించినవారికి సమస్త పాతకములు వినాశనమగును. దరిద్రములేమి పోవును. ఇచట విక్రమాదిత్య మహారాజుగారి ... స్తంభముల సభామండపము మంగళగ్రహక జన్మస్థానము మంగళేశ్వర భర్తృహరిగుహలు గలవు. సాందీపనిముని ఆశ్రమము (ఈ ప్రదేశమునందే శ్రీ కృష్ణభగవానుఁడును శ్రీ బలరాముఁడును విద్యాభ్యాసము మొనరించినట్లు చెప్పుదురు.) ఉన్నది. మహాపరాక్రమశాలియగు విక్రమాదిత్య మహారాజు రాజధానియు నిదేపట్టణము. ఇతని సభామండపమునం దాస్థాన కవిశేఖరులగు కాళిదాస ప్రభృతి నవరత్నములీదిగువ నుదాహరించినవారుండిరి:—"శ్లో॥ ధన్వంతరి, క్షపణ, కామర సింహ శంఖ। బేతాళభట్ట, ఘటకర్పర, కాళిదాసాః। ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం। రత్నాని వై వరరుచిర్నవవిక్రమస్య."

ఇచట సింహరాశియందు బృహస్పతి ప్రవేశించిన గొప్ప కుంభమేళా (తిరునాళ్ళ) జరుగును. పండ్రెండువర్షములకొకసారి యీ మహోత్సవమునకు వేనవేలుయాత్రికులిచటి కేతెంచెదరు. శ్రీ మహా

..శ్వరలింగస్థాపనసంబంధమగు నితిహాస మీవిధముగా పురాణము
..లోఁ జెప్పఁబడియున్నది.

శ్రీకర గోపభక్తుః చరిత్ర

ప్రాచీనకాలంబునం దుజ్జయినీనగరమును చంద్రసేనుఁడను
..గలరాజు పరిపాలించుచుండెను. అతడు గొప్ప శివభక్తుఁడు. ఒక
..డు రాజచంద్రుఁడు శివార్చనయందు లీనుఁడై యుండెను. ఆ సమయ
..న శ్రీకరుఁడను పేరుగల పంచవర్షముల గోపబాలకుఁడు తన తల్లి
..టు నచటికివచ్చెను. రాజొనరించు శివపూజంగాంచి యా శాబకుని
..తమగు కౌతూహలము గలిగెను. రాజుననుకరించుటకై స్వయముగా
..పూజగావింప నుత్కంఠితుడయ్యెను. రాజమందిరమునుఁడి గృహా
..ఖుఁడై మార్గమధ్యమున నొకశిలను చేఁబూనెను. స్వగృహముఁ
..వేశించి యాశిలను శివస్వరూపమున భావించి యొకచోట స్థాపన
..నర్చించెను. పుష్పచందనాదులతో నత్యంత శ్రద్ధాపూర్వకముగ
..లింగమునర్చించుచుండెను. పూజింపుచు మానస మా పరమేశ్వరుని
..యందు లగ్నముగావించి ధ్యాననిష్ఠయందుండెను. చాలాకాలమైనదని
..పబాలకునితల్లి యాహారముభుజింప తన సూనునిఁ బిలువవచ్చెను.

కుమారునిసమాధిస్థితినిగాంచి పిలువఁజాలక యట్టే యొకించుక
..డ వచట నిలిచెను. తుద కా యమ వేసటజెంది యా శివలింగమును
..హారమునఁ బడవైచి బాలకుని బలవంతముగ నెత్తుకొని రాసాగెను.
..ల్లి బలాత్కార మా డింభకుని సమాధినిష్ఠనుండి మరలింపజాల
..య్యెను. సరళచిత్తుఁడగు శ్రీకరుఁడు "శంభో మహాదేవ" యని బిగ్గ
..గా నఱవ మొదలిడెను. హతాశురాలై మాత తిఱిగిపోయినది.
..కాని బాలభక్తుని ప్రార్థన మెడతెగక సాగుచుండెను. ఇట్లు ప్రార్థన
..గావింపుచునే యీశ్వరధ్యానమున దన్మయుఁడై మూర్ఛాపరవశుఁ
..డయ్యెను.

చిట్టచివరకు భక్తజన వశంకరుఁడగు శంకరభగవానుఁడు తన
..సదయాళుత్వమును భక్తజన సులభత్వముఁ బ్రకటింపగోరి ప్రసన్నుడై
..సాక్షాత్కరించెను. అంత నా బాలకుఁడు సమాధిఁ జాలించి కన్నులఁ
..దెఱచి చూడగా నెట్టయెదుట నొక విశాలమందిరము స్వర్ణరంజితమై

మణిమయంబై నది కాన్పించెను. అం దతిప్రకాశమానంబగు జ్యో
ర్లింగము దేదీప్యమానముగా విరాజిల్లుచుండెను. బాలభక్తు డాశ్చ
సాగరమున నిమగ్నుడయ్యెను. శ్రీ శివభగవానుని స్తుతింగావిం
మొదలిడెను. వెనుకనుండి తల్లి యీ దృశ్యమును గాంచి యానందా
శయమున తన ప్రియతనూజుని లేవనెత్తి గాఢాలింగనము గావిం
సంతసమను సంద్రమున మునింగియుండెను.

ఈయద్భుత ఘటనమును చంద్రసేన రాజేంద్రుడు చారులవ
నాలకించి యచటికే తెంచి నిజపరిస్థితింగాంచి యాశ్చర్య సాగరము
దేలియాడుచుండెను. బాలుని యెత్తికొని ప్రేమపూర్వకముగా చుం
నము గావించెను. అంతలోనే యంజనాసూనుడగు హనుమంతు డచ
ప్రసన్నుడై యచటి జనుల సంబోధించి యిట్లు ప్రబోధించెను.

"ఓ జనులారా! ప్రపంచమునం దతిశీఘ్రకాలమున కళ్యాణమ
గావించువాడు శివభగవాను డొక్కడే. మీ రెల్లరీ గోపబాలకు
చరిత్రము బ్రత్యక్షముగాం జూచుచున్నారుగదా! ఇతండేమి తపస్సు
గావించెను? అరణ్యములందు ఋషులు మునులు సహస్రాధిక వ
ములు కఠిన తపోనియమాదులం గాంచంజాలని ఫలము నీత డనాయ
సముగాం బొందెను. భక్త సులభుడగు శ్రీ శంకరుని విశేష ప్రేమకు
బ్రత్యక్షనిదర్శనముగాదా! మీ రందఱును నితని దర్శనము
గృతార్థులైతిరి. కావున మీరు యీ విషయమును జ్ఞాపకమునం దుంచు
కొనుండు. ఈ బాలుని యెనిమిదవ తరమున మహాయశస్వియగు
నందగోపకుం డవతరించును. అతని గృహమున శ్రీకృష్ణ భగవానుడు
పుత్రరూపమున ననేకకాద్భుత లీలలగావింపగలడు." ఈ విధముగా
దెలిపి మహావీరుడగు హనుమాను డంతర్ధానమయ్యెను. ఈ మహా
కాళేశ్వరు నర్చింపుచు అంత్యకాలమున శ్రీకరగోపుడు చంద్రసేన
మహారాజు సపరివారముగ శివసాయుజ్యమందిరి.

శ్రీ మహాకాళేశ్వరలింగమునకు సంబంధించిన యితిహాసము
మఱియొకటి కలదు. ఒకానొకసమయమునం దీ యవంతికా నగరమున
దొక ఆహితాగ్నిహోత్రియును వేదపాఠియునగు ద్విజకుల శేఖరుం
కాపురముండెను. అతనికి దేవప్రియ, ప్రియమేధ, సుకృత, సువ్ర

మను పేర్లుగల్ల పుత్రచతుష్టయముండెను. పితాపుత్రు లత్యంత శివ
క్తియుక్తులై ధర్మనిష్ఠచేఁ బ్రవర్తింపుచుండిరి. అంత వారిఖ్యాతి
లకించి బ్రహ్మచే వరముల నందిన దూషణుడను పేరుగల మహా
దాంధుడగు రాక్షసుఁడు రత్నమాలయను పర్వతమున వసించెడి
ను తనపరివారసహితముగా బ్రాహ్మణునిపై దండెత్తి వచ్చెను.
రవాసులందరు నసురబాధచే మిగుల పీడితులై యుండిరి చివరకు
బ్రాహ్మణ శివభక్తి మాహాత్మ్యమున భగవానుఁడగు శంకరుఁడు
త్యక్షమై యొక మేఘగంభీర నిస్వనము గావింప నా దానవుఁడు
గత జీవుఁడయ్యెను. పిదప లోకకళ్యాణార్థము సదా తత్ప్రదేశమున
సమొనరింప నాబ్రాహ్మణ శ్రేష్ఠునకు వరప్రదానముగావించి
హాదేవు డంతర్హితుఁడయ్యె. తదాది నా మహాదేవుఁడు లింగరూప
మున విరాజమానుఁడయ్యెను. జ్యోతిర్లింగ సమీపమున జగన్మాత
యగు పార్వతీదేవియు శ్రీ గణేశుఁడును కలరు. భగవానుడు భయంకర
ర్జన గావించుటచే నా జ్యోతిర్లింగమునకు మహాకాళేశ్వరలింగ మను
పేరు గలిగినది. ఈ మందిరము అయిదంతస్తులు గలిగి మిగుల విశాల
మైనది. క్షిప్రానది కొంకెంచుక దూరమున నున్నది. మందిరముయొక్క
యూర్ధ్వభాగమున శ్రీ ఓంకారేశ్వరమూర్తి గలదు. అధోభాగమున
భూగర్భమునందు మహాకాళేశ్వరుడున్నాడు. యాత్రికులు రామఘట్ట
మునను లేక కోటితీర్థమున సుస్నాతులై శ్రద్ధాభక్తులతో నగస్త్యేశ్వర,
కోటీశ్వర, కేదారేశ్వర, హరసిద్ధిదేవి (విక్రమాదిత్యమహారాజు కుల
దేవి) మున్నగు వారిని దర్శించి మహాకాళేశ్వరుని జేరుదురు. ప్రాతః
కాలమున మహాకాళేశ్వరునికి ప్రతిదినముఁ జితావిభూతిచే యర్చన
జరుగును. ఆసమయమున యాత్రికులు ప్రత్యేకముగ దర్శింపవలెను.
ఇచట ననేకమందిరములు గలవు. వీనిలో నెక్కువభాగము విక్రమాదిత్య
మహారాజ నిర్మితములే. ఈప్రదేశము (B. B. and C. I Ry) మధురా
నాగదా లైనునందు నాగదాస్టేషనుకు సన్నిహితముగనే యున్నది.
స్టేషను సమీపమున క్షిప్రానదీతీరమున నొక సుందర ధర్మశాలయు
గలదు. (శ్రీకర గోపభక్తుని శివ ప్రత్యక్షమును దెలుపు చిత్రము
నిందు మొదట బ్రచురించినాము.)

---

# సుభాషితము

కవిరత్న : లక్కన మల్లికార్జునుడుగారు



౧

క. పతిలేని కాంత సొగసును
సతిలేని గృహంబు సుగుణి సంతతిఁ గన న
ట్టితనువు శాంతిరహితమగు
యతిజన్మము తృణసమాన మన్నిటియందున్.

౨

క. విధమెఱుఁగని యుద్యోగము
నద నెఱుఁగని జన్మతీరు ననురాగముతో
వదలని వాక్కులు జ్ఞాన
ప్రదమును గానట్టిబోధ వ్యర్థములుసుమీ.

౩

క. శివభక్తిలేని జన్మము
ప్రవిమల భావములు లేని పలుకులకూర్పున్
నవరసము లేని కవితయు
భువిఁ బన్నీరందుచున్న బూడిద కాదే !

౪

క. దీక్షను వడయని శైవుఁడు
శిక్షను గనఁజేసి ముక్తిఁ జేర్పనిగురుడున్
దక్షత భక్తిప్రౌఢిమ
రక్షింపని వీరశైవరాజ్యము వృథయా.

౫

క. అక్కఱకురాని గురువులు
మక్కువతోఁ బూజలిడని మాయలశిష్యుల్
మ్రొక్కని శిరములు శివునకు
లక్కనవారింట లోష్టలవములు సుమ్మీ !



# బసవేశ్వరుఁడు — బిజ్జలుఁడు

**బండారు తమ్మయ్యగారు**



ఉ. ధరణిని వీరశైవమత ధర్మము సన్నగిలంగఁ దత్సము
ద్ధరణముకై శివాజ్ఞఁ బ్రమదంబు మెయిం జనుదెంచు నందికే
శ్వరు నవతారమైన బసవప్రభు నాతని రాజు బిజ్జలున్
గర మనురక్తినెంచి కలకాలము సన్మతి సంస్మరించెదన్.

వీరశైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరుఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు బిజ్జలునివద్ద మంత్రియై వీరశైవమతమును సంస్కరించి ప్రచారింపఁజేసెననుట ప్రఖ్యాతవిషయము. ఇప్పుడు నిజామురాష్ట్రమున గుల్బర్గాప్రాంతమందున్న కల్యాణపట్టణము పశ్చిమచాళుక్యులకు రాజధానిగానుండుట చరిత్రప్రసిద్ధము. బిజ్జలుఁడు మొదటఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియు, త్రైలోక్యమల్ల బిరుదాంచితుఁడు నగు మూఁడవ తైలపదేవుని సామంతుఁడుగా నుండి యాతని ప్రతినిధిగా క్రీ॥ శ॥ 1145-1162 ప్రాంతమువఱకు, తర్దవాడి మున్నగు సీమలను బరిపాలించుచు క్రీ॥ శ॥ 1162వ సంవత్సరమున స్వతంత్రుఁడయి స్వామిద్రోహ మొనర్చి కాకతిప్రోలరాజు మొదలగువారి సాయముతోఁ దైలపదేవునినోడించి కల్యాణపట్టణము నాక్రమించి పశ్చిమచాళుక్యరాజ్యమందలి కొంత భాగము నపహరించెను.

అప్పుడు తైలపుఁడు కల్యాణపట్టణమును విడిచి యన్నిగేరి, బనవసి మున్నగు ప్రాంతములం దుండి మిగిలిన రాజ్యభాగములను పరిపాలన మొనర్చుచుండెను. బిజ్జలుఁడు, నాతని పుత్రులు కల్యాణపట్టణమున రమారమి క్రీ॥ శ॥ 1162—1182 వఱకుఁ బరిపాలించిరి. మూఁడవ తైలపుని కుమారుఁడు నాలుగవ సోమేశ్వరుఁడు క్రీ॥ శ॥ 1182 ప్రాంతమున బిజ్జలుని పుత్రుల నోడించి తన తండ్రి గోల్పోయిన రాజ్యభాగమును మరల గైకొనెను. ఇవి యుపలబ్ధములయిన శాసనములవలన నిర్ధారితములయిన సుప్రసిద్ధ చరిత్రాంశములు.

బసవేశ్వరుని గుఱించి తొలుదొలుత వెలువడిన ప్రామా గ్రంథ మాంధ్రభాషలో పాలకురికి సోమనాథకవి ద్విపదగా రచిం బసవపురాణము. సోమనాథుఁడు బసవేశ్వరుని నిర్యాణము నాటి బాలుఁడయి యటు తరువాతఁ గాకతిరుద్రదేవుని (మొదటి ప్రతా రుద్రుని) కాలమున క్రీ॥ శ॥ 1190 ప్రాంతమున బసవపురాణము రచించి క్రీ॥ శ॥ 1240 ప్రాంతమువఱకు జీవించియున్న వాఁడు. బసవే రుని యనంతర మత్యంత సమీపకాలమున వెలునడిన గ్రంథమవుట బసవేశ్వరుని చరిత్రము విషయమై యీ గ్రంథమున కున్నంత ప్ర మాణ్యము దీనితరువాత వెలసిన మఱి యేకృతులకు నుండఁజాలదు. శైవమతోద్ధరణమున కయి నందీశ్వరుఁడే శివునియాజ్ఞ చొప్పున బ వేశ్వరుఁడయి యవతరించెనని చెప్పి సోమనాథుఁడు బసవేశ్వరుని చరి మును బూసలలో దారమువోలె మఱికొందఱు పురాతనాథునా సమకాలీనభక్తుల చరిత్రములతో పాటీగ్రంథమున సంఘటించినా బసవేశ్వరునివలె సోమనాథుఁడు గూడ నవతారపురుషుఁడే యని శైవుల విశ్వాసము. క్రీ॥ శ॥ 1520 ప్రాంతమున ద్విపదబసవపురా మును బద్యకావ్యముగా వెలయించిన పిడుపర్తి సోమనాథుఁడు గూ నీక్రింది పద్యమునం దీ విషయము నిట్లు వర్ణించెను.

చ॥ అసదృశ తన్మహామహిమ ♦ మారవితారకమై చెలంగ శ్రీ
బసవపురాణమున్ సకల ♦ భక్తకథామణి సూత్రభాతిగా
వెస రచియింపు మీవు పృథి♦వీస్థలికిం జని నాఁగ భృంగి సం
తసమునఁ బుట్టెఁ బాల్కురికి♦నామపురీవర సోమనాథుఁడై.

బసవేశ్వరుఁడు తత్సమకాలికు లగు కొందఱు భక్తులు చూ మహిమలు బసవపురాణమున నద్భుతముగ వర్ణింపఁబడుటచే నట్టివా యందు విశ్వాసములేని కొందఱు, బసవేశ్వరుఁడు సోమనాథుని సృష్టింపఁబడిన యొకకల్పితపురుషుఁడే గాని చారిత్రకవ్యక్తి కానే డని చెప్పు సాహసమునకుఁ గడంగుచున్నారు. భక్తిశూన్యులకు భక్తు మహిమలందు నమ్మకములేకుండుట సహజమే. కాని భగవంతు యందును నాతని యత్యద్భుత శక్తిమహిమములందును విశ్వాసమ గలవారికి భగవద్భక్తుల శక్తి మహిమములందుఁగూడ నవిశ్వాసమ

ంగనేరదు. భక్తపరతంత్రుఁడు భక్త పరాధీనుఁడునగు భగవంతుఁడు
క్తులకుఁ బ్రత్యక్షమయినప్పుడు తనకంటెఁ దనభక్తులెక్కువవారని
క్కాణించి యుండుట శైవవైష్ణవ పురాణములెల్ల ముక్తకంఠముతోఁ
హిమాఖులు ఘోషించి యున్నవి. కావున మహాభక్తులు పరమేశ్వరుని
వతారమూర్తులే యని తలంచువారికి సోమనాథుని వ్రాఁతలయం
శ్వాసము పొడముటకుఁ గారణము లేదు.

బసవేశ్వరుఁడు చారిత్రికవ్యక్తి కాఁడని తలంచు ప్రబుద్ధులు
ంచు కారణాభాసములలో ముఖ్యము లయినవి.

(1) అట్టిపురుషుఁడు వాస్తవముగానుండిఁ పశ్చిమ చాళుక్య చక్రి
ర్తియగు బిజ్జలునకు మంత్రిగానే యున్నచో నాతని శాసన మొక్క
యిన దొరకకుండునా యనుట.

(2) బిజ్జలుని శాసనములందయిన నాతఁ డుదాహృతుఁడు
కుండుట. నేటివిద్యాధికులకు శిలాతామ్రశాసనములందలి వ్రాఁతలపై
ప్రమాణబుద్ధి మహాకవుల కావ్యములలోని వాక్యముల యెడ
కుండుట శోచనీయము.

శాసనములు వెలయించుటకు బసవేశ్వరుఁడు మంత్రిగనేగాని
ర్వభౌముఁడుగా నుండలేదని పాఠకు లెఱుంగవలెను. భూములిచ్చినను
గ్రహారములిచ్చినను, దాత రాష్ట్రాధిపతియే యవుటచే శాసనము
ాతని పేరనే యుండునుగాని యాతని మంత్రుల పేర వెలువడనేరవు.
ంతకు బసవేశ్వరుఁడు మహాభక్తుఁడు. ఆతఁ డొసంగినదానములు పేరు
ొఱకుఁ గీర్తికొఱకుఁ జేయఁబడినవి కావు. అతఁడు నిరంతర మొనర్చినది
న్నదానాది రూప మగు భక్తగణార్చనమే కాని ప్రత్యేకవ్యక్తు
కు స్థిరవసతి రూపమున నొనర్చిన భూప్రదానము కాదు. మఱియు
ప్పటి భక్తవరులుకూడఁ దృణీకృత హరి బ్రహ్మపురందరులు. అర్థి,
ాతయను తారతమ్య బుద్ధితో బసవేశ్వరుఁ డర్చనము చేసియున్నచో
ాతని సపర్యలను వారు గణించెడివారు కారు. సకలార్థసిద్ధిప్రదంబగు
శివభక్తి వారి కరచేతి చింతామణియైయుండ నిచ్ఛామాత్రముననే
యిష్టార్థములఁ బడయుటకు వారు సమర్థులయి యుండిరి. బసవేశ్వరుఁ
డెంతమహాభక్తుఁ డయినను మధ్యమాధ్యఁ గొన్ని భక్తిధర్మసూక్ష్మ

ములలోఁ దేలిపోవుచుండెననియు, మడివాలు మాచయ్య మున్నగు
భక్తవరు లిట్టి యెడల బసవేశ్వరుని చర్యలను దీవ్రముగ నిరసించి
యాతనికి వినిర్మలభక్తిని బ్రబోధించుచుండిరనియు బసవపురాణము
ప్రభులింగలీలయుఁ జదివినవారికిఁ దెలియఁగలదు.

I స్వాతిశయ సూచకముగఁ గాఁబోలు బసవేశ్వరుఁ డెప్పుడో
రచించిన చిన్నగీత మొకభక్తుఁడు గాన మొనర్పఁగా మడివాలు
మాచయ్య "శివశివా"యని చెవులుమూసికొని బసవేశ్వరుని దూ
నాడిన వాక్యములను నీసంగతి విని మాచయ్యకుఁ బాదాక్రాంతుఁడై
బసవేశ్వరుఁ డాతనిని వేఁడికొనిన క్షమావచనములను దిలకింపుడు.

"మఱికొన్నిదినముల కఱలేక బసవఁ
డఱిముఱి నొకగీత మానతిచ్చుడును
శివశివయని కేలు సెవులఁ జేర్చుచును
నవినీతుఁ డిట్లుండె హా! కల్లినాధ!
చెల్లబో! దీనులఁజేసి శరణుల
కెల్లను దానొక యిచ్చువాఁడయ్యె
ఎన్నఁడుగ్రోఁతియయ్యెను వెక్కరింప
నెన్నఁడు గఱచె నిం కెక్కడిభక్తి
దోసంబుగాదె భక్తులు దీని విండ్రె
బాసలుగీసలు వాటవాడకుఁడు
మాయొద్దననుచును మాచయ్య గినిసి
కాయకంబున కరుగంగ నిక్కడను
నంతనంతయు విని యాత్మలోఁగలఁగి
యంతంత ధరణి సాష్టాంగంబులిడుచు
బసవఁడు భక్తజనసహాయుఁడగుచు
వెసనేగుదెంచి భయసమగ్రవృత్తి
మడివాలు మాచయ్య యడుగులపొంతఁ
బుడమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి
"యాక్రాంత సంతతాహంకారనిరతు
నక్రమాలాపు నిర్వక్రాపరాధు

నూర్జితక్రోధు వివర్జిత సత్యు
దుర్జనాచారు ననిర్జిత కాము
నజ్ఞానపుంజంబు నపగత శౌచు
విజ్ఞాన విహీను వివేకవిదూరు
నిర్భాగ్యచూడామణిని భక్తిరహితు
దుర్భావకు నవినీతుని నన్ను నింకఁ
గాచిరక్షింపవే కారుణ్యపాత్రి
యేచిన మద్గర్వ మెల్ల మాయించి

*　*　*　*　*　*

*　*　*　*　*

యనుచు నిట్లాత్మనిందాతిదీనోక్తులను
విన్నవించుఁడు విననట్లు వినియు
జంగమపరతంత్రుఁ డంగావికారి
లింగదమాచఁ డాలీఢశౌర్యుండు
"అధముఁడా! క్రొవ్వితే హరభక్తులరయ
నధములే? నీవొక యర్థాధిపతివె
అడిగెడువారు లేకయ్య నీవింత
బడగవైతివి! మజ్జ! బాపురే! యనుచు
అట్టి యాచకుల నేనటుగందుఁగాని
యిట్టిత్యాగులఁ గాన మేలోకములను
పానవిన్నియునేల బసవ! నీయిచ్చు
నేనిక దున్నలు నిలఁబచ్చమన్న
గుజ్జుపు గాడిదల్ గుటిలంపుసతులు
నెట్టికోకలు బాగ్రితియే శరణులకు
నీ దిక్కు చూడుమా నాదు జంగమము
పేదరికములేని పెల్లుసూపెదను

*　*　*　*　*　*

*　*　*　*　*

"నీ మహత్త్వముఁజూడ నే నెంతవాఁడ
ధీమణి! సంగయ్యదేవ! సర్వజ్ఞ!
నీవు శంకరుఁడవు నేను గింకరుఁడ
నీవు నిర్మలుఁడవు నేను దుర్మలుఁడ
* * * * * *
* * * * *
పొరి నిట్టి దుర్గుణంబుల ప్రోఁకలోన
నరయంగఁ గలదె నాయందుసద్గుణము.
రక్షింపు మిట్టిగర్వప్రాప్తు నన్ను
శిక్షింపవే! యయ్య! జియ్య! నాదైన
యపరాధ శతసహస్రావలి సైఁచి
విపరీతమహిమాఢ్య! వేయును నేల!"
అనుచున్న బసవన్న నందంద కౌఁగి
టను జేర్చి కారుణ్యావనధినోలార్చె.

II బసవపురాణము పంచమాశ్వాసమున వర్ణితమైన మో[ళిగ] మారయ్యగారి కథలోఁగూడ బసవేశ్వరునికి గర్వభంగమయిన మ[...] యొక సంవిధానము గాననగును. మారయ్య యడవిలోఁ గట్టెలుగొ[...] తెచ్చి యమ్మికొని జీవించుచు యథాశక్తి భక్తిశ్రద్ధలతో జంగమా[ర్చ]నలు సలుపుచుండెను. ఈతనిచే నర్చితులయిన జంగములు బసవేశ్వ[రు]నింటికేఁగినప్పు డీతని యర్చావిశేషములఁ గూర్చి ముచ్చటించిరి. కా[...] కష్టమునకు లోనయి జీవించుచు నిట్టి జంగమార్చనలు సేయు మా[ర]య్యవృత్తాంతమునకు సంతసించి బసవేశ్వరుఁ డట్టిభక్తునకుఁ దానుగూ[డ] సాయమొనర్చుట విధియనితలంచి జంగమవేషమున మారయ్య యిం[ట] లేని సమయమున నచ్చటికేతెంచి "అమ్మా! యాఁకలిచే బాధప[డు]చున్నాను. మారయ్యగారు వచ్చువఱకు నిలువఁజాలను. చర[...] ప్రసాదము వడ్డించి యాఁకలిని బోకార్పు"మని యాతనిభార్యతో జెప్పి యామె యొసంగిన పదార్థముల భుజించి యామెకుఁ దెలియకుం[డ] రెండువేల బంగారుమాడల నొకపళ్లెరముక్రింద నిరికించి వెడలిపోయెను. మారయ్య యింటికేతెంచి జంగమార్చనావసరమునఁ బళ్ళెరముల స[...]

మాటలో నీ బంగారుమాడలనుగూర్చి యవి యెట్లువచ్చినవని భార్యను
ప్రశ్నించెను. ఆమెయు నిర్విణ్ణయై "నాకేమియుఁ దెలియదు. మీరింట
లేనప్పుడొక యయ్యయే తెంచి యూఁకలికిఁ దాళఁజాలనని ప్రసాదము
గ్రహించి వెడలిపోయెను. ఇంతకన్న నేనేమియునెఱుఁగ"నని ప్రత్యుత్తర
మొసంగెను. మారయ్యయిది బసవనికృత్యమయియుండునని గ్రహించి
యాతనికి బుద్ధిచెప్పెదఁగాకయని జంగమములనుబూజించి వారి పాదోదక
మును దానుదెచ్చిన కట్టెమోపులపైఁ బ్రోక్షించెను. అప్పుడా కట్టె
లన్నియు సువర్ణఖండములుగాఁగ జంగమమునకొక వేయి మాడలు
చొప్పున వానినెల్ల మారయ్య వారికి సమర్పించెను. ఈ వృత్తాంతమును
జంగమములవలనవిని బసవఁడచ్చటికే తెంచిమారయ్యగారి పాదములపైఁ
బడి "మహాత్మా! నాయపరాధమును సైరింపవే" యని ప్రార్థించెను.
మారయ్యయు నాతనిఁగాంచి "అయ్యా! నీవేమియపరాధ మొనర్చి
తివి? నేను నిన్నేమంటిని? నేను నిన్నుక్షమింపవలసినదేమి? విడిముడిగల
వాఁడయఁడవు. నీవుగాక మావంటిబడుగులకు మఱియేడుగడ యెవరు"
యని మృదురీతి నాతని మందలించి లేవనెత్తి ప్రబోధించెను.

III భక్తజనోద్ధరణమునకయి యవతరించిన యల్లమ ప్రభువు
చరిత్రము నాకర్ణించి యా మహానుభావుఁడెప్పుడు తనకు దర్శనమిచ్చి
నన్నుఁ దరింపఁజేయునాయని బసవేశ్వరుఁడు నిరీక్షించుచుండెడివాఁడు.
అట్టియెడ నొకనాఁడల్లముఁడు కల్యాణమునకే తెంచి వీథిలోనిలువఁబడి
తనరాకను బసవేశ్వరునకు ద్వారపాలకుని ద్వారమునఁ గబురంపెను.
అప్పుడు బసవేశ్వరుఁ డిష్టలింగార్చనమందుండెను. సాక్షాచ్ఛివస్వరూపుఁ
డగు నల్లమప్రభువే తెంచినపు డిష్టలింగార్చనముతోనేమియని వెంటనే
యిష్టలింగపూజ నంతతోఁగట్టిపెట్టి యెదురేఁగి శరణుచేసి యల్లముని
స్వయముగా లోనికిఁదీసికొని వచ్చుటకై చనుదేరక బసవేశ్వరుఁడు
"లోనికిదయచేయుఁ"డని యా చారునివలన నల్లమునకు వర్తమాన
మంపెను. ఇదివిని యల్లముఁడు చరలింగపూజకన్న నిష్టలింగపూజన
మెక్కుడనుబుద్ధి బసవనికెవరు చెప్పిరనినవ్వి లోనికేఁగక వచ్చినదారినే
మరలిపోఁదొడఁగెను. అప్పుడుకూడ మడివాలు మాచయ్య బసవనిఁదగు
విధమున మందలించిభక్తసద్ధర్మములందింకను బాలుఁడయియున్న బస

వనికి వానినుద్భోధించి మన్నించుట మంచిదిగాని కినుకతో మరలిపోవ
పాడికాదని యల్లముని సాంత్వవచనములతో వేఁడికొని యాతనిని ప్ర
సన్నునిఁ గావించెను.

"మృడునిభక్తులలోని మెరమెర వోవఁ
గడిగి నిర్మలములు గావించుకతన
మడివాలుఁడనెడునామము దగుననఁగ
మడివాలు మాచయ్య మహి వన్నెకెక్కె."

అని ప్రభులింగలీల మాచయ్యనుగూర్చి చెప్పుచున్నది.

ఇట్టి పరిస్థితులలో నట్టి మహాభక్తుల నడుమ వర్తిల్లిన బసవే
శ్వరుఁడు నిజయశఃప్రశస్తికై శాసనము లేమయిన నెలకొలిపిన నాటి
గౌరవ మేమయిన నిలుచుట కవకాశ ముండెడిదేమో పాఠ
కులూహింతురుగాక. బసవేశ్వరుఁడు చాళుక్యరాజ్యమంత్రి యైన
నాతని శాసనములు లేకుండుట కిదియే కారణము. ఇఁక బసవే
శ్వరుఁడు నిజమహిమముచేతనే తన యాశ్రియుల యభిమతములఁ గూర్చ
గలిగినప్పుడు తన యేలికయగు బిజ్జలునిచే వానిని సత్కరింపఁజేయ
వలసిన యావశ్యకత యాతనికి లేకుండెను. ఇందుచే బిజ్జలుని దా
నశాసనములలోఁ గూడ నాతని ప్రసక్తి యుండుట కవకాశము కలు
లేదు. కావున శాసనములలో నుదాహృతుఁడు కానంతమాత్రమున
బసవేశ్వరుఁడొక కల్పితవ్యక్తియని బుద్ధిమంతులు దలంపఁజాలరు. సోమ
నాథుఁ డెంత బసవభక్తుఁడయినను బసవేశ్వరుని గుణదోషముల నెల్ల
నిష్పక్షపాతముగఁ దాను విన్నవిధమున వర్ణించి యున్నవాఁడు
కావున నాతేఁడు బసవపురాణమునఁ జెప్పిన విషయము లతిశయోక్తు
లనిగాని యప్రమాణములనిగాని త్రోసిపుచ్చుట కవకాశము లేదు
ఇఁక బసవేశ్వరుని సమకాలీనులుగ సోమనాథుఁడు వర్ణించిన భక్తులలో
ఏకాంతరామయ్యను గూర్చి యాతడు వర్ణించిన విషయములు క్రీ॥ శ॥
1190 ప్రాంతమున కామదేవుఁడను కదంబరాజు కాలమున వెలసిన
అబ్లూరు శాసనములో నించుమించుగ నొకే విధమున నుదాహృతము
లవుటచే నతని వ్రాఁతలయొక్క ప్రామాణ్యము మఱింత దృఢీయగు
చున్నది.

ఈశాసనమున బసవేశ్వరునిపే రుదాహృతము గాకున్నను [ఏకా]ంతరామయ్య చూపినమహిమలు నాతనికి బిజ్జలుఁడొనర్చిన సమ్మా[న]ము పేర్కొనఁబడినవి. ఈ శాసనమును బట్టి యానాఁటిభక్తుల మహి[మల]ఁ గూర్చియు బసవేశ్వరాదుల యునికిని గూర్చియు నిప్పుడు చాల [మ]ందికిఁ గొంతవఱకయిన నమ్మకము కలుగుచుండుట సంతసింపఁదగి [యు]న్నది. ఏకాంతరామయ్యయే బసవేశ్వరుఁడయి యుఁడునేమోయని [కొ]ందఱు తలంచుచున్నారు. అది కేవల మసంగతము. వారు భిన్నవ్యక్తు[ల]ని సోమనాథుని బసవపురాణము వలన విశదమగు చున్నది. క్రీ॥ శ॥ [1]180 నాఁటి మరడీపుర శాసనమున నుదాహృతులయిన భక్తులలో [బా]గన బసవయ్య ఏకాంతరామయ్య యను నామములు వేర్వేరుగఁ [పే]ర్కొనఁబడినవి.

ఇట్లుండ మైసూరు వాస్తవ్యులు శ్రీ యస్. శ్రీకంఠశాస్త్రి [ఎ]. ఏ గారు కర్ణాట సాహిత్య పరిషత్పత్రిక బహుధాన్య సంవత్సర [మా]ర్గశీర్ష సంచికలో బసవేశ్వరునిఁగూర్చి వ్యాసమువ్రాయుచు నాతని [త]రువాత నొకశతాబ్దిలో అనగా క్రీ॥ శ॥ 1251-1280 సంవత్సరముల [మ]ధ్య వెలసిన కొన్ని కన్నడశాసనములలో బసవేశ్వరుని నామోల్లేఖన [ము]ండుటచేతను, యాదవ కృష్ణరాజుల అర్జునగి (అర్జునవాడ) * శాస[న]ము (క్రీ॥ శ॥ 1260) వలన మాదిరాజ పుత్రుఁడగు సంగనబసవని [వం]శమువారు దానము గ్రహించి రని తెలియుటచేతను బసవేశ్వరుఁడు [చ]ారిత్రికవ్యక్తియే యను విషయము స్పష్టమగుచున్నదని యంగీక[రి]ంచుచు నాతని యేలిక యగు బిజ్జలుని కాలమును సరిగా నిర్ణయింప [లే]రక యాతనింగూర్చి కొన్నిసంశయములం బ్రకటించిరి. వీరివ్యాసమున [య]నువాదమును శ్రీ జి. వీరనాగేంద్రులుగారు విభూతిపత్రిక నాల్గవ [సం]చికలోఁ బ్రకటించియున్నారు.

శ్రీకంఠశాస్త్రిగారు తమ వ్యాసములోఁ దాము పేర్కొన్న [హ]రిహరియూది, అర్జునగి, చౌడదానపుర, కల్లెదేవరపుర, మరడీపుర, కణ్ణ[ను]ూరు శాసనములన్నియు బసవని కాలముకంటె సుమారు ఒక శతా

* ఈ శాసనమును ఈ పత్రికలోనే వివరములతో ముందు ప్రకటింతును.

3

బ్దికిఁ దరువాతివనియు వానియందనేక చరిత్రానర్హ విషయము లం
ములై యున్నను గొన్ని తథ్యాంశములు కనఁబడుచున్నపనియు, గ్
ములు కూడ రెండవ ప్రతాపరుద్రుని సమకాలీనులగు పాల్కు
సోమన, హరీశ్వరుల యనంతరమే ప్రాముఖ్యము నందియుండుటచే
వని సమకాలీనములు కావనియు వ్రాసియున్నారు, సోమనాథుఁ
హరీశ్వరుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువారని తలంచుటలో
గొప్ప ప్రమాదమునకు లోనైరి. అట్లెంచుటకుఁ గల కారణము
నైనను వీరు తమ వ్యాసమునఁ బ్రకటింపరైరి. కర్ణాటక కవి చరి
కారులగు శ్రీ నరసింహాచార్యులుగారు హరీశ్వరుఁడు బసవేశ్వరు
సమకాలీనుఁడై క్రీ॥ శ॥ 1165–1168 ప్రాంతములందుండెననియు; సో
నాథుఁడు బసవేశ్వరుని తరువాత నత్యంత సమీపకాలమున మొద
ప్రతాపరుద్రుని కాలమున క్రీ॥ శ॥ 1195 ప్రాంతమున నుండెనని
నిర్ణయించియున్నారు. సోమనాథునిఁ గూర్చి వీరొనర్చిన యీ కా
నిర్ణయమును ఆంధ్రకవిచరిత్రకారు లగు శ్రీ వీరేశలింగము పంతు
గారు, ఆంధ్రుల చరిత్ర రచించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా
బసవపురాణ పీఠికాకర్తలగు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు నించుమించు
నంగీకరించియున్నారు. నేనుగూడ 1922 సం॥ర ప్రాంతమునుండి సో
నాథునిఁ గూర్చి పరిశోధన మొనర్చి వ్రాసిన వివిధవ్యాసములలో
బయి కాలనిర్ణయము నంగీకరించుచు నాతఁడు బసవేశ్వరునకు స
కాలీనుఁడు మాత్రము కాఁడనియు, బసవేశ్వరుఁడు లింగైక్యమొంది
క్రీ॥ శ॥ 1168 ప్రాంతమునాఁటికి పది పదిరెండేండ్ల బాలుఁడ
యుండి మొదటి ప్రతాపరుద్రుని కాలములో క్రీ॥ శ॥ 1195 ప్రాంతము
నాఁటికి బసవపురాణాది రచనముచేఁ బ్రసిద్ధుఁడయి క్రీ॥ శ॥ 1220 -
1230 ప్రాంతమునఁ బండితారాధ్య చరిత్ర రచియించి క్రీ॥ శ॥ 12
ప్రాంతమువఱకు జీవించియుండెననియు నిరూపించి యుంటిని. ఇ
దొనర్చిన యీ నిర్ణయములఁ బరికింపక శ్రీకంఠశాస్త్రిగా రన్యథా
తలంచుట యాశ్చర్యము. వేయేల! కన్నడకవి సోమరాజు తాను రచి
చిన ఉద్భటచరిత్రము శా॥ శ॥ 1144 (క్రీ॥ శ॥ 1222) సంవత్సరములో
రచించితి నని వ్రాసికొని యందులో హరీశ్వరుని, సోమనాథుని

న్నరసు నొక్క పద్యమునందే స్తుతించియున్నాఁడు - చిత్తగింపుడు.

॥ ప్రమథానీకకథార్ణవేందు హరిదేవాచార్యనం ధైర్యనం
సముదంచద్వృషభస్తవామరమహీజారామనం సోమనం
విమలజ్ఞానసుదీపికాస్ఫురితచేతస్సద్మనం పద్మనం
క్రమదిందంబలగొండు పేళ్వెనొసె దానీవొవ్యమం సేవ్యమం
॥ జననాథోత్తమ సోమరాజనుసిద్ధి కావ్యంవలం శాలివా
హనశాకాబ్ద మదెద్దెసాసిరద నూటెం సందనాల్వత్తు నా
ల్కనె యారంజిత చిత్రభానువరాశ్వీజ్యోత్స్నైకాదశీ
వనజాతారి తనూజ వాసర దొళాద త్తల్లమంగర్పితమ్.

ఇందువలన హరీశ్వరుఁడు, సోమనాథుఁడు క్రీ॥ శ॥ 1220 కంటె
పూర్వపువారయి యుండవలె ననుట నిర్వివాదముగ నంగీకరింప
దగునుగదా. రెండవ ప్రతాపరుద్రుఁడు కాకతీయ సామ్రాజ్యమును
॥ శ॥ 1295 నుండి 1326 వఱకుఁ బరిపాలించినవాఁడు. కావున శ్రీకంఠ
శాస్త్రిగారి వ్రాఁత కేవల మసంగతమని వేఱ చెప్పనక్కఱలేదు.
హరీశ్వర సోమనాథు లించుమించుగ బసవేశ్వరుని సమకాలీనులగుటచే
బసవేశ్వరునిఁగూర్చి వారు వ్రాసిన చరిత్రమునకే యెక్కువ ప్రామాణ్య
మొసంగక తప్పదు. తరువాత నెప్పుడో రమారమి నూఱుసంవత్సర
ములలో వెలసిన శాసనములలో నందుకు వ్యతిరేకములగు విషయము
లున్నను వానికి హరీశ్వరసోమనాథుల రచనములకంటె విశేషప్రామా
ణ్యము కలుగనేరదు. ఇంతకు శ్రీకంఠశాస్త్రిగా రుదాహరించిన
శాసనము లేవియుఁగూడ నీకవివరుల గ్రంథస్థ విషయముల కెంత
మాత్రము వ్యతిరేకముగా లేవనియే నాయభిప్రాయము. పరస్పరసమీ
క్షణ మొనర్చి విమర్శకులు వాని సమన్వయముచేసికొనఁదగును.

మొదట మూఁడవ తైలపుని సామంతుఁడుగానుండి తరువాత
నాతని పశ్చిమచాళుక్య రాజ్యము నాక్రమించి కల్యాణపట్టణము
రాజధానిగాఁ దద్రాజ్యమును బరిపాలించిన బిజ్జలుఁడు చంద్రవంశ
క్షత్రియుఁడు, హైహయాన్వయుఁడు, కలచుర్య వంశ్యుఁడునని యాతని
శాసనముల వలన వ్యక్తమగును. అబ్లూరు శాసనమున నాతఁడళ్లె

యుదాహరింపఁబడినాఁడు. పశ్చిమ చాళుక్య రాజ్యాపహరిపాలకుఁడగ
నీ బిజ్జలుఁడు గాక యీ పేరుగల రాజులు మఱికొందఱుండుట
నిందులో బసవేశ్వరుని యేలిక యెవ్వఁడను విషయము సంశయాస్ప
ముగ నున్నదని వ్రాయుచు శ్రీకంఠశాస్త్రిగారు తమ పూర్వోక్త
వ్యాసమున క్రీ॥ శ॥ 1168—1177 ప్రాంతమువఱకుఁ గల్యాణ
పట్టణము నేలిన రాయమురారి సోవి దేవుని పాదపద్మోపజీవి
యాతనికి సామంతుఁడై తరికాడునాడు పరిపాలించుచుండిన సింద
వంశ్యుఁడగు బిజ్జణుఁడే (క్రీ॥ శ॥ 1169—1174) బసవేశ్వరుని యేలి
కాఁడగునని నిర్ణయించిరి. ఆ కాలమునందే రాయమురారి సోవిదేవు
నాల్గవపాలనసంవత్సరమగు క్రీ॥ శ॥ 1171 సం॥లో వెలయింపఁబడి
* మడగిహాళు శాసనమునందుఁ జతుర్థకులజుఁడగు మఱియొక మాళిగ
బిజ్జనాయకుఁ డుల్లేఖింపఁబడి యున్నాఁడనియు, తరికాడునాడు నందలి
మంగళవేఢ యాతని రాజధానిగా నుండెననియు, బిజ్జలునిమరణము
నకుఁ గారణుఁడుగా బసవపురాణమున వర్ణితుఁడయిన మధుపయ్య
మంగళవాడయందే వసించి యుండెనని 1926వ సంవత్సరము నవంబరు
నెల 'శివానుభవ' పత్రిక సంచికలో నున్నదని కూడ వీరు వ్రా
యున్నారు. రాయమురారి సామంతులుగ నించుమించుగ నేక కాల
మునసే తరికాడునాడు పరిపాలించిన యీ బిజ్జనాయకుఁడు, బిజ్జణుఁ
నేకపురుషుఁడా, భిన్న పురుషులా? యని సందేహము కలుగవచ్చును
కాని వారి తలిదండ్రులపేరులు సోదరుల నామములు బిరుదములు
గూడ శాస్త్రిగారు వివరించి యుండుటచే వా రిరువురు భిన్న పురుషు
కాఁదగునని తలంపవచ్చును. ఇరువురను గూడ నీ సందర్భమున

---

* "శ్రీకంఠశాస్త్రిగారు వ్రాసినట్లు మాళిగె బిజ్జనాయకుఁడు మంగళవాడ
రాజధానిగాఁ బరిపాలించెననుటకుఁ దగిన యాధారములు కానరావు మాడగిహాళు
శాసనమునం దాతని రాజధాని "మాళిగె" యనుపట్టణ మనియే స్పష్టముగాఁ జెప్ప
బడినది. ఆ మాళిగయే తరువాత మాడగిహాళు నామమున వ్యవహరింపఁబడు చున్నది
సిందవంశబిజ్జణున కయినను మంగళవాడ రాజధానిగా నుండె ననుట కాధారము
మృగ్యములు. శాస్త్రిగారుకూడ వానినుగ్గడించి యుండలేదు. కొంతకాలము మంగళ
వాడలోను నటుతరువాతఁ గల్యాణపట్టణమునను బరిపాలించినవాఁడు రాయమురారి
సోవిదేవుని తండ్రి బిజ్జలుఁ డొక్కరుఁడే కానవచ్చుచున్నాఁడు.

...కొనుటచే సింద్ వంశ్యుఁడగు బిజ్జణుఁడే బసవేశ్వరుని మేలిక యని ...కు నిర్ణయించికొనినను వీరిలో నెవరో యొకఁడు బసవేశ్వరుని ...లిక కాఁదగునని శ్రీకంఠశాస్త్రిగారి యభిప్రాయ మైనట్లు మనము ...హింపవచ్చును. ఇట్లు వీరు తలంచుటకుఁగల ముఖ్యకారణములు.

(1) హరీశ్వరుఁడు తాను రచించిన రగళయందు బసవేశ్వరునిఁ ...చ్చి "నీవు బిజ్జళరాయఁ డుండు మంగళవాడకు పొమ్మ" అని చెప్పి ...తఁడచట బిజ్జలుని సేవించి జీవించెనని చెప్పియుండుట.

(2) పాలకురికి సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున

"అవనిలోఁ జాళుక్య లను పేరు హరుని
కవిలను దుడిపించి కల్యాణకటక
మీఁడిత భక్తిమహిష్ఠత పేర్మిఁ
బాడుగా శపియించె బసవనమంత్రి"

అని బిజ్జలుని నాతని సంతతిని జాళుక్య లనిచెప్పి కాలచుర్యులని ...ప్పకుండుట.

(3) బసవేశ్వరునికిఁ బూర్వపుతని మేనమామ బలదేవుఁడు ...లుని మంత్రిగానుండెనని బసవపురాణమునఁ జెప్పఁబడుట పూర్వో ...హృతుఁడైన సింద్ వంశ బిజ్జలుని యధికారులగు బలదేవనాయక, ...రటూరి దాసిమయ్య, అమృతరాశి దేవులకు క్రీ॥శ॥ 1174 సం॥రములో ...న మొసంగఁ బడినట్లొక శాసనమునందుఁ జెప్పఁబడుటచే నీ బలదేవ ...యకుఁడే బసవేశ్వరుని మేనమామ కాఁదగునని శాస్త్రిగారూహిం ...టు.

హరీశ్వర సోమనాథులు బసవేశ్వరుని స్వయముగ నెఱిఁగినట్లు ...ని యాతని కాలముననే కల్యాణపట్టణ ప్రాంతమున నుండినట్లుగాని ...ంచుటకెట్టి యవకాశములును లేవు. సోమనాథుఁ డాంధ్రదేశీయుఁడు, ...రుగల్లు ప్రాంతమందలి పాలకురికి వాస్తవ్యుఁడు. "ప్రస్తుతింపంగ ...వ్యక్తి విస్ఫురణఁ, బ్రస్తుతికెక్కిన బసవని చరితఁ, జెప్పితి భక్తులచే ...న్నమాడ్కి, దప్పకుండఁగను యథాశక్తిఁ జేసి" అని యాతఁడే బసవ ...పురాణమునఁ జెప్పికొనియుండుటచే నాతఁడు స్వయముగా బసవేశ్వరు ...నెఱుఁగఁడనియు నాతనికి సమకాలీనుఁడు కానేరఁడనియు విస్పష్టము.

బసవేశ్వరుని నిర్యాణమునాఁటి కాతఁడు బాలుఁడయి తర్వాత మొ
ప్రతాపరుద్రుని కాలమున క్రీ॥ శ॥ 1195 ప్రాంతమునఁ బ్రసిద్ధి
యుండునని వెనుకనే చెప్పియుంటిని. హరీశ్వరుఁడు పంపావిరూపా
స్వామి భక్తుఁడయి పంపావిరూపాక్ష శతకము, గిరిజాకల్యాణము,
గణదరగళె యను గ్రంథములను గన్నడమున రచించినవాఁడు కా
నాతని నివాసస్థలము బళ్లారిప్రాంతమని తలంపవచ్చును. ఈతఁడు బ
వేశ్వరునిఁ గూర్చి ప్రత్యేక గ్రంథమేదియు రచించినట్లు కానరా
తాను విన్న పూర్వశివభక్తులగూర్చి రగడ రచించుచు నించుమించు
దన సమకాలీనుఁడగు బసవేశ్వరుని మహిమాదికములను గూడ వి
వాఁడగుటచేఁ దనరగడలో నాతనినిగూడ నించుక ప్రశంసించినట్లు కా
నగును. సోమనాథునకంటె నాతఁడొకించుక పూర్వుఁడుగఁ గాన్పిం
టచే నాతని వాక్యముల ప్రామాణ్యముగూడ ద్రోసిపుచ్చదగినదికాద
పండరపుర సమీపమందున్న మంగళవేఢ యా కాలమునఁ బశ్చి
చాళుక్యరాజ్యమున నొక ముఖ్యస్థానముగ నుండి యుండును. మూఁ
తైలపుని సామంతుఁడుగా నుండిన మొదటి బిజ్జలుఁ డా తైలప దే
ప్రతినిధియై, తర్దవాడి, తరికాడు మున్నగు సీమలకెల్ల నధికారి
పరిపాలించుచుండినట్లు కానవచ్చును. ఇతఁడు స్వతంత్రుఁడు గ
పూర్వమితని యధికారులు మైతారదండనాథుఁడు మొదలగువా
ప్రకటించిన బిజాపురము, బెలగాము (బలగాము) శాసనము
మున్నగునవి యచ్చట వెలసినవే. కావున నప్పుడతనికి మంగళవే
(మంగళవాడ) యే రాజధానిగా నుండి యుండును. ఇంతయేల
శాస్త్రిగా రుదాహరించిన మడగిహాళు శాసనమునందే రా
మురారి తండ్రి బిజ్జలుఁడు నాతని పూర్వులు మంగళవేఢ యం
రాజ్యమొనర్చిరని విస్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. ఈ మంగ
వేఢకుఁ బశ్చిమ చాళుక్య రాజధాని యగు కల్యాణపట్టణమున
రమారమి నూఁఱుమైళ్ళ దూరమున్నది. బిజ్జలుఁడు నాతని యనంత
మాతని తనయుఁడు రాయమురారి సోవిదేవుఁడు కల్యాణపట్టణమ
రాజ్యముచేయుచున్నప్పుడు గూడ వారి రాజ్యములో నీ మంగళవే
యొక ప్రధానస్థానముగా నుండెను. అందుచేతనే రాయమురారి సా

ములను మాళిగెబిజ్జనాయకునకు బిజ్జణునకుఁ గూడ నిది రాజ్యస్థాన
ముగాఁ బేర్కొనఁబడుటకుఁ గారణమయినది.

మఱియు రాయమురారి మహామండలేశ్వరుడు లఖియదేవుఁడు
వ్రాయించిన శాసనములలో (N-E. R 160 of 1934) క్రీ॥ శ॥
1173 లో రాయముురారి మంగళవాడయందే యేలుచుండెనని చెప్పఁ
బడుటకు గూడ నిదియే కారణము. రాజ్యములోని ముఖ్యస్థలములలో
నేదియో యొకటి పాలనస్థలముగాఁ బేర్కొనఁబడినంతమాత్రమున
నదే ని ప్రధాన రాజధానీ నగరముకూడ నదియే యని తలంప నవ
సరము లేదు. రాయమురారి కల్యాణపట్టణము నేలుచున్నప్పుడు గూడ
మంగళవాడ యాతని యేలుబడిలోనిదే కావున నాత డచ్చట నేలు
చుండెనని చెప్పుటలోఁ బ్రత్యవాయ మేమియులేదు. అట్లేగాక
మంగళవాడయే యాతని రాజధాని యని తలంచినచో నా పట్టణ మా
కాలమునందే యాతని సామంతుల రాజధానిగాఁ బేర్కొనఁబడుట
యసంగత మగునుగదా! కావున బిజ్జలుఁడు సామంతుఁడుగా నున్న
ప్పుడు మంగళవేఢలోనుండి, స్వతంత్రుఁడయి పశ్చిమ చాళుక్య రాజ్య
ములో విశేష భాగము నాక్రమించినప్పుడు రాజధానిని గల్యాణము
నకు మార్చియుండెనని నిరాటంకముగఁ దలంపనగును. బసవేశ్వరుఁడు
గూడ మొదట మంగళవేఢలో నున్నప్పుడే బిజ్జలునియొద్ద మంత్రిగాఁ
బ్రవేశించి తరువాత నాతనితోపాటు కల్యాణమునకు వచ్చియుండును.
స్వతంత్రుఁడయిన తరువాత బిజ్జలుఁడు కల్యాణములోఁ బరిపాలించినది
నూఱెనిమి యాఱుసంవత్సరములు మాత్రమే. బసవేశ్వరుఁడు కల్యాణ
ములోనుండి యీ స్వల్పకాలముననే వీరశైవము నంతగా విస్తరింపఁ
జేయుట యసంగతముగా నుండును గావున మంగళవేఢలో నున్నప్పటి
నుండియే యీ మహోద్యమమున కాతఁ డుపక్రమించెనని తలంచు
టయే సమంజసముగా నుండును.

మఱియు హారీశ్వరుఁడు కూడ "శ్వశ్శ్రేయసం, శివం, భద్రం,
కల్యాణం, మంగళం, శుభం." అనునిఘంటూక్తి వలన, కల్యాణ
మంగళ శబ్దములు పర్యాయము లగుటచేఁ గల్యాణపట్టణమునే యుద్దే
శించియు దానినే మంగళవాడయని పేర్కొని యుండును. పాలకురికి

సోమనాథునకు బసవేశ్వరునేలికయై కల్యాణపట్టణమందుండిన బిజ్జలుఁ
హైహయుఁడా లేక కాలచుర్యుఁడా యను వివరములతోఁ బ్రసక్తి లేదు
మన పూర్వకవుల కిట్టి సూక్ష్మచరిత్రాంశములపయి దృష్టి యు
డెడిదికాదు. ఆతఁడేవంశమువాఁడయినను గల్యాణమున నుండి
పాలించినది చాళుక్యరాజ్యము. అందుచే నాదృష్టితోనే యాత
నాతని సంతతిని జాళుక్యులనియే యాతఁడు పేర్కొనెను. బసవేశ్వరు
గూర్చి చెప్పిన నమస్కార గద్యలోఁగూడ నతఁడు "సాధిత చాళుక్
దారియ నమో" "శాపనిహిత చాళుక్యాయ నమో" అనియే వ్రా
యున్నాఁడు. కావున నిందులో నసంగతి యేదియుఁ గానరాదు.
వేశ్వరుని పేర నున్న కొన్ని కన్నడవచనములలో బిజ్జలుఁడు చాళు
రాజుగా నుదాహృతుఁడగుటకూడ నిట్టి యభిప్రాయముతోడనే య
గ్రహించునది. ఇంతకు బసవేశ్వరుని పేర లబ్ధములగు నీవచనముల
నన్నియు నతఁడు చెప్పినవేయనుటకుఁ దగిన యాధారములులేవుఁ
ప్రక్షిప్తములుకూడ నందుఁజేరి యుండవచ్చును. పశ్చిమచాళుక్యరా
ధానిగా నుండిన కల్యాణ పట్టణములో బసవేశ్వర సంబంధికముల
నన్నివేశము లిప్పటికేని గలవని స్థలజ్ఞులు చెప్పుచున్నారు. బసవేశ్వరు
గద్దెయని పిలువఁబడు స్థలము పయి దుకాణముపెట్టి యమ్మకమ
చేయు వర్తకులకు విశేషైశ్వర్యము గలుగుచుండెడిదనియు నందు
నాప్రదేశ మేఏటట వేలమువేయఁబడు చున్నదనియు వర్తకులు దా
నెక్కువసొమ్ముకుఁ బాడుదురనియుఁ దెలియు చున్నది.

కావున నైతిహ్య పరంపరా ప్రసిద్ధ మగు నిట్టి కల్యాణపట్ట
సంబంధము బసవేశ్వరు నుండి విడఁదీయుటకు శ్రీకంఠ శాస్త్రిగా
చెప్పిన యాధారము లెంతమాత్రము నిలువ నేరవు. మూఁడవ తైల
దేవుని సామంతుఁడుగా నుండిన బిజ్జలుఁడు గాక కల్యాణపట్టణము
రాజ్యము నెఱపిన బిజ్జలుఁడు మఱొకఁ డెవఁడు నాకాలమునఁగాని య
సమీపకాలమునఁగాని కానరాఁడు. బసవేశ్వర సమకాలికుఁడుగా
బసవపురాణమున వర్ణితుఁడయిన ఏకాంతరామయ్యకు ఈ బిజ్జలుఁ
సామంతుఁడుగా నున్నప్పుడు దానమిచ్చెనని యబ్లూరు శాసనమ
ప్రకటించుచున్నది. శ్రీకంఠశాస్త్రిగారు పేర్కొనిన యిరువురు బి

లలో నెవరికిఁగాని కల్యాణపట్టణ సంబంధము గానరాదు. శాస్త్రి
రు దానిని నిరూపించి యుండలేదు. కావున 'నదిహరళహళ్లి'
సనము మున్నగు వానివలన క్రీ॥ శ॥ 1168 వఱకుఁ గల్యాణమును
పాలించుచు, ఆ సంవత్సరప్రాంతమున రాజ్యమును ద్యజించి తన
త్రుఁ డగు రాయమురారి సోవిదేవునకుఁ బట్టము గట్టినట్లు కాన
చ్చు బిజ్జలుఁడే బసవేశ్వరుని యేలిక యగును గాని శ్రీకంఠశాస్త్రి
రు తలంచినట్టు లా రాయమురారి సామంతులుగా నుండిన మాళిగె
నాయకుఁడు గాని సింద్ బిజ్జణుఁడు గాని కానేరఁడని వేఱచెప్పనక్కఱ
ు. సింద్ బిజ్జణుని కాలమున బలదేవనాయకుఁ డొకఁడు కానవచ్చు
తమాత్రమున నాతఁడే బసవపురాణమున వర్ణితుఁడయిన బసవేశ్వ
ి మేనమామయని యెంతమాత్రము తలంప నవసరములేదు. రాయ
రారి తండ్రి బిజ్జలుఁడు నాతని సామంతులగు బిజ్జలనామధేయులు
ర్వేఱుపురుషు లయినట్లే యీ బలదేవనాయకులు కూడ భిన్న
క్తులు కాఁ దగును. జైనులు వ్రాసిన బిజ్జలరాయ చరిత్ర మున్నగు
ంథములు గూడ వానిలోఁ జరిత్రవ్యతిరిక్తము లగు విషయము
న్నియున్నను రాయమురారి తండ్రి బిజ్జలుఁడే బసవేశ్వరుని యేలిక
నియు, బసవేశ్వరుని యనుచరులు బిజ్జలుని వధించినప్పుడు బసవేశ్వ
ఁ జంపుటకయి యిమ్మడి బిజ్జలుఁడగు నీ రాయమురారియే
ాతని వెన్నాఁడెననియు జెప్పుచున్నవి. సుప్రసిద్ధ ఆంగ్లవిద్వాంసు
ు విన్ సెంటుస్మిత్, డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు మున్నగు
ిత్రజ్ఞులును, ఆంధ్రచరిత్ర పరిశోధకులగు శ్రీ లక్ష్మణరావు, వీరభద్ర
ావుగారులుగూడఁ దమ గ్రంథములలో క్రీ॥ శ॥ 1168 వఱకుఁగల్యాణ
ట్టణమునఁ బశ్చిమచాళుక్యరాజ్యమును బరిపాలించిన బిజ్జలునే బస
శ్వరుని యేలికగా నిర్ణయించియున్నారు. శాసనములను, గ్రంథము
ను సరిగా సమన్వయము చేసికొనక శ్రీకంఠశాస్త్రిగా రన్యథా
ఁచుట శోచనీయము.

ఇఁక సోమనాథుఁడు బసవేశ్వరుని శాపమహిమచే బిజ్జలుని
త్రులుగూడ రాజ్యమునకై యన్యోన్యము పోరాడి యాతని వెను
ంటనే మరణించిరనియు వారు చనిపోయిన వార్త విన్నతరువాతనే
సవేశ్వరుఁడు కూడ సంగమేశ్వరమున కేఁగి సంగమేశ్వర లింగమునం

దైక్యమయ్యెననియు బసవపురాణమునఁ జెప్పిన సంగతులఁ గూ
విచారింతము. ఇవి చరిత్రసమ్మతములు కావనుట నిక్కవము.
సరియేయని చెప్పినచో బసవేశ్వరుఁడు క్రీ॥ శ॥ 1182 ప్రాంతమువఱ
జీవించియుండునని చెప్పవలసి వచ్చుననుట వాస్తవమే. బిజ్జలుని త
వాత రాయమురారి సోవిదేవుఁడు క్రీ॥ శ॥ 1177 వఱకును దరువా
నాతని సోదరులు క్రీ॥ శ॥ 1182 ప్రాంతము వఱకును జాళుక్యరా
మును బరిపాలించినట్లు శాసనములవలన వ్యక్తమగును. సోమనాథు
తాను బసవపురాణమును రచించిన క్రీ॥ శ॥ 1195 ప్రాంతమునాటి
గల్యాణమున జాళుక్యరాజ్య మంతరించెను. అంతకుముందు పదిరెండే
క్రిందటనే బిజ్జలుని సంతతి నిర్వంశమయ్యెను. కావున సోమనాథు
తన గ్రంథరచనా కాలమునకున్న పరిస్థితులఁబట్టి తాను విన్న వార్త
లిఖించుటలో నిట్టి స్వల్పవ్యత్యాసము లేర్పడుటకుఁ గారణమయిన
ఇట్టి సూక్ష్మచరిత్రాంశములు మన కవులదృష్టి కెక్కనవి కా
మొదటనే మనవిచేసితిని. పండితారాధ్య చరిత్రములోఁ గూడ మ
కార్జున పండితుని శాపమహిమచే వెలనాటి చోడుఁడు నాతని స
తియు నశించిన దనుటలోఁ గూడ నాతఁ డిట్లే చెప్పినాఁడు. బసవే
పండితారాధ్యు లవతారపురుషులని సోమనాథుని గ్రంథములవల
వ్యక్తమగును. వా రొందినది స్వచ్ఛందమరణము. బసవేశ్వరుని దర్శిం
నేఁగుచు దారిలో వనిపురప్రాంతమున నాతని నిర్యాణవార్తవిని
పించి పండితారాధ్యుఁడు శివరాత్రివ్రతమును ముగించి బసవేశ్వరు
డవతారమును జాలించినప్పుడు తా నుండియుఁ బ్రయోజనమ
లేదని భావించి, యాతఁడు సంగమేశ్వరునందు సంగమించిన
తాను గూడ శ్రీశైల మల్లికార్జున లింగమం దైక్యమయ్యెన
కావున బసవేశ్వర మల్లికార్జున పండితుల శాపమహిమచేఁ గ్రమము
బిజ్జలుఁడు, వెలనాటిచోడుఁడు, తత్సంతతియుఁ దరువాత ననతికా
ములో నశించినను వారుమాత్ర మంతకు ముందే క్రీ॥ శ
1168,1170 ప్రాంతమున నిర్యాణ మొందిరని తలంచుటలో నసంగ
మేమియు లేదు. చరిత్రవిషయముల నిట్లే చరిత్రకారులు పరస్ప
వైషమ్యములకు, ప్రబల ప్రమాణ వైరుద్ధ్యములకు నెడమీయకుం
సూక్ష్మదృష్టితో సమన్వయము చేసికొనఁదగును.

# శారదానక్షత్రమాలిక

## కె. సాంబసిద్ధయ్యగారు ఉపాధ్యాయులు

ఉ. శ్రీయొనఁగూడునీదు దయచే యశమబ్బును ధీజడత్వమో
పాయును జ్ఞానవృద్ధియగు భక్తియు గల్గును ముక్తికాంతతో
హాయిగ సంతతమ్ము సుఖదంబుధినవ్యతరంగమాలికన్
నూయెలలూగుచుండు మనుజుండు ధరాతలమందు శారదా! ౧

ఉ. నీదయగల్గియున్న జననీ యసమర్థునకైన ధాత్రిలో
లేదొక దుష్కరమ్ము దయలేమి మహేంద్రునకైన నుర్విలో
గాదది నిక్కమిద్ది కలకాలము నీదుకృపా పరిష్కారమా
సాదరవీక్షణంబులిల సర్వశుభావహమౌను శారదా! ౨

చ. పలుకులరాణి నీదు మృదుపాణితలంబున వీణబూని యా
నలువను గానమాధురి యనారతము న్దనియింపజేయు కో
మలమగు నీదురూపమును మానసమందు స్మరించుచుండు నా
తలపుననుండు సర్వశుభదాయిని పావని వాణి శారదా! ౩

చ. ధరణిని గోపజన్మమును *దాలిచి యక్షరమన్న నెట్టిదో
యెరుగని కాళిదాసకవియేగతి నిన్ను స్తుతింపగల్గి నీ
కరుణకు బాత్రుడై వెలసి కన్గొనజాలెను నీదుదివ్య సుం
దర వదనేందు మండల సుధారుచులన్ననులార శారదా! ౪

ఉ. ఆ పినవీరభద్రకవి యట్టులె గాఢసుషుప్తినుండగా
దాపుననుండు గ్రంథము ముదమ్మున గైకొని ముద్దులొల్కు నీ
వోపిక బూర్తి పొత్తము మనోహర శైలిని వ్రాయనున్నచో
భూపతికోపవహ్నిబడి పోవక నే గతినిల్చు శారదా! ౫

చ. కలిమియుగల్గనిమ్ము యధికారము శౌర్యము బంధుజాలమున్
గలిగిన గల్గనిమ్ము తనుకాంతి జయంతుని యబ్ధిపుత్రి ము
ద్దుల మురిపంపు పుత్త్రవరుతో సరిపోలిన లాభమేమి నీ
లలితపు మందహాసకళలన్గనజాలనివాడు శారదా! ౬

ఉ. నీకరుణారసంబున జనించు విధేయత దానివెంట నే
చేకురుచుండు బాత్రిత విశేష ధనార్జన దానిచేత నే
మేకొని పుణ్యకార్యము లమేయతరంబుగ జేసి మర్త్యుడీ
లోకమునన్ సుఖించి పరలోక సుఖంబుల నొందు శారదా! ౭

ఉ. నమ్మితి నిన్ను నామనమునందున వారిజగర్భురాణి మా
యమ్మదయార్ద్రదృష్టిగనుమా! వినునా మొఱ నీదు పాదప
ద్మమ్ముల నంటియుండు భ్రమరంబును గానొకొ నన్ను నీవు దూ
రమ్మొటు సేయనెంతు దయరాదటె నాపయినీకు శారదా! ౮

---

* కాళిదాసు గొల్లవాడనుటకు నింతవరకు చారిత్రకాధారములు లభించలేదు.

—సంపాదకుడు.

చ. కనులవిగల్గు సత్ఫలము కామితదాయిని నీ స్వరూపముఁ
యనయము గాంచగల్గుటయె హ స్తములుండిన నిన్ను సేవలఁ
దనుపుటె సత్ఫలమ్ము వసుధాతలమందున వీనులున్నచో
వినుటయె సత్ఫలమ్ముగద వేమరు నీ చరితమ్ము శారదా!

ఉ. నింగినిభూమిపై జలనిధిఁ జగమంతట నెందుజూడ నీ
రంగగు సుందరాకృతి విరాజిలుచుండు నటంచు విందు నె
బ్బంగిని యెందుజూచినను పన్నిన సంతసమంబు దక్కఁ గ్ర
న్నుంగవ నీదురూపు గననోచక మాఱ్నిపుడిపోవు శారదా!

చ. అకలుషచిత్తవృత్తిఘటితాంజలినై భవదీయ నామతా
రకముజపింతు భక్తజనరక్షణశీలి మదీయ జిహ్వపై
దకతక తక్కఁతక్కఁతకతక్కఁయటంచనిశమ్ము నాట్యమో
పిక నొనరింపుమమ్మ దయ విద్యలరాణి పదంబశారదా!

ఉ. ఏవిడు సంపదాళి యదినిత్యము భూమినియగ్ని నీటిచే
బోవదు రూపభేద మయిపోవదు మమ్ములవీడి చోరులో
యేవిధినైన దీని హరియింపగనోపరు యిట్టి దివ్యమౌ
పావనగాత్రి యెవ్వరిడువారలు దేవతలందు శారదా!

చ. కవితయటన్న నేమొ ఘనకావ్యములన్న మరేమొ వానినే
నెవియు నెరుంగసుమ్మి భవదీయపదాంబుజ ధ్యానశక్తి నా
కవితను నీ చరిత్రమును గానముసేతు రసపరిపూర్ణలౌ
కవులకు గర్ణపర్వమయి గ్రాలగ నీ దయచేత శారదా!

చ. పరమవిశాలమౌ ప్రకృతి పత్రముపై గవనంపు తూలికఁ
సురుచిర వర్ణజాలమున సుందరమౌ భవదీయరూప చి
త్తరువు లిఖించి జన్మచరితార్థత నొందగ జేసికొందునో
సరసిజగర్భురాణి భవసాగరతారణి వాణి శారదా!

ఉ. దేవతలందు నీకుసరి దేవతలెవ్వరు నీదుపాదరా
జీవములందు మానసముజేరిచి నిన్ను భజించువారి చే
జీవితనౌకకర్ణమును చేత ధరించి సురక్షితమ్ముగా
చేవదలిర్ప మోక్షదరిజేరిచి బ్రోవగతల్లి శారదా!

చ. వరరుచిరాంగి నీదు ప్రియభర్తఁ మనుష్యుల సృష్టిజేయుచే
యెరుగును గాని వారలకు నేగతి జ్ఞానవికాస మబ్బునో
యెరుగడు నీవు వారలకు నింగితమిచ్చి మనుష్యనాములై
బరగెడు రీతి సల్పెదవు భవ్యకృపామతితోడ! శారదా!

చ. సిరికిని ముద్దుకోడలవు శ్రీపతిగానమరందమత్తతా
పరుడగు దేవమౌని గడుపారగగన్న సుమాతవీవు ఈ
సురుచిరలోకజాలముల చోద్యముగా రచియించు బ్రహ్మకో
తరుణివి నీదుభాగ్యదశ ధాత్రినుతింప తరంబె శారదా!

ఉ. నామొఱనీదు వీనులకు నాటుట లేదొకొ నాటియుండి న
న్నోమముల సామి ప్రేమరసలోలత దన్మయతఁ శరీరమే

యేమరియుండిన న్దలపవే మొకో యింత పరాకుజెల్లునే,
కామితదాయినీ కలుషకానన సీమదవాగ్ని శారదా! ౧౮

ఉ. బ్రహ్మ సృజించు లోకము లపారముగా దనశక్తిచే కవి
బ్రహ్మ సృజించు గావ్యము లపారముగాగవితాప్రసక్తినీ
బ్రహ్మకు లోకజాలము లపారముగా సృజియించునట్టి యా
బ్రహ్మకు శ్రేమపాత్రివయి భాసిలు జాణవునీవు శారదా! ౧౯

ఉ. పసితనమెల్లనో పరమ పావని నాకు భవద్వ్యుపాసనా
వ్యసనమునందు దాటెనిక నావల నీ నిలయంపు సేవయే
పొసగెను జీవయాత్ర పరిపూర్ణ సుఖంబుగ వెళ్ళబుచ్చనీ
వసుధను పూర్వపుణ్య పరిపాకమహాత్మ్యముచేత శారదా! ౨౦

ఉ. వారిజనాభుడు న్మరియు వారిజగర్భుడు శూలపాణి ఈ
ధారణి గామితార్థ వరదాన మొసంగెదరంచు శాస్త్రముల్
మారువచించుమాటలకు మామదిసంశయమందు నీవొకో
కోరిభజించువారి కొసకొంగుననే నివసింతు శారదా! ౨౧

ఉ. తొలుతనె ఓంనమోయనుచు దోయజపత్రవిశాల నేత్ర నిన్
దలచును బాలకుండు వసుధాతలమందున వచ్చిరాని ము
ద్దులమురిపంపుమాటలను దోసము లెల్ల హరించి ముందు వి
ద్యలనిడి ప్రీతిబోధించుటకునై కరముల్మొగిడించి శారదా! ౨౨

ఉ. నీ లలితంపునవ్యకళ నేగనలేని జడుండు ఇంద్రుడై
కాలముబుచ్చుచుండినను కార్యములే దిసుమంతయేని నే
తాలకు గాంతిహీనమయి గాలి సుగంధపు స్పర్శయేనియున్
బోలకధాత్రిలో వెలయు మోదుగపూవదియేల శారదా! ౨౩

ఉ. ఒకచెయితో మయూరమును యొయ్యన మేను స్పృశించుచుండి వే
రొకచెయిఁ డ వీణియ మనోహరరీతిని మీటుచుండి నా
కొకపరి దర్శనంబొసగుమో జలజాసనురాణి వాణి నే
నిక మదిశాంతిజెందగలనే నిను జూడక యున్న శారదా! ౨౪

ఉ. బిట్టుగ నెంత వేడినను ప్రేమవశరూపిణి యింకనీవు నీ
బెట్టును వీడలేవు నను బ్రీతిఁ గనుంగొనలేవు నేను నీ
కొట్టిడుచుంటి బొట్టుపయినో కలహంసమదేభయానయిం
కెట్టుల గానరాక నను నేచెదవో గనుగొందు శారదా! ౨౫

ఉ. పాపవిమోచనీ పరమపావని పంకజగర్భరాణి నీ
దాపున జేరదీసి సముదారమతిన్ గరుణాలవాలమౌ
చూపులు నా పయింబరపు సుందరచారుచకోరనేత్ర నా
తాపము బాసిపోవ మది దాల్మివహించి సుఖింతు శారదా! ౨౬

ఉ. ఏనిడుచుంటి భక్తినిదె యిర్వదియేడు ప్రసూనరాజముల్
వీనిని నీసిగన్ దురిమి వేచని నీపతిచెంత మంద మం
దానిలమందు బుష్పముల దావి గ్రహించుచు వీణమీటుచున్
గానము సేయుచున్దనుపగా నిను వేడెదనమ్మ శారదా! ౨౭

# వీరశైవ వైదికత్వము — శివదీక్ష

జి. వి. యస్, శర్మ.

ముందీ వీరశైవమతము వైదికమా? ఇందు ప్రయుక్తములై మలత్రయము, దీక్ష యనువాటి విశేషజ్ఞానము ఏతీరుది? అను విషయ మును తెలిసికొందము.

వీరశైవులు కొన్ని ఆగమములను ప్రమాణముగా తీసికొ చుండుటచే వీరు తాంత్రికులేగాని వైదికులుగారని కొందరు పొరబ చుండిరి. స్మార్తులు స్మృతిగ్రంథములను మన్నించుచున్న మాత్ర మున వారు వైదికులు గారనుటకు వీలుపడదు ఎట్లో, వీరును వైదికు గారనుటకు అట్లే వీలుపడదు. వీరశైవ మతమునందు ముఖ్యధర్మ మగు ఆవరణాష్టకము "సగురుమేవాభిగచ్ఛేత్"— "అమృతస్య దేవధారణో భూయాసమ్"— "ఆత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః" ఇత్యాది ప్రమాణములచే వేదములందు ప్రతిపాదింపబడియున్నది. ఇట్టి వేదోక్తధర్మములనే అవలంబించినదయ్యు వేదావిరుద్ధము లగు ఆగమము (తంత్రము)లను స్మృతి పురాణేతిహాసాదులవలె ప్రమాణీ కరించుకొని తనప్రక్రియ కనుగుణమైన * బ్రహ్మసూత్ర భాష్యము చేత స్వతంత్రమైయున్న ఈ వీరశైవమతమునకు వైదికత్వము నిష్ప్ర త్యూహమై యున్నది.

ఆగమములు: శ్రౌతములు, అశ్రౌతము లని రెండువిధముల పేర్కొనబడుచున్నవి. వానియందు శ్రౌతాగమములు (శ్రుత్యర్థ బోధ కము లగు కామికాద్యాగమములు) మాత్రమే వీరికి ప్రమాణము లని వెనుకనే తెలిసికొని యుంటిమి. ఈ శ్రౌతాగమములును అప్రా మాణ్యములే యైన యెడల, "ఆమ్నాయై రవిరుద్ధాః ప్రమాణమ్" [వేదములతో విరుద్ధములు కాని ఆగమాదులు ప్రమాణము] అను ఆపస్తంబుని ధర్మసూత్రము,

"శివాగమ మిదం పుణ్యమ్ శ్రుతిసారం విముక్తిదమ్
తస్మాత్సదా సేవనీయం భక్త్యా విప్రాదిభి ర్ద్విజాః!"
(శివరహస్యఖండ, అధ్యాయము ౧౭

---

* శ్రీకరభాష్యము, నీలకంఠభాష్యము, శివాద్వైతమంజరి, సిద్ధాంతశేఖరము ఇత్యాదులు వీరశైవాచార్యులచే రచితములైయున్నవి.

[శివాగమము వేదసారము, పవిత్రము, ముక్తినిచ్చునదై యున్నది. అందువలన నిది బ్రాహ్మణాదులచే సదాభక్తితో సేవింప దగియున్నది]

"వేదాన్ స్మృతి పురాణాని త్వాగమా నపి శాంకరాన్
వినిందయతి మూఢాత్మా సోఽంధేతమసి మజ్జతి."
(శంకరసంహిత ఉపదేశకాండ, అ. ౮౫)

[వేదములను, స్మృతులను, పురాణములను, శివాగమములను, ఏమూఢుడు నిందించుచున్నాడో వాడు గాఢాంధకార మను నరకము నందు మునుగుచున్నాడు.] అను పురాణోక్తులు వ్యర్థముకావలసి వచ్చును. మరియు కామికాద్యాగమములు శివోక్తములనుటకు,

"అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః
కామికాది ప్రభేదానాం యథా దేవో మహేశ్వరః."

[కామికాగమము, సుప్రభేదాగమము ఇత్యాదులకు ఈశ్వరు డెట్లు కర్తయో అట్లే పదునెనిమిది పురాణములకు వ్యాసుడు కర్త] అను సూతసంహితావచనము ప్రబలతర ప్రమాణమై యున్నది. సూతసంహితకు వ్యాఖ్యానమును రచించిన విద్యారణ్యయతియు పురాణప్రామాణ్యతను సాధించుచు "కామికాదీనా మాగమ సంహితానాం శివేనైవ ప్రణయనాత్ ప్రామాణ్యే యథా విస్రంభః ఏవం నారాయణావతారేణ వ్యాసేన ప్రణయనాత్ పురాణేఽ ప్యవిశ్రమః" [కామికాద్యాగమములకు శివప్రోక్తత్వముచే నెట్లు ప్రామాణ్య మబాధితమై యున్నదో అట్లే నారాయణుని యవతార మనంబడు వ్యాసునిచే రచితములగు పురాణములందును ప్రామాణ్యమును ఒప్పుకొనవలయును.] అను భావమును సూచించియుండిరి. మహాభారతముయొక్క ఆనుశాసనిక పర్వమునందును—

"యానీహాగమశాస్త్రాణి పురాణానిచ భూతలే
తాని వేదం పురస్కృత్య ప్రవృత్తాని యథాక్రమమ్."

[ఈ జగత్తునందే శివాగమశాస్త్రములు, పురాణములు ప్రసిద్ధములై యున్నవో అవన్నియు క్రమముగా వేదము నవలంబించియే ప్రవర్తించినవై యున్నవి.] అని చెప్పబడి యున్నది. అందుచే వేదము

లను వేదావిరుద్ధములగు ఆగమములను ప్రమాణీకరించు
ప్రవృత్తమైన ఈ వీరశైవమతము వైదిక మనుట కెంతయును
యున్నది. శ్రౌతాగమముల పురస్కరించిన మాత్రమున
అవైదికత్వము ప్రాప్తించునని చెప్పెడిచో తనచే రచింపబ
ప్రపంచసారము, గాయత్రీపురశ్చరణపద్ధతి మొదలగు గ్రంథ
లందు శివాగమ ప్రమాణముల నెన్నిటినో యుదహరించిన ఆది
రులు, సూతసంహితయొక్క వ్యాఖ్యానావసరమందు విశేషతః శై
గమములపై ననే చేయూదిన విద్యారణ్యులు, "వేదార్థసారసంగ్రహ
కానాం క్వచిదపి దోషశంకాకలుష రహితానాం శైవాగమానా
బలవత్త్వవ్యవస్థితేః" [పాంచరాత్రాద్యాగమములకుగాక వేదార్థ
సంగ్రహాత్మకములును, ఎక్కడను దోషశంకాస్పదములు కానట్టివియు
నగు శైవాగమములకే బలవత్తరప్రామాణ్య ముండుటవలన.]
శివతత్త్వవివేక గ్రంథమున నిరూపించిన అప్పయదీక్షితులు మొదల
వారును వేదవిరుద్ధు లనవలసి వచ్చునుగాన ఏతన్మార్గావలంబకమే య
వీరశైవమతమును వైదిక మనియే చెప్పనొప్పెడిని.

ఐన నీమతీయులు వేదోక్త యజ్ఞాదికర్మల నంగీకరింపకుండు
కారణమేమి? యను శంక జనింపవచ్చును. కాని వైదికుడైనంతమా
మున వేదోక్తకర్మల నన్నిటిని యాచరింపవలయు ననువిధి ఎచ్చట
కానరాదు. అట్లాచరించుటయు మన కసాధ్యము. అదియట్లుండ వేద
"యాన్యస్మాకం సుచరితాని తాని సేవితవ్యాని నో ఇతరా
(తై. ౧౧-౧౦-౨) [ఏకర్మలు మనకుత్తమములో అవియే మన మా
రించవలయును. ఇతరము లట్లాచరింపదగినవి కావు] అని చెప్పుచున్న
"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" [స్వర్గమును కోరువాడు ఇంద్ర
దేవతలను జ్యోతిష్టోమము (యజ్ఞవిశేషము)చే యజించవలయును] అ
టయు వేదవాక్యమే. ఈ వాక్యముచే యజ్ఞయాగాదులు కామ్యక
లని సిద్ధమవుచున్నది. మరియు "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశ
[పుణ్యము తీరిన వెంటనే మర్త్యలోకమున ప్రవేశించుచున్నారు.] అ
వాక్యము స్వర్గాదిభోగములు నశ్వరము లని వెల్లడిపరచుచున్న
అందుననే వీరశైవులు నశ్వరఫలప్రదములగు కామ్యకర్మల వదలి అ

స్వర ఫలప్రదములు, హింసాదూరములు, రాగరహితములు నగు

"కర్మయజ్ఞ స్తపోయజ్ఞో జపయజ్ఞ స్తథాపరః
ధ్యానయజ్ఞో జ్ఞానయజ్ఞః పంచయజ్ఞా ఇమే స్మృతాః॥
(సూక్ష్మ - పట ౬)

కర్మయజ్ఞము, తపోయజ్ఞము, జపయజ్ఞము, ధ్యానయజ్ఞము, జ్ఞానయజ్ఞము అను పంచయజ్ఞముల నొనర్చువారలే వైయుండిరి. ఈ యజ్ఞనిరూపణ విషయమున శివునిచే—

"మదర్చాకర్మ విజ్ఞేయం బాహ్యా యాగాది నోచ్యతే
మదర్థే దేహసంశోష స్తపః కృచ్ఛ్రాది నో మతమ్॥
జపః పంచాక్షరాభ్యాసః ప్రణవాభ్యాస ఏవచ
రుద్రాధ్యాయాదికాభ్యాసో న వేదాధ్యయనాదికమ్॥
ధ్యానం మద్రూపచింతాద్యం నాత్మాద్యర్థసమాధయః
మమాగమార్థవిజ్ఞానం జ్ఞానం నాన్యార్థవేదనమ్॥
(వా - సం. ఉ - భా. అ ౧౦)

[శివార్చనయే కర్మయజ్ఞముగాని బాహ్యాయాగాదులు కాదు. నా నిమిత్తమైన దేహసంశోషణమే తపోయజ్ఞముగాని కృచ్ఛ్ర చాంద్రాయణాదులు కాదు. పంచాక్షరినో, ప్రణవమునో, రుద్రాధ్యాయమునో అభ్యసించుటయే జపయజ్ఞముకాని, ఏతదన్యమగు కామ్యకర్మపరవేదాధ్యయనము కాజాలదు. నారూపమును చింతించుటయే ధ్యానయజ్ఞము కాని ఇతర వస్తుచింతన ధ్యానము కాజాలదు. శివాగమముల విశేషార్థమును గురుముఖమున నెరుంగుటయే జ్ఞానయజ్ఞము కాని యన్యార్థముల నెఱుంగుట జ్ఞానయోగము కాజాలదు.] ఇట్టి పంచయజ్ఞముల మాత్రమీ మతీయు లాచరించుచునే యున్నారు. అందుచే నీ మతము (వీరశైవము) వైదికమనియే సిద్ధమవుచున్నది. ఈ వైదికత్వస్థిరీకరణమున కెన్నియేనియు ప్రమాణములు గలవు కాని వ్యాసవిస్తర భీతిచే నవి ఇటననుదాహృతములు.*

* కామ్యయజ్ఞము లవసరములేదు కాని "కుండమంటపహోమాద్యైర్వాన్యైస్సైరప్యకలాదిభిః" అను ప్రమాణములవలన శివదీక్షా వివాహాది సంస్కారములందు వీరశైవులకు హోమాదు లావశ్యకములు. హోమము వేరు, యాగము వేరు. ఈ తారతమ్యము ముందు వివరింపబడును.

౯

ముందు ఈ మతమునం దుదాహృతమైన మలత్రియ మే నేమో తెలిసికొందము. మలమనగా సంసృతి (సంసారి) బంధమునకు కారణమైన పాశము. ఈ పాశము ఆణవ, మాయా, కార్మికము లను మూడువిధములు. అందులో—

ఆణవమలమన—అవిద్య తన ప్రాబల్యముచే ఆత్మయొక్క జ్ఞాన, క్రియా రూపశక్తిని ఆవరించి (బంధించి) ఆత్మను అణురూపము (సంకుచితము)గా జేసి పడవైచునది.

మాయామల మన—సత్యము నసత్యముగను, ప్రకాశము నప్రకాశముగను కన్పడజేయు ఆచరణము. అనగా, అవిద్యచే ఆత్మకు ప్రాప్తించిన కించజ్జ్ఞత్వ, కించిత్కర్తృత్వ, భోగలోలుపత్వములు మొద లైన నానావిధ వైషయిక ధర్మములకు అనుగుణమును సపరిణామ మును నగు కార్యవర్గమునకు ఉపాదానకారణమై సత్యజ్ఞానానందరూపు డగు పరమాత్ముని మరుగుపఱచి, తన కార్యముచే కల్పింపబడి ప్రపంచమునే వ్యాపింపజేసి మెఱయుచుండు పాశవిశేషము.

కార్మికమలమన—వృక్షబీజ న్యాయమువలె ప్రవాహరూప మున అనాదియైన ధర్మాధర్మాత్మకకర్మ, ఫలవాసనారూపమైన పాశము.

ఇట్టి త్రివిధమలములు అనుక్రమముగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల నావరించి ఆత్మకు పశుత్వము (జీవభావము)ను ప్రాప్తింప జేసినవి. ఇందుచే ఆత్మ తనను విడనాడకుండిన సంసృతిబంధమునకు లోనై చిక్కుల నందుచున్నది. ఇట్లు స్వస్వరూపాజ్ఞానముచే ప్రాప్తిం చిన జీవత్వ పరిహారమునకై ముముక్షువునకు శివదీక్షావశ్యకత తప్ప నిదై యున్నది.

ముందు దీక్షావివేకమునకు గడంగుదము. అవిద్యాపాశమును నిర్మూలించి శివాऽభేదజ్ఞానమును కలుగజేయు నొక విధమగు ఆత్మ సంస్కారమునకు 'దీక్ష'యని పేరు. ఈ యర్థమునే వాయవీయ సంహిత ఉత్తరభాగము ౧౫వ అధ్యాయమున—

దీయతే యేన విజ్ఞానం క్షీయతే పాశబంధనమ్
తస్మాత్సంస్కార ఏవాయం దీక్షేత్యపిచ కథ్యతే.

...నియు, సిద్ధాంతశిఖామణి ౬ వ పరిచ్ఛేదమందు—
"దీయతేచ శివజ్ఞానం క్షీయతే పాశబంధనమ్
యస్మాదతః సమాఖ్యాతా దీక్షేతీయం విచక్షణైః."
[ఏది శివజ్ఞానమును కలుగజేయునో, మరియు మలమాయాకర్మ ...ధమును నాశమొనర్చునో దానికి శాస్త్రజ్ఞులు దీక్షయని చెప్పు ...రు.] అనియు చెప్పబడియున్నది. దీనిననుసరించి గురువు శిష్యుని ...నుత్రియము [స్థూలసూక్ష్మకారణ దేహములు] నందుండిన మల ...్రియము [ఆణవ, మాయా, కార్మికమలములు] దీక్షాత్రియ [వేధా, ...ంత్ర, క్రియా, దీక్షలు, అందు ౧-శివస్వరూపుడగు శ్రీ గురువు ...యొక్క కృపాకటాక్ష వీక్షణమాత్రమునను, హస్తమస్తక సంయో ...మువలనను ఏ జ్ఞానక్రియాత్మక శివతత్త్వ సమావేశము కలుగగలదో ...ది వేధాదీక్ష.

౨. శివ పంచాక్షరీ మంత్రము నుపదేశించుటయే మంత్రదీక్ష.

3. శుభముహూర్తమున దీక్షామంటపమందు ఐదుగురు మాహే ...శ్వరులచే స్థాపింపబడి విధ్యుక్తముగ పూజింపబడినవియు, పంచబ్రహ్మ ...మయాత్మకములును నగు సద్యోజాతాది పంచకలశములందలి తీర్థముచే ...గురువు ఋత్విజులతోగూడి శిష్యుని మూడుసార్లభిషేకించి మిగిలిన ...క్రియలనన్నిటిని సక్రమముగా నొనర్చిన పిమ్మట అధ్వశోధన, కలా ...న్యాసాదులచే సుసంస్కృతమై శిష్యుని నిరతిశయ ప్రీతి కాస్పదమైన ...పంచసూత్ర ఘటిత ఇష్టలింగమును శిష్యుని హస్తమునందు స్థాపించు ...టయే క్రియా దీక్ష.] బలముచే బూడిదగా నొనర్చి స్థూలసూక్ష్మ కారణశరీరములందు క్రమముగా * ఇష్ట, ప్రాణ, భావములను త్రివిధ

* "శివలింగస్వరూపం తే వక్ష్యామి శృణు పార్వతి!
ఇష్టలింగం భావలింగం ప్రాణలింగ మితి త్రిధా॥ ౨౩॥
దీక్షావిధానాద్గురుణా యల్లింగం ప్రతిపాదితం
మంత్రోపదేశసహిత మిష్టలింగ ముదాహృతం॥ ౨౪॥
తత్ర దేహేంద్రియగుణః శివార్పిత నిజాంతరః
శివఏవ మనోలీనం ప్రాణలింగం తదుచ్యతే॥ ౨౫
జాగ్రదాదిష్వవస్థాసు జ్యోతిర్లింగైక్యమానసం
అజ్ఞానం నివృతం యస్మాద్ భావలింగం తదుచ్యతే॥" ౨౬॥
అని సూక్ష్మాగమము ౭వ పటలమునందు లింగత్రయ స్వరూపము నిరూపింపబడియున్నది.

లింగములను స్థాపించుచున్నాడు. ఆపై శివలింగానుష్ఠాన క్రమము
బోధించి యావజ్జీవమును ఈ యనుష్ఠానమును వదలకూడదని ఆజ్ఞాపి
అట్లులనే యావజ్జీవము శివానుష్ఠానము నాచరించునట్లు శిష్యుని
ప్రతిజ్ఞను జేయించుచున్నాడు. ఇట్టి నియమములతో కూ
శివసంస్కారమే దీక్ష యనబడుచున్నది.

జీవునకు పాశనివృత్తినొనర్చి శివసాయుజ్యమును కలుగజే
నీదీక్ష మోక్షార్థుల కత్యావశ్యకమనుట విశదమాచున్నది. ఇట్టి దీక్ష
పొందుటచే జీవుడు దగ్ధబజన్యాయమువలె పునర్జన్మకు దూరు
చున్నాడు.

ఇట్లు వీరశైవమతము వైదికమన నొప్పి, మానవుని అవిద
(అజ్ఞాన) పంకిలమును సయుక్తికముగ త్రిమలములుగా విభజించి
న్నివృత్తిసమర్థము లగు కర్మలను దీక్షలనుగా పేర్కొని, తన్మాలము
'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' అనునట్లు,

అల్పకర్తృత్వముతోనే మహత్తర ఫలమును కలుగజేయునదై
అనగా - కొందరు క్లేశసాధ్యములగు బహుకర్మలయందు దొడంగి
వారయ్యు, ఈజన్మమున ముక్తినిగాంచనేరక పితృ, పితామహ, ప్రపిత
మహాది లోకముల పరిభ్రమించుట తప్పనివిధిగా పరిణమించినవారలై
యుండ, మరికొంద రంతకును నెక్కుడగు కాయక్లేశముల కోర్చి ధ
సాధ్యమగు అనేక ద్రవ్యరాసులతో యజ్ఞ యాగాదుల నొనర్చియు
'క్షీణేపుణ్యే మర్త్యలోకే విశంతి'యను ప్రమాణముపై అనిత్యము
అల్పతరమును నగు స్వర్గరూపఫలమునే బొందుచుండిరి. ఇట్లు బహు
కర్తృత్వముచే అల్పఫలమునందుచుండు కర్మఠులగు నితర మతీయులకు
వలె గాక నీ వీరశైవమతీయులకు 'నిస్స్వస్య విశ్వేశ్వర ఏవ దేవః'
అన్నట్లు నిర్ధనికులకును సాధ్యమగు భస్మబిల్వాదులచే శివలింగము
నర్చించుటయను సులభకర్మచే దుర్లభమును మహత్తరమునునగు 'ఏకేన
జన్మనా ముక్తిర్వీరశైవానయినాం' అనునట్లు ఈ జన్మముననే
శివసాయుజ్యమననొప్పు పరతరముక్తిని యందజేయునదై యుంట సర్వ
తోముఖముగ తన (వీరశైవమతముయొక్క) వైశిష్ట్యతను వెల్లడిజేయు
చున్నది.

# దైవభక్తికి ధన్యవాదములు

## కవిరత్న లక్కన మల్లికార్జునుడుగారు



మ. కొలుతుం దావక పాదపద్మములు నీకుం మ్రొక్కుచుం భక్తితోఁ
దలతుం దావక నామపుంజములు చేతంజేతు నీ కర్పణం
బుల గావించి మదీయమానసమునం బొల్పొందగానిల్చి నా
తలపుల్ సార్థకమంద జేయుమయ నీ దాసుండ మృత్యుంజయా.

అనేక చిల్లరవేల్పులకు గొంతెమకోరికలతో మ్రొక్కుటలువీడి యేకాగ్ర చిత్తంబున పరమాత్ముండగు మహేశ్వరోపాసన చేయువారలఁజూచిన నాశ్చర్యము కలుగకమానదు. విద్యావంతులు ఘనులు గాకున్నను నిరాశ నిర్మలాత్మ గల వీరలు భక్తి సమయములో సదాశివుని యర్చించెడివేళ నిరక్షరకుక్షులగువారు సహితము నాశు కవితా సంకీర్తనల నల్లుచుండుట యద్భుతము. అట్టి దైవభక్తిగలిగిన ప్రమథ మహేశ్వరుల చరిత్రము వ్రాయబూనుచో ననేకములుకలవు. ఈదిగువ సూచించిన శ్రీబసవ నామావళిని యీవైశాఖశుద్ధ తదియా శనివారమున మాగ్రామమందు బసవ కల్యాణము చేయుతరి బసవనియందు మనసు లయముచేసి తన్మయులై యాశువుగా చెప్పిన వారిని గురించి కొంత ప్రసంగింతము.

వీరు సుప్రసిద్ధమైన వీరశైవంబున కృష్ణామండలాంతర్గత వల్లూరుపాలెములో జన్మించిరి. తండ్రి వీరయ్య, తల్లి కోటినాగమ్మ. వీరి పవిత్రనామము బసవయ్య.

వీరు స్థూలకాయులగుటచే విభూతి రుద్రాక్షలుధరించి పూజచేయు సమయమున చూపరులకు సాక్షాత్తు శివావతారులవలె గన్పట్టుచు నానందము గలిగింతురు. శివపూజాది క్రియలకు చాలాకాలము వెచ్చిచుత్తురు. రమారమి పదివర్షములక్రితము వీరి యర్ధాంగి శివలోకప్రాప్తిఁ జెందినది.

తదాది యన్నముతినుట మాని, కాయలు, పండ్లు, శనగలు మొదలగునవి మితముగా భుజించుచు నాలుగువర్షములు గడిపిరి. ఇపుడు వృద్ధాప్యమువలన ఒకపూట భోజనము చేయుచుండిరి.

విద్యవిషయమై విచారించినచో స్వల్పవిద్య. వ్యాకరణము, ఛందస్సు
తెలియనే తెలియదు. కాని పురాణార్థములు, లింగాంగ సామరస్యములు,
ములు, మంత్రార్థములు విశదముగా చెప్పగల నేర్పు గలదు. భక్తిచే లింగార్చన
తదుపరి తన్మయులై కీర్తనలుపాడుట విన్నచో హాయిగానుండును. గాత్రము
ముగా గంభీరముగా నొప్పుచుండును. వీర లారుమాసములకిత్రము శివశతక
రచించిరి. అది పూర్తియగువరకు నెవరికి తెలిపినవారలుకారు. ఒకనాడు నేను
రింటికివెళ్ళి కూర్చుండగా నా వ్రాతగ్రంథము కంటబడినందున చూచితిని. లక్షణ
తెలియనివా రెట్లుచేసిరాయని వింతయైనది. ఆ పద్యములలో లక్షణముతప్పు
భావముబాగు. వీరికి ఇట్టి కవిత్వముపుట్టుటకు కారణంబు లింగారాధన చేయు
నేకాగ్రతచిత్తంబున శివుని ధ్యానించుటయేయని నా భావము.

మచ్చునకు రెండుపద్యము లిందు వ్రాసెదను గనుడిః

క. భ్రమరము కీటకముంగొని, భ్రమరంబును చేయురీతి పరికింపగ స
ద్విమలాత్ముడైన గురువును, తమి శిష్యుల ఘనులఁజేయు ధనదాప్తశివా.

క. వలజిక్కి ఱెక్కలార్చిన, పులుగెగసి జనంగనెటుల పోలేదటులే
ఇలమాయ బోధలనియెడి, వలజిక్కినవాడెట్లు వర్ధిల్లుశివా.

శ్రీ బసవ కల్యాణమునాడు విరచితమునకు మచ్చు:

బసవని నామము పలుమరు భక్తిని పఠియించుం డన్నా॥ ఓ ॥ ప ॥
పసచెడి భవరోగంబులు తప్పక పారిపోవు నన్నా॥ ఓ ॥ ప ॥
బసవని దలచెడి ముఖపద్మంబును బాయడు శివు డన్నా॥ ఓ ॥ ప ॥
బసవడనంగ ద్వితీయశంభుడే భక్తి దెలియు డన్నా॥ ఓ ॥ ప ॥

ఇట్టి భక్తాగ్రేసరుని పాదవనజంబులకు ధన్యవాదములనర్పించి ధన్యుడనయ్యె
ఇటులే మున్ముందు మహనీయులం గూర్చి విశదీకరించెదనని మనవి.

---

శ్రీ శివాయ గురవే నమః.

# వరదాత

## జ్యోతిషకేసరి, శనగవరపు వేంకటరమణశాస్త్రిగారు



ఆనాఁడు హరదినం. మామూలుగ మేమందరం శివపూజచేసే
యానికి ఏ అభ్యాగతో మాయింటికి వస్తూవుండటం మానాన్న
రాయన్ని అర్ఘ్యపాద్యాదులచే అర్చించి తన పంక్తిని కూర్చుండ
కొని మాకుగల కలో గంజో యింత భోజనంపెట్టి ఆదరించటం
వాటుగావుంటుండేది. ఆనాడుకూడా ఆలాగే జరిగింది. ఆవచ్చిన
గతికూడ మానాన్నగారి అదృష్టంపండిందా అన్నట్టు అపర
వతారంగా భస్మాంకిత దేహుఁడై ప్రకాశిస్తున్నాడు. మానాన్న
కే కాకుండా మాయింట్లో వున్న ఆబాలగోపాలానికి ఆవ్యక్తి
భక్తి కుదిరినది. భక్తంటేమెరుగని పరమ మూర్ఖుడనగు నేను
ా ఆపరమశివావతార స్వరూపాన్ని చూచి పరమానందంపొందాను.
లో ఆవ్యక్తి యీలా మొదలెట్టాడు.

అతిథిఅభ్యాగతుల ఆదరించి పరమేశ్వరార్పణముగ పరిచర్య
ు భక్తశిఖామణులకు అన్నివిధముల ఆనందం కలుగ చెయ్యటానికి
వ స్వరూపుడగు భగవానుడు అతిథి అభాగ్యతుల రూపంగావచ్చి
గ్రహిస్తుంటాడు. ఆమహానుభావుని చర్యలు అవాఙ్మానసగోచర
ు. అది కనుక్కోవడం భక్తేతరులకు అందని మ్రాని ఫలము.
ట్టి భగవదారాధనకు ప్రథమ సోపానం భక్తి. దానిని సంపాదించు
వాలంటే ఆవశ్యకమైంది మనశ్శుద్ధి. చిత్తశుద్ధి పొందటానికి
యవలసినపని ఏకాంతసేవ. అనగా ఆడంబర రహితమైన ధ్యానం.
భ్యం కావాలంటే ప్రతినిత్యం సత్సంగుల సాంగత్యం యే పదినిమిషా
న కలిగివుండటానికి నిత్య నైమిత్తికములతోపాటు ఆచరణలో
ుకోవాలి. అందుకే భగవానుఁడు శంకరాచార్యులు—

"సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వమ్।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః."

అని చెప్పినాడంటూ మడి కట్టుకోవచ్చునని మా అమ్మగారు తొం
దర బెట్టుటచే ఆయనగారు మడి కట్టుకొన్నారు.

అప్పటికి సుమారు ఒక గడియ పొద్దుపోయి యుంటుంది
ఆ రోజు రాత్రిసమయంలో అభ్యాగతార్చన జరగటానికి హరి
సమే కారణం. అంతటినుంచి "అభిషేకప్రియశ్శివః" అను ప్రమాణ
సత్యమని రుజువుచేయటాని కన్నట్లుగా మా జనకునితో పాటు తా
గారు కూడా నమక చమకాలతో ప్రారంభించి ఘోషశాంతితో
ముగించారు అభిషేకాన్ని లింగోద్భవకాలానికి. అంతట అత్యంతప్రియు
స్వయంగాపోయి మా వూరి వెలుపల ఉన్న పంచవటి సమీపంలోని
శివాలయ ప్రాకార లోపలి భాగమున ఉన్న వృక్షమునుండి మ
నాన్నగారు తీసుకొచ్చిన బిల్వదళాల్తో అష్టోత్తరశత శివ నామార్చ
అమోఘంగా జరిగింది. ధూప దీపాల్ని యిచ్చారు. మహానైవేద్య
ఆరగింపయింది. కర్పూరం వెలిగించి కైలాసవాసునికి మంగళనీరా
నాన్ని అందజేశారు. మా యింటికొచ్చిన అభ్యాగతి తాతగా
బంధువర్గ సమేతంగా అందరు పంక్తికి వస్తేనేగాని తను ఆపోశ
పట్టనన్నాడు. మా నాన్నగారి ఆజ్ఞ చొప్పున అలాగే అంద
వచ్చాము. ఆయనగారు మాలోబడుగైన పిల్లలందరిని తన కిరువైపు
కూర్చోటానికి నియమించాడు. బ్రహ్మచర్యాశ్రమంలో ఉన్న
బాలకుల్ని చూస్తే పరమేశ్వరుడికి యెక్కువ ప్రీతిరా అన్నాడ
కాని, పంచాక్షరీపారాయణం చెయ్యనివాళ్ళనుచూస్తే పరమశివుని
ఆగ్రహంరా అనికూడాఅన్నాడు.

అనంగానే నాగుండెల్లో రాయిపడ్డలాగ అయింది. తలతి
పోయింది. దేహమంతా చెమర్చింది, ఎందుకంటే ప్రళయఘూ
లయకారకుడు, ఆద్యంతశూన్యుడు, అద్వితీయుడు, అగు ఆపరమశివు

గ్రహంకలిగితే బ్రతికేదెల్లాగు? అనుకొన్నాను. పంచాక్షరీచేయని
నామీదనే ఆగ్రహంకలిగితే, పంచాక్షరీఅంటే యేమిటో యెరుగని
పంచమహాపాతకుల్లో ఒకడినగు నాపై యెంతఆగ్రహం కలుగుతుందో
ని ఒణికిపోయాను. నేను ఒణకటంచూచి పద్యంరానిపిల్లవాడ్ని ముఖం
చూస్తానే తెలుసుకొనే పంతుల్లాగు మా అభ్యాగతి తాతగారుకూడా
ను నామమాత్రం బ్రహ్మచారినే అని, వేదాభ్యాసవిరహితుఁడనని,
గ్రహించారు. పంచాక్షరిని పారాయణచేసి శివానుగ్రహంపొందని
హీనుఁడననికూడా తెలుసుకొని పశ్చాత్తప్తుడనైనందులకు కనికరించి
పంచాక్షరీమంత్రాన్ని ఉపదేశించాడు. ప్రణవసహితంగా పారాయణ
చేయమన్నాడు.

ఆ పరమగురుని యజ్ఞానువర్తుడనై తదేకధ్యానమున పంచాక్షరీ
పారాయణంచేశాను. ప్రసన్నంకాకపోతే పార్థివలింగంచే తల బ్రద్దలు
కొట్టుకొంటానని పట్టుబట్టాను అపరరాత్రి అవుతుందేమో అనే
సమయంతో మా నాన్నగారు ఔపాసన వడ్డించారు. ఔపాసన
సమయంలో అనంతకోటి సూర్యప్రకాశమైన తేజస్సుచే మా
అందరికి కన్నులు మూతలు పడినై. మేం కన్నులు విప్ప చూచే
టప్పటికి అభ్యాగతి తాతగారు అర్ధనారీశ్వరుడై ఆస్థాన మలంకరించి "అను
గ్రహపాత్రులగు మీకు అణిమాద్యష్టసిద్ధుల ననుగ్రహించా"నని
ప్రసన్నదృక్కుల ప్రసరింపజేశాడు. జగన్మాతయగు పార్వతి సంతో
షాన్ని వెలిబుచ్చి 'సంతతశ్రీరస్తు, సన్మంగళానిభవంతు' అని ఆశీర్వ
దిస్తున్నది. పార్వతీ పరమేశ్వరులకు జయ్! అని మా బాల బాలిక
లెల్లరు జయగీతాన్ని పాడారు. నన్నింతలో మా ఆవిడ వచ్చి తెల్ల
వారినది; లెమ్మన్నది. *



* కల తెల్లవారుజామున వచ్చినది కాబట్టి కథ సత్యం—సంపాదకుడు.

# జ నా బా యి

విద్వాన్, కవిరత్న, అష్టావధాని— మేడిపల్లి లక్ష్మీకాంతంగారు



## తృ తీ యా ం క ము - (ప్రథమరంగకము)

(నామదేవునిగృహము)

జనా—(౬ వ అనుబంధము) (పిండి విసురుచుండగాఁ తలుపు చప్పు డగును) ఎవరువారు? (లేచివెళ్ళి తలుపుతీయును.)

(శ్రీకృష్ణుఁడు జనాబాయికిస్త్రీవలెఁ గనఁబడును.)

కృష్ణా—(ప్రవేశించును) నీవేనమ్మా యిప్పుడు పాటపాడినది?

జనా—ఔను. రండు కూర్చొనుఁడు.

కృష్ణా—(పీటపై గూర్చుండును)

జనా—అమ్మా! తమపేరేమి? తమరేలవచ్చితిరి?

కృష్ణా—(అటునిటుచూచి) అమ్మా! నా పేరు కృష్ణాబాయి. శ్రీ కృష్ణునిపై నీవుపాటలు పాడుచుండ వినవచ్చితిని. మా యత్త మామలకు శ్రీహరియన్న గిట్టదు. గాదె క్రిందిఎలుక లెల్ల ప్పుడు కలుఁగులోనికి గింజలు గూర్చునట్లు సర్వదా పరుల మోసగించి ధనమార్జించుటే వారివృత్తి. అదేచింత. ఇక నా మగఁడన్న వారిపుత్రుఁడేకదా? ఆవు చేనిలో, దూడగట్టున మేయుటకలదా?

జనా—అమ్మా! అటులనెద రేమి?

తే. గీ. ముండ్లమధ్యమున గులాబి • పూలు మొలుచు
కాలగనులను రత్నాలు • ప్రభవమొందు
ఫణిఫణంబుల మణులును • బరఁగునటుల
ఖలులకడుపున సుజనులు • గల్గుచుండ్రు.

త్రిజగత్కంటకుఁడైన హిరణ్యకశిపుని గర్భమున శ్రీహరి భక్తుఁడగు, ప్రహ్లాదుఁ డుదయించుటెఱుఁగవా? తల్లీ! దానికి మన మేమి చేయుదుము. అయినను విలపించిన విపత్తు లీడేరునా?

స్నా—రామ! రామ!! ఇంతపాప మెచ్చటనైనగలదా? హరిదాసుల కన్నమిడుట తప్పు. హరికథలాలించుటతప్పు. మీబోఁటి పావనుల దివ్యకథాసందర్శన మొనర్చుట తప్పని నామగఁడు నన్ను రట్టుపెట్టుచుండును. నీ కీర్తన మాలించి పరవశనై యిటనువచ్చితిని. ఏది, మఱియొకసారి హరికీర్తన పాడుము. శ్రవణానందముగ వినుచు నేన యీపిండి విసరెదను.

—(౭ వ అనుబంధము)

స్నా అమ్మా! పిండియైనది. లోనికేగి పళ్ళెరమును దెమ్మా. దీని నెత్తియిచ్చెదను. (తిరుగలి తీసి పిండి కుప్పగా నద్దుచుండును.)

—చిత్తము. (నిష్క్రమించును)

స్నా—ఆహా! ఏమీ తరుణి భక్తిపారవశ్యము. ఏ మీ వనిత సత్ప్రవర్తనము!!

సీ. ఆబాల్యమాదిగ • హరినామ సంకీర్త
నామృతంబును గ్రోలు • నాతిమిన్న
మోక్షమార్గ నిరోధ•ములవీడి జగతి ని
ష్కామంబుతో నున్న • కలికిమిన్న
పరులకుఁ దనకు ద్వై•వంబునకు నభేద
భావంబు గలిగిన • పడఁతి మిన్న
కుసుమకోమలియయ్యుఁ • గోవిద సేవ క
లరుచునుండెడు నవ•లాల మిన్న
తే గీ భక్తి హృత్పద్మమున నను•బంధితునిగఁ
జేసి భావనామృతమును • బోసి, పెంచి
తనకు వశ్యునిగాఁ గొన్న • తరుణి మిన్న
భక్తులం దెన్న నీ జనా•బాయి మిన్న.

(అదృశ్యుఁడగును)

జా—(పళ్ళెరముతో వచ్చి) ఏదీ కృష్ణాబాయి యెక్కడ? కృష్ణాబాయి! కృష్ణాబాయి!! (నలుదిక్కులు వీక్షించి, పిష్టరాశిపై శంఖ చక్ర చిహ్నితములగు శ్రీకృష్ణుని పాణ్యాంకములఁజూచి,

నిర్భరానందముతో) కృష్ణా! కృష్ణా!! (కన్నుల కద్దుకొని) భక్తవత్సలా! నీ వెంత కరుణార్ద్రహృదయుఁడవు. ఒక్కసారి నినుఁ గీర్తించినంత వచ్చితివి. నీ సతి రుక్మిణీబాయి నీకై యెందరిగనో! పెద్దతడవు నాకడ వసించితివి. పరపురుషునితోఁడి ప్రియభాషణము కులస్త్రీలకుఁ దగదనియా? నా మనం బెఱిఁగి నీకు, నే నితరముగాఁ దోచితినా? కృష్ణా! స్వస్వరూపముఁ నరుదెంచినను నిను గాదను వా రెవరు? (ఆలోచించి) ఓ! కాదు కాదు, నీసతి రుక్మిణి నిన్నడ్డును, నీ ప్రియభార్య సత్య గద్దరించును. నీప్రియురాలు రాధ యొట్టుపెట్టును, ఓ! వట్టిమాట. గజప్రాణావనోత్సాహివై యరుగునపుడు, శ్రీజయ దేవులకు సాక్షాత్కరించినపుడు, ప్రహ్లాదునకై యుక్కుకంబముఁ నుండి యుద్భవించినప్పుడు నిన్ను రుక్మిణియు, సత్యయు, రాధయుఁ బోవలదని యడ్డికట్టిరా? భక్తావనా! నన్నేల యుద్ధ రింపవు? నాకేల దర్శనమీయవు? కృష్ణా! నీదయఁజూరకొనుటకై నింకను నోచుకొనలేదా? నాగతియేమి, నాకింకెవరుదిక్కు కృష్ణా! కూరురాలనై పిండియంతయు నీచేత విసరించితిని నే నెంతయవివేకిని, నిన్నేలగుర్తింపను? నామూర్ఖ్యమునకు మన్నిం పుము. నన్ను నీయందుఁ జేర్చికొనుము. తండ్రీ!

(౮ వ అనుబంధము)

నామ —(ప్రవేశించి) తల్లీ! జనా! ఏల యిట్లు విషాదముద్ర వహించి యున్నావు. కారణమరయుదునా?

జనా—తండ్రీ! నాగోపాలకృష్ణున కింకను నాపైఁ గృపకలుగదే? పిండి విసురుచున్న నాకడకు స్త్రీవలెఁ గపటవేషధారియై చనుదెంచి, తాను తిరుగలివిసరుచు నాకీర్తన లాలించి నేను గృహములోనికి బళ్ళెరమున కేగి వచ్చునంత నదృశ్యుఁడయ్యె. ఆ మాయవేష ధారి మన్మానససరసీరుహాసనుఁడు, ఇవిగో! ఇవిగో!! శంఖ చక్రాంచిత పాణ్యంకము లీపిష్టరాశిపైఁ గన్పట్టుచున్నవి. తండ్రీ! ఇఁక నాదిక్కెవరు? ఇఁక నాకేది తెఱవు? నాకు శ్రీహరిదర్శన భాగ్యము లభింపదా? (విచారముతో నుండును)

—(దయాశాంతవచనముల) భగవల్లీల లెఱుఁగ నేరికి శక్యము? తల్లీ !

లోలిజన్మంబునఁ జేసినట్టికృషి యెం • తో యంతకుఁ సాటిగా
ఫలమీజన్మమున న్ఘటిల్లు నది త • ప్పంజూడశక్యంబె లో
కులు కష్టంబుల దూరుచుందురు విధిం • గోపంబునన్ మూఢులై
లలనా! మూర్ఖులఁబోలి చింతిలక, శ్రీ • లక్ష్మీపతిం గొల్వుమీ.

కర్మవిమోచన మగువఱకుఁ దాళియుండుము. పరిశాంతముతో ని ధ్యానింపుము. త్వరలో సర్వాంతర్యామి స్వస్వరూప సందర్శనానందకందళిత హృదయారవింద వయ్యెదుగాక, రమ్ము (ఇరువురు నిష్క్రమించు) (యవనిక వ్రాలును)

## ద్వితీయ రంగకము

### [ నామదేవుని గృహము ]

—(ఇంటిముంగిటఁగూర్చుండి శ్రీకృష్ణునిపైఁ గవన మల్లుచుండును)

కృ—(తాటాకులు, గంటమును జేతఁబూని వ్రాసికొనుచుండును)

—కృష్ణా! వాచామగోచరుఁడ వగు నిన్నేమని వర్ణింతు!

తే. గీ. భువనజాతములను జిఱు • బొజ్జనుంచి
జీవకోటులకు న్నీవ • జీవనమయి
స్వస్వకర్మానుఫలముల • జరుపుచుందు
వీవ, నిన్నెఱుఁగంగ నే • నెంత? కృష్ణ!

కృష్ణ—(వ్రాసికొని) ఆహా! యీ కలకంఠి వాక్సుధారసము గాంగజల ప్రవాహ గతింబఱగుచు భక్తితరంగముల నన్మూ(?)ఁగజేయుచున్నది. ఈ కవయిత్రి నాపై నల్లు కవనమెంత కొనియాడఁదగినది. ఐహికసుఖాపేక్షవీడి ననుఁగోరి తలక్రిందుగఁ దపంబొనర్చు మౌనీశులకును దెలియశక్యముకాని నే నీమెకు సేవకుఁడనైతిని.

తే. గీ. స్వాదుపేశలామృత రసా • స్వాదమునఁ, గ
మలమున వసించు మధుపంబు • వలెఁ దన కవి
తారసంబున కాసించి • తరుణి హృదయ
పంకజంబున కే వశం • వదుఁడనైతి.

జనా—

శా॥ పారంబుల్ గనరాని వ్యర్థపుభవ॰వ్యాపార పారీణతల్
నేరంజాలను, తావకాంఘ్రి యుగళిల్ ॰ నిశ్చింత సేవింప, నీ
కారుణ్యామృత దృష్టి నన్నుఁగని, మ॰త్కా-లుష్యముల్ బాప, నా
ధారంబీవ మఱొండు లేరుగద, భ॰క్తవ్రాజ చ్చింతామణీ!

శ్రీకృ—(వ్రాసికొనును)

జనా—

చం॥ సనకసనందనాది ఋషి ॰ సత్తము లెన్నఁదరంబుకాని, పా
వనచరితుండపీవ, భవ॰పంకనిమగ్నను గాదె నేను, నీ
మననము సేయనోపుదునె? మాధవ! దీనజనావనుండ వీ
వ, ననుఁ గృపందలంచి పరి॰పాలన సేయవె నీకు మ్రొక్కెదన్.

కృష్ణుఁడు—(వ్రాసికొనును) ఆహా! ఏమీ కవనము!!

తే. గీ. సకల కుసుమరసంబుల ॰ చవి నెఱింగి
భ్రమరికూర్చిన పుష్పాస॰వమునకన్న
స్వాదుపేశల గుణముఁ లీ ॰ సరణిఁగూర్చి
సుకవితామృతలహరినీ ॰ సుదతిపార్చు.

నామ—(ప్రవేశించును) (9 వ అనుబంధము)

శ్రీకృ—(ఉలికిపడి తాళపత్రములను గంటమును దాచికొని పోవను
కించును)

నామ—శ్రీకృష్ణ భగవానుఁ డేమో చిత్రమొనర్చి నా కనుగట్ట
యత్నించుచున్నాఁడు. కానిచో నీ తొట్రుపాటేల కలుగును!
కృష్ణా! కృష్ణా!!

శ్రీకృ—(విననియట్లభినయించును)

నామ—(ఉచ్చైస్స్వనముతో) కృష్ణా! శ్రీకృష్ణా!!

శ్రీకృ—(వెనుదిరిగిచూచి) ఓహో! నామదేవులా!

నామ—స్వామివా రేదో నాటకమాడించుచు నాకుఁ జూపకున్నారు.
ఇదియేనా? ఉపాస్యోపాసక మర్యాద.

శ్రీకృ—ఏమియులేదు. నామదేవా! మఱేమియులేదు.

న—ఔను. ఏదియు లేకుండుటనే వలలోఁ జిక్కిన చేపవలె నా దృక్పథమునుండి తప్పించుకొనఁ జూచుచున్నావు. మాయా నాటక సూత్రధారుఁడవు. నీ వెన్ని నాటకములనైన నాడింపఁ గలవు. ఇదివఱ కెన్ని యాడించితివో! ఇకముందెన్ని యాడింప గలవో! సంకల్పసిద్ధుఁడవు. నీవు తలంచినఁ గాకుండున దెద్ది!

కృ—నామదేవా! నన్నుగూర్చి యీ వ్యాఖ్యానమేల? నీ వెఱుఁ గని దిచ్చట నేమియుండును?

న—(మందహాసమున) మఱేముండును? ఉగ్గుపాలతో నలవడిన చౌర్యము నేఁ డీవు లక్ష్మీకాంతుఁడ వైనను బోవునా? భక్త మానసాపహారీ! ఎవని గ్రంథమునుండి యీ తాళపత్రములను దొంగిలించితివి? పాప మా గంటమును వానిదేనా?

కృ—(పరిహాసముగా) ఆహా! ఎంతచక్కఁగా గ్రహించితివి. నేను కవినైనను బద్యచౌర్యమునకుఁ బాల్పడు కాకవి ననుకొంటినా?

న—(తన కీయ సైగచేయును)

కృ—(పరధ్యానము నటించుచుండును.)

న—పోనిమ్ము. కృష్ణా! నే నొకసారి చూడఁగూడదా?

కృ—(నామదేవుల కిచ్చును.)

న—(చదివి కన్నుల కద్దుకొని) కృష్ణా!

ఉ. ఏ మహనీయధన్య రచియించెనో నీపయి నిట్లు పద్యముల్
ఏ మహితాత్మపూత రచియింపఁగఁ జేసెనొ నిన్నుఁ బద్యముల్
ఏమి తపంబుజేసి కనె నిట్టి కవిత్వ మహత్వసంపదన్
ఆ మహితాత్మఁగాంచ హృదయంబునఁ గోరికలుబ్బి పర్వెడున్.

కృ—(తట్టి) నామదేవా? అదుగో! జనాబాయి. ఆబిడ వక్త్ర పద్మమే యీ కవితా మాధురీఝరికి జననస్థానము. భక్తి పారవశ్యమున వివశమై మల్లీలాభివర్ణన మొనర్చుచున్నది. మన మిచ్చట నొకింత పొంచియుండి యామెను గమనింతము రమ్ము.

న—(శ్రీకృష్ణుని వెన్నంటును. ఇరువురు నిష్క్రమింతురు)

జనా——గోపాలకృష్ణా! భవత్సందర్శన భాగ్యము నాకీ జన్మమున లభింపదా? నే నింకను బావనిని గాలేదా? త్రికరణశుద్ధిని గొల్చు దాసిపై నీ కింతకృపగల్గదా? నా జన్మము, నా భ[illegible] నా శ్రద్ధ, నా ప్రేమ నేఁటితో వమ్ము గావలసిన దేనా? సర్వకా[illegible] సర్వావస్థల నిన్నే మఱక భజించు నీ దీనురాలి గోడెఱుఁగ[illegible] వాఁడవా నాఁడల్లుఁడా రమ్మని గోముఖవ్యాఘ్రమువలెఁ [illegible] చిన మామ నెట్లు మెచ్చితివో! కాళింది, పూతన, శకటాసుర, ధేనుకాసురాది రాక్షసులకన్న నిను నే నెక్కుడు గాఁచితినా? భక్తత్రాణ పరాయణుఁడవను నీ బిరుదున కీనాఁడు భంగపా[illegible] కలిగెనా? నన్నుఁ గృపఁగనవేమి కర్మము? కృష్ణా! నీ [illegible] దెంచిన నాకడ వెన్నముద్దలు లేవనియా? దధిభాండము[illegible] దొరకవనియా? బొజ్జనింప క్షీరముండదనియా? పరుం[illegible] బూపాన్పు లేదనియా? నా హృత్పంకజముపఁ బరుండిన నీ కిందిరా సంగమము లభించునే. నిష్కళంకమై నిశ్చలమ[illegible] బునఁ బ్రార్థించుచున్న నాకు దర్శన మీయని నీవు—

తే. గీ. కన్నతల్లికి నెడఁబాపి • కానఁద్రోసి
పూతనాది రాక్షసుల నీ • పొడవణంప
లేక, మధురకుఁ బిలిపింప • లేశమైన
సంశయింపక చనితె? కంసారి! చెపుము!

కృష్ణా! కృష్ణా!! గోపాలకృష్ణా! బాలకృష్ణా!! (అ[illegible] మూర్ఛనొందుచుండ శ్రీకృష్ణుఁ డామెను బట్టికొని యంకతలము[illegible] బరుండఁజేసి) (10 వ అనుబంధమును చూడుము)

శ్రీకృ—నామదేవా! నీ వీమె పూర్వజన్మవృత్తాంత మెఱుఁగుదువా[illegible]

నామ—స్వామీ! వినఁగోరెదను.

శ్రీకృ—అవధరింపుము,

తే. గీ. ఉద్ధవుఁడ వీవు, కుబ్జ యీ • యువిద పూర్వ
జన్మమందు నన్నువరించి • శయ్యఁజేర్ప
మత్కర స్పర్శనము సేసి • మహితగుణము

గలిగి వర మొందె నాచేతఁ • గడకుఁ దాను
దన పునర్జన్మమున ముక్తి • గనఁగభక్తి.
(శ్రీకృష్ణుఁ డదృశ్యుఁడగును. తెర బ్రిద్దలగును. బాలకృష్ణుఁడు,
..., ఉద్ధవుఁడు కనఁబడుదురు.
..మ—ధన్యోస్మి! ధన్యోస్మి !!
తే. గీ. బ్రతుకు బంగారమయ్యె, నా • వ్రతము పండెఁ
బూర్వజన్మమునందు నా • పొత్తులేక
సానియింటికిం జననట్టి • సంగడీఁడు
బాలకృష్ణు సందర్శన • ప్రాప్తిఁజేసి.
ఆహా! ఆకుబ్జయే యీజనాబాయి. ఏమీాతన్వి యదృష్టము!
..కుబ్జయియుండియు మంగళాకారుని మన మాకర్షించినది. యథార్థ
..తియె.
తే. గీ. వనిత నిష్కల్మషంబైన • వలపుచేతఁ
బూరుషుని వశ్యుగాఁగొని • పొందుసుఖము
మెఱుఁగుపూఁతల, సొమ్ముల • మఱుఁగుమందు
ల, నన్నృతంపుపల్కుల, టక్కు • లను, టమారి
విద్దియలఁ బొంద నేర్చునె • రద్దిగాక ?
..కృ—(ప్రవేశించి) నామదేవా! ఇంకను జరుగనున్న విచిత్రమును
గందము. రమ్ము. (నామదేవునితో నిష్క్రమించును.)
..నా—(మూర్ఛనుండి లేచి) కృష్ణా! కృష్ణా!! గోపాలకృష్ణా! మురళీ
కృష్ణా! ముద్దుకృష్ణా! పోకుము. పోకుము.

(౧౧ వ అనుబంధము)

రాధా—(ప్రవేశించి) జనాబాయీ! నీవేలయిట్లు కలవరపడుచున్నావు?
..నా—(ఆతురముతో) తల్లీ! కృష్ణుఁడు, బాలకృష్ణుఁడు, నాముద్దు
కృష్ణుని, నాగోపాలబాలుని, నామురళీకృష్ణుని నాకుఁజూపరా?
(విషాదమున) ఏడీ? ఎచ్చటో ఎచ్చట? చూపవా?
రాధా—అమ్మో! వెఱ్ఱితల్లి! శ్రీకృష్ణుఁడిందు రాలేదు. వచ్చిన నగు

పడఁడా? ఏలయిట్లు పిచ్చిదానివలెఁ దిరుగుచుంటివి? మన
కుదురుపఱచుకొనుము, శ్రీకృష్ణుఁడిందువచ్చినఁగదా చూపుట
జనా—వచ్చినఁగదా! అదేమి? వచ్చెనుగదా! రానేలేదా?
లేదు. నాబాలకృష్ణు నెందోదాచి వచ్చి లేదనుచుంటివి. రమ
నాకృష్ణుని నాకుఁజూపుము. (రాధాబాయిన్ని లాగుచుండును)
నామ—(ప్రవేశించును.)
జనా—తండ్రీ! మా యమ్మ నా బాలకృష్ణునెందో దాచివ
చూపుమన్నఁ జూపకున్నది. మీరైన నా దేవదేవుని
మురళీకృష్ణుని నాకుఁ జూపరా? (కాళ్ళపైఁబడి ప్రార్థించును
నామ—(లేవఁదీసి) అబలా! సర్వాంతర్యామి, సకలభూతాత్ముఁడు
సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణు నెందు చూపఁగలను? అతఁడు
స్థలమొక్కటి గలదా? శ్రీకృష్ణ పరబ్రహ్మ మద్వితీయ
పర్వతములనుండి పరమాణువు వఱకును, సూర్యచంద్రాది గో
ములు సమస్తము దానయ్యై, పరంజ్యోతియై వెలుఁగుచున్నా
జనా—మహాత్మా! నే నజ్ఞానను, అబలను. భక్తజనలోలుఁడు, భ
పాశబద్ధుఁడు. భక్తవ్యామోహనుఁడు, నాగోపాలకృష్ణుఁ
నాకు జక్షుర్గోచరుఁడుకాఁడా? (నిట్టూర్పువిడిచి) కృష్ణా! కృష్ణా!
(రాధాబాయితో) అమ్మా! కృష్ణుఁడు నా బాలకృష్ణుఁ
(ఆలించివిని) నిజముగా నిదియే మురళీగానము. అహో! గోప
బాలుఁడు, గజ్జెలందియలు మ్రోగుచున్నవి. (౧౧వ అ
బంధము)తో నిష్క్రమించును)

రాధా— } (పరస్పరము భావలోకనముతో నామెవెళ్ళినతో వెన
నామ— } వెళ్ళుదురు. (యవనిక వ్రాలును.)

తృ తీ య ర ం గ క ము

(నిష్కుటవనము)

జనా—(౧౧ వ అనుబంధముతోఁ బ్రవేశించును.) (ఒక గున్నమావి
సమీపించి విభ్రమముతో) ఏఁడీ! శ్రీకృష్ణభగవానుఁడు! (ప
కించి) మోసపోతిని. ఓసీ! తుమ్మెదా!

తే. గీ. కృష్ణవర్ణంబుదాల్చి శ్రీ॥కృష్ణునందు
నైక్యమును బొంద నెంచితో ॥ యది హుళక్కి-
కాని మధువానునపుడును ॥ గానలోలు
కీర్తనముమాన వెంత సు॥కృతవు భ్రమరి!

(౧౧ వ అనుబంధముతో నొక వెదురుగుమ్మను సమీపించి)

కృ! శ్రీకృష్ణభగవానుఁడు! (యోచించి) అబ్బా! ఎన్నివిఘ్నములు నారా! ఏదిక్కునులేని నీకింత యార్భాటమేల? ఎంత కాలహరణ మొనర్చితివి!

తే. గీ. వెదురుసందుల జీవ్వన ॥ పీచుకతన
మురళియో యను భ్రమమున ॥ మురిసియాడి
కాదనుచు నెఱిఁగినయంతఁ ॥ గనలి ఫణుల
మ్రింగుటుచితంబె నిన్ను స॥మీర కపటి!

(౧౧ వ అనుబంధముతో నిష్క్రమించును.)

ము—
కృ— } (ప్రవేశింతురు.)

కృ—నామదేవా! చూచితివా? ఇది భక్తి; ఈమె భక్తురాలు. ఈ జనాబాయియే పరమభక్తురాలు.

ము—భక్తవత్సలా! ఇఁకనైన నాబాలను గృపఁగనవా?

కృ—(రోయుచు) ఇదుగో! ఇటేవచ్చుచున్నది.

ము—కృష్ణా! ఏ మట్లు రోయుచున్నావు?

కృ—చూడు మా యింతి యెటుల పరుగిడుచున్నదో!

ము—ఆహా! భక్తుల కార్తిగలిగిన భగవానుఁ డోర్చునా? గాయ తెల్పినఁ దీఁగె యల్లలాడదా?

—(౧౧ వ అనుబంధముతోఁ బ్రవేశించును.)

భా—(ప్రవేశించును.)

—గురువర్యా! నా చిన్నారికృష్ణునిఁ జూపరా?

ము—వెతకఁబోయిన తీఁగె వ్రేలికిఁ దగిలినట్లు నీ కట్టెదుటనున్న శ్రీకృష్ణపరమాత్మ నెఱుఁగవా? తల్లీ!

జనా—(శ్రీకృష్ణు నాపాదమస్తకము వీక్షించి) ఈ కృష్ణుఁడేవ...
మాయవేషధారి, కృష్ణపాత్రధారి. నా కృష్ణుఁడు ...
కృష్ణుఁడు. హా! కృష్ణా! కృష్ణా!!

తే. గీ. పాలబుగ్గలలేనవ్వు ♦ చాలువాఱఁ
దప్పటడుగుల గజ్జియల్ ♦ తాళగతిని
మ్రోయ, పింఛంబు నుసియాడ ♦ మురళినాదు
లీల, దర్శనమిమ్ము గో♦పాలకృష్ణ!

శ్రీకృ—అట్లయగుఁగాక! (అదృశ్యుఁడగును.)
(పై విధమున బాలకృష్ణుఁడు ప్రత్యక్షమగును.)
(జనాబాయి, రాధాబాయి, నామదేవులు స్తుతింతురు.)(౧...
అనుబంధము.) (బాలకృష్ణుఁ డదృశ్యుఁడయినంత శ్రీకృష్ణుఁడు ప్రత్య...
మగును.)

నామ—కృష్ణా! నీ లీల లెఱుఁగ నేరికి శక్యము? భక్తప్రియ...
భక్తులకొఱకే నివిన్ని యవతారము లెత్తుట. కాని, నా ...
కోర్కె గలదు. నేఁడీవు మా కతిథివిగా రమ్ము.

శ్రీకృ—(మాట్లాడకుండును.)

నామ—ఏమి నిరుత్తర మనంగీకారసూచకమా?

శ్రీకృ—ఉఁ; ఉఁ! (అని ముఖము త్రిప్పును.)

నామ—శ్రీకృష్ణా! అలనాఁడా కుచేలుఁడే ధన్యుఁడు. ఆ విదురు...
ధన్యుఁడు.

శ్రీకృ—నామదేవా! మీ యతిథితోడపై, మీజనాబాయి కూర్చు...
యాతని కన్నమును తినిపింపవలెను.

నామ—అమ్మా! ఏమి నీ యదృష్టము! స్వామివారి యభీష్టము నె...
గితివా!

జనా—

తే. గీ. పదరజస్పర్శమాత్రఁ బా♦వనము సేయు
వానియూరుతలంబు నే ♦ చానయెల్ల

క్కుండు ? రససిద్ధిచే నిన్ను♦గుండు పసిడి
ముద్దయగుటకు సందియం ♦ బుండునొక్కొ.

రాధా—ఆహా !

సీ. భూతకోటులనెల్ల ♦ పోషించు పురుషోత్త
మున కన్నమిడుసతి ♦ పుణ్యమేమొ !

నామ— క్షీరాబ్ధికన్యక ♦ చెలువొందు శ్రీహరి
యంకపీఠిక నెక్కు ♦ నతివ ధన్య

జనా— యజ్ఞాదికర్మల ♦ కందగారాని, శు
భస్థలినుంట నా ♦ భాగ్యముగద

నామ— ఎవ్వరెఱుంగనట్టి ♦ యిట్టిపదవి జనా
బాయి కనుట కామె♦భాగ్యమేమొ!

కృష్ణ— తే. గీ. భక్తప్రహ్లాద, విదుర, శ♦బరి, కుచేలు
రాదిగాఁగల భక్తులం♦దరయమిన్న
యగుటఁ దృప్తితీర భుజింతు ♦ నమిత కాంక్ష
చే జనాబాయి తినిపించు ♦ భోజనంబు.

నామ—కృష్ణా! తరించితిమి. గృహమున కేగుదము రమ్ము.

(ఎల్లరు నిష్క్రమింతురు) (యవనిక వ్రాలును)

తృతీయాంకము

సమాప్తము.



# శ్రీ మటికె నాగయ్యతల్లి నిర్యాణము



సుప్రసిద్ధధర్మాత్ములును వీరశైవ భూషణులును అగు కైలా వాసి శ్రీమటికె నాగయ్యగారి జనని యగు శ్రీమటికె బసవమ్మగారు ఇదేఅధిక శ్రావణ బ॥ ౧౩ ఆదిత్య వారము(13-8-1939) సాయంకాలము ఆరుగంటలకు శివైక్యమైన దనువార్త దెలుపవలసివచ్చినది. బసవమ్మ గారొక యమాయకపువ్యక్తి. ఆమె సత్యలోకముమానవురాలని చెప్ప నొప్పును. బాల్యమునుండియు సదాచార హరగురుభక్తిపరురాలు పతివ్రతామణి. కావుననే కీర్తికాయుడగు నాగయ్యవంటి మహా భావునకు జన్మము నీయగలిగినది. పతియగు శ్రీమటికె చెన్న బసవప్ప గారి నిధనానంతరము ఆరుసంవత్సరములలో పుత్రదుఃఖము (నాగయ్య గారు పోవుటవలన) సంభవించెను. వృద్ధాప్యమున పతిపుత్ర దుఃఖము రెండును గల్గుట ఘోరముగదా! దాదాపు మూడు సంవత్సరము నుండి యామె విషాదముతోడనే కాలము వెళ్లబుచ్చుచున్నది. పైగ డెబ్బదియేండ్ల ముదుసలితనమును వేసరగానుండెను. ఆమె దేహమ వెనుకటికాలముదికావున ఇంకను ఆరోగ్యముగనుండి నేదో కొం పనిచేసుకొనుచుండెను. కాని ఇటీవల జబ్బువలన మెత్తనగుచు క్షీణించ చున్నప్పటికిని ఎక్కువగా నుపచారము చేయించుకొనలేదు. చివరక పదునాలుగు దినములు మాత్రమే అతిసారము, సన్ని మున్నగు జాడ్య ములవలన నేలబట్టియుండెను. క్రొత్తగా వచ్చిన చిన్నకోడలి ము పెము చూడకమునుపే వెళ్ళుట విచారకరమైనను, పండినపండు రాలక నుండదుకదా! శ్రీ బసవమ్మగారి యాత్మకు పరశివుడు పరమశాం ననుగ్రహించి యామె ముద్దులపుత్రికగు శ్రీ మటికె రాజయ్యగారి భోగభాగ్యాయురారోగ్య సంతానముల సదా ప్రసాదించుగాక యని యాశించుచున్నాము.



# లింగాయత శబ్దపు అన్యాయము !

## అత్యవసరమైన సూచన

గతసంచికలో లింగాయతశబ్దముయొక్క వివరమును జూపుచు [అ]ది యనర్థకారియనియును వీరశైవశబ్దమునే వాడవలెననియును [సూ]చించియుంటిమి. ప్రస్తుత మీ లింగాయతశబ్ద సమస్య చాలమహ[త్త్వ]మునకు వచ్చినది. కొందరు విచిత్రవ్యక్తులు ఈ శబ్దమునే కోరుచు [మ]దాసు ప్రభుత్వమునకు నివేదించగా వారటులే యంగీకరించిరట ! [ఈ] సమాచార మాంధ్రవీరశైవులకు బొత్తుగ దెలియదు. ఇటీవల [ఈ] లింగాయతశబ్ద మొక ఘోరమైనయన్యాయమున కెట్లు కారణమైనదో [ఈ] క్రింద వివరింపబడుచున్నది.

నిజాంరాష్ట్రమందలి వనపర్తిసంస్థానములో కొత్తకోట యను [గ్రా]మ మొకటి కలదు. ఆయూరనివసించు జమేదారు రామన్నయను [వీ]రశైవుడు తన భార్యతో కలహించి వెళ్ళగొట్టగా యామె వనపర్తి [సం]స్థానమునందు జీవితభృతి నిప్పించవలసినదిగా. (మనోవృత్తికి) దావా [వే]సుకొనెను. సంస్థానమువారు న్యాయమువిచారించి భార్యకు అన్న [వ]స్త్రములను రామన్న ఇవ్వవలెనని తీర్మానించి యా యనాథను కనిక[రిం]చిరి. కాని యా రామన్న తనకు న్యాయముకలుగలేదని హైదరా[బా]ద్ హైకోర్టుకు అప్పీలుచేసి "తాను లింగాయతుడనియును లింగా[య]తులనగా శూద్రులనియును శూద్రుడు తన భార్యను వదలినచో [భా]ర్యకు భృతి నీయనక్కరలేదనియును" ఒక విసతిపత్రమున సైతము [స]మర్పించుకొనెనట ! ఇక నడుగవలసిన దేమున్నది ? వకీళ్ళ వంచనలు [చ]క్కెల జారికొనుటలు కారణముకాగా రామన్నగారి ప్రార్థన సఫలము [చే]యబడి, ఆ యనాథయగు భార్య యడవిపాలు చేయబడినది.

ఈ ఘోరమైన పరాభవమును గూర్చి యా యిల్లా లేవిధముగ [ప]రితపించుచు నీ లింగాయత శబ్దము మీద నెంత దుమ్ము పోయు[చు]న్నదో చెప్పలేము. రామన్న మహానుభావుడు, వీరశైవలోకము [ను]ండి శూద్రమైన లింగాయతమున బడి డబ్బు మిగిలినందుకు కొండంత

పండుగులో మునిగి యుండవచ్చును. వా డెట్టివా డ్త్రైనను సరి కా
భార్యకు నన్నము వేయలేనివానిని పురుషునిగా దలంచుటమె పా
పాటు. ఈ కుకృత్యమువలన నెంతటికళంక మాపాదించినదో రామన్న
వంటివ్యక్తి తెలియలేదు. ఆతడు తన కన్నతల్లిని సైతము బహిష్క
రించిన జెట్టియట! ఇదియును శూద్రాచారమో, అసురాచారమో
అయ్యుండును.

ఈయనగారి గృహకల్లోల మెట్లున్నను తాను స్వయము
శూద్రుడనని మొరపెట్టుకొని రెండు మెతుకులను మిగిలించుకొను
జూడ హేయముగ నున్నది. ఈయనకు తోడుగా హరిహరప్పయను
నామధారి యొకడు జంగమవేషమును వేసికొని ఈ శూద్రాచా
మును సమర్థించి సాక్ష్యమిచ్చెనట! ఈతడును తన శూద్రత్వము
సమర్థించుకొనినటులేకద! ఆహా! ఏమీ కలివిలాసము? లింగాయ
సామరస్య సదాచారములను బోధించు జంగమమున కిట్టి దుర్గతి ప
యుండుటకు కారణము సురాశాపిశాచమో కాలప్రభావమో
కావచ్చును. మహబూబ్ నగరము జిల్లా వీరశైవులందరు ఐకమత్య
ముతో నీ యుభయ వ్యక్తులను బహిష్కరించి ముందిట్టి యన్యాయ
ములు జరుగకుండ కట్టుదిట్టము లొనర్చుట ముఖ్యవిధి యని హెచ్చ
రించుచున్నాము.

## నిజాం వీరశైవుల కర్తవ్యము

నిజాం ప్రభుత్వమువారి "ధరంశాస్త్ర" అను కానూను
బుక్కులో లింగాయతులను గూర్చి అమంగళముగా వ్రాయబడి
యున్నది. ఆ కళంక మెన్నడో తొలగింపబడవలసి యుండెను. కాని
ప్రభుత్వ విద్యలను చదువుకొనిన వారును ప్రభుత్వోద్యోగులును
ఇట్టి విషయ మింకను ఉదాసీనించి యుండుట శోచనీయము. ప్రస్తు
తము నిజాం ప్రభుత్వమువారు ప్రజల మొరలను విని న్యాయ్యముగ
తీర్మానింతుమని యభయ మిచ్చుచున్నారు. కావున నిజాంరాష్ట్ర
మందలి సమస్త వీరశైవులును తమ గ్రామములలో నుండు వీరశైవు
లందరి సంతకములతో ఒక మహజరును "శ్రీ ఆలీజనాబు హోంసెక్రె

...గారు హైదరాబాద్ దక్కన్'' అను చిరునామాకు రిజిష్టరు ద్వారా
...పవలెను. అది వారి వారి యిష్టానుసారము ఉర్దూ ఇంగ్లీషు తెలుగు
...న్నగు భాషలలో నుండవచ్చును. దానియం దిట్లు వ్రాయవలెను:

శ్రీ ఘనమైన నిజాం ప్రభుత్వమువారికి---

ఈ క్రింద సంతకముచేసిన మేమందరము ఈ ప్రార్థనా పత్రిక ద్వారా తెల్పున దేమనగా,

పవిత్రమైన శివలింగమును ధరించుచు కేవల శాకాహారమును ...చారమునుకలిగి అనాదినుండి యున్నతమైన మా 'వీరశైవమత'ము ... ప్రభుత్వమువారి కానూనులలో "లింగాయత్" అను అశాస్త్రీయ ...పేరు వ్రాయబడుటయేకాక దీనిని కనిష్ఠమైన వర్గములో జేర్చి ...కే వ్యాజ్యములలో ఘోరమైన తీర్మానములు జేయబడుచున్నవి. ...విషయము వీరశైవుల కెంతయు సంతాపకరమైనది. 'లింగాయత్' ...పేరు, మాకులేదు. 'వీరశైవ'అనియే వాడవలెను. ౧౫ సంవత్సరము ... పూర్వము బీడ్‌జిల్లా పరళివైద్యనాథ్ అనుచోట స్మార్తులకును వీర ...వులకును గొప్ప మతవాదముజనించగా శ్రీ సర్కారువారేర్పరచిన ...టియెదుట చాల దీర్ఘముగా చర్చలుజరిగి వీరశైవులు ద్విజులని ...ను వేదాధికారము కలవారనియును శ్రీ॥ శ్రే॥ రాయబాలముకుందు ...ు తీర్పుచెప్పుటయేకాక శ్రీ శ్రీ నిజాంప్రభువుగారును ఫర్మాను ద్వారా సమ్మతించియుండిరి. కావున నికముందు ప్రభుత్వపురికార్డులో ...శైవ' అని వ్రాయుటయేకాక మా మతసంబంధమైన విషయము ... తగాదాలురాకుండ మా మత ప్రముఖులు పండితులతో గూడిన ...క సంఘముద్వారా మా యాచారములకు కానూను ఏర్పరచవలె ...మును దృఢముగా గోరుచున్నాము. ఈ విషయమున తాము ...క త్వరగా గట్టిగా ప్రయత్నించి మా యసమాధానమును ...ాడ వేడుచున్నాము.

మా పత్రికా పాఠకులలో నెవరేకాని పల్లెపల్లెకు నీవిషయ ...ము ప్రచారము గావించి కార్యక్రమమును సాగించి ప్రభుత్వము ...కి తెలియునట్లు చేయవలెను. అవసరమగుచో సభలు జరిపి ప్రచా ...ు చేయవచ్చును.

## కర్నూలు వీరశైవుల సూచన

కర్నూల్ వీరశైవులు కొందరు తమను "లింగాయతు
అనియో "వీరశైవు"లనియో రికార్డులో వ్రాయవలసినదిగా మద
ప్రభుత్వమువారిని వేడికొనిరట. దానిమీద ప్రభుత్వమువారు
ముందు "లింగాయత్" అనియే రికార్డులో వ్రాయవలసినదిగా
ప్రసాదించిరట. దీనితో కర్నూల్ వీరశైవులు పొంగిపోయిరని
తెలియుచున్నది. ఈ విషయము మా యాంధ్రదేశపు క
గోదావరి గుంటూరు వీరశైవులకుగాని ప్రముఖులకుగాని మఠాధి
లకుగాని ఏమాత్రము తెలియదు. బళ్లారినుండి వెలువడు 'నవసం
మను కన్నడభాషా వారపత్రికలో మాత్రమే చూచితిమి. ఈ ప
కకు సంబంధించినవారెవరో ఈ యాందోళనము గావించుచున్న
తోచుచున్నది. కాని కర్నూల్ నివాసులగు అమాయకపు వీరశై
లకు మేము దెలుపునదేమనగా, సోదరులారా! మీరు గొప్పగా ప్ర
త్వమువారిని ప్రార్థించి తెచ్చుకొనినది వరముకాదు, శాపము!
లింగాయత శబ్దములోని విషబీజము మన యాంధ్రదేశమునను నా
బడుచుండుట శోచనీయము. కర్నాటక, మహారాష్ట్రదేశములలో
విపరీతఫలములను సోదరు లనుభవించుచున్నారు. కొన్ని హైకో
ర్టులింగులలోను లా బుక్కులలోను లింగాయతులు శూద్రులని
మతీయులచే వ్రాయబడియున్నది. ప్రభుత్వములో పరమతీయు
పలుకుబడి యుండుటవలన వీరశైవుల విషయమున నీ లింగాయత
ముతో గొంత దురుద్దేశ్యమును ప్రచారముచేయబడుచున్నది. బన
ప్రకరణమున శ్రీ శాంత వీరవడియరుగారివంటి కలెక్టరుగారే ఈ లిం
యత శబ్దవిషము వలన పరాజయము నొందియున్నారు. ఈ శబ్దకా
ములనుగూర్చి వెనుకటి సంచికలో దెలిపియే యున్నాము. మీ
కూడ మద్రాసు ప్రభుత్వము వారికి మరల ప్రార్థన నంపుకొని అ
పయుక్తమైన లింగాయతనామము వలదనియును 'వీరశైవ' అని వ్రా
వలెననియును సూచించుట సమంజసమైయున్నది. మీ రేదో కొం
ప్రయత్నము చేసినందులకు సంతసమేకాని దీనిని దీర్ఘముగ నాలో

వనందునలన్న నిట్టి దోషము వాటిల్లినది. కావున నాగ్రిహాము
కే సరిజేసికొనుట పరమకర్తవ్యముగా నెరుంగగోరు చున్నాము.

## ఆంధ్ర వీరశైవుల కర్తవ్యము

కృష్ణా, గుంటూరు, గోదావరి, నెల్లూరు, కర్నూల్,కడప, అనం
తం మున్నగు నాంధ్రజిల్లాలలో నివసించు సమస్త వీరశైవులు
తమ గ్రామములలో సభలుజరిపికాని మహజరులు వ్రాసికాని
కమును పెట్టించి 'శ్రీ చీఫ్ సెక్రిటరీ ది గౌర్నమెంట్ ఆఫ్
ద్రాసు' అను చిరునామాకు రిజిష్టరుద్వారా పంపుకొనవలెను.

అయ్యా! కొందరి వీరశైవుల ప్రార్థన ననుసరించి 'లింగాయత'
ము నికముందు ప్రభుత్వము రికార్డులో వ్రాయ నాజ్ఞాపించితిరట.
మ్యాందోళనము మా కెంతమాత్రము దెలియదు. ఆంధ్రదేశస్థ
మా ప్రముఖులకు గాని మఠస్థులకుగాని ఇది తెలియజేయ బడ
. మా మతగ్రంథములందుగాని శిష్టాచారములో గాని ఈ శబ్దము
. 'వీరశైవ' అని వ్రాయుటయే సమంజసము. కావున తాము
త్తగా ఆర్డరు వేసిన 'లింగాయత' శబ్దము నుపసంహరించి వీరశైవు
నిందుమూలముగా గలిగిన యసమాధానమును శాంతింపజేసి
కరించ గోరుచున్నాము'' అను నభిప్రాయ మా పత్రికయం
డవలెను.

ప్రతివారును నేడు స్వసంఘాభివృద్ధికై పాటుపడుచున్నారు.
గన నాంధ్రవీరశైవు లీ విషయమున త్వరగా తప్పక ప్రయత్నించి
సమాచారమును మా కార్యాలయమునకును ఆంధ్రపత్రిక, జన
త్రి మున్నగు వార్తాపత్రికలకును తెలిపి స్వకర్తవ్యమును నెరవేర్ప
చున్నాము.

సంపాదకులు.

# చేమంతిపూలు

సురభి నరసింహమగారు, బి. ఏ.

హాయిహాయి! ఏకాంత సౌఖ్యానుభవము!
లోయ లద్రులపైని విహాయసమునఁ
దేలిపోయెడి మొయిలట్లు దిరుగు చోటఁ
గాంచినాడను నాకస్మికముగ; స్వచ్ఛ
జీవన సరస్తటీ వనసీమలోన,—
మినుకు మినుకని సత్పథమునఁ జలించు
దీర్ణ తారాగణమణీ వికీర్ణశయన
మవనిఁ బఱచుఁ దెఱగున ననంతమౌచు,—
ముం దధివసించు జలసఖామోదముగ ద
టీవితర్దికాసీనమై తీవిమీఱు
శీతవాతోపగూహనస్మిత వికాస
వదనకుముద విక్షేపహేలఁ దనరారుఁ
దాండవ శ్రీ ప్రదర్శనాదర్శకములు,
నొక్కచూపునఁ గనులవిం దొసఁగఁ జాలు
మాలు, వేనవేల్పసిమిచేమంతిపూలు !!
మెఱయుఁ గెఱటాల మిడిసిపా టెఱిగి పూవు
లపహసించుచు మేలు నృత్యంబు సలిపె!
బళిర! కవిచంద్రుఁడైనవాఁ డలరకున్నె?
కలుగ సుమనోమనోజ్ఞ సాంగత్యసుఖము!
ఎంచుకో చూచుటా దృశ్య మేమిఫలమొ!
ఇంచుకెంచకె చూపుసాగించినాను,
గాని,—సుఖతల్పశాయినై, ధ్యానినైన,
భావనాశూన్యుఁడనునైన, బహుళగతుల,
మూగతలఁపులు దాఁగుడుమూఁతలాడుఁ
దదమలైకాంత సౌఖ్య ప్రదర్శభావ
పటము, నామనోదృగ్జ్ఞాన భానుపటలి
యలమి,—చేమంతిపూలు ప్రత్యక్షమౌను!!
వానిఁ బైనిడి, ఆనందవార్ధిఁ దేలి,
నృత్యమాడును, జోఁక నాహృదయనౌక!!

(వర్డ్స్వర్తు మహాకవి "Doffodils"న కనుకరణము)




బ్రహ్మాండదర్పణము :—కర్త, కోటిరామచంద్రదాసుగారు,
కాశకులు, ఎం. పి. వి. బుచ్చయ్యగారు, ఆయుర్వేదిక్ ఫిజిషియన్,
. ౫౮౩౦ అబ్దుల్‌నబీస్ట్రీట్, సికింద్రాబాద్ దక్కన్.

వెల ఒకరూపాయి—

ఇది యొక కుతూహలమును కలిగించుపొత్తము. నేడు జగదంత
ములగు సూర్యచంద్రాదిగ్రహములను ఉత్తరధ్రువాది స్థానములను
నికులు మహాకష్టముల కోర్చి పరిశోధించుచున్నారు. సిద్ధాంతము
లేదు. కాని ఇట్టి యనేక విషయములను మనప్రాచీనులు వివరము
ను విశదముగాను తెలిపియున్నారు. అవి పురాణాదులలో గలవు. ఆ
మ్మృతములను నేటివారు విశ్వసించకున్నను, మన ఋష్యాదు లట్లు
ప్రయించి వ్రాయుటకు గల కారణములనైనను మనము విచారించ
సియున్నది. ఉదాహరణమునకై "రమ్యకవర్షము:—ఇచ్చట మానవ
కలరు. నైశ్రేయసవనంబు ౧౦౦, యోజనములవెడల్పు, ౫౦౦
యోజనముల విస్తీర్ణము కలదు. ఇందు వైవస్వతమనువు తపఃసంప
న్నుడై మత్స్యదేవతోపాసన జేయుచుండును. దానికి నుత్తరమున
శ్వేతాచలముకలదు." అని యీగ్రంథమున నున్నది. ఇటులే బ్రహ్మాండ
ండలి "సృష్టి, పంచభూతములు, చతుర్దశభువనములు, నవద్వీపములు,
సప్తసముద్రములు, కైలాస వైకుంఠములు" మున్నగు విషయములకు
సంబంధించిన విషయములను గ్రంథకర్తగారు పురాణములలోనుండి సం
గ్రహించినారు. విషయము ప్రాతదైనను ఆధునికులు దీనినవలోకించ
సియేయున్నది. ప్రస్తావనలో ప్రకాశకులగు శ్రీ బుచ్చయ్యగారు కడు
స్పష్టగా వివరించినారు. పునర్ముద్రణావకాశము గలిగినచో దీనిని
బాగుగా సంస్కరించి విపులముగా ప్రకటించ గోరుచున్నాము.

**శ్రీ రామగిరి**:—కవి, ఇంద్రకంటి వేంకటరమణమూర్తిగారు, ఆంధ్రవాఙ్మయ సేవాసమితి, బూర్గుంపాడు, నైజాం. వెల 0-2-0

ఇది కవిగారి ప్రథమకృతి, గోదావరితీరమున గల రామగిరి ప్రాంతమున నివసించినపుడు వారికిగలిగిన భావోద్రేక మీ ఖండకావ్యముగా మారినది. కథ సరళముగాసాగినది. ఈ పద్యకావ్యమున గద్య కూడ కొన్నిసారులు వచ్చినది. శైలి సరళము, మచ్చునకు—

"గీ. పొడుపుసూర్యున కర్ఘ్యమ్ము లిడెడివారు
వాలుకాలింగపూజల దేలువారు
పితరులకుఁ దర్పణములు గావించువారు
నై చరించిరి విప్రులయ్యవసరమున."

కాళిదాసకవి నిరూపించిన రామగిరి యదికాదని కవిగారికి గట్టిగా దెలియును. రచయితలు మున్ముందింకను అభివృద్ధి నందవలసిన వారు. ఇందు వారి ప్రతిభ కనుపడుచున్నది.

**గ్రామోద్యోగి (మాసపత్రిక)**:— సంపాదకులు, దేవళాశ్రీ సూర్యనారాయణరావు, బుద్ధిరాజు లక్ష్మీహనుమంతరావుగార్లు, కార్యాలయం, కొండపల్లి - వయా బెజవాడ, సంవత్సరచందా ఒకరూపాయి, విడిసంచిక. 0—1—0

గ్రామములలో నుండు ఉద్యోగులను గూర్చియు ఉద్యోగములను గూర్చియు ప్రచారము గావించుట దీని యుద్దేశమయి యున్నది. "ఆశయాలు" చాలా కలవుగాని వాని సంబంధించిన మంచి వ్యాసములిందు కనుపడుటలేదు. ఈ విషయమునకు సంబంధించిన పత్రికలు హిందీ మరాఠీ కన్నడములలో బాగుగా వెలువడు చున్నవి. సంపాదకులు గమనించి యభివృద్ధి పరచగోరుచున్నాము. ఆకారము. డబుల్ డెమ్మీ కాగితములు రఫ్.

**సుదర్శనం (మాసపత్రిక)**:—సంపాదకులు భద్రిగిరి రామావతారముగారు బి. ఎ. చాత్తాద వైష్ణవ యువజనసమితి, విజయనగరం. రఫ్‌కాగితములు ౩౪ పేజీలు. చందా వివరం ఏమీ తెలియదు— సైజు డెమ్మీ.

చాత్త్తాదవైష్ణవులలో సదాచారమును విజ్ఞానమును ప్రచార ముసర్పి సంస్కరింప బూనిన పత్రిక. ఉద్బోధమే దీనికి ప్రధానము. ఇది కూడా శ్రీరామానుజాచార్యుల ఉపదేశము ననుసరించుటయే టు! కాని వేదాగమాది శాస్త్రముల గూర్చి వ్రాయునపుడు నిష్ఠ నుపడుటలేదు. మత సిద్ధాంతములకు సంబంధించిన మంచి వ్యాసము ను కూడ ప్రకటించి సామాన్య వైష్ణవసమాజమున కాదర్శముగా సుదర్శనము సిద్ధము కావలెనని యాశించుచున్నాము.

వైద్యకళ (మాసపత్రిక):—సంపాదకులు డాక్టర్ చక్రవర్తుల సింహాచార్యులు, వాసవిప్రెస్, బెజవాడ. సం॥ చందా ఒకరూపాయి జు వార్తాపత్రికలవలె పేజీలు ౧౬.

సైజుపెద్దగా నుండుటచే ఆప్రకారములనుబట్టి యిది యొకవార త్రికవలె నుండునుకాని మాసమునకొకసారి బైలుదేరును కావున మాసపత్రిక. రోగనివారణము, ఆరోగ్యరక్షణము అను నవియే ఆయు ర్వేద ప్రయోజనములు. వీని నాంధ్రలోకమున వెల్లడించుటకొరకీ లభమైన వైద్యకళ పుట్టినది. వ్యాసములు సరళముగా నుపయుక్త ములుగానున్నవి. వైద్యుల యభివద్ధియు దీని కభిమతము. వెలసులభము ంధ్రాదరణ మందుటకు సందియముండదు.

కన్నడనుడి (వారపత్రిక):—సంపాదకులు అ. న. కృష్ణరాయలు, న్నడసాహిత్య పరిషత్తు బెంగళూరుసిటి-చందా, 2-4-0, విడిసం. 0-0-6.

కేవల కన్నడ బాసను గూర్చిన యాందోళనముకయియే యీ త్రిక యవతరించినది. ఒకవైపు మనయాంధ్రదేశమున గ్రామ్యభాషా ప్రచార మగుచుండ కర్ణాటదేశమున కట్టుదిట్టముల భాషను బుట్టించు టకు గట్టి ప్రయత్నములు జరుగుచున్నవి. కన్నడసాహిత్యపరిషత్తు శ్రీ మైసూరు మహారాజాదిప్రముఖుల యాదరణ వడసి చాల సమర్థ ముగా నభివృద్ధిగాంచుచు తన చక్కని త్రైమాసపత్రిక యుండగా భాషకు సంబంధించిన సమస్త సంస్కరణ ప్రయత్నములకొరకీ వార పత్రికను ప్రకటించుచున్నది. ఇందు కన్నడభాషలో ప్రముఖుల వ్యాస ములు కలవు. ఇట్టి యాదర్శము గల "తెలుగుపలుకు" పత్రిక యాంధ్రు లకు గావలసియున్నది.

"రాజహంస"

...క స్మృతీనాం ప్రత్యక్షిక వేదమూలకత్వాభావాత్ సాంఖ్య
...వ న్న విధాయకత్వం; శ్రౌతవిధే ర్బలీయస్త్వాత్. "ఉదితే
...తి - అనుదితే జుహోతి" ఇతి వచనద్వయవిరోధే శాఖాంతర
...యవన్మాలానుట్టంకితధూ ర్త స్మా ర్తమాయావాదికల్పితనిషేధవాక్యా
... గగనారవిందవత్ ప్రామాణ్యాంగీకారే అవైదికత ప్తలింగధారి
...యత్వం గ్రాహ్యం; చక్రిపదసామానాధికరణ్యాదర్శనాత్. శ్రౌత
...విషయత్వే లింగధార్యు త్త మాధికారివ్యవస్థాపకశ్రుతిస్మృతిపురా
...మాదీనాం ద త్తజలాంజలిత్వప్రసక్త్యా వేదబాహ్యమతప్రవేశః
...త్.

శ్రౌతాశ్రౌతవిభేదేన ద్విధా లింగస్య ధారణం,
షడధ్వశుద్ధలింగం తు శ్రౌత మిత్యభిధీయతే
అశ్రౌతం త ప్తలింగాదిధారణం ప్రోచ్యతే శివే,
శ్రౌతానాం వీరశైవానాం వేదమార్గైకవ ర్తినాం,
త ప్తలింగపరిగ్రాహే ప్రత్యవాయో మహాన్ భవేత్.

ఇతి సిద్ధాంతాగమే దర్శనాత్. యావజ్జీవాగ్నిహోత్రదీక్షితస్య
...కర శ్రౌతయాగదీక్షావిరోధాభావవ ల్లింగధారణదీక్షాయా అపి నిత్య
...ప్రా ప్తత్వేన "నహి కర్మణి కర్మాంతరారంభః" ఇతి నియమస్య
...కాశదీక్షావిషయత్వం. శైవదీక్షాయా అగ్నిష్టోమాదిదీక్షావత్
...శిప్రయోగాపవర్గిత్వాభావాత్ తయాసహ విరోధాభావాత్సముచ్చ
...పప త్తేః శైవానాం క్రిత్యనుష్ఠానమావశ్యకమేవ; ఉభయోః
...త్వాత్. నిషేధస్య ప్రతిప్రయోగాపవర్గియావజ్జీవనిషిద్ధదీక్షాం
...నిషేధపరత్వాదవైదికపాంచరాత్రాదిదీక్షానిషేధపరత్వేనోపప త్తిః.

జాతాశౌచమృతాశౌచాదౌ స్వకర్తృకయావజ్జీవాగ్నిహోత్రి
...క్షితస్య స్వనిత్యోపాసనాధికారవత్ శైవదీక్షితస్య జాతాశౌచాదౌ

4

వపి లింగపూజామాత్రాధికారవత్త్వం. అత ఏవ "సర్వలింగం స్థా
యతి" ఇత్యత్ర పవిత్రశబ్దేన ధృతలింగస్య సర్వకాలధారణపూజాధికా
యోగ్యత్వం సూచితం.

శైవం దేవార్చనం యస్య యస్య చాగ్నిపరిగ్రహః
బ్రహ్మచారియతీనాం చ శరీరే నాస్తి సూతకం.
లింగార్చనరతా నారీ సూతికా వా రజస్వలా,
రవి రగ్ని ర్యథా వాయు స్తథా కోటిగుణోజ్జ్వలా,
జాతకే మృతకే వాఽపి న త్యాజ్యం శివపూజనం.

ఇత్యాదిపారాశరస్మృతిసిద్ధాంతశిఖామణ్యాదౌ లింగాంగిదేహస్య
పవిత్రత్వవ్యపదేశా ల్లింగధారణపూజాదే ర్న విరోధః.

నను - ప్రమాణాచారసత్త్వేఽపి ప్రత్యక్షవిరుద్ధత్వాత్ ర
స్సూతకాదికాలకృతపూజాధారణాదికమనుపపన్నం, ఇతి చేన్న
జ్యోతిష్టోమాతిరాత్రపౌండరీకాది యాగీయ పశువిశసన మాంసభక్షణ
సురాపానబ్రహ్మచారికృతదివాదాసీసంగమాది ప్రత్యక్షలోకవిరుద్ధ
శ్రౌతాచారభంగప్రసంగాత్.

నను - శైవానాం పంచసూతకాభావే వర్ణచతుష్టయాతీతత్వ
ప్రసంగాత్, తత్కృతపాకాదిపరిగ్రహప్రసక్తేశ్చ వైదికానాం లిం
ధారణమనర్హమితి చేన్న.

స్వేష్టలింగైకపూజాయాం నైవాశౌచం విధీయతే,
పౌండరీకే రజః స్త్రీణాం స్వాగ్నిహోత్రే యథా తథా.
అశరస్పర్శయోగ్యాఽపి యథా జిహ్వా మహేశ్వరి,
మంత్రోచ్చారణమాత్రస్య పూతా భవతి భూతలే.
తథా సూతకినః శైవాః పూజామాత్రసునిర్మలాః,
నాన్యస్పర్శానుకూలాః స్యురితి వేదానుశాసనం.
ఇతి సిద్ధాంతాగమాదిషు శివపూజామాత్రయోగ్యతాశ్రవణాత్,

దీక్షానంతరం ప్రేతత్వజీవత్వాభావేఽపి శివాగమేషు శైవానాం వర్ణాశ్రమోచితపూర్వాపరకర్మకర్తవ్యతాయా విధేయత్వాదకరణే ప్రత్యవాయదర్శనాచ్చ విధివిహితయావత్కర్మానుష్ఠానమావశ్యకమేవ.

స్వజాతివిహితం ధర్మం కుర్వంతః పూజయంతి యే,
భక్త్యా శ్రీకంఠమనిశం తే వై మాహేశ్వరాః స్మృతాః.
కర్మ విధ్యుక్తముత్సృజ్య స్వజాతివిహితం నరాః,
యేఽర్చయంతి శివం తేషాం పూజాం గృహ్ణాతి నేశ్వరః.
వర్ణాశ్రమసదాచారాః శివేన కథితాః పురా,
యే తానుల్లంఘ్య వర్తంతే శివస్యాజ్ఞావలాపినః.
రాజాజ్ఞాభంగకృన్మర్త్యాణాం యథా దండో భవిష్యతి,
శివాజ్ఞాభంగకృన్మర్త్యాణాం దండో హి నరకస్తథా.
సాంబేన శంభునాఽఽజ్ఞప్తం ధర్మం త్యక్త్వార్చయేచ్ఛివం,
యస్తస్మై కుప్యతి స్థాణుః స్వాజ్ఞాభంగవిధాయినే.
చోదనాలక్షణం ధర్మం శివేనాజ్ఞప్తమత్యజన్,
శంకరం పూజయేద్యస్తు తస్మై సాంబః ప్రసీదతి.
(శంకరసం. అ. ౮౬)

అంధపంగువదన్యోన్యసాపేక్షే జ్ఞానకర్మణీ,
ఫలోత్పత్తౌ విరక్తస్తు తస్మాత్తద్ద్వయమాచరేత్.
జ్ఞానే సిద్ధేఽపి విదుషాం కర్మాపి వినియుజ్యతే,
ఫలాభిసంధిరహితం తస్మాత్ కర్మ న సంత్యజేత్.
ఆచార ఏవ సర్వేషామలంకారాయ కల్పతే,
ఆచారహీనః పురుషో లోకే భవతి నిందితః.
జ్ఞానేనాచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః,
తస్మాదాచారవాన్ జ్ఞానీ భవేదాదేహపాతనం.
(సి. శి. పరి. ౧౬)

ఇతి శంకరసంహితాసిద్ధాంతశిఖామణ్యాదౌ కర్మకర్తవ్యతాదర్శనాత్, స్వపరియోజనాభావేఽపి భృత్యానాం రాజాజ్ఞాభంగభయాత్ తదుదీరితకర్మాచరణవత్ శైవదీక్షితానాం కర్మకరణే పరియోజనాభావేఽపి శివాజ్ఞాపాలనార్థమవశ్యం తత్కర్తవ్యమేవ. "భీషాఽస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః'' (తైత్తి. ఆనం.౮) ఇత్యాదిశ్రుతౌ పవనప్రభాకరాదిదేవానాం శివజ్ఞానాధికానామపి పరమేశ్వరాజ్ఞాభంగభయేన సకలజగదనుకూలస్వోచితకర్మానుష్ఠానశ్రవణాత్ కిం న కర్తవ్యమల్పజ్ఞానినాం మనుష్యాణాం?

కించ లైంగే—

వయం బ్రహ్మాదయస్సర్వే పశవః పరికీర్తితాః,
త్వమస్మాకం పతిర్యస్మాత్తస్మాత్పశుపతిః శివః.
ఇత్యుక్త్వా దేవతాః సర్వాః శివలింగాది ధారణం,
కృత్వా పాశుపతాః సర్వే తస్మాత్పశుపతిః శివః.
అతో బ్రహ్మాదిదేవానాముపాస్యః శివ ఏవ హి.
తథా విభూతిరుద్రాక్షలింగధారణదేహినః,
శుద్ధస్ఫటికమాలాభిర్బద్ధహస్తాంబుజానపి.
బ్రహ్మవిష్ణ్వాదిదేవాంశ్చ దృష్ట్వా సాంబస్త్రిలోచనః,
త్రిపురాసురసంహారమకరోద్భక్తవత్సలః.
బ్రహ్మవిష్ణ్వాదిదేవాశ్చ మునయో గౌతమాదయః,
ధారయంతి సదా లింగముత్తమాంగే విశేషతః.

కించ స్కాందే శంకరసంహితాయాం—

ఉరస్స్థలే హరిర్లింగం ధృత్వా మూర్ధ్ని పితామహః,
లింగస్థం మాం సమారాధ్య స్వం స్వం పద మవాపతుః.

ఇత్యాద్యుపబృంహణవాక్యే బ్రహ్మాదీనాం శివలింగాదిధారణదర్శనాత్, లోకే అనంతపద్మనాభవిరలేశ్వరాదిక్షేత్రేషు నారాయణ

ప్రాపి పాణిశిర్షో దేశేషు ప్రత్యక్షశివలింగధారణదర్శనాచ్చ న సందేహ
ప్రసంగః.

"శ్రద్ధాభక్తిధ్యానయోగాద వేహి" (కై వ. ౧-౨) ఇత్యాదిషు
జ్ఞానయో రేవ మోక్ష హేతుత్వవ్యపదేశాద్బాహ్యలింగధారణాదినా
ప్రయోజనమితి చేన్న — "తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వ
భావాద్భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః." (శ్వే. ౧-౧౦) ఇతి
త్యా తస్య - హరస్య, అభిధ్యానాత్ - అంతరనుసంధానాత్, యోజ
త్ - సంయోగాత్ - బాహ్యధారణాత్, తత్త్వభావాత్ - తత్త్వ
క్షాత్కారాత్, సకలమాయానివృత్తిర్భవతీతి శ్రవణాత్, శ్రుతి
కోచే మానాభావాత్, "జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేన్నోపాసా
ప్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్" (బ్ర సూ. ౧-౧-౩౨)
త్యాదా భగవతా వ్యాసేనాపి త్రివిధోపాసనావ్యపదేశాత్. తథా
ందే—

మానసోపాసనం కుర్యాద్ధృదయే దహరేఽపి వా,
పంచాక్షర్యా చ గాయత్ర్యా రుద్రసూక్తాదిభిస్తథా,
వాచికోపాసనం ప్రోక్తం ధృతలింగే శివాత్మకే.
పాణిపీఠే తథా వహ్నౌ స్థండిలే వా విధానతః,
కామికోపాసనం కుర్యాత్ శ్రద్ధాభక్తిసమన్వితః.
ఏవం త్రికరణైర్నిత్యమీశ్వరోపాసనం ద్విజః,
కుర్వన్ముక్తిమవాప్నోతి వైదికో నాన్యహేతునా.

ఇత్యాదినా, "మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మ
నాం" ఇతి న్యాయేన చ మానసయజ్ఞసంన్యాసాదీనాం ప్రవర్తకత్వ
ర్శనాత్, అంతర్ధారణమాత్రే బాహ్యాంగస్య నిష్ఫలత్వాత్, తద్గత
కార్మికమలధ్వంసాభావప్రసంగాచ్చ.

కించ-ప్రాగుపనయనదీక్షితస్యైవ "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" "అహరహస్సంధ్యాముపాసీత" ఇత్యాదివాక్యవిహితస్వాధ్యాయా కర్మాధికారవత్ లింగధారణదీక్షితస్యైవ శివజ్ఞానాధికారిత్వమవిరుద్ధం అంతర్ధ్యానధారణయోరావశ్యకత్వేఽపి పాకస్య వహ్నివత్ మోక్షస్య లింగదీక్షాయా ముఖ్యసాధనత్వాత్, తదస్వీకారే పూర్వోదాహృత శ్రుతిస్మృత్యాగమపురాణవైరుధ్యేన వేదబాహ్యత్వప్రసంగాత్.

శివధ్యానపరో భూత్వా శివలింగాంగసంయుతః,
శివేతరపరిత్యాగీ ధ్యానయోగీ స ఉచ్యతే.
ముఖే మంత్రో హృది ధ్యానం మస్తకే లింగధారణం,
శిఖా సూత్రం తథా భస్మ చైతద్బ్రాహ్మణలక్షణం.

ఇతి మనుగౌతమాదిస్మృతిషు శివలింగధారణస్య వేదవిహితత్వ దృష్టత్వాచ్చ వైదికానామవిరోధః.

"మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" ఇతి నారాయణస్యైవ మోక్ష ప్రదాతృత్వోపదేశాత్తస్యోపాసనమేవ ముముక్షూణామావశ్యకమి చేన్న - తథావిధశ్రుత్యభావాత్, "శివ ఏకో ధ్యేయశ్శివంకరస్సర్వ మన్యత్పరిత్యజ్య" (అథర్వశిఖా 3) "జ్ఞాత్వా శివం శాంతిమత్యంతమేతి" (శ్వే. ४-౧४) "ఈశం తం జ్ఞాత్వా అమృతా భవంతి" (శ్వే. 3-౭) "క్షరం ప్రధానమమృతాక్షరం హరః క్షరాత్మానావీశతే దేవ ఏకః తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వభావాద్భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః" (శ్వే. ౧-౧౦) "ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః" (శ్వే. 3-౨) "యో దేవానాం ప్రథమం పురస్తాద్విశ్వాధికో రుద్రో మహర్షిః" (మహానా. అను. ౧౦) "తమక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమానమీశం" (మహానా. అను. ౧౦.) ఇత్యాది శ్రౌతవిధేర్బలీయస్త్వాన్నారాయణస్య బ్రాహ్మణదేవతాత్వాభావాత్, శ్రుతివిరుద్ధస్మృతేః ప్రామాణ్యాభావాత్, తాదృశస్మృతీనాం సమక్ష

న్యాయేన పరంపరయా శివోపాసనద్వారా మోక్షహేతుతా
త్వస్య సిద్ధత్వాత్.

సాంఖ్యయోగసహస్రేణ జన్మనా ద్వైతగో భవేత్,
తన్మతస్య సహస్రేణ సౌరం మతముపాశ్నుతే.
తత్సహస్రసమభ్యాసాజ్ఞానాపత్యమతీ భవేత్,
తత్సహస్రేణ భూలోకే వైష్ణవం మతమీర్యతే.
తద్వైష్ణవసహస్రేణ శాక్తో భవతి సర్వదా,
తత్సహస్రాన్మహాభాగ శైవసామాన్య ఉచ్యతే.
తత్సహస్రేణ విప్రేంద్రా వీరశైవమతీ భవేత్,
తేనైవ ముక్తిమాప్నోతి నాన్యథా బహుయత్నతః.

ఇతి స్కాందే దర్శనాచ్చ; విష్ణులోకం ప్రాప్తానాం విష్ణుసారూప్య
ాపన్నానాం శివశర్మాదీనాం శివోపాసనద్వారా మోక్షప్రాప్తిః
ఖండే శ్రూయతే. వ్యాసోఽపి స్వభుజస్తంభనానంతరం శిష్యై
హ శాంభవదీక్షాం లబ్ధ్వా మోక్షాధికార్యభూదితి తత్రైవ శ్రూయతే.
హిమ్నస్తవేఽపి, "త్రయీసాంఖ్యం" ఇత్యారభ్య "త్వమసి పయసా
ర్ణవ ఇవ" ఇత్యంతేన ఋజుకుటిలత్వేన స్వమతమన్యమతాని చ
హాప్య శివ ఏవ సర్వేషాం ప్రాప్యస్థానమిత్యుపదిష్టం.

"సర్వలింగం స్థాపయతి" ఇత్యత్ర లడంతత్వేఽపి "వ్రీహీ
ోక్షతి, వ్రీహీనవహంతి" ఇత్యాదివద్విధ్యర్థత్వోపపత్తిః, న చానేక
ానే వాక్యభేదదోషః, "యదాగ్నేయోఽష్టాకపాలః" ఇతివత్
ర్వేషామప్రాప్తత్వేన విధేయత్వాత్, "అప్రాప్తే తు విధీయంతే
హవోఽప్యేకయత్నతః" ఇతి స్మృతిదర్శనాత్, స్థాపయతీత్యత్ర
ామావేవేతి వినిగమకాభావాత్, శ్రుతేః సంకోచాసహిష్ణుత్వా
భయథా ప్రమాణాచారదర్శనాచ్చ.

న చ పాణినా మననాత్పూజనాత్త్రాయత ఇత్యర్థసంభవేన లింగ
ారణాసిద్ధిరితి వాచ్యం, మానసాదీనాం పూజాకరణత్వదర్శనేన పాణి

శబ్దస్య నైయర్థ్యప్రసంగాత్, పాణినా అభిమంత్రితం పాణిమంత్ర మిత్యప్యసంగతం, మంత్రశబ్దస్య గౌణార్థస్వీకారే ఈక్షత్యధికరణవిరోధ ప్రసంగః, ఏతన్మంత్రార్థస్తు లైంగోత్తరభాగే ఏకవింశాధ్యాయే భగ వతా వేదవ్యాసేన స్పష్టముక్తః.

యజురప్యాహ సర్వం వై లింగం స్థాపయతీతి చ,
తస్మాద్ధార్యం మహాలింగం పాణిమంత్రేతిమంత్రతః.
పాణౌ లింగం వినిక్షిప్య దీక్షాకాలే గురుః శివం,
యేన స్మరతి తన్మంత్రం పాణిమంత్రం వదంతి హి.
పవిత్రత్వాన్మహేశస్య శివస్య ప్రతిపాదనాత్,
పవిత్రీకరణాత్ పుంసాం పవిత్రమితి కథ్యతే.
అతస్సర్వేషు కాలేషు ధారయేల్లింగముత్తమం.
గచ్ఛంస్తిష్ఠన్ స్వపన్ జాగ్రదున్మిషన్నిమిషన్నపి.
శుచిర్వాప్యశుచిర్వాపి లింగం సర్వత్ర ధారయేత్.
లింగధారీ సదా శుద్ధో నిజలింగం మనోహరం,
అర్చయేద్గంధపుష్పాద్యైః కరపీఠే సమాహితః.
నిత్యాని కర్మబృందాని తథా నైమిత్తికాని చ,
శివార్పణధియా కుర్యాత్సమ్యగ్జ్ఞానాభివృద్ధయే."

(ఇతి లిం॰ పు. ఉ. భా. అ. ౨౧)

నను వృశ్చికాదివిషమాత్రేణ మ్రియమాణస్య కాలకూటభక్షణే శక్త్యభావాత్, రజ్జుదర్శనేన సర్పభ్రాంత్యా పలాయమానస్య భుజగ ధారణే శక్త్యభావాత్, యత్కించిల్లాంఛనధారణే ప్రమాణాభావాచ్చ శివలింగభస్మరుద్రాక్షధారణం ముముక్షూణాం రాజభృత్యవన్నాంగీ కర్తవ్యమితిచేదుచ్యతే—

భక్తానాం స్వసాయుజ్యసిద్ధ్యర్థం స్వనిష్ఠభస్మరుద్రాక్షశివలింగ చిహ్నానామకరణే ప్రత్యవాయజనకనిత్యవిధివిషయత్వేన పరమేశ్వరోప




సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

| | | |
|---|---|---|
| ంద్రము ౧ | సికింద్రాబాదు<br>శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి<br>భాద్రపదము | రేఖ ౮ |

# ప్రసూత ప్రకృతి

కొమరువోలు వేంకట సుబ్బారావుగారు, బి., ఏ.

ఉ. సస్యపుబిడ్డ నెత్తికొని సాధ్వి వసుంధర ప్రావృషేణ్యసా
రస్యమనోజ్ఞ జీవనధురంధరుఁడైన జలంధరప్రియుం
డాస్యము ముద్దుగొన్న దరహాసము తోడనె వాని నాగి డిం
భాస్యము నడ్డుగా నిడెడు నాతని ముద్దుల కౌర! కంటివే!

ఉ. చక్కని చుక్క-బాలకుని సాగర తెచ్చితి నీకుఁ గాన్కగా
నక్కునఁ జేర్చికొమ్మని కృశాంగి, తరంగిణి రిక్కపాప క
న్నెక్క నుయాలలూచు నోడి నీయఁగఁ గైకొనినట్లె యాతఁడుం
గ్రక్కునఁ జేతులం గమిచి కౌఁగిఁటి కామెను లాగెఁ గంటివే!

శా. నీరాడెం బురుఁటాలు పచ్చియొడ లీ నీ రేజినీసాధ్వికిన్
రారాపిళ్ళకు నోర్వదీయబల నీరాగంబు గొన్నాళ్ళు ఛా
యారామామణి పైని జల్లఁగదవయ్యా! భాస్కరా! యన్న వా
డౌరా! పద్మిని గిల్గిలింతిడి రహస్యమ్మాడె నెంతాత్రిమో!

ఉ. తెక్కలు వచ్చుచున్నయవి రింగురిరింగు మటంచుఁ బ్రాణమ
గ్రుక్కలు మ్రింగుచున్నయవి కోపము సేయకు మోమిళింద య
కొక్కపదేను చుట్లు విడకుండ రచించిన నీనిసుంగు నా
యక్కరఁదీర్చువాఁడగు నహా! విడుమయ్యయో! యేమి సేయుదు

మ. పడుచుండెం బిడుగుల్ నభమ్ము దహియింపంజొచ్చె సౌదామిను
దౌడరంజొచ్చె నకాలవర్షములు సద్యోభిన్నకోశమ్ము వె
ల్వడి కోకో యని కూయు నన్యభృతశాబమ్ముల్ శితత్రోటికో
బొడిచెం గ్రిందికిఁ ద్రోసెఁ గాక మకటా! ముందేమి కానున్నదో

శా. ప్రాలేయామలభానుమత్పృథుక మాక్రందింపఁగా వానికిం
బాలీయన్ శశికాంతసన్మణి యురోభాగంబునం జేర్పగా
రాలెం దచ్ఛిశునేత్రయుగ్మమున వర్షాభమ్ముగా బాష్పముల్
దేలెన్ మాతయుఁ బ్రేమఘర్మసలిలాబ్ధిన్ సంభృతస్వాంతయై

మ. తడికాలమ్మరుదెంచెఁ దూర్పుదెసయన్ దన్వంగి బాలెంతరా
లౌడిలో నెత్తుటికందు భానుఁ గొనెఁ బ్రత్యూషప్రభల్ స్నానమా
డెడి నీరయ్యె నశౌచపుంబొగలు నిండెన్ గాఱుకొమ్మబ్బుల
నడికట్టాటకు నింద్రచాపమునె యింద్రాణీప్రియుండంపెనన్.

———

# సరస్వతి బ్రహ్మ భార్యయె

## గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు శతావధాని



నూరుకల్లలాడి యొకనిల్లు నిల్పవలెనను నానుడికలదు. నిల్పవలె
చోట నుపసంహరణార్థ ముపయోగించుట రాచబాటయైనను
తన పద్ధతి నుద్ధరింపదలచు టార్యవిధి. శక్తికొలది మానవులకే
దేవదానవాదులకుగూడ మొదటి వేల్పుగాన ఆయన సంసార
ను చక్కబెట్టిననే వారి దాంపత్య ఫలరూప బ్రహ్మాండ జగద్వ్యాల
ము, వాసనాబలము, బ్రహ్మద్వేష మిందలి పదమాత్ర వాచ్య
హ్మణ ధర్మములయందకాక తొలిహేతువువరకు గూడ వ్యాపించి
శ్లో॥ 'విచిత్రరూపాః ఖలు చిత్తవృత్తయః' అని తలచి నా యభి
యమును వ్రాయ నుంకించితి. సహృదయులు విషయమున్న
హింతురుగాక.

ఇది వినోదవిమర్శ మనుటతోడనే హేలాలాపములుగ నెల్లరకు
చరించుచున్నది. స్వయముగ విద్యానిధులు కాశీ విద్వన్మిత్రగోష్ఠీ
ష్ఠితాభిప్రాయము, హేత్వాభాసకవి ఘనములవరకు నెదుగుటయు
కపోరాదని వ్యాసరూపముగ వ్రాయు కారణము. కేవలమూహా
ముగగాక సప్రమాణముగ ప్రకటించుట వ్రాయుచు నింత
త్రమున తాము నాస్తికులముగామనియు నాస్తికులను నొప్పింప
యలేదనియు నొక పద్ధతి నాశ్రయించి వినోదముగ వ్రాయు
న్నామనియుగూడ సారళ్యముగ హృదయమును వెల్లడించిరి. చిగు
పురాణకథల నూతగొనక కేవల మమరకోశము నంతకంటె
చీన వాఙ్మయదృష్టితో సూచించుచున్నట్లును తద్విధదృష్టితో
హృదయ వ్యాసముల నిరీక్షించుచుందుమనియు వ్రాయుటవలన
యభిప్రాయ ముడుత ప్రయత్నమున నిచ్చుచున్నాను. మరొకవ్యాస
నగూడ ఏ రీవిషయము వ్రాయుచిహ్నమును పొందుపఱచిరి.
ంగముచూడక కశ్చిత్కాంతా అనగా కాచిత్కాంతా అనువానివలె
డియు పరిణమించకుండుగాక. కారణమేమన వారివిమర్శ సక్రమము
ను ప్రాజ్ఞసమ్మతముగను వారి శీర్షిక నిబంధనలకు తూ. చా. తప్ప
ండ సత్యాన్వేషణమే. వినోదాలాపనములే యచ్చొత్తుచుండుటవలన

నేను నివి ప్రకటించుటలో వారభ్యర్థించిన సహృదయాభిప్రాయము లి
దున్నవారు గ్రహింపగల్గుదు రేమోయని వ్రాయుచుంటిని. కాని వా
యభిప్రాయములకు వ్యాఘాతభీతికి కాదు. కనుక నేనిప్పుడు వ్రాయు
లగ్గనితోచి విశదపరచుచున్నాను. ఇం దేవ్యక్తిదూషణ మక్కరలే
సత్యాన్వేషణ కుపకరించిన నుపకరింపవచ్చునని నాయూహ. ఉపకరిం
జాలకున్న నాపాటి పరిశ్రమయే క్షమించి పూజ్యపాదులు సమరసదృష్టి
నాలోకింతురు. ఇది విమర్శయుగమనియు పరబ్రహ్మప్రత్యక్షము
గూడ సవిమర్శకముగ నంగీకరింతురని మాత్రము సెలవిచ్చిరి. సజీవు
మరణించినవానిగ గొనిపోవుచు వానికి తెలివివచ్చి యెక్కడికి నన్ను
గొనిపోవుట? నేను జీవించియున్నానని వాడె మొరపెట్టుచున్నను డాక్టరు
సర్టిఫికెటు నీకేది? అది లేనిది నీవు జీవించునట్లు భావింపబడదు ఇదియు
నొక మరణసైత్యముగ నిటీవల డాక్టర్లుకనిపెట్టి వ్రాసిరని విమర్శించుట
మనినబాగేమో, మానవబంధవిచ్ఛేదనచట్టముమనసంపర్కముతో భారతి
గూడనొదవినదని హేలగదోపకమానదు. అమరకారుడుపురాణప్రయో
గములకు నిఘంటువు మిక్కిలి క్లుప్తముగ నిచ్చినట్లు లోకవిదితము. శ్లో
ప్రాయశోరూపభేదేన సాహచర్యాచ్చ కుత్రచిత్ । స్త్రీపున్నపుంసకంజ్ఞేయం
తద్విశేషవిధేః క్వచిత్ ॥అని రూపవిజ్ఞాననిరూపణమునకు వారిప్రతిజ్ఞలో
నడువజాలక తద్విశేషవిధియని అనిర్దిష్టరూపమైన గొప్పదిడ్డికంత నుంచు
కొని, ప్రతిజ్ఞా నిర్వహణము నోపినంత శ్లాఘ్యముగ నొనర్చిరి. కాని
మీరరయు వైదికశ్రౌత అతిప్రాచీన వాఙ్మయ ప్రసక్తికి వీరి నిరూపణ
విశ్వరూపునికి సూర్యచంద్రులు మొలగంటలైనట్లు అట్టి నిఘంటువు
నూతముగగొనుట పురాణవాఙ్మయాన్వేషణమునకు వెల్గొసంగునుగాని
ప్రాచీన వాఙ్మయశోధనకు కరదీపిక మాత్రముకూడ కాజాలదు.
ఆదృక్పథముతో వారినిఘంటువులేదు. లౌకికదృష్టితో దైవికమును
విమర్శించినట్లైనది. మొత్తముమీద సుప్రసిద్ధ అమరకోశకారుడు
తన దృష్టితో నంటక పోయిన భారతీవల్లభత్వము ననుమానించుటకు
మాత్ర మాస్పదమనుట నిర్వివాదాంశము. విమర్శకులు నుడివినట్లు
తక్కిన కారణములుకూడ దుర్బలములనుటకు చతుర్వేదములు షడంగ
ములు నవశిక్షలు ప్రాతిశాఖ్యాదులు, సక్రమముగ పారబట్టవలె.

..నివిమర్శ కాగలదు. కాని అమరకారుడు చాలడు. మంత్రలింగ
..లతో బుద్ధిని దిప్పు మనవంటి సామాన్యవివేచనశీలురకు దుర్జయ
..నని. (కేవల శ్రుతిప్రయోగములు)

వాక్పతిశ్చక్షుష్పతిః॥ యజుర్వేదము - శిక్షావల్లి.

ఇరా పత్నీ విశ్వసృజాం॥ యజుర్ బ్రాహ్మణ నాచికేతాంతిమా
..యే, ఋచాం ప్రాచీమితి. (చయన ప్రకరణే)

వాగేషాగ్ం సుబ్రహ్మణ్యాసీత్॥ (డిటో)

ఆపోవా ఇదమాసన్ త్సలిలమేవ॥ సప్రజాపతి రేకః పుష్కరపర్ణే
..భవత్। తస్యాంతర్మనసి కామస్సమవర్తత। ఇదగ్ం సృజేయమితి।
..వా వదతి తత్కర్మణాకరోతి। తదేషాభ్యనూక్తా.

ప్రజాపతిర్వావసృజత్ ఆత్మనాత్మానం విధాయ తదేవాను
..విశత్ తదేషాభ్యనూక్తా విధాయ లోకాన్ విధాయ భూతాని
..ద్యాదులు. ఇమానుకంభువనానీష ధేమ॥ ఆపోవాఇదమను రెండు అను
..కములు అరుణపాఠమున సాంతముజూచిన బ్రహ్మసంసారము
..ంపత్యము, ఇచ్ఛామాత్రసృష్టి దాంపత్యశబ్దతత్త్వము రేతస్సించన
..ష్టితత్త్వము తత్పరిణామము తేటతెల్లముకాగలదు. అగ్నిమిచ్ఛధ్వం
..రతాః॥ అనికూడ కలదు. భరతుని కూతురు భారతికాదగిన దుర్గ్రహ
..ర మాజననికక్కరలేదు. అగ్న్యారాధక మనుష్యాదులు త్రేతా
..ల్లో భామదివ్యాకరజాదులోగాక జఠరాగ్నిపూరిత జీవకోటికి
..రతశబ్ద మగ్నిసమారాధక ప్రదీప్తిచేత దీప్తిమత్త్వముతో భారత
.. ముత్పత్తి యగుచున్నది. హృదిప్రతీష్యా కవయోమనీషేతి॥ అని
..డకలదు. దురదృష్టవశమున నేటికవులు భాషాశోషకులైనను
..వులు బ్రహ్మరాణి ననుగమించుట కవిస్వరూపమున నేకాదు. కవులనుట
.. కం బ్రహ్మాణం వేత్తీతికవిః॥ వేదవిత్ లోకవిత్ సకలకలావిత్ కాల
..త్,ఇత్యాదులాతనియందు బ్రహ్మనిష్ఠధర్మములు సమంతతోవ్యాప్తిగ
..వు. జాతస్య మరణం ధ్రువం॥ అనుసూక్తిప్రకారము బ్రహ్మసృష్టి
..చన) నష్టమగునది. కవిసృష్టి (రచన) శబ్దకళ, అమృతత్వనిత్యోపాస
..ల్మికి. ఇటులనే కవిబ్రహ్మకు - బ్రహ్మకు - శబ్దకళాసంసారమున
..త్మకలుగుటవలన నిరంకుశ కవులు వారివారి కనువగు రీతి నావిశ్వజన
..ణిని భాషించుచున్నారు.

బ్రహ్మకే కాళిదాసు కుమారసంభవమున ద్వితీయసర్గలో శ్లో. పురాణస్యకవే స్తస్య చతుర్ముఖసమీరితా. అని వచించినట్లున్నది. ఈసరస్వతీ శబ్ద ప్రమేయము, యజుర్వేదమున సగంహిత బ్రాహ్మణోపనిషత్ప్ర... కారణ పంచకములలో శతశోధికముగ ప్రకారాంతరములుగ సమర్థింపబడియున్నవి. వాటి యర్థము సాకల్యముగ నొసర్చుటకు బుద్ధి దార్బల్యము సంఘదార్బల్యము గ్రంథదార్బల్యము నాక్రమించి స్వరూపతిరోధానమైనది.

ఈ వేదస్థితు లిట్లుండ నమరకారునికంటె ప్రాచీన కవుల కాలమున నీబ్రహ్మకు వాక్కుతో సంసారము ముడిబెట్టిన కల్పనలు లేవని శంకించుటయు పాడికాదు. అమరకారునిదృష్టి కవి తిరోధానమైనను ఆదికావ్యమైన శ్రీమదాప్రమాయణమున శ్లో. మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ! ప్రవృత్తేయం సరస్వతీ. అని వాల్మీకమునితో సెలవిచ్చినట్లు బ్రహ్మవాక్యముతో ఛందోనువర్తినిగనైనది కదా. ఇక (వేదవ్యాసుల) పురాణములలో నెన్నిచోట్ల నిర్ధరించిరో అగోచరమె. లలితారహస్య ఖండలలో దిలకింపుడు. శ్లో. బృహతీ-బ్రాహ్మణీ-బ్రహ్మబ్రహ్మాత్మైక స్వరూపిణీ। బ్రహ్మాణీ బ్రహ్మజననీ। బహురూపా బహుప్రియా అనియు వ్రాక్రుచ్చిరి. బుద్ధచరితాది మహాకావ్య కర్తయైన అశ్వఘోషునకు సమకాలీనుడైన కళింగకవి మరణించినప్పుడొక మహాకవి రుచ్యముగ విచారమును వెల్లడించినవర్ణనకలదు. శ్లో॥ హేగోదావరి దేవి తావకతటోద్దేశే కళింగః కవిః। బ్రహ్మాణీం బహుదేశదర్శన సఖీం త్యక్త్వా విరక్తిం గతః। ఏనామర్ణవమధ్యసుప్తమురభిన్నాభీసరోజాసనం బ్రహ్మాణం గమయ క్షితౌకథమసావేకాకినీస్థాస్యతి. అని చాటువు కలదు. దీనిలో బ్రహ్మాణీ యనుచోట వాగ్దేవీ అని కూడ పాఠాంతరము కలదు. ఎట్లైన నాపాతరమణీయప్రదర్శనము కాదా ? ఆలంకారిక చర్యలో నిందు ఏకాకినీం సరస్వతీం బ్రహ్మాణం ప్రతి గమయ ఇతి గోదావరి ముద్దిశ్య కవేరుక్తిః. గోదావరియొక్క అసాధారణశక్తి కవియొక్క శక్తి ప్రతీయమానములు. అర్ణవమధ్యేత్యాది బ్రహ్మవిశేషణన్యసనము వలన శ్లేషయనియు పదార్థహేతుక కావ్యలింగమనియు సాభిప్రాయ విశేషణ సామర్థ్యమువలన పరికరమనియు కోలాహలముకలదు. అపు...

ాగ్దేవీయనుప్రాశము దిద్దుటకలెు బ్రహ్మాణీయనిన కావ్యలింగమునకు
ళిప్రాయ విశేషణమునకు నుత్తరవర్తి బ్రహ్మాణంగమయేతికల్పనకు
నలో సంధింపబడినదియనియే నిర్ధారణకు రాగలదేమో ? శ్రీ
్యాస పురాణ ఘట్టములలో శక్తిత్రిమోపన్యాస సందర్భముల సప్త
క్యాదులలో పెక్కుచోట్లట్టి విశేషణములు వ్యాసగౌరవము వ్యాస
రవము కాగలదేమోనని ప్రదర్శింపలేదు. కాని అంతర్మాతృక
హిర్మాతృకాసాదనలో పంచాశద్వర్ణ స్థానీయములతో నీతత్త్వమే
దర్శింపబడియున్నది.

దండి కావ్యాదర్శ ప్రారంభమున॥ చతుర్ముఖ ముఖాంభోజ
హంసవధూర్మమ॥ అనియు నుడివెను. శ్రీ కవికుల
ిక కాళిదాసు, శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ॥ అని అర్థశబ్దముతో
ితముగ వాగాలంబనాధి దేవతనేకదా ? పార్వతీ పరమేశ్వర నిత్యా
యౌచితితో మాతా పితృరూపధ్యానమును స్త్రీ పురుషమాత్ర
ంపత్యసృష్టి ప్రారంభదశ కావ్య ప్రారంభమున వ్యక్తపరచెను.
్ష చరిత్ర ప్రారంభమున శ్రీ బాణ మహాకవిచే, సత్యలోక శారదా
భారతీవల్లభత్వ గాయత్రీ సావిత్రీ మేధాసాదిత సదస్యమును
ర్చి దుర్వాస స్సామాపస్వర కారణ భారతీస్మితము నుత్పత్తి చేసి
ర్వాసశ్శాపమూలమున బ్రహ్మ దాంపత్య విప్రలంభసమాశ్వాస
ణయ జగదవతరణ ప్రక్రియలు సర్వాంగసుందరముగ వర్ణింపబడియె.
ర్మాత్ర ప్రదర్శనము దశదిఙ్మాత్ర ప్రదర్శనమగుచుండుటచే, ప్రాచీన
వహారమింత విచ్చలవిడిగ నుండ అమరకారునికి గోచరింపలేదను కార
మున మాత్రమే చర్చింప వీలుకాదని తోచుచున్నది. మొత్తము
ాద బ్రహ్మకు గుడియు పూజయు, నెందులకో ఎన్నడో ఖలపడినది.
లకాలము కవులతో కులుకులాడుచున్నను బ్రహ్మరాణియనిమైన
్వాణి నను చుండుట సువ్యక్తము. అదికూడ జీర్ణింపజేయు ప్రసంగ
ెదురగుట వలన కొంచెము విమర్శించి సామరస్యము నరయవలయు
ియు నవిచ్ఛిన్నముగ సకలకవులు మతాచార్యులు, ఘంటాఘోష
ముగ వాడుచున్న భాషాపతీత్వము బృహస్పతికి ముడిపెట్టిన అమర
కారుని దృష్టి, బృహస్పతి నొక వశ్యవాక్కుగా భావించి రని

మాత్రమే మనమనుకొనదగియున్నది. బాణుడు మరణించినప్పు
గూడ నొకకవి శ్లో॥ ధ్వస్తఃకావ్యోరుమేరుః కవివిపణిమహారత్నరా
శిశ్శీర్ణః శుష్కశ్శబ్దౌఘసింధుః ప్రళయముపగతో వాక్యమాణిక్యకో
దివ్యోక్తీనాం నిధానం నిధనముపగతం హాహాతాదివ్యవాణీ బా
గీర్వాణవాణీప్రణయినివిధినా శాయితే దీర్ఘనిద్రాం. అనియు నుడివె
శ్లో॥ ఉరస్థదారో భగవాన్ రమేశః। పార్శ్వస్థదారో భగవానుమేశః। ము
స్థదారో భగవాన్ ప్రజేశః। శిరస్థదారోస్తి మనుష్యలోకే. అను ఇ
సంతనోక్తి వరకు రూఢమైనది. కూతురనినను భార్యయనినను లో
సృష్టి ప్రకరణమున స్వాయంభువ శతరూపాదికములలో నుపాధిభేద
లేదు. రానురాను నేడుకూడ భర్తృభార్యాశబ్దములలో సమ
ర్థము లోకు లీ రహస్యముగ నెఱుంగుటకు కాబోలు దీర్ఘతమముని
త్రిలో భారతమున వ్యక్తులతో దాంపత్యమున పోల్చి ప్రకటపఱచి
శ్రీ శంకరాచార్య మండనమిశ్రవాదమునగూడ శ్లో॥ యాసాం యో
షు త్వంజాతః॥యాసాం స్తన్యం త్వయాపీతం॥ పశువద్రమ సేకథం.ఇత్యా
వాగ్వాద ముభయభారతియెదుర గందముతో నైచిన కస్తూరితో నై
నట్లు పాదుకొల్పబడియె. బ్రహ్మకు కూతురుగనో భార్యగనో సృష్టి
మూలబడకుండ, ధాతాయథాపూర్వ మకల్పయత్॥ అనునట్లు ఆయ
సృష్టినాయనకు ఆమెమూలమున సాగనిచ్చుట శుభోదర్కము. వ్యా
కర్తలు తమ అభిప్రాయములకు సామరస్యముగ నౌచిత్యభంగమ
కానంతవరకు దీనిలో నుపకరించు భాగమున గ్రహింపవలెనని మన
వలనుపడదన్న నాయనగ్రహచారమాయనదే. ముదుసలి. వయస్సు
మీరినది. మరియొక భార్య వరింపదు. ఎట్లో కాలక్షేపము నవీనయు
మున గడుప బ్రహ్మకుబ్రాతతప్పనిసరియని యూరుకొనవలసియున్నది.

సహృదయు లితోధికములు, సత్పక్షమున కుపయోగించి లో
కల్యాణమున కుపయోగించి ఆయన నొక యింటివాని నొనరిం
తోడగుదురుగాక. దీనికి ద్రవ్యత్యాగమనవసరము గనుక తలదా
రేమోనని మనవి.*

---

* ఈ వ్యాసమునుచూచి పూర్వవ్యాస కర్తయగు "విద్యానిధి" మరల పరా
మర్శను వ్రాసినారు. అది ముందు సంచికలో ప్రకటితము కాగలదు.—సంపాదకుడు.

### మహాకవి జగద్ధరభట్టుని

# స్తుతి కుసుమాంజలి

## ( విద్యానిధి )

ప్రపంచ మనోహరములైన కావ్యముల నావిష్కరించి లోకో త్తర యశోవిరాజితులగు కవీశ్వరులెందరో కలరు. మఱికొందరు ఖండ కావ్యములను సుభాషితములను విరచించి రసికరంజనము గావించి 'రసకవి' బిరుదము నందినవా రున్నారు. వీరి కృతులన్నియు దాదాపు ప్రాచీనములగు పురాణేతిహాసముల కనువాదములో అనుకర ణములో అయ్యుండుటవలన ప్రతిభాసంపన్నులగు కవులకును ఆశ్రియ మీయ యంటకపోలేదు. కాని ఏ కథ నాశ్రయించక భావతరంగము లలో దేలియాడునట్లు సుభాషితమయమైన కృతిని సృజించుట కష్టము. అనగను కేవల స్తోత్రములతో నిట్టి పనికిబూనుట కష్టతరమని చెప్ప నవసరముండదు.

శివకేశవాదులను గూర్చిన పరస్సహస్రస్తోత్రములు సంస్కృత భాషలో నున్నవి. వానిని దేవభక్తులు పఠించుచు నానందించు చుందురు. మహిమ్నము, శివానందలహరి, గంగాలహరి మున్నగు కొన్ని స్తోత్రములు జగత్ప్రసిద్ధములై యాబాల గోపాలము సుపరిచిత ములు. వీనియందు గొన్ని శబ్దాలంకారములు గలవియును కొన్ని యర్థాలంకారములు గలవియును అయ్యున్నవి. మరికొన్ని భావోన్నత ములుగాను నున్నవి. కాని ఒకకవియే సకలగుణపరిపూర్ణమైన స్తుతు లను విరచించిన విషయము మన కిదివరకు దెలియదు. ప్రస్తుతవ్యాస మున నట్టి మహాకవిసార్వభౌముడును మహాశివభక్తశిరోమణియును నగు జగద్ధరభట్టునుగూర్చియు ఆతని సుప్రసిద్ధమగు "స్తుతికుసుమాం జలి" గ్రంథరాజమును గూర్చియు నించుక వివరింపబడుచున్నది.

ఆ కాశ్మీర దేశ మెంతటి పుణ్య మొనర్చినదో కాని కాళిదాస, క్షేమేంద్ర, కల్హణ, బిల్హణ, వసుగుప్త, ఉద్భట, రుద్రట, సోమానంద, రుయ్యక, మండనమిశ్రాది కవిపండిత వర్యు లందరును అచ్చోట జనించి ప్రసిద్ధినందినవారే. ఆ భూకైలాస మనదగు కాశ్మీ రము నందే ఈజగద్ధరభట్టు పుట్టినాడు. యజుర్వేదమునకు "వేద

విలాస* భాష్యమును విరచించిన గౌరధరుడు మనభట్టుకు పితామహుడు. మహావిద్వాంసుండగు రత్నధరుడు జనకుడు. వీరిరువురును మహాశివభక్తులు. ఇట్టి యుజ్జ్వల వంశసాగరమున జగద్ధరునివంటి కవి పండిత భక్తశిరోమణి యుద్భవించుట సార్థకముకదా.

జగద్ధరుడు మహాతార్కికుడు. తనపుత్రునకు (యశోధరునకు) సులభముగ శాస్త్రప్రవేశము గావలయునను తలంపుతో తర్క కాతంత్రమునకు "బాలబోధిని" యను వృత్తిని విరచించినాడు. (శ్లో॥ స్వసుతస్య శిశోర్యశోధరస్య స్మరణార్థం విహితో మయా శ్రమోఽయం। ఉపయోగమియాద్యది ప్రసంగా దపరత్రాపి తతో భవేదవంధ్యః॥) తర్వాత నీవృత్తి సుప్రసిద్ధమై పఠనపాఠములలో బ్రచారము నందినది. ఈవృత్తికి రాజానక శితికంఠుడొక టీకను వ్రాసినాడు. ఇతడు జగద్ధరునకు మనుమరాలియొక్క మనుమరాలి కుమారుడు (తన్నప్తృకన్యాతనయాతనూజః) ఈ శితికంఠుడు "భూజానౌ హస్సనాఖ్యే భువనపతి మయా తన్యతే గ్రంథ ఏషః" అని తన వ్యాఖ్యారంభమున జెప్పియుండుటచేత క్రీ. శ. 1472-84 వరకు కాశ్మీరమును పాలించిన హాసన్ షాహ కాలమున నుండె ననుట సుస్పష్టము. ఇతనికంటె నైదు తరములు పూర్వమువాడగు జగద్ధరభట్టు క్రీ. శ. ౧౩ వ శతాబ్దారంభమున నుండెననుకొనవచ్చును.

జగద్ధరభట్టుయొక్క సువిఖ్యాతమైన కృతి "స్తుతికుసుమాంజలి" ఈమహాకవి రాజులను ఓజులను గొలుచువాడు కాడు. మహాభిమాని, నిష్ఠురుడు, పరమ శివభక్తుడు. తన పాండిత్యప్రాగల్భ్యముల నీశ్వరార్పణ మొనర్చు తలంపుతో హృదయపూర్వకముగ నీ మహోన్నతమైన గ్రంథమును విరచించి ధన్యుడైనాడు. శివస్తోత్రములు కానిండు అవి విష్ణుస్తోత్రములుకానిండు, స్తోత్రములకు సంబంధించిన సాహిత్యప్రపంచములో నింతటి కృతిలేదని నిస్సంశయముగ జెప్పనగును. దీనికి రాజానక రత్నకంఠు డొక చక్కని సంస్కృతటీకను రచించినాడు. ఇట్టి గ్రంథరత్నము కాశ్మీరదేశమున మూలబడియుండగా బొంబాయి నిర్ణయసాగర ముద్రణాలయమువారు నలుబది సంవత్సర

ములకు బూర్వ మిద్దానిని ముద్దుగా నచ్చు వేయించిరి కాని యదియు న్ని వత్సరములలోనే యలభ్యమయ్యెను. నేనును ఇది త్వరగా మరల ముద్రింపబడవలెననియును ప్రచారము నందవలయుననియు వెనుక ంత ప్రబోధము గావించితిని. మన్మిత్రులును సతీర్థులును అగు ధర్మ స్త్రాచార్య శ్రీ ప్రేమవల్లభ శాస్త్రి త్రిపాఠిగారు చక్కని హిందీ భాషా టీకతోడను సుందరమైన ముద్రణపత్రములతోడను ప్రస్తుతము ప్రకటించినారు. డెమ్మిసైజున 850 పేజీలు మంచి బైండుగలిగిన స్తుతికుసుమాంజలి "శివభక్తి గ్రంథమాల నం 24/58 రామఘాటు, నారస్‌సిటి" అను చిరునామలో నాల్గురూపాయల వెలకు లభించు న్నది.

ఇక 'స్తుతికుసుమాంజలి'ని గూర్చి ముచ్చటింతము. ఇందు ముప్పదితొమ్మిది స్తోత్రములును మొత్తము పదునాలుగువందల శ్లోక ములును కలవు. ప్రతియొక స్తోత్రమును ఒకవిశిష్టమైన యభిప్రాయ ముతో గ్రంథించబడినది. "స్తుతిప్రస్తావన, నమస్కార, ఆశీర్వాద, మంగళాష్టక, కవికావ్యప్రశంసా, హారాష్టక, సేవాభినందన, కరుణా క్రందన, దీనాక్రందన, ప్రభుప్రసాదన, రుచిరంజన" అని యీ విధ ముగా స్తోత్రములకు వేరు వేరు నామకరణము చేయబడినది. అవి కేవల సార్థకములై యొప్పుచున్నవి. అనగా ౩౯ సర్గలుగల ఒక మహాకావ్య మని తెలియవలెను. ప్రతిస్తోత్రము నొక కుసుమముగా నెంచి మొత్త మీకుసుమాంజలిని తన యిష్టదైవమున కర్పించినాడు. ఇందలి స్తోత్రపలుకులు, ఉజ్జ్వల ఉపాలంభములు, కమ్రకరుణాక్రందనములు పాఠకుల హృదయమును పరిపూర్ణముగ పరవశము నొందించక యుండవు. పదయమక స్తుతి, శృంఖలాబంధ స్తుతి, కాదిపదబంధ, మహాయమకాదుల యందును ఇది చిత్రకావ్యమని తెలియుచున్నది. ఇవి యన్నియు కవి యొక్క లోకోత్తర ప్రతిభకు నిదర్శనములు. ఇట్టివిషయములుగల కావ్యము క్లిష్టముగా దుర్బోధగా నున్నదేమో నని భావింపవలదు. పదచ్ఛేదము గావించినవెంటనే భావము సుబోధ మగును. శబ్దసామగ్రి కాదు. వాగధిదేవతయగు సరస్వతియే కవీశ్వరుని కధీనమై యతడు

చూపిన మార్గమున నడచుచుండును. శబ్దశ్లేషయమకాదులను నిష
పించుటలో సంస్కృత సాహిత్యమున నీతని మించినవాడు లేరేమో
ఇది విద్వల్లోకమున బ్రచారము నందినగాని తెలియదు. చూడుడు.

దేవాలయే వసతిమర్థయతే కపోతః
సింధౌ వణిగ్భజతి వృత్తిమశంకపోతః
పృష్ఠే శ్రియం వహతి నిత్యమనేకపోఽతః
త్వద్భక్తిమేమి సరసీమివ భేకపోతః॥ ౯-४౨॥

"ప్రభూ! కపోతము (పావురము) ఉపద్రవములేని గుడిలో
నుండ నిచ్ఛగించును. గట్టి నావ గలవాడు సముద్రవ్యాపారమున ధ
మార్జించ నుజ్జగించును. గజము తన మూపున నిత్యము లక్ష్మి
వహించు చున్నది. కప్పసరోవరమును జేరు చందమున నేను నీభక్తి
శరణము పొందుచున్నాను"—చూచితిరా స్వాభావికమైన మధు
భావము! క్లిష్టశబ్ద మొకటైనకలదా! ఇన్నియున్నను అన్నిచరణము
చివర 'కపోత' శ్రవణ మెంత సుభగముగా గ్రీడించుచున్నదో వివరిం
నవసరములేదు.

స్వైరేవ యద్యపి గతోఽహమధః కుకృత్యై
స్తత్రాపి నాథ! తవ నాస్త్యవలేపమాత్రం
దృష్టః పశుః పతతి యః స్వయమంధకూపే
నోపేక్షతే తమపి కారుణికో హి లోకః ౧౧ - ౨౮॥

"నేను నా కుకృత్యములచేతనే యధోగతినొందినాడ ననుట
నిజమేకాని, ఇట్లని నీవు తిరస్కరించకూడదు. మదించిన వృషభము
తెలియక బావిలో బడుననుకొనుడు. కరుణాళులగు జన మూరకుందురా!
పైకిదీసి బ్రతికింతురు. పరమేశ్వరా! నీవు మాత్రము నన్నుద్ధరించక
నెట్లుందువు!"

శృంగీ వివేకరహితః పునరున్మదోఽయం
మత్వేతి చేత్ పరిహరస్యతికాతరం మాం
ఏవంవిధోపి వృషభశ్చరణార్పణేన
నీతస్త్వయా కథ మనుగ్రహభాజనత్వం॥ ౧౧ - ౫౩॥

"నేను శృంగిని (అనగా గర్వము కలవాడను) జ్ఞానహీనుడను, ...వును, ఉన్మత్తుడను అనికదా నీవున న్నదాసీనించుట? అయితే వృషభవాహనమో! దాదాపంతయు నావలెనే యున్నది. నిట్టి ...నిపై చరణమునిడి యేల యనుగ్రహించితివి? ఇది నిక్కమగుచో ...ష్ట వీడుట న్యాయముకాదు"— హృదయమును స్పర్శించు నట్టి ...ములెన్నిటినని వ్రాయవలెను?

సాధునాథ! నుతిరీప్సయా మయా
యామయార్చిత కృతాత్రి సాధునా
సాధునా తు విపదం భవామయా-
యామయాపనలసద్రిసాఽధునా॥ ౩౦ - ౫॥

ఇది మహాయమకమున కుదాహరణము. కాదిపదపదరచిత ...కటి.

కావ్యకౌశలకలాసు కోవిదైః । కీర్తితః కవికులైః కుతూహలాత్
కౌముదీకుముదకాంతకీర్తిభిః । కామితః కుశలకార్యకారిభిః॥ ౨-౨-౧॥

ఇందు ప్రతిశబ్దముయొక్క ఆదియందు కకారమే ఉపయోగింప ...నది. ఇట్టి రత్నములచే గ్రంథమంతయు ప్రకాశించుచున్నది. ఈ ...ంథము నవలోకించిన శివభక్తుడు ఒకసారి పులకాంకురము లొదవ ...ూహలముతో నుప్పొంగిపోవుననుట సత్యదూరముకాదు. సంస్కృత ...్యాంసులందరును శైవులు నొకసారి యీ కుసుమాంజలి మకరందము ...క్రోనగోరుచున్నాను. వైష్ణవులును దీని నవలోకించి యిట్టి విష్ణు ...తోమంజరిని సిద్ధముచేయింతురు గాక! ఈ గ్రంథము ప్రచార ...ుచో శైవులలో నిపుడు వాడుకొనబడుచున్న మహిమ్న, మలయ ..., హలాయుధ, అనామయము మున్నగు స్తుతులు మూలకు బడు ...మో నని నాసందేహము. వ్యయప్రయాసలగణించక ఇట్టి యుద్గ్రంథ ...ము ప్రచారములోనికి దెచ్చిన మిత్రవర్యులగు పం॥ ప్రేమవల్లభ ...స్త్రిగా రెంతయు ప్రశంసార్హులు. రసికవర్యు లాదరింపదగిన స్తోత్ర ...ంథమిది. భక్తులవిషయము జెప్పవలయునా?

(కుమారసంభవాది సంస్కృత కావ్యములలోను నాటకము
శృంగారవర్ణనము లుండుటచే బాలబాలికలకు జదివించునపు డెం
సంకోచముగానుండును. ఇకమీద నిస్సంకోచముగ నీస్తుతికుసువ
లిని పాఠశాలలలో బాలికలు మున్నగువారికి జెప్పవచ్చును. దీని
సర్వవిధములైన వ్యుత్పత్తులనుగలిగించు శబ్దసామగ్రి కలదు)

ఈ కుసుమాంజలిపరాగ మింకొక పర్యాయము మా 'విభ
పాఠకుల కందజేయు సంకల్పము కలదు.

---

### శ్రీ కుంకులగుంట బసవ కవి కృతులు *

సీ. బోధించిరే బుధపుంగవుల్ భక్తుల
 కీ తులిత శైవరహస్యములను
కృ | శోధించిరే శ్రుతుల్ శ్రుత్యాది శైవ సి
 ద్ధాంతాగ మేతిహాసార్థములను
సాధించిరే విచక్షణులు నిష్టపాత్రిణ
 భావలింగైక్య ప్రభావములను
క్రీడించిరే ఘనుల్ కుటిలవర్తన దుష్ట
 మార్గ రసాంత సమానములను
గీ. అట్టి జంగమసన్మార్తు లహరహంబు
బాయకుందురు నీ దివ్యభజనయందు
కఠిన రిపునాశ చేబ్రోలు మఠనివేశ
జన్మకర్మాటవీదావ శంభుదేవ.

---

* ఈ కవికృతులు కొన్ని ౨వ సంచికలో ప్రకటింపబడినవి. ప్రస్తుతము ల
చిన శ్రీ చేబ్రోలు స్వాములవారి స్తోత్రమందలి మరియొక పద్యమిది.

—సంపాదకు

# షట్ స్థల దర్పణము

## శ్రీమఠం నదిపూడి నాగభూషణదేవరగారు

శ్రీశైవయోగీశ్వరేశ్వర సేవ్యమై
అణువుకు పరమాణువైన దెద్ది
కమలభవాండత్రియము నిర్మితముజేసి
కబళింప నుమియగాగలదు నెద్ది
కాలకర్మక్రియాకర్తృభోక్తృత్వమై
కర్తృభోక్తృత్వముల్ గాని దెద్ది
ఘటనా విఘటనసంఘటిత పటూత్కట
ఘటపటాదులయందు నటన మెద్ది
గీ. యట్టివస్తువ నీవని ఆత్మదలచి
స్వానుభవులెన్న సీసపద్యానుసరణి
నర్పణము జేతు షట్స్థల దర్పణంబు
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి.

అవని జలానలపవన మాకాశము
ఖ్యంబైన భూతముల్ గానినాడు
వేదాగమపురాణ వితతిశాస్త్రేతిహా
సానుగతార్థముల్ గానినాడు
ఆదిత్యగ్రహతారకాబ్జసంకలితార్థ
కాలచక్రంబును గానినాడు
దేవమానవ ఋషి తిర్యగాధమ సము
త్కట జీవసంఘముల్ గానినాడు
గీ. కమలభవవిష్ణు పశుపతుల్ గానినాడు
పూని ముల్లోకభువనముల్ గానినాడు
కలిగియున్నది లింగంబు గగనభంగి
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి.

అవికార మచ్యుత మద్వంద మమల మ
జర మశేష మభాగ్మచర మతర్క్య

మాద్యంతశూన్యంబు నతులనిరంజన
నిబిడీకృతానంద నిశ్చలంబు
సర్వచైతన్యంబు నిర్వాణ మవ్యయ
సర్వాధికారి ప్రశస్తమైన
గీ. వస్తువొక్కటి పరిపూర్ణవార్ధి భంగి
మొనసియున్నది యెప్పుడు మొదలు తుదియు
నాకసములేని లింగదేహంబునందు
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి.

సీ. ఆలింగ దేహమం దాదిచైతన్యంబు
భావలింగంబయ్యె ప్రణుతి కెక్క
ధన్యత నపరచైతన్యంబు ప్రాణలిం
గంబయ్యె సన్మౌనిగణములెన్న
సిరిమించుమూడవచైతన్యమిష్టలిం
గంబయ్యె నిర్ధూత కలుషవిధులు!
నెట్లన్న బిందువు నిష్టలింగంబయ్యె
నా నాదు ప్రాణలింగాఖ్యమయ్యె.
గీ॥ కడగి చిత్కళ భావలింగంబు దెలియ
వలయు శివభక్తియుక్తుల వరుసనొకటె
రెంటి మూడింటి లింగమూర్తిని సదాత్మ
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి.

సీ. అకుటిలదుర్గ్రాహ్య సకలస్వరూపమై
కరమర్థి నిష్టలింగంబునొప్పు
చారుమనోగ్రాహ్య సకల నిష్కళరూప
మై ప్రాణలింగంబు నలరుచుండు
నెమ్మి భావగ్రాహ్య నిష్కళాకృతిభావ
లింగంబు పేర్మి చెలంగుచుండు
స్పష్టమై బాహ్యమం దిష్టలింగమునుండు
లీల నాంతర ప్రాణ లింగ మునికి.

గీ. వలచి బహిరంతరంబుల భావలింగ
మూర్తి వెలుగొందు శ్రీగురుమూర్తి చరణ
తమ్ములను గూర్చి శివప్రసాదంబుగొనగ, లీల....
అమలదేహ, ప్రాణ, మాత్మభావంబుల
త్రివిధ లింగములని దెలియవలయు
విధివక్ర్కియామంత్ర, వేధదీక్షలనంగ
త్రివిధలింగములని, దెలియవలయు
పొలుపొంద ప్రకృతియు పురుషు డీశ్వరుడన
త్రివిధ లింగములని దెలియవలయు
శుద్ధ ప్రసాదంబు సిద్ధప్రసిద్ధాఖ్య
త్రివిధ లింగములని దెలియవలయు.
గీ. బిందునాదంబు చిత్కళ ప్రియముతోడ
త్రివిధలింగములని బుధుల్ దెలియవలయు
నిష్టలింగాది ననుభవమెంచి వరుస, లీల....
త్రివిధలింగంబులు ద్వివిధలింగములయ్యె
నిలనొక్కటొక్కటి మెలగుచుండు
నాచారగురులింగ మయ్యె నిష్టము నందు
శివలింగచరము సంభవముప్రాణ
మందు ప్రసాద మహాలింగములు రెండు
గలవవి భావలింగంబునందు
భూతేశుడియ్యారు బుట్టుట విభజించి
రజతాద్రియందు పార్వతికిజెప్పె.
గీ. గాన లింగోద్భవంబుల గణనజేసి
అంగములయందు నరయుటననుభవంబు
పుడమి శరణులు నివిబుద్ధి పొందవలయు, లీల....
అంగముల్ త్రివిధంబులని వచించెను శంభు
డారీతి నెట్లన్న ననుభవంబు
శైవయోగులకెల్ల స్వానుభవంబిచ్చు
కతన యోగాంగముల్ స్తుతివహించె

శివయోగి భోగసంసిద్ధివహించుట
కతనయోగాంగముల్ స్తుతివహించె.
ధర్మార్థకామముల్ త్యాగించుటందుల
కతనయోగాంగముల్ స్తుతివహించె.
గీ. కాన నీమూడు నంగసంజ్ఞలుగడించి
శరణుపరిణామశీలురై సత్యశాంతి
పూర్ణవిజ్ఞానమున బుద్ధిబొందవలయు, లీల....
సీ. సుమహితంబగు స్థూల సూక్ష్మ కారణములు
త్రివిధాంగములటంచు దెలియవలయు
ఆప్తజాగ్రిత్ స్వప్నసుప్తికావస్థలు
త్రివిధాంగములటంచు, దెలియవలయు
బలువిశ్వతైజస ప్రాజ్ఞు లనంగను
త్రివిధాంగములటంచు దెలియవలయు
జీవాత్మపాత్రిభాసికపరమాత్మన
త్రివిధాంగములటంచు దెలియవలయు
గీ. కలితసత్క్రియమంత్రయోగము లనంగ
తెలియవలయును త్రివిధాంగములెయటంచు,
సుప్రసాదుల ననుభవ సూత్రమెరిగి, లీల....
సీ. ఆగమవిధిత్యాగ భోగాంగ యోగాంగ
సంకుచితంబైన స్థలములారు
నెట్లన్న భక్తమహేశ్వరస్థలములు
త్యాగాంగజన్యలీలాస్థలములు
రమణప్రసాదాఖ్య ప్రాణస్థలంబులు
భోగాంగ సహితసంభూతములును
అవిరళంబగు శరణైక్య స్థలంబులు
యోగాంగమందున నుద్భవించె.
గీ॥ గాన సంగత్రియంబులొక్కటయె రెండు
విధములై తోచె భక్త్యైక వృత్తులందు,
షట్థలంబులు నివి ప్రకాశము వహించె, లీల....

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## (४) ఓంకారేశ్వర, అమలేశ్వరము.

### మఠం సిద్ధివీరయ్యగారు ఉపాధ్యాయులు.



శ్రీ ఓంకారేశ్వర జ్యోతిర్లింగము మాళవదేశమునందు నర్మదా తటంబున వెలయుచున్నది. ఉజ్జయినీ నగరమునుండి ఖండ్వావరకు (B. B. &, C. I.RY) అను చిన్న ధూమశకట మార్గమున (మోరటక్కా) యను పేరుగల స్టేషను గలదు. అటనుండి యేడుమైళ్ళ దూరమున నీ దివ్యక్షేత్రమున్నది. ఉజ్జయినీ నగరమునుండి మోర టక్కా ౭౯ మైళ్లును, ఖాండ్వనుండి ౩౭ మైళ్లును దూరము. ఈ ప్రదేశమునందు నర్మదానది రెండు పాయలుగా చీల్చుకొని మధ్యభాగ మొక దీవిగా నేర్పడినది. ఈ దీవినే మాంధాతపర్వతము లేక శివపురియను జనులు వ్యవహరించుచున్నారు. ఒకపాయ పర్వతపు టుత్తర దిక్కునఁ బ్రవహించును. రెండవది దక్షిణదిక్కు. రెండవపాయకు విశేష ప్రాధాన్యము గలదు. దీనిని పడవలమూలమున జనులు దాటెదరు. తీరములయందు బలిష్ఠమగు ఘట్టములు నిర్మింపఁబడియున్నవి. పడవలో వెళ్లునపు డిరువైపుల దృశ్య మతిమనోహరమై మానసికాహ్లాదముఁ గలిగించును. ఈ మాంధాతగిరియందే యోంకారేశ్వరు డధిష్ఠించియున్నాడు. సుప్రసిద్ధ సూర్యవంశ రాజశ్రేష్ఠుఁడు మాంధాతయను (అతని పుత్రులగు నంబరీష, ముచికుందులను ప్రఖ్యాత భగవద్భక్తులు) స్వయముగ తపస్వియునై యజ్ఞయాగాదు లాచరించిన వాడు. ఈ ప దేశమునందే ఘోరతపమాచరించి శ్రీ శంకర భగవానుని ప్రసన్నుని గావించుకొనియెను.

కావున నీపర్వతమునకు మాంధాతపర్వతమను పేరుగలిగినది. ఈ గిరియందలి విశేషమందిరములు పేష్వాలకాలమున నిర్మింపబడినవియే. శ్రీ ఓంకారేశ్వర మందిరమును వీరే కట్టించినట్లు ప్రతీతి. మందిరమును ప్రవేశించునపుడు రెండుగదులలోనుండి వెళ్ళవలసియున్నది. నిబిడమగు నంధకారముండుకతన నచటి దీపము బాగుగా ప్రజ్వరిల్లుచుండును.

ఓంకారేశ్వర లింగము భూస్థాపితమైయుండక స్వతస్సిద్ధముగా యున్నది. దీని నలుగెలంకుల సర్వదా జలమునిండియుండును. లింగము మందిరశిఖరము దిగువనుండక దూరముగానున్నది. ముపై మహాకాళేశ్వరమూర్తి కానఁబడును. కొండజీ పర్వతము ఓంకారరూపముగా భావించి ప్రదక్షిణలుగావించెదరు. మందిరములయందు సిద్ధేశ్వర మహాదేవమందిరము దర్శనీయమైన ప్రదక్షిణ గావించునపు డనేక మందిరములు గాన్పించును. వాని ఓంకారపర్వతమను పేరు సార్థకమైనది. ఓంకారేశ్వర మందిర చంద్రస్వరూపమై భాసిల్లును. ఓంకారేశ్వరుని సమీపమున శ్రీపార్వ విగ్రహమున్నది. ఇచట జనులు మహాదేవునికి సెనగపప్పు నైవే ముగా సమర్పించెదరు. యాత్రికులు నిశాసమయమున (శయనహార యొక్క దర్శనము నవశ్యమొనరింపఁదగినది. కాలినడకతో యా గావించిన మధ్యమార్గమునందొక భయంకర పర్వతము గాన్పించు పూర్వము కొందఱు సద్యోముక్తి నభిలషించిన వారై యీ పర్వత నుండి నర్మదానదిలో దుమికి ప్రాణముల గోల్పోయెడివారని యందు

౧౮౨౪ (క్రీస్తుశక) సంవత్సరమున ఆంగ్లప్రభుత్వము వా శ్రీ రామమోహనరాయలవారి ప్రయత్నఫలితముగ సతీ య ఆచారమును రూపుమాపిరి. కావున తత్సంబంధమగు నీ ప్రాణనా కరమగు నాచారమును భృగుపతన మనుపేరుగల దానిని సైత లేకుండఁజేసిరి. కాలినడకను పోవు యాత్రికులకు మార్గ మతిదుర్గమ శిలామయంబై కర్కశమైనది కావున ప్రయాసదాయకము. ప్రతివ రము కార్తికశుద్ధ పూర్ణిమ కీ క్షేత్రమున గొప్పయుత్సవము జరుగు శ్రీ శివపురాణమునందు శ్రీ ఓంకారేశ్వర శ్రీ అమలేశ్వర దర్శన నర్మదానద్యవగాహనమువలన విశేషపుణ్యము లభించునని మాహాత్మ్ మభివర్ణితమైయున్నది. స్నానమేకాక దర్శనమాత్రమున పవిత్రత నని చెప్పబడినది.

మోరటక్కనుండి ఓంకారేశ్వరమున కేగుటకు మార్గమధ్య నందు వివిధవృక్షాదులుగల్గి మార్గ మతిమనోహరమై చల్లదనముగ నుండును. ఇరువైపుల ఓకుమార్కులుగలవు. ఇవి మిగుల మెత్తైన

...దానదివరకు వరుసగానున్నవి. మధ్యమున చిన్న చిన్న కొండలు ...పించును. వీనిని విష్ణుపురి, బ్రహ్మపురియను పేర వ్యవహరించెదరు. ...రెంటిమధ్య కపిలధారయను పేరుగలనది ప్రవహించును. ఇది ...దానదియందెసంగమించును. విష్ణుపురి బ్రహ్మపురులలో బలిష్ఠమగు ...ములును మందిరములును గలవు. విశేషముగా యాత్రికులు ఓంకా...ర ప్రదక్షిణము పడవలయందే యొనరించెదరు.

ఓంకారేశ్వరస్వామి జలహారికను (సోమసూత్రమును) గుఱించి ... విధముగా నుండవచ్చునని యూహింపవచ్చును. నర్మదానది ... యేదో (వివరము) కలదు. పూజాసమయమునం దర్చకులు తమ ...స్త్రమును జలహారికయం దుంచెదరు. జనులు సమర్పించిన పదార్థ...ు తాత్కాలికము గ్రహించెదరు, తక్కినవానిని వదలెదరు. అవి ...దలో గలియును. ప్రతిసోమవార మోంకారేశ్వరుని పంచముఖ ...విగ్రహమును జలవిహారమునకై పడవయందు త్రిప్పెదరు. నర్మదా ...స్నానము, ఓంకారేశ్వర స్థాన నివాసము నారోగ్యమునకు శ్రేష్ఠ... చెప్పెదరు. ఓం తత్ సత్.

(సూచన:—ద్వాదశ జ్యోతిర్లింగములలో నోంకారేశ్వరుడుండ ...లేశ్వరుఁడను పేరు ఏల శ్లోకమునం దుదహరింపఁబడియెనని పాఠక ...శేయులకు సంశయము జనింపవచ్చును. అట్టి సంశయ నిర్మూలన ...కై అమలేశ్వర సంబంధమగు నితిహాస ముదహరింపబడుచున్నది.

అమలేశ్వర మందిరము నర్మదానది దక్షిణతీరమధ్యమున నున్నది. ...నను ఉభయలింగముల గణన యేకలింగముగానే యున్నది. ఒకా... సమయమున వింధ్యాద్రి పార్థివార్చనసహితముగా నోంకారేశ్వ... షణ్మాస పర్యంత మతినియమముతో నారాధించెను. అందువలనఁ ...మేశ్వరుఁడు ప్రసన్నుఁడై వింధ్యాచలముయొక్క మనోభీష్టము నెర...ర్చెను. ఆసమయమునందే సురమునిగణంబు లచటికేతెంచిరి. వారి ...ర్థనానుసారము ఓంకారేశ్వరుఁడు తన్ను రెండుభాగములుగా నొన...చుకొని అందొకదానియందు ప్రణవస్వరూపుడై విరాజమానుఁ...య్యెను. అద్దానినే ఓంకారేశ్వరుఁడనియును పార్థివలింగమున బ్రక...శమైన లింగమునకు పరమేశ్వర (అమరేశ్వర, అమలేశ్వర) నామముచేఁ ...ఖ్యాతిగాంచెను.

# మృత్యువు

నూతికట్టు కోటయ్యగారు, బి. ఏ.

---

*మనశరీర పటుత్వమ్ముఁ మన నృపాల
కత్వమును క్షణికమ్ములే, కావు సతము;
అవ్విధినెదుర్చుటకు నుపాయమ్ములేదు;
మిత్తినలికేల్ విడునె, భూమీశులయిన
రాజదండము మకుటమ్ముఁ రాలిపోయి,
ధూళిలో పార కొడవలితోడ నేక
మగుట తప్పదు, లేదు గత్యంతరమ్ము.
కొందఱు కరాసిచే రణక్షోణి శత్రు
కంఠములగోసి జయలక్ష్మికరముబట్టి
వెలయుదురుకాని చివరకు వీరి కఠిన
బాహు పంజరమును నేలపాలెయగును;
అయిన వీడరు వీరలన్యోన్యహింస:
ఓడవలె విధికెల్లరు నేడొ రేపొ
వీడవలె మఱి మూలుగుతోడి మొప్ప
బద్ధశాత్రవగణములభాతి మృత్యు
సన్నిధికి మెల్ల మెల్లగా జాఱునపుడు.
కంఠ సీమనె జయమాలికా గణమ్ము
వాడిపోయిన; దింక భవత్ప్రతాప
ములనుగూర్చి ప్రగల్భముల్ పలుకవలదు;
మృత్యుదేవత బలిపీఠ మెట్టయెదుట
విజయుడే నెత్తురుల్ గ్రక్కువిధముగనుడు:
వల్లకాటికి మీ తలల్ వ్రాల్లవలయు,
ధర్మపరుల సత్క్రియలు మాత్రమ్ము వారి
మట్టిలోపల బుప్పించి మధుర మధుర
పరిమళమ్ముల జిమ్ము భూవలయముననె.

---

* J. Shirley Death the Leveller

# భాష

గాడేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధాని గద్వాల్

పలువు రుపలాలించువారలుండి ప్రతిపదుపయుక్త మగుటట్లుండ
శ్యైక్షకర పరిగ్రిహణయోగ్య రమణీయాంశములతో నలరారు భాషా
వి దినదినము కృష్ణపక్షమె కాని శుక్లపక్షపక్షపకు మొగము వాంచి
ర్వాంగ కృశత్వమున నమృతత్వసిద్ధ సూత్రిమాత్రి కారణ శరీరమై
నాళాంతర తంతుదశతో ధ్యానగమ్యా, యోగగమ్యా దుర్ జ్ఞేయ
మ్యా (ఇత్యాది) ముద్దుపేరులు సార్థక పఱచుచున్నది. నవ్వుల
ాటలు పెండ్లిపదాలైనట్లు సకలధర్మ స్వరూపిణియైన భాషాదేవి
షణము మనకు పోషణము భూషణము గానగునా? కాజాలదు.

కేవలాంధ్రి ప్రోత్సాహనిర్మిత కళాశాలలుగూడ పాశ్చాత్యాది
మోహములు వదలజాలని యయ్యవార్ల లాంగూలేత స్తతశ్చాలన
లకు చమరీమృగవాలపుచ్ఛ పరిచాలనములవలె కునుకులాడ దా
సంగుచుండ దేశభాష నెగులు దీర్చు శూరు లింకెం దొదవగలరు?
ో వాక్కులు క్రియతో నేకపరికారముగ మేళవించుచుపరరాజన్య
సహాయములేకున్నను, దేశధనమును కన్నులు మూసి కొల్లగొట్టుకొని
వు దండయాత్రికుల వడువున నాంధ్రి యూనివర్సిటీలను పేర్లతో
ళ్లుగూళ్లు గట్టుకొని దేశీయనాళరక్తముల బీల్చినట్లు మొదలంట
యుచు క్రమశః అను ప్రత్యయము నడుగడుగున కులదేవతకంటె
క్క డారాధించుచు ప్రతివ్యాస శిరోధార్యముగ నుంచుకొనుచు
షాసౌధమునకు పునాదైన పడరాని స్థితిలో దేశీయద్రవ్యము,
లము, పూనిక, దుర్వ్యినియోగపఱచుచున్నారు. భాషాంతర బహి
ప్కరణమైన జీవనమెట్లని వీరిదొకకుతర్కము. భాషాంతరములతో కొంప
ాములార్చుకొని జీవనము వనమేనని కునుకు లాడు సంఖ్య లక్షోప
క్షలుగ క్రిములవలె దెసలకెగబారిన అమాయక గృహమేధులు,
ాకతీయులలో నిప్పటి కసంఖ్యాకులు. రాజభాషలున్నవట, మనవారికి
ఓప్పెదరట, దొరతనములు వస్తాయట అను భ్రాంతిలోనుండి మితిమీరిన
తములు, నిరర్థక గ్రంథవ్యయ కాలహరణములు, పిడికెళ్ళతో ట్యూష
ులు భరించుచుండ సీగోళ్ళు గిల్లుకొనుచు దేశీయకళాశాలలలో కాలము
ఓచ్చువారి పూలు పుటికెలలో బడుచున్నవి. సోదరదేశీయులారా!

భాషాస్వరూపము తదాసేవనము నివేదించి నిర్భయముగ ప్రకటిం
పత్రికల పోషించి సంస్కృతాంధ్ర భాషా యోష నలరించి యా
సంపూర్ణాశీర్వచనపాత్రులు కాదలచిననే కాంగ్రెసు గాంధీత్యాది మహా
శయులు బిలేశయులుగనున్నను స్వోద్యమము ప్రోద్యమమై మన
రక్షించును. బాటను గుర్తించి ప్రోత్సహించుడు.

దయచేసి మనదగ్రివ్యముగూడ వారిభాషణాలాపముల కుపయో
గించు సంఘుద్రోహవ్యక్తుల భేదకత స్వార్థపరత కాలయాపనము
గుర్తించి యాత్మోద్ధరణమునకు పునాదు లారంభింపుడు.

తెల్గుపేరెఱుగనిదేబెలు తమిళులు, త్రైలింగమున నుపాధ్యాయులగు
జాతిమతగ్రంథ సారస్యమెఱుగని,భరతమాతృలె స్కూల్ ప్రివక్తలగు
ముమ్మాటి కరులకీల్ బొమ్మలై తిరుగాడు, లాలసులే న్యాయశీలురగు
జాతివిద్వేష విఖ్యాతిధనార్జన,పరతంత్రులే న్యాయవాదులగుట

గీ. ప్రతిభ మనయాంధ్రమున ప్రతిప్రజకు గలుగ
సత్యమునుజూడు డివి యెటుసంభవించు
గాన నేడైన మూసినకనులు దెఱచి
యాంధ్రమును బ్రోవుడో సోదరాంధ్రులార.

తెల్గు తెల్గని సభాధిత్యకవాపోవు, రాజ్ రైటు లను కుటీరమునదూరి
మాతృభాషనుచు సమాజాలలో బల్కు,కార్బారు హూణమేకలమునం
ఆంధ్రజాత్యభిమానమను రచ్చలందెక్కి, ప్రోన్నతోద్యోగులపూజలెప్పు
మనభాషపాలనమున కనుసంతట, క్రీడల సహితము కింగుబోర్డు

గీ. పాలుమాలినవాడు సోపానమెక్కు
పూనికైనను లేనియీ బూటకమున
కాంధ్ర భాషాభివృద్ధి యెట్లగునో తెలియ
భాషకగ్రత లేకేమి పాలనంబో.

గీ. తెలుగువిద్వాను కింగ్లీషు దెలియకున్న
నొల్లరట స్కూళ్ళలో నొక్క హూణభాష
నరసి తెల్గేమి యెరుగని యరవమైన
తగునటిది మాతృభాషార్థ తత్త్వమొక్కొ.

ఓం

# సహచారిణి

## కె. సాంబసిద్ధయ్యగారు ఉపాధ్యాయులు



మ. వనవాసం బతికష్టసాధ్యమనుచున్ వాకుచ్చిచున్ నీవు నా
మనమున్ భీతిని గొల్పజూచె దకటా మజ్జీవితాధార యొం
టిని నన్నీభవనంబునన్ నిలుప నేశేవన్ మనంబొప్పినో
యనఘా నిన్నెడబాసి నే నిలుతునే హర్మ్యంబునం దొంటినై. ౧

ఉ. ఆ రవి వేడికాకలకు నాకలి దప్పుల కోర్వలేక కాం
తారమునందు గాల్నడల దాముప్రియాణ మొనర్చుచుండ శృం
గారపు పూవు తోటలను కాంచనహర్మ్యతలమ్మునందు సం
చారము సేయజాలుటకు జానకి చిత్తము వజ్రపీఠమే. ౨

గీ. సూర్యకిరణాంకురంబులు సోకకుండ కరము మణిమయమందిరాంగణములందు
దిరుగు సుకుమారులే మీరు కటికరాతి నేలదిరుగాడ నేనిందు నిలువనేల ? 3

చ. పతివనుమ కష్టములపాలయి ఖేదము జెందుచుండ నే
నతులిత సౌఖ్యసంపదల నందుచు శాంతివహింప నేర్తునే ?
సతి, పతియర్ధగాత్రియని శాస్త్రములెల్ల వచించుచుండు మీ
సతి నగు నేను మీచరణ సన్నిధి నుండుటకేని నోచనే ? ౪

ఉ. వాసన, పుష్పమున్విడిచి వాసమొనర్చునె ? ఛాయ భాస్కరున్
బాసి చరింపనేర్చునొకొ ? పాసిచరించునె ? మించు మేఘమున్
ఓ సుగుణాగ్రగణ్యా ! యటులుండుట కొప్పునె ? మిమ్ము వీడి నే
వాసమొనర్ప జాల నిట వచ్చెద నన్ గొనిపొమ్ము మొక్కెదన్. ౫

గీ. నీదు ముఖపద్మమాధురి నిమిష నిమిషమునకు నాసక్తిగ్రోలుచు దనివిజెందు
నాదు నయనాళి పదిపైన నాలుగేడు లెటుల సైరించ దయజూడు మినకులేంద్ర! ౬

ఉ. మీవెనువెంటనున్న వనమే తలపోయ నయోధ్యనాకు నా
పావనశీల మిమ్ము నెడబాసి యయోధ్య వసించుటన్న నా
భావమునం దరణ్యమయి భాసిలుగావున నన్ను వెంట గొం
పోవక యున్నచో హృదయమోహన ప్రాణము నిల్పనేర్తునే ? ౭

చ. జనవర ! అత్తమామలకు జక్కగ సేవలొనర్చుచుండి యిం
టను నివసింపు మందు వకటా ! వనభూముల మీరు వల్కలా
జినములదాల్చి మౌనులయి సిల్గులచే వెతజెందుచుండ నే
మనమున నత్తమామలకు మక్కువతో పరిచర్యసేతునే ? ౮

సీ. ప్రాణేశ ! నీవుండు బంధురాటవినాకు, దేదీప్యమాన మందిరములగును
స్వామి ! మీ వెనువెంట సంచారమొనరింప, వనములే నా కుపవనములగును
చిత్తజాకార ! నీచెంత నే నిదురింప, పాషాణతలము పూపానుపగును
మోహనాకార నీ మ్రోల నే నటియింప, నగరాజములు రాచనగరు లగును
గీ. జీవితేశ్వరా నేను మీ చెంతనిలువ, కష్టభరితమ్ము బహుళదుఃఖాకరంపు
ఘోరనరకంబు నాకు నీకువలయమున, పరమస్వర్లోకసామ్రాజ్యపదవియగును ౯

సీ. పసిలేళ్ళు తనవెంటబడి వచ్చుచుండగా, రయమున బారు సారంగచయము
మృదులవాతాహతి బృథివిపై జల్లున, కుప్పలుగా గూలు కుసుమచయము
నగరాజములనుండి దిగి క్రిందికి బారు, స్వచ్ఛమౌ సెలయేటి సముదయము
చెట్లనీడలనిల్చి చెలువొప్పు బురివిప్పి, నృత్యమ్ము సలిపెడి నెమిలినెలత
గీ. వృక్షశాఖలు వీనుల విందుగొలుప, గాన మొనరించు పక్షిసంతానములను
జూచి సంతోషవారాశి వీచికలను,దోగు భాగ్యంబు నాకిట దొరుకగలదె!
తే. గీ. అగ్నిసాక్షిగా మనము పెండ్లాడువేళ,నొకరినొకరము నెడబాసియుండమని
వేదవిధినోటితో జెప్పి విపినభూమి,కొంటిగా నేగ జూచుట లుచితమగునె?
ఉ. క్రూరులు రాక్షసాధములు గ్రుమ్మరుచుందు రటంచు జెప్పెదో
ధారుణినాథ, మీరు కడు దర్పముచే విలు చేతదాల్చి నా
చేరువనుండ రాక్షసులు జేయునదేమి? సురేంద్రుకైననా
దేరి కనంగ శక్తిగలదే పెరవారల జెప్పనేటికి.
సీ. అర్కాంశుతపన దేహమున జెమ్మటతోప,,వీవన చేబూని వీచుదాన
బడలికచే మేను వాల్పనుంకించిన, నంకభాగము దిం డమర్చుదాన
కందమూలములకై యందందు దిరిగిరా, నిష్టాన్నమును వేళకిచ్చుదాన
అతిథి యభ్యాగతు లరుదేర వారల, సేవల బరితృప్తి సేయుదాన
గీ. అన్నిపనులను సాయమై అహరహమ్ము, మీకుచేదోడుగా నేను మెలగుచు
కౌననావాసఖేదంబు గలుగనీక, కాలమును సౌఖ్యతరముగా గడపుదాన.
చ. అటువలెగాక నొంటిగ బ్రయాణము మీ రొనరింతురేని నే
నిట వసియింపనోప కెటులేని వియోగభరమ్ముచేతసం
కటపడి వీతిహోత్రునకు గానుకగా దను నప్పగింతు న
ప్పటికిని నైన మీదగు కృపారసము న్బడయంగనోపనే?
చ. అనుచును రామచంద్రచరణాబ్జములందున వ్రాలి బాష్పధా
రను బ్రవహింపజేయు రఘురాముడు మెల్లన లేవనెత్తి యా
వనరుహనేత్రి నేత్రముల వారిని జేలముతో నడద్ది పే
మను అమృతోపమానమగు మాటల ఖేదము వాపుచిట్లనున్.
తే. గీ. విషయమును జెప్పినంతనే భీతిజెంది, అణిముత్తెంబులన్ బోలు అశ్రుధార
నేల నేలపై బ్రవహింప జేలవగుచు, మాను ఖేదమ్ము ధైర్యమ్ము బూనుమ
ఉ. గాలికిలేచియాడు నురగంబుల గాంచిన సింహముఖ్య శా
ర్దూలవిరావముల్ జెవులదూరిన గుండెలు వ్రయ్యలౌను ఏ
లీల వనాంతరంబుల జరించెదు నా వెనువెంట సౌఖ్య సు
శ్రీలకు దూరమై వనటచే గృశియింపగ జూడ నేర్తునే?
చ. అనయము రాజసౌధములయందు విహారమొనర్చు నీవు కా
ననముల రాతనేల, లలనా, తిరుగాడుచు గందమూలముల్
దిని మనలేవటంచు వెనుదీసెను సామన మంతెగానినీ
పరిణయసుధాంశుసుండయిన రాముడు నిన్నెడబాసియుండునే?
తే. గీ. చెక్కుటద్దాలకన్నీరు చిలుకరింప, వదనమున మిగుల దీనభావమ్ముదోప
మాటికిని నన్ను బ్రార్థింప నేటికబల, రమ్ము నావెంట బయనమ్ము కమ్ము

# జనాబాయి

విద్వాన్ కవిరత్న అష్టావధాని మేదిపల్లి లక్ష్మీకాంతముగారు



## చతుర్థాంకము

### ప్రథమరంగకము

(నామదేవునిగృహమున శ్రీకృష్ణుఁడు, జనాబాయి చెరియొక ప్రక్కపైఁ బండి నిద్రించుచుందురు. తెర వెలువడును.)

కృ—(నిద్రనుండిలేచి కూర్చుండి) ఆహా! అవస్థాత్రియంబునను న న్నేమరక భజించు నియ్యింతి ప్రాపున నే నెంతయు ధన్యుఁడను. నాకెనలేని మోదము గలుగుచున్నది. రాధాబాయి యొసఁగిన నా ప్రసాదము నీమె స్వీకరింప మఱచి నిద్రించుచున్నది. దానంజేసి నాకెంతయు క్షుద్బాధ యతిశయించు చున్నది. త్వరగా నీమెను లేపి భుజింపఁజేతును. (జనాబాయి నుద్దేశించి) జనాబాయి! జనాబాయి!!

జ—కృష్ణా! కృష్ణా!! (అని లేచి కూర్చుండును)

కృ—జనా! నా కాఁకలి మితిమీరుచున్నది. తాళఁజాలకున్నాను, నాకేమైన నొసంగుము.

జ—స్వామీ! నాకడ నేమియున్నది. నీక్షున్నివారణమున కేనేమియొసఁగుదును? నాహృదయము నారగించి నీయాఁకలిఁ దీర్చికొనుము.

కృ—(జనాంతికముగా) ఆహా!

తే. గీ. అచ్యుతము నద్వితీయము నైచెలంగు
తనదు నాత్మార్పణంబున ననుఁ గృతార్థుఁ
జేయఁగాఁగోరి త్రికరణ సిద్ధితోడఁ
బలుకు నీబాల యమృతంబు లొలుకు పలుకు.

(జనాబాయింజూచి) అటు లనెద వేమి? నీకు రాధాబాయి యొసఁగిన యుచ్ఛిష్టాన్నము నేమిచేసితివి?

జ—(సంభ్రమమున) ఔనౌను మఱచితిని కృష్ణా! క్షమింపుము నన్ను మన్నింపుము. (తలక్రిందనున్న రొట్టెముక్కలను దీయును శ్రీకృష్ణుఁ డామెప్రక్కమీఁదఁ గూర్చుండును. ఇరువురు భుజించుచుందురు. ఈలోపల శ్రీకృష్ణుఁడు తన యాభరణములన్నిఁటిని నామె ప్రక్కలోదాచును)

శ్రీకృష్ణ—చాల ప్రొద్దుపోయినది. నీవు పరుండుము.

జనా—చిత్తము. (పరుండును.)

శ్రీకృ—[౧౩ వ అనుబంధము] (నిష్క్రమించును) యవనిక వ్రాలును.

ద్వితీయరంగకము.

(విఠోభాగృహము)

విఠో—(శయ్యపై నిద్రించుచుండి కలవరపాటునలేచి) హా! రంగా! రంగా! అహ జనా! జనా! (శయ్యపై వ్రాలి నిద్రించుచుండును)

వీరప్ప—(ప్రవేశించి) అయ్యా! అయ్యా!

విఠో—(లేచి కూర్చుండి) ఎవరు? ఎవరు వారు?

వీరప్ప—దాసుఁడను స్వామీ! తమరేదో కలవరించుచున్నట్లున్నారు.

విఠోభా—అడుగో! రంగఁడు. ఇదుగో నా కన్నతల్లి జనాబాయి. అహ జనా! జనా!

వీర—స్వామీ! ఇది తమ స్వగృహము. పండరికాదు, కోవెలలేదు. ఇవి ఫలకములు.

విఠోభా—(కన్నులు తుడిచికొని) హా! హతాశ! వీరప్పా! సత్రమునకేగుద రైనను మహాత్ములు, తైర్థికులు, ఎందైన నా బిడ్డను గనియుందురేమో!

వీర—దేవర! తెల్లవాఱుచున్నది. వెళ్ళుదము రండు.

విఠో—(లేచి)

శా. శ్రీకాకుత్థ్సకులాబ్ధి శీతకరు, రాజీవాక్షు, ధర్మాత్ము, సీ
తాకాంతుర్, భవబంధభంజను, గుణోద్దాముర్, మహావీరు, ని
త్యైకానంద రసాత్ము, దాశరథి, భక్తాభీష్టసంధాయకుర్
లోకారాధ్యు, రఘుప్రవర్యుఁ దమి, నీలోఁగొల్తువా? చిత్తమా!

(ఇరువురు నిష్క్రమింతురు. యవనిక వ్రాలును.)

తృతీయరంగకము

(పండరిపురవీథి)

(పటేలు, అర్చకుఁడు, పౌరులు, భటులు ప్రవేశింతురు.)

పటేలు—(అర్చకునిజూచి) ఇంకెవరియిల్లు చూడవలయును?

అర్చ—ఎవరిల్లేమిటి? స్వామివారి సొమ్మంతా దొంగిలించిన యా దొంగముండ కొడుకిల్లు.

పటేలు—ఎవ రా చోరుఁడు?

అర్చ—చోరుఁడెవరా? ఎవరేలా యాతారు. చౌర్యముచేసినవాఁడు చోరుఁడు.

పటే—ఎవరా చౌర్యము చేసింది?

అర్చ—అది మేము చెప్పతే యింకా మీరు మీ యేగులోళ్ళంతా యెందుకు తగులఁబడనా? నే నసలుచూస్తే వాండ్లను బోనిస్తానా? తస్సకొయ్యా! రాజభటుల కప్పగించి సున్నములోని కెముకలేకుండ పొడిపించకపొయ్యానా!

శా—కోవెల్లలోని కెవరును వచ్చినట్లు తోచదు, ఏలయన? కుంచెకోల తమ యొద్దనే యున్నది తలుపులా? తెఱచినట్లులేవు, కావున స్వామివా రెచ్చ టికో వేంచేసి యుండవలెను. ఏ భక్తునికో దయతో ననుగ్రహించి యుండ వలెను. నాకైతే యీలా తోచుచున్నది.

పా—అప్పాజీ! నీ మాట చక్కఁగా నున్నది.

శేల్క—అట్టిభక్తు లెవరు?

ప్పు—ఎవరున్నారు? అఁడు లేఁడు నామదేవులె.

పా—కాదు. వాని యింటిలోనున్న పిల్ల. నామదేవుఁడు భక్తుఁడు కాని దొంగ కాడు. ఆయననంతా యెఱుఁగుదురు.

పా—ఔను. ఆ పిల్ల యెప్పుడు స్వామివారిని విడిచియుండునదికాదు. నాకుఁ గూడ నా పిల్లయంటె—కొంచె మనుమానము.

పా—కొంచెములేదు, గించెములేదు. అపహరించిన దా పిల్లయె. నాకు గట్టి నమ్మకము. స్వాముువారిని చూచింది. అట్టె నగలపైఁ గన్నుపెట్టింది. ఏమాఱు ఖాళీపుచేతులో సంపాదించుకొని వెలుతురు లేకుండ పని చక్కఁబెట్టు కుంది.

ప్పు—ఔనాను. ఇచ్చటికి వచ్చేవా రంతా తెల్లగడ్డాలవారు, పేలపిండివారె కాని యీలాఁటి పడుచుపిల్లలువచ్చి, యింతభక్తితో నుండఁగ నేను చూడలేదు. మానాన్నైనఁ జెప్పలేదు. మాతాతయైన మచ్చుకెక్కడవ్రాసిపెట్టలే.

పా—వచ్చిన నెందులకు వచ్చెడివారో! ఎందులకుఁ బోయేవారో, కాని, యిటు వంటి పాపమెన్నడుఁ జేయలేదు. "రామ! రామ!! స్వామివారి నగలే దొంగి లించుట?

ప్పు—కాకపోతె పిల్లేమిపిల్ల, పదునారేండ్ల బాలపడుచు, పట్టుచెండు. కరగిపోసిన కడాని, ముట్టితే మాసిపోతుంది. నిజముగా యిది యిల్లాలయితే బుద్ధిగల కొప్పు భుజము దాటదన్నట్లు పెండ్లి పేరంటము లేక, ముక్కాలు ముసలి తండ్రిని విడిచివచ్చి పడియుంటుందా! ఎబ్బెబ్బె!

పా—సానిముండలకన్న సంసారి రండలే మిన్న. అదంతా మీకుఁజెప్పాలెనా! యింతకు జనాబాయిని బట్టితిమా సొమ్ములు బయలుపడ్తాయి.

శేలు—ఆ బాల నామదేవునింట నున్న జనాబాయి యనియేనా మీనిశ్చితాభి ప్రాయము.

ందరు—(ఏకగ్రీవముగా) ఔనాను.

శే—సరే, వెళ్ళుదము రండు.

పా—(ఆలించి విని) వీడుగో! నామదేవు లిటే వచ్చుచున్న ట్లున్నది.

ాష—(౧౪ వ అనుబంధముతోఁ బ్రవేశించును)

పటేలు—మహానుభావా! మీయింటనున్న జనాబాయి శ్రీ పాండురంగస్వా
వారి యాభరణముల నపహరించినదని పంచాయితీదారులెల్ల చెప్పుచున్నా
కావున నేనామెనుబట్టి శిక్షించి యథార్థమును వెల్లడింప నున్నాను.

నామ—ఆమె దొంగిలించినపు డెవరైనఁ జూచియున్నారా? ఎవరువారు?

పటేలు—ఒకరు చూచుటేమి? ఆమెయే దొంగిలించి యుండనోపు. కానిచో
సహకారు లిట్లేల చెప్పుదురు? ఇదుగో! నే నామెను శిక్షించి సొమ్ము
గ్రక్కింతునుసమ్ము.

నామ—వెఱ్ఱివాఁడా! ఆబాల నగల కాశించునా?

మ. ధనధాన్యంబులకెల్ల రోసి, జగమే దారిద్ర్యకూపంబటం
చని, శ్రీవిష్ణు పదాబ్జయుగ్మమునె, సర్వైశ్వర్యద ప్రీతిఁ జిం
తనముం జల్పుచు మోక్షలక్ష్మిగను, నీ నారీవతంసంబెటుల్
ధనతృష్ణార్తిని దేవదేవునగలన్ దాచంగఁ దానోపునే.

పటేలు—ఐనఁగానిండు; మీరు మాతోరండు. మీయిల్లు సోదాచేసి చూసెదను.

౧ పౌ—ఉన్నను లేకున్నను సందేహ నివృత్తి యగునుగదా!

నామ—మంచిది రండు. (ఎల్లరు నిష్క్రమింతురు) (యవనిక వ్రాలును)

## చ తు ర్థ రం గ క ము

(నామదేవునిగృహము)

(రాధాబాయి పూలను దండగా గ్రుచ్చుచుండును. జనాబాయి,యొక్కొక
పుష్పము నందిచ్చు చుండును) (తెర వెలువడును.)

రాధా—జనాబాయి! పుష్పహారమునందెడనెడ నీ తులసీ దళములను గూర్చి క
భగవానున కెంతయో ప్రీతి.

జనా—అచ్చట మహాలక్ష్మి యుండునుగదా!

రాధా—లక్ష్మిని ఉరమునందే ధరించియుండును. కనుక నే శ్రీవత్సాంకుడని బిరుదు

జనా—మహాపతివ్రతయైన తులసియే లక్ష్మితులసిగా జన్మించిన భగవానుఁ డమ
హింపఁడా!

రాధా—అమ్మా! యీదండను సమకూర్చుము. చంటివా డేడ్చుచున్నాఁడు. స
దాయించి వచ్చెదను. (నిష్క్రమించును)

జనా—తరించితిని (పూలను గ్రుచ్చుచు) కృష్ణా!

మ. సుమనః పుష్పము, హస్తపంకజము, హృత్పూనంబు, నేత్రాబ్జముల్
మిము సేవింపఁగఁ దగ్గపుష్పములు, భూమీజోత్థ పుష్పంబు లే
లని మనోనాయక భక్తిసూత్రమున, మేల్ రాణించు మద్గాత్రిదా
మ మురం బుంచు సిరింబలెన్ సతము నన్ మన్నించి భక్తప్రియా!

హారమును గైకొని నిష్క్రమించును)

(పటేలు, పౌరులు, అర్చకుడు, నామదేవులు ప్రవేశింతురు.)

జ—జనాబాయి!

నా—(ప్రవేశించును)

టేలు—అమ్మా! సన్యాసినివలెఁ గనఁబడు నిన్నపరాధినిగా భావించు నా విధికి మన్నింపుము.

నా—హా! పాండురంగా!

నా—(ప్రవేశించును)

టేలు—అమ్మా! స్వామివారి నగలు పోయినవను గగ్గోలు మీరెఱిఁగియే యుందురు. అందు మిమ్ముదోషిణిగా గ్రహించితిమి. దీనికి మీరేమందురు.

నా—ఆ! ఆ!! నేనేమియు నెఱుఁగను. పాండురంగా! నన్నేల యిట్టి నిందల పాల్జే తువు?

టే—భటులారా! మీరీగృహమును శోధింపుఁడు.

టులు—చిత్తము (ఇల్లంతయు వెదకి యొక బొంతలో నున్న స్వామివారి యాభరణ ములను దెత్తురు. కొందరు కోపోద్దీపితులగుదురు. నామదేవుని తలితండ్రులు, బిడ్డలు నిరుగుపొరుగువారెల్లరు విచారములో వత్తురు).

పౌ—ఎంతపనిచేసితివె. నీ బ్రతుకుపు గాల. మానోళ్ళల్లో మన్నుపోద్దామనుకున్నావా?

పౌ—ఇది చాలటక్కరి. ఎవరి కొంప లార్చటానికో యీలా సన్యాసినైంది.

టేలు—(భటులనుజూచి) ఈమె చేతులకు గడియవేయుఁడు.

టులు—(అట్లుచేతురు)

టేలు—జనాబాయి! ఆ బొంత నీదేనా?

నా—ఔను.

ధా—(విచారములో) కట్టా! ఏ పాపమెఱుఁగని యీ బాలకా! యీ ఘోర శిక్ష!

టేలు—జనాబాయి! నీవె ట్లపహరించితివో నీకుఁ దోడ్పడిన దెవరో సత్వర మెఱిఁ గింపుము.

నా— అహా! నేనేమియు నెఱుఁగను. ఇదియంతయు శ్రీ పాండురంగని చిద్వి లాసము.

టేలు—పాండురంగని చిద్విలాసమా? కాక, నీ సౌందర్యవిలాసమా? చెప్పుము. త్వరగాఁజెప్పుము. భటులారా! మీ రీమెచే సత్యమును జెప్పింపుఁడు.

టులు—నిజముచెప్పు. ఒప్పుకో. ఒకరిపేరుచెప్పు (కొరడాలతోఁ గొట్టుచుందురు)

నా—(చలింపక) హా! రంగా! పాండురంగా!!

తే. గీ. అన్యమెఱుఁగక సతము నీ యంఘ్రియుగము
దిక్కనుచు నిన్ను సేవించు దీనురాలి
నిట్టి యిడుమల, నిందల నేల త్రోసి
పరితపింపఁగఁ జేతువో! పాండురంగ!

పటేలు—(ఎగతాళిగా) భేస్ (కోపముతో) ఈ టక్కులనువాని నిక్కము వక్కాణింపుము.

౪ పా—ఈమెకెవరైనను రాత్రి తెచ్చియిచ్చిరేమో విచారింపుఁడు.

రాధా—(రోషముతో) ఈమెకెవరు తెచ్చి యిత్తురు? అట్లితరులిచ్చుటకు నీమె కొనుటకేమైన నవకాశముండునా? అసంబద్ధప్రలాపములను జేయకుఁడు.

౫ పా—ఏమో! ఆమె చక్కఁదనానికి మీ దారిద్ర్యానికి దయదలఁచి యెవ్వ నిచ్చిన నిచ్చి యుండవచ్చును.

పటేలు—సంసారులయం దిట్లు భావింపరాదు.

3 పా—అయ్యా! ఇందు విపరీతమేమున్నది?

తే. గీ. ధనమునకొ, తరుణికో, కాక, తన ప్రయోజ
నం బొకింతయుఁగోరక, న్యాయబుద్ధిఁ
బరుని కుపకృతి సేయఁగ, బరునితోడ
నేస్తమొనరింపఁగోరు చాదస్తుఁడెవఁడు?

పటేలు—జనాబాయి! ఇనుమును గూడిన యింగలమునకు సమ్మెటపెట్లట్లు నీమూలమున నీపుణ్యదంపతు లిడుమలఁ గుడుచు చున్నారు. సత్వర మెవ్వ పేరుచెప్పిన నీవు ముక్తిదొరుకును.

జనా—ధర్మాధికారు లధర్మవర్తనులుగానిచో నిది కలికాలమెట్లగును?

పటేలు—నామదేవా! మేమీమెను గొంపోయి తగిన విధిని శిక్షించెదము. మీరేమి భయపడవలదు.

నామ—హరిభక్తుఁడెవరికి భయపడవలెను? నీకా? లోకులకా? లేక సత్యా విచక్షణలేని నీబోఁటి యుద్యోగాంధకారాయత్తప్రమత్తచిత్తులకా? ప మునకు వెఱవవలయును. ధర్మమునకు భయపడవలె. కాని, పాపభీతిలేని క పాత్ముల కెవఁడు జంకును?

పటేలు—(కోపముతో) భటులారా! యీపూటకీమెను గారాగృహబద్ధను సాయంత్రమున వధ్యభూమికిఁ దోడితెండు. (నగలను నేర్పకునకుఁజూ ఈనగలు స్వామివారి వనుట కావంతయు సందియముండదు గదా?

అర్చ—సందేహమేమి? అబ్బె! స్వామివారివె.

౫ పా—ఔను. ఈలాటిదాని తల గొట్టించితిరా యిఁక మీఁద నీపుణ్య క్షేత్రమం గపట సన్న్యాసులు, సన్న్యాసినులు మందునకైనఁ గనబడరు.

ులు—(జనాబాయిని లాగుచుందురు)

ము—హా! పశ్చాత్పరా! శ్రీకృష్ణ భగవానుఁడా.

చం. సరసిజ నేత్రు సేవనమె, శాశ్వత సౌఖ్యపదంబటంచు, నీ
సరణి నమానుషీయమని, జానపదంబులు సన్నుతింప, నే
మఱక, యహర్నిశంబులు, రమాధవు సంస్మరణామృతంబు, సు
స్థిరమతిఁ గ్రోలు నీయబల, శిక్షకు నర్హయె! చౌర్యవృత్తియే!

ా—(రాధాబాయి, నామదేవులు మున్నగు వారలకు నమస్కరించును) సెలవా సం
గుఁడు పోయివచ్చెదను.

ము—అమ్మా! నీపవిత్ర జీవితమునకీ యపనింద లే వెన్నెలెచ్చు. శ్రీకృష్ణ పర
మాత్మ నేమఱక భజింపుము. నిన్నాతఁడు రక్షింపఁగలఁడు. ఇవన్నియు నాతని
పరిశోధనలె. నీకు శుభంబగును. వెళ్ళిరమ్మా.

ా—(జనాబాయిని కౌఁగిలించుకొని) బిడ్డా! నీవు బాలికవైనను ననన్యసామాన్య
భక్త్యతిశయంబున విరాజిల్లు పరమభక్తురాలవు. నీ స్నేహంబున నాకొదవిన
సంసార క్లేశములనెల్ల మఱచితిని. నీరాక మాకెంతయు శుభప్రదమయ్యె. నిను
వీడి నే నెట్లసువుల భరింపఁగలను? తల్లీ! కనుగందువే! ఈవృత్తాంతమువిన్న
నీతండ్రి యింకను జీవించునా? అమ్మా! నేనేమి చేయుదు. (జనాబాయి
వెంబడి నందరు నిష్క్రమింతురు) (యవనిక జారును)

(చతుర్థాంకము సంపూర్ణము)

---

## పంచమాంకము

### (వధ్యభూమి)—ప్రథమరంగకము

(శృంఖలాబద్ధయగు జనాబాయిని భటులు గొనివత్తురు.)

ా—కృష్ణా! కృష్ణా!! నే నేమి యపరాధమొనర్చితిని! నాకీ ఘోరశిక్షయేమి?
నే నపరాధను. అబలను. అనన్యసహాయను, నీవేదిక్కు. రంగా! రంగా!!
నాకేల యిట్టిగతి గల్పించితి? ఆ బాల్యము నీసంకీర్తనామృతమును గ్రోలు
చుండినందులకా? యీ-యకాలమరణము. లేక నీ భక్తారాధనము నిరంతరము
సల్పుచుండినందులకా? కాక. నా మెఱలు నీ స్వేచ్ఛావిహారమునకు
భంగము గల్గించుననియా? లేక నే నర్థార్థినై ధనధాన్యముల నాసించి నిను
బీడించుచుంటిననియా? స్వామీ? నీ వెఱుఁగవా! నా హృదయము.
నీ వేల సాక్ష్యమొసఁగవు? దీనబంధూ! దయాసింధుఁడవే. ఈ దీనురాలిపై
వింత దయారసము చిమ్మరాదా. సాయంసమయమైనదాది నీ భోజనమునకై
పదార్థములఁ బచించితి. నీకు వడ్డించితి. నీకుఁ దినిపించితి. కృష్ణా! కృష్ణా!!
గోపాలకృష్ణా! నే నా పూట నీ ప్రసాదమును స్వీకరింపమఱచి నిద్రించు

చున్న క్షుద్బాధచేఁ బరుగిడివచ్చి నా పొత్తున భుజింపఁగంటివే. భక్తత్రా
దీక్షాబద్ధకంకణ హస్తమున నా కన్నమును దినిపించితివే? పిండి విస
చున్నప్పుడు నా చేయి కందునేమోయని నీవె వచ్చివిసరితివె. ఇది యంతయు
నిక్కవమా? కాక, స్వప్నగత వృత్తాంతమా! బాలకృష్ణుఁడవై సాక్షా
రించిన నాటి కరుణాకటాక్ష మిపు డేమాయె? భక్తత్రాణుఁడవయ్యు
గో డేల యాలకింపవు? కృష్ణా! కృష్ణా!! రావేమి? రక్షింపవేమి
నిష్కల్మషచిత్తంబున నీ పదాంబురుహంబులను హత్తించి, తదరిపాప
సేవనాకాంక్షనై బ్రతుకు నన్నే రక్షింపనివాఁడ వప్పట్ల ప్రహ్లాదాది భక్త
నెట్లు ప్రోచితివి? గజేంద్రుఁడు కుయ్యో! యనఁగనె, "వివాదప్రో
శ్రీకుచోపరిచేలాంచలమైన వీడక పరుగెత్తితివకొ! (ఇది సత్యమ
అస్థిరమై, మలభాండమైనదేహమును వీడి మృత్యువు జయించుటకే నో
లేదు. నీ భక్తురా లిట్టి పాపియని లోకులాడుకొనఁతలకు వెఱతును. నా
భక్తసంతతికిఁ జెట్టపుట్టునుగదా! నే నిట్లు మరణించిన జనాబాయి కపట
రాలు. స్వామిద్రోహినియని కవులెల్ల గ్రంథములఁ జాటరా? నాచరిత్రి
ముగాఁ బ్రదర్శింపఁబడదా? దీనరక్షకా! దేవకీనందనా! నన్నేమైనను
కొమ్ము. నీపాదములవీడను. నీ సంస్మరణ మానను.

(౧౫-వ అనుబంధము)

(పౌరులెల్లరు ప్రవేశించినపిదప, పటే లరుదెంచును)

పటేలు—ఈమె దోషిణియని మీరెల్ల రెఱిఁగినదియె.

ఇవిగో! యీ నగలనీమె దొంగిలించినది. ఈమె కింకెవరో తోడ్ప
యుందురు. వారలనీమె తెలుపక పట్టుపట్టియున్నది. అట్టి కలుషాత్మురా
శిరచ్ఛేదన మొనర్పవలయును. అదియేశిక్ష విధించితిని. తలారీ! నీ వీమె శిర
ఖండన మొనర్చుటకు సంసిద్ధముగనుండుము. జనాబాయి! ఇఁకనైనను చెప్పె
దవా? లేదా?

జనా—నే నేమియు నెఱుఁగను. ఇదియంతయు శ్రీ పాండురంగని చిద్విలాసమ
జగన్నాటకసూత్రధారున కిదియొక రంగకము. జంత్రపు బొమ్మలవలె
ట్లాడించుచున్నాఁడు. తన్ను దా మఱచి ప్రతిజీవి యీ నాటకమునఁ దత్తమది
భూమికను ధరించియున్నాఁడు. నే నెఱిఁగినది తెల్పితి. ఇఁక మీ యిష్టము.

పటేలు—(క్రోధముతో) నీ మిట్టవేదాంతమును నీ మిథ్యావాదమును గట్టిపెట్టుము
(భటులనుజూచి) మీ రీమెను నేర మొప్పుకొనువఱకు దండింపుఁడు.

భటులు—(కొరడాలతోఁ గొట్టుచుందురు)

పటేలు—ఇది తన పెంకెపట్టును విడువకున్నది. తలారీ! ఇఁక నీ పనిఁ దీర్చికొమ్ము.

తలారి—అమ్మా! ఇదో! ఒక్కనిముసంలో దేవుని తలఁచుకో.

శా. శ్రీకృష్ణ! యదువంశరత్న! సకలోర్వీనాథ సంస్తుత్య! రా
ధాకృష్ణ! ఋషిహృన్నివాస! సుజనోద్ధారా! మహాధీర, ధ
ర్మాకృష్టాత్మ! మహానుభావ! భవకర్మాతీత! యోగీంద్ర! ల
క్ష్మీకాంతా! కమలాక్ష! రావె నను రక్షింపంగ భక్తావనా!

—ఈ. చాలు చాలు సిద్ధముకమ్ము!

(తలారి జనాబాయి మెడపై వేటు వేయఁబోగా ఖడ్గము భస్మ మగును. లోఁ పెద్దధ్వనియగును. వెంటనే దివ్యకాంతి వెలువడును. నామదేవులు, రాధా యు, జనాబాయి తక్కఁ దక్కినవారెల్ల రంధులగుదురు.

కృ—(సాక్షాత్కరించి) జనాబాయినిబట్టుకొని (౧౬.-వ అనుబంధము) పౌరులారా! ఈ జనాబాయి నాభక్తురాలు. నే నీమె చరిత జగద్విదిత మగునట్లును, భూలో కమునం దాచంద్రార్కముగా వెలయుటకు నిట్టి విషమస్థితి గల్పించితిని. పర మపావను రాలగు నీ జనాబాయినిగొల్చు ధన్యులుఁగదు. మీరీమెను నిర్దోషినిగా మద్భక్తాగ్రేసరగాఁ దలంచిన మీకుఁ దిరుగ నయనదృష్టి గలుగును. జనా! నీ భక్తికి మెచ్చితిని. నీ జన్మముతరించె. నీజ్ఞానము ఫలించె. నీకును నాకును నభేదము. నీ కీదేహాంతమున ముక్తి లభించును. అంతఁజనకు జీవన్ముక్త వలెనే జీవితశేష మును గడిపి, పిదప నా యందైక్యము నొందుము. రే పిట కరుదెంచు నీతండ్రి కనుసన్నల మెలఁగుము. సృష్టియే కర్మ. కర్మలను వదలఁజలయు నని యెంచినను వదలవు. కనుక నాత్మజ్ఞాన చిత్త శుద్ధ్యనంతరము సయితము ఫలాశను వదలి ధైర్యముతో, నుత్సాహముతో, సర్వ సత్కర్మల నొనర్పవలయును. నిష్కామ మనఁగా నిష్క్రియకాదు. అతఁడు తన యావదాస్తిని స్వామి కైంకర్యమున కొసఁగియున్నాఁడు. కృతార్థుఁడైనాఁడు భక్తిఫలసారమును చవిఁగొనినాఁడు. ఏ చరిత వినిన వారికష్టము లీడేరును. పాపములు నశించును. మత్సందర్శనమున వీరును బాపరహితులగుదురు. నీకు శుభంబగు. నామదేవా! జనాబాయివలె నీ సతియు బుణ్యాత్మురాలు. మీయాదరణమున జనాబాయి తపము ఫలించినది. మీకుశుభంబగు. జనాబాయి! నీకేమివరము కావలయునోకోరుకొనుము.

నా—స్వామీ! పూర్వజన్మమున నేఁగోరినవరము నేఁడుఫలించె. ఇంకేమి కావల యును. నిష్కామబుద్ధితో నీ పదసేవన మొనర్పఁజేయ బ్రార్థితులు.

కృ—అదిసరి. మఱియేదైన నొక వరముగోరుము. ప్రసాదించెద.

నా—భగవత్కృపావీక్షణమున నిట్లగుఁగాక!

తే. గీ. పాపభీతియు, దైవసంప్రార్థనంబు
కలిగి వర్తించుజనులను గన్నబిడ్డ
లవలెఁజూచుచు రాజులు రాజ్యమేలు
చుండుగాకుత సతతంబు శోభగలిగి.

శ్రీకృ—అట్లగుఁగాక!

నామ—తథాస్తు?

మంగళము (తెరవడును)

పంచమాంకము సర్వంబును సమాప్తము.

గద్య:—శ్రీహరిహరనాథ కరుణాకటాక్ష వీక్షణానులబ్ధ సుకవితావిచిత్ర, భారద్వాజ గోత్రపవిత్ర, మహాకవి మేడిపల్లి నృసింహశాస్త్రి పుత్రపర్యాంచ గర్భశుక్తి ముక్తాఫల నవలానాటకహరికథేతిహాస గ్రంథరచనాప్రవీణ విద్వాన్, కవిరత్న, అష్టావధాని మేడిపల్లి లక్ష్మీకాంతప్రణీత శ్రీమజ్జనాబాయి నాటకమున పంచమాంకంబు సర్వంబు సమాప్తము

శ్రీ శ్రీ శ్రీ



## కృ తి స మ ర్ప ణ ము



సీ. తనుభిన్నమయ్యు నద్వైతసరణి నెవ్వ, రేకాత్మకాఁగూడి యొసఁగినారొ
కర్మసంచితముగఁ గల్గు నా జన్మకే, దంపతుల్ హేతువై తనరినారొ
కావ్యకర్తలునయ్యుఁ గావ్యభర్తలుకాఁగఁ, గవిత నా కెవ్వారు? గఱపినారొ
ఉగ్గులో శ్రీరాము నుపదేశమొనరించి, జన్మసాఫల్యంబు సలిపినారొ
తే. గీ. అట్టివారలు పూజ్యులు నైనవారు, పార్వతీ నారసింహుల పాదపద్మ
ములకు నీకృతినర్పించి మ్రొక్కువాఁడ, భక్తిశ్రద్ధల నానృణ్యపరత మిగుల

ఇట్లు ప్రియపుత్రుఁడు,
గ్రంథకర్త.

# శ్రీమ॥ నాగయ్యగారి ధర్మనిలయము

## వార్షికోత్సవము.

కీర్తికాయులు శ్రీ మటికె నాగయ్యగారిచే నిర్మింపబడిన ధర్మ
యమున ఈ ప్రమాధిసంవత్సర నిజశ్రావణ బ॥ ౧౦ శుక్రవారము
ను నిలయ గురుకులాధ్యక్షులగు శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్ర
గారి యాజమాన్యమున సికిందా్రబాద్, హైదరాబాదు వీరశైవ
జనస్తోమమునకు అత్యంత వైభవముగా సమారాధన నెరవేరిన
తెలుపుట కెంతయు సంతసమగుచున్నది. ఈసారి ఆశ్రమమంతయు
ాలేపనములచేతను రంగుపూతలచేతను చక్కగా అలంకరింపబడుటచే
ల భవ్యముగా మెరయుచుండెను. రెండుమూడు దినములు మొదటి
డియే పక్వాన్నముల సంసిద్ధతకై పనులు జరుగుచుండెను. ఉత్సవము
టికి ఉదయమునుండియే స్త్రీ పురుషులు బాలబాలికలు ఆశ్రమమున
మిగూడుచుండిరి. మధ్యాహ్నము ధర్మనిలయమందలి శ్రీ కాశీవిశ్వే
ర, ప్రసన్న వీరభద్ర, భద్రకాళీ విగ్రహములకు గురుకులచ్ఛాత్రుల
విధ్యుక్తముగ అభిషేకాదులు, అలంకారములు, చేయబడెను.
వరకు జనస్తోమము క్రిక్కిరియుచుండగా మంగళహారతీమంత్రపుష్పము
న్నత ధ్వనితో జరిగెను. తర్వాత ౧-౨ గంటలకు గణార్చన పంక్తి
జనము లారంభమై రాత్రి పదిగంటలవరకును జరుగుచునే యుండెను.
మారు నాలుగువందల గణసమూహము యుండవచ్చును.
సాదలకును యథాసాధ్యముగ అన్నదానము చేయబడెను. పక్వా
ది యాహారపదార్థము లన్నియు పరిశుభ్రముగను రుచికరముగను
డుటచే మిక్కిలి మక్కువతో మెక్కుచు వక్కాణించుచుండిరి.
త్రి ఒంటిగంటవరకు సికిందా్రబాదు వీరశైవ భజనసంఘమువారి
న సుశ్రావ్యముగా జరిగి శయనారతి, మంత్రపుష్పముల తరువాత
సాద వితరణముతో ముగించబడెను.

ఈ సారి గణార్చనాదికములు ఇంత ఉత్సాహకరముగా జరుగు
కు కారణము ముఖ్యముగా ధనవ్రయాదులైనను స్థానికులగు భక్త

మాహేశ్వర కుటుంబికులు రెండుమూడు దినములవరకు ఎడ తెగక సమ
భోజన సామగ్రిని సిద్ధపరచుటకై గొప్పగా పరిశ్రమించి యున్నా
వీరి సహాయమే దీనికి తోడ్పడినది. శుభకార్యముల శ్రీ నాగయ్యగా
ధర్మము నీవిధముగ వన్నెకు దెచ్చుచున్న శ్రీ శర్మగారి ప్రయత్నవిశే
ములను గూడ కొనియాడుచుండిరి. వీరశైవులలో నెవరి గృహ
లందైనను శుభకార్యములయెడ ఇటులే ఐకమత్యముగ పాల్గొని ప్ర
సార్థముగ నిర్వహించ గోరుచున్నాను.

"ఒక ఉత్సవభాగి"

---

# కీ॥ శే॥ సంగ్రామప్ప వకీలుగారు

నిజాంప్రాంతపు కర్నాటక మహారాష్ట్ర వీరశైవులలో స్వజా
యభ్యుదయమునకై షుమారు ౬-౭ సంవత్సరములనుండి అత్యంతమ
అభిమానోత్సాహములతో నిరంతరము శ్రమిసల్పినట్టియు, కార్యని
హణచాతుర్యము గలిగినట్టియు, ఉదగీర్ గ్రామ నివాసులు శ్రీశే
కార్ సంగ్రామప్ప వకీలుగారు ఇటీవల అకస్మాత్తుగ అకాల మృత
వుకు బలియైరని తెలుపుటకు విషాదమగుచున్నది. వీరివలన నాప్రాంత
వీరశైవులలో గొప్పగా సంచలనము కలుగుటయేకాక మున్ముందిం
వీరికీర్తి యుజ్జ్వల మగుననియే తలంపబడుచుండెను. కాని పరమేశ్వ
లీల విపరీతముగ పరిణమించినది. వీరశైవమత సిద్ధాంతములలో వీ
మాకును ఘోరమైన మతభేదముండెను. ప్రత్యక్షముగ చర్చించు కొ
వలయు నను ఉభయపక్షముల మనోరథములును ఈ విధముగ అ
మొందుట దురూహ్యాము. మతవైషమ్యముండినను మైత్రికి లోపమ
లేకుండెను. ఉన్నతుడగు ఇట్టియువక సోదరుని నిధనమునుగూర్చి
మాకు గలిగిన సంతాప మధికము. వీరి పరివారములో మా సా
భూతిని దెలుపుచు కైలాసవాసుని యాత్మకు పరమశాంతి ననుగ్రహించు
నట్లు పరమేశ్వరుని వేడుచున్నాము. —సంపాదకుడు

---

# మహాకవి భవభూతి నివాసస్థలము

## మాడపాటి హనుమంతరావుగారు

---

సుప్రసిద్ధము లగు నాటకముల రచించి, సంస్కృత వాఙ్మయము
న అజరామర మగు కీర్తిని సంపాదించి యిచ్చిన విఖ్యాత కవివరేణ్యు
డు భవభూతి నివాసస్థలమును గురించి విద్వాంసులు తర్క- వితర్క-
ములు సలిపియున్నారు.

ఈ విషయమున మహా కవికృతమగు నాటకము - మహావీర
చరిత్రము - నందున్న "అస్తి దక్షిణాపథే పద్మపురమ్ నామనగరమ్,
...."ఇత్యాది వాక్యముల ఆధారమున, ఇప్పటికాలమున "దక్కను"
అని పేర్కొనబడుచున్న ప్రాంతములోని పద్మపురము మహాకవి నివాస
మని నిర్ణయించిరి. భవభూతి కృతమగు మరియొక నాటకము -
మాలతీ మాధవము - నందు "దక్షిణాపథే విదర్భేషు..." అను
వాక్య ముండుటవలన ఈ యంశము మరింత విస్పష్టమైనది. ఈ
"విదర్భ"యనునది దక్కనులోని ఇప్పటి "బీరారు" (Berars) అను
ప్రాంతమే కనుక భవభూతి జన్మస్థాన మగు "పద్మపురము" బీరారులో
నున్నదని తేల్చిరి. అయినను, ఈ "పద్మపురము" అనునది ఇప్పటి
ఏ గ్రామని యూరని యింకను స్థిరీకరింపబడక యుండినది. (Padmapura
has not yet been identified) *

అదృష్టవశమున నీ "పద్మపురము" ఇటీవల పరిశోధింపబడి కను
గొనబడినది. ఇప్పుడిది యొక చిన్నగ్రామము. బెంగాలు నాగపూర్
రైల్వే (Bengal Nagpore Railway) మార్గముననున్న "ఆంగాన్"
(Amgaon) అను స్టేషనునకు మూడుమైళ్ళ దూరమున నున్నది. ఇది
మధ్యపరగణాల (Central Provinces) లోని "భండారా" Bhan-
dara) జిల్లాలోనిది. ఇటీవల బ్రిటిషు ప్రభుత్వమువారి ఆర్షశాఖాధి
కారులు (Archeological authorities) పరిశోధించి, "ఎనిమిదవ

---

*శారదారంజన్ రాయకృతమగు "Bhavabhuti's Uttara Charitam"
లోని పీఠిక, పుట. ౭

శతాబ్దమున యశోవర్ధ యను రాజు ఆస్థానమున కవిశేఖరుడుగా నుండి
భవభూతి నివాసస్థలమిదే'' యని యీ పద్మపురమును నిర్ధారణచే
దానిని పురాతన చారిత్రిక చిహ్నములుగా శాసనముక్రింద పరిరక్షిత
ముగా జేసియున్నారు. †

ఇది పరిశోధకులగు వారికి ఉత్సాహజనకమును, వాఙ్మయ
ప్రియులగు వారి కానందదాయకమును యగు విశేషము. అయిన
తెలిసికొనదగిన విషయము మరియొకటి కలదు. ''ఈపద్మపుర
తెలుగు ప్రాంతములోనిదా'' యను ప్రశ్నయొకటి యుద్భవించు
యదార్థమేమన, ఈ మహాకవి జన్మస్థానము మహారాష్ట్రదేశము లో
దైననేమి, తెలుగు దేశములోనిదైన నేమి, ఏ భాషా ప్రాంతములో
దైనను పూజార్హమే కాని, విఖ్యాతచరిత్రకారులగు, క్రీ. శే. కొమర్రా
లక్ష్మణరావు, ఎం. ఏ. గారు తమ హిందూదేశ కథాసంగ్రహములో
ఆరవ ప్రకరణమున "ఈతడు తెలుగు సీమను జన్మించిన వాడని డాక్ట
భాండార్కరు మొదలైన విద్వాంసుల అభిప్రాయమై యున్నది". అ
వ్రాసియున్నారు. (మొదటికూర్పు పుట ౧౬౮). ఎట్లైనను స
"పద్మపురము'' తెలుగు ప్రాంతములోని గ్రామమైనచో ఆంధ్రుల
వారికి సంతోషము అధికము కాగలదు. అది స్థిర పడకపోయినను, భ
భూతివంటి ప్రతిభాశాలియగు కవిశేఖరుని నివాసస్థలము యిదమిత్థమ
నిశ్చయమైనది గనుక హిందూదేశ వాసులగు వారందరికి నిది ఆనం
దాయకమై వర్తిల్లగలదు. సంస్కృత కావ్యరసాస్వాదనపరు లగ
వారికి ముందీ "పద్మపురము" యాత్రాస్థలము కాగలదని నమ్మ
విరమించుచున్నాను.

---

† ఈయంశములు మద్రాసునుండి వెడలు హిందూ దినపత్రిక (30-౮-౧౯3౯
లో ప్రకటింపబడి యున్నది.)

# గురు నిరూపణము

గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

ఇది కర్మభూమి. మన జీవనమే కర్మఫలము. కర్మముగిసిన దంటి
నమునుముగిసితి మన్నమాటయే! ఎట్టి సోమరిపోతైనను తినుట,
ంచుట, క్రీడించుట మొదలగు కర్మలనైనను చేయకయుండడు.
సామాన్య కర్మలయందును ఒక పద్ధతి (శిష్టమ్) కలదు. అది యుండుట
త్యము. ఆ పద్ధతి ఎంతటి శ్రేష్ఠమైనదై యుండిన అంతటి
ష్టతను జనులు మన కొసగుచుందురు. అందుచే నిట్టి పద్ధతి యలవ
కై గురువెంతయు మన కవసరము. కొందరాధునికులు స్వయం వివే
శక్తిగలవారల కా గురువు అనవసరమని చెప్పుచుందురైనను నేటి
పరిస్థితులంబట్టి "అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయం ధీరాః
తంమన్యమానాః" అన్నట్లు అజ్ఞానమున మునింగియు అహంకార
తమ్ము తామే విజ్ఞానశిఖామణులుగా తలంచు పండితమ్మన్యులే
కు మిక్కిలియై యుంట వారు వీరనక ఎల్లరకును గురు వావశ్యక
చెప్పుటయే యుక్తియుక్తము. పరిణతచిత్తులకు గురు వనవసర మని
కు వెంటనే తోచినను నిదానమున పరికించితిమేని వారికిని గురు
సర మనుట స్ఫురించకపోదు.

ఏలనన అపరిణతచిత్తులకు గురువు మానవరూపమున మాత్రమే
ధకుడై యుండ, పరిణతచిత్తులకు ప్రకృతి యందలి ఏవస్తువైనను
రువుగా పరిణమించి ఉపదేశించునదై యుండును. చెట్టునుండి పడు
డిన పండును 'న్యూటన్'ముని మహావిజ్ఞానవంతుని చేయగల్గినది.
ద్ధుడు, రోగి, పీనుగు, ఇవియే బుద్ధుని యందతులవైరాగ్యమును
గ జేసినవి. "......................ఏతత్తూత్కారతా ఘోర
ష్టలు మానంగలవాడ పక్షిగురువై సంధించె సద్బోధమున్." అని
యొకడు పావురమును తనకు గురువునుగా జెప్పికొనియుంట భార
మున ప్రసిద్ధము. ఐనను ఏపరిణతచిత్తులకో తప్ప ఎల్లరకును గురువు
మానవ రూపముననే ఆశ్రయణీయుడై యుండు ననుట తప్పనిసరి.

అందుననే "ఆచార్యవాన్ పురుషో వేద" అను వాక్యము గు
కలిగినవాడే పరమాత్మ నెరుగుచున్నా డనుటను వ్యక్తము శే
చున్నది.

'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.'

[ఓ అర్జునా! నమస్కారము చేతను, మాటిమాటికి చేయు ప్ర
చేతను, సేవచేతను, పరతత్త్వమును జూచిన జ్ఞానులు నీకు జ్ఞాన
ఉపదేశించెదరు.]

అను గీతావాక్యమును మోక్షార్థికి గురువుయొక్క ఆవశ్యకత
నిర్దేశించుచున్నది. అందుచే అజ్ఞానమును తొలగించి శివజ్ఞానము
ప్రసాదించు సద్గురువును మోక్షార్థి మొదలు సంపాదించి కొనవ
యున్నది. ఈ హేతువుననే గురువు అష్టావరణములందు మొ
వాడుగా గణింపబడుచున్నాడు.

మరియు 'గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మ
(భా. శా.) [తండ్రికంటెను, తల్లికంటెను. గురువెక్కుడు వా
నా మతము] అని భీష్ముడు చెప్పియుండెను. తలిదండ్రులు సంసా
ప్రవృత్తినే బోధించుచుండిరిగాని అందుచేనైన బంధమును పారమా
మార్గదర్శకుడైన గురువే పరిహరింప సమర్థుడౌచున్నాడు. గాన
భీష్మోక్తి ఎంతయు సమంజసమైయున్నది. ఇంతియగాక,

'అహమేవ గురు ర్భూత్వా దీక్షా శిక్షా విధానతః
భక్తాన్ మదేకశరణాన్ పారయామి భవాంబుధేః
(సూక్ష్మ ప. ౫)

[శివుడు పార్వతి నుద్దేశించి "దేవి! అనన్యభావముచే శరణాగత
లైన నాభక్తులను నేనే వారల గురువునై దీక్షాశిక్షా విధానము
వలన బోధించి, భవసాగరమునుండి దాటింపజేయుచున్నాను"] అ
సూక్ష్మాగమము నందును,

'పరిపక్వమలా నేతా నుత్పాదన హేతుశక్తిపాతేన
యోజయతి పరే తత్త్వే స దీక్షయాఽచార్యమూర్తిస్థః'

[ఆ శివుడు పరిపక్వదోషములుగల జీవులను పాశనివృత్తి కారణ
మైన అనుగ్రహశక్తి సంపర్కముచే గురుమూర్తి నధిష్ఠించి దీక్షచే
సర్వోత్కృష్ట తత్త్వమునందు జేర్చుచున్నాడు.] అని భోజరాజ కృతతత్త్వ
ప్రకాశికయందును చెప్పియుండుటచే గురు వన సాక్షాత్పరశివుడనియే
భావింపదగియున్నది. అందుచే గురుకృపలేక శివకృపయు లభించుట
అసంభవము. దీక్షామూలకముగ తనకు శివలింగమును ధరింపజేసి
సత్క్రియాచారముల నుపదేశించిన శ్రీ గురువును ఎవడు అహంకార
ముచే నిందించునో ఆ పాపి ముందు శ్మశానమందలి వృక్షమై పుట్టు
చున్నాడు. పలుమాటలతో నేమి? గురువుయొక్క క్రోధమునకు గురి
యైన పాపి నేడు లేకుండిన ముందైనను హీను డగుట సహజము. అం
దుచే శ్రేయస్సు నభిలషించు వివేక శీలున కెవనికైనను త్రికరణశుద్ధి
పూర్వకమగు భక్తితో గురువును సేవించి తత్కృపకు పాత్రుడవుటయే
శ్రేయము.

ఐన నాగురువు దేహేంద్రియాది వ్యతిరిక్తమగు ఆత్మను ఎరింగిన
వాడుగను, స్రక్చందన వనితాది విషయ వ్యామోహమునకు దూరుడు
గ నుండి, బాహ్యాభ్యంతర లింగపూజాధురీణుడై శివసిద్ధాంతతత్త్వము
నెరింగి, గురుపరంపరాగత సదాచారమున ప్రవర్తించువాడై యుండవల
యును. మరియు శరణాగత శిష్యులకు శివదీక్ష నొసగి లింగాంగ సామ
రస్య జ్ఞానమును ప్రస్ఫురింపజేయ సమర్థుడై కుమార్గగామి కాక కామా
దిషడ్వర్గమునకు చిక్కక శివాకారవృత్తి గలవాడుగను, అజ్ఞాన
ముచే స్వేచ్ఛానువర్తులగు భక్తసంఘముల శిక్షింపను, స్వసిద్ధాంతవిరో
ధి పూర్వపక్షమును ఖండింపను, అధికారముగలిగి శ్రీ రేణుక,
దారుక, ఏకోరామ, పండిత, విశ్వారాధ్య శివాచార్యులను పంచాచా
ర్యుల సంప్రదాయస్థుడును, మఠస్థలోత్పన్నుడును నగు వీరమాహేశ్వ
రుడై యుండవలయును. ఇట్టి పూజ్యగురుమూర్తియే ప్రతియొక వీర

శైవునకు నిర్మలభక్తిచే నవశ్యముగ నర్చింప నెంతయు తగియుండును.
ఇట్టి గురునిర్ణయమున-

'మాతృతః పితృతః శుద్ధః శుద్ధభావో జితేంద్రియః
సర్వాగమానాం సారజ్ఞః సర్వశాస్త్రార్థతత్త్వవిత్. ౧
పరోపకార నిరతో జపపూజాది తత్పరః
అమోఘవచనః శాన్తో వేదవేదాంతపారగః. ౨
యోగమార్గానుసంధాయీ దేవతాహృదయంగమః
ఇత్యాది గుణసంపన్నో గురు రాగమసమ్మతః.' ౩

అని శారదాతిలకము చెప్పుచున్నది. కొందరు దీక్షాగురువు, శిక్షాగురువు, జ్ఞానగురువు, అని గురువుల మూడు విధములుగ చె... చుండిరి గాని అది యసమంజసము.

'పితృభాతృకళత్రాణాం పుత్రాదీనాం తథైవచ
దీక్షాశిక్షావిధానార్థ మేక ఏవ గురు ర్భవేత్
గురవో యత్రబహవో భవన్త్యన్యోన్యభేదతః
వీరశైవ సదాచార స్తత్ర నాస్తీతి నిశ్చయః'

[తండ్రి, అన్న, భార్య, పుత్రుడు, మొదలైనవారలను దీక్షా శిక్షాదుల విధింప నొక గురువు మాత్రమే యుక్తముగాని పరస్పర భేదములచే కల్పింపబడిన యనేక గురువుల స్వీకరించుట వీరశైవ సదాచారమునకు విరుద్ధమైనదనియే నిశ్చయింప దగియుండును] అని సూక్ష్మాగమముయొక్క ఐదవ పటలమున జెప్పబడియున్నది. అందుచే వీరశైవు లెల్లరును ఒకడేయగు తమవంశపరంపరాగత శ్రీ గురువు వల్లనే దీక్షా శిక్షాదుల నందుట యుక్తము. పైన చెప్పబడినట్లు శివసంస్కారము నొనర్ప నధికారియగు దీక్షాగురువే శివశాస్త్రస్థిత రహస్యార్థముల బోధించు చుండుటచే శిక్షాగురువనియు శివాద్వైతజ్ఞానము ననుగ్రహించు చుండుటచే జ్ఞానగురువనియు చెప్పబడుచున్నాడు. అందుచే నిట్టి లక్షణ లక్షితుడగు గురువునందు—

యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః
(శ్వే. అ. ౬)

[సకల జగన్నియంత యగు పరశివునందువలె గురువునందును భక్తిగల పురుషునకు మాత్రమే ఆధ్యాత్మిక రహస్యముల ననుభవము కు తెచ్చుకొను సమర్థత గలుగునది] అను భావము మనోవాక్కాయ ములచే విశేషభక్తిగలిగి నడుచుకొను పుణ్యశీలుడు మాత్రమే శివ పకు పాత్రుడై అవ్యయానందము నంద గలిగియుండు నని వ్యక్తము యుచున్నది. శ్రీగురు విందుననే సర్వులకును సేవనీయు డనుట త్రముల ఘోషమై యున్నది. *

(* ఈ విషయమున నింకొక వ్యాసము రానున్నది. సంపాదకుఁడు.)

---

## చందాదారులకు సూచన

### కాగితముల ధర పెరిగినది

అనవసరమైన ఈ యుద్ధము హడావిడివలన అన్నివస్తువులకు రలు పెరిగినటులే కాగితముల ధరలును విపరీతముగ హెచ్చిన వనుటలో శ్చర్యము లేదు. ప్రప్రథమముననే మన 'విభూతి' కీ యుదంతము ంతాజనకముకదా! అయినను సాధ్యమైనంతవరకు చిన్నచ్చులో ముద్రించి లేఖనసామగ్రిని తగ్గించక కాగితములలో మాత్రమే సరి చుకొనవలసియున్నది. కావున 'విభూతి' పాఠకులు పరిస్థితిని గమ నించి మాకు నన్నివిధముల తోడ్పడగోరుచున్నాము.

పత్రికాధిపతి.

---

శ్రీ జగద్గురు పంచాచార్యేభ్యోనమః.

# శివదీక్షా విషయమున మాహేశ్వరులకు విజ్ఞ

శ్లో॥ కీటో భ్రమరయోగేన యథాభృంగోభవిష్యతి।
మానవః శివదీక్షాతఃశివో భవతి తద్ ధ్రువం॥ ౧౧

ఆర్యులారా? భువన ప్రసిద్ధులును శాపానుగ్రహశక్తి సం
న్నులును జగద్గురువులును నగు శ్రీ రేణుకాది పంచాచార్య లీ ప
పవిత్రమగు వీరశైవమతమును స్థాపించి వీరమాహేశ్వరులకు వంశప్ర
షులనదగు వీర, నంది, భృంగి, వృషభ, స్కంద, యను పంచగో
ములను బోధించి స్థాపించిరి. మనవంశములోని పూర్వపురుషు లందరు
సదాచార తపోబలములవలనను విద్యాగౌరవములవలనను లోకపూజ్యు
రాజగురువులై పంచపీఠాధిపతులై మహా వైభవముగా అష్టాదశ
ములతో పాదపూజలు చేయించుకొని రత్నములవలె ప్రకాశించి
కారణమేమనగా, వారందరును పరమైశ్వర్య సంపన్నమగు పరశివలిం
మును శాస్త్రవిధి ననుసరించి గుర్వాజ్ఞాధారకులై శివదీక్షా మంత్రో
దేశ పూర్వకముగ పూజించుచు సదాచారనిష్ఠగలవారై ఆయురా
గ్యభోగ భాగ్యములతో తులదూగి మిన్నలైరి. ఆ క్రమము మొన
మొన్నటి దాకను జరుగుచు వచ్చెను. కాని కలికాలప్రభావము చేత
కేవలము సుఖ మను భ్రాంతివలన ననాచారముల కలవాటు పడుటచేత
మాహేశ్వరులలో నైకమత్యముతప్పి,ఋణరోగ దారిద్ర్యములకునునిస్స
తానమునకును గురియగుచున్నారనినచో నాశ్చర్యములేదు. మన యి
యాచారములను పరిస్థితినిచూచి,వీరికి గురువులు గోత్రములు ఆచా
త్వము వేదాధికారము మున్నగునవి కలవా లేవా? శివదీక్షోపనయనము
మంత్రోపదేశము లెపుడు జరుగుచున్నవి? వీరి యాచారవిచారము
లెట్టివి ? అని పరమతీయులు ఆక్షేపించుచున్నారు. నిజముగ విచారించి
నచో మతగురువుల మగు మనకే యీ విషయములు సరిగ తెలియన

...లియవు. కొలదిగనో గొప్పగనో కంఠసాహిత్యము పేరి దీక్షాసంస్కా...ము జరుగుచున్నది కాని దాని స్వరూపము చాల సూక్ష్మముగ మారి...వుటచే క్రమమైన విధానమును తెలియక మనలోని హెచ్చుతచ్చు..., కారణమూర్తుల తత్త్వమును, పాదోదక ప్రసాదవిషయములను, ...హించలేక తగవులాడుచు వ్యర్థముగ నపహాస్యమునకు గురియగు...న్నాము. వీనికన్నిటికిని మనకు ముఖ్యసంస్కార మగు వీరమాహే...శ శివదీక్షా సంస్కారము చక్కగా జరుగనందువలననే యని గట్టిగా ...ప్పవచ్చును.

"దీయతేచ శివజ్ఞానం క్షీయతేచ మలత్రయః" మ్మని శ్రీమదా...ర్యులు సెలవిచ్చినట్లు ఈ శివదీక్షా సంస్కారమును శాస్త్రీయముగ ...ప్పక నెరవేర్చుకొనినచో ఋణరోగ దారిద్ర్యాది అశుభములు నశిం...చేగాక తేజః కీర్తివంతులై భోగభాగ్యముల ననుభవించి పరమ ...త్రమగు శివసాయుజ్యమును నిరాతంకముగ నందుకొనుటలో సంది...ములేదు. కావున నిట్టి దీక్షాసంస్కారమును ఆచరించుటకై మన ...లో నందరితో సంప్రదించి ఒకసక్రమమైన పద్ధతి నేర్పరచగోరు...న్నాను.

ఇట్లు,
ఒక మాహేశ్వరుడు.

---

# ద్రవ్యదాతలు

'విభూతి' మహారాజ పోషకులగు శ్రీ నేలవెల్లి కోటయ్యగారు ...మగ్గిరాల) ప్రథమ బహుమానముగా నూరు రూపాయిలను పంపించి...రు. వీరు గొప్ప స్వమతాభిమానులు. సహృదయులు. అయాచిత...ముగా తమ విధిని నెరవేర్చి యుపకార మొనర్చినారు. శ్రీ చిలువూరు ...మార బసవయ్యగారును తమ వాగ్దానము పదిరూపాయిలను పంపి ...హాయ్యపడినారు. తక్కినవారును తమ తమ సహాయములను త్వరగా ...పి యుద్యమమునకు దోడ్పడ గోరుచున్నాము. —సంపాదకుడు.

# కుతర్కము

కవిరత్న లక్కన మల్లికార్జునుడుగారు

క. నిరసింతురు తొలిధర్మము
నిరసింతురు బుధులమాట నిర్మలనిష్ఠల్
నిరసింతు రిల కుయుక్తులఁ
గరపుచును వితండవాదకరు లెన్నంగన్.

క. దూరాలోచనలేకను
చారుతరంబైన శాస్త్రసారము గనకన్
కోరికలకుఁ దగురీతిని
క్రూరాత్ములు జెప్పుచుందుర్ కుటిలప్రౌఢిన్.

క. మతధర్మాచారస్థితి
హితమార్గము గానలేక హీనపుమతిఁ దా
మతికుల నిందించుచు దు
ర్గతికిని బాల్పడుదు రీర్ష్యగర్వంబులతోన్.

క. అన్నియు నీశ్వరసృష్టియె
అన్నియు సమమంచు నంతె యనఘం బనుచున్
గ్రన్నన నియమము లేకయె
దున్నలవలె మెలగుచుంట దోసముగాదే.

క. అందరి తనువుల రక్తము
చిందునుగా హెచ్చుతగ్గు చెందునె యని వా
కొందరు క్రియలకు నెడమై
యందురె కరి కిరియు సదృశమంచును విబుధుల్.

# హరిశ్చంద్రోపాఖ్యానము

ఆంధ్రోపన్యాస నిపుణ, ఆవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు



శ్లో॥ జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,।
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్॥

భాషాప్రపంచమునకు వెలుఁగును ప్రసాదించువాఁడు కవి. అతని దృష్టిలోఁ ...కాది బ్రహ్మపర్యంతముం గల సమస్త జీవరాసులు నాట్య మొనరించుచుండును. ...హములు, భూమ్యాకాశములు, అష్టదిక్కులు, — సర్వభూతప్రపంచము గతి ...వడచుచుండును. ఒకవేళ గతులు తప్పెనేని కావ్యరూపమున గతులు నేర్పి ...చుచుండును. గతుల నేర్పి, నీతులబోధించెడి కావ్యనిర్మాత లేనిచో, యీ ...నమున నిలుచుండుటకైనను యే ప్రాణికిని చోటులేదని గట్టిగ నమ్మవచ్చును.

కాంతాజన సమ్మితంబగు కావ్య మాతని సొత్తు. కావ్యము నవకుసుమకోమల ...ంబగు కాంతాస్వరూపము. పురుషసదృశములు వేదములు. పురుషునిఁ గోరు ...వరు? కాంతలను సమస్త భూతప్రపంచముఁ గోరును. దానంజేసియే మానవు ...నెరుచులఁ దెల్పవలయునన్న కవిబ్రహ్మలు రసాత్మకముగఁ గావ్యస్వరూప ...లను సృష్టిజేసి లోకమున కర్పించుచున్నారు. ఈ కావ్యకాంతలు చేయరాని ...లేవు. సర్వమును చక్కంజేయును. శాసనముకన్న బోధ యెక్కువదిగదా! ...కారములగు వేదములు శాసనతుల్యములు. కావుననే వేదములనుజూచి భయ ...దురు. కావ్యములఁజూచి భయపడుటకు మారుగ ప్రేమింతురు. శిరసావహిం ...కారణము? కావ్యము కాంతాజనసమ్మితము. కావుననే దానికింతటి యౌన్న ...ము చేకూరినది. మనమింతవఱకు నేర్చిన నీతులు, నడఁచెడినడఁతలు — సర్వము ...లోకరయే. కావ్యము రసాత్మక నీతికథా ప్రేమమయము. కాంత ప్రేమమయము. ...స్తవ భేదములేదు.

ఇట్టి దృష్టితోడనే కావ్యనిర్మాతలను "కవిబ్రహ్మ"లని పిలచిరి. ఈనామము ...కవులపట్ల సార్థకమే. సృష్టికర్తలు, పైఁగా శిల్పులు లోకమును భ్రమయింపఁ ...దురు. అంతలో వైరాగ్యమొందునటులఁ జేయును. వేయేల? అతఁడు తలఁచిన ...ప్రత్యక్షదైవ స్వరూపులగు సూర్యచంద్రాదులే గతులఁదప్పి యంతర్ధాను లగుదురు. ...గారేచనిచో గవిగాంచునేకదా! ఇంతకు యభినవ బ్రహ్మలు కావ్యనిర్మాతలు.

కావ్యమును వ్రాయువారెల్లరు నొక కథను మదినిడుకొని, నవరసములు వెల్లి ...మనటుల నీత్యాత్మకముగ, నౌచిత్య విచారమును సేయుచు వ్రాయుచుందురు. ...పాఠకుని చిత్తస్థైర్యములను పరీక్షించును. తన భానుకిరణ ప్రసారజాలమున ...పఁజేయును. అతని పరీక్షలకు నెగ్గినవాఁడు సర్వకక్ష్యలయం దుత్తీర్ణుఁడే. లేనిచో ...హీనుఁడే యగును.

కవి సూర్యమూర్తి, ఛందోవ్యాకరణాది లక్షణములు, నవరసములు, వర్ణ
లాతని కిరణ సమూహము. ఈ కిరణజాలమునుండి బయల్వెడలిన తేజఃపుంజమే క
సానపై మెఱుఁగుఁబెట్టఁబడి వస్తువుగ సంతరించిన ప్రతిబింబము కావ్యస్వరూపము.
తీక్ష్ణ స్వరూపమును శాంతిపరుపఁ గలిగినది కావ్య మొక్కటియే. ఈ కావ్య
లేనిచో నాతని కిరణసమూహము లోకులను, లోకములను, లోకపాలురను భస్మీప
మొనరించును. ఇట్టి శక్తుల నలవరించుకొనుట యందే వారి గొప్పదనము కావ్య
గలదు. వేములవాఁడ భీమకవి, తురగా రామకవి, డిండిమభట్టు గాఁగల తెలుఁగుక
కవిరాక్షసులుగాఁ బరిగణింపబడిన దీశక్తిచేతనే యని గ్రహించుట లగ్గు.

కవి మన యానందమునకో, తన యానందమునకో తనచే సృజింపఁబడిన కా
కాంతను లోకుల కర్పించి, తాను కేవలము జడపదార్థమువలెఁ జూచుచుండును. అ
డటుల చూచుటయందే యానందతత్త్వము గోచరించుచున్నయది. ఎంతకాల
యానంద పరతత్త్వ దృష్టిలో నాతఁడు చలింపఁడో యంతకాలము లోకమునకు
ములే యొనఁగూడును. లేనిచోఁ దీవ్ర వాతాతపములు, భయంకర మారీ
కాదులు, అధివ్యాధులు, ప్రళయాగ్ని తుపానులు గాఁగలవి పరంపరగా సంభవి
చుండును. ఎచ్చోటవినినను యాక్రందనస్వనులే! ఎచ్చోటచూచినను పీనుఁగుపెంట
అతని కావ్యకాంత చల్లనిచూడ్కులతో హాయిగఁ బాడుచు భావారంగమున న
మొనరించుచున్న దేని నిత్యకల్యాణములతోఁ బచ్చని తోరణములతో దేశము క
లాఁడుచుండును. ఎచ్చోటవినినను కావ్యకన్యల గాంధర్వాభినయములు, నవరస
మంజీరధ్వనులు వినవచ్చును. ఏ వంక బరికించినను కావ్యకన్యల స్వరూపముల కాం
పుంజములే గోచరించును. అట్టి యానంద పరబ్రహ్మతత్త్వమునందే కవులు, గా
కులు "ఆనందో బ్రహ్మేతివ్యజానాత్" యనుబుద్ధులఁ గీర్తించుచుఁ గీర్తికాయు
సుస్థిరముగ స్వర్ణసింహాసనముల నలంకరించి దివ్యలోకరాజ్యముల నేలుచున్నయది.

భావనాపరంపరశక్తిని మహాకవుల కుగ్గుపాలతో తెలుఁగు తల్లులు పోసిపెంచి
వారిచేతి చలువయే మన కింతవఱకును మనుటకుఁ జీవనాధారమైనది, మహాకవులకు జీవ
ధారములు కావ్యములు. కావుననే వాల్మీకిమహర్షి నుండి నేఁటిదనుకఁ గావ్యపు
ద్యాన విహారభూము లనంతములుగఁ బెరిగినవి. ఈ యుద్యానవనములఁ బుష్పవ
రాల్చుచు, సౌరభమును వెదజల్లుచు ననేకజాతుల పుష్పములను ప్రసాదించు
సంస్కృతాంధ్రములయందసమానకీర్తి ప్రతిష్ఠల నందింపజేసినది కావ్యకాం
కావ్యకాంత విహారపీఠభూములలోఁ దెలుఁగుబాసను యనేక పుష్పజాతు లుద్భవిల్లి
ఈ పుష్పజాతుల సమూహమే నవరసములు ఛందోవ్యాకరణాది లక్షణములు. తల్లక్ష
ముల కూర్పులే కబ్బములు.

ఇట్టి కబ్బములు తెలుఁగుబాసను వేనవేలు గలవు, వానిలో నీ హరిశ్చంద్రో
పాఖ్యాన మొక్కటి.

ఇమ్మహాకావ్యమును రచించినది శంకరకవి. ఈతని జీవితాద్యంశములను గనుం
హరిశ్చంద్రోపాఖ్యానమునం గల యాధారములే కాని, యితరాధారములు
. వానింబట్టియే నిర్ణయింపవలసి యున్నది.

శంకరకవి దేచనామాత్య పుత్రుఁడు. ఆరువేలనియోగిశాఖాబ్రాహ్మణుఁడు.
స్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రాలంకారుఁడు. ఇట్లని యీ క్రింది యాశ్వా
తే గద్యమువలనఁ దెలియనయ్యెడిని.

"ఇది శ్రీమదాపస్తంబసూత్ర పవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకలసుకవి
మిత్ర దేచనామాత్యపుత్ర వినయవివేక విద్యాలంకార శంకరకవి నామధేయ
తంబైన హరిశ్చంద్రోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు—"

కవి యెచ్చటివాఁడు?

కవి గ్రామనివాసమును గూర్చి బ్రౌన్ దొరవారు, నెల్లూరి మండలమునకుం
నవాఁడనియుఁ గావ్యమునకు నెల్లూరి కావ్యమనియు లిఖించిరి. వీరిట్టుల లిఖించు
హేతువులేమైన నున్నవేమో తెలియరావు. గ్రంథస్థ పద్యములఁబట్టి చూచిన
తి, తనకు బంధుగుఁడైనట్లును సాదరపూర్వకముగాఁ గృతి నిమ్మనినట్లును వ్రాసు
ను గోదావరిమండలములోని 'కారొల్లను' గ్రామమునకుఁ గృతిపతి యధిపతి
ట్లును లిఖించినాఁడు.

గీ. మతి వితర్కింపఁ గేవల మంత్రిమాత్రుఁ
డే ధనంజయుబాహు శౌర్యాధికుండు
సత్యవతిఁ ననుఁ డీమారి శాసనుండు
హితవచోహారి బాచయ యెల్లశౌరి. పీఠిక 50

వ. అమ్మంత్రి నిధానంబునకు నిజస్థానంబు. 51

మ. అరవిందాసన వాసవాద్యమర లోకారాధ్య కరోట్కటకే
శ్వర కారుణ్యపదాభిరక్షితము భాస్వద్దీప్తి మహాభూసురో
త్కర నిత్యశ్రుతిపాఠ నిస్వన ముదాత్త శ్రీ నజస్రంబు ని
ద్ధరణిం బేర్కొనఁ నొప్పుఁ గారొల్లను గోదావర్యుపాంతంబునన్. 52

.. ఈ పద్యములంబట్టి చూడఁగ నీడూరియెల్లన కారొల్లను గ్రామమునకుఁ గరణ
యుండినట్లు తోఁచెడిని. లేనిపక్షమున నింతదనుక గోదావరి మండలములోఁ
రొల్లను అనునదియే చిన్న సంస్థానముగానైనను నుండియున్నట్లు వినియుండ
ు. ఆ కాలమునుండి నేఁటిదనుకఁ దెలుఁగుకవులు క్షుద్రత్వదోషమునఁ గృతి
ల్ఁ దార్చుచు లేనివికొన్ని, యున్నవికొన్ని కలిపి యిచ్చవచ్చినట్లు పొగడుచుం
ట దురాచారమైనది. వీరి దురాచారణ పంక్తియే వేదఘనాపాఠీలకును పట్టుకొని
ల నేఁడేపించుచున్నయది. ఇంతకన్నఁ గృతిపతి సంస్థానాధీశ్వరుఁడనిగాని, రాజు

వద్ద నుండెడి మంత్రియనిగాని, తలంచుటకు వీలులేకయున్నది. అంతియ "అమ్మంత్రి నిధానంబునకు నిజస్థానంబు" అని వ్రాయుటచేతను, కర యూహించుటయే సమంజసముగా నున్నయది.

కృతిపతి యాదూరియెల్లన బంధువని యీ క్రిందిపద్యము వ్రాసుకొ డుటంబట్టి కవియుఁ గొల్కొలను గ్రామమునకు సమీపమునందో, కొంచెమ ముగనో నివసించువాఁ డగుచున్నట్లు యూహింపవచ్చును.

మ. ననుఁ గౌండిన్యమునీంద్ర గోత్రజు సుధాంశుస్సింధుకల్లోల తు
ల్య నిరాఘాటవచో ధురంధరుని దేచామాత్య సత్పుత్రుఁ బా
వనచారిత్రు శశాంకమౌళి పదసేవా లబ్ధసాహిత్య స
ద్ధనుని న్బంధువి ధేయు శంకరకవి న్దాక్షిణ్య పుణ్యాధికుఁ.

తే. మమత రావించి యర్ధాసనమున నునిచి
తత్పరత మీఱ గంధాక్షతంబులాది
గాఁగఁ గర్పూరతాంబూల కనకభూష
ణాంబరములు దనియ నందందయొసఁగి.

ఇంతియేగాని, బ్రౌన్ దొరవ్రాసినట్లు నెల్లూరిమండలమునకుం జెందిన కాఁడు. మఱియుఁ గోదావరిమండలములోనిఁ 'బల్లికురువ' 'పెండెకట్ల' మొ గ్రామములందుఁ గృతిభర్తకు యిచ్చి పుచ్చుకొను బాంధవ్యములున్నట్లు కృతిపతిన వర్ణనమునందుఁగలదు. ఏవంవిధకారణములచేఁ గవి గోదావరిమండలమువాఁడు సందియములేదు.

జీ వి త కా ల ము

కవి జీవితకాలమున కీ గ్రంథములో పంచమాశ్వాసాంతమున గల యీ పద్యమువలనఁ గోలకొండనవాబగు మహమ్మద్ కులికుతుబ్‌షా కాలమున నున్న దెలియుచున్నది.

క. అలఘు ప్రతాపకుతుబన
మలకేంద్ర కృపాసముద్ర మహిమాన్విత కో
ర్కొలని గ్రామనికేతన
జలసీమారక్షణైక చాతుర్యనిధీ.

దీనింబట్టి చూడ గోలకొండనవాబగు మహమ్మద్ కులికుతుబ్‌షా క్రీస్తు 1580 మొదలు 1611 సంవత్సరమువఱకు రాజ్యముచేసినవాఁడు. కుతుబ్‌షాను తెల కవులు 'కుతుబనమలకేంద్రుఁడని'యే వాడుచు వచ్చిరి. గంగాధరకవితపతీసంవ పాఖ్యానమున.

"అష్టదిగ్గజులను దనకరియుఁ గోరు
వెట్టికాపులఁజేసి ముప్పేట్టిగొనియె

నితరధరణీతలాధీశు లెవ్వ రీడు
పృథివి గుదుపనమలుకచక్రేశ్వరునకు.''

అని వ్రాసియున్నాడు. రామరాజభూషణుఁడును వసుచరిత్రమున నిటులే వ్రాసియున్నాఁడు. మఱియుఁ దపతీసంవరణోపాఖ్యానమునందే.

"అకుతుపశాహి కుదయించి రనఘయశులు
మూఁడుమూర్తులవలెఁ జగన్మోహ నిధులు
ఘనవివేకులు హైదరుఖాను విభుఁడు
జంసతమహీంద్రుఁ డిభరామచంద్రుఁడనఁగ.

అని గంగాధరకవి వ్రాసియున్నాఁడు.

కుతుపషాహిపేరే సుల్తాన్ కూలికుతుబ్ షా. ఇతనికి ముగ్గురు కుమారులు. ...ఁడవవాఁడు యిబ్రహీమ్ కుతుబ్ షా. ఇతని కుమారుడే మహమ్మద్‌కులికుతుబ్ షా. ...ని యాదరణమునసే యీడూరి యెల్లన మనినది. తెలుఁగుకవులు కుతుబ్ షా, యను ...మునకే కుతుపనమలుకచక్రేశ్వరుఁడని వాఁడిరి. ఈ పేరు కుతుబ్ షా, యనువా ...కిని చెల్లవచ్చును.

శంకరకవివ్రాసిన కుతుబనమలకేంద్రుఁడగు మహమ్మద్ కులికుతుబ్ షా క్రీ.శ. ...80 మొదలు 1611 వఱకు రాజ్యమొనరించె గావున శంకరకవి యీ కాలమునం ...డి యుండవచ్చునని నిర్ధారణ చేయవచ్చును. కెండియు బ్రహ్మశ్రీమద్దులపల్లి గురు ...బ్రహ్మశర్మగారు వారి రామదాసునాటకము పీఠికయందు గోలకొండ నవాబులపట్టిక ...కదానిని చూపెట్టిరి. అందు కృష్ణాడిస్ట్రిక్టుమ్యాన్యుయలున నిట్లు కలదని నీ క్రిందివిధ ...గ వ్రాసినారు.

5. "మహమ్మద్ కులికుతుబ్ షా. (1580-1611) ఇతఁడు ఇబ్రహీం ...మారుఁడు. తండ్రి పిదప పీఠమెక్కి పాలించి 1611 డిశంబరు 17-వ తేదీన ...మృతినొందెను.''

దీనింబట్టి చూచినను శంకరకవి, కృతిభర్తయగు యీడూరియెల్లన క్రీస్తుశకము ...పనారు పదునేడవ శతాబ్దముల నడుఁగాఁ బైకాల మధ్యభాగములయం దున్నవాడని ...ల్లడి యగుచున్నది.

## గ్రంథ ప్రశంస

ఈ హరిశ్చంద్రోపాఖ్యానము సర్వవిధముల నుత్తమకావ్య మనుటకు సంది ...యములేదు. ఇందుఁగలకథ పేరునుబట్టియే తెల్లమగుచున్నయది. కవిత, సానపైరాపిడి ...రాటదీ. మొక్కవోని పటుత్వశక్తిగలది. కాంతిమయమైనది. రసభూయిష్ఠము. ...మృదుమధుర ద్రాక్షాపాకమున హృదయంగమముగ నున్నయది. లక్షణయుక్తముగ ...లయుచున్నది. అందందు పొదుగఁబడిన వర్ణనములు రసపుష్టిచే నొప్పారుచుఁ దార

కలవలె స్వభావసిద్ధముగ నున్నయవి. నీతులు, ఉపమానములు చెప్పకు కం...
అందందుంగల వర్ణనాదికముల బరికింతము.

చ. మదనవిరోధి దాపససమాజము పూజయొనర్చు దాఁక ష
ట్పదములు పుష్పగుచ్ఛములపైఁ భ్రమరింపవు చంద్రశేఖరుఁ
ముదమున మజ్జనంబు మునిముఖ్యులు సేయక మున్న హంసము
ల్గదియఁగఁబోవు తామరకొలంకుల కవ్విపినాంతరంబులన్. 1-

రాజ నిరసనము:—

ఉ. ఒత్తుగ మాంసము న్మడుగుటో గిరముఁ ఘృతశర్కరాదులున్
గుత్తుక బంటిగా మెసఁగి క్రొవ్వి వధూరతితంత్రలీలలన్
మత్తిలి దేహముల్మఱచి మాటికిబొంకు నృపాలకోటికిన్
సత్తుదలంప నెక్కడిది సంయమి నీకిటుపల్కఁ బాడియే. 1-

వసంతవర్ణనము:—

చ. ప్రసవిత కింశుక ప్రముఖపాదపజాలము పాంథలోక మా
నస పరితాప కారణము నందిత కోకిలకీర శారికా
భసలము చందనాచల నభస్వదుదారము వచ్చెఁ జైత్రమ
య్యసమశర ప్రతాపము మహోభ్యుదయంబును బొందుచుండఁగన్. 1-1

అస్తమయవర్ణనము:—

ఉ. పంకజగర్భ సీమ మధుపంబులు వృక్షములందుఁ బక్షులుం
బంకరుహాక్షులందు రతిభర్తయుఁజేరి వసింపనొప్పె న
ప్పంకరుహాప్తు డస్తగిరిపై గడుమందములైన రశ్ములన్
మంకెనపువ్వుగుత్తి క్రియ మండలమంతయుఁ గుంపు లీనగన్. 1-1

చ. తరుణవయస్కుఁడైన హిమధాముని మీఁద మనంబు నిల్పి యం
బరసతి దన్ను వృద్ధుచు మానఁదలంచిన జాలసిగ్గునం
ద్వరితగతి న్మునింగిన విధంబునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకె భా
స్కరుఁడు గుముద్వతీతతి ననంగ వికాసక శామిషంబునన్. 1-15

క. అనుపమ తేజోనిధియగు
దిననాధుని మహిమ రాశిదేరిన చందం
బున సాంధ్య రాగదీధితి
గనుపట్టె నవీనకింశుక ప్రసవరుచిన్. 1,15

ప్రపత్తి కుదాహరణము:—

తె. తాపసోత్తమ నీదు చిత్తంబునాదు
భాగ్య మిందాద్రిది దేవతా ప్రణుతిఁగన్న

నిన్ను శరణంబు వేఁడెద నీళ్ళుముంపు
పాలముంపుము వేయును బల్కనేల? 2-170

(కే)యమునకు:—

తే. కులము దిగఁద్రొచి మీ మాలెతల వరించి
కొంచు గీర్వాణలోక సౌఖ్యంబు లొల్లఁ
బంతమైన రాజ్యమును వర్జింతుఁగాని
చలముకొని యెన్ని చెప్పినఁ గులమువిడువ. 2-183

(రా)వర్ణనము—

సీ. కంధరపటల సంకాశంబులగు నంధ
కారము ల్తోరణ గట్టె దిశల
వ్యోమసీమంబెల్లఁ బాహెర్యై తారక
స్తోమము ల్నిండి తోడ్తోనఁ బొదలె
విరహాగ్ని శిఖలచే వేఁగి రథాంగ ప
రంపర ల్మిగుల దుఃఖింపఁదొడఁగె
ఘీకరానేక వల్మీకరంధ్రంబులు
వెడలి చరించె దర్వీకరములు

గీ. పెల్లు ఝిల్లీవిరావము ల్పిక్కటిల్లె
మిగులఁదఱచుగ ఘూకము ల్మెలఁగి యాఁడె
నిబిడముగ శాకినీ ఢాకినీ పిశాచ
భూతవేతాళ సంచారములు చెలంగె. 3-68

(మా)లపల్లియవర్ణనము—

సీ. బహువిధ పశుకళేబర సమాకీర్ణంబు
దుర్గంధలహరికానర్గళంబు
పలల భక్షణ కుతూహల సారమేయంబు
కాక గృధ్రానీక కలకలంబు
మక్షికాచ్ఛాదిత మాంసతోరణరాజి
చత్వరాస్తరణార్ద్ర చర్మపటలి
ప్రబల విట్చరఘుర్ఘురధ్వానపూర్ణంబు
సవిధతమాపాంగ సంభృతాస్థి

గీ. వారుణీపాన కృత్యదుర్వార జనిత
మదభరాలస చండాల మండలేత
రేతరానర్థ కలహసంజాతరవము
గనియె మాతంగవాటము మనుజవిభుఁడు. 5-8

ఇంకను వ్రాయవలయు ననియే యాశయము. కాని విస్తరభీతిపై వెనుక వేయుచున్నాను.

## గ్రంథ మను వా ద మా ?

అను విషయమునుగూర్చి వ్రాయవలసివచ్చినపుడు ప్రత్యేకముగ నీ విషయమునే వ్రాయవలసియుండును. వేదములందుఁగల కథ పురాణములయందు వ్రాయఁబడునాఁటికి చాలభాగము మార్పునొందినది. పురాణములనుండి ప్రబంధరూపముం దాల్చునాఁటికి మూలము పూర్తిగా మార్పు జెందింపఁబడి, యిప్పుఁడు మనము బజారులలోఁ జూచుచున్న కథావిధానముగాఁ దయారైనది. వేదములందలి హరిశ్చంద్రునకు చంద్రమతీ లోహితులులేరు. నక్షత్రకుని బాధలేదు. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునాఁటికి, చంద్రమతీ లోహితులు, నక్షత్రకునిబాధలు మెడకుఁ జుట్టుకొనినవి. ఈ విధ కారణములచే నీ హరిశ్చంద్రోపాఖ్యానము స్వతంత్ర గ్రంథమేయని చెప్పవలసి వచ్చుచున్నది. అనువాదముమాత్రము కాదని విజ్ఞాపనము.

కవితనుగూర్చి యిదివఱకే వ్రాయబడియున్నందున నింతటితో విరమించుచున్నాను.*

---

*గౌరనకవి కృతమగు హరిశ్చంద్రోపాఖ్యానము (ద్విపద కావ్యము) మరియొకటి కలదు. దీని పరిచయము ముందు ప్రకటింపబడును. —సంపాదకుడు

స్తత్వాత్, లోకే రాజాజ్ఞావిహితరాజచిహ్నానామేవ భృత్యైః స్వీకార
్శనాత్, పూర్వోక్తవేదశాస్త్రపురాణాగమాదిషు శివలింగభస్మ
ద్రాక్షధారణవిధాయకవిధ్యుపదేశాత్, భుజగధారణవిషభక్షణ
్యదర్శనాత్, బ్రహ్మవిష్ణ్వాదీనాం సర్వేషాం పూర్వభక్తానాం శివలిం
భస్మరుద్రాక్షధారణస్యైవ దర్శనాత్,

శివాజ్ఞాపాలనార్థాయ శివభక్తః శివవ్రతీ।
లింగరుద్రాక్షభస్మాని శివచిహ్నాని ధారయేత్॥
రాజాజ్ఞోల్లంఘనాల్లోకే యథా దండో విధీయతే।
శివాజ్ఞోల్లంఘనాద్దండో రౌరవం నరకం తథా॥

లైంగే దర్శనాచ్చ।

సగుణస్య మిథ్యాభూతత్వాత్ కథం తదుపాసనస్య నిర్గుణచైత
ప్రాపకత్వమితి చేన్న - "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం
లోచనం నీలకంఠం ప్రశాంతం, ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూత
యోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్" (కైవ. ౧-౭) ఇతి కైవల్య
శ్వేతాశ్వతరాద్యుపనిషత్సు సగుణోపాసనస్యైవ హేయగుణరహిత
్వసాక్షిచైతన్య ప్రాపకత్వోపదేశాత్, "స్థిరేభిరంగైః పురురూప
్రః" (ఋ. ౨-౭-౧౭) ఇతి రుద్రసూక్తాదిషు పరమేశ్వరశరీరస్య
్యత్వోపదేశాచ్చ।

న చాగమానామాలమోత్సవప్రతిష్ఠాంశ ఏవ ప్రామాణ్య
ి వాచ్యం, గాయత్ర్యాదిసర్వమంత్రాంగన్యాసకరన్యాసధ్యానము
ద్రాకుండమంటపాదీనామాగమప్రమాణవిధేయత్వాత్ తదస్వీకారే
్యయాగ మంత్రఫలసాధనత్వాయోగాచ్చ బ్రహ్మవిద్యాయాం
శాంభవదీక్షితస్యైవాధికారిత్వమితి నిర్ణీయతే.

నను- "యస్యైతే చత్వారింశత్సంస్కారా న చాష్టావాత్మ
గుణా న స బ్రహ్మణస్సాయుజ్యం సాలోక్యం చ గచ్ఛతి" (గౌతమ

ధర్మసూత్ర ౮-౨౨) ఇత్యాదినా గర్భాధానాదిసకలకర్మణాం దురితక్షయద్వారా పరమేశ్వరప్రాపకత్వోపదేశాత్, "విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ" (ఈశా. ౧౧) "తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ" (బృ ౪-౪-౮) "సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం" (ముండక ౩-౧-౫) ఇత్యాదిజ్ఞానకర్మసముచ్చయశ్రుతిదర్శనాచ్చ ధర్మజిజ్ఞాసానంతర్యం యుక్తం.

కిం చ - "తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" (ఛాందోగ్య ౮-౧-౬) ఇత్యాదినా కర్మఫలానామనిత్యత్వం, "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన (ముండక ౧-౨-౧౨) ఇత్యాదినా కర్మఫలేషు వైరాగ్యం, "శాంతో దాంతః" (నారదప... ౧-౧) ఇత్యాదినా శాంత్యాదికం, "న స పునరావర్తతే" (ఛాందోగ్య ౮-౧౫-౧) ఇత్యాదినా మోక్షస్య నిత్యత్వంచావగమ్యతే. అత ... తేచ్ఛాసంభవాన్ముముక్షుత్వం సూచితం. తస్మాదేతత్సాధనచతుష్టయానంతరం వా బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా లింగధారణస్యాపి కర్మత్వేన మోక్షోపయోగిత్వాభావ ఇతి చేన్న.

"నాస్త్యకృతః కృతేన" (ముం ౧-౨-౧౨) ఇతివాక్యేన ప్రాకృతస్యైవ కర్మణో నిషిద్ధత్వాత్, "అమృతస్య దేవధారణో భూయాసం" (తై .శిక్షా. ౪) "తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వభావాద్భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః" (శ్వే. ౧-౧౦) "వ్రతమేతచ్చాంభవం సర్వేషు వేదేషు వేదవాదిభిరుక్తం భవతి తస్మాత్ తత్సమాచరేన్ముముక్షుర్న పునర్భవాయ" (కాలాగ్నిరుద్ర ౧) "సర్వ లింగం స్థాపయతి పాణిమంత్రం పవిత్రం" (మహానా. అను. ౧౪) ఇతి తైత్తిరీయశ్వేతాశ్వతరకాలాగ్నిరుద్రాదిషు శివలింగధ్యానధారణాదీనాం

ప్రాకృతకర్మణాం మోక్షహేతుత్వోపదేశాత్ గర్భాధానాది ప్రాకృతకర్మణాం మోక్షసాధనత్వవిధాయక శ్రుతిస్మృతీనాం సాధన చతుష్టయానంతర్య బ్రహ్మవిద్యాధికారిత్వోపదేశకవాక్యానాం చ "అన్నం బ్రహ్మ" (తై. భృ. ౨) ఇత్యాదివాక్యానామివ స్థూలారుంధతీన్యాయేన సమక్షజలన్యాయేన చ పరంపరయా సాధనత్వం యుక్తం.

"సందిగ్ధేషు వాక్యశేషాత్" (పూర్వమీ. ౧-౪-౨౯) ఇతి న్యాయేన "అమృతస్య దేవధారణో భూయాసం" (తై. శిక్షా ౪) శ్రుతివాక్యే అసందిగ్ధత్వేన బ్రహ్మవిద్యాధికారిత్వనిరూపణాత్ పూర్వోదాహృతజ్ఞానకర్మసముచ్చయసాధనచతుష్టయప్రతిపాదకశ్రుతీనాం సంధిగ్ధత్వం సిద్ధం. శంకరసంహితాయాం భగవతా వ్యాసేన—

"నిత్యానిత్యవిచారవానిహ పరత్రాపేక్షితార్థారతిః" ఇత్యారభ్య "న త్యజ ప్రాణలింగం త్వం యావజ్జీవం ప్రతిజ్ఞయా, పునర్భవో న తే వత్స! విద్యతే మాతృయోనిషు' ఇత్యంతేన సాధనచతుష్టయసంపద్విశిష్టస్య లింగధారణముక్త్వా తతో బ్రహ్మజ్ఞానోపదేశవిధిర్నిర్దిష్టః. రేణుకభగవత్పాదాచార్యేణాపి "పిండతా పిండవిజ్ఞానం" ఇత్యారభ్య "ఏతాని శివభక్తస్య కర్తవ్యాని ప్రయత్నతః" ఇత్యంతేన సిద్ధాంతశిఖామణౌ తథైవోపదిష్టం.

న చ లింగధారణమాత్రేణ ముక్తిసంభవే తదేవాలం, కిమౌపనిషదశాస్త్రవిచారప్రయాసేన? ఇతివాచ్యం, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" (బృహ. ౨-౪-౫) "వేదాంతశ్రవణం కుర్యాత్" ఇత్యాదినా మాయాపాశవిముక్తానామపి ప్రారబ్ధప్రతిభాసనాశపర్యంతం పరమేశ్వరాజ్ఞాపాలనస్య కర్తవ్యత్వశ్రవణాత్, తదభావే లింగాంగజ్ఞానదృఢప్రత్యయాభావాత్, పునః కామక్రోధాదీనామంతఃకరణప్రవేశావకాశహేతుత్వాత్,

"ఆసుప్తేరామృతేః కాలం నయేద్వేదాంతచింతయా,
కామాదిపరిహారాయ శివజ్ఞానాభివృద్ధయే".

ఇతిస్మృతేశ్చ కరణతయా స్వతంత్రవిధ్యంతరరహితసాత్రిమః బృహస్పతిసవాదేరగ్నిచయనవాజపేయాద్యంగత్వేన ఉభయవిధిబలా దుభయసిద్ధివత్ లింగధారణబ్రహ్మజిజ్ఞాసయోర్న విరోధః.

న చ జ్యోతిష్టోమాదివల్లింగధారణస్యాపి కర్మత్వేన పరంపరయా ముక్తిహేతుత్వమితి వాచ్యం - పూర్వోదాహృతప్రత్యక్షికశ్రుతివిరో ధాత్ శ్రవణాదీనామపి కర్మత్వేన తేషామపి ముక్తిహేతుత్వం స్యాత్, తత్స్వీకారే మాయాపాశనివృత్తౌ ముఖ్యకారణాభావాత్ బ్రహ్మజిజ్ఞాసాశాస్త్రస్య ప్రసక్త్యసంభవప్రసంగః, తథాచేన్మూలచ్ఛే తవ పాండిత్యప్రకర్షః.

వ్రీహిప్రోక్షణాదికం దర్శపూర్ణమాసోత్పత్త్యపూర్వహేతుతయా స్వర్గే యథా సముచ్చీయతే, తథా పరమేశ్వరార్పితపురాకృతజ్యోతి ష్టోమాదిసర్వకర్మాణి సాధనచతుష్టయాదికం చ శివజ్ఞానశివలింగధారణ ప్రయోజకతయా మోక్షే సముచ్చీయంతే.

నను—లింగధారణబ్రహ్మవిచారశాస్త్రయోః కర్తైక్యా భావాత్ కథం క్రమనియమః? కర్త్రైక్యమిహ ఆఘారదర్శపూర్ణమా వదంగాంగిత్వేన వా? పంచప్రయాజవదేకాంగిప్రయుక్తానేకాంగత్వేన వా? గోదోహనాదివదధికారాంతరప్రయుక్త్యుపజీవిత్వేన వా? షడ్యా గవదాషధ్యాదివచ్చ ఫలైక్యేన వా భవతి? ఇతిచేదుచ్యతే - పూర్వోక్త తైత్తిరీయశ్వేతాశ్వతరకైవల్యజాబాలకఠవల్ల్యాదిశ్రుతిస్మృతి పురాణా గమ ప్రమాణైః కర్త్రైక్యదర్శనాత్ కర్త్రైక్యవికల్పవిచారో న విధేయః.

నను - లింగధారణస్య నిత్యత్వమస్తు, జైమినిసూత్రవిహిత విధిత్రయే కో విధిరాశ్రీయతే? అపూర్వవిధిః? నియమవిధిః? పరిసంఖ్యా

త్వా! "వ్రీహీన్ ప్రోక్షతి" ఇతివన్నాపూర్వవిధిః, లింగధారణస్య
విత్రం తే వితతం బ్రహ్మణస్పతే" (ఋగ్వేద ౭-౩-౮)
త్యాదిబహుశ్రుతివిహితత్వాత్ "వ్రీహీనవహంతి" ఇతివన్న నియమ
ః; శివలింగేతర శిఖాయజ్ఞోపవీత భస్మరుద్రాక్షధారణస్య
త్వాత్ "పంచ పంచనఖా భక్ష్యాః" ఇతివన్న పరిసంఖ్యావిధిః,
ధారణాదికర్తవ్యత్వాకర్తవ్యత్వయోరేకదా సముచ్చయప్రసక్త్య
భావాత్. అతో లింగధారణస్య న వైదికత్వమితిచేన్న - విధిత్రయే
సిద్ధత్వాత్.

"అమృతస్య దేవధారణో భూయాసం" ఇత్యత్రాపూర్వవిధిః
ధారణస్య "సర్వలింగం స్థాపయతి" ఇత్యాదిబహుశ్రుతివిహిత
న నాపూర్వవిధిరితి చేత్ - ఉపజీవ్యోపజీవకభావన్యాయేన "సర్వ
గం స్థాపయతి" ఇత్యాదివాక్యానాం ఫలధారణ శబ్దాయోగేన
జీవిత్వం; "అమృతస్య దేవధారణో భూయాసం" ఇత్యత్ర మోక్ష
ధారణవిధాయకత్వశ్రవణాదుపజీవ్యత్వం; అతో న దోషః.

నియమవిధిశ్చ — తాంత్రికతప్తలింగశూలడమరుశంఖ చక్రా
నిషేధపూర్వక శ్రౌతశిఖాసూత్ర భస్మరుద్రాక్ష లింగధారణ
కారాత్ "హరికేశాయోపవీతినే" (తై. సం. ౪-౫-౨ ("రుద్ర
షా" ఇత్యాదౌ భస్మరుద్రాక్షాదివచ్ఛివస్యైవ శిఖాసూత్రధారణ
ణాచ్ఛివలాంఛనమితి సిద్ధం. "యశ్ఛందసాం" ఇత్యాదిలింగధారణ
యకశ్రుతీనాం పరమేశ్వరానుగ్రహలబ్ధసర్వవేదార్థవేదిభిః సర్వజ్ఞ
సుర్వాసోరేణుకశ్వేతోపమన్యుదధీచి కుంభసంభవాదిపూర్వాచా
లింగధారణపరత్వేన వ్యాఖ్యానాత్తదేవ గౌరవం. వయం శ్రుతి
క్త్యనుభూతివాదినః, బౌద్ధాదివన్న యుక్తిమాత్రావలంబినః.

నిగమాగమోభయవేదాంతప్రతిపాదిత భక్తిక్రియాజ్ఞానకాండ
యవిహిత స్థూలసూక్ష్మచిదచిత్ప్రపంచ ప్రకాశక షట్స్థలపరశివ

సాక్షాత్కారకారణ బహుజన్మకృతశివార్పిత యజనయాజనతపోధ్యా
ద్యనేక పుణ్యాపూర్వఫలశరీరత్రయగత మలత్రయధ్వంసక కాష
కల్యాణ కైవల్యవిభూతిత్రయప్రదాయకాష్టావరణపంచాచార సద్గు
కరుణాకటాక్షలబ్ధశక్తిపాతాద్యవచ్ఛిన్న పరశివేష్టలింగధారణా
పాశుపతదీక్షాఽనంతర్యమిత్యథశబ్దార్థో నిర్ణీయతే.

అతానంతర్యాభిధానముఖేనాథశబ్దేనైవ హేతుత్వసిద్ధేఃకుతో
తఃశబ్దః ? ఇతిచేన్న; "అపామ సోమమమృతా అభూమ" (ఋగ్వే
౬-౪-౧౧) ఇత్యాదౌ ప్రాకృతకర్మఫలస్యాపి నిత్యత్వశ్రవణాత్, "
త్యేకాక్షరం బ్రహ్మ" (గీతా.౮-౧౩) ,,అసావాదిత్యో బ్రహ్మ
(తై. ఆర. ౨-౨) "నారాయణపరం బ్రహ్మ" (మహానా. ౧౧ 
"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" (తై. భృ. ౨) ఇత్యాదౌ నా
విధోపాసనదర్శనాత్ కథం పరశివేష్ట లింగధారణాన్ముక్తిస్సంభవే
శంకానిరాసాయ హేతుత్వదృఢీకరణార్థమతఃశబ్దోనిర్దిష్టః । ప్రాకృత
ఫలస్యానిత్యత్వే "పుణ్యచితో లోకః క్షీయతే" (ఛాం. ౮-౧-
ఇత్యాదిబహుశ్రుతీనాం విద్యమానత్వాత్, కర్మప్రకరణపఠితశ్రు
పేక్షయా బ్రహ్మప్రకరణపఠితాయా "అమృతస్య దేవధారణో 
యాసం" (తై. శి. ౪.) ఇత్యాదిశ్రుతేర్బలవత్త్వాత్, "శివ ఏకో 
యశ్శివంకరస్సర్వమన్యత్పరిత్యజ్య" (అథర్వశిఖా. ౩) "ఏకోహి రు
న ద్వితీయాయతస్థుః"(శ్వే-౩.౨) "అసంఖ్యాతాస్సహస్రాణి స్మర్య
న చ దృశ్యతే" (తై. ఆర.౧.౨) "త్వం దేవానాం బ్రాహ్మణానా
పతిర్విష్ణుః ,క్షత్రియాణామధిపతిర్బ్రాహ్మణానాం బ్రాహ్మణైరా
యతః" ఇత్యాదిశ్రుతిషు బ్రాహ్మణానాం శివోపాసనస్యైవ 
త్వాత్, "యో వై స్వాం దేవతామతియజతే ప్రస్వాయై దే
తాయై చ్యవతే న పరాం ప్రాప్నోతి పాపీయాన్ భవతి" (తై
సం. ౨-౫-౪) ఇతి శ్రుతౌ స్వదేవతాపరిత్యాగే ప్రత్యవాయ శ్రే
ణాత్.

బ్రాహ్మణానాం శివో దేవః క్షత్రియాణాం తు మాధవః,
వైశ్యానాం తు తథా బ్రహ్మా శూద్రాణాం సురనాయకః.
బ్రాహ్మణో భగవాన్ రుద్రః క్షత్రియః పరమో హరిః,
పితామహ స్తథా వైశ్యో వృషలస్తు పురందరః.

ఇత్యాదిపారాశర్యపురాణాదిషు వైదికబ్రాహ్మణానాం శివదేవ
త్రీవణాత్, అపామేత్యాదిశ్రుతేః "ఆభూతసంప్లవం స్థానమమృ
త్వం హి భాష్యతే" ఇత్యాదిస్మృత్యా భూతప్రళయావధ్యపేక్షితా
త్త్వప్రతిపాదనతాత్పర్యావధారణాచ్చ.

యతోఽసాధారణకారణత్వేన అమృతస్య దేవధారణం విధీ
తే, అతః పశుపతిస్వరూప బ్రహ్మజ్ఞానాయ వేదాంతవాక్యవిచారః
వ్యః. "సత్యకామః సత్యసంకల్పః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః"
ం. ౮-౧-౫) 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో
ధ్యాసితవ్యః' (బృ. ౨-౪-౫) ఇత్యాదిషు బ్రహ్మజిజ్ఞాసావిధిః
ియతే. "ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం
న్యంతే స ఆత్మా స విజ్ఞేయః" (మాండూక్య ౧-౭) ఇత్యాదిశ్రుతి
త్మన్‌శబ్దస్య పరశివప్రతిపాదకత్వదర్శనాన్నాన్యార్థకత్వం.

అత్ర - బ్రహ్మణో జిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసేతి కర్మణి షష్ఠీ, న
షష్ఠీ. జిజ్ఞాసాయా జిజ్ఞాస్యాపేక్షత్వాత్ శేషషష్ఠీపరిగ్రహణేఽపి
హ్మణో జిజ్ఞాసాకర్మత్వముపదిశ్యతే సంబంధసామాన్యస్య విశేషనిష్ఠ
త్వాత్. ఏవమపి బ్రహ్మణః ప్రత్యక్షం కర్మత్వముత్సృజ్య సామాన్య
ద్వారేణ పరోక్షం కర్మత్వం కల్పయతో వ్యర్థః ప్రయాసః స్యాత్,
ధానపరిగ్రహే తదపేక్షితానామప్యర్థాత్ సిద్ధత్వాత్.

అత్రసూత్రే కర్తవ్యేతిపదాధ్యాహారో నాంగీకర్తవ్యః, విషయ
ప్రయోజనజ్ఞానాదేవ పురుషవ్యాపారసంభవాత్, సిద్ధాంతే కార్యా
స్వితే పదశక్త్యనంగీకారాచ్చ నహ్యనువాదదోషః అప్రాప్తానువాదే

దోషాభావాత్. కర్తవ్యపదాధ్యాహారమాత్రేణ కథమనువాదదో
పరిహారః ? "విష్ణురుపాంశుయష్టవ్యోఽజామిత్వాయ"ఇత్యాదౌ
ప్రత్యయేఽప్యనువాదదర్శనాత్. అప్రాప్తస్యానువాదస్య కర్తవ్యప
ధ్యాహారం వినాపి "తత్త్వమసి" (ఛాం. ౬-౮-౭) "అయమాత్మ
బ్రహ్మ" (బృ. ౨-౫-౧౯) ఇత్యాదివదనువాదత్వసంభవాన్నానువాద
హారాయాధ్యాహారః.

నచ శ్రవణవిధ్యపేక్షితన్యాయవిచారార్థత్వాదస్య సూత్రస్య శ
సూత్రయోరైకరూప్యార్థమధ్యాహారః,శ్రవణవిధేరనంగీకారాత్. విధి
ప్రయోజకరూపసంపత్త్యభావేన న తావదపూర్వవిధిః, విచారస్య
యహేతుత్వస్యతాత్పర్యగ్రాహకస్య లోకసిద్ధత్వాత్. న చ బ్రహ్మ
క్షాత్కార హేతుత్వం న ప్రాప్తమితి వాచ్యం, విచారమాత్ర
విచార్యనిర్ణయహేతుత్వస్య బ్రహ్మప్రమాణస్య తత్సాక్షాత్
హేతుత్వస్య చ ప్రాప్తౌ విచారితవేదాంతజ్ఞానరూపశ్రవణస్య తద్ధేతు
ప్రాప్తేః.

నాపి నియమవిధిః, వ్యావర్త్యాభావాత్. న చ గురువిరహి
విచారో వ్యావర్త్యః, "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం స గురుమేవా
గచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" (ముండక. ౧-౨-౧
ఇతివిజ్ఞానార్థం విధీయమానగురూపసదనదృష్టద్వారసంభవే అదృష్టక
నాయోగాత్. వేదాంతవిచారేణైవ విజ్ఞానార్థః పర్యవస్యతీతి స్వతో
విచారవ్యావృత్తేరుపగమవిధినైవ సిద్ధత్వాత్.

న పరిసంఖ్యావిధిః, సాధనాంతరస్య సముచ్చిత్య ప్రాప్త్య
భావాత్. న చ వ్యాపారాంతరస్య నివృత్త్యర్థం యావజ్జీవం వేదాం
విచారః కర్తవ్యః, న చ వ్యాపారాంతరనివృత్తిస్సంభవతి ఇతి వాచ్యం,
తత్రైవ దోషాపాతాత్. కించ- సంన్యాసినోఽసంన్యాసినో వా వ్యాప



హిమాలయ శ్రీకేదారనాథ మందిరము



సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

సికింద్రాబాదు

(సం)పుటము ౧ | శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి ఆశ్వయుజము | రేఖ ౬

# పోతన్నగారికి నైవేద్యము

విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు, ఎం. ఎ. ఎల్. టి.

సీ॥ గౌరీశు నర్చించు కరములు కరములు
శ్రీకంఠు వర్ణించు జిహ్వ జిహ్వ
సోమశేఖరుజూచు చూడ్కులు చూడ్కులు
శివసాంబునకు మ్రొక్కు శిరము శిరము
భీము నాకర్ణించు వీనులు వీనులు
మదనారి దవిలిన మనము మనము
పశుపతి న్వలగొను పదములు పదములు
భూతేశ్వరునిమీది బుద్ధి బుద్ధి;
గీ॥ త్రిపురదాహకు జింతించు దినము దినము
సర్పభూషణు బ్రకటించు చదువు చదువు
గుహగురుం దగ జెప్పెడి గురుడు గురుడు
ధరణి హరుజేరుమనియెడి తండ్రి తండ్రి.

సీ॥ కామారికినిగాని కాయంబు కాయమే
పవనకుంభితచర్మ భస్త్రిగాక
ఫాలాక్షుబొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక

హరుపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
గౌరీశుజూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక
గీ॥ శంభుచింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
భీమభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక.
సీ॥ సంసారజీమూత సంఘంబు విచ్చునే
శంభుదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లారునే
భీమసేవామృత వృష్టిలేక
సర్వాంకషాఘౌఘ జలరాసు లింకునే
హరమనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే
ఫాలాక్షనుతిరవిప్రభలు లేక
గీ॥ నిరుప మానున రావృత్తి నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
చంద్రశేఖర చింతనాంజనము లేక
తామరస గర్భునకునైన ధాత్రియందు.
సీ॥ మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబువోవునే మదనములకు
నిర్మల మందాకినీవీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు
గీ॥ అంబికాప్రియ దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు సేరనేర్చు
విబుధనుతశీల, మాటలు వేయునేల. *

---

* బమ్మెర పోతరాజుకవి భాగవతములోని "కమలాక్షు నర్చించు కరములు కరములు" అను పద్యములకు నివి ప్రతికృతిగాఁ (శివపరముగా) బరివర్తింపఁబడి శైవుక నెన్నఁడో 'భారతి'లోఁ బ్రకటితములు.

సంపాదకుఁడు,

# ఆచార్యపండితుఁడు

బండారు తమ్మయ్యగారు

---

శ్లో॥ శ్రీవీరశైవహేతూనా, మాచార్యాణాం చతుర్థకం,
వందే శ్రీశైలపీఠేశం, నిత్య మాచార్యపండితమ్.

ఆంధ్రవాఙ్మయమునఁ గవిత్రియమువారెట్టివారో వీరశైవ
త ప్రపంచమునఁ బండితత్రియ మట్టివారని నుడువుచు నా మిత్రులు
యుత నిడుదవోలు వేంకటరమణ బి. ఏ. గారు అక్షయ (1926)
ంవత్సరమున భారతిలో (సం. 3 సం. 3) శివలెంక మంచెనపండిత,
పతి, పండిత, మల్లికార్జునపండిత, అను పండితత్రియమును గూర్చి
యొక వ్యాసమును బ్రకటించి యున్నారు. ఆంధ్ర దేశమందలి
మారాధ్య బ్రాహ్మణులలోఁ దా మీ పండిత త్రియముయొక్క
కూటస్థులమని చెప్పుకొనువారు కొందరు కలరు. పై మువ్వురలోను
డపటివాఁడగు మల్లికార్జున పండితుఁడే తనకుఁ బూర్వులైన తక్కిన
ఇరువురికంటె లోకమున నెక్కుడుగాఁ బరిచితుఁ డయినాఁడు.
ందుకుఁ గారణము పాండిత్యాతిశయమునఁగాని భక్తి మహిమోన్న
తినిగాని యాతఁడు వారికంటె నెక్కుడగుటగాక పాలకురికి సోమనాథ
వీశ్వరుఁ డాతని చరిత్రమును ప్రత్యేక గ్రంథరూపమున లోకమున
సంగుటయే యనిగ్రహింపఁదగియున్నది. మంచెన శ్రీపతిపండితు లీ
మాత్రమయిన లోకమున కెఱుకపడుటగూడ సోమనాథుని మూలము
నేయని తలంచుట సత్యదూరము కానేరదు. సంగ్రహముగనైన వారి
చరిత్రములను సోమనాథుఁడు బసవపురాణమున నుగ్గడించియుండుటచేఁ
గాని లేకున్న నా మహనీయు లీవఱకుఁ బూర్తిగ విస్మృతులై యుందు
రేమో! శ్రీకరభాష్యకర్తృత్వముగూడ శ్రీపతి పండితుఁడు సుప్రసిద్ధుఁ
డవుటకుఁ గొంత కారణమైనది. అహో! కవికృత్యమున కెంత మహ
త్తర ప్రభావమున్నది! కావున నే కల్యాణపండితుఁ డిట్లు వచించినాఁడు:

శ్లో॥ భుజతరువనచ్ఛాయాం యేషాం నిషేవ్య మహౌజసాం
జలధిరశనా, మేది న్యాసీ దసావకుతోభయా
స్మృతిమపి న తే యాంతి క్ష్మాపా వినా యదనుగ్రహం
ప్రకృతిమహతే కుర్మస్తస్మై నమః కవికర్మణే॥

శ్లో॥ యేఽప్యాసన్నిభకుంభశాయితపదా యేఽపి శ్రియం లేభిరే
యేషామప్యవసన్పురా యువతయో గేహేష్వహశ్చంద్రికాః
తాన్ లోకోఽయమవైతి లోకతిలకాన్ స్వప్నేఽప్యజాతానివ
భ్రాతస్సత్కవికృత్య! కిం స్తుతిశతై రంధం జగత్త్వాం వినా॥

వీరశైవ మతమునకు మూలకారణులగు పంచాచార్యులలో
జేరిన యాచార్య పండితునివిషయమై యీ పండిత త్రియమునుగూ
తెలిసినంతయైన నాంధ్రిలోక మెఱుఁగకుండుట శోచనీయము. పోనీ
డాతనిఁ దెలియనేరక పూర్తిగ విస్మరించినను బాగుండెడిదే. వీరశైవు
శుభాశుభ కర్మములలో స్మరించి పూజించు పంచాచార్యులలో
బేర్కొనఁబడు నామహనీయుఁడు మల్లికార్జున పండితుఁడే యని వచిం
సాహసమునకుఁ గూడ లోకము పాల్పడుట యాశ్చర్యము గొల్పక
మానదు. వీరశైవము బసవేశ్వరాద్యుపజ్ఞమే యనియు న
బసవేశ్వరునికాలముననే దేశమున నెలకొనెననియు వీరశైవులుపూజించు
పంచాచార్యులు బసవేశ్వర సమకాలికులే యనియు నందలి పండితా
రాధ్యుఁడు మల్లికార్జున పండితుఁడే యనియు వ్రాయుట కాంధ్ర
విద్వాంసు లెంతమాత్రము వెనుదీయకున్నారు.

నామిత్రులు శ్రీయుత భావరాజు వేంకటకృష్ణరావు M. A. B. L.
గారు ప్రబుద్ధాంధ్ర రక్తాక్షి (1924)మార్గశీర్ష సంచికలో (సం. 3 సం. 10)
వీరశైవమునుగూర్చి వ్యాసము ను వ్రాయుచు, క్రీ॥ శ॥ 7, 8, శతాబ్ద
లలో నాయనారు లను శివయోగీంద్రులచే ద్రవిడ దేశమునఁ బ్రతిపా
దింపఁబడిన దాక్షిణాత్య శైవమే యాపిమ్మట నెలసిన కాలాముఖశైవ
ముతోఁగలసి క్రమపరిణామమును జెంది బసవేశ్వరాదుల కాలమున
నాంధ్ర కర్ణాటక దేశములందు వీరశైవముగా మాఱినదని లిఖించిరి.
ఈ వ్యాసమందలి—

*నిజముఁ బరికింప బసవేశ్వరుఁడు నూతనమతమును స్థాపించెననుటకు వీలులేదు. ...ను లేనకు పూర్వమున్న శైవమును సంస్కరించి, వీరశైవమతమును స్థాపించెను. ...మతావలంబకులైన వీరశైవులనఁబడు లింగాయతులు పంచారాధ్యులను శివయో...ర్తులను దమ మతమునకు మూలగురువులుగాఁ బరిగణింతురు. ఈ పంచారాధ్యులు ...పంచముఖములనుండి యావిర్భవించినవారనియు వారివలన జీవుఁడు శివదీక్షను ...యుచున్నాఁడనియు విశ్వసించుచున్నారు. రేవణసిద్ధుఁడు, మరుళసిద్ధుఁడు, ఏకో...రామారాధ్యుఁడు, పండితారాధ్యుఁడు, విశ్వారాధ్యుఁడు అను నీపంచారాధ్యుల పవిత్ర...నామములను ప్రతిజంగమగురువును, శిష్యునికి శివదీక్ష యొసంగి లింగధారణము సేయు...ను ఆహూయముచేయును. వీరి నామములు ప్రతిజంగముని యింటను సర్వదా ...బడుచుండును. అందు పండితారాధ్యుఁడు ఆంధ్రుల కత్యంతచిరపరిచితుఁడు. శివ...దానసమయమున నైదు పంచపాత్రలను దెచ్చి నాలుగుదిక్కులందును నడుమ ...క దానిని ఉంచి, పంచారాధ్యులకిరింద వానిని పూజింతురు. కొన్నిజంగమభిక్షా...ములందు గురువులు తాము పంచారాధ్యుల సంతతివారమని చెప్పుకొనుటయుఁ ...ను. ఈ ఆరాధ్యులెవ్వరో వారి చరిత్రమెద్దియో వివరముగాఁ దెలియు భాగ్యమిం...మనకుఁ బట్టియుండలేదు. కన్నడభాషయందు చెన్నబసవ కవిచే రచింపఁబడిన ...వణసాంగత్యము" అను కావ్యమునందు రేవణుఁడు లేక రేణుకుఁడు అను ...రాధ్యుఁడు 'కొలనుపాక' యను గ్రామమున జననమొందెననియు నేడుశతాబ్ద...జీవించెననియుఁ దెలుపఁబడియున్నది. మఱియు నీరేవణుఁడు అగస్త్యమహర్షికి ...శివయోగమును లింగార్చనరహస్యమును బోధించెనఁట. రావణుని సోదరుఁడగు ...నిచే నాలుగుకోట్ల లింగముల ప్రతిష్ఠచేయింపఁజేసెనఁట. ఆతఁడు దిగంబర వేష...యై జనులకసహ్యము కలిగించి యుండినను తనదివ్యమహిమప్రభావములచేత ...కముచే మహనీయుఁడని కీర్తింపఁబడియెను. మహారాజులనేకు లాతని దివ్యమహిమం...గొనియాడుచు తమ తనయలనిచ్చి పరిణయము గావించి యుండిరఁట. ఒకప్పుడీతఁడు ...ల్యాణపురాధీశుఁడైన బిజ్జలనృపాలునికడ కేఁగి యాతఁ డొకానొక సిద్ధికై ...రెండువేల కన్యల బలియొసంగ నుండుటఁ జూచి యాప్రయత్నమునుండి వారించి ...క్షయొసంగి యాతని కొమార్తెను పెండ్లియాడెనఁట. పిమ్మట నానగరమున తన ...న్యలతోఁగూడి పారయు గుద్దలియు జతఁబూని విశాలమైన తటాకమును నిర్మించె...ను. ఇతనికి రుద్రముని యని యొక కొడుకుగలఁడు. కళ్యాణనగరమున తటాకనిర్మా...ణ ముగిసిన పిదప, రేవణుఁడు స్వగ్రామమగు కొల్లిపాక కేఁగి యచ్చట సోమేశ్వర ...లింగమున నంతర్ధానమయ్యెనఁట. పైనిఁ జెప్పిన కథనిజానిజములెట్లుండినను, కళ్యాణ ...రాజు సమకాలికుఁడని మాత్రము వానివలనఁ దెలియుచున్నది. మఱియు రేవణుఁడు ...మొదలుగాఁ గల శివయోగులు బసవేశ్వరునిపూర్వులనియు వారల బోధనలు చాల ...కము వీరశైవ వ్యాప్తికి మార్గములయ్యెననియుఁ దెలియుచున్నది. మిగిలిన యారా...ధ్యులచరిత్రము దెలియరాదుగాని, పండితారాధ్యునిచరిత్రము ఆంధ్రులకుఁ దెలిసి...న నవకాశములున్నవి. శ్రీనాథుని పండితారాధ్యచరిత్రము నశించినను ఆతని

చారిత్రము దెలుపు ప్రబంధము ఒకటి గలదు. అయ్యదియును లభింపమిచే నిప్పుడు వారి చరితము నిట వివరింపలేమైతిమి."

అను శ్రీ కృష్ణరావుగారి వాక్యములు బసవేశ్వరుఁడు వీరశైవ మతస్థాపకుఁడనియు, పంచాచార్యు లాతని సమకాలికులే యనియు నందలి పండితారాధ్యుఁ డాంధ్రులకుఁ బరిచితుఁడైన మల్లికార్జున పండితుఁడే యనియు వారిసిద్ధాంతమైనట్లు వ్యక్తమొనర్చుచున్నవి. అర్వాచీనుఁడగు కన్నడకవి 'రేవణసాంగత్య' మను గ్రంథమునుండి యుదాహృతమై పరస్పర వైరుధ్యములతోఁ గూడిన రేవణాచార్యుని (రేణుకుని) గూర్చిన పై కథకుఁ జారిత్రికదృష్టియం దేపాటి ప్రామాణ్యముండఁగలదో విజ్ఞులకు వేఱచెప్పనక్కఱలేదు. ఒకచో నగస్త్యునకు, మఱొకచో విభీషణునకు సమకాలీనుఁడుగాఁ జెప్పఁబడిన యా రేణుకాచార్యుఁడు (రేవణుఁడు) బసవేశ్వరుని కాశ్రయుఁడైన క్రీ. శ. ౧౧౬౭ ప్రాంతమున రాజ్యమేలిన కళ్యాణబిజ్జలుని కొమార్తెను బరిణయమయ్యెననెడి యసంగత కథనుబట్టి శ్రీకృష్ణరావుగారి వంటి విమర్శకాగ్రణు లాతనిని బిజ్జల సమకాలికునిగాఁ దలంచుటయు మరల నా వెంటనే స్వవచనవ్యాఘాతముగ "రేవణుఁడు మొదలుగాఁ గల శివయోగులు బసవేశునకు పూర్వులని తెలియుచున్నది." అని వ్రాయుటయు మాత్ర మాశ్చర్యజనకము కాకపోదు. ఇఁకఁ బండితారాధ్యునిఁగూర్చి వీరు వ్రాసిన వ్రాఁతలను గూడఁ జిత్తగింపుఁడు. శ్రీనాథుని పండితారాధ్యునిచరిత్ర మింతవఱకు లోకమునకే దొరకలేదు. దొరికిన దాని మూలగ్రంథము పాలకురికి సోమనాథుని ద్విపద పండితారాధ్యచరిత్రయే యైనను వీరికి లభింపలేదఁట. దానిని వీరు చదువలేదనుట స్పష్టమేకదా! కాని యా చరిత్రమందు వర్ణితుఁడైన మల్లికార్జునపండితుఁడే పంచాచార్యులలోని వాఁడని తలంచుట కేమాత్రము తలంకరైరి. తరువాతనైన వీ రా గ్రంథమును జదివి మల్లికార్జునపండితుని యథార్థచరిత్రమును గ్రహించియుందురని విశ్వసించుచున్నాను.

ఆంధ్రగ్రంథమాలలో శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావుపంతులుగారిచేఁ బ్రకటింపఁబడిన పాలకురికి సోమనాథుని ద్విపద

వపురాణమునకు విపులమైన పీఠిక వ్రాయుచు బ్రహ్మశ్రీ వేటూరి
ప్రభాకరశాస్త్రిగారు బసవేశ్వరునకుఁ బూర్వమున్న శైవమతభేద
ములఁగూర్చి యించుక చర్చించి వీరశైవము బసవేశ్వరోపజ్ఞమే
యనియు, బసవేశ్వరునకుఁ బూర్వ మీ మతములేదనియు, మల్లి
కార్జున పండితుఁడు లింగధారణములేని పాశుపత మత ప్రవర్తకుఁడు
గాని వీరశైవుఁడు కాఁడనియు, పైని జెప్పిన పండితత్రయములోని
మిగిలినవారు గూడ వీరశైవులు గారనియు, తెలుఁగునాటి యారా
ధ్యులు పూర్వులు లింగధారులనుటకుఁ గాని కృష్ణరాయలకుఁ బూ
ర్వము బ్రాహ్మణులలో లింగధారణ ముండెననుటకుఁ గాని యాధా
రములు గానరావనియు నిత్యాదిగా వ్రాసియున్నారు. శ్రీ శాస్త్రి
గారి బసవపురాణ పీఠిక విపులపరిశోధన ద్యోతకముగ నున్నను,
కొన్ని విషయములలో నది భ్రమప్రమాదసంకలితమై ప్రమాణదూర
మగుచున్నది. ఈ పీఠిక యారాధ్యబ్రాహ్మణులలోను వీరశైవులలోను
గూడఁ జాలసంచలనము గలిగించినది. శాస్త్రిగారి పరమ మిత్రు
లును మహోపాధ్యాయ బిరుదాంచితులును నగు శ్రీ ముదిగొండ నాగ
లింగశాస్త్రిగారు తమ శైవరహస్యబోధిని పత్రికలోఁ బ్రత్యుత్తర
రూపకముగ నీ పీఠికపై విమర్శన మొకటి ప్రకటించిరి. (విభవ సంవ
త్సర చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ సంచికలు) అందులో వారు లింగధార
ణము తాంత్రికముగాక వైదికమేయనియు, వీరశైవము బసవేశ్వరాద్యు
పజ్ఞముగాక చాలఁ బ్రాచీనమనియు, పండితత్రయమేగాక తదితరులు
తెలుగునాటి యారాధ్యుల పూర్వులందఱుగూడ లింగధారులే యనియు
నిరూపించుచుఁ జాలవిషయములు చర్చించిరి. అందుకు ఆంధ్రవీరశైవ
లోకము వారి కెంతయుఁ గృతజ్ఞతఁజూపఁగలదు. శ్రీ నాగలింగశాస్త్రిగా
రొక్కకొంతవఱకు విమర్శనము సాగించిరి. కావున వారు విడిచినవిషయ
ములఁగూర్చియు, బసవపురాణ పీఠికయందలి మఱికొన్ని చారిత్రిక
మతవిషయిక, భాషావిషయిక ప్రమాదముల గుఱించియు నాకుఁ
దోఁచిన యభిప్రాయములుగూడ లోకమునకుఁ దెలియఁజేయు తలం
పుతోఁ గొన్ని ప్రత్యేక వ్యాసముల వ్రాయనెంచి యింతవఱకు "పాల
కురికి సోమనాథకవి కులగోత్రప్రశంస," "సోమనాథ స్తవము" "పిడు

ప_త్రికవులు'' "పాలకురికి సోమనాథకవి కావ్యవిశేషములు''
వ్యాసములఁ బ్రకటించియుంటిని. ఇప్పు డీ వ్యాసమును బ్రకట
ముందు "తెలుగునాటి యారాధ్యులు'' "వీరశైవమత ప్రాచీన
మున్నగు మఱి యొందు రెండు వ్యాసములు ప్రకటింపనెంచి
శ్రీ ప్రభాకరశాస్త్రిగారును లోకమునుగూడ వానిని సుహృదా
ముతోఁ దిలకించి సత్యనిర్ధారణమొనర్తురుగాక యని సవినయము
బ్రార్థించెదను.

పైనిజేర్కొన్న శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారికిఁగూడ వీరశైవ
మునుగూర్చిన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సిద్ధాంతములు సరిగా సమ్మతమైనట్లు లే
'Journal of the Andhra Historical Research Society' (Vol 3 Pa
2, 3 and 4 Page 234) లో బసవపురాణ పీఠికపై వారొసంగిన యీ క్రింది
ప్రాయముఁ జిత్తగింపుఁడు. "Mr. Shastri has not been able to thr
more light on the historic authenticity of Basava in his discuss
of that topic. He has attempted to trace the connection betwe
the Aradhya Saivism of the Adhra and Karnataka countries b
has not satisfactorily dealt with the question. Likewise he h
not been able to trace the origin and growth of the earlier form
Saivism in South India with its intricate Philosophy of religio
rites, the Pasupatha, Kalamukha, Aghora, and other varieties a
how Basava's Veerasaivism was an improvement or otherwise
the older cults,"

భారతీయమతములలో శైవము చాలఁ బ్రాచీనతమమైన
దానిలో ననేకములగు నవాంతరభేదము లనాదినుండియుఁ గలవు
వీనిలో నొకటి మొదట వెలసినదనియుఁ దక్కినవి దానిలోనుండి క్రమ
పరిణామమునొంది తరువాత వెలసినవనియు నిర్ధరించి వచించుటకు
దగిన సామగ్రి కానరాదు. అట్లూహించుటకూడ సరికాదనియే నా
మతము. ఈ యవాంతరభేదములన్నియు నా. యా యాచార్యులచేఁ జా
బ్రాచీన కాలమునుండియే వేర్వేఱు ప్రదేశముల వెలయింపఁబడి
యుండుననియు నందులోఁ గొన్ని రాను రాను గొంతకాలమునకు నితర
మతవ్యాప్తిచేఁ దగిన ప్రచారములేక యంతరించి యుండుననియుఁ
దలంచుటయే సమంజస మని నా యభిప్రాయము. నిగమాగమములలో
నిగమములు పరమేశ్వరుఁడగు శివుని నిశ్వాసములనుండి జనించినవనియు

...ములు తద్వాదనసంజనితము లనియుఁ జిరకాలమునుండి భారత ...మున వ్యవహరింపఁబడుచున్నది. ఆ స్తికలకు రెంటి యందును ...డే బ్రమాణబుద్ధి గలదు. చారిత్రాత్మకముగ నీ వేదాగమము ...ప్పుడు వెలసినది యిదమిత్థముగ నిరూపించుట యెట్టి విద్వాంసుల ...ను సుకరమయిన పనికాదు. నామరూపవిరహితుఁ డగు పరమేశ్వరు ...కు నామరూపములు సాధకుని సాధనకొఱకే కల్పింపబడినవనుట నిర్వి ...దముగ నంగీకరింపదగును. పరమేశ్వరతత్త్వము శివరుద్రాదినామ ...లతో వేదకాలమునుండియు వ్యవహరింపబడినట్లు ఋగ్యజుర్వేదముల ...నఁ గాననగును. "శివస్య ఇదం శైవం" అను నిష్పత్తిచే శైవశబ్ద ...ష్పడినది. "మన్ (తలంచు)" అను ధాతువు నుండి మతము అను ...ము నిష్పన్నమయినది. కావున శైవమనునది పరమేశ్వరతత్త్వ ...సకయి యీ భారత దేశమున వెలసిన ప్రాచీనమతమనుట విస్ప ...ము. ఆగమములలో శివాగమములు కామికాదినామములతో నిరు ...యెనిమిది యున్నవి. శైవమతమునందలి యవాంతరభేదము లీ ...ాగమములందుఁ బ్రతిపాదితములయి యున్నవి. సూక్ష్మాగమములో:

...। సామాన్య శైవం ప్రథమం మిశ్రశైవం తతః పరమ్
శుద్ధశైవం తతో జ్ఞేయం వీరశైవం తతః పరమ్.

అని స్థూలదృష్టితోఁ జతుర్విధ శైవమును, కారణాగమములో:

...। ఆదౌ సామాన్యశైవంతు, పూర్వశైవం ద్వితీయకం
మిశ్రశైవం తృతీయం తు, శుద్ధశైవం చతుర్థకం
పంచమం శ్రౌతశైవంతు, షష్ఠమం మార్గశైవకం
సప్తమం వీరశైవంస్యా, ద్వీర సామాన్య చాష్టకం
విశేషం వీరశైవంతు, నవమం పరికీర్తితం
నిరాభారాఖ్యశైవంతు, దశమం పరిచోదితం
క్రియాశైవం దశవిధం, తత్తద్భేద మిహోచ్యతే.

అని దశవిధశైవములును బేర్కొనఁబడి వాని భేదములు వివ ...పఁబడినవి. వీనిలో శ్రౌతశైవ, మార్గశైవ, వీరశైవములలో సాధ ...కుఁ గురుదత్త మగు నిష్టలింగమును హస్తపీఠమందునిచి యర్చించుట ...రూపఁబడినది. ఇష్టలింగ మెప్పుడును ధరింపఁదగినదనియుఁ దద్విషయ

మున సాధకుఁ డతిజాగరూకతతో మెలంగవలయుననియు, అది ప్రమా
దమున నైనను భూపతితముగాని వినష్టముగాని యైనచోఁ బ్రాణ
త్యాగముకన్న వేఱుగతి లేదనియు వీరశైవుని విషయమున శాసిం
బడి యిష్టలింగార్చనమునం దాతనికి విశిష్టభక్తి నియమములు విధిం
బడినవి. దహరాకాశ ప్రతిష్ఠితమగు నంతర్లింగమునకు, గురుక
మగు బాహ్యలింగమునకు (ఇష్టలింగమునకు) బింబ ప్రతిబింబ రూ
మగు నైక్యానుసంధానమును నిరంతరము సాధనచేయుచు నాతఁడు
మును గడుపవలెను. పంచాక్షరీజపము ఇష్టలింగపూజనము మాత్ర
యాతఁడొనర్పవలెను. అన్యదేవతాస్మరణము మంత్రోపాసనము
నాతనికి సంపూర్ణముగ నిషేధింపఁబడినవి. ఇందుచేత నే తక్కినమతము
వారాంగనాసదృశము లనియు, వీరశైవము కులాంగనాసమ మని
అల్పక్రియగలిగి బహుఫలదాయకమగు నీ వీరవ్రతమును విధియుక్తము
నిర్వహించు సాధకున కొక్కజన్మములోనే ముక్తి సిద్ధించునని
శైవాగమములలోఁ జెప్పఁబడినవి.

శ్లో॥ "విశబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్యబోధికా
తస్యాం రమన్తే యే శైవా వీరశైవాస్తు తే మతాః"
"వేదాంతజన్యం యద్జ్ఞానం విద్యేతి పరికీర్తితా
విద్యాయాం రమతే తస్యాం వీర ఇత్యభిధీయతే॥"
"విశిష్టఈర్యతేయస్మాద్వీర ఇత్యభిధీయతే."

ఇత్యాదిగా వీరశైవశబ్దము నిర్వచింపఁబడినది. కావునశివజీవైక
జ్ఞానము (లింగాంగసామరస్యము) కయి నిరంతరము సాధనచేయు జను
వీరశైవుఁడని వ్యవహరింపఁబడును గాని కొందఱు సామాన్యము
భ్రమించునట్టు లితరమతములను, మతస్థులను ద్వేషించువాఁడు కాఁడు
వీరవ్రతుని దృష్టి యెప్పుడు నాత్మోన్నతియందేగాని పరమతద్వేష
ములపయిఁ బ్రసరింపనేరదు.

అనన్య భక్తిజ్ఞాన వైరాగ్య ప్రధానమై మోక్షైక సాధనమగు
నిట్టి యుత్తమ మతము బసవేశ్వరాద్యుపజ్ఞమేగాని ప్రాచీనముగాదని
తలంచుట గొప్ప ప్రమాద మని చెప్పక తప్పదు. వీరశైవమునకు
బ్రధానాంగ మిష్టలింగధారణ మగుటచే నా మతము నూతనమని

ంచువారు లింగధారణము తాంత్రికమేగాని వైదికము కాదని ప్పు సాహసమునకుఁగూడఁ గడంగుచున్నారు. ఇదియుఁ గేవలము ్రమమూలకమే.

"పవిత్రం తే వితతం బ్రిహ్మణస్పతే ప్రిభుర్గాత్రాణి పర్యేషి శ్వతః, అతప్త తనుర్న త దామోఽశ్నుతే, శ్రితాస ఇద్వహం స్త మాశత" అను ఋగ్వేద మంత్రమువలనను,

"అయంమేహస్తో భగవాన్ అయంమే విశ్వభేషజోయం శివాభి మర్శనః అయంమాతా అయంపితా అయంజీవాతు రాగమాత్" న్నగు నితర వైదిక మంత్రములవలనను వైదికయుగమునండియు లింగధారణము ప్రాచీనార్యసమ్మతముగా నుండెననుట వ్యక్తమగు న్నది. ఇందుకుఁదగిన యుపబృంహణ వచనములుగూడ నుపనిషత్తుల ందును బురాణములందును ననేకములు కాననగును. పూర్వ మునీశ్వ లు పలువు రిష్టలింగధారులుగా నుండిరనుటకు స్మృతి పురాణ ప్రమాణములు పెక్కులున్నవి. "వీరశైవమత ప్రాచీనత" యను వ్యాసమునఁ బయివిషయములెల్ల విస్తరింపఁబడును.

వేదాగమపురాణ ప్రసిద్ధమగు నీ వీరశైవమతమునకుఁ బ్రథ మాచార్యులెవ్వరను విషయమునింక విమర్శింతము. "ఈశానస్సర్వవిద్యా నాం" అను ప్రమాణమువలనఁ బరమేశ్వరుఁడే ప్రప్రథమాచార్యుఁడని స్పష్టమగును. అతనియాజ్ఞవలన నీ మతప్రచారమున కయి యాతని పంచవదనములనుండి పంచాచార్యు లుద్భవించిరనియు యుగభేదముల ననుసరించి వారు వేర్వేఱు నామములతో వ్యవహరింపఁ బడిరనియు ఆగమములు తెలుపుచున్నవి.

"సద్యోజాతశ్చ ప్రథమో, వామదేవో ద్వితీయకః
అఘోరస్తు తృతీయస్తు, తత్పురుషశ్చతుర్థకః
ఈశానః పంచమశ్చేతి, ముఖాని మమ సర్వశో
తాన్యాననాని గోత్రాణి, వేదోక్తాని నసంశయః
వృషో నందీ తథాభృంగీ, వీరశ్చ స్కంద ఏవచ
మత్స్వరూపా త్సముత్పన్నాః, పంచగోత్రాధికారిణః,
రేణుకో దారుకశ్శంఖ,కర్ణశ్చ ధేనుకర్ణకః ।

విశ్వకర్ణశ్చ పంచైతే, పంచగోత్రసముద్భవాః
ఏతేషాం పంచనామాని యుగభేదేన సర్వశః
ఏకాక్షరో ద్వ్యక్షరశ్చ, త్ర్యక్షరశ్చతురక్షరః
పంచాక్షరః కృతయుగే, పంచనామానిసర్వశః
ఏకవక్త్రో ద్వివక్త్రశ్చ, త్రివక్త్రశ్చతురాననః
పంచవక్త్రేతి త్రేతాయాం, పంచనామాని సర్వశః
ద్వాపరే రేణుకశ్చైవ, దారుకశ్చద్వితీయకః
శంఖకర్ణః తృతీయశ్చ, ధేనుకర్ణశ్చతుర్థకః
విశ్వకర్ణశ్చ పంచైతే, పంచనామాని సర్వశః
రేవణో మరుళశ్చైకో, రామేతి పండితస్తథా
విశ్వారాధ్యఇతి ప్రోక్తాః, కలౌ పంచార్యనామకాః
వీరశైవమతోద్ధార, హేతవే పంచ తావపి
మన్ముఖేభ్యస్సముత్పాద్యాః, తై రేవాకర్ష మంజసా"
(సుప్రబోధాగమము)

శ్లో॥ 'అతఃపరం ప్రవక్ష్యామి, పంచాచార్యసముద్భవం
తేషాం నామాని దేవి త్వం, శృణు నిశ్చలచేతసా
ఘంటాకర్ణగణశ్చాద్యో, గజకర్ణో ద్వితీయకః
తృతీయో రేణుకః ఖ్యాతః చతుర్థో దారుకస్తథా
పంచమో విశ్వకర్ణశ్చ పంచారాధ్యా ఇతి స్మృతాః
తఏవ యుగభేదేన ప్రతినామాన్యుపాగతాః
ఏకాక్షరో ద్వ్యక్షరశ్చ, త్ర్యక్షరశ్చతురక్షరః
పంచాక్షర ఇతిఖ్యాతా స్త్రేతాయాం మేనకాత్మజే!
ద్వాపరే చైకవక్త్రశ్చ, ద్విముఖస్త్రీముఖస్తథా
చతుర్ముఖః పంచముఖ, శ్చేతితే విశ్రుతా గణాః
ఏకోరామః పండితార్యః తథా రేవణసిద్ధరాట్
తథా మరుళసిద్ధేశో, విశ్వారాధ్య ఇతిక్రమాత్
భవితారః ప్రవక్ష్యామి, శృణు తజ్జనన క్రమం
దక్షారామే రామనాథ, లింగే యుగచతుష్టయే
ఏకోరామస్య జననం, ఆవాసస్తు హిమాలయే

సుధాకుండాఖ్యసుక్షేత్రే, లింగే శ్రీమల్లికార్జునే
జననం పండితార్యస్య, నివాసశ్శ్రీగిరౌ శివే!
తథా రేవణసిద్ధస్య కుల్యపాక పురోత్తమే
సోమేశలింగే జనన, మావాసః కదళపురే
తద్వన్మరుళసిద్ధస్య, వటక్షేత్రే మహత్తరే
సిద్ధేశలింగజననం స్థానముజ్జయినీపురే
కాశ్యాం విశ్వేశ్వరే లింగే విశ్వారాధ్యస్య సంభవః
స్థానం శ్రీకాశికాక్షేత్రే శృణు పార్వతి! సాదరం'
(స్వయంభువాగమము)

వీనినిబట్టి రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, [విశ్వ]ారాధ్యనామములు క్రమముగా నీపంచాచార్యులకుఁ గలియుగము [న] వ్యవహరింపఁబడుననియు, వీరిపీఠములు వరుసగాఁ గొలనుపాక [(ఆంధ్రర]ాష్ట్రము), ఉజ్జిని (బళ్ళారిమండలము), హిమవత్కేదారము [(ఉ]త్తర హిందూస్థానము), శ్రీశైలము (కర్నూలుమండలము), కాశీ [(ఉ]త్తరహిందూస్థానము) అను క్షేత్రములందు నెలకొనెననియు స్పష్ట[మగ]ుచున్నది. వీనిలో రేవణసిద్ధుని (రేణుకాచార్యుని) పీఠ మాతని [కా]లములోనే కొలనుపాకనుండి మైసూరురాష్ట్రమునందలి కదళీపురము [(బ]ాలెహొన్నూరు)నకుఁ దరలింపఁబడినట్లు రేణుకవిజయము మున్నగు [గ్ర]ంథములవలనఁ గాననగును. పండితారాధ్యునిపీఠము శ్రీశైలమునుండి [...]ఁకల్లున కొకశతాబ్దిలోపలఁ దరలింపఁబడినది. తక్కిన మూఁడు [పీఠ]ములు నిప్పటికి ఉజ్జిని, కేదార, కాశీక్షేత్రములందే నెలకొని [య]ున్నవి. ఇట్టులీ పంచాచార్యులచేఁ బ్రతిష్ఠింపఁబడిన పంచ సింహా[సన]ములు పారంపర్యముగ ననాదినుండి తన్మతాచార్యులచే నధిష్ఠింపఁ[బడ]ి నిర్వహింపఁబడుచుండ క్రీస్తుశకము 1130-1170 మధ్యఁ గళ్యాణ[పట్ట]ణమున, బిజ్జలునిమంత్రిగానుండిన బసవేశ్వరుఁడే యీ మతమునకు [మూ]లాచార్యుఁడనికాని యాతని సమకాలికుఁడగు మల్లికార్జున పండి[తు]ఁడే పంచాచార్యులందలి పండితారాధ్యుఁడని కాని తలంచుట కేవల[మ]సంగతము. బసవేశ్వరుఁడు, మల్లికార్జునపండితుఁడు క్రీస్తుశకము [పన్న]ెండవ శతాబ్దియందు వీరశైవమతము నుద్ధరించి క్రమముగఁ గర్ణా

టాంధ్ర దేశములందు విస్తరింపఁజేయుటకై యవతరించిన మహాపురు
షులేగాని యీ మతాచార్యు లెన్నటికిని గారు. పాలకురికి సోమనా
థుఁడుగూడ వారిని మతాచార్యులుగా నెచ్చటను జెప్పియుండలేదు.
శివలెంక మంచన, శ్రీపతి పండితులకు వలెనే మల్లికార్జునునకుఁగూడ
పండితోపపద ముండుటచేతను, వీరశైవమతోద్ధారకులలోఁ బేరెన్నిక
గన్న బసవేశ్వరుని కాలముననే యాతఁడుకూడ నుండుటచేతను నాతఁడే
వీరశైవ పంచాచార్యులందలి యాచార్యపండితుఁడని భ్రమించుట
గొప్పప్రమాదము. ఇంతకుఁ బంచాచార్యులలో బసవేశ్వరుని నామమే
కానరానప్పుడు మల్లికార్జున పండితున కందుఁ బ్రవేశము కలిగించుట
మఱెంత వింత కాదా! మఱియు బసవేశ్వర మల్లికార్జున పండితు లిరు
వురుగూడ జీవితాంతము దనుక గృహస్థాశ్రమస్థులయి భార్యాపుత్రు
లతోఁ గాఁపుర మొనర్చినవారని పాలకురికి సోమనాథుఁడు రచించిన చరి
త్రములవలనఁదెల్లమగును. అద్వైతమతస్థుల శంకరాచార్య పీఠాదికముల
వలెనే ఈ వీరశైవ పంచాచార్యుల పీఠాదికములుకూడఁ బారంపర్యముగ
సన్న్యాసాశ్రమము (కేవల సన్న్యాసము కాదు) స్వీకార మొనర్చినవారి
చేతనే యెల్లప్పుడు నధిష్ఠింపఁబడుచున్నవి. బుద్ధిమంతులకు మల్లికార్జునపం
డితుఁడాచార్యపండితుఁడు కాఁడనుటకీ యొక్క విషయమే చాలును. ఆచార్య
పండితుని శ్రీశైల సింహాసనమునకు 'సూర్యసింహాసన'మను నామాంత
రముగూడఁగలదు. తన్మతస్థులు భిక్షావృత్తులను పేరఁగూడఁ జిరకాలము
నుండి వ్యవహరింపఁ బడుచున్నారు. ఐరోపాఖండమునఁ బూర్వకాలమున
రోమక (Rome) సామ్రాజ్యమున (Popes) అను మతాచార్యులు
రాజచిహ్నములు వడసి మహావైభవముతో సమస్తరాజన్యుల పయి
నధికారము నెఱపినట్లే యీ భిక్షావృత్తిమతస్థులు కేవలము శ్రీశైల
క్షేత్రాధిపత్యము నేగాక శ్రీశైల ప్రాంత రాజ్యమున కెల్లఁ బరిపాలకులై
సైన్యపరివారాదికములతో గొప్ప వైభవ ప్రాభవములతోఁ దులఁ
దూఁగుచుండినట్లు శాసనములవలన గ్రంథములవలనఁగూడ వ్యక్తమగు
చున్నది. రాజధర్మముల ననుసరించి వీరు కవుల నాదరించుచు భాషా
పోషకులుగఁగూడ వెలయుచుండిరి. పదునేనవశతాబ్దియందుండిన సుప్ర
సిద్ధాంధ్రకవీశ్వరులు గౌరన శ్రీనాథుల నాదరించి యీ మతస్థులు

మునపేరఁ గృతులఁగూడ నంకిత మొందిరి. కావున తన నవనాథచరిత్ర
మను ద్విపదకావ్యమును శాంతభిక్షావృత్తియతీశ్వరుని యాజ్ఞాను
సారముగా శ్రీశైలమల్లికార్జున స్వామి కంకిత మొనర్చి గ్రంథావతారి
కలో నాయతీశ్వరుని తపోవిశేషాదికముల నేగాక యాతని రాజ్యవైభవ
ప్రాభవములఁ గూడ నెక్కుడుగ వర్ణించియున్నాఁడు. శ్రీనాథుఁడు
న శివరాత్రిమాహాత్మ్యమునుగూడ నీ శాంతభిక్షావృత్తి యతీశ్వరుని
యానతిచొప్పుననే యాతని మూలభృత్యుఁడగు ముమ్మయ శాంతయ్యకు
ర రచించినాఁడు. కావున నిట్టి యనేక కారణములచే మనయాచార్య
పండితుని శ్రీశైల భిక్షావృత్తిమఠమునకు మల్లికార్జున పండితునకు
నెట్టిసంబంధమును లేదని వేఱ చెప్ప నక్కఱలేదు. బసవేశ్వరుని
దర్శింప నేగుచు మార్గమందు వనిపుర ప్రాంతమున
యాతని నిర్యాణవార్తవిని మిక్కిలి పరితాపించి, శిష్యులతో శ్రీశైల
యాత్రయొనర్చి బసవేశ్వరుఁ డవతారమును జాలించి వెడలినపుడు
గానుండియుఁ బ్రయోజనము లేదుకావున సంగమేశ్వరక్షేత్రమం దా
బసవేశ్వరుని నైక్య మొనర్చుకొన్నట్లే మల్లికార్జునపండితుఁడు తన్నుకూడ
నైక్యమొనర్చికొమ్మని శ్రీశైల మల్లికార్జునునిఁ బ్రార్థించి యాస్వామి
యం దైక్యమయినట్లు సోమనాథుని పండితారాధ్య చరిత్రమువలన
వ్యక్తమగును. మల్లికార్జునపండితుని యనంతర మనతికాలములో రచింపఁ
బడిన యీ గ్రంథములో నింతకంటె నాతనికి శ్రీశైలముతో నెట్టి
సంబంధము చెప్పఁబడి యుండలేదు. అతఁడంతకుముందెప్పుడు శ్రీశైల
మందుండినట్లుగాని, నిర్యాణసమయమునైన నచ్చట మఠము నెలకొల్పి
నట్లుగాని యందేమియు వర్ణితముకాలేదు. ఈ మల్లికార్జునపండితుఁ
డారాధ్యబ్రాహ్మణవంశ్యుఁడు. సోమనాథుఁడు రచించినగ్రంథమం
దుగ్గడింపఁబడిన యాతని చరిత్ర సంగ్రహ మిది.

“గోదావరీ మండలమున దక్షారామక్షేత్రమందు వెలసిన భీమే
శ్వరస్వామికి భీమనపండితుఁ డారాధకుఁడుగానుండెను. అతఁడు సంతా
నార్థమై శ్రీశైలమల్లికార్జునునిఁగూర్చి తప మొనర్పఁగా నా స్వామి
యనుగ్రహమున నాతనికిఁ బుత్రుఁడుదయించెను. భీమనయు నాతని
భార్య గౌరాంబయు నాతనికి మల్లికార్జునుఁడన్నియే పేరిడిరి. తరువాత

వారు మరల దక్షారామమున కేఁగిరి. ఆ ప్రాంతమందు వసించు కో
పల్లి యారాధ్య దేవుఁడను శైవాచార్యునివద్ద మల్లికార్జునుఁడు
శైవదీక్షఁబడసి యాతని యనుగ్రహమువలన సకలవిద్యాపారగుఁడు
వీరశైవమత ప్రచారమునకుఁ గడంగెను. కర్ణాటదేశమున బసవేశ్వ
డొనర్చు మత ప్రచారమునుగూడ నీతఁ డచ్చటినుండివచ్చు జంగము
వలనవిని యానందించుచు నాంధ్రదేశమున మతప్రచార మొనర్చు
బసవేశ్వర సందర్శనార్థమై బయలుదేరెను. మార్గమున గుంటూ
మండలమున దశదపురము (చందవోలు)న రాజ్యమేలు వెలనా
చోడు నాస్థానమున మత వివాద మొనర్చి యాతఁడు
పాండిత్య శక్తిని బ్రకటించెను. వెలనాటిచోడుని బౌద్ధ గురువు
మల్లికార్జునునిశిష్యు లొనర్చిన యుపచారము నెపముగాఁగొని
రాజేంద్రుఁడు పండితుని కనులఁ బెఱికించెను. అప్పుడు పండితా
ధ్యుఁడు చందవోలునందలి యురులింగోద్భవస్వామిని స్తుతించి తన నే
ములతోపాటు మూఁడవకన్నునుగూడఁ బడసి వెలనాటిచోడుని శ
యచ్చటనుండి ప్రయాణమును సాగించెను. ఆతఁడు వనిపురప్రాంతము
నుండఁగా బసవేశ్వరుఁ డంతకు నెనిమిదిదినములై యవతారము
జాలించి సంగమేశ్వరునం దైక్యమయ్యెననువార్త భక్తులవలన
వచ్చెను. దానికిఁ బండితుఁడు కడుంగడుఁ బ్రలాపించి శిష్యులతో శ్రీ
శైలమున కేఁగి బసవేశ్వరుఁడు వెడలిన తరువాతఁ దాను లోకము
నుండియుఁ బ్రయోజనములేదు. కావునఁ దన్నుఁగూడ నైక్య మొనర్చు
కొమ్మని మల్లికార్జునస్వామినిఁ బ్రార్థించి భార్యాపుత్ర సహితము
నా దేవదేవుని గర్భమం దంతర్హితమయ్యెను. అప్పు డాతని శిష్యుఁ
డోనయ్య భక్త ప్రార్థనముపయి తండ్రితోను సోదరులతోను మల్లి
కార్జునస్వామియం దైక్యముగాక నిలిచియున్న పండితారాధ్యుని
పుత్రుఁడు కేదారయ్యకు లోకారాధ్యపట్టముగట్టి పూజించుచుండెను.

ఇట్టి నిజచరిత్రమును సరిగా గుర్తింపక కర్ణాటక కవిచరిత్ర
కారులు 1907 వ సంవత్సరమునఁ దాము ప్రకటించిన యా కవిచరిత్ర
ములో వీరశైవ పంచాచార్యులలో వినవచ్చు పండితారాధ్యుఁడే మల్లి
కార్జున పండితుఁడేయని భ్రమప్రమాదములకు లోనై లిఖించిరి. వీ
వ్రాఁతనుఁజూచియే కొందరు విషయవిమర్శన మొనర్పక, సంస్కృత

...తారాధ్యచరిత్రను ద్రావిడకన్నడ వివరణముతోఁ బ్రకటించిన వీర
...పండితులు శ్రీ ఎస్. ఆర్. కటిబసవశాస్త్రిగారుకూడఁ దమ
...తారికలో నీ ప్రమాదమును దాముగూడ దొరలించిరి. ఇట్లే వీరి
...సరించి గతానుగతిక న్యాయమున నితరులుకూడఁ బొరపడుటకుఁ
...ణమయినది. చరిత్రపరిశోధకులు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు
...తులుగారుమాత్రము పొరపడక ఆంధ్రసాహిత్య పరిషత్తువారు
...టించిన మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునకుఁ దాము వ్రాసిన
...లో నిట్లు యథార్థమును లిఖించిరి.

"సంస్కృత పండితారాధ్య చరిత్రమును గర్ణాట భాషాంతరములో మైసూరు
...ఁ బ్రకటించిన శ్రీయుత కటి బసవశాస్త్రిగారు పీఠికలో నిప్పుడు గుత్తిలోనున్న
...మతమే పరంపరాగతమైన మల్లికార్జున పండితారాధ్యుని మతమనియు, దానిని
...వృత్తిమత మనికూడ ననిరెదరనియు వ్రాసియున్నారు. కాని వారందుకు
...యు నాధారములు చూపి యుండలేదు. పండితారాధ్యుని మతము జంగమమత
...తికిని గానేరదని నా తాత్పర్యము. ఏలయన మల్లికార్జునుఁడు బ్రాహ్మణత్వము
...నవాఁడునుగాఁడు. సన్న్యాసమును పుచ్చుకొనినవాఁడునుగాఁడు. జంగమ మతము
...నీ రెండును నావశ్యకములు...."

ఇదియుఁగాక యీతనితరువాత నీతని మతమును వ్యాప్తి చేసిన
...ది గృహస్థపీఠమేగాని సన్న్యాసపీఠము కాదనియు నా పీఠస్థులు పండి
...కుమారుఁడైన కేదారయ్యయొక్కయు, శిష్యుఁడైన దోనయ్య
...క్కయు సంతతివారనియు స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. కావున
...వృత్తి మత మనఁబడు జంగమ మతమునకును పండితమతమునకును
...బంధము లేనట్లు స్పష్టపడుచున్నది. శ్రీశైలముమీఁద 15-వ శతాబ్ద
...ందు భిక్షావృత్తి మత మొకటి యుండెనని శాసనములవలనను శ్రీనా
... శివరాత్రి మాహాత్మ్యమువలనను మన మెఱుఁగుదుము. శ్రీనా
...డు తనగ్రంథమును భిక్షావృత్తి యతీంద్రుని యనుజ్ఞ ననుసరించి
...తని శిష్యుని కంకితముగ వ్రాసెను. ఈకవియే పండితారాధ్య చరిత్ర
...ను ద్విపదకావ్యముగ రచించె నన్నమాట మనము మఱచిపోరాదు.
...వునఁ బండితారాధ్యులకును భిక్షావృత్తి మతమునకును నేవిధమైన
...బంధమున్నను శ్రీనాథుఁడు తన శివరాత్రి మాహాత్మ్యమునందుఁ
...ప్పియుండును. అట్లాతఁడు చెప్పియుండలేదు.*" (సశ్లేషము)

* ఈ విషయమును గూర్చిన పెక్కు చరిత్రాంశములు ముందుసంచికలలో రాఁగలవు.
—సంపాదకుఁడు.

# ధ్యానము

## గుండు శానప్పశాస్త్రిగారు

ఉ. కూరిమి కొండరా సొగసుకూఁతురు పెండిలియాడునప్పు డొ
య్యారము మీఱ లేనగవుటందము చెక్కులపొంత నాటలన్
జీరుచునుండ, పైటపయి జేరిన కమ్మబెడంగు నంచుపై
జేరి నటించుచుండ, తమి జేరిన బోటులబోటుమాటలన్
దూరినరీతి, శీవి గనుదోయి మెదల్పగ, మిత్తిగొంగ సిం
గారపుమానికంబులను గాంచి మనంబున గొంకుచుండి బల్
గారవమున్ బ్రియంబును చొకారపుటందము సిగ్గుగల్గి, తా
జేరగరాని దుందుడుకుచే, రతనాలు శిరంబుపై పయిన్
బోరున జారబోయ, వలపుల్ తలపుల్ మది సందడింపగా
సారెకు నవ్వుచుండు మన సాంబుడు శ్రీ జగదీశ్వరుండు; ని
స్సారభయప్రధాన రిపుజాలమహాఘవినిర్మితోరు సం
సారకఠోరభీకరప్రచండతమఃప్రకరప్రభంజనా
కారుడు; గోత్రభిత్తనుజగాఢశిలీముఖభంజక ప్రభాం
కూరమహాస్త్రసంజనిత ఘోర రణాస్మిత మండితత్రియీ
సారుడు; ప్రీతిఁ బాశుపతశస్త్రము, నర్జును కిచ్చు భిల్లు డిం
పారగ దారుకావనవిహారకురంగవిలోకి సుందరీ
మారుఁడు కుక్కుటేశ్వరుఁడు మామకసౌఖ్యవిధాత గావుతన్.

మ॥ హరిలోకేశులు సంతతంబు భవదీయాంఘ్రిద్వయిన్ గొల్చి సు
స్థిరమౌ ప్రేమకు బాత్రులై రనిన యాసేవా మహత్త్వంబొ స్వ
కరుణాత్త్వమొ గాక నే నెరుగ తర్కింబేల మాబోంట్లకున్
పొరపాట్లుండకమాన వే కరణి ని న్పూజించి మెప్పించెదన్.

---

# కుమారసంభవము గూఢవస్తుమయ కావ్యమే!

దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు
(ఆంధ్ర విశ్వవిద్యాలయ సభ్యుడు)



*నన్నెచోడ "తేంకణాదిత్య" కవి తన కుమారసంభవమ్ము (ను)......గూఢ వస్తుమయ కావ్యముగా......చెప్పినాడని తదుదాహరణములతో సిద్ధాంతము చేయవచ్చునని నా పరిశీలనా ఫలితము చెప్పుచున్నది.

"గూఢవస్తుమయకావ్య" పరిభాషాసూచన ఆంధ్ర కుమారసంభవ "కావ్య ......నన్నిచోడు(డు)." తాను "తేంకణాదిత్యుండ"నని "సూర్యవంశ" ...పర్యాయముగా ప్రకటించుకొని యున్నాడు.

దీని కనుగుణముగా:

"భారవి" కవి తన కిరాతార్జునీయములో......(గూఢ) వస్తుకవితను...... ...కైల నగారోహణవర్ణనల జనారాధితు" డైనట్లే... తేంకణాదిత్యకవి (భారవి... ...స్యుడు) తన కుమారసంభవములో "—(గూఢ) వస్తుకవితను......ఉదయపర్వత ...రాగారోహణ......వర్ణనల జనారాధితు" డైనాడు.

ఇది "గూఢవస్తుమయకా" వ్యోదాహరణ పరిశీలనకు దోడ్పడుచున్నది.

"ఉద్భట" కవి తన "కుమారసంభవమ్ము నలంకారము గూఢవస్తుమయకావ్య ...గా......చెప్పి మెప్పించి..." నట్లే తేంకణాదిత్యకవి (ఉద్భటుఁడు - ఆది ...స్యుడు) తన "కుమారసంభవమ్ము నలంకారము గూఢవస్తుమయ కావ్యముగా— ...ప్పి - మెచ్చించె" నని తదుదాహరణములతో నిరూపించవచ్చును.

ఇక, నన్నిచోడాంధ్రకుమారసంభవమందలి :

"కరములు తునుముడు పరముని
వరదునిఁగాఁ గొలిచి కవితవలనసె మగుడన్

---

* నన్నిచోడకవి కాలమును గూర్చి 'విభూతి'లోని చర్చను పాఠకు లెఱింగియే ...యుందురు—పూర్వవ్యాసకర్తలగు శ్రీ రెడ్డిగారు ప్రస్తుతము మూఁడు శీర్షి కలుగల ...కే వ్యాసమును పంపియున్నారు. ఇందు "కుమారసంభవము గూఢవస్తుమయ ...వ్యమే" అను వ్యాసము శ్రీ బండారు తమ్మయ్యగారి వ్యాసము చూడకమునుపే ...వ్రాయబడినది. విమర్శకులు సూక్ష్మముగ నీ వ్యాసమందలి యంశములను గమనింప ...కోరియున్నది. —సంపాదకుడు.

కరములు పడసి జగంబునఁ
బరఁగె మహాకవి యనంగ బాణుఁడు పేర్మిన్.''

అనే మార్గసత్కవీశ్వర సంస్తుతికి అనుకరణముగా :

సీ. "గద్యంబుచెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసిన బాణుఁదలఁచి''

పెదపాటి ఎఱ్ఱాప్రెగడ "కుమారనైషధము''ను రచించియున్నాడు.

అయితే, "బాణుడు'' కాదంబరీ - హర్షచరిత్రాది గద్య కావ్యములలో "కరములు తునుముడు – "దైవజ్ఞ'' కవితవలననే "మగుడన్ కరములు (యుడు)'' అనే సంకేత గణితసూత్రమునకు లక్ష్యగద్యము వ్రాసియున్నాడో లేదో? నాకు తెలియదు. కాని, నన్నిచోడాంధ్రకుమారసంభవములో తదుదాహ గీతపద్యముకలదు. ఇది "బాణాసుర'' కరఖండన సంఖ్యాచరిత్రతో ("దైవజ్ఞ'') గణితభేదమున్నప్పటికిని శాలివాహన కరసంఖ్యా చరిత్రను గూఢవస్తుమయ కావ్యముగా ప్రకటించుచున్నది.

"తదీయ(..."బలినందనులు నూర్వు రందులోన నగ్రజాతుండు బాణుడు... సహస్రకరుడు'' అనే "బాణుని'') బాహాసహస్రంబుఁ గరచతుష్టయావశిష్టంబు దునుముడు)'' అనే బాణాసుర కరఖండన సంఖ్యలకును, నన్నిచోడాంధ్రకుమారసంభవమందలి "దశశతకరములు తునుముడు... ("దైవజ్ఞ'') కవితవలననే మగుడ చతుష్కరములు పడ (యుడు)'' అనే గణితసూత్రసంఖ్యలకును భేదములేదు.

ఇంతేకాక, "బలినందనుఁడు...బాణు''నికిని, ("చోడ'') బలి తనూజుఁడు... బాణు''నికిని "నామైకదేశే నామగ్రహణ'' సాదృశ్యముకలదు.

ఇట్లే, "సహస్రకరుడు...బాణు''నికిని, "దశశతకిరణుడు...బాణు (భా భాను)నికిని కరసంఖ్యా భేదములేదు. కాబట్టి, తేంకణాదిత్యుఁడు తన కుమార సంభవ గూఢ వస్తుమయకావ్యములో "పద్యంబుచెప్పి శంకరునిచే కరములు (పన్ను వార్షికములు) ప్రతిభతోపడసిన బాణుడు (ఆంధ్రకావ్యబాణుడు)'' అనే కీర్తి నార్జించినాడని క్రిందిపద్యసాక్ష్యముకలదు.

"ముదమున సత్కవికావ్యము
నదరగ విలుకాని పట్టినమ్మును (బాణమును) బరహృద్
భిదమై తలయూపింపని
యది కావ్యమె యలరి (?) పట్టినదియుం గరమే!''

అని తన "కావ్యబాణ'' బిరుదును సమర్థించుటయే కాక, "బాణకర' ప్రాముఖ్యమును (పర్యాయ శబ్దములతో)సూచించియున్నాడని పాఠకులు జ్ఞప్తియం దుంచుకోవలెను. కాబట్టి, "బాణు''డనగా (భాణుడనే) తేంకణాదిత్యుఁడని కాని, ("చోడబల్లి తనూజు''డనే) బలితనూజుడనికాని, (బాణములు కలవాడనే) కావ్య బాణుడనికాని, "విలుకా[?]''డని కాని (వీరందరివంటివాడనికాని) చెప్పవచ్చును''

ఇంతేకు, నన్నిచోడాంధ్రకావ్యమందలి సంఖ్యామయ గీతపద్యములో ,,గూఢ మయకావ్య దైవజ్ఞ సుకృతి''ని ధ్వన్యనుప్రాణిత సంఖ్యానిర్ణయములో గురు గవలెనేకాని, కేవలశబ్దార్థములతో కాదని తదుదాహరణ సంఖ్యాచరిత్రము ుక చెప్పుచున్నది.

తేంకణాదిత్యకవి తన కృత్యవతారికలో—

,,గుఱు తెల్లి(గి వస్తుచయమున
కొఱ(గెడు నా దీపవర్తియునుబోలె నిజ
మ్మెఱి(గి కృతి (గూఢ) వస్తుసమితి (ని)
వలలగ మదినెఱు(గు విబుధవర్గము( దలతుఁ.''

అని ,,నిజమ్మెఱి(గి కృతి (గూఢ) వస్తుసమితిని'' పరీక్షింపుడని పాఠకులను చ్చరించి యున్నాడు. కాన నన్నిచో డాంధ్రకుమారసంభవ గూఢవస్తుమయ వ్యమందలి ధ్వన్యనుప్రాణిత సంఖ్యాచరిత్రను నిస్సందేహముగా విశ్వసింప ను.

ఇంతేగాక తేంకణాదిత్యకవి తన కృత్యవతారికలో—

,,అన్యతారకవితతుల (ఇతర గూఢకవి సంఘములను) నాదరించి
వెలయ సత్కవి బుధగురు బలము వడసి
యొనర దైవజ్ఞునట్ల (జోస్యునివలె-గణకునివలె) శుభోదయమున
దివ్యసుకృతి( (''ప్రబంధము''ను) బ్రతిష్ఠింతు(దిరము (స్థిరము) గా(గ''

అని ప్రతిజ్ఞ కావించియున్నాడు. కాబట్టి, తేంకణాదిత్య—నన్నిచోడ జన డు "జంగమ మల్లయ వరమునందు( గనిన (గూఢ) వస్తుకవిత'' నభ్యసించిన ని తదుదాహరణములతో సిద్ధాంతము చేయవచ్చును.

"దైవజ్ఞ'' గూఢవస్తుకవితోదాహరణములు తేంకణాదిత్యకవి తనకృతి పరిస ప్రాశ్వాసములో ''ఇట్లు శతముఖదశశతకరపరిఘశోభితుండై యనేక విధాయుధ ంబులు గురియుచుం చెరలనెత్తి'' అని బాణగద్యమును వ్రాయుటయే కాక,

గీ. "ద్వాదశార్ధార్ధనయను నా ద్వాదశార్ధ
వదను( డొగి(జుట్టి నిజభుజద్వాదశమున
నుదయ దశశతకిరణు( డయ్యుదయనగము(
గిట్టి దశశత కరముల( జుట్టినట్లు.''

అని అ య్యుదయనగ గీతపద్యమును వ్రాసియున్నాడు.

ఈ గీతపద్యము ''ఉదయపర్వత శిఖరాగ్రారోహణ'' (గూఢ''వస్తుకవితా)- లు'' కలదని ''భారవి''—ఆదిత్యుడు—తేంకణాదిత్యుడు తన కృత్యవతారికలో చించుటయే కాక, (''ఇ య్యుదయనగ'') "గూఢవస్తు కవితాకరసంఖ్య'' లలో రములు తునుముడు—(దైవజ్ఞ) కవిత వలననే మగుడఁ కరములు పడ (యుడు)'' నే సంకేత సంఖ్యలను బోధించి, తాను ,,దైవజ్ఞు''నివలె ,,అ య్యుదయనగ''మందు ముగా ,,శుభోదయము''ను ప్రతిష్ఠించి యున్నాడు.

ఈ "దైవజ్ఞత్వము"ను ,,విస్ఫురదవదాత ఖడ్గలత పూచెను నా జయశ్రీ సంపదన్."

* * * *

"(గూఢ) శక్తిధర ముఖవిజయ ప్రశస్తశాసన లిఖితాక్షరంబులయ్యె" న దైవజ్ఞ శాసన లిఖితాక్షరంబులు బలపరిచుచున్నవి.

## నన్నెచోడ కవికాలము
### (పెద్దచెరుకూరు శాసనాధారము)

ఆంధ్రకుమారసంభవ మందలి చోడబల్లి వంశమునకును, పెద్ద చెరుకూ శాసనమందలి చోడబల్లి వంశమునకును భేదము లేదని (ఆంధ్రభాషాలేత్త విమ కాలవేత్త లొకరిద్దరు తప్ప) చారిత్రికు లంగీకరించి యున్నారు. కాని, పరిదపూం దానకాలము పెద్ద చెరుకూరు శాసనములో లేనందువల్ల; చోడబల్లి తనూజుని నన్నిచోడకవి కాలనిర్ణయములో చారిత్రికులు భిన్నాభిప్రాయము కలవారై యు మాట వాస్తవము.

నన్నిచోడకవి తన జాను తెనుగు కుమారసంభవములో "గూఢ ,వస్తుమ కావ్యము"గా వ్రాసిన తత్ప్రబంధరచనాకాలమునుబట్టి కాకతీయగణపతి సామం డయిన మల్లిదేవచోడుని పెద్దచెరుకూరు శాసనకాలమును సప్రమాణముగా యించ వచ్చునని నాకు తోచుచున్నది.

డగ్గాంబికా నందనుడయిన మారాయన ఆదిలో ఇక్షుగ్రామాగ్రహార ( పెద్దచెరుకూరు) మందలి భీమేశ్వరునికి పరిదపూండిని దానము చేసెననియు, గణ దీనిని "పున:" దానము గావించెననియు, శ్రీమన్మహామండలేశ్వర మల్లిదేవ చో మహారాజు దీనిని 'వీరరాజేంద్ర కాకతీయగణపతి మహాక్షోణీశు'నికి ,,ధర్మార్థ గా (పుణ్యముగా) శాసనము చేసెననియు పెద్ద చెరుకూరు శాసనమందలి పరిదపూం దానచరిత్ర చెప్పుచున్నది. దీనినిబట్టి, మల్లిదేవ చోడరాజు కాకతీయ గణపతిదేవు సామంతుడుగా నుండెనని చెప్పకతప్పదు.

ఇక, పెద్దచెరుకూరు శాసనములో పరిదపూండి దానకాలము లేకపో నప్పటికిని, కాకతీయ గణపతిదేవుని యన్యశాసనకాలమును బట్టి, పెద్దచెరుకూ శాసనకాలమును నిర్ణయించుట కవకాశమున్నది. కాని కొన్ని చిక్కులను పోలేదు. ఇందువల్లనే చారిత్రికులు భిన్నాభిప్రాయములు కలవారగుట కవకా మేర్పడినది.

ఆంధ్రకుమారసంభవ మందలి చోడబల్లితనూజుడయిన నన్నిచోడదేవ కవిరా కాలమునుబట్టి పెద్దచెరుకూరు శాసనమందలి చోడబల్లి కుమారుడయిన నన్నిచోడు కాలమును, తద్వంశజుడైన పెద్దచెరుకూరి శాసననిర్మాత మల్లిదేవచోడుని కా మును నిర్ణయించవచ్చును. పరిశీలింపుడు.

పెద్దచెరుకూరు శాసనమందలి నన్నిచోడకవికాలము

| ఆంధ్రకుమార సంభవమందలి చోడబల్లి వంశము | ఆంధ్రకుమార సంభవ మందలిగూఢవస్తుమయ కావ్య రచనాకాలము (క్రీ. శ. 1054) నుండి తరమునకు 30 సంవత్సరముల లెక్కను. | పెద్దచెరుకూరు శాసనమందలి చోడబల్లి వంశము | కాకతీయ గణపతి ప్రథమ దానకాలము(క్రీ. శ. 1202 పిల్లలమర్రి శాసనకాలము) నుండి తరమునకు 30 సంవత్సరముల లెక్కను. |
|---|---|---|---|
| చోడబల్లి | 994-1024 | చోడబల్లి | 994-1024 |
| నన్నిచోడుడు | 1024-1054 | నన్నిచోడుడు | 1024-1054 |
| | | సూరభూపతి | 1054-1084 |
| | | *ఘటంకారుడు | 1084-1114 |
| | | మల్లిదేవుడు | 1114-1144 |
| | | నన్నిచోడుడు | 1144-1174 |
| | | మల్లిదేవుడు | 1174-1204 |

పైపట్టికయందలి చోడవంశీయులకాలనుసుబట్టి, పెద్దచెరుకూరి శాసనము కాకతీయగణపతి రాజ్యారంభకాలములో, ప్రకటింపబడినదని చెప్పకతప్పదు. దీనినే యొక విషముగా చెప్పదలచిన పక్షమందు కాకతీయ గణపతిదేవుని సామంతుడైన మల్లిదేవచోడరాజు (తన రాజ్యాంతిమకాలములో) తన ప్రభువునకు ధర్మార్థముగా పెద్దచెరుకూరునందలి భీమేశ్వరస్వామికి పరిదపూండిని దానముచేసి, శాసనము వ్రాయించినాడని చెప్పవచ్చును.

ఇక, నాంధ్రకుమారసంభవమందలి (క్రీ. శ. 1054) చోడబల్లి కుమారుడయిన నన్నిచోడదేవ కవిరాజును, పెద్ద చెరుకూరు శాసనమందలి (క్రీ. శ. 1024-1054) చోడబల్లి తనూజుడయిన నన్నిచోడుడును క్రీ. శ. 11-వ శతాబ్దమందలి సమకాలికులని నిస్సందేహముగా చెప్పవచ్చును.

కనుకనే, నన్నిచోడ కవిరాజు తన కుమారసంభవమందలి "గూఢవస్తుమయ కావ్యము"లో "విక్రమ శక గత వర్షము ౧౧౧౦ యగు జయసంవత్సర చైత్రశుద్ధ ... మంగళవారము" నాటికి (సరియైన 15-3-1054 తేది నాటికి) తన కుమారసంభవరచనాకాలమును ప్రతిష్ఠించియున్నాడని చెప్పకతప్పదు.

కాబట్టి, ఆంధ్రకుమారసంభవ కావ్యకర్త నన్నిచోడదేవ కవిరాజును, రాజరాజనరేంద్రుని నందంపూడి శాసనకావ్యకర్త నన్నియభట్టును క్రీ. శ. 11-వ శతాబ్దమందలి (1053) సమకాలిక కవులని నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఆంధ్రకుమారసంభవ "సత్కళాధిపతి భవ్యుడు జంగమమల్లికార్జునయో(గి)" ...శ్రీనగోత్తుంగ (శ్రీశైలోత్తుంగ) మణిశ్రీసంగతమల్లికార్జునదేవతాకంబై జగంబులం

* ఘటంకారుని సోదరుడు రాజరాజచోడుడు. 1084-1114.

బ్రిత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమమల్లికార్జునదేవుం" డైనా డని "సత్కవి ఘు నన్నెచోడుడు" తమ దివ్యకథలో చెప్పియున్నాడు. కాబట్టి ఆంధ్రకుమారసంభ కావ్యకర్త నన్నిచోడదేవ కవిరాజును, సత్కథాధిపతి (కృతిపతి) జంగమమల్లికార్జు యోగియును పాకనాటిదేశనివాసులని నిస్సందేహముగా చెప్పకతప్పదు.

ఇక "ఒరయూరి కధిపతి" నని నన్నిచోడకవి చెప్పుకొనుట బిరుద ప్ర యమే కాని, నిజరాజధానీ పురాధిపత్యము కాదని చెప్పకతప్పదు.

ఇంతకును పెదచెరుకూరి శాసనములోని కందుకూరి పాకనాటి చోడులకు నన్నెచోడుని కుమారసంభవములో ప్రస్తావింపబడిన అయ్యుదయగిరిపాకనాటి చో లకును భేదములేదు. కనుక, క్రీ. శ. 11-వ శతాబ్దమందలి నన్నిచోడ, నన్నియభ కావ్యకర్త లిద్దరు సమకాలి కాంధ్రభాషాకావ్య సృష్టికర్తలని చెప్పక తప్ప

చళుక్యభీముఁడే: చాళుక్యరాజ దేశిసత్కవి

నే నీ వ్యాసములో దేశికవితఁ బుట్టించి తెనుంగు నిలిపి (న)—చాళు రాజు; "చళుక్యభీమ" దేశిసత్కవి యని కాశీఖండాది కావ్యప్రమాణముల నిరూపించ తలచినాను.

శ్రీనాథ కవిసార్వభౌముడు తన భీమఖండములో—

"హారచూడాహరిణాంకవక్రితయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీపర్యంతకాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్ దిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్."

అని కవిసమయలక్షణమును నిర్వచించి, తన కాశీఖండములో:—

"ఈక్షోణి న్నినుఁ బోలు సత్కవులు లే రీనేఁటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమ వరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణ ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ భవదీయప్రౌఢసాహిత్యముల్."

అని కవిసమయలక్ష్యము నుదాహరించియున్నాడు.

ఇక, "వర గంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ గంధసారఘుసృణ" క సమయమునకు—"కాఠిన్యమున్ సరసత్వంబును సంభవిం(చి)న—సత్కావ్యముల్" అని శ్రీనాథకవి హృదయానుసారము వ్యాఖ్యానముచేయుట దోషముకాదు. వి షించి, కాశీఖండములో "ఛందోవితతి కుచ స్తబక యుగము" అని శ్రీనాథు వ్యాఖ్యానముకలదు.

ఇంతేకాక, శ్రీనాథకవి కాశీఖండమందలి "దక్షవాటీక — భీమేశ్వరు" శనివారోత్సవములో:—"దేశిమార్గమున గంధర్వాప్సరోనృత్తముల్" అని వర్ణించి యున్నాడు. దీనికి బింబ ప్రతిబింబముగా:—దేశిమార్గమున గంధర్వాప్సరో (వక్షో

(వు) వృత్తముల్—అని సవరణ నుపపాదింపవచ్చును. కనుక నే, "...........
.........................(పయోనర) సత్కావ్యముల్ దిక్కులం జిరకాలంబు
...చుండుఁ గవిరాజీగేహరంగంబులన్."

అని శ్రీనాథుడు దాక్షారామభీమఖండములో వర్ణించియున్నాడు.

ఇంతకు 'దేశిమార్గము'న సాహిత్యమును, నాట్యమును కల వని తాత్పర్యము.

ఇక నీ కవిసమయమును నట్లుంచి, తక్కిన పద్యచరిత్రను పరిశీలింతము.

రెడ్డివేమవిభుఁడు శ్రీనాథు నుద్దేశించి:—

(మాప నాశ్రితుఁడ వనఘ,) వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండ
నొక్కొక్కమాటు"

కవిసార్వభౌమ, భవదీయ ప్రౌఢసాహిత్యములు దాక్షారామ చళుక్యభీమ...
రాజ్యభారంబు నధ్యక్షించును. (కనుక నే) ఈ క్షోణిన్, ఈ నేటి కాలంబునన్
(వుడు) నినుఁబోలు సత్కవులు లేరు—అని చారిత్రికముగా ప్రశంసించి
న్నాడు.

ఈ ఘట్టమందలి "వేములవాడ భీమనభంగి—దాక్షారామ చళుక్యభీమ-
రాజ్యభారంబు" అను వాక్యములను సందర్భానుగుణముగా, వేములవాడ భీమన
...(ఉద్దండలీలాసాహిత్యభంగి—దాక్షారామచళుక్యభీమసాహిత్య...ద్వైరాజ్య
...) భారంబు" అని యరము గ్రహించక తప్పదు.

అయితే "వచియింతు—అధ్యక్షించున్" అను క్రియలు పరస్పర వ్యతిరేకార్థ
...లు కావా? అని సందేహము కలుగవచ్చును. కాని, యీ యలంకార క్రియా
...ము—చారిత్రిక క్రియాభేదమును సూచింపదు. మరియు నిక్కడి క్రియలు "వచి
...(వు) ఒక్కొక్కమా టధ్యక్షింతువు" అనే సమన్వయమును నిస్సందేహముగా
...ంచుచున్నవి.

అయితే, "వేములవాడ భీమన, దాక్షారామ చళుక్యభీమ(న) అను నామములు
...త్రిక వ్యక్తిభేదమును సూచింపవా? అని మరియొక సందేహము కలుగవచ్చును.
..., క్రింది క్రమాలంకారములను సావధానముగా పరిశీలించినపక్షమందు వేముల
... భీమనకును, దాక్షారామ భీమనకును వ్యక్తిభేదము లేదని చెప్పకతప్పదు.

"వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని రేవ సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు."

* * * *

"దాక్షారామ చళుక్యభీమ (సాహిత్య) ... ... ... ...
ద్వైరాజ్యభారంబు నధ్యక్షించున్ గవిసార్వభౌమ భవదీయప్రౌఢ సాహిత్యముల్."

* * * *

"శబ్దశాసను నన్నపాచార్యుఁ దలఁచి
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
సత్ప్రబంధ మహేశ్వరు శంభుదాసు
నధికతరభక్తి సంయుక్తి నాదరించి."

అని కలవు.

శ్రీనాథుడు తన కాశీఖండ పూర్వాంధ్రకవి సంస్తుతిలో _ వేములవాడ భీమ
చాళుక్య వంశభేదమును సూచించుటకు కాబోలు "దాక్షారామ చళుక్యభీమ (
యనే నామాంతరముగల వేములవాడ (చళుక్య) భీమనను చేర్చకపోయినప్పటి
తన "యుభయవాక్ప్రౌఢి" యొక్కొక్క మాటు వేములవాడ (చళుక్య భీమ
నుద్దండలలగా నుండుననియు, మరియొక్క మాటు దాక్షారామ చళుక్యభీమ ద్వై
జ్యభారంబు (ప్రౌఢి) నపేక్షించు ననియు సగర్వముగా వ్రాసికొని యున్నాడు.

ఈ పద్యమందలి "దాక్షారామ చళుక్యభీమ (సాహిత్య) ద్వైరాజ్యభార
నకును, వేములవాడ భీమన (సాహిత్య) భంగికిని భేదము లేదు." కనుకనే రెడ్డి
విభుడు తమ కాశ్రితుడయిన శ్రీనాథకవి సార్వభౌమునికి —"ఈక్షోణి న్నినుఁ
సత్కవులు లే రీనేఁటి కాలంబునన్" అనే బిరుదు నిచ్చియున్నాడు.

ఒకవేళ, శ్రీనాథకవి తనచే నోడిపోయిన వేములవాడ చళుక్యభీమకవి
దాక్షారామచళుక్యభీమకవికి నమస్కరింపకుండుట చమత్కార మనుకొంద
పక్షమున, తనచే నోడిపోయిన "ఎఱ్ఱన శంభుదాసు"కు — అధికతరభక్తిసంయు
నాదరించి — ఒక గీతపద్యపాదమును పాడుజేయుటయే గాక, క్రమాలంకారభ
దోషము గావించియున్నా డని వాదించుట కవకాశ మిచ్చియుండకపోవచ్చు
అనగా పూర్వాంధ్రకవిస్తోత్రగీతపద్యములో సీసపద్యము పూర్వాంధ్రకవి క
క్రమానుగుణముగా:—

"ఆదికవి భీము సద్భక్తి నాదరించి"
(ఆదికవి భీముఁ జాళుక్యు నాదరించి)—
శబ్దశాసను నన్నపాచార్యుఁ దలఁచి
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
(సత్ప్రబంధమహేశ్వరు శంభుదాసు) తలచి.
—"మత్ప్రితామహుఁ గవితాపితామహునిఁ దలఁతున్."—

అని వ్రాసియుండవచ్చు నన్న మాట.

ఇంతకు, రెడ్డి వేమవిభునివాక్యములలో వేములవాడ భీమన (సాహిత్య) భం
కిని, దాక్షారామ చళుక్యభీమ (సాహిత్య) ద్వైరాజ్యభారంబునకును (ప్రౌఢికి
శ్రీనాథుడు "నా మైకదేశమందు నామగ్రహణ"మ్మను ప్రమాణముతో నభేదాభ్య
సాయమును సాధించుటయే కాక పూర్వాంధ్రకవిస్తోత్ర గీతపద్యములో ప్రసక్తి
దోషముగా వేములవాడ చళుక్యభీమనను జేర్చకనే పూర్వకవి కాలక్రమానుగుణ
ముగా యథాసంఖ్యాలంకారమును పోషించియున్నాడు. కాన, క్రీ. శ. 1053 సం

ప్రాంతమందలి నన్నయభట్టకవికంటె; వేములవాడ భీమకవి యనే దాక్షారామ
క్య భీమకవి ప్రాచీను డనుట శ్రీనాథకవి సార్వభౌముని చారిత్రికమతము.

ఇక చాళుక్యవంశములో నన్నయభట్టుకవి కంటె పూర్వీకు లెందరు చాళుక్య
లున్నారో అని పరిశీలింతెము.

[14] చాళుక్య భీముడు 888—918.

[22] ఇతని మనుమడు-చాళుక్య భీముడు 934—945.

[27] నన్నయభట్టకవి పోషకుడు-రాజరాజు 1022—1063.

అనువారు మాత్రి మున్న ట్లాంధ్రికవుల చరిత్రిమందలి చాళుక్య వంశవృక్షము
చున్నది. క్రీ. శ. 1053 సంవత్సరప్రాంతమందలికి నన్నయ భట్టకవి తరువాత
వంశ వృక్షములో చాళుక్య భీములుగాని, భీములుగాని లేరు. అయితే, క్రీ. శ.
నందలి బెజవాడశాసనములో „శ్రీవేంగ్గిదేశ చాళుక్య నంకకాల...శ్రీమన్మహా
క భీమన......" పేరు ప్రస్తావించబడియున్నది. ఇతను క్రీ. శ. 12 వ శతా
దలి వాడు కాన, క్రీ. శ. 11-వ శతాబ్దమందలి నన్నయకు పూర్వీకుడు కాలేడు
క్రీ. శ. 9-వ శతాబ్దమందలి కళింగ గంగుకు సమకాలికుడయిన చాళుక్య భీమ
(వేములవాడ చాళుక్య భీమకవి) కలడు.

రి రంగకవి యానందరంగరాట్ఛందములో:—

"ఆదిమ సుకవి భీమనకు దండము వెట్టి
య(న)న్నయభట్టుకు నర్థి మ్రొక్కి
యమరఁ దిక్కనసోమయాజికిఁ గేల్మోడ్చి
... ... ...
* * * *

1. ప్రాసములకు నాదిమకవి భీమనచ్ఛందము. (కవిజనాశ్రియము)
2. హల్లునకు భీమన హరవిలాసము.
3. 'ప్రతి' అను నుపసర్గయందలి యచ్చుకు భీమన నృసింహపురాణము."

అని వ్రాసియున్నాడు. కాబట్టి, ఆదిమసుకవి భీమనకు, వేములవాడ భీమన,
క్షారామ చళుక్యభీమన యనిపే ర్లున్నట్లు కాశీఖండము ననుసరించి నిర్ణయించక
పను.

ఇంతేకాక, నన్నయభట్టకవికి సమకాలికు డయిన నన్నిచోడదేవ తెంకణాదిత్య
వి తన కుమారసంభవకృత్యాదిలో:—

"మును మార్గకవిత లోకంబున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయంబునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

* * * *

"మార్గ సత్కవీశ్వరులను దేశిసత్కవుల సన్నుతిఁజేసి మనోముదంబునన్."
„క్రమంబున" ("క్రమాలంకారముగా") వ్రాసియున్నాడు.

# విజయదశమి

## దేవీ నవరాత్రులు, దసరా.

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు.



"శ్లో॥ యామాహుః సర్వలోకానాం ప్రకృతిం శాస్త్రపారగాః ।
తాంధర్మచారిణీం శంభోః ప్రణమామి పరాం శివాం॥"

### నవరాత్రములు.

అనంతమగు నీ కాలప్రవాహమున నెన్నియో యహోరాత్రములు గడచిపోవుచున్నవి కదా? ప్రత్యేకముగ నీ నవరాత్రములకు మాత్రమే యింత గౌరవమేల యను ప్రశ్నకు, ఈ విశాలమగు వసుంధరను పాలించిన సకలసార్వభౌములలో శ్రీరామచంద్రునకు మాత్రమే సర్వశ్రేష్ఠత్వ మేల యను ప్రతిప్రశ్నమునే యుత్తరముగా నుదహరించెల్లును. నవరాత్రములు "విజయదశమి" వంటి విషయములనుగూర్చి యిదివర కెంతమంది లేఖకులు జర్చించి యున్నను, నా యీ వ్యాసమున పాఠకులకు బ్రత్యేకత గోచరింపకపోదు.

ప్రతియుగమునను అధర్మము ప్రబలినపుడెల్ల శక్తివిశిష్టుడగు పరమేశ్వరుడు తన ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులతో విచిత్రలీలలఁ బ్రదర్శించుచునే యున్నాడు. నవీనులు అవతారవాదము నంగీకరించని మాత్రమున అవతారము లాగిపోవునా? హిరణ్యకశిపుడు భగవత్తత్త్వమును నిరాకరించినంతనే ప్రహ్లాదునకును ప్రత్యక్షముగాకయుండెనా? తామసులగు నసురులకు బుద్ధిజెప్పుటకయియే శక్తి తనపరివర్తితరూపములో నవతరించుట గలదు. ఇట్టి విషయ మార్య శాస్త్రములందు సయుక్తికముగ నిరూపింపబడియున్నది. నేటి భౌతిక ప్రత్యక్షవాద పద్ధతితోడను అవతారవాదమును నిరూపింపవచ్చును. దానికిఁ బ్రబంధాంతరమునఁ బ్రయత్నింతును.

శక్తియొక్క అవతారము పలువిధములుగ నగుచున్నది. మొదటి దవ్యక్తరూపము. అనగా సామాన్య చర్మచక్షుష్కుల

...గమ్యము, యోగిజనులకు సుగమము. ఈ సమస్త విశ్వమందలి వివిధ ...చేతనాత్మకవస్తువులను సంచలింప జేయుచున్న శక్తి వ్యక్తమై ...త్యక్షమై యున్నను- జగదీశ్వరానుభవము గలుగుచున్నను, మాయా ...మూఢులైన జీవులు స్పష్టముగ నంగీకరించ జాలకున్నారు. ఇదియు ...యోగమాయ. జగజ్జనని జగదీశ్వరుని యనుగామిని. దుర్గా సప్తశతి ...ము దిట్లు విశదీకరింప బడెను—

శ్లో॥ తథాపి మమతావర్తే మోహగర్తే నిపాతితాః ।
మహామాయా ప్రభావేణ సంసార స్థితికారిణా ।
తన్నాత్ర విస్మయః కార్యో యోగనిద్రా జగత్పతేః ।
మహామాయా హరేశ్చైషా తయా సంమోహ్యతే జగత్.

ఈ విషయమునుగూర్చి యక్కజ మందనక్కరలేదు. దీని వాస్త... స్వరూపమును దెలియుట గొంత కఠినమైనను అసాధ్యముకాదు. ...త్యయమైన మాయను దూరదృష్టితో చిరంతనాభ్యాస వశమున ...గురుద్వారా తెలియవచ్చును, ధ్రువము.

ఆ స్తికులలో జిరకాలమునుండి దేవీనవరాత్రములు సుప్రసిద్ధ...లు. ఇంచుమించుగ మానవసమాజమెల్లను శక్తిసేవకమై యున్న... చెప్పనగును. కాని పూజావిధానమున మాత్రము భేదము సహజ...గ నగపడుచున్నది. శక్తిని త్యజించువాడెవడు? ఎల్లరకు నావశ్యకమే! ...ల ముపాస్వ" యను మహామంత్రమును పెడచెవిని బెట్టినవాడే చెడి...వును.

బంగాళా దేశమున దేవీనవరాత్రోత్సవము మహావైభవముగ ...గును. సర్వస్వమును దేవిముందర వెదజల్లుటకు వెనుదీయరు. ...ందూదేశమునం దంతటను శాస్త్రము ననుసరించి యీ పండుగు ...ప్రచారము నందియున్నది. లౌకికముగను శక్తిపూజాఫల మనల్పమని ...ప్పనవసరము లేదు. పరశివశక్తి యగు నీ దేవికే 'దుర్గ'యను నామాం...ముకలదు. దుర్గాసప్తశతి యను మహాగ్రంథము నెరుగనికర్మఠులు ...న దేశమున లేరు. ఉత్తర దేశమున సప్తశతీపారాయణమును "దుర్గా...ఠ్" అని వ్యవహరించుట సుప్రసిద్ధము. భగవద్గీత తరువాత యెక్కువ

ప్రిచారములో దుర్గాసప్తశతియే కలదు. జీవచ్ఛవమగుచున్న భా
వర్షమునకు దుర్గాసప్తశతిని సంజీవినీఘుటికయని నుడువవచ్చు
ఈ యుద్గ్రంథముపై దుర్గాప్రదీప, గుప్తవతి, చతుర్ధరి, శాంతన
నాగోజిభట్టీ, జగచ్చంద్రిక, దేశోద్ధారములను సంస్కృతటీకలుగల
నాకు గుప్తవతి సర్వసుందరమని తోచినది. దేవీదుర్గనుగురించి స్కా
(3-౧-౧౭) మత్స్య (౧3) దేవీభాగవత (౯) పద్మ (స్వ-3
మార్కండేయ పురాణము (దే.మా-౮౧) లందును విశదమైన వర్ణ
గలదు. అది వివిధవిషయములను నిరూపించుచున్నది.

శుంభనిశుంభాది అసురులబాధలవలన ప్రార్థింపబడిన దుర్గ శ
భక్తులగు దేవతలకు నభయపూర్వకముగ, 'మీరు వెరవనక్కరలే
అసురుల జెండాడెదను. ఆశ్వినశుక్లపక్షు ప్రతిపత్తునుండి ఘటస్థాపనా
పూజలనారంభించి యారాధించు'డని యాజ్ఞాపించెను. ఆశ్వయుజశు
పాడ్యమిని ప్రవేశతిథిగా దలంచికాబోలు కొన్ని పంచాంగములలో
గోవిందార్ణవ మను గ్రంథమునందును పూజానిర్ణయతిథులు సరిగ లేవు.

శ్లో॥ పూర్వవిద్ధాతు యా శుక్లా, భవేత్ప్రతిపదాశ్వినీ
నవరాత్రవ్రతం తస్యాం, న కార్యం శుభ మిచ్ఛతా.

యను మార్కండేయ వచనము ననుసరించి పరవిద్ధ యగ
పాడ్యమియే శ్రేష్ఠమనియును, పాడ్యమినా డుదయము అమావాస్య
శేషముండగా బ్రారంభింప గూడదని తెలియుచున్నది. శుద్ధపాడ్యమి
మొదలు ఆశ్వ॥ శు॥ నవమివరకు గ్రమముగ శైలపుత్రి, బ్రహ్మచారిణి
చంద్రఘంట, కూష్మాండ, స్కందమాత, కాత్యాయని, కాళరాత్రి
మహాగౌరి, సిద్ధిద, యను నవదుర్గలను యథావిధిగ బూజింపవలెను.

శ్లో॥ ప్రథమం శైలపుత్రీతి, ద్వితీయం బ్రహ్మచారిణీ
తృతీయం చంద్రఘంటేతి కూష్మాండా చ చతుర్థకం॥
పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతిచ
సప్తమం కాళరాత్రీతి మహాగౌరీతి చాష్టమం
నవమం సిద్ధిదాత్రీతి, నవదుర్గాః ప్రకీర్తితాః.

ఈ నవదుర్గల పూజాకృత్యముల ననుసరించియే యీ తొమ్మిది
...లకు నవరాత్రిములను వ్యవహారము గలిగినది. కాశీక్షేత్రమందు
...త్యేకమైన యీ నవదుర్గామందిరములను పూజావైభవములను
...చి ధన్యులుగాదగును.

వ్రతవిధియిట్లుగలదు: పాడ్యమిప్రాతఃకాలమున నభ్యంగస్నాన
...నర్చి, నిత్యకృత్యముల నెరవేర్చి ఘటస్థాపన, దుర్గాపూజ, కుమారీ
...జల నొనర్చవలెను. కుమారి ప్రాయము, రెండువత్సరములు
...దలు పది వత్సరముల దనుక నుండనోపును. కుమారీపూజ,
...శతీ పారాయణము, దేవీభాగవతశ్రవణము, నందాదీపము,
...భుక్తము మొదలైన యీ కర్మలు నిత్యముగ దశమివరకు
...వించుచుండవలెను. అంతిమదినమందు ప్రసాదమును శిరసాస్వీకరించ
...లెను. పూజింపబడు కుమారికలందు త్రిమూర్తి, కల్యాణి, రోహిణి,
...డిక మున్నగు దేవీభావముల నుంచవలెను. కుమారీ పూజలో,

... మంత్రాక్షరమయీం లక్ష్మీం మాతౄణాంరూపధారిణీం।
నవదుర్గాత్మికాం సాక్షాత్, కన్యామావాహయామ్యహం ॥

అని బోధింపబడుట స్పష్టముగనే యున్నది. దేవీ సాక్షా
...ప్రపమును నిర్మలలైన కన్యకలందు గాంచనగును. భక్తానుగ్రహా
...నకై దేవి యిట్లు వివిధరూపముల గ్రహించును. భక్తి శ్రద్ధలతో
...జించువారికి ధర్మార్థకామ మోక్షములు కరగతములనుటలో సంది
...ములేదు. శత్రుబాధ నిక్కముగ నశించు ననుటకు నిట దేవతలే
...మాణముమహిష రాక్షసునిబరిమార్చిమహిషాసురమర్దని'మహాలక్ష్మి'
...నియును శుంభనిశుంభుల దునిమి'చండిక'యనియును, మధుకైటభుల
...హరించి"మహారుద్రాణి"యనియును భక్తులకు సర్వసస్యశాకములనను
...గ్రహించి'శాకంభరి'యనియును,జగద్వ్యాపినియగుటచే దుర్గతినాశనము
...చేసి 'దుర్గ' యనియును వివిధనామములతో విలసిల్లెను. ఇట్లనేకకార
...ములచే 'గౌరి కాళి' మున్నగు నామములచే బ్రసిద్ధయయ్యెను. దేవిని
...ప్రత్యేక మొనర్చుకొనుటలో "బలి" యొక్క కృత్యము. అది నరబలి,
...శుబలి'యని పెక్కువిధముల తామసరాజస పూజగా మన దేశమున

జాలగా బ్రిచారమునందినది. కానియది సర్వసమ్మత మెట్లగును!సా
బలినిగూర్చి మహానిర్వాణ తంత్రిముందు,

శ్లో॥ కామక్రోధౌ ద్వావశూచ, మనసాబలి మర్పయేత్।
కామక్రోధౌవిఘ్నకృతౌ బలిందత్త్వా జపం చరేత్ ॥

కామక్రోధము లనెడు నీరెండు పశువులే మన కార్యముల
నిరంతరము జెరచుచున్నవి. వీనిని మనఃపూర్వకముగ దేవీపాద స
ధానమున వదలి నిర్మలముగ ధ్యానమొనర్చ వలయునని కదా ఉ
పదేశము చేయబడినది ?

సర్వాభ్యో వా ఏష దేవతాభ్య ఆత్మానమాలభతే॥
(ఐ. బ్రా. ౨-౬-౩)

అను శ్రుతియు నిర్వికారమైన ఆత్మార్పణమును (ఆత్మహ
కాదుసుమా) బలిగా నంగీకరించు చున్నది. ఈ శ్రుతి యందలి ఆత్మా
ర్పణతత్త్వమే నవవిధమగు భక్తిస్వరూపమై భక్తుల కర్తవ్యము న
దేశించినది. స్వయంశక్తిస్వరూపిణి యగుదేవి మహిషాసురాది దు
సత్త్వముల దునిమినదేకాని కేవలసామాన్య ప్రాణులను రక్షించిన
సత్యమేగద ? మనమును దుష్టప్రకృతుల నాశార్థమై దుర్బుద్ధివినాశ
నకై ప్రయత్నించవలయును గాని దేశకాల పాత్రవ్యవస్థలను త్యజిం
శాస్త్రగ్రంథమునందలి యక్షరార్థమునే సర్వ కాలములందు సా
జనీనముగ జెప్పవలనుపడదనుట సహృదయవేద్యమై యున్నది. మహ
నీయులారా ! పరిశుభ్రమైన భక్తిని శక్తి కర్పించి పవిత్ర సమర్థమై
యాత్మతేజమును బడయుటయే నేటి మన కర్తవ్యమనిన సాహసమ
కాదు.

దేవి త్రయీ భగవతీ భవభావనాయ,
వార్తాసి సర్వజగతాం పరమార్తిహంత్రీ,
మేధాసి దేవి విదితాఖిలశాస్త్రసారా,
దుర్గాసి మే తు భవసాగరనౌరసంగా.

# విజయదశమి

మనధార్మిక కృత్యములలో బ్రతిదాని యందును నొక మహా
ముగలదు. సంవత్సరము పొడుగునను వచ్చెడి పండుగులలో విజయ
ు చాలనుత్సాహముగల పండుగు. విశేషముగ క్షత్రియులకు సం
ంచినది గావున రాజపుత్రస్థాన [రాజపుతానా] మునందంతటను
వైభవముగ నుండును. దీనికే "దశరా" యని వ్యవహారముగలదు.
రదేశమున "దశహరా" యందురు. దేవీ నవరాత్రములు
మ్మిది దినములు] కాగానే దశమ దినమున నీ పండుగువచ్చుటచే
రాత్రములు" అను అర్థ సూచకముగా దశరాయని వాడుకపడెను.
ప్రాంతమున దశరామహోత్సవమునకు మైసూరు నగరము పెట్టి
పేరు. దశరాపండుగునాటికి వివిధప్రాంతముల విలక్షణమైన లక్షల
మును ఒక మైసూరునందు జూడవచ్చును. సుప్రసిద్ధమైన విజయ
మును ఈ విజయదశమినాడే స్థాపించిరట. దానజేసి కర్నాటక
స్తు లీ పదిదినముల పొడుగునను, "నాడహబ్బ" [నాటిపండుగు]
ి ఒక గొప్ప జాతీయాందోళనమును లేవదీసి, కవిత్వమునకు, గ్రంథ
లకు, శారీరక వ్యాయామ ప్రదర్శనమునకు ప్రోత్సాహమును
ంచి జనమనోరంజన సప్తాహ దశాహముల నేర్పరచుచున్నారు.
్రదేశమునను ఇటీవల గొన్ని చోట్ల సభలు, ఉపన్యాసములు,
రంభింపబడినవి. అరవలకు సంగీత కార్యక్రమముల సందడి సదా
మునని సజ్జనసంవేద్యముకదా ?

వీరప్రసవయగు భారతమాతయొక్క వీరపుత్రులకిది విజయ
త్రా ప్రారంభదినము. ఆధిభౌతికమునకేకాదు, ఆధిదైవికమున
ఈ దినము శుభోదర్కము. ఈ దినముననే శ్రీరామచంద్రుడు
విద్వేషియగు రావణాసురుని దుదముట్టించుటకు గృతనిశ్చయుడై
యాత్ర నారంభించెను. విజయదశమి యనిపేరుబడుటకు రామ
ద్రుని విజయయాత్రయు నొకకారణము. రామచంద్రుని ప్రయాణ
మునసున్న తిథినక్షత్ర యోగములే వ్రతోత్సవాదులలో ముఖ్య
గ స్వీకరింపబడెను. రాముడు ఆశ్వయుజశుక్ల శ్రవణాయుక్త దశమి

నాడు అపరాహ్ణమున లంకాయాత్రకై ప్రయాణ మొనర్చెనని సువిదిత
కావున నిట్టి యోగయుక్తకాలమును విజయముహూర్తమని శా
కారులు నిర్ణయించిరి. అందుననే యీ దశమి విజయదశమి యయ్యె
సంస్కృతవ్యాకరణ పద్ధతితో స్త్రీలింగ విశేషణము కావున "విజ
దశమి" యనియు ప్రయోగము కలదు. ఇందు నక్షత్ర ప్రయాణ
విషయములలో గొంత మతభేద మగపడుచున్నది. కొన్నిట సూర్యో
మయకాలమును, మరికొన్నిట నపరాహ్ణారంభ కాలమును "విజయ
యని చెప్పబడినది. కాని ఆశ్వయుజ శు ౧౦ మధ్యాహ్నముపయి
టలో మాత్రము వైమత్యము లేదు. అయినను "విజయా ముహూ
మునుగూర్చిన చర్చను మాత్రము సంక్షేపముగ గనుగొన వలసి
యున్నది. 'హేమాద్రి' యని ప్రసిద్ధి నందిన చతుర్వర్గ చిం
మణియందు,

శ్లో॥ ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయే ।
సకాలో విజయోనామ సర్వకామార్థసాధకః॥

ఆశ్వ ॥శు॥ ౧౦ నాడు నక్షత్రము లుదయ మగుచుండగా
కాలమునకు 'విజయ' మని పేరు. ఇది సర్వాభీష్టములకు సాధక
అనియును, జ్యోతిర్నిబంధమందు —

శ్లో॥ ఈషత్సంధ్యా మతిక్రాంతః కించి దుద్భిన్న తారకః
విజయోనామ కాలోయం సర్వకార్యార్థసిద్ధిదః॥

అని పైకాలమే సంధ్యాకాలముతరువాత కొలదిగ చుక్క
పొడుచు చుండగా నని స్పష్టపరుపబడినది.

శ్లో॥ ఉదయే దశమీ కించిత్ పూర్ణా త్వేకాదశీయది
శ్రవణర్క్షం యదా కాలే సా తిథి ర్విజయాభిధా
శ్రవణర్క్షే తు పూర్ణాయాం కాకుత్ స్థః ప్రస్థితో యతః॥
(హేమా॥

అను ప్రమాణమువలన శ్రవణానక్షత్ర ముండుటయు ము
మని తేలుచున్నది. పైగా నుదయము దశమి యించుకయుండి, తర్వా
నేకాదశి యున్నను 'విజయ' కాల మంగీకరింపబడి యున్నది. వి

ముగ గనుపడుచున్నను హేమాద్రియే రెండు విధముల నభిప్రాయ మిచ్చుచుండుటచేసి సామాన్యముగ సంశయము కలుగుచున్నది. ఇప్పటి ప్రకరణోపన్యాసమునుబట్టి విశేషముగ నీక్రింది నిరూపణ కవకాశమున్నది—

అపరాజితా శమీ ఖడ్గాది పూజలకు నపరాహ్ణకాలమే యోగ్యము గాని ప్రదోషకాలము [తారకోదయము] అపేక్షితము కాదు. ఒకవేళ రెండవ దివసమున దశమి అపరాహ్ణవ్యాపిని యగుచో గ్రహించవలయును. రెండు దినములలోను మధ్యాహ్నము తర్వాత దశమి యుండుచో శ్రవణ లేకున్నను పూర్వదినముననే గ్రహించవలయును. శ్రవణాయోగ మున్నపుడు మాత్రము రెండవతిథినే పాటింపవలెను. పూర్వదినమం దపరాహ్ణవ్యాపినిగా నున్నను రెండవదిన ముదయము మూడు ముహూర్తముల కాలము (౨ గం-౧౪-నిమి) దశమి యున్నను శ్రవణాయోగ ముండునెడల రెండవ దినమే గ్రాహ్యము. ఈ వ్యవస్థ ననుసరించి యీ సంవత్సరము ఆశ్వ॥ శు॥ ౧౦ ఆదివారము (22 అక్టోబర్ 1939) నాడే శ్రవణ లేకున్నను పగలు గలసినంతకాలము దశమితిథి యుండుటయు, విజయదశమి యనవలసి యున్నది.

శాస్త్రజ్ఞుల ననుసరించు ఆస్తికు లీ విజయాదశమీ శుభదినమున అపరాజితాదేవి పూజను, శమీవృక్షపూజను గావించి సీమోల్లంఘనమును, దేశాంతర ప్రయాణముల నొనర్చవలయును. అపరాజిత యనగా శత్రువులచేత నోడింపరాని దేవత యని యర్థము. అవును! ఇట్టి విజయాదేవియేకద మనకు గావలసియున్నది. ఇక సర్వప్రసిద్ధమైన శమీపూజనుగూర్చి చెప్పనక్కరలేదు. "శమీశమయతే పాపమ్మను పురాణమంత్రి మించుమించుగ నందరకును కంఠపాఠమే. సికిందరాబాదు హైద్రాబాదులలోనున్న జమ్మిపత్రిఖర్చు మరేనగరమున నుండజాలదు. కర్నాటక దేశమున దశమినాటి జమ్మిపత్రిని జేబులలో బదిదినముల దనుక దమ ప్రియబంధువులకు బంపుచునే యుందురు. సంక్రాంతి పండుగునాడును "నువ్వులుబెల్లము" సిటులే

కర్నాటక మహారాష్ట్రీలు కొందరు బంపికొందురు. జమ్మికి పూజ్యభా
మున "బంగారు"మన్నంత గౌరవము దక్కినదని చెప్పనవసరములే
ఆంధ్రదేశమున జమ్మిని పురోహితు లాదిగా గలవారు మాత్ర
తమ యజమానులకు నిచ్చి యాశీర్వదింతురుకాని కర్నాటక దేశము
నందరును పరస్పరముగ నిచ్చి పైకొందురు. ఉత్తరదేశమున నీనా
యవాంకురముల నిచ్చుకొందురు గాని శమీపత్రి ప్రదానము బహు
లేదు. "అర్జునస్య ధనుర్ధారీ" యనుటచే సుప్రసిద్ధ ధనుర్విద్యావిశార
డగు పార్థుడు అజ్ఞాతవాసమున నీ వృక్ష రాజము నందే బాణము
నుంచెననుటలో మతభేదము లేదు. కాని, అర్జునుడును నీ విజ
దశమినాడే తన విజయ యాత్ర సాగించెనా యని యాక్షేపమొక
కలదు. అది విస్తృతవ్యాసమున కెడమిచ్చునది కావున మరొకమా
చర్చింపనగును. శైవుడొకడు "అర్జునస్య ధనుర్ధారీ" యనలేక వీరభ
ధనుర్ధారీ యను పాఠాంతరమును చెప్పినంత మాత్రమున "వీరభద
డును అర్జునునివలె దన యస్త్రములను జమ్మిచెట్టున నుంచె"న
సిద్ధాంతముచేయబడలేదుకదా? అజ్ఞాతవాసగ్రహచార మపరరు
డగు వీరభద్రున కేకారణము వలన నెక్కడ సంభవించెనో తోచు
లేదు. బిల్వము ద్రోణపుష్పము (తుమ్మి) తరువాత జమ్మిపత్రియ
శివునకు బ్రియమే కావున "శివస్యప్రియవాదినీ" యను పాఠము
శైవులు వచింతురుగాక? ఏది యెటులున్నను ఇటు రాముని విజయ
యాత్రదిన మగుటచేత సీమోల్లంఘనము కారణముగా నా విజయ
యస్త్రధారణమూలమునను స్వతఃసిద్ధ తేజోవృక్షమగు శమికి బూ
చుట ఖడ్గముల సరిజేసుక బలప్రదర్శకులగుట ననాదిగ సదాచారమ
వచ్చుచున్నది. కావుననే శమీపూజలో అమంగళనాశని యనియు
శుభప్రద యనియును శమి పొగడ్తగాంచినది.

శ్లో॥ అమంగళానాం శమనీం శమనీం దుష్కృతస్యచ,
దుఃస్వప్ననాశనీం ధన్యాం ప్రపద్యే శుభదాం శమీం.

దక్షిణదేశమున నాడు రావణునియత్యాచారములు చెప్పనలవి
గాక యుండెను. విజయముహూర్తమున శ్రీరాముడు ప్రయాణించి

...యసువుల ననిలమున గలిపిన సుదినమిది. నేడు మనకు శత్రు
...లేరు. కావున "అవశ్యంపితురాచార" మ్మను మహావాక్యము నను
...చి యాచారమునకై నను శమినిబూజించి విజయదశమినాడు సీమో
...మున మొనర్చు పద్ధతి యిప్పటికి మిగిలియుండుట ముదావహము.
...చంద్రుడు వారిధిగట్టి ద్వీపాంతరమున నున్న రాజ్యలక్ష్మిని
...ము చేబట్టినాడుకాని మా సనాతన సోదరులు స్వదేశముననే
...క స్వరాజ్యలక్ష్మిని పరుల బాధలనుండి రక్షించజాలకున్నారు.
...యోచితమైన మార్గముననుసరించువారికి జయ మెల్లప్పుడును లభిం
... కాని కాలమును దాని కనుగుణముగనుండుచో సాధనసామగ్రి
...లమగుచుండును. మాకు వట్టి గడుబిడులకంటె జన్మభూమిలోని
...ర్మదార్బల్యమే హృదయశల్యముగానున్నది. స్వధర్మమునందు
...స్త స్వభావములకు వలయు సర్వసామగ్రి యుండియే యున్నది.
...ర్మనిష్ఠలేనివానికి స్వజన్మభూమికి భక్తిమాత్రము బడాయికిగాదా?
...ము డట్టి స్వర్ణాశ్రమాది స్వధర్మ పరిపాలకు డగుటజేసియే,

శ్లో॥ అపి స్వర్ణమయీ లంకా న మే లక్ష్మణ రోచతే।
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ॥

లక్ష్మణా! బంగారులంకగూడ నాకు భాగ్యముకా... తల్లియు
...భూమియును మనుజునకు స్వర్గముకంటె నధికముగదా యని సెలవిచ్చి
...న్నాడు. ఇటజనని స్వధర్మము, జన్మభూమి, ధర్మరాజ్యము, నామ
...త్రములగు కౌసల్యాభారత భూములు, కావు. ఇకమీద మా
...మట నేటిక్షాత్రతేజము రామరాజ్యమును స్థాపించగలదని యాశలేదు
...ని, విజయదశమినాటి యాదర్శమగు ధార్మిక కర్తవ్యము నైనను
...క్షత్రియం దుంచుకొనుటకై (అనగా మన యితిహాసమును మాప
...కుండుటకై) శత్రువినాశని యగు శమి (శమగుణయుతశక్తిని) నైనను
...పూజించరా యని పరివేదించుచున్నాము. వైద్యశాస్త్రములోని,

శ్లో॥ శమీ తిక్తా కటుః శీతా కషాయా రోచనీ లఘుః
కఫకాసభ్రమశ్వాస కుష్ఠార్శః క్రిమిజిత్ స్మృతా॥

అను శ్లోకభావ మెటులున్నను స్వేచ్ఛాహారములు గలవారికి రోగములు వచ్చుచుండుటయు, తచ్ఛమనార్థమై శమిని స్వీకరించుటయు స్వాభావికము కదా! జగత్తున్నంతకాలము భోగ్యవస్తువులను గూర్చి సురాసుర ప్రవృత్తి గలవారికి సంఘర్షణ తప్పదు. గెలుపు లక్ష్మివలె చంచలమైనను సదాచారనీతి సంపన్నులనే స్థిరముగ నాశ్రయించిలీగును. ధర్మన్యాయమార్గములే లోక కంటకముల నివారించి యాత్మశాంతి ననుగ్రహించును. మా విజయదశమి మొదలగు ధార్మికకృత్యముల లోని భౌతికతత్త్వములను (ఆధ్యాత్మిక ధార్మికములు వారికక్కరలేదు కావున) ఇకమీదనైనను విపక్షసోదరులు గ్రహించ బ్రియత్నిం తురా?

శమీ శమయతేపాపం । శమీ శత్రువినాశినీ
అర్జునస్య ధనుర్ధారీ । రామస్య ప్రియదర్శినీ॥

పాఠకులారా! మంత్రము చదువ బడెను. సంప్రదాయా సారము (మీరుహిందువులేకద) మా విభూతికి దాన దక్షిణలు [చంద దారులు] పుష్కలముగా లభించవలసియున్నవి. స్వహస్త పరహస్త ములతో మీ ధర్మమును నెరవేర్చి విజయమును చేపట్టుడు. ఇతిశివ

[జ్యేష్ఠ శు॥ పక్షమందు జరుగు గంగోత్సవములకును కొన్ని చోట్ల దశరావ్యవహారముకలదు. అది వేఱు]

---

## ద్ర వ్య దా త లు

వికారాబాదు నివాసులును వీరశైవమతాభివృద్ధి విషయమై చిరకాలమునుండి పరిశ్రమించుచున్న వారును అగు శ్రీ ఎస్. సోమేశ్వర రావు వకీలుగారు మా పత్రికా సహాయకులై ప్రథమసహాయముగా నిరువదిరూప్యముల సమర్పించి కృతజ్ఞతకు బాత్రులైనారు.

# కట్టుపాటు

## కవిరత్న : లక్కన మల్లికార్జునుఁడుగారు



క. పరులకు లొంగుట తగదని
గరువంబున నెదురుబల్కి ♦ కలహప్రియుఁడై
నిరుపమగు కట్టడులను
నిరసించుట తనకు చేటు ♦ నిఖిలములందున్.

క. దినకృత్యములందైనను
ఘనముగ నొక కట్టుపాటు ♦ గానక నెపుడున్
తనయిచ్చకొలఁదిపోయిన
ననలమునఁ బడు మిడతవలెనె ♦ యందు విపత్తున్.

క. పరులకు లొంగుటయేలా ?
ఎరుగుచు నొక కట్టుపాటు ♦ నింపుగదానిన్
జరపుచు వర్తించినచో
కొరువెందును లేదుముక్తి ♦ కలుగునుసుమ్మా.

క. సతతము నియమముతప్పక
క్షితిజములు ఫలించు జంతు ♦ చేష్ట లమరునం
చతియాశ దానిమరచియు
ప్రతినియమము మీరుచుంట ♦ పాపముగాదే ?

క. ప్రతికర్మకు నొకధర్మము
మతిమంతులు పెట్టినారు ♦ మంచిని గని, స
మ్మతి దానిని గరచిన మన
మతులన్నియు చక్కబడును ♦ మాధ్యముతోలగున్.

ఖలుడా !

క. మాటలు సొగసులు నెరుగక
వాటంబగు నీతిఁ గనక ♦ పాపాత్మను ఏ
బూటక నాటకమో గని
కూటికి మతమున కెడమయి ♦ కూలాడువటరా.

క. చెప్పిన గ్రహియింపవు నో
రిప్పిన పరుషంబులెన్ని ♦ హీనపుమతితోఁ,
దప్పక దూషించుచు బహు
తిప్పలు గూర్చెదవ ? చెనటి ! ♦ దివ్యులకెందున్.

క. క్రూరా! నీవొకడవె దగు
క్రూరుడవై చెడక మమ్ము ♦ నేలను చెఱుపఁగ
కోరికతో నెదిరింతువు,
పూరింతువె నీదుజన్మ ♦ పుణ్యముకాఁగన్ః

ఉ. ఒక్కరు పెద్దలయ్యెదరొ ♦ ఒక్కరు పేరుగడింతురొక్కఁ యిం
కొక్కరు భాగ్యవంతులయి ♦ యీప్సితమందుదురంచు నెంచి పెం
పెక్కిన యీర్ష్యతోడ మది♦నెంతయు శాంతియులేక నిచ్ఛమై
కక్కసు వెళ్ళబుచ్చకుర ♦ కాలము నిన్నెటు దోచునో ఖలా!

క. తుదిదాక నొక్కకర్మను
వదలుచు, చేయంగలేక, ♦ భావంబొలుకన్
విదితముగ పలుకనేరక,
వదరుట సహజంబునయ్యె ♦ పాపుడ! నీకున్.

గీ. బలము విత్తంబు సౌఖ్యంబు ♦ కలిగియుంట
సబలగర్వంబునుండుట ♦ సహజమగును
వసతిలేదయ్యె విద్యయా♦ వమ్మునయ్యె
యమితగర్వంబు నీకేల ♦ నధమ జనుఁడ!

ఆ. దున్నపోతు నేల ♦ దున్నును చక్కగా
తిండిపోతు మెక్కి ♦ పండుకొనును
అరయ గర్వపోతు ♦ అటుల గాకుండియు
చేటుగూర్చుచుంటః ♦ జెనటి వీవు.

క. మంకా! పెద్దల తిట్టకు
శంకరు సద్భక్తిలేక ♦ సత్త్వముగనకన్,
సంకటములబడి పాపపు
పంకిలమున మున్గగలవు ♦ పరికింపంగన్.

---

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## (౫) శ్రీ కేదారనాథ లింగము

**మఠం సిద్ధి వీరయ్యగారు, ఉపాధ్యాయులు.**



శ్రీ కేదారేశ్వర మహిమ గొప్పది. ఉత్తర హిందూదేశమున
నాథ కేదారనాథ తీర్థములు ప్రధానమైనవి. ఉభయతీర్థ సంద
ఫలమునుగుఱించి గొప్ప మాహాత్మ్యముగలదు. కేదారనాథుని
ంచి యీ విధముగ వ్రాయఁబడినది. "ఏవ్యక్తికాని కేదారేశ్వ
దర్శింపక బదరీనాథునియాత్రఁగావించునో అతని యాత్ర నిష్ఫల
ను."

శ్లో॥ "అకృత్వాదర్శనం వైశ్య! కేదార స్యాఘనాశినః
యో గచ్ఛేద్బదరీంతస్య యాత్రాః నిష్ఫలతాం వ్రజేత్."
(కేదారఖండము)

కేదారేశ్వర సహిత నరనారాయణమూర్తి సందర్శనఫలము
స్తపాప నిర్మూలన కరమై జీవన్ముక్తి ప్రాప్తిదమగునని తెలుపఁ
డి.

శ్లో॥ "తస్యైవరూపం దృష్ట్వాచ సర్వపాపైః ప్రముచ్యతే
జీవన్ముక్తో భవేత్ సోఽపి యో గతో బదరీవనే
దృష్ట్వారూపంనరస్యైవ తథానారాయణస్యచ
కేదారేశ్వరనామ్నశ్చ ముక్తిభాగీ నసంశయః"

ఈ జ్యోతిర్లింగస్థాపనేతిహాసము సంక్షేపముగా వ్రాయబడు
న్నది.

సుప్రసిద్ధమగు హిమాలయమునందు కేదారశృంగమొకటికలదు.
టు విష్ణుదేవుని యవతారములైన మహాతపస్సంపన్నులగు నర
రాయణులు తపస్సానరించుచుండిరి. వారి తపస్సునకు మెచ్చి వారి
రాధనకుఁ దృప్తి జెంది శంకర భగవానుఁడు ప్రత్యక్షమై వారి

పాౖర్థనానుసారము జ్యోతిర్లింగ రూపమున నచ్చట సదావాస మొ
రించుటకు వరపౖదానము గావించెను. కేదార నాథుఁడు పర్వత రా
మనఁదగు హిమవత్పర్వత కేదారశృంగమునధివసించియున్నాడు. ఈశి
పూర్వభాగమునందు అలకనందా నదీతీరమున రమణీయ పౖదేశ
నందు శీౖ బదరీ నారాయణమూర్తి విరాజమానుఁడై యున్నా
పశ్చిమదిశయందు మందాకినీ సరిత్తటంబున శీౖ కేదారనాథుఁడధివసి
యున్నాఁడు. అలకనందా మందాకినీ నదులు రుదౖపౖయాగలో స
మించును. దేవపౖయాగనుండి వీని సంయుక్తధార గంగోతిౖనుండి వె
లినట్టి భాగిరథీనదీ మతల్లి నాలింగన మొనరించుకొనును. ఈ పౖ
ముగా మన మొనరించు గంగాస్నానముయొక్క సంబంధము శీౖ బ
కేదారేశ్వరుల చరణ సరోజాతములనుండి కలుగును.

ఈ పౖదేశము హరద్వారమునుండి దాదాపు (౧౫౦) మైళ్ల
(హృషీకేశ) ఋషీకేశమునుండి (౧౩౨) మైళ్ల దూరమునగలదు. హ
ద్వారమునుండి ఋషీకేశమువఱకు మోటారు మార్గముఁగలదు. మోటా
లారీలు నడచును. ఋషీకేశమునుండి కేదారనాథ మందిరమువఱకు
పథ మతిదుర్గమము. కాలినడకనడుచుట కశక్తులైనవారికి కండీ
ఝప్పన్ అను డోలీలు లభించును. వీనిని పర్వతపాౖంతీయులగు కూలీ
మోయుదురు. అందుప్రయాణము చేయవచ్చును. బదరీనాథ సందర్శ
లైన యాత్రికులు సాధారణముగ కేదారనాథయాత్ర పూర్తిఁగావిం
కొనియేవెళ్లెదరు. ఏమార్గమునుండి వెళ్లెదరో ఆమార్గమునుండి తిరిగిర
రామనగరమునుండి వచ్చెదరు. డోలీలకు (కిరాయ) సుమారు (౧
రూపాయలు హరద్వారమునుండి రామనగరమువఱకు వ్యయమొనరి
వలసివచ్చును. మార్గమధ్యమునందచ్చటచ్చట యాత్రికులసౌకర్య సా
ధ్యమునకు (మజిలీ) విశ్రాంతిస్థలములు (చట్టీలు) నిర్మింపఁబడియున్న
చిట్టచివరనుండెడు విశ్రాంతిస్థలము కేదారనాథసమీపమునగలదు. సమ
ద్రమట్టమునుండి ౨౩ వేల యడుగుల యున్నతంబునగలదు. అక్క
చేరుటకు మందాకినీనది నొక (దారువారధి) కర్రవంతెన మూలము
దాటవలసినచ్చును. అది మిక్కిలి సాధారణమైనది. కాలుకొంచెము జా

కో నదీగర్భమునఁ జేరవలసియుండును. ఇచట మంచు వేసవి కాలమునను
కల మత్యధికముగానుండును. కొన్ని కొన్ని ప్రదేశములయందు నదీ
ముసైతము ఘనీభవించును. శ్రీ కేదారేశ్వరుఁడు మూడు వైపుల
ట మంచుగడ్డలచే నావృతుఁడై యుండును. సీతాకాలవాసమచట
సంభవము. కార్తికపూర్ణిమ యనంతరము అర్చకులు కేదారేశ్వరుని
మముఖీమూర్తినిగైకొని దిగువనుండెడి (ఉఖీమఠము)న (రావల్జీ)
ను (మహంతు) వసించెడి స్థలమున కేగుదురు. పిదప నారుమాసముల
వాత మేషసంక్రాంతి ప్రవేశానంతరము మంచుగడ్డలఁ జీల్చుచు
ర్గమేర్పాటుచేసికొని పునః మందిర కవాటములను తెరచెదరు.

మందిరము మందాకినీఘట్టమున పర్వతమునం దున్నది. అందు
మంకరాంధకారము క్రమ్ముకొనియుండును. దీపము సహాయమున
శంకరసందర్శనమగును. దీపము వెలుగుటకు యాత్రికులు ఘృతము
యోగించెదరు. శివలింగము అనగఢ్ కొండయెదుటనున్నది. అర్చ
లు యాత్రికులు జల పుష్పాదులతో నర్చించెదరు. మఱియు కేదా
శ్వరునికి ఘృతలేపన మొనరించి బాహువుల నప్పళించి గాఢాలింగన
మొనరించెదరు. విగ్రహము లింగమూర్తి ౬ అడుగుల యెత్తును
౪) రెండున్నరఅడుగుల లావును గలదు. మందిరపు టంగణమున
ౌపదీయుక్త పంచపాండవ విగ్రహములుఁగలవు. మందిరము వెనుక
గమున ననేక కోనేళ్లుఁగలవు. అం దాచమన తర్పణాదులఁ గావిం
దరు.

కేదారనాథుని సమీపమున (భైరవఝంప) పర్వతము గలదు.
ర్వమిచట యనేకులు హిమఖండములలో జిక్కి లేక పర్వతమునుండి
మికి ప్రాణములఁ గోల్పోవుచుండిరి. ౧౮౨౯ క్రీ॥శ॥ సతీ యనునట్టి
ను భృగుపతనాది ఆచారముల ప్రభుత్వమువారు తొలగించినరీతిగా
నిని రూపుమాపిరి.

ఓం తత్ సత్.

[శ్రీ కేదారనాథక్షేత్రము హిందువులకు పరమపవిత్రక్షేత్రమనుట యందరెఱింగినదే. ఇక వీరశైవుల కన్ననో జగద్గురుక్షేత్రము స్వక్షేత్రము. పంచసింహాసనములలో నిది మూడవది. శ్రీ జ॥ ఏకోరామ శివాచార్యుల యవతారభూమి. ప్రకృతి సౌందర్యమునకు పట్టుగొమ్మ. పూర్వ జగద్గురువులు చాల గొప్పగ ఆస్తిని సంపాదించినారు. కొన్ని వందల గ్రామములు భూమి. శ్రీ కేదారేశ్వరక్షేత్రము మున్నగు వానివలన ప్రతి సంవత్సరము షుమారు ౨౦ వేలయాదాయ ముండును. ప్రస్తుతము సింహాసనాధిపతులు శ్రీ జగద్గురు నీలకంఠలింగ శివాచార్య మహాస్వాములై యున్నారు. అచ్చటివారు శ్రీవారిని "రావల్ సాహెబ్" అందురు. (ఈ బిరుదము అచ్చటికి దగ్గరగానున్న శ్రీ బదరీనాథ జ్యోతిర్మఠము శ్రీ శంకరాచార్యస్వాములకును కలదట!) కేవల శ్రీ కేదారనాథుని క్షేత్రముననే నివసించుటకు వీలుకాదు కావున దానికి దిగువగా నుండు ఉషామఠ (ఉఖీమఠ్)మున శ్రీ జగద్గురువుల వారును సిబ్బందియు స్థిరముగ నివసింతురు. శ్రీ జగద్గురువులవారు విద్యాప్రియులును పరోపకార ధురీణులును అయ్యున్నారు కావున ఒక హైస్కూలును (సంస్కృతాంధ్రభాషలకు) ఔషధశాలను పోస్టాఫీసును ఇంత చిన్న పల్లెలో (పైగా నడవిలో) నిర్వహించుచున్నారు. గ్రామపారిశుద్ధ్యసంఘమునుకలదు. అప్పుడప్పుడు పండితసభలు, ఉపన్యాసములు, ఉత్సవములు జరుగుచుండును. శ్రీ కేదారనాథ ఔషధాలయమున (P. O. Qkhimath Garheval Dt. M. P.) శాస్త్రోక్తముగ సిద్ధముచేయబడిన మహౌషధములు దొరకును. దివ్యౌషధులకు, మూలికలకు మాతృస్థలమని వేరుగా జెప్పనక్కరలేదు. శ్రీవారు కర్నాటక దేశపు వీరశైవుల యభివృద్ధికయ్యును దానధర్మముల నొనర్చియున్నారు. మా యాంధ్రవీరశైవులపైన శ్రీవారి కరుణాకటాక్షము ప్రసరింపవలసియున్నది. శ్రీ కేదారనాథ క్షేత్రముయొక్క చిత్రము నిందులో ప్రకటింపబడినది. ఈ క్షేత్రమునకు వేసవికాలమున బ్రయాణించవలెను. యాత్ర కొంత కష్టకరమైనను దానివలన గలుగు మహానందమును ఇంతని వ్రాయవలెనా? పుణ్యాత్ములకే యది లభించును.]

# షట్ స్థల దర్పణము

## శ్రీ మఠం నాగభూషణ దేవరగారు

---

సీ॥ పూని, సదాచారబుధ గోష్ఠి భక్తిచే
గీలింపబడుట భక్తిస్థలంబు
శివభక్తిశేషంబు జిహ్వానిష్ఠరుచించు
సంయుక్తమే మహేశస్థలంబు,
లింగావిధానలాలిత్యసంపన్నుడౌ
ధన్యత సుప్రసాదస్థలంబు
లింగానుభవతృప్తి సంగానురతుడౌట
గా నది ప్రాణలింగస్థలంబు
గీ॥ లింగ పరవశ సంభావ నాంగు శరణు
డనలకర్పూర సంయోగమట్లునెక్యు
డిట్లు షడ్విధ స్థలభేద మెరుగవలయు
వీరహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి. ౧౧
సీ॥ అష్టాంగయోగము లార్గురుగావింపు
క్రమమెన్నభక్తుడు యమనియమము,
ఆసనంబు మహేశ్వరాధీనమగును, ప్ర
సాది ప్రత్యాహార వేదియరయ
నతులప్రాణాయామ రతి ప్రాణలింగియం
తర్లక్ష్యశరణుండు ధారణంబు
నిర్వాతదీపంబు, సుధ్యానెంపొందిన
మాడ్కిలింగైక్యసమాధిజేయు
గీ॥ గాన యార్గురుయోగాష్టకంబుదెలిసి
పరగ నటియించు బుధుడెపో బాహ్య మంత
రంగములయందు నాతడు లింగమూర్తి
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి. ౧౨
సీ॥ రమణ భక్తాంగంబు రత్నగర్భంబున
నంబు మహేశ్వ రాంగంబుదలప
లింగప్రసాది కళేబరంబగ్ని
సత్ప్రాణలింగుని శరీరంబుగాలి

శ్రీయుత శరణుడు కాయమహాకాశంబు
సహజైక్యమేను విచక్షణాత్మ
శివభక్తునకు బైసుచిత్తమై చెల్వంగ
మాహేశునకు సుహస్తమును బుద్ధి
గీ॥ వరప్రసాదికి గర్వనివారణంబె
ప్రాణి సుమనస్కరంబు విభావనమ్మ
పరగ సజ్ఞానమైక్య సద్భావకరము
లీలహృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.
సీ॥ సారవిచారాత్మ శ్రిద్ధాఖ్యభక్తి సం
భావించి మదిగూర్చి భక్తుడుండు
నైష్ఠికాన్వయ భక్త్యధిష్ఠించి సత్కీర్తి
హితమతి జేర్చి మహేశుడుండు
బలునవదాగాఖ్య భక్తినిమగ్నత
సాంతుడై భవ్య ప్రసాదుడుండు
ప్రవిమలంబగు భవభక్తి సంధాన
ప్రచురతరాసక్తి ప్రాణుడుండు
గీ॥ శరణు డానందభక్తి ప్రసక్తినుండు
నకట సమరసభక్తి శ్రినైక్యుడుండు
గాన షడ్విధభక్తి మార్గంబుదెలియ
లీల హృద్వర్తి శ్రీమహా లింగమూర్తి. ౧
సీ॥ భక్తునిమేన ప్రభాసితంబైయుండు
గంగాధరాచార లింగమూర్తి
యూహింపగ మహేశు యొడలందు వెలుగొందు
మంగళాకరగురు లింగమూర్తి
దివ్యప్రసాది స్వదేహమ్ముల లాలిత్య
శృంగంబుగా శివ లింగమూర్తి
ననువంద ప్రాణుని తనువుసందునునుండు
లీలాత్మ జంగమ లింగమూర్తి
గీ॥ శరణుని శరీరమందు ప్రసాదలింగ
మూర్తియుండు మహాలింగ మూర్తి మైక్య

కాయమందుండు సద్బుధుల్ గనగవలయు
లీల హృద్వర్తి శ్రీమహా లింగమూర్తి. ౧౫

సీ॥ ఆచార లింగమూర్త్యచలక్రియాశక్తి
ఘటియించి నిర్వృత్తి కళనటించు
సర్వదోషముఖ ప్రతిష్ఠా కళాజ్ఞాన శ
క్తియు గురు లింగమూర్తియు నటించు
నగ్నియిచ్ఛాశక్తి నంటి విద్యాకళ
శివలింగమూర్తి వైభవముమించు
శశ్వత్పవనమాది శక్తి శాంతీకళ
చరలింగమూర్తి సుస్థిరత వెలుగు

గీ॥ శాంత్యతీతకళ పరాశక్తి నభము
నందున ప్రసాది మహాలింగ మాత్మయందు
శాంత్యతీతోత్తర కళ చిచ్ఛక్తినటన
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి. ౧౬

సీ॥ ఘ్రాణంబుభూమి సంగ్రహముగా విలసిల్లు
నాచారలింగ మందంటి వెల్గు
పొల్పారు జిహ్వయు భువనమై విలసిల్లు
గురులింగమందు వెల్గొందుచుండు
నక్షిద్వయంబున నగ్నియై విలసిల్లి
శివలింగమందు వసించియుండు
చర్మంబు వాయవ్య సముదగ్రద్యుతినొప్పు
చరలింగమందు నక్షయమునుండు

గీ॥ శ్రవణ మాకాశ మేఘ ప్రసాదలింగ
మూర్తియుండును హృదయాంగమున శుభాంగు
శ్రీ మహాలింగమూర్తి వర్షింపుచుండు
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి. ౧౭

సీ॥ గహ్వరీముఖమందు గంధపదార్థ మా
చారలింగమున కర్పనలుజేసి
జలవక్త్రమున షడ్రసంబులు గురులింగ
మూర్తి కారాధనల్ స్ఫూర్తిజేసి

శుకాస్యమున రూపుజూచియు ద్రవ్యంబు
నతశివలింగార్చనంబు జేసి
మారుతాననమందు జేరు సంస్పర్శలు
చరలింగమూర్తి కర్చనలు జేసి
గీ॥ చదలువదనమునందు ప్రసాదలింగ
పూజశబ్దంబునాత్మ సంస్మరణమందు
తృప్తి మహాలింగమూర్తి కర్పింపవలయు
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి.

సీ॥ భూమిసద్యోజాత వామదేవ మఘోర
తత్పురుషేశాన హృత్పదంబు
లన ఘ్రాణ జిహ్వాయక్షులు చర్మశ్రవణాత్మ
వరగంధరసరూప స్పర్శశబ్ద
మైదింట సంతృప్తియాను షడ్ద్రవ్య మా
చారాది గురుశివ చరప్రసాద
లింగమహాలింగ లీలలకర్పించి
పగమానుభవతృప్తి సిరినహించి
గీ॥ నారు ముఖముల లింగము లారుదెలిసి
యారు ద్రవ్యము లార్గురి కర్పణంబు
కోరి పూజించు మిముభక్తి కోవిదుండు
లీల హృద్వర్తి శ్రీమహాలింగమూర్తి.

సీ॥ ఆత్మాంగ గరిమ మహాలింగమూర్తియు
శబ్దాంగమహిమ ప్రసాద లింగి
చర్మాంగమె విభూతి జంగమలింగి స్వాత్
శివలింగ మణిమ మక్షిద్వయంబు
జిహ్వాంగభూతి యాశ్రితగురులింగంబు
నాసికైశ్వర్య మామ్నాయసరణి
నాచారలింగ మీ యారులింగము లార్గు
రంగములందు మహాప్రసాద
గీ॥ మాజ్ఞగైగొని సావధానార్పణంబు
సులభముగ జేయు ననుభవ సూత్రమెరిగి

లింగపరవశ సుస్వాంత లింగమతడు
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి. ౨౦

సీ॥ పరికింప ఘ్రాణంబు పాయక సౌమ్యంబు
జిహ్వాయు గుహ్యమక్షిద్వయాంఘ్రి
చర్మంబుహస్తముల్ శ్రవణాంగ వక్త్రము
లొక్కొకటియ విభేదోక్తి లేమ
జ్ఞానేంద్రియములు సంధానమౌ లింగముల్
కర్మేంద్రియంబుల గలిగియుండు
గాన తద్విషయాఘ కామ్యముల్ భజియించి
యవయవంబుల లింగభావముంచి
గీ॥ శంభునారాధనల్ జేసి సమరసాబ్ధి
భవభయంబుల దూలించి పరమసౌఖ్య
కలనవర్తించు శ్రీమహాఘను డతండు
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి. ౨౧

సీ॥ అలబహురంధ్ర సమంచిత ఘటములో
పల వెల్గుదీప మా పగిది దేహ
మంపులనిష్ఠగా లింగాకృతై యారు
లీలల వెల్గు శ్రీ లాలిత్యమహిమ
సముదగ్రమాలింగ చైతన్యమే యంత
రంబున బాహ్యమం దమర వెల్గి
నిఖిలావయవములు నిద్రింప నిద్రించి
భావమైయుండుట భావలింగ
గీ॥ మనుచు పరమేశు డాది రహస్యలింగ
సూత్ర ముపదేశమిచ్చెను గోత్రసుతకు
గాన బ్రహ్మనైష్ఠికు లిది గనుడు నాత్మ
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి. ౨౨

(సశేషము)




**వైద్యవిప్లవము:**—కర్త, డా॥ అడుసుమిల్లి వేంకటకృష్ణా గారు, ఎల్. డి. ఆరోగ్యవర్ధనీసమాజం చందాప్రోలు పోస్టు అంగలూ కృష్ణాజిల్లా, పుటలు ౧౫౦ కాగితములు ముద్రణము ఆకర్షక వెల 0—8—0 పాకెటుసైజు.

భారతదేశమున చాలాకాలమునుండి మసూచికము అ అమ్మతల్లి, అమ్మవారు (హిందీలో శీతలా) పోయుట, కొందరకెక్కు వ్రణములయి వికారముగ శరీరమునిండ గుంతలువడుట మున్నగు తులు సుప్రసిద్ధము. ఇది సాంక్రామికరోగమనియును ఋతుసంబంధ మనుష్యులలో బ్రచారము నందుననియును మనదేశీయుల అనుభ యున్నది. ఎటులైననేమి? ఈ రోగమును నిర్మూలింపజేయుట పర వశ్యకమేకాని అట్టి చికిత్సావిధాన మింక నెవరికిని హస్తగ కాలేదు. ఇటీవల టీకాలు పొడిచినచో నా రోగము రాదని తెల్లదొ మనదేశమున ప్రచారముచేయసాగిరి. తెల్లవారి విధానము లని నవి శ్రేష్ఠములనియే పామరబుద్ధికి దోచుచుండుటచేత దాదా పందరు టీకాలువేయించుకొనదొడగిరి. వేయించుకొననిచో దండింతు ప్రభుత్వమువారి యాజ్ఞయుండుటవలన బుద్ధిమంతులు సైత మీ వి నము శాస్త్రీయమని నమ్మజొచ్చిరి. కాని ఈటీకాలవలన నేమాత్ర లాభములేదనియును పైపెచ్చు అనేక బాలకులకీ పద్ధతియే మరణ రణమయ్యె ననియును, ఇటీవల పరిశోధనల వలన విస్పష్టముగా దెలి నది. టీకాల విరోధాందోళనమునుగూర్చి పుట్టుపూర్వోత్తరములు దెలు పుచు చక్కని యుద్బోధము నీగ్రంథ మొసగుచున్నది. ఈ యాందో నము మన దేశముననేకాదు. పాశ్చాత్యదేశమందు సైతము వి ముగా ప్రాకిపోవుచున్నది. గొప్పగొప్ప ఆంగ్ల డాక్టర్లు ఆయుర్విద్యా నిపుణులుకూడ ఈ యసహ్యమును అనర్థకమును అగు టీకాల పద్ధతి

నూపుమాపవలెనని బద్ధకంకణులై ప్రయత్న మొనర్చుచున్నారు. కాని ప్రభుత్వమువారుమాత్రము మొండిపట్టును వదలజాలకకాబోలు పెనుగు లాడుచున్నారు. ఇది ప్రజాహితకరమైన పద్ధతిమాత్రము కానేరదు. వైద్యులే ఇది పనికిరాదని చెప్పుచున్నపుడు దీని యాథార్థ్యమును పరి శీలించుటప్రభుత్వమునకు ముఖ్య కర్తవ్యముగదా! టీకాలవలన అమ్మ వారుపోయదను అంధవిశ్వాసమువలన లోకమునకు గొప్పయపకారము జరుగుచున్నదని ఈ గ్రంథము గుద్ది చెప్పుచున్నది. ఈ పొత్తము లోకమంతట ప్రచారమైనగాని దీని తత్త్వమును పరిశీలించుట కవ కాశము కలుగదు. ఇట్టి సద్గ్రంథ ప్రచారము గావించిన గ్రంథకర్తగారి పరిశ్రమ మిక్కిలి ప్రశంసార్హము.

**లీలావతి:—**(శ్రీ) తెన్నేటి వెంకటదీక్షితులుగారు పెనుగొండ పశ్చిమ గోదావరిజిల్లా, సైజు క్రౌను పుటలు 110, కాగితము అచ్చు నిష్టముగానున్నవి. వెల 0—12—0.

ఇది యొక వైదంకముల తెలుగునాటకము. సనాతన ధర్మసేవా నిరతులై సదాచారములను ప్రచార మొనర్చు తలంపుతో స్త్రీ విద్య యగత్యములేదను సిద్ధాంతము నిందు గ్రంథకర్తగారు ప్రతిపాదించినారు. సిద్ధాంత మెట్లులున్నను వారవలంబించిన పద్ధతి మనోభిరామముకాదు. గంభీరముగను సయుక్తికముగను ప్రతిపాదన పరుగిడలేదు. వికార మును గలిగించు విద్యయవసరములేదు కాని, సదాచార విజ్ఞానదాయక మగు విద్య స్త్రీలకును ఆవశ్యకమేకద! శైలి సరళము. సామాన్యజను లలో బ్రచారము జేయదగియున్నది.

**గోపికారహస్యము:—**కర్త, ఎల్లాప్రగడ శ్రీకృష్ణమూర్తిగారు స్టెనోగ్రాఫర్. పి. డబ్ల్యు. డి. సెక్రటేరియేట్. నిజాంగవర్నమెంటు, హైదరాబాద్ దక్కన్. పుటలు 30 కాగితములు అచ్చు మంచివి. వెల 0-6-0.

ఇది యొక పద్యకావ్యము. ఏకాశ్వాసము. ఇందులో గద్యము లేనందున "నిర్వచన" మనియును బిరుదమీయబడినది. శ్రీకృష్ణుని చరిత్రను విమర్శించునపుడు గోపికలనుగూర్చి కొందరు అశ్లీలములను భావించుచుందురు. ఎంతసమాధానముజెప్పినను పెడచెవిని బెట్టుచునే యుందురు. కృష్ణునియందలి లౌకికభావములను మాత్రము చారిత్రి

కముగ స్వీకరించి కుతర్కము చేయుచుందురుకదా! అట్టివారు కృష్ణ యలౌకికమహిమలను అసలేన మ్మరు. కాని అవతారతత్త్వము జీవితఘటనలను సమన్వయముగ నిర్వచించుకొనినవాడే మహాత్ము చరిత్రను దెలిసికొనజాలును. గోపికల తత్త్వమునుగూర్చి యనేక గ్రం ములు వెలువడనలసియున్నది. అట్టివి కొన్నికలవు కాని పెద్ద పొత్తములనెత్తి చిత్రగించువారి త్తరి బొత్తుగనున్న. ఈ చి పొత్తమున గోపికలు పూర్వజన్మమందు మహర్షులనియు, విష్ణుని ప మోహనాకారమునకు దమకపడి గోపికలైపుట్టి ప్రేమజీవితమును గ రనియును, అది శుద్ధప్రేమయేకాని అశ్లీలము కాదనియును సమ ధాన మీయబడినది. శైలి సులభముగ నున్నది. సర్వసాధా ముగ బ్రచార మొందవలసిన చిన్నారి పొన్నారి పొత్తము. ధార్మికు యాదరమునకు సుపాత్రము. గ్రంథకర్తగారి భావము భక్తిభరితము శైలికి—

ఉ. గోపికలార మీరిటుల గోపము తాపముతోడ వచ్చి యీ
పాపని జన్నునేమఱని బాలుని జారుఁడు చోరుఁడంచు మి
థ్యాపరివర్తనోక్తి నిటులాగడిఁబెట్టఁగఁ జూతురమ్మ సం
తాపకరంబుగాదె? తలిదండ్రుల కాత్మజు నిందసేసిన౯.

**ప్రజలు ప్రభుత్వము:**—కర్త:—జానపాటి సత్యనారాయ గారు. పుటలు ౧౦౦, కాగితము రఫ్ వెల 0—6—0.

**ఔంధ్ సంస్థానము:**—కర్త:—పులిగడ్డ వెంకట సుబ్బారా గారు బి॥ ఏ॥ పుటలు-౫౦- కాగితములు రఫ్ వెల 0—5—0.

ఈ రెండు పుస్తకములను సికింద్రాబాద్ ఇమాంభావి వీధిలో దేశోద్ధారక గ్రంథమాలవారు ప్రకటించినారు.

మొదటి పొత్తము జగద్విఖ్యాతుడైన టాల్‌స్టాయి గ్రంథము కనువాదము. "ప్రజలు—ప్రభుత్వము" అను ద్వంద్వమును గూర్చి యనుకూల ప్రతికూల విషయములను చర్చించి ప్రజాసేవకుల విధాన మును ఉద్బోధమగు రీతిని సూచించుచున్నది. ఇది రాజకీయ రంగము నకే కాక సామాజిక జీవితమునకును ఉపయుక్తముగ నున్నది. అను వాదము సరళముగ నున్నది. భాష యింకను గొంత సంస్కరింప బడవలెను.

రెండవది బొంబాయి ప్రాంతమున నుండు ఔంధ్ సంస్థానము ...ర్చియు క్రొత్తగా నచ్చోట స్థాపింపబడిన బాధ్యతాయుత ప్రభుత్వ ...మును గూర్చియు వివరించు చిన్నపుస్తకము. బ్రిటిష్ ఇండియాలోని ...లజడి దేశీయ సంస్థానములలోనికిని ప్రాకుచో నాశ్చర్యములేదు. ...లివిగలరాజు లిప్పటికిప్పుడే ప్రజల పలుకుబడిని గమనించి పలయు ...కార్యములను గలుగజేయుచున్నారు. అందు ప్రథమస్థానము ఔంధ్ ...స్థానమునకే కలదు. మహారాజుగారు సాహిత్యసేవకుడై సూర్య ...మస్కారప్రియుడై మొదలే సుప్రసిద్ధుడు. ఇపుడీ క్రొత్తసౌలభ్య ...ుల నొసంగి ప్రజాప్రియుడు నైనాడు. ఈ కథను గ్రంథకర్తగారు ...ముచితముగ సంక్షేపించి యాంధ్రులకు సమర్పించి కృతజ్ఞతకు ...తులైనారు.

అధ్యక్షోపన్యాసము :—కర్త. బచ్చు వేంకటేశ్వరగుప్త హైకోర్టు ...లుగారు: సదాశివపేట. (నిజాం) అణాటికెటుకు ఉచితము.

నిజామాంధ్ర ప్రాంతముననొక మహాసభయే కాక, ప్రత్యేకముగ ...ల్లాసభలును జరుగుచున్నవి. ఇదియే యెక్కువ ఉపయుక్తమైనదని ...ప్పవచ్చును. ఇటీవల మెదకుజిల్లా ఆంధ్రమహాజనసభ జోగిపేటలో ...హోత్సాహముగా జరిగినది. దాని యధ్యక్షస్థానమునుండి సుప్ర ...ద్ధమండలకార్యకర్తలైన శ్రీ వేం. గుప్తగారు తమ యుపన్యాసమున ...రాజ్యాంగసంస్కరణలు, ఆందోళనోద్యమము, జిల్లా సంఘములు, వ్యవ ...సాయము, గ్రామోద్యోగులు, పన్నులభారము, ఆర్థికదుస్థితి, వర్తకము ...ద్య, భాష, పరిశ్రమలు, సినిమాదురుపయోగము, మున్నగు విషయ ...ములనుగూర్చి సయుక్తికముగ నుపన్యసించినారు. నవీనులయ్యును విజ్ఞాన ...వంతులు కావున సనాతన ధార్మికరక్షణలోని విచక్షణత నచ్చటచ్చట ...గుప్తగారు వాకుర్చిచ్చినారు. సినిమా విషయములో వీరి అభిమత ...ంతయు సమంజసము. దీనినిగూర్చియు కాఫీహోటళ్ళనుగూర్చియు ...చెప్పగ ప్రబోధము గావలసియున్నది. అధ్యక్షుని యాదర్శములు ...ఫలమగుగాక !

**హరశతకము:**—కర్త:—కవిరాట్టు హనుమత్కవిగారు, వెల ...౦ దొరకు స్థలము అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు, వంగిపురము, ...పత్తిపాడు, జి. గుంటూరు.

ఇదియొక సరళపద గుంభితమైన చక్కని శతకము, శివభ
ప్రతిపాదకము శైవజనాదరణీయముఇంచుక చమత్కృతము. మచ్చుక

కం. సదనహరా సవనహరా
మదనహరా మదనమదన మదవదరి రణో
ద్విళనచణ మోహనగిరి
సదనా స్మితవదన యద్రిజారమణ హరా.

**శతక ప్రబంధ హరిహరస్తోత్రరత్నాకరము:**—దొరకుస్థల
ఛాగంటి రామచంద్రరావుగారు, దెద్దనాపల్లి పెద్దాపురం తా॥ తూర్పు
గోదావరి జిల్లా. పుటలు ౪౦ వెల 0—8—0.

ఇందు హరిహరులకు సంబంధించిన భక్తి స్తోత్రములు ఆంధ్ర
గ్రంథములనుండి సంగ్రహింపబడినవి. ప్రయత్నము మంచిదే కాని
తప్పుల కుప్పలు దరిద్రకాగితములు హెచ్చుధరలు ఉండకూడదనిమనవి

**రామదాసు:** राम दास :-కర్త, పింగల లాజపతిగారు, పూర్ణ
నందంపేట, బెజవాడ. పుటలు ౧౦౦ కాగితములు అచ్చుమంచి
వెల 0—10—0 లు.

ఇదియొక హిందీభాషాకావ్యము. ఆంధ్రదేశమున బ్రసిద్ధుడగు
రామదాసు చరిత్రను అఖలభారతమున బరిచయ మొనర్చుటయు దీ
కొక గౌణయుద్దేశ్యము కావచ్చును. భక్తి ప్రతిపాదనయే ముఖ్యము
విశేషమేమనగా గ్రంథకర్తగారు ఆంధ్రుడయ్యు హిందీభాషా కవీశ్వ
రుడై సరళమైన ధారలో కావ్యమునల్లి పెద్దల మెప్పువడసినారు
మున్ముందింకను అభివృద్ధి నందవలసినయువకులు. ఆంధ్ర దేశ హిందీప్రచా
రకు లీ పొత్తమును కనీస మాంధ్ర దేశమందైనను పాఠ్యముగ
నొనర్తురుగాక!

సద్బోధ రత్నావళి:— కర్త: మల్లికార్జునారాధ్యులు, మఠ
మఠ పో. తిపటూరు జి. తుమకూరు మైసూరుస్టేట్. పుటలు ౧౫౦
వెల 0—8—0.

లోకనీతులను అధ్యాత్మభావములను చక్కగ దృష్టాంతము
లతో బోధించు కన్నడపొత్తమిది. యా దేశమున గొప్పగ ప్రచా
రమునందు ననుటలో సందియములేదు. కర్తగారి పరిశ్రమ మిక్కిలి
ప్రశస్తము.




సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

సంపుటము ౧ | సికింద్రాబాదు | రేఖ ౧౦

శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి

కార్తికము

# పురుషత్రయజిజ్ఞాస

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

## అతఁడు

సీ. పర్వతపాదప పక్షిగణంబులఁ
దగ సృష్టిఁ జేయు నుదారుఁ డతఁడు
విశ్వాలసన్నటీ వివిధనృత్యమ్ముల
దర్శింపఁ జేసెడు ధన్యుఁ డతఁడు
సౌందర్యవైభవ సౌజన్యవైదుష్య
భూతిని దయ సేయు పూజ్యుఁ డతఁడు
సుఖదుఃఖజాలాబ్ధిఁ జొప్పించి క్షణములో
నవ్వింప నేడ్పింప నాథుఁ డతఁడు
గీ. వెండి యీలీల లెన్నొ గావించు నతఁడు
లెక్క సేయంగ నేల యే యిక్కలోనఁ
జేరి యున్నాఁడొ లౌకిక చేష్ట లుడిగి
కలఁడొ లేఁడొ యెన్నటికైన గాంచ నగునొ!

## నీవు

సీ. ప్రకృతికి ముద్దుల పతివయ్యు నీవె త
త్సృష్టి గావించిన స్రష్ట వెట్టు
లజ్ఞాన విషయ మర్త్యాదులఁ బుట్టించి
సుజ్ఞాని బిరుదెట్లుఁ జొచ్చె దీవు ?
విశ్వచరాచర వికృతి నశ్వర మగు
నీవు శాశ్వతకాలనియతి వెట్లు ?
కౌతుకమున లోకకల్పనఁ గావించి
దీని నంటకయుండు తీ ర దెట్టు ?
గీ. లెట్టు లరయుదు నేను నీ గుట్టు సకల
జీవిహృద్దేశమున నుంటఁ జెప్పుచుండ్రి;
తెలిపెదో నన్ను నీలోనఁ గలిపికొనెదొ
పలుక వేమిర యెదురుగా వెలుఁగువాఁడ!

## నేను

సీ. ఏ చిరంతనదివ్యవాచినో హృత్ప్రాణ
సంచయంబుల ధాటి మించియుందు
నే నాయకామలజ్ఞానినో నేనొక
సంసారరథముతో సాగుచుందు
నే శక్తి ప్రేమాభిపాశినో క్షణమున
నంగజపావక మందు పడుదు
నే దీనవాత్సల్య వేదినో నే నొక
గడియలోఁ దల్లిన కథను విందు
గీ. నే ననెడువాని కార్యమ్ము లేనె లేదొ
వేచి వేచి యిన్నాళ్లు నే విసుగు వడితి
జగతి "సోఽహం త్వ" మనియెడు శబ్దకూట
మేకమో యిచ్చిచూడ ననేక మగునొ ?

(ఈ పద్యములు 19-10-39 తేదిని హైదరాబాదు శ్రీకృష్ణదేవరా యాంధ్ర భాషా నిలయమున శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి యధ్యక్షతలో జరిగిన కవిసమ్మేళమున జదువఁబడి సభికుల యామోదమును బడసినవి. శైలి సరళము నున్నను భావ మత్యంత విపుల గంభీరమనుట సుస్పష్టము. కొన్ని గొప్ప యుపన్యాసములకు వలసిన సామగ్రి యిందు గలదు. కవి కిది తన రచన యను నభిమానములేదు. ఇది శాస్త్రసారము. ఇట్టి యలౌకిక స్ఫురణ మొకొక్కప్పుడు కలుగు చుండును.)

# అధిక్షేపకావ్యము

**శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు**



భారతీయాలంకారికులు "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్" అని కావ్యలక్షణ మనువదించి యా రమణీయత్వ మెట్లు సాధ్యమగు నని విచారించి రమణీయత్వ మనఁ జమత్కార జనకతావచ్ఛేదకమనియు నా చమత్కార మర్థగత మనియు నా యర్థము వాచ్యలక్ష్యవ్యంగ్య భేదములచే ముత్త్రివిధము లనియు నందు వ్యంగ్యార్థప్రధానమగు కావ్య ముత్తమ మనియు గుణీభూతవ్యంగ్య మగు కావ్యము మధ్యమమనియు నవ్యంగ్యమగు కావ్య మధమమనియు నిర్వచించిరి. ఆ వ్యంగ్యము రసాలంకారవస్తుభేదము వలనఁద్రివిధమనియు వస్త్వలంకారధ్వనులకన్న రసధ్వనియే సర్వశ్రేష్ఠమనియు నిర్వచించిరి. రసశబ్దము శృంగారాది నవరసములకు వాచక మగుటయే కాక రస్యమానతా సాధారణ్యముచే భావ తదాభాసాదులకును జెల్లును.

శ్లో॥ రసభావా తదాభాసా భావస్య ప్రశమోదయౌ
సంధిశ్శబలతా చేతి సర్వేఽపి రసనా ద్రసాః.

(సాహిత్యదర్పణము)

కావున శృంగారాది రసధ్వనివలెనే భావధ్వనియు సర్వశ్రేష్ఠ మనుట నిర్వివాదాంశము.

మరియు రసములు తొమ్మిదైనను నందు గావ్యమున కంగిగా నుండఁదగినవి శృంగారవీరములే యనియు, మిగిలిన రసము లంగభూతములై యవిరోధిభావముతో నుండవలయు ననియు వక్కాణించిరి. సామాన్యముగా సంస్కృతకావ్యములందుఁ గాని యాంధ్రకావ్యములందుఁ గాని నాటకములందు వలె నితివృత్తనిర్మాణ మగపట్టదు. కావ్యమందును నాటకమందు వలెనే కథాశరీర ముండవలయుననియే ధ్వనికారమతము. కాని నాటకకర్త లితివృత్త విషయమున వహించి నంత శ్రద్ధ నేలకో కావ్యకర్తలు వహింపరైరి.

ఈ విధముగా ప్రతిపాద్య మగు నర్థమును బట్టి రసభావ భేదములును, అందును, ఉత్తమ, మధ్యమ, అధమ భేదములను బూర్వులు

నిర్ణయించిరి. ప్రతిపాద్యార్థమును బట్టియే కాక ప్రతిపాద్య వస్తు
బట్టియుఁ బెక్కు భేదములు పేర్కొనఁబడి యున్నవి. అవి మ
కావ్యము, ఖండకావ్యము, ముక్తకము మొదలగునవి.

మేఘసందేశాదులు రసకావ్యము లైనట్లు శతకములు, స్తో
ములు, దేవమునిగురుపుత్రాదుల వర్ణనములు మొదలగునవి భ
కావ్యము లనఁబడును. మఱియు ముప్పదిమూఁడు వ్యభిచారిభావము
గలవు. ఆ భావము లొక్కొక్కటియుఁ బ్రధానముగాఁ గొని కావ్య
రచించినచో నదియు భావకావ్యమగును విక్రమోర్వశీయము
జతుర్థాంకమున నున్మాదము అను నొక్క భావమే నిర్వహింపబడి
అట్లే ఇతరభావములను నుపజ్ఞగల కవులు నిర్వహించి కావ్యము
వ్రాయవచ్చును. అప్పు డట్టి కావ్యములు భావకావ్యము లనవచ్చు
కాని రసకావ్యములని కాని భావకావ్యములని కాని వ్యవహారములే
సాధారణముగాఁ గావ్యమనియే ప్రాచీనవ్యవహారము. రస, భావ
ముల నుపయోగించినచో నది వాచ్యతాదోష దూషితమగును.

కావున మహాకావ్యము కానిండు, ఖండకావ్యము కానిం
ముక్తకము గానిండు, భావకావ్యము గానిండు: వ్యంగ్యప్రధానమ
నచో నది యుత్తమకావ్య మగునని భారతీయాలంకారికుల సిద్ధాంతమ

నిజము చెప్పవలసినచోఁ గావ్యానందసిద్ధికి సాధనములను భా
తీయ లాక్షణికులు నిర్వచించినట్లు పాశ్చాత్యలాక్షణికులు నిర్వచిం
రైరి. ఎట్లన.

శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యంగ్య వైభవమ్
హారాది వదలంకారా స్తత్రస్యు రుపమాదయః
శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవ స్థితాః
ప్రఖ్యాతా లోకవ దియం సామగ్రీ కావ్యసంపదః (ప్రతాపరుద్రీయము

అనఁగాఁ బాశ్చాత్యులలో నుత్తమలాక్షణికులు లేరని కాదు. ఉత్తమ
కావ్యములు లేవనియును గాదు. లక్షణ నిర్వచనము సేయవలసినచో
భారతీయ లాక్షణికులే చేయవలయును. ప్రపంచములో నున్న యే
యుత్తమ కావ్యమునకైనను మన భారతీయ కావ్య లక్షణము సరి
పోవును. అట్లు సరిపోకున్నచో నది యుత్తమ కావ్యము కాక
పోవలయును.

వేదాంతాది సర్వశాస్త్ర సిద్ధాంతములలో హైందవ సిద్ధాంత ములే, యందును నద్వైత సిద్ధాంతమే యెల్ల ప్రపంచమునకు నుపాదే యమైనట్లు కావ్యసిద్ధాంతములలో భారతీయ సిద్ధాంతములే మేలుబంతి యనక తప్పదు. పాశ్చిమ కావ్యసిద్ధాంతములను విమర్శించి భార తీయ సిద్ధాంత మెట్లు మేలుబంతియో మరొక వ్యాసమునఁ దెలుపుదును.

పాశ్చాత్త్యులు ప్రతిపాద్యవస్తువును బట్టి కావ్యములకీక్రింది నామ ములిచ్చిరి. అవి Epic (పురాణకావ్యము) Lyric (ఖండకావ్యము) Satire (అధిక్షేప కావ్యము) Elegy (మృతవిషయ కావ్యము) Didactic (హితోపదేశకావ్యము) Ballads (ఏలపాటలు). కానీ జా ఫ్రై అను నొక విద్వాంసుఁ డిట్లు కావ్యవిభాగమును జేసెనని Encyclopaedia of Brittanica అను గ్రంథములోఁ గలదు.

Jonffroy was perhaps the first asthetician to see quite clearly that lyrical poetry is really nothing more than another name for poetry itself, that it includes all the personal and enthusiastic part of what lives and breathes in the art of verse so that the division of pedantic criticism is of no avail to us in its consideration. We recognize narative or epic poetry; We recognise a drama in both of these when individual inspiration is strong; there is much that trembles on the verge of the lyrical. But outside what is pure epic and pure drama all or almost all is lyrical.

కాఁబట్టి యీయన మతమునుబట్టి పురాణ కావ్యము, నాటకము ఖండకావ్యము, అను భేదములు మాత్రమే గలవు.

ఈ కావ్యప్రభేదము లన్నియు భారతీయుల మహాకావ్య, ఖండ కావ్య లేక ఉపకావ్య, భావకావ్యములలో నంతర్గతములగును. ప్రతి పాద్య వస్తువును బట్టి యేనామము నెవరు వాడినను ఉత్తమ కావ్యత్వ మ్మె కెవరికైనను రసభావాదులు దక్క నన్యకారణము లేదనుటలో నెట్టి విప్రతిపత్తియు లేదు. కావుననే పాశ్చాత్త్యులు ఒక కావ్యభేద ము త్తమమనియు నొకటి యధమమనియు నిర్వచింపరైరి. కాఁబట్టి యెక్కు లెట్లు ఉపాదేయమో, సెటైరు (అధిక్షేపకావ్యము) అను కావ్య మును అట్లుపాదేయమే యగును గాని యనుపాదేయము గాదు. ఉత్తమమీద పైనిఁ దెలిపిన జాఫ్రై అనువాని యభిప్రాయము

ననుసరించి రసవంతమైన యధిక్షేపకావ్యముగూడ లిరిక్కులోనికిఁజేరు
కావున లిరిక్కు ఉత్తమకావ్యమనియు నధిక్షేపకావ్యము క్షుద్రమని
ననుట యవివేకమూలము. రసఘట్టములన్నియు లిరిక్కుగానే
హృతమైనపుడు రసఘట్టముగా నున్న సెటైరు(గూడా తప్పక లిరిక్కు
తప్పదని నాయాశయము. కాన సెటైరు దుష్టమని దోషోద్ఘోషణ
సేయు దోషజ్ఞమ్మన్యులే దోషులగుదురుగాని కావ్యముగాదు. సెటై
నది భాషాభూషణము నగును. ఆ విషయము ముందు నిరూపింతును.

సంఘ దురాచారములను గూర్చి వ్రాయు ప్రతికావ్యమును
క్షేపకావ్యముగాక తప్పదు. కీ॥ శే॥ వీరేశలింగము పంతులుగారు
శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారును వ్రాసిన ప్రహ
ములు అధిక్షేపకావ్యములు గాక మరేమి? ఇత్తరి వెడలిన యెన్
నాటకములు, చలనచిత్రములు, అధిక్షేప కావ్యములై యున్నవి. మ
పాననిషేధ నాటకము త్రాగుఁబోతులపై వ్రాయఁబడిన యధిక్షే
కావ్యముగాదా? కన్యాశుల్కము కన్యావిక్రేతలపై గిరీశమువం
మోసగాండ్రపై వ్రాసిన యధిక్షేపకావ్యముగాదా? గురుజాడ
దృష్టిలో నొకఁ డట్టివాఁ డుండకపోయినచో నా విధముగా నాపాత్ర
బోషింపఁగలుగునా? వరవిక్రయము వరశుల్కాభిలాషులపై నధిక్షేప
గాదొకో? మాలపిల్ల సనాతనులపై నధిక్షేపము గాదనగలరా? రైతు
బిడ్డ జమీందారులపైని నధిక్షేపముగాకపోవునా? పానుగంటి
సాక్షి యెందఱిమీఁదనో యధిక్షేపమని యెవఁడంగీకరింపఁడు? మరి
వారి కంఠాభరణము మహానంద భోగమువారిపై నధిక్షేపముగా
అపూర్వ సంఘసంస్కరణము, మూన్నాళ్లముచ్చట, అను గ్రంథము
అధిక్షేపకావ్యములు గావని యెవరు చెప్ప సాహసింతురు? కా
సంఘ దురాచారములనుగూర్చి వ్రాయు ప్రతికావ్యము గద్యముగా
పద్యముగానీ నాటకముగానీ అధిక్షేప కావ్యముగాక తప్పదు. * అ
కావ్యప్రచారమువలనఁ గాని సంఘ దురాచారములు తొలఁగవు

---

* ఈ విధమైన పద్యములు వేమన బయ్యనల కృతులలోను కొన్ని శతకము
లోను చాటువులలోను కలవు. వీనికి నీతిపద్యము లనియును మఱియొక వ్యవహారము.
—సంపాదకుడు

దురాచారములను ప్రక్షాళనముచేసి సంఘమును నిర్మలముగాఁ జేయవల్ల
మునని ప్రతి విద్యావంతుఁడును దలఁచుచునే యున్నాఁడు. కావున
అట్టి కావ్యములు భాష కవసరము. బాల బాలిక లా యా కావ్యములను
చదివించి తీరనలయు నన్నమాట నెల్ల రంగీకరింతురు. మఱియు నిప్పటి
యాంగ్లవాసనా వాసితులగు విద్వాంసులు సాధారణ ప్రజలలో నుండి
పాత్రలను గ్రహించి కావ్యనిర్మాణముఁ గావింపవలె ననుచున్నారు.
అట్టియెడ సాధారణ ప్రజలలో నున్న యవగుణములను గైకొని వానిని
వర్ణించినపు డా గ్రంథ మధిక్షేప కావ్యముగాక తప్పదు.

కాఁబట్టి సంఘ దురాచారముల వంటివే యగు నధికారుల యధి
కారగర్వము, నడుమంత్రపు సిరిగలవాని ప్రవర్తనలు, పయోముఖ
విషకుంభములవంటి గౌరవోద్యోగుల (డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటులు,
మ్యునిసిపలు చైర్మనులు, సొసైటీల కార్యదర్శులు) నడతలు మొదలగు
వానినిఁ బ్రజలు, బాలబాలికలును, దెలిసికొనవలయునుగదా! అట్టి
దుష్ప్రవర్తనా ఫలితములను వారు గన్నారఁగాంచి సత్ప్రవర్తనాపరులు
కావలయునుగదా! మఱియు మనుష్యులు సదసత్తులు రెండును దెలిసి
కొనవలయును. కానీ కేవల సత్తును దెలిసికొనుటవలన ప్రవర్తన దృఢిష్ఠ
మగాదు. ఉదాహరణ ప్రత్యుదాహరణములవలనఁ గానీ వ్యాకరణ
సూత్రార్థము దృఢముగా నవగతము గానట్లు సదసత్పరిణామ ఫల
మును గాంచినఁగానీ బాలబాలికలకు నీతి దృఢముగా దెలియదు. అట్టి
యెడ హితోపదేశకావ్యముల ప్రక్కనే యధిక్షేపకావ్యములు గూడఁ
జదివింపఁదగినవి. ఇంతేకాక హితోపదేశకావ్యము కన్న నధిక్షేపకావ్యము
హాస్యరస భూయిష్ఠమై యుంటచే బాలబాలికలకును బామరులకును
పఠనాసక్తినిఁ గలిగించి దానికన్న విశేషించి నీతిబోధక మగును.
మొత్తముమీఁద నిదియు హితోపదేశకావ్యమో లేక నీతికావ్యమో
యగును. ఒక యాంగ్లకవి The ridicule is the test of truth
అన్నాడు. కాఁబట్టి వస్తుగౌరవమును బట్టి యర్థగౌరవమును బట్టియు
అధిక్షేపకావ్యమును నితరకావ్యముల వలెనే యుపాదేయమే కానీ
యనుపాదేయము గాదు.

కానీ కొందఱు పత్రికాధిపతులు, కొందఱు రసజ్ఞులగు పండితు

-లును నిట్టి యధిక్షేప కావ్యములను గూర్చి దుర్విమర్శనలు చేయుట
నెఱుగుదును. కొంద అధిక్షేపకావ్యము కావ్యమే కాదని దానినిఁగూ
నిర్లక్ష్యముగాఁ బలుకుదురు. కానీ శాస్త్రరీతితో విమర్శించిన
కావ్యము గాక తప్పదు. మన యింట మనము గూర్చుండి మన
పెద్దలమై యధిక్షేపకావ్యము కావ్యము గాదన్నచో సరిపోవు
ఇష్టానుసారముగాఁ దమ మాటే వేదవాక్య మనుకొని యవిచారము
పత్రికాధిపతులు విమర్శించిన విమర్శింతురు గాక. సంఘదురాచార
లను ఖండించుటకై వ్రాసిన గ్రంథ ముపాదేయమైనపు డొక
"క్షితి నిటుగాదె యొక్కొకరికిన్ నడుమంత్రపు గల్మి గల్గినన్" క
వాచోయుక్తినిఁ గొని లోకులను విమర్శించుచు నొక ఖండకావ్యము
వ్రాసినపుడు "వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతముఖః" అ
లోకోక్తినిఁ గొని లోకమును విమర్శించుచు నొక ఖండకావ్యము
వ్రాసినచో నివి యేల యుపాదేయములు గావో తెలియదు. వీరన్న
మాత్రమున ( గావ్యత్వహాని యెట్లు ?

మణిం లుఠతి పాదేన కాచః శిరసి ధార్యతే
యథై వాస్తాం తథైవాస్తాం కాచః కాచో మణి ర్మణిః.

అన్నట్లు వా రట్టి కావ్యముల నిరాదరించిన మాత్రము
గావ్యత్వహాని పొసఁగదు.

ఒకప్పుడు మా మిత్రులగు సురవరము ప్రతాపరెడ్డిగారు గా
దపైఁ గొన్ని పద్యములను వ్రాసి యాంధ్రభాషలోఁ బద్యకావ్య
లలో హాస్యరసములేని కొఱఁతను దీర్ప వ్రాసితి నని సెలవిచ్చినా
కానీ యే యుద్దేశముతో వ్రాసినను నం దధిక్షేపస్పర్శ లేకపో
అధిక్షేపస్పర్శలేని హాస్యముండదు. హాస్యములేని యధిక్షేపముండ
అవి యన్యోన్యాశ్రయములు. కావున వారు దమ గ్రంథము
హాస్యమే యున్నదన్నను నధిక్షేప మలఁతిగానైన లేకపోలేదు.

రెడ్డిగారన్న ట్లాంధ్రభాషలోఁ బద్యరూపమగు హాస్య గ్రం
ములు లేవు. * ఆ కొఱఁత యీ యధిక్షేప కావ్యముల వలన

* ఆంధ్రభాష యందలి కొన్ని శృంగార కామ పద్య కావ్యములలో
హాస్యము కలదు కాని యవి అశ్లీలములుగా నున్నవి—సంపాదకుడు.

బ్రేవలయును. ఈ సందర్భమున గొన్ని యధిక్షేప కావ్యములలోని పద్యముల ఉదాహరించి యీ వ్యాసమును ముగింతును.

సీ. ఈఁగ యీనినదన్న నే రీతి నెఱుఁగునో ?
పక్షివై వాలు నప్పట్టు నందుఁ
గొత్తకుండం దప్పకొను చుండి రన నెట్లు
పసిపట్టునో యూడిపడు నచటికిఁ
బచ్చతోరణగట్టఁ బ్రోఁకునో ? యేమొ ? యా
గంధ మా తృటినె సాక్షాత్కరించుఁ
బసుపుముగ్గులఁ దీర్ప వాఁకిట వీచునో
యా గాలి ? దూఁకి ప్రత్యక్షమగును.
గీ. మంగళామంగళంపుఁ గర్మములయందు
నొక్క వేషమె ! యొక తీరె ! యొక్క చదువె !
కాసు వీసంబులకు నూరు క్రోసు లేనిఁ
బఱచు గౌరవదూరుఁ డా బాపనయ్య.

* * * *

ఉ. పలుకఁడు పల్కరించినను బ్రోఁత చెలుల్ నడిబాట; నోరగాఁ దొలఁగుఁ బరాఙ్ముఖుం డయి యెదో! విధి లేకయు మాటలాడఁగా వలసిన రెండు ముక్తసరి పల్కులు పల్కును జూచుచుం దెసల్ అలుపపు జీతగాండ్రఁ గవియం డది గౌరవదూరమం చెదన్.

గీ. రమ్మని పురందరుఁడు నాకు రథముఁ బంపె
బాల్యమున దాదివై లక్ష్మి పాల నిచ్చె
వానధారల సందునం బఱవనేర్తు
నని యసంభావ్యములఁ బల్కు టతని ప్రకృతి.

ఉ. తుమతుమలాడుచున్ మొగము తుమ్మలలోపలఁ బొద్దుగ్రుంకుచం దము వహియింప సేవకజనంబులఁ గంకును; జీఁదరించు; వ్యర్థముగఁ జివాట్లు వెట్టు నపరాధ లవంబు నెసంగకున్న నీ క్రమమునఁ జెల్లునంచు నధికార మొనర్చు నతండు మూర్ఖతన్.

ఇవి నడుమంత్రపుసిరిలోనివి. ఈ నడుమంత్రపుసిరిలో గర్వము అను వ్యభిచారి భావము నిర్వహింపఁబడినది.

2

శ్లో. గురో ర్గిరః పంచ దినా నధీత్య
వేదాంతశాస్త్రాణి దినత్రియం చ,
అమీ సమాఘ్రాయ చ తర్కవాదాన్
సమాగతాః కుక్కుటమిశ్రపాదాః

(సాహిత్య దర్పణము)

(కుక్కుటమిశ్రపాదులవారు మీమాంసాశాస్త్రము నైదు దినములలో గుక్కబట్టి మూడు దినాలలో వేదాంతశాస్త్రము నూరుకొనితాగి, తర్క వాదముల నొకతూరి పేల్చివేసి యిదిగో దయ చేసినారు.) ఇది యెల్ల శాస్త్రముల నంజుకొన్న వానినిఁగూర్చి చేసిన ఆక్షేపము.

శ్లో. వేశ్యావేశ్మసు సీధుగంధిలలనావక్త్రాసవామోదితైః
నీత్వా నిర్భరమన్మథోత్సవరసై రున్నిద్రచంద్రాః క్షపాః
సర్వజ్ఞా ఇతి దీక్షితా ఇతి చిరాత్ప్రాప్తాగ్నిహోత్రా ఇతి
బ్రహ్మజ్ఞా ఇతి తాపసా ఇతి దివా ధూర్తైర్జగ ద్వంచ్యతే!

(ప్రబోధ చంద్రోదయము)

(రాత్రులయందు వేశ్యా సంగమము, మధుపానము సేవించుచు పగట మేము సర్వజ్ఞులము, దీక్షితులము, ఆహితాగ్నులము, బ్రహ్మజ్ఞులము, తపస్వులము, అని చెప్పుకొనుచు ధూర్తులు లోకమును వంచించు చున్నారు.

కం. తమ గ్రహచారము చాలమిఁ
బ్రమాదపడి జనులు సమితిపాలకుఁగా నీ
కుమతిని వరించి రొకపరి
తమ గొప్పను గోరఁ గొలువఁ దాకెన్ను గతిన్

గీ. ఇంద్రపదవి లభించిన ట్లీ ఖలుండు
గన్ను మిన్నును గానక మిన్నుముట్టఁ
బొగరు తొక్కుచుఁ జను నీఁతముల్లునేని
నట్టి ప్రభుతాంధ్య మతనికిఁ దట్టె నొక్క

కం. తొత్తుకు సివమెత్తఁగ రా
జోత్తములు నమస్కరింప కుందురె? యటు లీ

మత్తోన్మత్తునిఁ గొండలు
చిత్తము చిత్త మని వచ్చి చేసిరి ప్రణతుల్.
గీ. అంత నభిషేక మొనరించినట్టి యగ్ని
చందమున నా డబిద్ధుండు చల్లఁబడియెఁ
గాని యవ్వానిఁ దాఁకిన గాత్రమునకు
నంటుఁగసటని దాదాల కరుగు జనము.
(డిద్ధడబిద్ధోపాఖ్యానము)
నీలకంఠ దీక్షితులు వ్రాసిన కలివిడంబనశతక మంతయు నిం
దుదాహరింపవచ్చును. విజ్ఞులు దానినిఁ బఠింతురుగాత. ఎంతమంది కవులు
రాజసేవను దూషింపలేదు? "భూభర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము
గాను టొప్పగుర్" అను భర్తృహరివచనము రాజదూషణము
గాదోటు!
శ్లో॥ రాజసేవా మనుష్యాణా మసిధారావలేహనమ్,
పంచాననపరిష్వంగో వ్యాళీవదనచుంబనమ్.
ఇది రాజదూషణము గాదొకో?
మా. మాయాశీలురు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైక కా
ర్యాయత్తుల్ సమయానుకూల హృదయవ్యాపార గోపాయనో
పాయజ్ఞుల్ మగవార లా పయి మహీపాలుర్ మహావైభవ
శ్రీ మోగాంధులు చెప్పనేల? మగవారిఁ నమ్మఁగా వచ్చునే?
ఇందు రాజదూషణము, పురుషదూషణము గూడఁ గలదు.
ఈ విధముగా నవగుణములు గల రాజునుగానీ రాజపురుషునిగానీ పురు
షునిగానీ స్త్రీనిఁగానీ పూర్వకవు లుపేక్షింపలేదు. ఆ కావ్యములన్ని
యును నధిక్షేపకావ్యములై పండితాదరణీయము లైనపు డీకాలమున
వ్రాసిన కావ్యము లేల కావో తెలియదు? లోకమునందలి వ్యక్తులలోని
యవగుణములను విమర్శించుటయే దోసమగుచో సదసద్వివేచనము
యెట్లు? అవగుణములను గప్పివేసి లేని సద్గుణముల నారోపించి
వ్రాసినది లెస్సయగునా? అతి స్తోత్రము హాస్యముగాదా? ఒక నీగ్రో
వానినిఁ జూచి "ఎక్కడివాఁడో యకుతెన యెందు జయంత వసంత

సంతులర్ ! జక్కదనంబునం గెలువఁజాలినవాఁడు" అని పొగడినచో నుచితముగా నుండునా? అది స్వభావవిరుద్ధముగాదా? అట్టిచో సాధారణముగాఁ బ్రతివ్యక్తివర్ణనము నొక్క విధముననే యుండును.

ఈ యధిక్షేపకావ్యములలో నేక దేశాంశ మెవరికేని దాఁకి వచ్చును. సాక్షి యెందఱికి దాఁకదు? అది యాదృచ్ఛికము. లోకములో నొకరిఁబోలిన వ్యక్తిని మరొకరినిఁ జూచుచున్నాము. షేక్స్పియరు యొక్క Comedy of errors అను నాటకమే దీనికి సాక్షి. అట్టి నీకావ్యము తమమీఁదికిఁ దోసుకొని కయ్యానికిఁ గాలు దువ్వుచుందురు కొందఱు. దీనివలన వారు దమ్ముఁ దామే బయటఁ బెట్టుకొని పరిహాస్యు లగుదురు.

కొందఱు నిట్టివారిని వెనుకవేసికొనివచ్చి దుర్విమర్శలు సేయుదురు. అనఁగా వీరికి గుణమందు కన్న అవగుణములందే పక్షపాత మధికము.

కావున భారతీయాలంకారకులు గానీ యభారతీయాలంకారికులుగానీ యీ యధిక్షేపకావ్యమును ఇప్పటివారిలో మిడిమిడి జ్ఞానము గల కొందఱివలె నధిక్షేపింప లేదు. దాని నకావ్య మనలేదు. అర్థగౌరవము బట్టియే కావ్యమునకుఁ దారతమ్యమును నిర్ణయించిరి. *

---

* దురాచారముల నధిక్షేపించి సదాచారముల బ్రోత్సహించుట విజ్ఞుల కర్తవ్యమనక తప్పదు. కాని తమ శత్రువు లగు వ్యక్తులను మాత్రమే మనస్సునందిడుకొని వ్యంగ్యముగ నట్టివారి చరిత్రమును కావ్యముఖమున స్ఫురింపజేయుట సదాచారము కాదేమో! వర్ణాశ్రమములను వేదాగమాచారములను సయుక్తికముగ విమర్శింపవచ్చునుకాని యసూయాభావముతో నిందించుటయును అజ్ఞతతో జర్చించుటయును సరికావుకదా! సర్వమతీయులగు వ్యక్తులలోను దోషములు కలవు. దానికి వ్యక్తులే బాధ్యులు, మతములుకావు. "మాలపిల్ల" మొదలైనవి నిరసూయాభావముతో సృష్టింపఁబడిన వని మే మంగీకరింపజాలము. లోకసామాన్యదోషములను నిరూపించి సమాజహితైక బుద్ధితో నిష్కల్మషమైన కావ్యకౌముదిని ప్రసాదించు కవిచంద్రుల కీర్తి యజరామరము, కాలవశమున దుష్కావ్యములకు వన్నెగల్గినను త్వరితముగ సన్నగిలుటయుగలదు. కావున విజ్ఞు లీ యధిక్షేపకావ్య నిర్మాణమునను తమ సర్వశుక్లయగు సరస్వతిని మెలకువతో వెలయింపవలె ననియే ఈ వ్యాసకర్తగారి హెచ్చరిక.

—సంపాదకుడు.

# ఓరుగంటిస్మృతి

## శేషాద్రి రమణకవులు, శతావధానులు

తెలుఁగులకెంతొ వైభవము తేజము గూర్చినవారు కాకతీ
యు లనుచు నెంచి వారల మహోన్నతి కాస్పదమైన యోరుగల్
చెలువము జూడఁగాఁ దలపఁ జేసితి నొక్క దినంబునందు నం
దలి రమణీయ శిల్పకలనంబును గన్గొని మోదమందఁగన్. 1

సీ॥ అది యఖండంబు తటాక సేతు వఁటంచు
బాటించి చన మంటి కోట యయ్యె
అది జీవనది యగు నని చెరువకుఁబోవఁ
బాతాళమంటెడి పరిఖయయ్యె
అవి శైల శిఖరంబు లని చెంగటకుఁ జేర
కాకతి నృపుల దుర్గంబు లయ్యె
అది యంజనాచలం బని డాయఁగాఁబోవ
గురుతరంబగు రాతి కోట యయ్యె
ఇద్ది యేకశిలాపురం బెట్లు లగు స్వ
రూపమందు ననేకశిలాపురంబు
కాపురం బిది లక్ష్మికి గాకతీయ
రాజధానియొ? యిది స్వర్గ రాజ్యమేమొ. 2

ఇందే కాకతి భూమిపాలకులు సాహిత్యేందిరన్ నిల్పి, యా
నందం బొప్పఁగఁ గావ్య పుష్పముల సన్మానించి పేరొందినా
రిందే తిక్కన సోమయాజి కవితా హేలావతీ నాట్య మిం
పొందించెన్ గణపత్యధీశుఁ డెద నోహో యంచు శ్లాఘింపఁగన్. 3

ఇదె కాఁబోలును గాకతీయులకు మున్నిష్టార్థ సంధానమై
ముదమున్ సర్వవిధాలఁ గూర్చిన స్వయంభూనాథ దేవాలయం
బిదె కాఁబోలు ప్రతాపరుద్ర నృప సాహిత్యైక గోష్ఠీ శుభా
భ్యుదయ స్థానము, రూపు మాసియు మనం బుఱ్ఱూఁతలూఁగించెడిన్.

కాటుకకంటె నల్లనగు గండశిలల్ గొని తెచ్చి, శిల్పపుం
బొటవ మెల్ల నందుఁ జెలువంబుగఁ దీర్చిరి యాంధ్ర శిల్పులా
హాటకగర్భ సృష్టి విభవాతిశయంబులు రాలపైని, ని
ష్పాటిగఁ దీర్చు నేర్పరు లెవారిక నాంధ్రులు దక్క నద్దిరా. 5

సీ॥ అచ్చుగుద్దిన పోల్కి యాస్య సౌష్ఠవమును
దివ్యకాంతులు చిందఁ దీర్చినారు
ప్రతి ముఖంబందు దేవత్వంబు మానవ
త్వంబును సరిగ నేర్పఱచినారు
నలుదిక్కులందు ముద్దులు గుల్కు నాల్గు మో
ములమధ్య లింగంబు నిలిపినారు
నాల్గు మోములు రుద్ర నరనాథు మోము పోం
దికకు నీడగు రీతి దిద్దినారు
అది చతుర్ముఖేశ్వరాలయాంతర గత
రమ్య భూషణము విరాట్ స్వరూప
మిప్పుడు దిక్కుమాలి యెండ వానల కోర్చి
యలరె శిథిలతర శివాలయమున.

శా॥ సాంచీస్థూపములోని ద్వారములతో సాదృశ్యముం గాంచి రా
యంచల్ పూర్ణ సువర్ణ కుంభములు మాల్యాదుల్ గజస్థంబు లే
పంచాస్యంబులు తోడు సూప భువనప్రఖ్యాతి గైకొన్న దీ
చంచద్ద్వార చతుష్క మాంధ్రధరణీశ త్యాగచిహ్నంబుగన్॥

సీ॥ నెలకొల్పినాఁడు భూస్థలి భూషణముగ నో
రుంగంట రాజ్యంబు రుద్రవిభుఁడు
పాలించినాఁ డరువది యేండ్లు రామరా
జ్యంబుగా గణపతి చక్రవర్తి
పరిపాలనను నాంధ్రతరుణులు మగలకుఁ
దీసిపోరనె రుద్రదేవి రాజ్ఞి
నవలక్షధానుష్క నాథులు పని విన
రూఢి కెక్కె ప్రతాపరుద్ర విభుఁడు
శత్రుజనభీకరంబు రాజన్యమకుట
భాసమాన మహాంధ్ర రాట్పాదపీఠ
లలిత మై మించు నేకశిలాపురంబు
శిథిలమై పోయెఁ బూర్వంపు సిరులఁదొలఁగి,

మ॥ శివదేవుండు ప్రధానియై శుభములం జేకూర్చె, రుద్రాంబరా
జ్ఞ విరోధి ప్రకరంబు నోర్చి మహితశ్రీఁ గూర్చె నాత్మీయరా
జ్యవిభూతి స్వాలయింప నాంధ్రులు స్వయంవ్యక్తిత్వముం జూపి శే
యవనీ భాగము నందు నౌర యది కూలాచెంగదా పూర్తిగన్. 9

తే॥ గీ॥ కాకతమ్మ నశించె శ్రీకంఠుఁడెటనొ
పొడవడంగెను జగదాదిమూర్తి యేక
వీర యెచటనొ సమకూర్చె వీరశయ్య
ఆంధ్రులకు మసనం బిది యాంధ్రనగరి. 10

మ॥ కృతిరాజంబులతోఁ గవీశు లాగి నర్చింపంగ భూపుల్ సమం
చితమౌ కానుక లంప, శిల్పులు కళాసేవల్ పొనర్పంగ భా
రతియున్ లక్ష్మియు నేకహేలను విహారం బాచరింపంగ ను
న్నతి మున్పొందిన యోరుగల్లి పుడు శూన్యప్రాయమయ్యెంగదా. 11

సీ॥ బంగారుపూలతోఁ బర్వావసరములఁ
గాకతీయుల పూజ గన్నతల్లి
చండముండాది రక్షస్సంఘ గళగళ
ద్రక్తసుస్నాతయౌ రాజ్యలక్ష్మి
లోకరక్షార్థమై కాకతి రుద్రాంబ
కవతార మొసఁగిన యాదిశక్తి
యాదవ పాండ్యచోళాది రాజన్యసం
పద లోరుగలు చేర్చి నట్టిశక్తి
మూడువందల వత్సరములు మహాంధ్ర
పతిమనోజ్ఞ వరాహ చిహ్నితపతాక
ద్వార శిఖరంబునను మింటఁ దాండవింపఁ
గనిన కాకతి లే దోరుగంట నిపుడు. 12

మ॥ అంగంబుల్ చెడి శృంగభంగమయి దివ్యద్భూషణానీకపున్
సంగాతంబు తొలంగి నాసికయు నాస్యంబున్ విలూనంబునై
తుంగాపీన పయోధరద్వితయ మందున్ బెత్తికల్ రాల, స
ర్వాంగీణాపహృతి నొంది కాకతి మహాంబా! యెందుఁ గూలారితే. 13

[ మిగిలియున్నవి ]

---

# ఆంధ్రసారస్వతము—వీరగాథలు

**వ్యాకరణశిరోమణి సి. హెచ్. రంగాచార్యులుగారు**



సామాన్య జనులలోఁ బుట్టి యకుంఠిత కార్యదీక్షచే అసా
రణభావనాబలముచే లోకోత్తరులై వెలసి తమ కృషిఫలితము
దనివితీరఁ దా ననుభవించి భావిసంతతికై పాతరలకొలఁది నిలువచే
యుంచిన కృతకృత్యులే దేశవాసులైనను, ఏ మతమునకుఁ జెంది
ఏ కళాశాఖావలంబులైనను పూజార్హులే. అఖండతపశ్శక్తిని ధారవో
యగోచరములగు విషయములఁ బ్రత్యక్షము గావించుకొని ప్రప
వాఙ్మయ రంగమున వేదపుష్పాంజలి ఘటించి, యద్దాని యపూ
పరిమళముచే సకలమానవ హృదయభ్రమరముల నాకర్షించి త
చుట్టును ప్రదక్షిణములఁ జేయించుకొను మంత్రద్రష్టలగు ఋషుల
బహు ప్రయాసములకు లోనై సంపాదించిన విద్యచే కఱకుటా
మైనపుముద్దల నొనర్చి భావనాగరిమ మెఱయ హస్తలాఘవము దీపిం
వేయి సుధర్మలను నందనోద్యానములను గండ్లకుగట్టి మర్త్యుల న
షులఁజేయు సిద్ధహస్తులగు శిల్పులును ఒక పీఠ మలంకరింప దగినవా
ఒకరు వీనులకు విందుసేయ, మఱియొకరు కనులకు బందువ చేయుదు
ఒకరు సామగానము చేసి మోడుల జిగిర్పింప, వేఱొకరు "అజంతల
జూపి చేతనుల మ్రాన్పడఁ జేయుదురు. వారి ఘంటమునకు వీరి యు
సాటి. వీరి యులికి వారి ఘంటము ఉద్ది. కావుననే కవికుల చక్రవ
"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్" అని గూఢము
దత్ప్రయోజకుల సామ్యమును వాకొని యున్నాడు. అట్టి మహనీయు
వేసి పెంచిన కళోద్యానమున నే వైపునకు మఱలినను హృదయము
కానందమే. ఒక క్రేవ వేదరసాలమున కంటులు గట్టి పెంచి
జొంపము లగు గున్నమామిళ్ల సొంపు, వేఱొక వంక అలంకారపు
గుచ్ఛముల యింపు, చేతికందు ద్రాక్షలు, ముగ్గిన యనఁటులు, న
నడుమ లేతకొబ్బరిచెట్లు. ఒక భాగమునఁ గైలాసకూటమ్ముల న

ంచిన చిత్రకూటములు, మఱియొకచో రాయంచ లాడు కేళా కూళులు. ఇంకొకచో జీవకళ లుట్టిపడు చంద్రికాంత శిలాప్రతిమలు. ఈ సార్వజనికోద్యానమునుండి తమకు గావలసిన యంటులను ప్రతిరూప ములను దెప్పించుకొని, గృహారామములఁ బెంచుకొని యానందించు చున్నారు. ఆంధ్రులును తోడివారివలె (తక్కినవారి కంటె కొంత యాలస్యమైనను) గృహారామము నొకదానిని వేసికొని యానందించుచునే యున్నారు. ఆ తెలుఁగు తోఁటలో సారస్వతపథమున బ్రవేశించి నోదింతము.

ఆంధ్ర సారస్వతము పుట్టి సుమారు వెయ్యేండ్లైనది. నిజమునకు అనంతమైన కాలపరిణామమున వెయ్యేండ్లొక లెక్కలోనివి గావు. అట్లని యయ్యది మిక్కిలి తక్కువకాలము గాదు. ఏ భాషయైనను పొందవలయు నభివృద్ధి యీ కాలపరిమితిలోఁ బొంద వీలున్నది. ఆంధ్ర సరస్వతియు నీ పరిమిత కాలమునఁ బలుపోకల పోయినది. చిన్నెలు వన్నెలుచూపినది. తెలుఁగునాట పురాణములు వెలసినవి. కావ్యములు వెలువడినవి. ప్రబంధములు ప్రభవించినవి. నాటకములు గన్పట్టినవి. కవిత్వమున కంటులేదు. అది క్షీరమువంటిది. కవుల నలుపు, తెలుపు, కలిమిలేములు అందు ప్రతిఫలింపవు. కావుననే ఆంధ్ర సారస్వత క్షేత్రమున కులబ్రాహ్మణుని దొట్టి కాస్మాపాలిటన్ కవి వఱకు నందఱు వాళికులే. నిరుపేదయగు పోతనయు, సార్వభౌముడఁగు శ్రీకృష్ణ దేవ రాయలు నొకగద్దె నెక్కువారే. ఆంధ్ర సారస్వతమున ప్రథమ గ్రంథ మనఁబడు భారత మనువాద మగుటఁ గాబోలు పదపడిన గ్రంథజాల మంతయో యా త్రోవనే నడచినది. భారతములు పలువిధములు, రామాయణములు రక రకములు. పురాణములకు ప్రతిపురాణములు. కావ్యములకు ప్రతిబింబములు. నాటకములకు తెలిగింపులు. ఆంధ్ర ప్రతిభ అనుకరణపుకొంకలలో దిరుగని పొలములేదు. ఎక్కని కొండ లేదు. కావుననే తెలుఁగు గ్రంథములలో పెద్ద మొత్తము అనువాద మనవలసి వచ్చినది. అట్లని స్వతంత్ర గ్రంథములు లేకపోలేదు. కాని అవి వ్రేళ్లమీద నిల్చునవి. ఇప్పుడిప్పు డింటు సంఖ్య పెరుగుచున్నది.

స్వతంత్ర రచనలు తక్కువగా నుండుటకుఁ గారణమేమి? చరిత్రగ్రంథము లెందుకు వెలువడలేదు? వీరగాథల శైలితియేల! వీ కన్నిటికిని మూలమొక్కటియే. అది నాటి సారస్వతలక్ష్యము. దా ననుసరించిన కావ్యలక్షణ మను ఉక్కుచట్టము. ఇందు కావ్యపద తక్కిన సారస్వత విభాగముల కుపలక్షకము. ఆ కావ్యలక్షణ మేమి "విశ్వశ్రేయః కావ్యం" (మన జగన్నాథపండితులు) ఆ శ్రేయః ధర్మమూలకము. ఆ ధర్మమును ప్రబోధించుటకు, ధర్మానుష్ఠాత ల మహాపురుషుల జీవితగాథలు పురాణముల నుండి గ్రహించి కవు తమ గ్రంథములలో నితివృత్తముల నేర్పఱచు కొనక తప్పినది గా ఎవరైన నప్రఖ్యాతేతివృత్తము స్వీకరింప సాహసించిరేని వాని గ్రంథ అసత్కావ్య మను అశనిపాతమునకు గుఱిగావలసినదే. ఈ య మే కొలదిమందినో విడచి సంస్కృత కవులకే తప్పినది గాదు. ని మాన ప్రతిభా సంపన్నుండగు కాళిదాస కవివరేణ్యుని ప్రసిద్ధ కృ లాఱింటిలో నైదు ప్రఖ్యాతేతివృత్తకములే గావలసి వచ్చినది. ని మొన్నటి దనుక ఆ మహాకవి ప్రతిభకు సర్వ నిదర్శన మను "మేఘ సందేశము" కూడ సమూల మని ఇటీవలనే ఈ పత్రికాము మున ప్రమాణములు ప్రదర్శింపఁబడినవి. వాఖ్యాతృ చక్రవర్తి మ మల్లినాథసూరియు నీ సంగతి మేఘసందేశ ప్రథమశ్లోక వ్యాఖ్యా మున "హనూమత్సందేశం మనసి నిధాయ" అను వాక్యముతో సూచిం యున్నాడు. ఇపుడు దొరకిన పురాణ ప్రమాణముల నాతఁడు చ డమి ఎట్లో నిర్మూలత్వమును దొలఁగింపఁ బాటుపడినాఁడు. ఇట్టి తీ ప్రతి విషయమున తు చ లు దప్పక సైనికునివలె నడచుకొను తెలుఁ కవి అప్రఖ్యాతేతివృత్తమును స్వీకరింప సాహసింపఁ గలఁడా? సా సించి తోడివారల మెప్పింపఁగలఁడా? సారస్వత మంతయు ధర్మ ప్రచా మునకు, వేదాన్త చర్చలకు, వినియోగపడినపుడు సామాన్య మానవు గాథలకు దావేది? భగవంతుని యనంతశక్తులు, దేవదానవుల యద్భు పరాక్రమములు, దివ్యప్రాసాదములు, నందనోద్యానములు నాఁటి కవు గీర్వాణవాణీ సుధారసమునఁ బాకము వట్టి యింటింట సారెలువెట్ట

...జూచి మక్కువమెక్కి గట్టునఁ బ్రేన్చిన ఆంధ్రజాతి, ఆంధ్రజాతియేమి మానవజాతి, ధర్మబద్ధమై యద్దానిముందు మోకరించినది. ధర్మముది మానవ హృదయమున హత్తుకొని పోయినది. ఱేఁడు ధర్మరక్షకుఁడు. ...జలు ధర్మానుష్ఠాతలు. ధర్మమునకై సామ్రాజ్యములు దలసూపినవి. ...ర్మమునకై సామ్రాజ్యములు రూపటినవి. ధర్మపథమునఁ గాలుజారిన ...ఁడు రసాతలమును జూడవలసిన దే. సంఘమున నాతఁడు మాలకాకి. ...ంఘశరీరమునకు వాఁడొక దుష్టావయవము. అంతియే, ముఱిగి చావ ...లసిన దే!

ఈ ముప్పు ఎక్కడజూచిన నక్కడ సి. ఐ. డి. వలె ప్రత్యక్షమే. ...తుక గోరువా డెవ్వ డిద్దాని నెదుర్కొనఁగలడు? ఇట్టితఱి వెయ్యారు ...లుఁగుకబ్బములు కేవలము అనువాదము లనినచో నబ్బురమేల? తెలుఁ... కవులకును ఒక సమయముగలదు. కవికి ముందు తొంబదిపాళ్లు ఒక ...ల రావలె. పిదప ఏరాజో పేరోలగమునఁ గాన్కలిడి గ్రంథముఁ వ్రాయ ...ర్థింపవలె. వ్రాసిన గ్రంథము విద్వత్పరిషత్తులు మెచ్చవలె. ధర్మ ...ద్ధ మని ధర్మాచార్యులు యోగ్యతాపత్రి మీయవలె. ఈ కాకల ...గిన కవికి ప్రజాదరము, ప్రభుసన్మానము. ఈ బడబానలమున ...ంకిపోవు కవితాస్రవంతు లెన్నియో? ఈర్ష్యంఝామారుతమున తెక్కలు ...ఱుఁగు కవుల లెక్క యెంతో!

అట్లు పవిత్రము, ధర్మప్రబోధైక ప్రయోజన మగు సారస్వత మును నశ్వరమును, పరిమితశక్తికమును నగు మానవజాతికై వినియో ...ంచుట పూలనిచ్చి కట్టెలుగొనుట వంటిదనియో, కప్పుర మిచ్చి యుప్పు ...నుట వంటి దనియో భావించినదినములలో చరిత్రములును, వీరగాథ ...లును సారస్వతమున నెట్లు పొడగట్టగలవు? నరుల బొగడుట మహాపాప ...మయ్యె. మేటిరాజయ్యు పద్యమునకు నోచుకొననప్పుడు ప్రబంధమున ...కెట్లు తగును. ఈ సిద్ధాన్తము, ఈ లక్ష్యము ఒకవిధముగ న్యాయ్యమే ...మైననగునేమోగాని, భావిజాతికి గొడ్డలిపెట్టని చెప్పకతప్పదు. దీనివలన ...చరిత్రలకు లేమిగల్గె, వీరగాథలకు దారిద్ర్యమేర్పడె. ఇంకేమిగావలయు?

ఏ జాతికి చరిత్రలేదో, ఏ జాతికి వీరగాథలులేవో, ఆ జాతి నిర్వీర్యమ
ననిగదా, మహాశయుల యాశయము. లేకున్న సామ్రాజ్యము లే
జాతి వీరజాతి కాకుండెడిదా? నాసికలో వెలసిన సైనికకళాశాల అ
రావతిలోనో, హంపిలోనో వెలయకుండెడిదా?

ఆంధ్రసారస్వతమునకు మూలస్తంభమగు తిక్కనమనీషి స్వ
ముగ రణకోవిదుఁడు, మీఁదుమిక్కిలి మంత్రి, పెక్కురంగముల
కించినవాఁడు, వశ్యవాక్కు. ఆతఁడే నాటిచరిత్రను, వీరగాథను వ్రా
దలపెట్టియుండినచో మన కెన్ని వీనులు గావలసియుండెడివో! భా
మునఁ దెరచాటునఁ గన్పడు నాతని స్వరూపము ప్రత్యక్షము గాకుం
డిదా! ఆంధ్రకవితా పితామహుఁడో! రాయలచమూధాటులఁ గ
లారఁ గాంచినవాఁడే! వ్యూహములం జూచినవాఁడే! పూచిన మోదు
లైన కడిఁది జోదుల మేను పులకరింప వీక్షించినవాఁడే! ఏది? ఆ య
శ్వాసాంతపద్యములు దప్ప, ఆ పలుకు బంగారముగాను, వేఱు వి
బడదే! అది మన దురదృష్టము. కాదేని, అయ్యది "శ్రీకృష్ణరా
విజయము" కబ్బము సాముగరిడీలలో ముక్కాకలు దీరి కాలికి గం
పెండేరము దొడిఁగి బంగరుపల్లకీ నెక్కిన అల్లసాని నోటనే వె
యుండమా? ఇయ్యది కుమారధూర్జటి పాలబడవలయునా? విజయనగ
సామ్రాజ్యలక్ష్మిని గనులారగాంచి, రాయలరాచఱికమును, అమాత్య
శేఖరుఁడగు తిమ్మరుసు పరిపాలనా కౌశలమును బ్రత్యక్షమొనర్చుకొను
పుణ్యముజేసి, కావలయునంతటి వాఙ్మయమును గైవసము గావిం
కొనియుండు అష్టదిగ్గజము లుండ, వచ్చియురాని భాష, దెలిసియు దె
యని భావములు గల వైదేశికుఁడా! ఆంధ్రచారిత్రకులకు బాలశి
వ్రాయవలసినది? గుడ్డిలో మెల్ల! అంతవరకతఁడు సంభావ్యుఁడే. అదియు
లేకున్న జేయున దేమి? ఈ మన కవులు బట్టిన మూఁగనోములో నెన్ని
వీరగాథ లణఁగి పోయినవో? ఎన్ని చారిత్రకరత్నములు నేలఁగలసినవో!
వారే యాపని నెఱవేర్చియున్నచో నేఁడు రాగిరేకులు బట్టుకొని, శిథిల
హర్మ్యములఁ జుట్టికొని చారిత్రక పరిశోధకులు గాలిని బోగుజేయఁ
బ్రాకులాడవలసి వచ్చియుండదుగదా!

కొమ్ములు దిరిగిన కవులి ట్లుపేక్షించినను అపుడపుడు హృదయము
ప్పొంగించు వీరకృత్యముల గాంచి యప్రయత్నముగ వీరగాథలు
గానముజేసిన కవులు లేకపోలేదు. కాని వారు కొలది మందియే. ఊరు
పేసులకై ప్రాకులాడని వారనామకులుగా భావింపఁబడుటలో నాశ్చర్య
మేమి? మహాకవులలో నెట్టులో దారితప్పి ఒక శ్రీనాథ కవిరాజు
గాబోలు నీ యపవాదునకు గుఱికాకున్నది. ఆంధ్రసారస్వతమున వీర
గాథల కితని "పల్నాటి వీరచరిత్ర" పచ్చలపగిడి. ఆరముగ్గిన పనసపండు
టియాతని కబ్బమునఁ దెలుఁగు జోదులుఘుమఘుమ మనుచున్నారు.
శౌర్యమపూడి కురుక్షేత్రమై వెలసినది. బాలుని వాఁడికటారి తళ తళ
నాగులేటి తరఁగలలో న ర్తించినది. వీరులు (వీరుళ్లు, ఈరుళ్లు) దేవత
ై పూజలు గొన్నారు. శ్రీనాథకవి సార్వభౌముఁడు వివిధ వృత్తము
తోఁ దన యసామాన్య శేముషీ విభవము వెలయ రచించిన శృఙ్గార
నైషధ, కాశీఖండ, భీమఖండాది మహాగ్రంథముల మూలమునఁ గన
పట్టాభిషేక గౌరవము నందఁ గల్గినచో, ద్విపదలో నందులను మంజరిలో
నొక్క "పల్నాటి వీరచరిత్రము" వ్రాసి యఖిలాంధ్ర హృదయ కనకపీఠ
మున 'పట్టాభిషేకము' గావించుకొనఁ గల్గినాడు. ఈ వీరగాథ వెలుపడి
ది మొదలు మొన్న మొన్న "అక్కిరాజు ఉమాకాన్తము"గారి ధర్మ
మాయని యచ్చొత్తింపఁబడి ప్రకటింపఁబడు వఱకు సుమారు ఐదువంద
ేండ్లు పుట్టెడు లేమిలో మునిఁగియు దమ సంతానముతోఁబాటు నెట్టెట్లో
తరములు రక్షించి మన కందిచ్చిన భిక్షుకజాతి కెన్ని ధన్యవాద
ముల జెల్లింపవలెనో? ఇది జాతీయములకుఁ బుట్టినిల్లు. తెలుఁగుదనము
ట్టోడిపాఱిన తేనెవాఁక. ఆంధ్రజీవితము ప్రతిఫలించిన అద్దాలమేడ.
ఈ గాథయే గ్రంథరూపము నొందకున్న నేఁడు మనము పలనాటిని
చిన్నచిన్న గుళ్ళకు' 'చిల్లర దేవుళ్ళకు' 'నాగులేటిసీళ్ళకు' 'నాపరాళ్ళకు'
కావని తప్ప బ్రహ్మనాయుని వంటి ధార్మికునకు, బాలచంద్రునిబోలు
యోధాగ్రేసరునకు, అనపోతు వంటి అభినవాశ్వత్థామకు, పాంచాలిని
బోలు మాంచాలకును బుట్టినిల్లని యూహించిరైన నుందుమా?

ప్రబంధధోరణిలో నడచిన వీరగాథలలో "శ్రీకృష్ణరాయవి
యము" ఒకటి. అష్టదిగ్గజములలో నొక్కడై "స్తుతమతి"యై అతులి
మాధురీమహిమతో శ్రీకృష్ణరాయల పొగడ్తలం గని తన కవిత
భాండారము నంతయు శ్రీ కాళహస్తీశునకు సమర్పించి ధన్యుడై
ధూర్జటి కవిచంద్రుని మనుమఁ డగు కుమార ధూర్జటి దీని క
మూరురాయరగండని విజయదుందుభిని గదలించి మోగించి
కుమారకవికిఁ దలకుమించిన పని యైనను ఎట్లో పూనుకొని కొ
వఱకు నెగ్గెను. ఈతని యుత్సాహము ప్రశంసాపాత్రము.

తెలుఁగు వీరగాథ ప్రబంధముగా వ్రాసిన కవులలో దిట్ట
నారాయణ కవి యొకఁడు. ఈతఁడు బెల్లంకొండప్రభు వగు మలా
రామనృపాలుని యాస్థానకవి. ఒకనా డీకవి "ఇదానీంతన మహావీరపు
పౌరుష రసానుబంధబంధురముగా నొక్క ప్రబంధంబు రచియింపఁగో
యున్న సమయంబున" మలారాజు రామనృపతి పిలిచి, సంభావించి;

"భారతయుద్ధ మట్టు లతిభాసురతం గనుపట్టుచు న్మహా
వీరరసప్రధాన మయి వేడుక నింపెడు రావువారి దు
ర్వార రణప్రసంగ మతి రమ్యతరంబది గద్యపద్య సం
భారయుతంబుగా నొక ప్రబంధ మొనర్పు మదంకితంబుగ

అని "రావువారి దుర్వార రణప్రసంగమును" ప్రబంధరూ
ముగ వ్రాయఁబ్రార్థించెను. ఉత్సాహియైన కవి "రంగరాయ క
రంగ చరిత్ర"మను "రంగరాయచరిత్రము" వ్రాసి బొబ్బిలిబెబ్బులు
బ్రత్యక్షము గావించియున్నాఁడు. దీనికి ముందే ఎన్నడో బొబ్బిలిక
యక్షగానరూపమున వ్రాయఁబడినది. ప్రజలు దీనికి చెవులు
కొనుచుండిరి. రావువారు లావు మెఱయఁ దెలుగుదెందమునఁ
కట్టుకొని కాపురము చేయుచుండిరి. తందాన తానగాం ధ్రదేశము
జాడ నాలకించు జనులు మేను గగుర్పొడు పరక్త ముప్పొంగ నొక్క
రుఁడును తాండ్రపాపయ్య యైపోవుచుండెను. ఈకథ పొందినంత వ్యా
వఱి యే వీరగాథయు పొందలేదు.

ఈ పై రంగరాయ చరిత్రము కృష్ణరాయ విజయములవలెనే
...తివిజయము సోమదేవరాజీయము, పద్మనాభయుద్ధము మున్నగు
...కూడ ఆంధ్రవీరగాథలే. ఆంధ్రసారస్వత నూతనోషస్సున ఆంధ్ర
...భూషణ మెలుగెత్తి భూపాలలో నాలపించిన వీరగీత మొక్కటియు
...క ప్రబంధమే. ఆ గీతను మహాపథీ ప్రభావమువలె తెలుఁగునాడుల
...జీ యుడుకెత్తించినది. "చావలేదు, చావలేదు, ఆంధ్రజన మహో
...లచరిత్ర; హృదయముల జీల్చి చదువుడు" అని యామ్రేడితము చేసి
...హాత్మాభిమానము రేకెత్తించినది. సారస్వతమున రాజకీయమున దీని
...లన తెలుఁగు నాటను గలిగిన ఫలితము ప్రబుద్ధాంధ్ర మెఱుఁగును.
...పడి "పాడరా నీ వీరభావభారతము" అను నీ కవి పల్లవిగొని యాల
...చిన యనుపల్లవులతో నాంధ్రదేశము మారుమ్రోగినది.

ఇవి గాక పల్లెటూళ్లలో పండువెన్నెలలో పాటరి జనము పరవశ
...గాఁ బాడించుకొను పాటలు, జంగముకథలు, పిచ్చిగుంటుల పదములు,
...ల్లసుద్దులు, తెలుఁగు వగటిమి పారు సెలయేటి దూకులే, చిన్నప
... కథ, ముసలమ్మకథ, (రాయలసీమ) సర్వాయి పాపడు కథ,
తెలంగాణమున పాపురము) సర్వై వెంకటరెడ్డి కథ, (వనపర్తియేలిక)
...టమరాజు కథ, మఱికొన్నియు వీరగాథలీ కోవలో రవ్వలే! ప్రతి
...యు తెలుఁగుజాతి యెత్తిన పతాక.

పగలెల్ల తెక్కలు ముక్కలుజేసికొని చెమటలోడ్చి కష్టజీవులకు
...శాంతి సమయమగు నా కొద్దివేళ నక్లేశముగ హృదయమును జొచ్చి
...యి గొల్పు నీ జాతిపదములే ద్రాక్షాసవములు. భావమున కందని
...షతో భాషలో మరుగువడు భావములతో నక్కిరి బిక్కిరియగు
...బంధముల యూబిలో నీ జాతివారు దిగలేరు. అవి తిన గుడువఁగలిగి
...ట్ట చీకులేని పెట్టి పుట్టినవారివి.

తెలుఁగు మాగాణము నాలుగు చెఱఁగుల గాలించినచో నేయే
...నాలలనుండి యేయేరత్నములు వెలువడునో! తెలుగు నుడికారపు
...ంపు చెంఫల దిద్దుకొను నద్దంబులగు నీ వాఙ్మయంబు నంతయు

ద్రచ్ఛురకయే తెలుఁగు నవనీతము నేమి యాస్వాదించినట్లు? తెలుఁగుకు సర్వాంగసుందరి గావలయు ననిన నిట్టి వీరగాథలు సంపాదించి యను త్తించి వెలువరించుట యవసరము. *

* విదేశీయుల వ్రాతలు భారతీయులకు ఇతిహాసచరిత్రగ్రంథములు లేవనియు వీరగాథలు లేవనియును ప్రకటింప జొచ్చెను. దీనిని సత్యమని నమ్మువారును కలరు. ఇది సువిచారము కాదని మాభావన. వేదములలోను వీరగాథలు కలవు. మహాభారత మొదలు బాలనాగమ్మ కథలవరకు గల విస్తృతమైన వాఙ్మయమంతయు వీరగాథలతో నిండియున్నది. అయితే మన దేశ కాలపరిస్థితుల ననుసరించియే రచన సాగుటయనుట స్వభావసిద్ధము. విదేశీయ పద్ధతితో మన గ్రంథములను, స్వదేశీయ పరిస్థితులతో విదేశీయ చరిత్రలను ఆక్షేపించుట సరియైన మార్గము కానేరదు. వీరరసమునకు ప్రాధాన్య మిచ్చియున్నారు కదా? చిన్న చిన్న వీరుల (ప్రాంతీయపురుషుల) కథలు ఒకప్పుడు సమకాలికులనే ఆకర్షింపవు. ఇక రాష్ట్రప్రఖ్యాతి యెట్లు? రాముడయోధ్యలో బుట్టినను లంకవరకును ప్రఖ్యాతుడయ్యెను. ఆ వ్యక్తిలోనే అట్టి వ్యాప్తి కలదు. ఇట్టికథలు చిరకాల స్థాయిత్వమును పొందు ననుటకు నుదాహరణములు చెప్పనక్కరలేదు. ఇందు మన ప్రాచీనుల యపరాధ మేమి? సర్వగుణములు గల కథ సర్వకాలము నందును పనికివచ్చును. వీరగాథ లన్నని యుద్ధకాలమున మాత్రమే ప్రధానముగా దోచును. సుభిక్షమైన పరిస్థితులలో శృంగారమే మనోహరమనుట సుప్రసిద్ధము. పైగా శృంగారము నిత్య జీవితముతో సంబంధము కలది కదా! ధర్మము వీరరసమునంగీకరించలే దనుటయు పొసగదు. లౌకిక పారమార్థికలాభము ననుగ్రహించుటయే ధర్మమునకు లక్ష్య మని కాణాదుడును, ధర్మము వలననే అర్థకామములని వ్యాసుడును నిరూపించిరి. ఇది "విశ్వశ్రేయః కావ్యమ్" అనుటకు సమన్వయమే. అర్థకామముల ననుభవించుచు చచ్చిపొండని ధర్మ మెన్నడును నాజ్ఞాపించలేదు. సమస్త విబుధులు దేశకాలపాత్రల ననుసరించి రసవత్తరమైన ఉత్కృష్ట కావ్యములనావిష్కరించి లోక కల్యాణమునకు బూనుట కెన్నడును నిరోధ ముండనేరదని వ్యాసకర్తగా రుద్బోధించియున్నారు. —సంపాదకుడు.

# షట్స్థలదర్పణము

## శ్రీ మఠం నడివూడి నాగభూషణ దేవరగారు



సీ॥ సోమసూర్యాగ్ని విస్ఫూర్తి బింబద్యుతి
ఘటితమై ధాత్రి నెచ్చట వెలుంగు
కమలభవాండాండ గర్భమై పిండసం
ఘటితమై ధాత్రి నెచ్చట వెలుంగు
పంచమహాభూత పటుతర వర్ణ సం
ఘటితమై ధాత్రి నెచ్చట వెలుంగు
బాహ్యాంతరంబు లుద్భవచరప్రళయ సం
ఘటితమై ధాత్రి నెచ్చట వెలుంగు

గీ॥ అట్టి నిరుపద్రవ సుఖస్థలాగ్రభాగ
మర్థి నివసించి విశ్వమం దావరించి
దివ్యమై యిష్ట లింగంబు తేజరిల్లు
లీల హృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.

సీ॥ అసమానవిధువిగ్రహములు జంత్రములన
దశ ప్రభంజనులు సూత్రములనంగ
సారది జాగ్రత్ స్వప్న సుప్త లాస్యంబన
భాస్కరచంద్రదీపము:లనంగ
కామ్యమోహము మాయ గాఢాంధ తెర గాగ
తతపంచప్రణవ నాదమును గాగ
నిత్యబ్రహ్మాండంబు నృత్యశాల యనంగ
ప్రాభవ మల్లింగ సభ యనంగ

గీ॥ సగుణ నిర్గుణహస్తముల్ సాచి దిగిచి
మేనులాడించు యిందజాలుని విధంబు
లీల గోరియు శ్రీయిష్ట లింగమూర్తి
లీలహృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.

సీ॥ ఎచ్చట మూర్కొన్న నచ్చట లింగంబు
నాశికరూప మున్నతి వహించె
నే దిక్కు రుచియింప నా దిక్కు లింగంబు
జిహ్వాస్వరూపు వసించియుండు
నే దెస గనుగొన్న నా దెస లింగంబు
కన్గవ రూపు ప్రకాశమయ్యె
నే తోవ స్పృశియింప నాతోవ లింగంబు
చర్మస్వరూప ప్రశస్తమయ్యె
గీ॥ నెచట విన్నను లింగంబు నచటి శ్రోత్ర
రూపమయ్యె ప్రమోదంబు రూఢి నెచట
నచట లింగంబు హృదయాంగమై నటించు
లీల హృద్వర్తి శ్రీమహాలింగమూర్తి.

సీ॥ ఏ వంక గుర్తించ నా వంక లింగంబు
జాగ్రిత్ స్వరూపు విశ్రాంతమయ్యె
నే తీరు కలగన్న నా తీరు లింగంబు
స్వప్నస్వరూప మశ్రాంతమయ్యె
నే సీమ నిద్రించ నాసీమలింగంబు
సమసుప్తిగాను శాంతము వహించె
నే చక్కి భక్తుండు నా చక్కి లింగంబు
భక్త స్వరూపమై పరిఢవిల్లె.
గీ॥ భక్తి యెక్కడనున్నదా వంచ నుండు
భక్తుడై యున్న తనకును భక్తునకును
భేదమేమియు లేక కన్పెట్టిచూడ
లీలహృద్వర్తి శ్రీమహాలింగమూర్తి.

సీ॥ త్రివిధాంగముల యందు దలివియున్న మలత్రి
యముల దీక్షాదిత్రియములచేత
ఖండించి నిలిపెను ఘనముగా లింగముల్
మూడంగముల యందు మూటి వరుస

నిగమోక్తు లెట్లన్న త్యాగాంగమందిష్ట
లింగంబు నిల్పి భోగాంగ మందు
ప్రాణలింగము నుంచి భవమెల్ల మడియించి
యోగాంగ మందున బాగుగాను,
గీ॥ భావలింగము స్థాపించి భర్గుతొల్లి
త్రిపురసంహార మొనరించు నా పగిదిని
త్రిమలహారి యన ననబడు దేశికుండు
లీలహృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.
సీ॥ విద్వాంసు లూహింప వేదోక్తి జీవాత్మ
విశ్వుడై జాగ్రత వెల్గుచుండు
మండీత మంతరాత్ముండు తైజసుడై
వెలయు స్వప్నావస్థ నేలుచుండు
అసమానగతి పరమాత్ముడు ప్రాజ్ఞుడై
పరగ సుప్తావస్థ జరుపుచుండు
మరియు విశ్వుడు దేహమై యుండు తైజసు
ప్రాణుడై వెలయును ప్రాభవముగ
గీ॥ నాత్మభావజుడై ప్రాజ్ఞ డతిశయిల్లు
సూక్ష్మబుద్ధిని సద్బుధుల్ శోధ లెరిగి
స్థిరత నీమూడు క్రమములు దెలియవలయు
లలహృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.
సీ॥ శశ్వత్క్రియాదీక్ష విశ్వుండునై కొని
వరయిష్టునకు నమస్కార మొసగు
దక్ష తైజసు మంత్రి దీక్షాత్ముడై ప్రాణ
లింగంబు గూర్చి సాష్టాంగమిడును
నక్షీణగతి వేద శిక్షాత్ముడై ప్రాజ్ఞ
డై కొని భావలింగంబు గొల్చు
వెండియు విశ్వుండు విమల పదార్థ రూ
పము నిష్ట లింగార్పణంబు జేయు

గీ॥ పరగ తైజసు రుచులెల్ల ప్రాణలింగ
మూర్తి కర్పించు ప్రాజ్ఞు డానందతృప్తి,
భావలింగార్చనలు జేయు భావమందు
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి.

సీ॥ సర్వలోకాలోక సంగ్రహమా బుద్ధి
యమ్మహాలింగంబు నందు నిల్పి
ఆ మహాలింగమూర్త్యాధారమగు స్థూల
కాయంబు యిష్టలింగమున కిచ్చి
యా యిష్టలింగమూర్త్యాధార మగు ప్రాణ
లింగంబు నందు సూక్ష్మాంగ మునిచి
ఆ ప్రాణలింగమూర్త్యాధార మగు భావ
లింగంబునకు కారణాంగ మునిచి
గీ॥ జ్యోతికర్పూర సంయోగ భాతిగాను
నంగలింగము నీ రీతి నైక్యమంది
చిత్కళాధామమున జేరు శివకరణుడు
లీలహృద్వర్తి శ్రీ మహాలింగమూర్తి.

సీ॥ లాలిత్యమా శివ స్థూలము గురుమూర్తి
సంగత సూక్ష్మంబు లింగమూర్తి
నమితకారణము జంగమమూర్తి యై యుండు
ముఖ్యమైనట్టి త్రిమూర్తి యతడు
బరువడి దేహంబు గురుమూర్తి కర్పించి
మనసు లింగానందమున వసించి
ధనములు జంగమ ద్రవ్యంబుగా ముట్టి
సచ్చిదానందాబ్ధి సమతబొంది
గీ॥ దగ్ధపటలము తను విందరి తనువుగాను
పనులు జేయుచు భావంబు బయలుబట్టి
పరమశరణుడు నీరీతి పర్యటించు
లీల హృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.

సీ॥ శర్కరనీటిలో సంయోగ మగురీతి
కర్పూరమున జ్యోతి కలిసినట్లు
లవణంబు జలములో లయమైన చందాన
నల బయల్ బయలులో గలియుమాడ్కి
సంగంబు శర్కర లింగంబు నుదకంబు
లీల సంయోగమే లింగమూర్తి
కర్పూర మంగంబు ఘనజ్యోతి లింగము
లీలసంయోగమే లింగమూర్తి
గీ॥ జలము లింగంబు సంగమై సైంధవంబు
బయలు సంగంబు నిర్బయల్ పరమలింగ
మూర్తిసంయోగమే లింగ మూర్తియతడు
లీల హృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.

సీ॥ ఆకాశమున సూర్యు నడరంగ కిరణముల్
కలయ జగంబెల్ల గప్పినట్లు
పరిపూర్ణజలధిలోపల గల్గు రంగదు
త్తుంగతరంగముల్ భంగిగాను
శుభ్రిదగగన మదభ్రిమై శోభిల్ల
నభ్రిపంక్తులు సృష్టి యైన యట్లు
పదపడి శివునిలో నుదయంబు విశ్వంబు
శివమయం బది వేరు జెప్ప నేది
గీ॥ యనుచు సద్బుధుల్ దేహ మోహంబు లూడి
సావధానాత్ములై శివ స్మరణవలన
భేదవాదంబు లణచి సంప్రీతులైరి
లీల హృద్వర్తి శ్రీమహా లింగమూర్తి.

స ం పూ ర్ణ ము.

---

# గౌరన హరిశ్చంద్ర

## సురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఏ. బి. ఎల్.



ఉత్తమ ద్విపద కావ్యములలో నిది యొకటి. మొదట గౌరన దేశకాలములను గురించి తెలుసుకొందము. గౌరన నిజాంరాష్ట్రి తన హరిశ్చంద్రలో స్వవిషయ మిట్లు వ్రాసికొనినాడు.

సింగన మాధవ క్షితిపాల మణికి
మంగళమూర్తికి మంత్రియై జగతిఁ
బొగడొందు పెద్దన పోతరాజునకు
దగిన తమ్ముడు యశోధను డెల్లమంత్రి
చెట్టబట్టంగ నోచిన భాగ్యవతికిఁ
జుట్టాలసురభికి సుందరీమణికి
ఘనుడు వల్లభమంత్రి గంగాంబ కోరి
కనిన పోచాంబకు గారాబు సుతుఁడ
భూతనాయక పాద పూజాభిరతుడ
గౌతమ గోత్రుండ గౌరనాహ్వాయుడ"

గ్రంథాంతమందు

"మతిమంతు డయ్యలమంత్రి పుంగవుని
సుతుడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు"

అని వ్రాసికొన్నాడు. వల్లభమంత్రికే అయ్యలమంత్రి పర్యాయ పదమేమో! పై నుదహరించిన సింగన యను రాజు రేచర్ల భూపాలుడే. అతని కుమారుడే మాధవరాయలు. ఇతడు ఇప్పటి నల్లగొండ జిల్లాలోని రాచకొండను రాజధానిగ చేసికొని పాలించిన వెలమరాజు. అతడు క్రీ.శ.౧౪౦౦ ప్రాంతములోని వాడు. కావున మన గౌరనయు ఆ కాలము వాడే.

ఈ విషయమునకు అంతగా సంబంధించకుండినను భైరవకవిని గురించికూడ రెండు మాటలు వ్రాయుదును. ఈ భైరవుడు, శ్రీరంగ

...హాత్మ్యమును రచించెను. ఇతడు గౌరన కుమారుడే. తన శ్రీరంగ
...మాహాత్మ్యములో నిట్లు వ్రాసికొనినాడు.

"కృతవిద్యాఖురళీ పరిశ్రమకళా కేళీ విలాసున్ జన
స్తుతచారిత్రుని గౌతమాన్వయపవిత్రుం గౌరనామాత్యస
త్సుతు గల్యాణకవిత్వలక్షణసమర్థుం సూక్తిముక్తాఫలా
తతకాంతిస్ఫుట చంద్రికోల్లసిత విద్వత్కైరవుం భైరవుం."

గౌరన, ద్విపద హరిశ్చంద్రనే కాక నవనాథచరిత్ర మను ద్విపద
...వ్యమును, సంస్కృతములో లక్షణదీపిక యను గ్రంథమును రచించెను.
...వనాథచరిత్రము గతసంవత్సరమే ముద్రితమయ్యెను.

గౌరనకవి ఉభయభాషలలో మంచి ప్రావీణ్యము కలవాడు.

"సరససాహిత్య లక్షణ విచక్షణుడ"

అని ఆదిలోనే తెలుపుకొనినాడు. హరిశ్చంద్ర గ్రంథాంత
...ందును ఇట్లు వ్రాసికొనినాడు.

"భ్రమరాప్రసాద సంప్రాప్తకవిత్వ
సుమహీతసామ్రాజ్య సుఖపరాయణుడు
చతురసాహిత్య లక్షణ చక్రవర్తి
ప్రతివాది మదగజ పంచాననుండు"

అనియు వర్ణించికొనినాడు.

మధ్యకాల కవులలో ద్విపదకావ్యముపై కొంత అసహ్యము గలిగి
...ట్లు కనబడుచున్నది. కాని నిజమైన తెనుగుదనము ద్విపదల లోనే
...ుమిడియున్నది. ద్విపదల నెన్నియో విధములుగా గానముజేయు
...రు. స్త్రీలపాటలు, తందాన కథలు, దశరా పద్యాలు, పల్లెటూరి
...టలు, కోలన్నపాటలు మున్నగున వన్నియు ద్విపద భేదములే. ద్విపద
...వ్యాలలో పేరెన్నిక గన్నవారు తాళ్లపాక చిన్నన్నయును (తిరువేం
... నాథుడు) పాల్కురికి సోమనాథకవియు, గోనబుద్ధుడును, మన గౌర
...ము, నైయున్నారు.

ద్విపద, గానయుక్తముగా ఆయా రసములకు తగినట్లుగా రాగ
...ను మార్చి పాడుకొన దగినట్టిది. అప్పుడే దాని రమ్యత వ్యక్తమగును.

అట్లు గానము చేయజాలని వారికికూడ ఈ గౌరన కవిత చదువుటకును వినుటకును మనోహరముగ నుండును. అనేక సందర్భములలో సంస్కృత దీర్ఘ సమాసములను అందముగా నిమిడ్చియున్నాడు.

"మందార మంజరీ మంజుమరంద
నందదిందిందిర నందనారామ
కమనీయ వికసిత కనకారవింద
కమలినీ తట లతాగార లతాంత
రచిత శయ్యాతల రతిరయగళిత
కచభర సురపుర గణికా కపోల
కలిత ఘర్మోదక కణగణమిళిత
మలయసమీర కోమల కంపితాగ్ర
మహితచిత్ర ధ్వజమాలా సహస్ర
సహిత చింతామణీ సౌధపాళికల"

ఇట్టి సమాసములు చాలగలవు.

కాని ఇది యొక విశేషము కాదు. తెనుగునుడికారముపై ఈ కవికి మంచి ప్రావీణ్యము కలదు. సహజవర్ణనలకే యెక్కువ ప్రాముఖ్యము నిచ్చినాడు. అపూర్వవర్ణనలను గావించినాడు. ఆవర్ణనలు ఆనందదాయకములు. అచ్చతెనుగులో దిట్టమగు శక్తి చూపినాడు. ఇవియే యీతని కవితలోని విశిష్టతలు. ఈ యంశములనే నిరూపించు కొన్ని వర్ణనలు మాత్రమే యుదహరింతును.

రాత్రి వర్ణనము

"భవచండతాండవ భ్రమణవేగమున
దివినుండి పడిన యందియయును బోలె
గిరణజాలంబుల కెంపు సొంపెసగ
అరుణబింబము పశ్చిమాంబుధి గ్రుంకె"

వేటకాండ్రు

"చోటమిాసములు, జుంజుఱుగొప్పు, బిరుసు
వాటెద్దుమేనులు, బరడు బిక్కలును,

చేవవిండ్లును, నెత్రుసెరల కన్నులును,
జేవురుబొట్లును, జిల్లకోలలును,
మొలసీలికాసెలు, మోటకత్తులును,
దలముళ్లు బదనిక దండకడెంబు
గలిగి భయంకర కాలకింకరుల
పొలుపున గర్జించు పొలపర్లు..."

కా ల కౌ శి కు డు

"త్రోలు నస్థులు జిక్కి తూగాడు మేను
పేలురాలెడు సిగ, పెడతలగణితి
పిల్లికన్నులు, గురుపీచు మీసములు,
నుల్లిగడ్డంబు, నత్యుగ్ర దృష్టియును,
దళమైన పట్టెవర్ధనములు, వేళ్ల
నులిచిన దర్భలు, నుదిటిపై బొరుసు,
నొ౦జగునోరును, వెలికుఱికిన పండ్లు,
అఱువు ధోవతియును, పంచాంగంబు, ముష్టి
బరగిన కరతిత్తి, పత్రాలసంచి,
యొఱగిన గొడుగును, నుసిరాలు కోల.

వీరబాహుడు హరిశ్చంద్రుని దూరుట.

"ధనరాశి యచ్చోట దరలకయిత్తు
ఒకవిచారము మాకునొదవె—ఈరాజు
నుకవాసి, పనిపంద, చూపుగుట్టంబు,
మామిడికింది సోమరి, మేదకుండు,
బూమెతుంటరి, మెనుపోతు పైవాన,
మొండరి, చల్లచప్పుడు, గోడచేర్పు,
చండిపో తనునట్టె జాడనున్నాడు
చెప్పిన పని జాగు చేసినవేళ
ముప్పిరిగొను కోపమున మొఱవెట్ట

దుడ్డున వీపు కంతులుకట్టి మోది
జడ్డువాపిన, గొల్వు చాలు నాకనుచు
దక్కిపోయిన, వెంట దగుల నావశమె?
ఉక్కున బెనచినట్లున్నాడు వీడు
గొలుసు తప్పినయట్టి కోతిచందమున
కల ధన మీవు రొక్కము కొనిపోదు"

పై రెంటిలో హాస్యరసముకూడ వ్యక్త మగుచున్నది.

ఈకవి సామెతలను విరివిగా వాడినాడు. అందు కొన్నిం నుదహరింతును.

"ఈ రత్నభూషాదు లేటికి మాకు
నీరువట్టారునే నెయి దాగివికొనిన"
"అందని ఫలముల కఱ్ఱులుసాపి"
"నిప్పును చెదలంట నేర్చునే"
"పులిమెడ గొఱియ దెంపున గట్టినట్లు"
"తీపారు చక్కెర దిన్న యా నోర
వేపాకు మేసిన విధమున..."
"పల్లెత్తి యెలుకల బట్టనోపినను
పిల్లి శాస్త్రమె మంటి పిల్లియేచాలు"

పూర్వ ప్రబంధములందు విశేషముగా రోకటిపాటగా వర్ణిం బడిన అష్టాదశవర్ణనలపద్ధతి యిందు లేనే లేదు. పచ్చి శృంగారమ మచ్చునకైన కానరాదు. ఆపాదమస్తక వర్ణనలు, విరహతాపాలు చిలుకలతో మొదలు పెట్టి చంద్రలోక పర్యంతము కావించునట్ల ఉపాలంభనలు, శ్లేషలు, యమకాలు, నానార్థాలు, ఇట్టి ఘోరా లేమియు నీ కవిత్వములో లేవు. పాఠకులు రక్షింపబడినారు. పైగా ఏవర్ణనమును చదివినను అందు నవ్యత శాశ్వత వ్యక్తమై పాఠకులకు ఆనందము కలుగుచుండును. ప్రాచీనాంధ్రసారస్వతములో నా కత్యంత ప్రియమైన గ్రంథములలో నిదొక్కటి.

ఓం

# వీ రాం గ న

**కె. సాంబసిద్ధయ్యగారు, ఉపాధ్యాయులు.**



సరసీజేక్షణ పాణిపల్లవమునన్ శస్త్రాస్త్రజాలంబు లే
సరణిన్ దాల్చితి వీరులౌ నసురులన్ సంగ్రామరంగంబులో
బరువెత్తించితి వే గతిన్ భళిభళీ భావింప నీశౌర్య మే
సరసీజాక్షులలో వెలుంగదు సుమీ సాత్రాజితీ! ధారుణిన్. ౧

కనులవి కెంపురాలవలె గాంతిమయం బయి తేజరిల్లగా
ధనువును చేతదాల్చి కడు దర్పముచే నిశితాస్త్రజాలమున్
దనుజులపైని గుప్పుచును తల్లడ మందగ జేసి ధారుణిన్
వనితలకెల్ల పౌరుషపు పాఠము నేర్పితి వెంత ధీరవో ? ౨

తే॥ గీ॥ మీస మన బూనుపాళికి మేదిని పయి
వీరపౌరుషచిహ్నమై వెలయుచుండు
గాదువ యేమయ్యె నీ కది బొదలకున్న
రోస ముండిన జాలదే మీసమేల ? ౩

అతివలు లోకమం దబల లారయ యే పనికేని జాలరన్
సతము జనమ్ము లాడుకొను శాశ్వతవాక్యము రిత్తయయ్యె నీ
వతుల పరాక్రమంబు పరమాద్భుతశౌర్యము జూపి ధీరతన్
క్షితిని మదాంధులౌ నసురసేనల తుళ్ళడగించియుంటచే. ౪

కలకంఠంబుల గానముల్ వినినచో కంపించి పూదోటలో
నిలువన్నేరక యంతటన్ త్వరగతిన్ నీ మందిరం బేగి యా
జలజాతేక్షణ బాహుపంజరములో శాంతించు నీవేగతిన్
బలదర్పాన్వితశూరులౌ నసురులన్ భంజించితో చిత్రమా. ౫

నిను వీరాంగనఁ జెట్టబట్టుటకునై నీ భర్త కృష్ణుండు తా
ఘనమౌ పుణ్యము లెన్నిచేసెనొ సుమీ! కల్యాణి లేకున్నచో
ననివార్యంపు పరితాపరాశి వగు నీహస్తాగ్రము న్నంటగా
వనజాతేక్షణు డొప్పుబెట్టు లహహా వాదింప నింకేటికిన్. ౬

ఓం.

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## (౬) శ్రీ భీమశంకర జ్యోతిర్లింగము

మఠం సిద్ధివీరయ్యగారు, ఉపాధ్యాయులు



బొంబాయి నగరమునకు, ప్రాగ్భాగమున, (౭౦) మైళ్ల దూ
మునందును, పూనా నగరమున కుత్తర దిశ ౪౩ మైళ్ల దవ్వున
భీమాస్రవంతీ తీరంబున శ్రీ భీమశంకర జ్యోతిర్లింగము విలసిల్లుచున్న
యాత్రార్థమేగు యాత్రికులు (బొంబాయినుండి పూనానగరము వ
మఱియు ముందు సాగునట్టి (G. I. P.) అయోమార్గమున (నెరా
యను పేరుగల స్టేషను కలదు. "ఇది కల్యాణ (కూడలి) జంక్ష
౨౧మైళ్లును,బొంబాయినగరమునుండి (౫౪) మైళ్లును కలదు. అచటదిగి
తరువాత, తూర్పుదిశకు ౧౬ మైళ్ల దూరమున, భీమశంకర దివ్యక్షేత
ముండును. (౧౦) మైళ్లు యెద్దులబండిపై ప్రయాణము చేయవల
యున్నది. మిగత మార్గము కాలినడక పోవలయును. అది పర్వతమ
ప్రదేశము. పర్వత పథముయొక్క కష్టమునుండి తప్పించుకొనదలచి
వారు, (నెరాళ) స్టేషనుకు ముందు (౪౪) మైళ్ళదూరమున (తలేగా
స్టేషన్ దిగినపిమ్మట, భీమశంకర క్షేత్రము (౨౪) మైళ్లుండును. మార్గ
వృషభశకటములు వెళ్ళుటకు వీలైనదిగా నున్నది. ఈ స్టేషను (త
గావు) పూనానగరమునకు, (౨౧) మైళ్ళ దూరముండును.

### క్షేత్ర మాహాత్మ్యము

ఈ ప్రదేశమునందు (ఢాకినీ) యను గ్రామమేదియును గాన్పి
చదు. అయినను "ఢాకిన్యాం, భీమశంకరమ్" అను శ్లోకపాదానుసార మి
యన్వర్థ మగుటలేదు. శ్రీ శంకరలింగము, సహ్యాద్రి పర్వతోప
భాగమునందుగలదు. భీమానది యుత్పత్తిస్థాన మిచటనేయున్నది.
ముఖ్యమైన యొక విగ్రహమునుండి జలస్రావ మగుచుండును. మందిర

...పమునందే రెండు కోనేళ్లు గలవు. వీనిని, సుప్రసిద్ధ రాజనీతిజ్ఞ...
...గు నానాఫడ్నవీస్ మహాశయులు నిర్మించియున్నారు. ఆలయప...
...మునందొక చిన్న గ్రామమున్నది. ఇచటి వయోవృద్ధులు, చెప్పు...
...షయ మేమనగా, శ్రీ భగవానుఁడగు శంకరుఁడు త్రిపురాసురవధఁ
...ఓంచిన పిదప శ్రమ నపనయించుటకీ స్థానమునందే నిలిచెను. ఆ సమ
...యమునందు అయోధ్యానగరమును పాలించు సూర్యవంశీయుఁడగు,
...క మహారాజు తపంబాచరింపుచుండెను. శంకర దేవుఁడు ప్రసన్నుఁడై
...నికి సాక్షాత్కరించి దర్శన మొసఁగెను. నాటినుండియే, యీజ్యోతి
...ంగము (భీమశంకరలింగ) మను పేర ప్రఖ్యాతమైనది.

(ద్వితీయ భీమశంకరలింగము)

శివపురాణమునందలి యొక చరిత్ర ననుసరించి శ్రీ భీమశంకర
...్యోతిర్లింగము, ఆసామ్‌ప్రాంతమందలి కామరూపమను పేరుఁగల మండ
...మునందు (A. B. Ry.) మార్గమున, గోహాతి యను పట్టణమునొద్ద
...హ్మపుర పర్వతముపై విరాజిల్లినట్లు తెలియుచున్నది. సంక్షేపముగా
...దిగువచరిత్ర మూలమున విషయద్యోతకము కాగలదు.

కామరూప దేశమున, తొల్లి, కామరూపేశ్వర మహారాజు
...లించుచుండెను. అతడు గొప్ప ప్రతాపశాలియై యుండెను. శివభక్తి
...లవాడు. అతఁడు పార్థివ శివపూజనము పక్రమముగా నాచరించెడి
...డు. భక్తిపారవశ్యమున మైమఱచి శివునియందే మానసము లయింప
...యును.

ఆకాలమునం దచట భీముఁడను పేరుగల యొక క్రూర రాక్ష
...ఁడు సంచరించుచు ధర్మిష్ఠులకు బాధ లొదవించెడివాఁడు. కామ
...పేశ్వరుని, శివభక్తి, మాహాత్మ్యము నాలకించి వాడచటికేతెంచెను.
...్యాన నిమగ్నుఁడగు, రాజేంద్రుని సంబోధించి, గంభీర నినాద
...మునరించెను. భయంకర కృపాణమును ఝుళిపించుచు పలికెను. "ఓరి
...ష్టా! శీఘ్రముగ నీవేమి చేయుచున్నాడవో తెల్పుము. అన్యథా
...కు క్షేమము లేదు."

శివభక్తిగల యా రాజున కా క్రూరరాక్షసుని గంభీర గర్జనము చలింపజేయదయ్యెను. రాజు, తన మానసంబున భగవానుఁడగు శం దుని స్మరింపుచు నిర్భయముగ శివుని ధ్యానించెను. వానితో ప్రత్యుత్తర మొసఁగెను.

శ్లో॥ "భజామి శంకరం దేవం । స్వభక్త పరిపాలకం"

"ఓ రాక్షసరాజా! నేను భక్తపాలకుఁడగు, శంకర భగవాను భజింపు చున్నాను.

ఈ ప్రత్యుత్తరము నాలకించి, యా రాక్షసుఁడు, శివ దూషించుచు, రాజును, శివుని పూజింపకు మని నిరోధము గలిగించె కాని వాని యవరోధ మేమి పనిచేయనందున కామరూపేశ్వరరాజు తన తీక్ష్ణకరవాలముఁ బ్రయోగించెను.కాని యా వాలు, రాజుపైఁబ నా పార్థివలింగముపై సోకినది. తత్క్షణమ శ్రీ శంకర భగవానుఁ పార్థివలింగమునుండి ప్రాదుర్భవించెను. మఱియు భీమరాక్షసుని సం రించెను. ఆ సమయమునం దా ప్రదేశమంతయు, ఆనంద మయమైన దేవ, ఋషిగణములెల్లను పరమేశ్వరుని నచట వసించుటకుఁ బ్రా చిరి. అందుకా పరమేశ్వరుఁడు సహర్షముగ నంగీకరించెను.

శ్లో॥ "ఇత్యేవం ప్రార్థిత శ్శంభు ర్లోకానాం హితకారకః
తత్రైవ స్థితవాన్ ప్రీత్యా స్వతంత్రో భక్తవత్సలః"
(శివపురాణం (౨౧) అధ్యాయము (౫౪) శ్లోకము)

అప్పటినుండియే యా జ్యోతిర్లింగమునకు భీమశంకరు డని పే గలిగినది.

(ఓం తత్ సత్)

---

# ప్రబోధము

శ్రీమతి ఎన్. అలివేణిగారు



సోదరీ! వేవేగ లెమ్మా, చూడుమా కనువిచ్చి జగమును
ముసుగువెట్టుక ఒక్కపెట్టున, మొద్దునిద్దరయా?
దిక్కులన్నియు తెలివి గాంచెను, దీప్తిమంతంబయ్యె భువనము
అప్పుడే బాలార్కకిరణము, లలముకొనె దిశలన్.
బాలికామణు లెల్ల పుస్తక పాణులై బడి కేగుచుండిరి
విమల విజ్ఞానప్రదీప్తులు, విరియు మోములతో.
ఒక్క సోదరి వీణ చే గొని, ఉర్విసర్వము కరగి పారగ
మధురమోహన రాగపంక్తిని, మారు మ్రోగించెన్.
ఒక్క సోదరి కుంచె చే గొని, ఉర్విసర్వము ప్రతిఫలించే
రంగురంగుల చిత్రములను హాగంగుగా వ్రాసెన్.
ఒక్క సోదరి కలము చే గొని ఉర్విసర్వము ముంచి వైచెను
కమ్రభావోజ్వలసుకవితా, గానవాహినులన్
ఇంకొకతె రాజ్యాంగరథమున, ఇంపులొలుక వసించి సార
థ్యమ్ము నెఱపె ననన్యసామా,న్య ప్రతిభతోడన్.
మరి యొకతె డాల్ కత్తి పూనియు, మరణ మన్నను సరకుసేయక
ఖండనోర్వి ప్రచండభీకర, తాండవము సలిపెన్.
వేరొకతె నేలగల విద్యల, కాలదన్నన్ గాలి దేవీ
వ్యోమవీధి విమానయానము, లొంటిగా చేసెన్.
సోదరీమణు లెల్ల యుక్తిని, సూక్ష్మమైన క్రియాకలాపము
నిర్వహింపగ నీవొక ర్తైవు, నిదురపోయెదవా!
దీర్ఘనిద్రను వీడి వేగమె, తెలివిదాలిచి నీదు ప్రతిభను
సాటి సోదరి వలెనె ధాత్రిని, చాటు మెల్లెడలన్.

[గృ. ల.]

ఓం

# బురదనుండి పన్నీరులోకి

శ్రీమతి బి. శ్యామలాంబగారు.



స్కూల్ ఫైనల్ ప్యాసైనాక అనేక కష్టాలమీద గాని రామా రావుకు ఉద్యోగం దొరకలేదు. చదువుకున్న వాళ్ళకు కూడా ఏవో కొన్ని వ్యసనాలుంటాయి. దీనికే కళ లేక కళాభిరుచి యని కూడా కొందరంటారు. సాలుకు రెండువేల ఆదాయం వచ్చే భూము లుండేవి తలిదండ్రులు పోవటమే ఆలస్యం! అవి కాస్తా అమ్ముకున్నాడు. అవి వృధాకార్యాల (కావు వేడుకలు?) క్రింద ఋణములో వ్యయ మైనాయి.

వచ్చే జీతంతోనైనా భార్యాభర్తలు బ్రతకొచ్చు. కాని మొత్తంలో మూడవ వంతుకన్న ఎక్కువే నాటకాలకు గానసభలకు ఖర్చయ్యేది. సంగీతం అంటే ఆయనకు చెవికోత. పాటల మోజుకొరకు వేశ్యలచుట్టు తిరగడమూ జరుగుతుంది. ఇక మిత్రమండలి కావలసినంత మూగింది. కచ్చేరి నుండి రావడమే ఆలస్యం, పొద్దుగూకులూ చాలా రాత్రివరకూ సరససల్లాపాలతో గడిచేది. ఇంటివైపు దృష్టి ఉండేది కాదు.

ఇంట్లో శాంత మహాపతివ్రిత. వయస్సున చిన్నదే కాని బుద్ధి చాల పెద్దది. భారత భాగవతములు చదువుకొను నంతటి విద్యకూడా వచ్చు. భర్త తనతో మాట్లాడకుండుటకు తన దురదృష్టమే కారణ మనుకొనేది. పతిని కలలోనైనా దూషించి యెరుగదు. ఆయన అను గ్రహం కొరకు చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలం అయినాయి. చివరకు భర్త సౌఖ్యమే తన సుఖం అనుకుంది. రామారావును ఇరుగు పొరుగువా ళ్ళంతా వివేకశూన్యుడనీ, కఠినచిత్తుడనీ, దుర్మార్గుడనీ తిట్టేవారు. అదంతా శాంత విననట్టే ఉండి పతిని అన్నివిధాలా పూజ్యునిగానే

[గ]మించేది. పైగా ఆమె ముఖం సంతోషంతో కళకళలాడుతూ [ఉ]ండేది. ఇదంతా చూచి స్నేహితురాలైన కమలకు చాలా ఆనందం, [ఆశ్చ]ర్యమూ కలిగేది. కాని తన స్నేహితురాలి దుర్గతినిగూర్చి విషాదం [కూ]డా చాలా కలిగేది. ఒకనాడు శాంతతో—

[క]మల—"చెల్లీ! నీ స్థితి తలచుకున్నపుడల్లా జాలికలుగుతుంది" అంది.

[శా]ంత—జాలెందు కక్కయ్యా! నేను మీ వలె లేనా?

[క]మల—నీవు చెప్పకుంటే తెలియదా? రామారావు అనాదరణ?

[శా]ంత—నా వశంలో లేరంటావా?

[క]మల—నీవశ మేమిటి? పాటలకూ, పాటకురాండ్రకూ వశమై గాన రసంలో మునిగి తేలుతున్నాడు. సరేకాని నే నొక ఉపాయం చెబుతా వింటావా?

[శా]ంత—ఏ విషయంలో?

[క]మల—మన వీథిలోనే పంతులమ్మగా రున్నారు. మీనాక్షమ్మ అంటారు. నాకు బాగా తెలుసును. ఉదయం ఆడపిల్లలకు చదువు చెపుతూ పగలు ఖాళీ గానే ఉంటుంది. సంగీతం బాగా వచ్చు. నీకు పరిచయం చేస్తాను. నాపుణ్యమా అంటూ సంగీతం నేర్చుకోరాదూ?

[శా]ంత—నేర్చుకుంటే యేమౌతుంది? పైగా డబ్బేది?

[క]మల—ఈ రెంటికీ జవాబు తర్వాత చెబుతాను కాని నావెంట రా!

* * *

మరుసటిదినం నుండే శాంత సంగీతవిద్యార్థిని అయిపోయింది. [ఏడా]లోపల బాగా ప్రాక్టీసుచేసింది. తెలివిగల మనిషికి కంఠం బాగా [ఉ]ండాలి కాని సంగీతానికి ఎంతకాలం పడుతుంది?

* * * *

రామారావు ఆఫీసునుంచి తనుండేవీథి చివరదాకా వచ్చి అక్కడ [అ]ప్పున్న ఆగిపోయాడు. కారణం శ్రీవణానందమే! పాటకురాలి స్వరం

ఫిడేలుతో కలిసి పోతూవుంది. ఆ గానమాధుర్యానికి మొండిచెట్టుకూ
ఇగురు వేయాలి. ఆలావుంది అక్కడిరంగం. ఇక రామారావు సంగ
చెప్పనక్కరలేదు. వివిధ విచారాలు తలలోకి వచ్చాయి. ఈ వీథిలో
కొత్తపాటకురాలెవరో చేరిందని నిశ్చయించుకొన్నాడు. సర్వస్వ
తా ఖర్చు పడ్డాసరే కాని ఆ అమ్మాయిని చూచి తీరాలనుకున్నా
పరుల ఇంట్లోకి ఏలాగు వెళ్లడం? "...నభయం నలజ్జా" అన్నా
కాదు పెద్దలు? ఆ ఇంటిదగ్గిరిదాకా వెళ్లి అడిగితే అది పంతుల
(మీనాక్షమ్మ) గారి యిల్లని తేలింది. ఎలాగైతేనేమి వాకిలికి ఎ
రుగా తప్పటడుగులు వేస్తూ లోపలికి చూచాడు, కొంత సంకోచ
కొంత భయంతో. ఈయన స్వభావం తెలిసినమనిషి. కాబట్టి పంతుల
లోలోపల నవ్వుకొని చూచీ చూడనట్టు వూరుకుంది. దక్షిణంవైపు
రూములోనుంచి గానామృతం బైలుపడుతూనే వుంది. రామారా
గుండె మరొకవైపు కొట్టుకుంటూ వుంది... ఈ వాలకం చూచి పం
లమ్మ రూము తలుపును మూస్తూ వాకిలివైపు వెళ్ళుతూ "ఎవరండీ
ఏంకావాలి?" అంది.

రామా—(లోపలికి ప్రవేశిస్తూ) మీతో పనుందండి.

మీనా—ఆలాగైతే రాండి, కూచోండి.

రా—నేను కూచునే స్థితిలో లేనండి.

మీ—ఎందుకని!

రా—గొప్ప అపరాధం చేయబోతున్నాను.

మీ—దానికి గొప్ప శిక్షకూడా వుంటుంది.

రా—మీ వంటి దయగలవారు క్షమించలేరా?

మీ—మీవంటి బుద్ధిగలవారు బాగుండరాదా?

రా—నా బుద్ధి బుగ్గియగుచున్నది.

మీ—నా దయ దయ్యమగుచున్నది.

రా—అయితే నేను బ్రతుకుటకు వీల్లేదా?

మీ—కావలసినంత అవకాశముంది.

రా—ఎలాగా?

మీ—నా యాజ్ఞాప్రకారంగా!

* * * *

వా రిద్దరూ ఏం సంప్రదించుకున్నారో తెలియదుకాని రామా
రావు ఈ క్రింది విధంగా ఒక కాగిదం వ్రాసి యిచ్చాడు.

శ్రీమతి హితవాదుల మీనాక్షమ్మగారికి—

గానామృతం రామారావు వ్రాసియిచ్చిన అగ్రిమెంటు కాగిదం
ఏమనగా, మీ యొద్ద సంగీతం నేర్చుకుంటూవున్న శ్రీమతి......తో
నా వివాహంచేయుటకు మీరు పూచీ యిచ్చినారు. కావున ముందు
నెలనుండి వచ్చు నా సర్కారుజీతం బాపతు రూపాయలన్నీ ఇకముందు
ఎల్లప్పటికీ నా నూతనపత్నికే అప్పగించి ఆమె యిష్టప్రకారంగా
నడుచుకోగలను. తప్పిన యెడల దావాచేసి నాజీతం యావత్తుకూ డిక్రీ
పుచ్చుకొనుటకు మీకు హక్కువుండగలదు. ఇది సమ్మతిని వ్రాసియిచ్చి
నది సత్యం"

పంతులమ్మగారు ఈ కాగితం తీసుకొని నవ్వుతూ రూము తలుపు
తీస్తూ "అమ్మాయి! నీ సంగీతానికి సంమోహితుడై ఒక మంచి
అబ్బాయి దొరికాడు. వివాహంచేసుకుంటావా?" అని అడిగింది.
అమ్మాయి నవ్వుతూ తొంగిచూచిందో లేదో రామారావు తొందర
గా పరుగెత్తి "ఆఁ! దొంగా! శాంతా! నా మనస్సునంతా అశాంత
చేసింది నీవేనా" అంటూ చేతులు రెండూ నొక్కాడు.

"అశాంతంకాదు. ఇకముందు ప్రశాంతంగానే వుంటుందిలెండి"
అంది శాంత.

* * * *

ఆవూరివాళ్ళంతా "బురదలోనుంచి పన్నీరులోకీ, సున్నంలో
నుంచి అన్నంలోకీ" అనుకున్నారు.

---

# పోటు బంటు

కవిరత్న లక్కౌన మల్లికార్జునుడుగారు.



క॥ చుట్టిన చెడు నడతలఁ బెను
కట్టుకుమూరిమగనిఁ గురుఁ గైవల్యముకై
పట్టుగ ధ్యానించుచు వెస
మొట్టుచు, మత గౌరవంబు బాలుపుగ నిలుపన్.

క॥ దిట్టదనంబున ఘనుడై
చెట్టపుక్రియఁ దురించి సతము సిద్ధుండై ఎ
ప్పట్టునఁ దన శిష్యులకును
గుట్టగు శివదీక్ష లిచ్చి కోవిద వరుడై.

క॥ పట్టుదల మీఱ మతమునఁ
బుట్టు సదాచారములను పుణ్య వ్రతముల్
మట్టునఁ బెట్టెడి దుష్టుల
గుట్టుల రట్టాడి వీర గురువర్యుండై.

క॥ కట్టుచు, మతసద్ధర్మపు
చెట్టును తగఁ బెంచి ఫలము జేర్చుచు యశపుం
గట్టుల నిలబెట్టుచు హరు
పట్టుకు తగఁ జేరుతోఁశివ పరికింపుచు తాన్.

క॥ కట్టడి నెందును పాయక
పట్టిన శివదీక్ష విడక బ్రతికిన దనుకన్
పుట్టిన మతముకు వన్నెను
పెట్టు గురుడ్డు పోటుబంటు విశ్వేశునకుఁ.

క॥ పుట్టెడు యాశలు నరునకు
పుట్టుట సహజంబులౌట భోగంబులకై
పుట్టిన, యరిషడ్వర్గము
కట్టును పాశంబుచేత గాపురుషుని గా. ౬

క॥ అట్టి దురాశాపాశపు
కట్టును పెకలింప జ్ఞాన ఖడ్గము గొని చే
పట్టిన గురుసేవ పదును
పెట్టుచు, మతమంత కెందు పేరు వెలయగ౯. ౭

క॥ కట్టిన శివలింగంబును
గట్టిగ నర్చించుచుండి కల్మషహరుడై
నెట్టన గురుక్రియలను చే
బట్టుచు సాయంబు చేసి వాంఛలఁ బడకన్ ౮

క॥ చుట్టంబులఁ దన మతికులఁ
బుట్టిన దేశమును దీక్షఁ బొల్పుగ నిడు నా
జెట్టిని గృహమును మతముకు
పెట్టిన ధర్మంబు ప్రోవ వెతలను బడుచున్. ౯

క॥ కట్టడి గల యొక వృత్తిని
పట్టుగ నొనరించి డబ్బు బడయుచు తను చే
బట్టిన కాంతను యిడుములఁ
బెట్టక పుత్రునకు విద్య విమలపు బుద్ధిన్. ౧౦

క॥ నెట్టన నిడి నొక వృత్తిలో
బెట్టుచు మతధర్మ వితతి వెలయగ నిడి బల్
జెట్టిని జేసెడి భక్తుడె
గట్టిగ నిల పోటుబంటు కటకంతునకున్. ౧౧

---




(విమర్శనకు రెండు ప్రతులు రావలెను)

**కీరసందేశము:**—కర్త, శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, ౪౪. జీరా, సికిందాబాదు. చక్కని కాగితము అచ్చు. పుటలు ౬౬. అట్టబైండు, రాయల్ సైజు వెల రు. ౧-౦-౦.

ఇందు "కీరసందేశము" "ద్వంద్వయుద్ధము" అను రెండు ఖం కావ్యములు కలవు. శాస్త్రిగారు ప్రకటించుచున్న ఆంధ్రకావ్య మాలలో నిది రెండవ పుష్పము.

భాగవతము నందలి రుక్మిణీకల్యాణము సుప్రసిద్ధము కదా! ఈ కథకే కీరసందేశము (చిలుకపలుకు) అను మారుపేరును కల్పించి రమ్యమైన ఫక్కిని కవిత్వమును పరువెత్తించిరి. సలక్షణమగు శాస్త్రిగా శైలినిగూర్చి వేరుగా జెప్ప నవసరముండదు. అందమైన వీరి కందము తెలుగు పలుకులవెలంది యందియలవోలె నందముగ సందడిసేయుట గాంచ దగి యున్నది. వీరి గ్రంథములు చదివినవారికి వీరి శైలియంతయు నొకే పడియచ్చులో నొత్తిన దాని వలె బరిమార్జితమై కన్పట్టక మానదు. నలునకు రాజహంస గన్పడి దమయంతీ భావమును దెలిపి నటులే శ్రీకృష్ణునకు అకస్మాత్తుగ చిలుక యొకటి చెంగట వ్రాలి రుక్మిణీప్రేమను దెల్పును. ఇదియే ఈ కవిగారి మార్పు. ఈ పరివర్త నమువలన నిది దూతకావ్యములలో బరిగణింపబడును. కీరసందేశము లోని కవితా ద్రాక్షారసమును సరసులు చవిజూడవలసి యున్నది.

8 వ పుటలోని 32, 40, వ పద్యములు గీతములుగాని కంద ములుకావు. అచ్చు పొరపాటు.

రెండవ ద్వంద్వయుద్ధ మను కావ్యమున పారసీక దేశపు సొహ్రా
రాబు రుస్తుముల పోరాటము వర్ణింపబడినది. విధివశమున ఒకరి నొకరు
తెలిసికొనక తండ్రికొడుకులగు రుస్తుం సొహరాబులు స్వస్వపరాక్రమ
ములకై వైరము పెంచుకొని యుద్ధమొనర్చి మడిసిరి. ఈ కథ పార్సీక
మహాకవియగు ఫిర్‌దౌసి రచించిన షాహ్‌నామ లోనిది. తర్వాత ఆర్
నాల్డు అను ఆంగ్లకవి ఇంగ్లీషుభాషలోని కనువదించుటయు అది పాఠ్య
గ్రంథములలో బ్రచారమగుటయును కారణము కాగా సొహరాబు
రుస్తుముల కథ సుప్రసిద్ధ మయ్యెను. మనవారికిని దెలియవలె నను తలం
పుతో శ్రీ శాస్త్రిగా రిద్దానిని ఆంధ్రకావ్యముగా విరచించిరి.

నిజము విచారించినచో సొహరాజు రుస్తుములు మన ప్రాచీన
కాలపు చాణూరాది మల్లులకు సరి రాక పోగా నేటి గామా పహిల్వా
నును సమానులు కారనియే మాతలంపు. కారణ మేమనగా ఫిర్దౌసి
మహాకవి స్వయముగా వీరిని గూర్చి:—

"మనమ్ కరదామ్ రుస్తుమే పహల్వాఁ
వగర్‌ఁ యలే బూద్ దర్ సిరస్తాఁ"

(సిరస్తాను ప్రదేశమున నున్న నొక సాధారణ మల్లుని రుస్తుమను
గొప్ప వీరునిగా నే నొనర్చితిని) ఇటుల స్పష్టముగా జెప్పియున్నాడు.
మనసాక్ష్య మక్కర లేదుకదా! ఎటులైననేమి? కాని పితృపుత్రుల యుద్ధ
మగుట వలన జదువుట కెంతో వేడుకగానుండును. (పూర్వ మొకప్పుడు
కాంగ్రెసు మహాసభలో శ్రీ మోతీలాల్ నెహ్రూగారును, జవాహర్ లాల్
నెహ్రూగారును [తండ్రి కొడుకులు] అతి విరుద్ధముగ వాగ్యుద్ధ మొన
ర్చిరి) ఆంధ్రవీరుల చరిత్రములును ఇటులే ఖండకావ్యములుగా విరచింప
బడుచో పాఠశాలలో బ్రచారము గావించుట కెంతేని తగియుండును.

శ్రీమదాంజనేయ మానసికపూజ:— కర్తలు, చిగురుపాటి
వేంకట సుబ్రహ్మణ్యారమణ సోదరులు, ప్రకాశకులు. చంద్రా నారా
యణ శెట్టిగారు, సికింద్రాబాద్, పాకెటుసైజు, 20 పుటలు.

వెల 0—2—0 రఫ్ కాగితములు.

గ్రంథకర్తలు యథాశక్తి అట నట సంగ్రహించి ఆంజనేయ భక్తులకు నుపయోగపడు రీతిని విరచించినారు. ద్వితీయముద్రణము దోషములను సరిగా తొలగించెదరని భావించుచున్నాము.

**తెలుగుతల్లి:**—సంపాదకులు, రాచమల్లు సత్యవతీ దేవి గారు పుట 38 సైజు డబుల్ క్రౌన్, కాగితములు గ్లేజు, సంవత్సరచందా 1-8-0. 36 ఎ. బజ సలాలుపేట, సికిందాబాద్, దక్కన్.

సికిందాబాదునుండి క్రొత్తగా వెలువడుచున్న మాసపత్రిక పండితులగు పురుషులును స్త్రీలును రచించిన చిన్న చిన్న వ్యాసములు కలవు. నిజాంరాష్ట్రమున స్త్రీల సంపాదకత్వమున వెలువడిన మొదటి పత్రిక యిది యనవచ్చును. ఈ క్రొత్త సహకారిణికి మా యభివందనము నొసంగుచున్నాము. మొదటి సంస్కృతకవిత చాల తప్పులుగా నచ్చుపడినది. మునుముం దింకను సమర్థమైన పద్ధతితో ప్రకటించి ప్రచారము నందగోరుచున్నాము.

"రాజహంస"

# సరస్వతి బ్రహ్మభార్య కాలేదు

(విద్యానిధి)

'విభూతి' యారవ (శ్రావణ) సంచికలో "సరస్వతి బ్రహ్మభార్యయా!" అను వ్యాసమును ప్రకటించినది పాఠకుల జ్ఞప్తియందుండును. తరువాయి యెనిమిదవ (భాద్రపద) సంచికలో శ్రీ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు "సరస్వతి బ్రహ్మ భార్యయే" అను లేఖను ప్రచురించిరి. దానికి సమాధానముగా నీ పరామర్శను చిత్తగింప గోరుచున్నాను.

నేను అమరకోశమును ముఖ్యముగా నాధార మొనర్చుకొని వేదాది ప్రాచీన వాఙ్మయమును సూచించుచు బ్రహ్మకు సరస్వతి భార్యగా ప్రతిపాదింపబడి యుండలేదని బలవత్తరమైన ప్రమాణముల చేత నిరూపించి యుంటిని. నా ప్రమాణములు లేవని కాని, ప్రామాదికములని కాని, శ్రీ శాస్త్రిగారు ఖండించలేదు. మీదు మిక్కిలి యా విమర్శాపద్ధతిని తెలిసియును విలక్షణముగ సరస్వతికి బ్రహ్మ భార్యాత్వమును నిలవేయజూనిరి.

వారన్నటుల (నూరు కల్లలాడి యొకనిల్లు నిల్పవలె నన్నట్లు) నూరు కల్లలాడిననే తప్ప సత్యమైన మార్గముతో బ్రహ్మకు సరస్వతి భార్య కానేరదు. వారు వ్యాసము మొదట గొంత చర్చ జరిపిరి కాని యది విమర్శకుల కవసరము లేనిది. "బ్రహ్మద్వేష మిందలి పదమాత్ర వాచ్య బ్రాహ్మణధర్మముల యందు కాక తొలిహేతువు వరకు గూడ వ్యాపించినది" అని శాస్త్రిగారు అతిసాహసముగ వ్రాసిరి. నా విమర్శమున శాస్త్రిగారికి గల జ్ఞానలేశము ఈ యసామంజస్యమునకు గారణము. నా కేకోశమునను అట్టి ద్వేషము లేదని గట్టిగా దెలిసికొందురు గాక! కేవల శాస్త్రభాషాచర్చలలో నిట్టి యారోపణలు వ్యర్థములు. అట్టి ప్రసంగముల నుపయోగించక తమ ప్రమాణార్థమును వినియోగించిన చాలును.

అమరకోశకారుడు శివ కేశవులయొక్కయు అష్ట దిక్పాలకుల యొక్కయు భార్యల పేరులను జెప్పి బ్రహ్మయొక్క భార్యానామము నేల చెప్పలేదని నేనడుగగా పురాణములను అమరకోశకారుడు సంక్షేపించెనని

వీరు చెప్పుచున్నారు. నా ప్రశ్న కిది యు త్తరమే కాదు. విశేషవిధి వలన పుంనపుంసకాదులను దెలియ వలయునని చెప్పినాడే కాని యథేష్టముగ విపరీతార్థముల గావింపుమని కాదు. "మొత్తముమీద సుప్రసిద్ధ అమర కోశకారుడు అంటకపోయిన భారతీవల్లభత్వము ననుమానించుటకు మాత్రి మాస్పద మనుట నిర్వివాదాంశము" అని శాస్త్రిగారే యంగీకరించిరి. ఇక "తన దృష్టితో" అను ప్రిచ్ఛన్నా(స్త్రము లవస రము లేవు. అమరకోశకారుని కాలము నాటికి సరస్వతికి బ్రిహ్మ భర్త యను కింవదంతి కలుగలేదు, ఉన్నచో నింతటి సుప్రిసిద్ధ విషయమును (క్రిమమును విధ్వంసపరచి) ప్రిమాదపడుటకు కారణ ముగపడదు.

శాస్త్రిగారు సమస్త సాహిత్యమును "సక్రిమముగ పారబట్ట వలె" ననిరి. నే నాపని చేయలేదను కొనుడు. క్రమము ననుసరించి శాస్త్రి గారేల పట్టలేదు ? వా రిచ్చిన ప్రిమాణజాలమంతయు సంబంధము కలదిగా లేదు. వేదములోనుండి భాగములను చూపిన సంతోషము తప్ప అవి బ్రిహ్మభార్యాత్వమునకు సాధకము లెంతమాత్రిము కావు. నా వాదనకే అనుకూలములు. వా రుదహరించిన "కేవల శ్రుతి ప్రిమాణములు" చూడుడు:— యజుశ్శిక్షావల్లిలో "వాక్పతిశ్చక్షు ష్పతిః" (వాక్కులకు పతి, నేత్రిములకు పతి) ఇట బ్రిహ్మసంబంధమే లేదు కావున సరస్వతీ భర్తృత్వము బ్రిహ్మకు జెప్పబడలేదు, యజు ర్బ్రిహ్మణ నాచికేతచయన ప్రికరణమున:—"ఋచాం ప్రాచీం" (ఋక్కులలో బ్రాచీనము) దీని నెందులకు వ్రాసిరో తెలియదు. "వాగేషాగ్ం సుబ్రిహ్మణ్యాసీత్" (వీరి వాక్కు పరబ్రిహ్మ యందు నుండెను.) సరస్వతి బ్రిహ్మభార్య యనుటకేనా ఈ ప్రిమాణములు ? "ప్రజాపతిర్వావసృజత్ ... మొదలు, భాషించుచున్నారు" అను వరకు గల గద్యభాగమంతయు పుటలను పూర్తిచేయుటకు మాత్రిము పనికి వచ్చును. ఈ యగోచర వాదమును వల్లెవేయ పనిలేదు.

కాళిదాసుని కుమారసంభవమున "చతుర్ముఖ సమీరితా" (నాల్గు ముఖములచేత నుడువబడినది.) అని నంతమాత్రిమున గాని "వాటి యర్థము సాకల్యముగ నొనర్చుటకు బుద్ధి దౌర్బల్యము, సంఘదౌర్బ ల్యము, గ్రింథ దౌర్బల్యము నాక్రిమించి స్వరూప తిరోధాన మైనది,

ను వాగ్విజృంభణములవలన గాని ప్రయోజనము ఇసుమంతయు లేదు.
వి యన్నియు బ్రహ్మకు సరస్వతి కూతు రనియే చెప్పుచున్నవి. భార్య
ని కాదు. రామాయణములోని "మచ్ఛందా దేవ తే బ్రహ్మన్!
ప్రవృత్తేయం సరస్వతీ" (నా యాజ్ఞవలన నే నీ నుండి సరస్వతి వెడలినది.
క ప్రత్యక్షమైనది) అనుటలో బ్రహ్మకు భార్యగ సరస్వతి చెప్పబడిన
! తమాష యనగా నిటులుండవలెను. "నా యనుగ్రహమువలన నీకు
స్వతి (కవిత్వము, శబ్దరచనాప్రవృత్తి) లభించినది" అనుటకంటె వేరు
క్తి యచట లేదు. "ప్రవృత్తా"కు "అనువృత్తా"యనుకొని దానికి
ర్యార్థమును బోధించుట చిత్రములోని విచిత్రము. "నా యనుమతి
న ఓ బ్రహ్మదేవుడా! నీకు సగస్వతి పెండ్లమయ్యె" నను తాత్పర్య
నకు దావుగాదు.

నేను పురాణములలో లేదన లేదు. కావున లలితా రహస్యాదులు
ని ఆధునికకవుల చాటూక్తులుగాని ఏకరువు పెట్టినచో లాభము లేదు.
రాణములలో ప్రాచీనాంశము లున్నను ఆధునికుల ప్రక్షిప్తముల
న సంకీర్ణము లగుటచేత సత్యాంశ పరిశోధన కొఱకు వేదాదులే
ణ్యములు.

ప్రమాణముల జూపు నపుడు గ్రంథనామము అధ్యాయము శ్లోక
ఖ్యాదులను సక్రమముగ సూచించవలెను కాని, "మహాభారతములో
దు" అనుట సయుక్తికము కాదు. మరియు పాఠకలోకమునకు దెలియు
ని సాధ్యమైనంత వరకు దెలుగు నుపయోగింప వలెనే కాని యనుచిత
ుగ నసంబద్ధ సమాసములతో శైలిని జెఱచిన ప్రయోజన ముండదు.
వసరమైనచో నంతకంటె పది మడుంగులు జటిలముగ వ్రాయ
చ్చును.

కాళిదాసమహాకవి "వాగర్థావివ సంపృక్తౌ పార్వతీపరమేశ్వరౌ
ంచే" (శబ్దార్థములవలె కూడియున్న గౌరీ శంకరులను నమస్కరించు
న్నాను) అనినందు వలన శాస్త్రిగారు వాక్కనగా సరస్వతి యనియును
ర్థమనగా బ్రహ్మ యనియును అర్థమును సాధింప నడుకట్టిన ట్లగుపడు
న్నారు. పార్వతీ పరమేశ్వరులకు వాగర్థము లుపమానముగా జెప్ప
టవలన సామాన్యుల కట్టి భ్రమ కలుగ వచ్చునేమో కాని

శాస్త్రిగారు అట్లు భావించియుండరనియే మా తలంపు. అ
నుపయోగించిన శబ్దములను మఱొకసారి చిత్తగించ లేదనుట
గారణ మందలి స్వసిద్ధాంత వైరుధ్యమే! శబ్దమును విడిచి య
ముండనటులే, అర్థము శబ్దపూర్వకముగ భావింపబడును, కావున అ
మును విడిచి శబ్ద ముండనటులె సదా నిత్య సంబంధముగల పార్వతీ ప
మేశ్వరు లిట బ్రస్తుతులు. శబ్దార్థములవలె నెల్లపుడు పార్వతీ పరమేశ
రులు కూడియుందురను విశిష్టాద్వైత సిద్ధాంత మిందు ప్రతిపాదింపబ
నది. శివశక్తులు స్వాభావిక సంబంధము గలవని శైవసిద్ధాంతము. కా
దాసుని కాలమునాటికి, కాశ్మీరాది దేశములలో సోమానందాదు
విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రచారములో నున్నది. సహజశైవుడ
కాళిదాసుడు స్వభావానుకూలముగ నట్లు ఐక్యసిద్ధాంతము నుపయో
గించెనే కాని పార్వతీ పరమేశ్వరుల దాంపత్యమును జెప్పుచు శబ్దార్థ
లలో సరస్వతీ బ్రహ్మలను సూచించుటకాదు. అటులగుచో వాదమ
నిరుత్తరణీయ మనుటకు సందియముండదు.

వాగర్థములకు జన్యజనకభావము సుప్రసిద్ధము కావున వాక్కు
సరస్వతిగాను అర్థము బ్రహ్మగాను భావింపబడుచో అపుడు సరస్వతి
బ్రహ్మ పుత్రికగును. ఇది ప్రత్యక్షశ్రుతికి విరుద్ధము. ఇట్టి య
ప్రాయములలో కాళిదాసు ప్రయోగించనూ లేదు. "కావ్యారంభము
స్త్రీ పురుషదాంపత్యసృష్టిప్రారంభదశను నిత్యా శ్రియా చితి తో
వ్యక్తపరచెనని" చెప్పు మన శాస్త్రిగారికి వాగర్థములలో స్త్రీ పురుష
(సరస్వతీ బ్రహ్మ) భావము లేదేమోకాని ఈ విచిత్రపంక్తి నెందులకు
అతి కష్టముతో గ్రథింపవలసి వచ్చినదో!

కాళిదాసుడును అమరసింహునికంటె ప్రాచీనుడో సమకాలి
కుడో అయ్యుండుటవలన పాఠకులలో విపరీతభావము గలుగవల దను
నభిప్రాయముతో వ్రాయబడినది. "భక్షితేఽపి లశునే న శాంతో
వ్యాధిః" (వెల్లుల్లి దిన్నను వ్యాధికుదురదయ్యె) అన్నట్లు శాస్త్రిగారెంత
కల్లలాడినను నావాదమునకు ప్రతికూల ప్రమాణమును జూపరైరి.
ఏదియో పరిశ్రమించి వ్రాసిరని మాత్రమే చెప్పవలెను. నా పూర్వ
వ్యాసమునకు శాస్త్రిగారి వ్యాసము నిజముగ ప్రత్యుత్తరము కాదని

...బచి యూరకుంటినిగాని పాఠకులలోననేకులు విచారించిరి. శాస్త్రిగ్రా ...దేవనిగా మాటి మాటికి బ్రహ్మ నొక యింటివానిగా నొన ...పవలె నని పట్టు పట్టుచున్నారు. మన వ్యాసముల మూల ...మున బ్రహ్మకు గల యిల్లు కూలిపోలేదని తెలియగోరు చున్నాను.

బ్రహ్మకు సరస్వతి భార్య యనదగు ప్రమాణములు ప్రాచీన వాఙ్మయమున లేనే లేవని నేను శపథము పూనలేదు. ఉన్నచో వెదకి ...మముగ నర్థసందర్భములను నిరూపించి సంక్షేపముగ నెఱింగించ ...సుచున్నాను. సమర్థములైన యుక్తులకు స్వాగతము. అనవసర వాగ్జా ...మును విస్తరింపవలదని మనవి. *

* ఈ విషయమున ౫,౬ వ్యాసములు 'విద్యానిధి'ని ఆక్షేపించుచు వచ్చినవి. ...సవ్యమైన మార్గము కాదు. సప్రమాణముగ వాదమును విమర్శింపవలెను గాని ...క్తిని నిందించినచో లాభము లేదు కదా ? —సంపాదకుడు



## 'చిత్కాళ'

యర్ర. కోటయ్యగారు బి. ఏ.

దివ్యసమ్మోహన దీధితుల్ వెదజల్లు
మోము చందురు గాంచి మురిసిపోయి
కనుదమ్ము లరవిచ్చి వినువీథి పరికించు
ముగ్ధదృక్కులకు నుప్పొంగిపోయి
చిఱునవ్వు కాంతిలో చిందిన మధురసా
స్వాదనంబున పరవశత నంది
సంతత కరపాద చాలనక్రీడకు
ననురూపగతుల నాట్యమును సలిపి
'ఉంగ, ఉక్కు' అను పలుకుల కూటలూరి
యుబ్బి తబ్బిబ్బులవును మా యుల్లములకు
మారి 'చిత్కాళ' గనుగొన్న మాత్రి; నట్టి
పట్టి నేవేళ బ్రోచుత పరమశివుడు.

# అత్యుత్తమ గ్రంథములు



త్వరపడుడు! కొలదిగా కలవు!!

| | | | | |
|---|---|---|---|---|
| ౧ వీర శైవ వివాహ విధి | తెలుగు | ౧ | ౦ | ౦ |
| ౨ లింగధారణ విధి | ,, | ౦ | ౬ | ౦ |
| ౩ లింగధారణ సిద్ధాంతము | ,, | ౦ | ౨ | ౦ |
| ౪ వీర శైవ రత్నము | ,, | ౦ | ౮ | ౦ |
| ౫ శివానంద శాస్త్రి శృంగభంగము | ,, | ౦ | ౧. | ౦ |
| ౬ శివ రహస్యము (సంస్కృత, నాగరి) | భా ౧ | ౨ | ౦ | ౦ |
| ౭ ,, ,, | భా ౨ | ౧ | ౮ | ౦ |
| ౮ కాశీపీఠాచే ప్రాచీనత్వ (మరాఠీ) | | ౦ | ౨ | ౦ |

ఒక రూపాయకంటె తక్కువ వెలగల గ్రంథములు వీ. పి. గా పంపబడవు కావున పోస్టుబిళ్లలు పంపవలెను. గ్రంథములు కొన్ని మాత్రమే యున్నవి కావున ఆర్డరులు త్వరగా రావలెను.

మేనేజర్:—

వి భూ తి

సజన్‌లాల్ వీథి, సికిందరాబాద్, దక్కన్.




శ్రీ కాశీ విశ్వేశ్వరుడు




సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

సికింద్రాబాదు

ంద్రము ౧ | శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి మార్గశీర్షము | రేఖ ౧౧

# రామలింగస్తుతి

కీ॥ శే॥ కంబము వీరరామయ్యగారు

సీ॥ కైలాసగిరిఖేల కల్యాణ గుణశీల
సురచక్రపాల యశో విశాల
భంజితాంహోజాల పాలిత మునిబాల
భావజేభమృగేంద్ర భక్తపాల
కరుణాలవాల శంకర పురహార బాల
నక్షత్రగాడ్ఢర నమితలోల
సవనాంతకా భవ సంభృత కరశూల
దిగ్జాలచేలార్కరుగ్విశాల

గీ॥ దీనసురపాల గళరుగ్జి తేంద్రనీల
నిలచి ప్రణుతించితిని గదే నీదు మ్రోల
యేలఁ జాల మిదేల నే నెగడఁజాల
రాజమిహిర రథాంగ శ్రీ రామలింగ.

సీ॥ రవిశశిశిఖినేత్ర భవలతోగ్రలవిత్ర
కవిజనస్తుతిపాత్ర ధవళగాత్ర
దివిజోపవనచైత్ర భువనరక్షణసూత్ర
నివసితసితగోత్ర శివ పవిత్ర
కుజనదుర్కరపత్ర విజితశాత్రవగోత్ర
వృజినౌఘకాననవీతిహోత్ర
రక్షితమునిపుత్ర దక్షప్రధనజైత్ర
పంకజాయతనేత్రకంకపత్ర.

గీ॥ ధవళ వృషపత్ర సుచరిత్ర ధనదమిత్ర
నిభృతదృక్శ్రోత్ర శ్రీ భవానీ కళత్ర
మిత్రజామిత్ర మానిసంస్తోత్రపాత్ర
రాజమిహిర రథాంగ శ్రీ రామలింగ.

(ము క్త ప ద గ్ర స్త)

సీ. శ్రీ సర్వమంగళా చేతోబ్జసారంగ
సారంగ నిర్జరవైరిభంగ
భంగీకృతత్రిపుర భవనాశ ధవళాంగ
యంగసంభవభంజి తార్యసంగ
సంగమేశ్వర, సమస్తకభవ్యసురగంగ
గాంగేయనగచాప కరకురంగ
రంగద్భుజంగేంద్రరవణ కృపాపాంగ
యంగజమదభంగ యఘవిభంగ

గీ॥ భంగరహిత ఫలప్రద భద్రసంగ
సంగతాష్టస్వరూప వాసగిరిశృంగ

శృంగమునినుత శుభ్రవృషేట్తురంగ
రాజమిహిరరథాంగ శ్రీరామలింగ. 3

( స ర్వ ల ఘు )

సీ. తరుణహిమకిరణధర ధరణిరథ హరిణకర
మరణజనిరహిత హృతదురితవిసర
కమలభవదమన సురవిమతకులశమన నర
నమితపదజలజయుగ యభయదకర
కదనతలవిజయ మదమదనహర కధరవర
సదన జగదవన మృదువచన సుకర
విహగహయవినుత పురగహనదవదహన చిర
బహుళతరవిభవ నిరుపమ శుభకర

గీ॥ కమలనిధిశరధి గరళగళ గగనచికుర
నరగమనసఖ సుఖఫలద మురహరశర
నిజగుణ కథనచణ కమలజమధుకర
రాజమిహిరరథాంగ శ్రీరామలింగ. ౪

[నిజాంరాష్ట్రపు మహబూబునగరం జిల్లా బాలనగర గ్రామ నివాసియగు నీ వీరమాహేశ్వరకవి షుమారు పదిసంవత్సరముల క్రితము కైవల్యము నందెను. ఈతడు అటనట నాంధ్రపురాణములను ప్రగల్భముగ జెప్పుచు గొప్ప మెప్పువడసియుండెను. సరసమైన వాచాలత, నిరుపమైన శివభక్తి యాతని సొమ్ము. ఆకారమున నష్టావక్రుడు. దేహము రోగములకొంప కాగా నింతటి పిన్న ప్రాయమున పరలోకమునకు పయనించెను. పక్షవాత మహావ్యాధిపీడితుడై శ్రీ రామేశ్వర స్వామి యాలయమున నివసించి యనుష్ఠానమువలన గొంత యుపశాంతి నందినపుడు నొక సలక్షణమైన అంత్యప్రాసగల రామలింగశతకమును రచించినాడు. ఇది ప్రాచీన శతకములవలె లోకోక్తులతో ప్రౌఢమై చక్కిలి చక్కగా నున్నది. అందలివే యీ పద్యములు.]

---

# వేదాంతము కౌలు



కౌలునామ బె॥ శ్రీలింగాకారపు సంత సదాశివ కైలాసవా అనంతకోటి బ్రహ్మాండనాయకు తానా, చతుర్దశ భువనం తాలూక మొకద్దము శిరూరు పాదుషాకిల్లే నంబర్ దారు పాంచభౌతిక పట్నం పిండాండపురం సర్కారు, మొకాం చేతన ఘాటుకు వ్రాసియిచ్చి కౌలునామా.

మీ బాపతు కుభృదాది దేశపాండ్య శిరస్తదారు అర్జీచేసి మీ మామూలియతు బందోబస్తు కానందున కారణ సంబంధములయి ఇంద్రియాది దేశముఖు హుజూరు తరఫున వున్న జ్ఞానాది ఫ్రిధా యొద్దికి వచ్చి తనతాలూకు పంచభూతములతో గూడి అజ్ఞాని అ వానిని కలుపుకొని మాయాభ్రిష్టుమాట నమ్మి విషయాది తాలూ కేదారు కామతుర్యుండు క్రోధనాశకుండు మోహదూరుం మోహనరావు మదమనే చీకటిగాడు, మత్సరమనే పాళెగాడు, దృ మనేఅధికారి, అరిషడ్వర్గమనే ఆర్గురు తలవార్లు, వ్యసనమనే యేడుగు వేటకాండ్రు, దశలనే నల్గురు మన్నెవారు, పరవశముగా ఏకమ ముతస్సలుచేసి యోగమనే పరగణా మామూలియతు వెళ్ళించక హజు రుకు రుజువుగాక మాలు ఖరాబుచేసిన రైతులు వృద్ధిపొందకుండా చే నందున ఆయువుతక్కువైనట్లు మా అర్జీఖాతరుకు పుచ్చుకొని గురు బాధకరావు, న్యాయప్ప, ధర్మాజీ, పేష్కారు, జ్ఞానాజీ, హవల్దా శాంతాజీ వీరు చెప్పినప్రకారంకాక మరల బదలాయించెదరు. వారివా స్థలములందు మోతుబరీ, ఠాణాధారు, గురూజీ, మారీఫత్తునవుంచి న ద్వారముల తాళపుచేతులు, స్వాధీనంచేసుకొని నిరంతరం పంచాక్ష మంత్రమనే యంత్రాన్ని బలముగా పట్టుకొని మనోయోగమనే సవా చేసి నిగ్రహమనే లగామువేసి దినక్రమమనే మాములియతు వెడలి ఎంతమాత్రం అశ్రద్ధ లేక విచారించవలెను. ఇదికాకను ముందటివాని

కలిసియుండినచో దండధరుని తాకీదు చేయించవలసియుండును. అతని తెలుచే చాల్ల చెడిపోవలసియుండును. తర్వాత ఈ వతను మీకు ఎన్న టికి దఖలులేకుండా పోవును. శ్రీమతు సచ్చిదానంద శివాచార పరి పూర్ణుండైన సద్భక్తునకు ఇందు అందు పొందరాని నమస్కారం చేసి నాము. భానుశశి పండువెన్నెల నిండు అమావాస్య మింటి కోంటి పయిని మొగడుచచ్చిన ముండమోపికి, మూడవనెల కుమారుడు పుట్టి నందున వానికి ఆలులేని పెండ్లియైనది. వీరి బంధువు లెవరనినచో ఆలికి తనయులైన ఆత్మజ్ఞానులైన తల్లికి మొగలైన తనయులు వచ్చేది. ఖర్చుకు కాలిపోయిన కనకం తెచ్చుకునేది. తోచని పక్షాన చింత మొద్దుమీద దీపం తెచ్చుకొనేది. అది తెలియకపోయినచో కలువల పల్లిలో లెక్కచూచుకొనేది. పక్కా గండిపోటు పొడిచి చూచేది. సకలం తాత్పర్యం కాగలదు. కాగితము చిరిగేదనుక ఈ కౌలు చెల్లు బడి కాగలదు.

(చిదిరెమఠము వంశస్థుల పాతకాగితములలో నిది దొరకగా యథావత్తుగా మార్పులులేకుండా ప్రకటింపబడినది.)

---

# ఆధునిక - ఆంధ్రనామ సంగ్రహము

శేషభట్టర్ వేంకట రామానుజాచార్యులుగారు



(బ్రాహ్మణవర్గు)

తే. గీ. యజ్ఞమన భ్రూణహత్యకు నగ్నిహోత్రి
మనగ సిగరెట్లు గాల్చుట కాఖ్య లమరు
యాచకున కొప్పు పండితుం డనగ వేద
పాఠి యనగను గవినాగఁ బార్వతీశ.

(ఆశ్రమవర్గు)

ఆ. వె. గుడిసెవేశ్యను నుంచుకొనుటచేఁ బెండిలి
కానివాడు పెండ్లికాక ముండ
నుంచుకొన్నవాడు నుర్విపై విలసిల్లు
బ్రహ్మచారి యనగ బ్రమథనాథ.

కం. దినమెల్ల బిచ్చమెత్తుట
యును నిశలం దెల్లఁ జౌర్య మొనరించుటయున్
బనిగల హిందూదేశపు
మనుజుడు సన్యాసి యన్నగ మహి నొప్పు శివా!

(దరిద్రవర్గు)

సీ॥ అద్దెకొ పనగ దాటాకుంలగుడిసెనా
జెట్టునీడ యనంగ జెల్లు నిల్లు
వికృతవేష కృశాంగి పిల్లలకోడి పెం
గయ్యాళి యను పేళ్ల గ్రాలు నాలు
సజ్జయన్నము జొన్నసంకటి మంచినీ
ళ్లుపవాస మననొప్పు నోగిరంబు
కోతిమూక దరిద్రగొట్లు సోమర్లన
నామముల్ బరగు సంతానమునకు

గీ॥ నార్జనము పేళ్లు విలసిల్లు నప్పనంగ
జౌర్యవృత్తి యనంగ భిక్షంబనంగ
బనియనఁగ జెల్లు బని లేనితనము పేరు
పురదనుజభంగ! శేషాహిభూషితాంగ!

(వ్యవహారవర్గు)

సీ॥ 'అప్రయోజకుడు' నా 'నవివేకి' యన రెండు
సంకేతములు సెల్లు సజ్జనునకు
'రండ' యన 'నపుంసకుం'డన నాఖ్యలై
యొసగుచుండును విజితేంద్రియునకు
'ఛాందసుం డన' 'వేదజడు' డన నామముల్
పరగు సదాచార వర్తనునకు
'స్నేహదూరుండన' 'జెనటి'నా నభిధలై
కాలుచుండును సత్యశీలునకును
తే॥ గీ॥ బరగు 'బసినిగొట్టు' నగ, 'బిశాచి' యనగ
ద్రవ్యశాలి కభిఖ్యలై ధరణియందు
'దత్త్వవేత్త'కు 'గంజాయిదమ్ముగా'డ
నంగ నభిధేయమై యొప్పు నంగజారి!

(స్వదేశవర్గు)

కం॥ ధన ధాన్యము లన, శౌర్యం
బన ధైర్యమనంగ విద్యయన విజ్ఞానం
బన జెల్లు భరతఖండం
బున గానగ రాని వస్తువుల పేళ్లభనా!
కం॥ వేసారక ఉపన్యా-
న్యాసము లిడువాఁడు దేశనాయకుఁడనగా
భాసిలు దచ్ఛ్రోతలకగు
వాసవముఖవినుత! 'దేశభక్తు'లనంగ౯.

(గో. క. సం.)

ఓం.

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## (శ్రీ విశ్వేశ్వర జ్యోతిర్లింగము)

**మఠంసిద్ధి వీరయ్యాగారు, ఉపాధ్యాయులు.**



శ్రీ వారణాసీ నగరము (కాశీ) నందు శ్రీ విశ్వేశ్వర జ్యోతిర్లింగము విరాజమానమై యున్నది. ఈ నగర ముత్తర భారత దేశపు ప్రఖ్యాత ధూమశకట మార్గము (E. I. R.) యొక్క శాఖయగు రైల్వే (మొగల్‌సరాయినుండి సహారన్పూరు వరకుగల) మార్గమునం దున్నది. ఈ ప్రదేశము (B. N- W. R.) యొక్క ప్రధానమగు స్టేషనైయున్నది. (E. I. R) యొక్క Main line నుండి యాత్రి చేయువారికి వారణాసి పోవుటకు మొగల్‌సరాయి స్టేషను యొద్ద రైలుబండి నుండి ప్రత్యే బండిలో మార్పుకొనవలసి యుండును. ఈ పవిత్రి పట్టణపు మహిమను గుఱించి జను లిట్లు నుడివెదరు. "ప్రళయకాలమందును నీ నగరము ధ్వంసము కాజాలదు. ఆ సమయమునందు శ్రీ శంకర భగవానుడు దీనిని తన త్రిశూలముపై ధరించి సృష్టికాలమువఱకు నిలిపి అనంతరము దిగువకు తెచ్చును."

ఇంతియేకాదు. ఆదికాలమున సృష్టి యొనరించిన ప్రదేశము సైత మిదియ యని తెల్పుచున్నారు. ఈ స్థలమునందే శ్రీమహావిష్ణువు సృష్టిచేయు సంకల్పముతో తపస్సొనరించెను. అతనికి శ్రీ విశ్వేశ్వరుడు సాక్షాత్కరించెను. తదుపరి విష్ణుభగవానుడు గాఢనిద్రా పరవశుడయ్యె. అంత నతని నాభికమలమునుండి శ్రీ బ్రహ్మదేవుం డుత్పత్తిగాంచెను. ఇతడే సమస్త ప్రపంచసృష్టి గావించెను. అగస్త్య మహామునియు విశ్వేశ్వరుని గాఢమగు భక్తితో నారాధించెను. ఇతని యర్చనా మూలకముగ వసిష్ఠమహర్షి త్రిలోక పూజ్యుడయ్యెను. అదే విధ ముగ రాజర్షియగు విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యయ్యెను. సర్వ తీర్థమయియై, సర్వ సంతాప హారిణియై, మోక్షదాయిని యగు కాశి యొక్క మహిమ యత్యద్భుతము. ఇచ్చట ప్రాణత్యాగ మొనరించు

లచే మోక్షము లభించును. భగవానుఁడగు సదాశివుఁడు మరణించు ప్రాణియొక్క కర్ణమునందు తారకమంత్రిముఁపదేశించును దీనివలన నా ప్రాణి జన్మగాంచు భీతిచే విముక్తుఁడగును. మృతిచెందిన వాఁడెట్టి వాఁడైనను సరే. "శ్లో॥ విషయాసక్తచిత్తోఽపి త్యక్తధర్మరతి ర్నరః
ఇహక్షేత్రే మృతః సోఽపి సంసారే న పునర్భవేత్."

విషయాసక్తుడుగాని యధర్మనిరతుఁడైనవ్యక్తిగాని ఈకాశీక్షేత్రమున మృతుడైనయెడల నతనికి పునః సంసార బంధనములేదు. ఎందుకు సంసారబంధనమున చిక్కును? శివదేవుని మూలమున బంధనములనుండి విడిపజేయునదే తారకమంత్రము. కొందరీ శబ్దమునకు విపరీతార్థమును జెప్పుదురు. అదియంతయు నసంగతము. ప్రమాణబాహ్యము. తారకమంత్రోపదేశమందిన యవసాన దశయందాతని యంతఃకరణము పరిశుద్ధతగాంచును. మఱియు నాతఁడు మోక్షమున కధికారియైయొప్పును.

కాశీనగరమునందనేక తీర్థములుఁగలవు. వానిలోఁ బ్రధానము లివి.

"శ్లో॥ విశ్వేశం మాధవం డుంఢిం దండపాణించ భైరవం
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికాం.
పై శ్లోకాభిప్రాయ మేనగా?

"(1) విశ్వేశ్వర జ్యోతిర్లింగము, (2) బిందుమాధవస్వామి, (3) డుంఢిరాజగణేశుఁడు, (4) దండపాణి కాలభైరవుఁడు, (5) గుహా ఉత్తర వాహిని గంగా, (6) మాతా అన్నపూర్ణాదేవి, (7) మణికర్ణిక" లను నమస్కరించుచున్నాను.

మత్స్యపురాణానుసారము ఈ శ్లోకము లుదాహృతములు.

"శ్లో॥ జపధ్యానవిహీనానాం, జ్ఞానవర్జితచేతసాం,
తతో దుఃఖహతానాంచ, గతి ర్వారాణసీ నృణామ్.
తీర్థానాం పంచకం సారం, విశ్వేశానందకాననే,
దశాశ్వమేధం లోలార్కం, కేశవో బిందుమాధవః
పంచమీ తు మహాశ్రేష్ఠా, ప్రోచ్యతే మణికర్ణికా,
ఏభిస్తు తీర్థవర్యైశ్చ, వర్ణ్యతే ఒవిముక్తకమ్॥"

పర్యుక్త శ్లోకముల భావ ముల్లేఖింపఁబడుచున్నది.

"జపము, ధ్యానము, జ్ఞానములేనివారలకు దుఃఖపీడిత జనులకు కాశీనగర మొకటియే శరణ్యము.

శ్రీ విశ్వేశ్వరుని ఆనందకాననమున, దశాశ్వమేధము, లోల్కారము, బిందుమాధవస్వామి, కేశవస్వామి, మణికర్ణిక ఈ (౫) ముఖ్యక్షేత్రములు. వీనివలన దీనికి అవిముక్తక్షేత్ర మను పేరు వచ్చినది.

కాశీనగరమునం దుత్తరభాగ మోంకార ఖండము, దక్షిణ భాగము కేదారఖండము, మధ్యభాగము విశ్వేశ్వరఖండము. ఇచ్చో టనే శ్రీ విశ్వనాథస్వామి ప్రసిద్ధమందిరము గలదు. ఈ మందిరస్థానము లేక పునఃస్థాపనము, శ్రీ శంకరుని యవతార మనబడు ఆ శంకరాచార్యులు స్వయముగా నిజకరకమలములతోఁ గావించి యున్నారు. ఈ ప్రాచీన మందిరమును మూర్తి ధ్వంసకుడైన బాదుషా ఔరంగజేబు నష్ట మొనరించెను. ఆ స్థానమునందు మసీదు నొకటి నిర్మించినాడు. అది యిప్పటికిని కలదు. అర్చకులు ప్రాచీనమూర్తి జ్ఞానవాపియం దున్నదని చూపుచున్నారు. తద నంతరము పైన చేర్కొనిన మందిరమునకు కొంత దూరము పరమ శివభక్తురాలైన మహారాణి యగు అహల్యాబాయి సోమ నాథాది మందిరములను బోలు విశ్వనాథుని కొఱ కొక సుందర నవ్య మందిరమును నిర్మించినది. పాంచాల కేసరియును మహాప్రతాపియు నగు రణజిత సింహ మహారాజు మందిరముపై స్వర్ణకలశ మెత్తించెను.

కాశీ నగరమునందు సుందర మందిరము లనేకము లున్నవి. జాహ్నవీ నదీ తీరమునందు మనోహర ఘట్టములు చూపరుల కానంద సంధాయకములై యున్నవి. మఱియు పండిత మదన మోహన మాలవ్యగారు స్థాపించిన కట్టడము హిందూ విశ్వవిద్యాలయము దర్శ నీయమైయున్నది. కాశీ నగరమునకు కొన్ని మైళ్ల దూరమున బౌద్ధుల క్షేత్రమగు సారనాథము గలదు. మఱియు ననేక సుందర మందిరము కునికిపట్టు. అత్యద్భుతమైన కాశీమహాక్షేత్రమునుగూర్చినాలుగుపంక్తులు చాలవనుట నిక్కువము. మరొకమారు కొన్ని విశేషముల నెరింగింప తలంపు గలదు. శ్రీ జగద్గురు విశ్వారాధ్య మహాసింహాసన ముందుటవలన

...శైవులకును నిది పవిత్రక్షేత్రము, 'జంగంబాడీ' యను గొప్పవీథి ...సింహాసనము వారికి గలదు. ఏ మతాచార్యులకును నింత విశాల ...మైన స్థలము ప్రత్యేకత కాశిలోలేదు. సింహాసనముయొక్క మఠావర ...ముకూడ మిక్కిలి విస్తృతమైనది. ప్రస్తుతము పీఠాధిపతులు శ్రీజగ ...ను పంచాక్షర శివాచార్య మహాస్వాములుకలరు. శ్రీవారి యండన ...ధ్ర కర్నాటకాది ప్రాంతములనుండి వచ్చిన వీరశైవ విద్యార్థు లనే ...లు విద్యాభ్యాస మొనర్చుచు విద్వాంసులై వెడలుచున్నారు. వీర ...వ లోకమున సుప్రఖ్యాతులైన విద్యానిధి, పండిత చిదిరెమఠము వీర ...ద్రశర్మగారి పీఠమునుగూర్చి "కాశీ పీఠాచే ప్రాచీనత్వ"మను పొత్త ...మును మరాఠిభాషలో ప్రకటించిరి. దానిని యథావసరముగా ...విభూతి' ద్వారా అందజేయ ప్రయత్నించెదము.

ఆధునిక దృష్టితోడను కాశీక్షేత్రము అభూత పూర్వ మనుటకు ...దియము లేదు. సంస్కృత భాషకును శాస్త్ర పండితులకును కాశి ...పెట్టినది పేరు. గౌర్నమెంటువారి సంస్కృత కాలేజి కాక మరి మైదారు ...మహా విద్యాలయములును, దాదాపు ఒక వంద చిన్న చిన్న పాఠశాల ...లును కలవు. సంస్కృత విద్యార్థులు పండితులు మొత్తము పదునొకండు ...వేలు, యతీశ్వరులు మఠములును కొన్ని వందలు. కాశీ నివాసార్థమై ...వచ్చిన వృద్ధులు, భిక్షుకులు, అనాథులును, కొన్ని వేలు.

ఆంగ్లాభ్యాసమునకై హిందూ యూనివర్సిటి యొక గొప్ప సంస్థ. ...విద్యార్థులు ఎనిమిదివేలు, దివ్యజ్ఞాన సమాజము, బ్రహ్మ సమాజము, ...ఆర్య సమాజము, భారతధర్మ మహా మండలము మున్నగు సంఘము ...లును కలవు. సనాతన ధర్మాచారములకే ప్రాబల్యము. గంగానది ...యొడ్డున రెండు మైళ్ల పొడవున సోపానములు కట్టబడి మహా సౌధముల ...చేతను సాయంకాలము స్త్రీ పురుషుల చేతను కడు రమ్యమై ముచ్చట ...గొలుపుచుండును. చేరువగానే కాంగ్రెసువారి ప్రధాన కార్యనిలయ ...మును, బౌద్ధుల ధర్మస్థలమును కలవు. ఇది యది యననేల ,కాశి యొక ...విశ్వము, కాశీపతి యొక విశ్వనాథుడు.

---

# ౮ శ్రీ త్ర్యంబకేశ్వరలింగము



ఈ జ్యోతిర్లింగము బొంబాయి రాజధానిలోని నాసిక్ మండలమునం దున్నది. (G. I. P.) రైల్వేమార్గము అలహాబాద్ నుండి బయలుదేరి బొంబాయివరకు పోయియున్నది. బొంబాయి నుండి ౧౧౭ మైళ్ళదూరమున ౧౭ స్టేషనుల తరువాత నాసిక్ స్టేషన్ కలదు. అట నుండి ౬ మైళ్ళదూరమున నాసికాపంచవటి యున్నది. ఈ ప్రదేశమునందే లక్ష్మణుడు రావణుని సోదరి యగు శూర్పణఖ నాసికను కోసివేసెను. అచ్చోటనే సీతాదేవిని రావణు డపహరించుకొని పోయెను. నాసిక రోడ్డునుంచి నాసిక పంచవటి వరకు గుఱ్ఱపుబండ్లు పోవును. పంచవటి నుండి మోటారుబండ్లును, గుఱ్ఱపుబండ్లును, వృషభశకటములును ౧౮ మైళ్ల దూరముననుండెడి త్ర్యంబకేశ్వర క్షేత్రమువరకు పోగలవు. మార్గ మతిమనోజ్ఞమైనది. ఇక్కడికి సమీపమం దుండెడు బ్రహ్మగిరి నామకగిరినుండి పూతసలిలయగు గోదావరి బయలుదేరెను. ఏమహిమ యుత్తరభారత దేశమందు పాపవిమోచన యగు గంగానదీమతల్లికి యున్నదో అంతే మాహాత్మ్యము దక్షిణప్రాంతమున గోదావరినదికి గలదు. దక్షిణదేశమున దీనికి గంగయనియే జనులు వ్యవహరించెదరు. ఏవిధముగా నవనీతలంబునకు గంగావతరణమునకు గారకుఁడగు మహాతపస్వి భగీరథ మహారాజునకు ఖ్యాతిగల్గినదో అదేవిధముగ (గోదావరీనది) ఋషిశ్రేష్ఠుఁ డగు గౌతమమహాముని ఘోర తపఃఫలమై యున్నది. అతనికి శంకరభగవానుని వలన ప్రాప్తమైనది.

భగీరథుని ప్రయత్నమువలన భూతలంబునకు నవతరించిన జాహ్నవీమాతను భాగీరథియనుపేరఁ బిలిచెదరుగదా? అదేవిధముగ గౌతమఋషియొక్క తపః ఫలస్వరూపముగా వచ్చిన గోదావరి రెండవ పేరు (నామాంతరము) గౌతమి. దీనిమహిమ చాలా ఘనమైనది. సింహరాశికి గురుఁడు ప్రవేశించిన తరుణమునం దిచట పుష్కరము వచ్చును. గొప్ప యుత్సవముఁ జరుగును. ఈ సందర్భమున గోదావరీ

స్నాన మాహాత్మ్యము జనులకు పాపమోచనకరము. గోదావరి పుణ్య తోయ ముద్గమించు స్థానమునకు సమీపమునం దధివసించిన త్ర్యంబ కేశ్వర భగవానుని మహిమ గొప్పది. గౌతమఋషియొక్కయు గోదా వరియొక్క ప్రార్థనల ననుసరించి శివభగవానుఁడు తాను యీస్థానమందు నసించుట కనుగ్రహించినాఁడు. త్ర్యంబకేశ్వరుఁడను పేర విఖ్యాతుఁడయ్యెను. స్వామిదర్శనమునకు స్త్రీలనర్హులు. అతివలా దేవుని కిరీటముమాత్రము దర్శింప యోగ్యులై యున్నారు. దేవాలయమునందు గాయత్రి జపించెడి సంధ్యావందన మొనర్చెడి ద్విజులకు ప్రవేశముఁ గలదు. తద్విరుద్ధ ముగా నున్న ద్విజులైనను శూద్రాదులవలె బహిః ప్రదేశమునుండియే దర్శించి సంతుష్టి జెందవలెను. మందిరాంతర్భాగమున పల్లమునందు మూడు చిన్నలింగము లున్నవి. ఇవి బ్రహ్మ, విష్ణు, శివ దేవులకు ప్రతి గా భావించఁబడును. త్రిమూర్తులపైన బ్రహ్మగిరినుండి వెడలిన గోదా వరీనది యవిచ్ఛిన్నరూపముగా పడుచుండును. శివపురాణానుసారము త్ర్యంబకేశ్వర దర్శనము అర్చనము వలన కలుగుఫలము, ప్రతివ్యక్తికిని ఇహపరలోకములం దానందముగ నుండును. బ్రహ్మగిరి పర్వతముపైకి పోవుటకు విశాలములగు ౭౦౦ సోపానములు నిర్మింపఁబడినవి. ఈ మెట్లపై కెక్కినపిదప (రామకుండము), (లక్ష్మణకుండము) అనునవి కాన్పించును. శిఖరోపరిభాగముఁ జేరినచో గోముఖమునుండి వెడలు గోదావరీ భగవతి దర్శనమగును.

ఓం తత్ సత్.

---

# పొగాకు, దానియపాయములు



సిగరెట్, బీడి, చుట్ట మొదలగువాని సేవన ఇటీవల అధికమై జనుల యందది యొక గొప్ప వ్యసనముగా పరిణమించుచు, ప్రచార మునకు వచ్చుచున్నది. అంతేల? ఈ మన బీద దేశమునందును ఇపుడు పొగాకును సేవించని శుద్ధాత్ము డెవడో నిశ్చయించుట దే కఠినమై యున్నది. పొగాకును నస్యముగనో, తాంబూలమున చేర్చియో, పొగ చుట్టగనో ఉపయోగించుట సర్వసామాన్యమైపోయినది. మొట్టమొదట అమెరికాయొక్క ఇండియన్ జనులే పొగాకు కృషిని ఆరంభించినవారైనను ఇపు డచ్చటిజనులు కొన్ని విశేష సందర్భములయందు మాత్రమే దానిని ఒక యంగముగా నుపయోగించుచున్నారు. తదితరులును కార్యార్థులై, అథవా అభ్యాగతులై వచ్చినప్పుడు అగ్గి చుట్టు కూర్చొని మాట్లాడుచు ఒకరొకరు ఒకటి రెండుసార్లు పీల్చిన చుట్టలను తమ ప్రక్క నుండు వారికి ఇచ్చుచు అందరును అన్యోన్య ప్రీతిసూచకము ములగు సత్కారముల వెలిబుచ్చెడు పద్ధతి కలదు. విశేషకూటములు కూడినపుడు కార్యారంభమునకు మొదట ఇదేరీతిగ నాచరింతురు. పొగాకు పూర్వచరిత్ర, దానియుపయోగక్రమము ఇంతకే పర్యవసా నమై యుండెను. కాని రానురాను ఈ పొగాకు మహిమను హెచ్చించి దానిని విశేష ప్రచారమునకు తెచ్చినవారన తెల్లవారలే! వారు ప్రతి దినము తప్పక పొగ త్రాగు అభ్యాసమును తమలో యాచరణకు తెచ్చుటయేకాక వారితోపాటు ఈ దురభ్యాసపు సోకుడును ప్రపంచము యొక్క సర్వ భాగములందున వ్యాపింపజేసిరి.

పొగాకు అనునది ఒక విధమగు విష వస్తువై యుండుటచే దానిని ఏరూపముగనైనను విడువక సేవించుచు వచ్చినచో దేహము నందా విష వేగము ప్రారంభమున మర్మావయవములందు వ్యాపించి మొదలే దుర్బలములగు ఆ యవయవములను మరింత దుర్బలములైన వానినిగా నొనర్చును. పొగాకు అభ్యాసము హెచ్చుచు వచ్చినకొలది

మనోబలము తగ్గుచు వచ్చును. హృదయమునం దుద్రేకము కన్పడి రొమ్ము నొప్పి మొదలగు చెడ్డరోగము లంకురించును. పొగాకునందు విష సంబంధము కల దనుటకు మనకు నిదర్శన మే యనవసరము. అభ్యా సము లేనివారి ముక్కు కొకింత నస్యమును పీల్పించినచో అప్పటివారి యవస్థ ఏతీరుదై యుండునో అందరు నెరింగియే యుండవచ్చును. అటులనే మొదలు తాంబూలమును నమలునపుడును; పొగచుట్టల త్రాగునపు డును దుస్సహమగు కష్టము జనించుచుండును. దీనికంతయు విష సంబంధమే కారణము. విషక్రిములవలె క్రిమ క్రిమముగ నావిషమును శరీరమున కంటవచ్చిన పిమ్మట మొదటి కష్టము కన్పడదు. కడకు మద్యపాన వ్యసనమువలె దానిని విడిచి యుండుటయు సాధ్యముకాని స్థితికి వచ్చును. ఐన నేమి? శరీరమున కేమియు దానినుండి బాధలేక హితకరమై యున్నట్లు కాన్పించినను లోలోపల నది శరీరమును పాడుచేయుచునే యుండును. అనేక సంవత్స రముల పర్యంతము పొగాకు నుపయోగించుచుండినను మా శరీరమున కేమియు విరోధమై యుండలే దని కొందరు అనుచుందురు. కాని దాని విషము లోపలనే వారలకు తెలియక బలు నిదానముగ పనిచేయు చుండును. అతిశయముగ పొగాకును ఉపయోగించుచుండువాడు ఒకటి రెండు దినములు దానిని విడిచి చూచినచో వానికి రాత్రియంతయు నిద్దురయే రాదు. వాని శరీరమందలి నరము లన్నియు ఈడ్చి కత్తిరించి వేయుచున్నట్లుండును. తిరుగ నతడు తన మొదటి యభ్యాసమును ప్రారంభించువరకు మబ్బుగను, మృతప్రాయుడుగను ఉన్నట్లగపడును. ఐన నీ పొగాకు యభ్యాసపు పరిణామ మేమని చూచినచో, ఆ దుర భ్యాసము పెరిగినకొలది మృత్యుదేవతను సమీపమున కాహ్వానించు కొనినట్లవునే కాని వేరుకాదని సిద్ధమగుచున్నది. అనగా ఆతని ఆయుస్సు క్షీణించుచున్నది. ఆత్మహత్యకై జనులు అవలంబించుచుం డెడు వివిధోపాయములందు దీని నొకదానినిగా గణించిన నది నతిశ యోక్తిగా నుండదు.

ఈ దురభ్యాసము ఆత్మఘాతకమునకు కారణమనియే కాదు

"స్వయం నష్టః పరా న్నాశయతి'' 'తా చెడిన కోతి వనమెల్ల చెరిచె' నను సామెతగా జనసామాన్యమునకును అట్టివారిచే గొప్ప అపాయములు అనర్థములు వాటిల్లుచున్నవి.

సినిమా, నాటకమందిరము, మొదలగు ప్రదర్శనశాలలయందును, ట్రాం, రైలు, బస్, మొదలగు ప్రయాణ సాధనములయందును, ఈ పొగచుట్టలను త్రాగుటచే నితరుల కగు సంకటములు ఎల్లరకును తెలిసియేయుండును. ఎవరైనను ప్రక్కవారలు 'ఈ బీడీలను త్రాగకు' డని చెప్పిరా? సరి; ఇక జగడము ప్రారంభమైనదన్నమాటయే! తమ కండ్లను, ముక్కులను, పొగ యావరించివైచినను ప్రక్కవార లట్లే సహించి యూరకుండవలసినదే! ఇదుండనిండు. తములములో పొగాకు వేసికొను యలవాటు మరియును సహింపరానిది. వార లెల్లపుడును ఉమియుచునే యుండవలయును. మద్రాసునందు సువాసన పొగాకు నమ్మువారి అంగడియందు నిల్చి ఏవైపు చూచినను ఎర్రటి ఉమ్మియే కన్పడుచుండును. గొప్పగొప్ప కూటములు, సభలు, గంభీరముగా జరుగుచుండినను, పొగచుట్టలను త్రాగువా రా స్థానగౌరవమునైనను గణింపక పొగచుట్టలను కాల్చుచు, చుట్టుప్రక్కలవారి మొగముపైననే యా పొగను విడుచుచుందురు. కొందర ట్లు చేయుటయే తమ పౌరుషమనియు భావించుచుందురు. దీనిచే జనకూటము లగు ప్రదేశములం దంతయు, వాతావరణము చెడి దాని యభ్యాసము లేనివారి కా దుర్గంధము చాల దుస్సహమగుచున్నది. అందునను సినిమాప్రదర్శన కాలమందు మబ్బుకై తలుపులన్నియు బంధింపబడి, శుద్ధవాయువు వచ్చుటకే అవకాశములేని సమయమున నిది చాలా యనారోగ్యకారణమవుచున్నది.

అనేక వ్యాధుల సోకుడు, ముఖ్యముగా క్షయరోగము యొక్క సోకుడు (అంటు) పొగచుట్టలు త్రాగుటచేతనే; సామాన్య జనులకును, వ్యాపింప హేతువగుచున్నది. వారునోటిచే విడుచుపొగ, అప్పుడప్పుడు వేయుచుండు ఉమ్మి, ఒకరు కాల్చినచుట్టను మరియొకరు నోటనుంచుకొని పీల్చుట, ఇవన్నియు వ్యాధులు వ్యాపింప మిగుల సహకారులు.

పాశ్చాత్య దేశములందు కొన్నిచోట్ల రైల్వే, ట్రాంబండి, మొదలగు కడ్డలందు, పొగబీల్చువారి కనియే ప్రత్యేక కంపార్టుమెంటు లను నిర్మించియుందురు. మొత్తముపై ఈ దురభ్యాసముచే జనారోగ్యము నకు చాల హాని కల దనుటయందు సందేహము లేదు. ముఖ్యముగా పొగాకు సేవనచే మాటిమాటికి నోటితో నుమియుచునే యుండవలసి వచ్చును. ఈ యుమ్మిచే గలుగు రోగము లన్ననో, అపారములై యున్నవి. అనేక అంటువ్యాధులు దీనిమూలముననే వ్యాపించుచున్నవి. అందుచే కన్పడిన స్థలము లందంతయు ఉమ్మివేయు ఈ దురభ్యాసము ఎంతెంత తక్కువవునో, క్షయరోగముచే నైన జనులయొక్క మరణసంఖ్యయు అంత తక్కువవుననుటలో సందేహముండదు.



# శివైక్యము

విజయనగర నివాసులును, శివపూజా ధురంధరులును, ఉదారు లును అగు శ్రీ బిక్కవలి పెదస్వామి దేవరగారు 11-9-39 తేదిని శివైక్యమైరను వార్తను కష్టముతో దెలుపవలసి వచ్చినది. ఆ ప్రాంతపు శైవ సంఘమున వీరు సుప్రసిద్ధులు. అంత్యకాలము వరకును శివపూజను సదాచార నియమములను చక్కగా నిర్వహించిరి. పూజా కాలమున భస్మ రుద్రాక్షావృతమైన వీరి దేహము శివమయముగా కన్పట్టెడిది. వీరు శ్రీ శ్రీ హత్తినిమఠము సిద్ధలింగ స్వాములవారి శిష్యులనియును, గురులింగ జంగమ సేవాపరాయణు లనియును, మహా భక్తి సంపన్నులనియును, ధార్మికు లనియును పలువురి వలన దెలిసినది. అట్టి మహనీయునకు శివసాయుజ్యము లభించిన దనుటలో సందియమే లేదు. తండ్రిగారి యవశిష్ట కార్యములను నిర్వహించుచు వారి వలెనే అభ్యుదయము నందవలెనని వారి పుత్రులగు బి. విశ్వనాథము బి. ఎ. బి. ఇడి గారితో మా సానుభూతిని ప్రకటించుచున్నాము.

# విరహిణీవిలాపము

శ్రీ॥ శే॥ చిదిరెమఠము వీరయ్యగారు

చ. కలకలమాధురీధ్వనులు గ్రమ్మ పికంబులుఁ గూయ శారికల్
చిలుకలుఁ బల్క భృంగములు చేరువ ఝుమ్మని మ్రోయ పుష్పవ-
ల్వలఁగొని గంధవాహుఁడు జవంబున డాయఁగఁ దాళఁజాల నా
వలన వశంబె మౌక్తికము వారక తప్తము సేయ నిల్చునే?

సీ॥ భువనంబులెల్ల నద్భుతకృపారసముచేఁ
బోషించు శౌరికిఁ బుత్త్రుఁడవయి
మేలొర్చి సురలకు మెసవ నన్నంబైన
యంబుజారికిని మేనల్లుఁడ వయి
సకల జనంబుల సంపత్కరులను జే
సెడు రమాదేవికిఁ గొడుకు వగుచు
ననయంబు ధర్మవర్తనలచేఁ బెంపొందు
సుమతియౌ రతిమనోరమణుఁడవయి

గీ॥ మఱియుఁ గరుణాగుణం బిసుమంత లేక
రసిక మతిని, పరోపకారంబు మాని
సంచరించుట మేర దోషప్రచార
మంచి దిక లేర మార రమాకుమార.

పం॥ మురారి సత్కుమార, నీవు మూఢవృత్తి నిత్తరి
న్బరాబరిన్ కడంగిపొంగి బాధ సేయఁ బూనియున్
నరాన నీకతారి నూరి సారెసారె నాదు పే
రురాన నేయ మేర గాదు రోరి ఘోర మారుఁడా.

[నల్లగొండజిల్లా మునికుంట గ్రామ చిదిరెమఠమువంశమున దుద్భవిల్లి సంస్కృతాంధ్ర పాండిత్యము కలిగి కవియై బ్రహ్మచారియై వైరాగ్యశాలియైన యీ మహానుభావుడు స్వదేశమును వీడి షుమారు నలువది సంవత్సరములు ఏ మయ్యెనో తెలియదు. వీరు బాల్యమున రచించిన శ్రీకృష్ణశతానందీయ నాటకము ౯౦ సం॥ క్రితము మద్రాసు శైవ సిద్ధాంతప్రెస్సులో ముద్రింపబడినది. ఆంధ్ర భాషయందలి ప్రథమనాటకములలో దీనిని జేర్చదగును. సరస్వతి బ్రహ్మను గూర్చి విలపించిన ఘట్టములోని వీ పద్యములు. శ్రీ వీరయ్యకవిగారు 'విభూతి' సంపాదకులకు కేవలము పినతండ్రి.]

# య మ వా హ న ము

కవిరత్న: లక్కన మల్లికార్జునుఁడుగారు



ఉ. అక్షులఁ గాంచినంతఁ దన కందెడి లాభము కానకున్న వే
కక్షను పిల్లిఁ గుక్క యల కాలునిపట్నము చేర్చురీతి సం
రక్షణ పొందుచుండు మత రాజ్యపు సంపద డుల్లఁజేయనే
పక్షము జేరి శత్రులకు పాల్పడు నట్టులఁ గూర్చుచుండియున్

ఉ. కక్షలఁబూని గర్వమునఁ గన్నును మిన్నును కానకుండి ని
ర్లక్షణుఁడౌచు పెద్దలను రమ్యచరిత్రులఁ బుద్ధిశాలురన్
యక్షయమైన ధర్మముల నార్యమతంబుల వేదశాస్త్రముల్
మోక్షము లిచ్చుమార్గములఁ బూజ్యపు వస్తువులం బురాణముల్.

ఉ. శిక్షలఁ గానకుండి; గురు శీలుల నోజ్జలఁ దల్లిదండ్రులన్
భిక్షువుగాండ్రులన్ సఖుల వేత్తల నక్కల నగ్రజన్ములన్
లక్షణవంతులన్ స్వమత రాజ్యపు సేవలఁ జేయుపెద్దలన్
యక్షయులై స్వరాజ్యమున కై వెతలందెడి పుణ్యశాలులన్.

ఉ. సాక్షిగఁ జూడకుండియె నిజంబు దలంపకె దుష్టబుద్ధిచే
పక్షివచించు కై వడిని పాపపుభీతియులేక నిచ్ఛమై
కక్షను తిట్టుచుండి, యతి క్రౌర్యము జెందుచు కీడు చేయుచున్
కుక్షిని దిద్దుకొంచు తన కోర్కెలఁ దీర్చుకొనంగ నెప్పుడున్.

ఉ. కక్షలఁ బెంచు దుష్టుడిలఁ గల్మష కల్మియు దుష్ట సౌఖ్యమీ
పక్షమునందు పొందినను బాపురె దున్న మదించినట్లు; యు
గాక్షుని యాజ్ఞచేతఁ దుద కా యమవాహనమా నతండునే
పక్షమునందు గాంచినను బద్ధమె యిద్ది యుమామహేశ్వరా!

---

# సంస్కృతమునకు దెబ్బ: మేల్కొనుడు!

జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ.



సెకండరీవిద్యా పునర్నిర్మాణ సంఘమువారు క్రింది ఫారములలో సంస్కృతమునకు గల స్థానమును పూర్తిగా తీసివేయుటకును, హిందీ యున్న స్కూళ్ళలో మాత్రము హిందీకి బదులుగ వారమునకు మూడు పీరియడులు మాత్రము సంస్కృతము బోధింపబడుటకును, పై ఫారములలో సంస్కృత స్థానమును బాగుగ తగ్గించుటకును గావించిన సూచనలు సంస్కృతభాషా విజ్ఞానాభిమానుల కెల్లరకు నావేదనను గల్గింపకమానవు. హిందీకి బదులుగ సంస్కృతము తీసికొనవచ్చు ననుట వలన సంస్కృతమునకు గల్గు లాభమేమియు నుండదు. హిందీ చాల తేలిక భాష యగుటచేతను హిందీలో ప్యాసుమార్కులు లేకపోయినను పరీక్షలో నుత్తీర్ణులగు నవకాశ ముండుటవలనను, వారమునకు మూడు పీరియడులు మాత్రమే సంస్కృతము నేర్చుకొనుచో నది యెంతమాత్రము అంటకపోవుటచేతను సంస్కృతము నా విధముగ తీసికొను వారెవ్వరు నుండరనియే చెప్పవలెను.

సంస్కృతమునకు ప్రస్తుతమున్న స్థానము చాల స్వల్ప మనియు, దీనిని నిర్బంధవిషయముగ చేయవలెననియు గా॥ సి. రాజగోపాలాచారిగారు ప్రధాన మంత్రిత్వమును స్వీకరించిన క్రొత్తలో లయోలా కాలేజిలో చెప్పియుండిరి. ఇప్పుడు చేయబడిన సూచనలతో ప్రధాన మంత్రిగారి కెట్టి సంబంధము నింతవరకు లేదు. కాని యికమీదట, నీసూచనల నమలు పెట్టవలెనా యక్కరలేదా యను విషయమున విద్యాశాఖా మంత్రిగారికే కాక ప్రధానమంత్రిగారికి కూడ ప్రమేయ ముండును. సంస్కృత విద్యాభిమానుల యాశలు చాలవరకు ప్రధానిగారి పైన గలవు.

విద్యాశాఖామాత్యులకును, విద్యాశాఖా డైరెక్టరుగారికిని, ప్రధాన మంత్రిగారికిని విజ్ఞాపనలను గావించుకొని యీ యుపద్రవము

రాకుండ చేసికొనవలసిన కర్తవ్యము సంస్కృత భాషాభిమాను లందరి పైనను గలదు. ప్రతి పట్టణములోను సభలను జరపి "సెకండరీ విద్యా ప్రనర్నిర్మాణ సంఘము వారు సంస్కృతముయొక్క స్థానమును తగ్గించుటకు చేసిన సూచనలను గర్హించుచున్నాము. ఇకమీాదట నేర్పరుపబోవు నెట్టి సెకండరీ విద్యావిధానములోను గూడ సంస్కృతముయొక్క స్థానముకంటె తగ్గియుండరాదు." అను తీర్మానము గావించి యా తీర్మానముయొక్క నకలును పైన తెల్పిన ముగ్గురు ఉద్యోగులకును పంపవలె నని కోరుచున్నాను. మనస్సులో నెన్ని యభిప్రాయము లున్నను, యీ సూచనపట్ల మనకెంత యావేదనయున్నను, వానిని మనము పైకి వెల్లడింపనిచో నేమియు ప్రయోజనము లేదు. ఆ వెల్లడించుటయైనను సభలలో చేయబడిన తీర్మానముల రూపమున నుండవలెను. ఆతీర్మానములైనను పై యధికారులకు తెలుపబడకుండినచో నేమియు ప్రయోజనములేదు. సంస్కృతప్రాధాన్యమునుగూర్చి పత్రికలలో నూరక వ్యాసములను వ్రాసినను ప్రయోజనములేదు. ఇదివరలో మనము (సి) విద్వాన్ వారి యర్హతనుగూర్చి గావించిన యాందోళనము ఫలించినది. దానిని బట్టి ధైర్యము తెచ్చికొని యైనను ప్రస్తుతవిషయమున యాందోళనము గావింపవలెనని తోడి సంస్కృతవిద్యాభిమానులను కోరుచున్నాను.

[సంస్కృతము భారతదేశపు సమస్త భాషలకు ఆదిమాత. దేశీయభాషల ప్రాచీన సాహిత్యము, వాఙ్మయ మంతయు సంస్కృతమునకు ఛాయ. అక్షరములు, ఉచ్చారణము, రచన, వ్యాకరణము మున్నగునవి సంస్కృతము ననుసరించియే యున్నవి. దక్షిణదేశపు ఆంధ్రకర్నాటక ద్రావిడ మళయాళ భాషలకు ప్రాచీనకాలమున వ్యాకరణములను వ్రాసి భాషాసముద్రమును తరిచి చూచిన నన్నయాది పండిత సార్వభౌము లందరును సంస్కృతభాషనుండియే ఆంధ్రాదులు పుట్టినవని సిద్ధాంతమును స్థాపించిరి. సంస్కృతభాషా వ్యాకరణపాండిత్యము లేనివారికి ఆంధ్రభాషావ్యాకరణనైపుణ్య మబ్బ నేరదనుట సర్వసాధారణము. సాంఖ్యయోగ మీమాంసా తర్క వేదాంతాది శాస్త్రములకును, దేశ

చరిత్రి ధర్మనీతి సదాచారాది వివిధ విజ్ఞానములకును భాండాగారమై
సంస్కృతమునుండి దేశీయభాషలోనికి వచ్చినవి కొన్ని బిందువు
మాత్రిమే! ఇంకను అపారమగు విజ్ఞానసంపదను మన మాతృభాషను
సంపాదించవలసియున్నది. సంస్కృతభాషా విజ్ఞానములకు సరియైన స
క్షణల నేర్పరచి సేవించనిచో రత్నరాశిని కోల్పోయినటులే!

ఇది యిటు లుండగా దక్షిణమున ద్రావిడభాషలనియును ఉత్త
మున ఆర్యభాషలనియును ఆర్యులు విదేశములనుండి వచ్చిరనియును బ
విచిత్రిమైన వాదము దేశమున "బాింది" వలె నెగబ్రాకి సాగెన
దానిని సేవించిన మన సోదరులును కొందరు ఈ రహస్యమును దే
కొనజాలక సంస్కృత మార్యులభాషయనియును బ్రాహ్మణభాషయ
యను ప్రచార మొనర్చుచు హిందీభాషవలె సంస్కృతభాషయు మ
భాషకు ముప్పు తెచ్చి పెట్టునని గగ్గోలుసేయుచు అంతరంగమున విద్రోహ
మారంభించినట్లు తెలియుచున్నది. విజ్ఞులు, సజ్జనులు, దూరభా
ముల జక్కగ నాలోచించి సంస్కృతమునకు గలిగిన యరిష్టములు బా
దోలుటకై బద్ధకంకణులు గావలసియున్నది. —సంపాదకుడు.

—

కాశీక్షేత్రములో

# "ఓం నమశ్శివాయ" బ్యాంకు

శైవులకు అమూల్యసంధి

కాశీక్షేత్రములో శ్రీ పంచాక్షరీ మహామంత్రి మహిమవలన లోకమున కుపకారము జేయనెంచి ఒక బ్యాంకును స్థాపించినారు. కాగి తము మీద వ్రాయబడిన శతకోటి మంత్రములు కావలసియున్నవి. స్త్రీలు బాలురు వృద్ధులు మున్నగు సర్వులును ఈక్రింది విషయముల గమనించి ప్రయత్నించి శివకృపకు పాత్రులు గాగోరుచున్నాము. వ్రాసిన పుస్తకములను కాశి అడ్రసుకుగాని బెజవాడ అడ్రసుకుగాని పంపవచ్చును. అక్షరములు తెలుగు లేక నాగరిలో నుండవచ్చును.

కొన్ని కాగితములు చేర్చి కుట్టుకొని, కాగితముల కిరువైపుల మెట్టుసిరాతోగాని, చందనము లేక కేసరీతోచేసిన సిరాలతోగాని అధ మము ఒకటింబాతిక లక్ష అనగా ౧,౨౫,౦౦౦ గాని యథాశక్తిగాని "ఓం నమః శివాయ" మన్త్రమును వ్రాసిగాని వ్రాయించిగాని పంపిన ముముక్షువుల పేరిట సంకల్పము చేయించి విధివిహితముగా ఆమంత్ర ములకు హవనపూజాదికములు చేయబడగలవు. ఇప్పటివరకు ౬౫ కోట్ల మంత్రసంఖ్య మా కార్యస్థానమునకు చేరియున్నది.

# వ్రాయు విధానము

ॐ नमः शिवाय ॐ नमः शिवाय ॐ नमः शिवाय ॐ नमः शिवाय

ఓం నమః శివాయ, ఓం నమః శివాయ, ఓం నమః శివాయ,

"ఓం నమః శివాయ" మహామన్త్రమును విశేషసంఖ్య వ్రాసిన భక్తశీల సత్పురుషు లనేకులకు యీ పరమపవిత్రనామమన్త్రజపాత్మక లేఖన ప్రభావముచేత శ్రీశంకరభగవానునియొక్క స్వప్నసాక్షాత్కార సౌభాగ్యమున్నూ, ఇష్టకామ్యార్థసిద్ధియున్నూ లభించియున్నది. 'జపా త్సిద్ధిః' యనునట్లు విశేషలేఖనాత్మక జపమువలన సంస్కారము నను

సరించి తప్పక యిష్టసిద్ధి కాగలదు. కలియుగమునందు కేవలము భగవ
న్నామ సంకీర్తనముచేతనే మోక్షము లభ్య మందుదురు. అయిన
జపమాల దిప్పుచూ నామసంకీర్తనముచేయునప్పుడు సైతము చిత్తము
విషయముల వైపుకు చలింపవచ్చును. కాని లేఖనారూపజపానుష్ఠా
మున మాత్రము చిత్తచాంచల్యము నిరోధింపబడుచున్నది. జపానుష్ఠా
మునకు సంకీర్తనముకంటెను లేఖనమే మహత్తర మని లేఖకులే యను
భవమున గ్రహింపగలరు.

ఏభక్తులు యేబదిలక్షలకు తక్కువకాకుండా ఈ మహామన్త్ర
మును వ్రాసియో వ్రాయించియో శివార్పణ గావింపనెంతురో వా
పేర నొకశాఖ యేర్పాటు కావింపబడును. ఈరీతిని యిప్పటికి ౧౫
శాఖలు పనిచేయుచున్నవి. కాశీలోని ప్రధానకార్యస్థానమునకు యిప్ప
టికి ౬౫ కోట్ల మంత్రసంఖ్య చేరియున్నది. శ్రీమహాశివుని యాజ్ఞచే
కల్గిన ఆత్మప్రేరణ ననుసరించి కాశీ మోక్షపురియందు శివాలయనిర్మా
ణమున్ను, అందు శతకోటి 'ఓం నమః శివాయ' మహామంత్రములపైని
శివప్రతిష్ఠయు కుంభాభిషేకము వగైరాలు జరుగగలవు. రాబోవు
సంక్రాంతియందు దీమహత్కార్యమును జరుపదలంచితిమి. కార్యాలయ
మునకు చేరియున్న మంత్రములకు ప్రతిదినము పూజాదులు జరుపబడు
చునే యున్నవి.

—చిరునామలు.

(1) శ్రీ పరమహంస స్వామీజయేంద్రపురీజీమహారాజ్,
టేఢీనీం, గోవిందమఠ, బనారస్ సిటీ.

(2) తోట సత్యనారాయణగారు,
(శివనామాల బ్రాంచి) బట్టలబజారు, బెజవాడ.



# ఆర్యధర్మసంగ్రహము

## (హిందూధర్మసారము)

### "విద్యానిధి"

### ధర్మమనగా నేమి?

ప్రత్యక్షముగా ఇహలోకోన్నతిని సాధించి పరలోక (మోక్ష) ప్రాప్తిని గలిగించునది ధర్మ మనబడుచున్నది. (సాక్షాదభ్యుదయ నిశ్శ్రేయససాధనో ధర్మః)

### ఉత్తమమైన ధర్మమెద్ది?

జగత్తునందుగల ఉత్తమమును ప్రాచీనమును అగు వివిధమత సముదాయములో వైదికధర్మమే శ్రేష్ఠమైనది. దీనికి హిందూధర్మ మనియును వ్యవహారముకలిగినది. ఇదియే ఉత్తమధర్మ మనుటకు గారణ మేమనగా - మతములలో నత్యధిక ప్రాచీన మగుటయే కాక ఇతరమత ముల ఒత్తిడిని సహించుచు నేటివరకును గట్టిగా నిలువదగిన దొక హిందూమతమే! మరియు నిది సర్వసంగ్రాహకమై, యనగా అనంతకాల మందలి యనుభవము వలన శ్రేష్ఠ మని యెన్నుకొనబడిన సర్వతత్త్వ ముల యొక్కయు ఆచారములయొక్కయు సమావేశము గలిగి సదా స్థిరముగా నుండునది కావుననే దీనికి సనాతనధర్మ మనియును వేరొక వ్యవహారముకలదు. (సదా భవతీతి సనాతనః.)

### ఆర్య, హిందూశబ్ద విషయము.

వేదాగమస్మృతిపురాణేతిహాసములందు ఆర్యశబ్దము విశేష ముగా వాడబడినది. ఆర్యయనగా సజ్జనుడు, పూజ్యుడు, పెద్దవాడు అను కొన్ని యర్థములుకలవు. అనార్యయనగా దుర్జనుడనుటయు సుప్రసిద్ధమే. కావున ఆర్యధర్మమనగా సద్ధర్మమని సహజముగ జెప్పుకొనవచ్చును. ప్రస్తుతకాలమున నెక్కువగా ప్రచారములో నున్నది హిందూశబ్దమే. ప్రాచీనములగు వేదాగమములలో నీశబ్దము ప్రయుక్తము కాలేదు. మను యాజ్ఞవల్క్యాది స్మృతులలోను, శంకర రామానుజ శ్రీకర

శ్రీకంఠ మధ్వావల్లభాదుల భాష్య గ్రంథములలోను హిందూశబ్ద విమ
ర్శన మగపడదు. ప్రాచీనకాలమున హిందూశబ్ద ముండుట కవకాశము
లేదని మఱొకవాదముకలదు. కారణ మేమనగా ఆదిమకాలమున భారత
దేశమందు స్వదేశీయులు మాత్రమే నివసించుచుండిరి. వీరిలో శివశక్తి,
గణపతి, సూర్య, విష్ణు, కార్తికేయ మున్నగు వివిధ దేవతల నుపా
సించువా రుండినను వీ రందరికిని వేదము ప్రమాణముగా నున్నం
దున వైదికు లనియు ఆస్తికు లనియు భారతీయులకు ఏక
వ్యవహారముండెను. మతవిచక్షణలో శైవవైష్ణవ వ్యవహారమును
కలదు. వేదము నంగీకరించనివారును బైలుదేరుటవలన నాస్తిక
లనియును జైనులు బౌద్ధులనియును వాడుక కలిగెను. తర్వాత ఇతర
దేశీయులును భారత దేశమును ప్రవేశించిరి. క్రొత్తగా వచ్చినవారిలో
గొందరికి యవన, మ్లేచ్ఛనామములు సహజము లయ్యెను. వివిధదేశీ
యులు ఒకే దేశమున జేరినపుడు అందరికిని వేరు వేరు నామములు
కావలసివచ్చెను. అటులే భారతీయులకును హిందువు లను వ్యవహారము
ఇతరులచే గల్పింపబడి యుండును. ఈ హిందూశబ్దమునకును ఒకే
యర్థములేక కాలముగడిచినట్లు వివిధములైన యర్థములు గల్గినవి.
వేదశాస్త్రముల నాదరించువారు హిందువు లని లోకమాన్యతిలకుగా
రనిరి. వైదికులుగాని జైనబౌద్ధ సిక్కులును హిందువులే నని పండిత
మదనమోహన మాళవిగారి వాదన. భారతదేశమం దుద్భవిల్లిన
ఏమతము ననుసరించిన వారైనను హిందువులే అని మరియొకరు క్రొత్త
వ్యాఖ్యానము గావించిరి. "హిందు"వులో 'చోర' అర్థము కలదు
కావున నిది సర్వథా త్యాజ్యమని ఆర్యసమాజము గోల మరియొకటి
కలదు. సింధునదీ ప్రదేశమున వసించువారికి మాత్రమే హిందుశబ్దము
చెల్లునుగాని భారతీయులందరికి వాచకముకాదని ఇంకొక వివాదము
కలదు. మన్వాదిముఖ్యధర్మగ్రంథములలో నీ శబ్ద నిర్వచనము లేనందు
నను, నిజమునకు నీశబ్దము మనది కానందునను ఇన్ని వివాదములు బైలు
దేరినవి. కాని మేరుతంత్రములో భవిష్యపురాణములో నీ శబ్దము
వచ్చియుండుటవలనను లోకమున నెక్కువగా వ్యవహరింపబడుచుండుట

ులనను హిందూశబ్దము నాదరింపవలసిన దేనని సనాతన ధార్మికులు
మ్మతించియున్నారు. నా యభిప్రాయ మేమనగా భారతీయుల నందరి
శబ్దముతో సంకేత మొనర్చినను 'వైదిక హిందూ' "అవైదిక హిందూ"
ని రెండు విభాగముల గావింపవచ్చునని సహజముగ దోచుచున్నది.
యితే వారివారి మతములను సరిగా దెలిసికొనక యెవరినైనను అవై
క హిందువు లని నామకరణముచేయుట గొప్ప పొరపాటు. వేదమం
ి యే మంత్రము నైనను సరియే తమ గురూపదేశమంత్రముగా
ుపజేయు అధికారముగల మతము లన్నియు వైదిక హిందూమతము
ి నేను సహజముగా తలంచుచున్నాను. వీరిని ఆర్యశబ్దముతో బిలు
ుటయు నిర్దోషమే!

## మన ధర్మగ్రంథములు

హిందువుల ధర్మగ్రంథములు ముఖ్యముగా వేదము లనుకొనుట
హజమే యైనది. కాని యిట నొక సూక్ష్మాంశము దెలిసికొనక
ప్పదు. వేదములలో ధర్మ, అర్థ, కామ, మోక్షములకు సంబంధించిన
మస్త పురుషార్థములును కలవు. కావున వేద మొక ధర్మగ్రంథము
ాత్రమే కానేరదు. అది కామగ్రంథముగను అర్థ గ్రంథముగను
ోక్ష గ్రంథముగను మహర్షు లంగీకరించియున్నారు. వివిధ మత
ర్మ శాస్త్రములలో సందేహము వచ్చినపుడు వేదమే ముఖ్య ప్రమా
ము కావున హిందువుల ధర్మగ్రంథము వేదమనియే వ్యవహారము
లిగినది. సామాన్యముగ వ్యావహారిక విషయములుగల మన్వాది
్మృతులకే ధర్మశాస్త్రమని సంప్రదాయము. కాని విశేష విషయ
ుల కొఱకుగాని శైవ వైష్ణవ ధర్మశాస్త్రములు ప్రత్యేకముగ ప్రసి
ములై యున్నవి. ఆయా స్థలములలో నవి సూచింపబడును. ఈ
్యాసము సుబోధముగా నుండుటకై ప్రశ్నోత్తర రూపముగా వ్రాయ
ుడును.

ప్రశ్న:— వేదమనగా నేమి?

ఉత్తరము:— పరమేశ్వరునివలె నిత్యమై పరమేశ్వరునిచేత
్రష్టకు బోధింపబడిన జ్ఞానరాశి వేద మనబడును.

ప్ర:—వేదము లెన్ని ?

ఉ:—మూలవేద మొకటియే కాని (ముందు దీని వివరణము చేయబడును.) సౌకర్యమును, ఐతిహాసిక పరంపరను అనుసరించి ఋగ్వే దము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము అని నాలుగు విభాగములు కలవు.

ప్ర:—ఆ వేదములలోను నింక నంతర్విభాగము కలదా ?

ఉ:—సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తులు అని యవియును నలు తెఱంగులు. మంత్రాత్మక భాగము సంహిత య యును, (మంత్రమనగా ఛందోబద్ధమైన స్తుతి) బ్రాహ్మణమనగా వి నిషేధములను బోధించు భాగమనియును, కర్మమార్గమును విడలిం జ్ఞానమును బోధించు భాగములు ఆరణ్యకము లనియును ఉపనిషత్తు యును (ఆరణ్యకములలోను కొంత కర్మప్రతిపాదనకలదు) తెలియవలె ఈ సంహితాదులైనను నాలుగు వేదములకు నాల్గే కాదు. సహస్ర సంఖ్యలున్నట్లు ప్రాచీన వాఙ్మయమునుండియే కాక నేటికిని అనే శాఖలు లభించియున్నందునను నిశ్చయ మని తేలుచున్నది.

ప్ర:—ఋగ్వేద మనగా నేమి ?

ఉ:—ఋక్కనగా ఛందస్సులోని మంత్రము, ఋక్కుల సం హము కల వేదమే ఋగ్వేదము. దీని శాఖలశాఖకు సంబంధించిన సం తలో పది మండలములును, షుమారు ౧౧౦౦౦ ఋక్కులు కలవు. అగ్ని ఇంద్ర, వరుణ, సోమ, అశ్వినీ, మరుత్, రుద్ర, మున్నగు దేవతల గూర్చిన యనేక వృత్తములతో నిబద్ధములైన స్తుతులీ వేదమున గల ఈ ఋక్కుల నెవరు ఎక్కడ (పూజ, యజ్ఞాదులలో) నెట్లు పఠింప నను అంశములు బ్రాహ్మణగ్రంథములందు జెప్పబడినవి. ఒకప్పు శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలను బట్టియు మంత్రోపయోగమును నిర్ణయింపవచ్చును. కావున సంహితా బ్రాహ్మ గ్రంథములకు కర్మకాండ యనియును ఆరణ్యకోపనిషత్తులకు జ్ఞానకాం మనియును శిష్టవ్యవహారము. దీనికి నపవాదముగ నుభయభాగము లోను కొన్ని భిన్నప్రకరణ మంత్రములు దొరకకపోవు.

ప్ర:—యజుర్వేద మనగానేమి?

ఉ:—యజ్ఞ (పూజా) విషయకమైన వేదమునకు యజుర్వేద మనిపేరు. ఈ విషయమున దీనికి గొప్ప మహత్త్వముకలదు. యజ్ఞ ఋత్విజులలో అధ్వర్యుడు ముఖ్యుడు, మహత్త్వముగల కార్యములన్నియు నతడే నెరవేర్చవలసి యుండును. ఈ క్రియలన్నియు నీ వేదముననే కలవు కావున యజుర్వేదమునకు అధ్వర్యుశాఖ యనియును నామాంతరము కలిగెను.

ప్ర:—సామవేద మనగా నేమి?

ఉ:—ఋగ్వేదమందలి మంత్రములే గానపద్ధతితో పాడబడుచు సామవేద మనబరగెను. ఇంతకంటె విశేషభేద మగపడుట లేదు. కొన్ని యితరమంత్రములును గలవుగాని దీనిని ఋగ్వేదమునకు గానరూపమైన సంస్కార మనియే చెప్పవచ్చును.

ప్ర:—అథర్వ వేదమనగా నేమి?

ఉ:—ఉపద్రవములను నివారించునట్టియు, వివిధ జాడ్యముల నివారించునట్టియు, వశీకరణాదులకు బనికివచ్చునట్టియు ననేక తంత్రముల నిరూపణమే యిందుగలదు. ధర్మపతితులైనవారిని పావనము చేయగల సుప్రసిద్ధమైన వ్రాత్యస్తోమ విధానము మిక్కిలి చక్కగా నిరూపింపబడినది. ఈ వేద మనేక వృత్తములతో విరచితమైనది. దీని యందు అధ్యాత్మ తత్వమునకును బనికివచ్చు మంత్రములును కలవు. ఆయుర్వేదమున కిది మాత.

ప్ర:—ఈ నాలుగువేదముల ఉపయోగమేమి?

ఉ:—యజ్ఞ (పూజా)విధానమునందు సామాన్యముగా నాలుగు విభాగములు గలవు. వివిధ దేవతాస్తోత్రములను జెప్పునది ఋగ్వేదమును, సర్వ కర్మలను నిరూపించునది యజుర్వేదమును, గానకార్యమును సామవేదమును, అన్ని పనులమీాద లక్ష్యముంచి యుపద్రవముల బారినుండి రక్షించునది యథర్వవేదమును అయ్యున్నవి. కావున నాలుగు వేదములును ప్రత్యేకమైనయుపయోగమునకై విభాగ మొనర్పబడినవి.

ప్ర:—వేదమూలములైన గ్రంథములెవ్వి?

ఉ:—ఆగమములు, స్మృతులు, సూత్రములు, పురాణములును.

ప్ర:—ఆగమము లనగా నేమి?

ఉ:—పరమేశ్వరుడు వేదభావమును సుస్పష్టమైన భాషలో కారికారూపముగ జెప్పినవే ఆగమములు. ఇవి శైవ, వైష్ణవభేదము ద్వివిధములుగ నున్నవి. తమకృత్యము లిందు స్పష్టముగ నీశ్వరునిచే ప్ర పాదింపబడుటవలన నివియును వేదములవలె స్వతఃప్రమాణములై యున్నవి. స్వాయంభువ, పారమేశ్వర, వాతూలాదులు శివాగమము లనియును, నారదపాంచరాత్రాదులు వైష్ణవాగమము లనియును తెలియ వలెను. ఇతర తాంత్రికాదులు వైదికములు కావని సామాన్యము పండితాభిప్రాయమై యున్నను అథర్వవేదమందలి క్రియలనే మరొ పద్ధతితో నిరూపించుచున్నవి. కావున శాక్తాగమాదులును తంత్రగ్ర థములును ప్రమాణములేనని మరికొందరు పండితుల మతమైయున్నది

ప్ర:—స్మృతు లనగానేమి?

ఉ:—ధర్మశాస్త్రములకు స్మృతు లనిపేరు. వేదార్థముల స్మరించి మహర్షులచేతను, మహాచార్యులచేతను ఇవి రచింపబడినవి స్మృతులలోనే ధర్మప్రతిపాదకము లగు సూత్రములును, శైవవైష్ణ ధర్మప్రబంధ గ్రంథములును పురాణములును, ధర్మవిషయమైన వ నములును అంతర్భావము నందియున్నవి. ఈ మొత్తము గ్రంథమ లలో మానవుల వర్ణాశ్రమధర్మములును సదాచారాదులును నిరూపిం బడినవి.

ప్ర:—సూత్రము లనగా నేమి?

ఉ:—ధర్మసూత్రములు, గృహ్యసూత్రములు, శ్రౌతసూత్రము లు, తత్త్వసూత్రములు, శాస్త్రసూత్రములు అని వివిధముగానున్న వర్ణాశ్రమధర్మములను నిరూపించునవి ధర్మసూత్రములు, గృహస్థునక గావలసిన కర్మలను, విశేషతః సంస్కారములను, నిరూపించునవి గృహ్య సూత్రములు. (పద్ధ్వాడి, వృష్టి, మున్నగు శైవధర్మసూత్ర గ్రంథమ

ను గలవు) శ్రుతులందు గల యజ్ఞాదిక్రియలను సవిధానముగా నిరూ
చునవి శ్రౌతసూత్రములు, అధ్యాత్మ విద్యను నిరూపించు బ్రహ్మ
సూత్ర శివసూత్రాదులు తత్త్వసూత్రములు. సాంఖ్య యోగ, తర్క
వ్యాకరణ మీమాంసాదులను నిరూపించునవి శాస్త్రసూత్రములు.
ఇంకను భక్తిసూత్రములు కామసూత్రములు మున్నగు గ్రంథములు
గలవు. ఆ యా సంబంధములు కల విషయములలో నంతర్భావము
నొందుచున్నవి.

ప్ర:—పురాణము లనగా నేమి ?

ఉ:—వేదాగమస్మృతులలో ప్రతిపాదితములైన యర్థములను
ఇతిహాసకథల సాహాయ్యమున సులభముగ ప్రతిపాదించు గ్రంథములు
పురాణము లనబడును.

ప్ర:—స్మృతులు పురాణములు స్వతంత్రముగా ప్రమాణము
లేనా ?

ఉ:—కావు. వేదమూలము గలవే ప్రమాణము. వేదవిరుద్ధము
లైన విషయములను ప్రతిపాదించు ప్రకరణములు స్మృత్యాదులలో
నున్నను అవి సర్వథా త్యాజ్యములే యగును. ధర్మవిరుద్ధములుగాను
అకల్యాణకరములుగాను అవి యెన్నబడును.

ప్ర:—ప్రామాణ్యమనగా నేమి ?

ఉ:—మాన్యత, ఆధిక్యము. వేదములు రాజాజ్ఞవలె శిరసా
స్వీకరించవలసియుండును. రాజభటుల ఆజ్ఞలవలె స్మృతి పురాణాదుల
లోని యుపదేశములును మాన్యములే ! అయితే వేదములు స్వతంత్ర
ముగాను పురాణాదులు వేదపరతంత్రముగాను ప్రమాణములై యున్నవి.
వేదములు జెప్పునవి కేవల శుద్ధసత్యనిష్ఠమైన కల్యాణకరమైన మార్గ
మని గట్టిగా స్వీకరించుటయే ప్రామాణ్యము.

## నా గ రి క త

ప్ర.—సభ్యత, నాగరికత, సంస్కృతి, యనగా నేమి ?

ఉ:—పాశ్చాత్త్యుల సంపర్కమువలన మనలో నీ శబ్దములకు

నేడు కొంత విశేషార్థ మేర్పడియున్నది. ఇంగ్లండు సభ్యత, జర్మ...
నాగరికత అనునట్లే, భారతీయ నాగరికత (Indian Culture) అ...
యును వ్యవహారము కావలసివచ్చెను. మన యార్యుల ప్రాచీనముల...
ఆచార విచార శీల విద్యాదులను గూర్చిన సామూహిక భావముని...
సభ్యత, నాగరికత లేక సంస్కృతి యనిపేరు. ఇది సంక్షేపముగా యజ్ఞ...
దాన, జ్ఞాన, తపశ్శౌచములని చెప్పవచ్చును. ఇవి కాయిక, వాచి...
మానసికములు పలుతెరంగులు.

యజ్ఞమనగా దేవతా జ్ఞానపూర్వకముగా సర్వప్రకారములై...
సంస్కారములతో పూజించుట. వివిధ విగ్రహారాధనలేకాక అ...
ప్రజ్వలించి ఇష్టదేవత నుద్దేశించి ఉత్తమ ద్రవ్యముల నర్పించు ...
ప్రాచీనపద్ధతి.

జ్ఞాన మీ ముత్తెఱంగులుగ నున్నది. ఈ జగత్తంతయు ...
పరమాత్మనుండి బైలువెడలి యందే విలీనము గానున్నదని తెలియు...
అధ్యాత్మజ్ఞానము. ఇట్టి జ్ఞానము ఆధ్యాత్మిక మనుష్యులకంటె నెక్కు...
సామర్థ్యముగల దేవతలు కలరనుటయే ఆధిదైవిక జ్ఞానము. పరమే...
దేవతలవిషయమైన జ్ఞానమేకాక సృష్టిలోని పదార్థములగూర్చి వి...
బోధకు ఆధిభౌతిక జ్ఞాన మనియును పేరు.

దానమనగా ధర్మశీలురగు సదాచారులకును, సమాజో...
కల్యాణకార్య నిరతులగు మహనీయమూర్తులకును నిరపేక్షబుద్ధి...
మనఃపూర్వకముగ శ్రద్ధమై యర్పించుటయే!

తపమనగా తమతమ వర్ణాశ్రమధర్మముల ననుసరించి స్వకర్త...
ములను గట్టిగ పాలించుటయే! (తపః స్వధర్మవర్తిత్వం)—శౌచమన...
శుద్ధత, వంశసదాచార విచారముల దృష్టితో శుద్ధమైన నిర్మలా...
ణమే శౌచము.

## సంస్కారములు

ప్ర:—సంస్కారమనగా నేమి?

ఉ:—శరీరమనముల నుత్తమమైన గుణములచేతను ఆచార...
చేతను సంయుక్తపరచుటకై చేయబడు శాస్త్రోక్తమైన క్రియ సంస్కా...
మనబడును.

ప్ర:—సంస్కారము లెన్ని ?

ఉ:—మొత్తము శాస్త్రోక్త సంస్కారములు నలుబదెనిమిది. కాని ముఖ్యమైనవి పదునారు. కొందరన్నియు ముఖ్యములే నను చున్నారు. కొందరు ముప్పదిరెండు మాత్రము ఆవశ్యకము లనిరి. ఆచారమున మాత్రము షోడశకర్మలే తప్పని సరిగా నిలిచినవి. తక్కి నవి వ్యక్తియొక్క అధికారమునుబట్టి సంభవాసంభవములుగ గ్రహించు నది. షోడశ సంస్కారము లివి—౧. గర్భాధానము, ౨. పుంసవనము, ౩. సీమంతోన్నయనము, ౪. జాతకర్మ, ౫. నామకరణము, ౬. అన్న ప్రాశనము, ౭. చూడాకరణము, ౮. ఉపనయనము, ౯. మేధా జననము, ౧౦. మహానామ్ని, ౧౧. మహావ్రతము, ౧౨. ఉపనిషత్తు, ౧౩. గోదానము, ౧౪. సమావర్తనము, ౧౫. వివాహము, ౧౬. అం త్యేష్టి - ఇవి ద్విజులకు మాత్రమే. తక్కినవారికి కొన్నిటియందే ఉప యోగమ్ము కలదు. ఈ పదునారును కొన్ని కర్మలు ఇతరకర్మలలో నంత ర్గతములై దశకర్మలుగా వ్యవహరింపబడుచున్నవి. శైవవైష్ణవభేదము ననుసరించి ఈ కర్మలకే నామాంతరములు కలవు.

## ఆ చా ర ము లు

ప్ర:—ఆచారము లనగా నేమి ?

ఉ:—ఆచార మన వర్తనము. ధర్మసంబంధమైన యాచార ములకే విశేషముగా నీ పేరు చెల్లును. హిందూధర్మాచారములు వర్ణా శ్రమములను బట్టియు సంప్రదాయములను బట్టియు వివిధములై యున్నవి.

ప్ర:—మన ముఖ్యమైన ఆచారము లెవ్వి?

ఉ:—పూజ, భజన, మననములు. వీనిలో కొన్నింటి నొనర్చినను ఆచారపాలన మగును. పంచమహాయజ్ఞములును ఇందంతర్గతములు.

ప్ర:—ఆర్యధర్మపు ముఖ్యగురుతులెవ్వి?

ఉ:—శిఖ, తిలక, కర్ణచ్ఛేదములు (జుట్టు, బొట్టు, చెవి కుట్టులు) ద్విజులను యజ్ఞోపవీతాదులవలనను గురుతింపవచ్చును.

ప్ర:—ధర్మవిధుల నెవ్వ రెట్లు చేసికొనవలయును?

ఉ:—స్వతంత్రాధికారజ్ఞానములుగల ద్విజులు నిత్యకర్మాదులను స్వయముగాను విశేషకర్మలను ఆచార్యులద్వారా నిర్వహించుకొన

వలెను.తనకర్మ నిర్విఘ్నముగ సాగునట్లు చూచుకొనుభారము యజమానునిపై యున్నది.

చాతుర్వర్ణ్యము

ప్ర:—వర్ణ మనగా నేమి

ఉ:—లోకవ్యవస్థకొరకై వేదములద్వారా మహనీయులచే నిరూపింపబడిన జాతి విభాగమునకు వర్ణ మను పేరుకలదు.

ప్ర:—వర్ణములెన్ని?

ఉ:—బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులని నాలుగు. ఈ నాల్గింటితోగూడిన సమాజమునకు చాతుర్వర్ణ్యమని పేరు.

ప్ర:—వర్ణవిభాగము ఏతత్త్వము ననుసరించినది?

ఉ:—లోకరక్షణతత్త్వమును గంభీరముగ నాలోచించి స్వభావసిద్ధమైన వృత్తి (ఉద్యోగము - శ్రమ) నిర్ణయము చేయబడినది.

ప్ర:—ఈ వ్యవస్థలో బ్రాహ్మణకర్తవ్యము లెవ్వి?

ఉ:—బుద్ధికి సంబంధించిన కార్యము బ్రాహ్మణులకు నప్పగింపబడినది. లోకముయొక్క సమస్తవిధములైన ఉత్కర్షలకు గావలసిన జ్ఞానము నేవిధముగ నార్జింపవలెనో సరహస్యముగ నవీనక్షేత్రములు పరిశోధించి తమ యభ్యాసమూలమున నిర్ణయించి లోకమున కెరింగించి యుపకారమొనర్చి శాస్త్రరక్షణము గావించుకార్యము విప్రులదై యున్నది.

ప్ర:—బ్రాహ్మణుని మహత్త్వమేమి?

ఉ:—ప్రతి హిందువుడును పూర్ణమైన ఉన్నతినంది మోక్షప్రాప్తి కర్హుడగుటయే మన ధర్మమునకు రక్షణ. ఇట్టి యుత్కర్షను సాధించుటకై చెప్పబడిన మహోన్నత క్రియలను కఠినమైన తపస్సువలననైనను ఆచరించి లోకమున నాదర్శమార్గమును స్థాపించువాడను సాభిప్రాయమే బ్రాహ్మణ మహత్త్వమునకు బాధ్యమొనర్చిన్నది. (యజనాది షట్కర్మలతికఠినములు)

ప్ర:—క్షత్రియుల కర్తవ్యమెద్ది?

ఉ:—శత్రువుల వివిధోపద్రవముల నుండి దేశమును రక్షించి సర్వవర్ణస్థులను స్వకర్మనిరతులనుగా జేయుట క్షత్రియుని కార్యము. ముఖ్యముగా ధర్మప్రచారము రాజు నాశ్రయించియే యుండును.

ప్ర:—వైశ్య కర్తవ్యమేమి?

ఉ—స్వరాష్ట్ర కల్యాణముకొరకు సర్వవిధములైన వ్యాపార కృష్యాదులవలన, ధనసంగ్రహము జేయుట, ఉపద్రవసమయమున దేశ మునకై దానిని వినియోగించుట, మున్నగు నవియే వైశ్యకర్మలు.

ప్ర:—శూద్రుల మార్గమెద్ది?

ఉ:—బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కార్యములలో అవసరము గల్గినపుడెల్ల సహాయకుడై తద్ద్వారా దేశక్షేమంకరుడగుటయే శూద్ర కర్తవ్యము.

ప్ర:—ఇందు సెవ లేని స్వకర్మచ్యుతులగుచో?

ఉ:—వారికి ధర్మాభ్యుదయముకాదు. మోక్షము లభింపదు? ఈ బాధ్యత విశేషముగా బ్రాహ్మణ, క్షత్రియుల శిరముల నధిరోహించి యున్నది.

ప్ర:—ఆచారభ్రష్టు డగుచో నేమి చేయవలెను?

ఉ:—వాడు స్వధర్మరతు డగునట్లు ఇతరవర్ణమువారును స్వవర్ణ ములును పతితుని కట్టుదిట్టములతో నాదేశించి విననిచో నింద్యునిగా దలచి బహిష్కరించుటయే మార్గము.

ప్ర:—వర్ణములు జాతులనుండియా, గుణమునుబట్టియా?

ఉ:—వేదశాస్త్రాదులను ప్రత్యక్ష మొనర్చికొనిన మహానుభావు లందరును ధర్మశాస్త్రములందు జాతినిబట్టియే వర్ణ నిర్ణయము గావిం చిరి. నేటివర కాచారము నదియే, ఇదియే సహజముకూడను. (ప్రాచీన కాలమున నన్ని వర్ణముల వారును ప్రేమతో స్వకర్మ నిర్వాహణము గావించుచుండిరి. నేడు ఒకరి కర్మను మరొక రవలంబించుటవలనను సోమరు లగుటవలనను పర దేశభావముల కలవాటు పడుచుండుటవలనను రానురాను ననేక విపరీత విభేదములు పెరుగుటవలనను నవీనులు వర్ణ మక్కరలేదని సాధింప సాగినారు) కాని ప్రాచీన పద్ధతియే దృఢమైన దని తెలిసికొనవలెను. జన్మమువలననే జాతి నిర్ణయించుట సులభము. త్వరగా వాడు తన కర్తవ్యమున బడి యున్నతి గాంచగలడు. కర్మను బట్టియే చెప్పవలె నన్న నొక మనుష్యుడు ఒక దినమున ననేక కర్మలు జేసినచో భిన్నభిన్న జాతీయుడుగా మారుట, హాస్యాస్పదముకదా! ఉదాహరణార్థము, బట్టల నుతుకుచో చాకలిగాను, క్షౌర మొనర్చుచో

మంగలిగాను) ప్రాచీన కాలమున నటులుండిరా, ఇటులుండిరా యని
అపరికృతగాథలను మానవాతీతములుగా నెరుంగునది.

ప్ర:—జాతి యనగా నేమి?

ఉ:—భిన్న భిన్నములైన, ఆచార, విచార, సంస్కార, వృత్తి
ప్రదేశ, ప్రకారములను బట్టి దేశీయమైన సంఘమున ననాదిపరంపర
వచ్చు జన్మసంబంధమునకు జాతియని పేరు కలదు.

ప్ర:—జాతి యుపయోగ మేమి?

ఉ:—విద్య, కళ, సంస్కృతులను రక్షించుటయే జాతియుపయో
గము. యంత్రసామగ్రివలన పరకీయదాస్యము ననుభవించుచున్న
లోకము తెలిసికొనజాలక ఉన్నతి నందితి మని భ్రమించుచున్నది కాని
యంత్రములనగా మానవుడు స్వంతముగా కోరుకొనిన సమాధియని
తెలియునది. ఆనువంశికకర్మ నిర్వహణములో పోటీలేక వెనుకటివలె
జాతీయక్రియలను (కులవృత్తులను) నిర్వహించిననాడే లోకమునకు నిశ్చ
మైన కల్యాణము కలుగగలదు.

ప్ర:—అస్పృశ్యులనగా నెవరు ?

ఉ:—అనాదికాలమునుండి అస్పృశ్యాచారము కలవారును,
సూతకము కలవారును, బహిష్కృతులైన వారును, అస్పృశ్యు లన
బడుదురు.

ప్ర:—అస్పృశ్యత యేలపుట్టెను?

ఉ:—ధర్మాచరణమున శక్యమైనంతవరకు పవిత్రత యుండ
వలయు నను తలంపుతో నిదిపుట్టి యవసరమ య్యెను.

ప్ర:—లోకవ్యవహారమునను దీనిని పాటింపవలెనా?

ఉ:—లోకవ్యవహారమువలనను ధర్మాచారములకు విరోధముగా
వర్తింపనివారు దీని నెల్లప్పుడును పాలింతురు. కాని సామాన్యవిషయ
ములలో మ్లేచ్ఛయవనుల కంటె నెక్కువైన సంబంధమునే స్వకీయ
అస్పృశ్యులతో గలిగియుండవచ్చును.

ప్ర:—నేడు క్షత్రియులు వైశ్యులును ఉన్నారా ?

ఉ:—ఉన్నారు. వర్ణము లిట్లు నష్టముకాజాలవు. కాని దేశకాల
పరిస్థితుల ననుసరించి వైపరీత్యము లన్ని వర్ణములలోను గలుగవచ్చును.

(సశేషము)

# "విభూతి" సూచన

## ౨వ సంవత్సర ప్రయత్నములు.



రాబోవు ౧౨వ సంచికతో 'విభూతి'కి మొదటి సంవత్సరము ముగియనున్నది. మరల శివరాత్రి (ఫిబ్రవరి) లోపుగా రెండవ సంవత్సరపు మొదటి సంచికను కడు రమ్యముగా సిద్ధపరచవలసియున్నది. ఇక ముందు 'విభూతి' యాకారము పెద్దదిగానుండును. అనేక చిత్రములును, వివిధములైన వ్యాసములును కలిగి పాఠకులను మెప్పించగలదు.

### వ్యాసకర్తలకు

కాగితమునకు ఒకేవైపున ప్రక్కన స్థలమువిడిచి స్పష్టమైన అక్షరములతో వ్యాసములనువ్రాసి జనవరి 25 వ తేది వరకు పంపించ గోరుచున్నాము. వ్యాసకర్తలు, తమ ముఖాకృతిగల చిన్నచిన్న బ్లాకులనుగాన్ని, ఫోటోలనుగాని పంపి సహాయపడ గోరుచున్నాము. కావున త్వరగా చక్కని వ్యాసరచనకై యుపక్రమింతురుగాక !

### 'విభూతి' సంరక్షకులకు

మా పత్రికయొక్క ప్రతిష్ఠాపకులు, మహారాజపోషకులు, రాజపోషకులు, సహాయకులు మున్నగువా రందరును తప్పక తమతమ ఫోటోలు ఉన్నచో బ్లాకులను త్వరగా పంపించవలెను. ప్రతియొకరును చిత్రములక్రింద తమ సరియైన పేరును వ్రాసియుంచవలెను. ఫొటోలను బ్లాకులుగా చేయించుట చాల వ్యయకరమైన విషయము కావున ఫోటోతోపాటు రెండేసి రూపాయీలను బంపి యుపకార మొనర్ప గోరుచున్నాము. ఈవిషయమున అందరును పరస్పరముగ సహకారముతో పాటుపడినచో ఈ సచిత్రమైన సంచిక సమర్థముగా నుండగలదు.

### దాతలకు

ఇదివరకు మా యుద్యమమునకు తోడ్పడిన వా రందరికిని కృతజ్ఞత తెలియజేయుచున్నాము. గత రెండుమాసములలో దుగ్గిరాల శ్రీరాచంశెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యగార్లు మహారాజపోషకులుగాను, మెదక్ పట్నంశెట్టి మల్లప్పగారు, మంచిరాల రుద్ర

శెట్టి గుండయ్యగారు, నల్లగొండ దొడ్డ కోటయ్యగారి వీరన్నగారు, రాజపోషకులుగాను చేరి ఎక్కువగా ప్రోత్సాహపరచినారు. ఈ క్రింది వారి సహాయముకూడ చేరినది.

శ్రీ దొడ్డ కోటయ్యగారి వీరన్నగారు నల్లగొండ ౨౦ రు.
,, చదువుల పిచ్చయ్యగారు పెనుమోలు ౫

రావలసిన సహాయము.

కొందరు దాతలు మాకు వాగ్దానము చేసి సంవత్సరములు గడిచి పోవుచున్నవి. ఎన్నిసార్లు సూచించినను వాయిదాలు వేయు చున్నారు. కాని మా కార్యము చాల వ్యయప్రయాసలు కలది కావు నను యుద్ధమువలన ముద్రణాసామగ్రి ధరలు పెరిగియుండుటవలనను చిక్కులు సంభవించుచున్నవి. దాత లందరు త్వరగా కరుణించి మా జాబుల నెదిరిచూడక తమ తమ సహాయమును మనియార్డరుద్వారా పం పించగోరుచున్నాము. అట్లు రానిచో వసూలుకొరకై సంపాదకులే బైలు దేరి సత్యాగ్రహ మొనర్చవలసివచ్చునేమో యని మనవి. పరస్పర ముగ పాతకు లందరును తోడ్పడుట పరమ కర్తవ్యము.

చందాదారులకు

ధరలు పెరిగినను పత్రిక ఇంకను పెద్దగా మార్చనున్నను చందాను పెంచక గత సంవత్సరమునందువలె ఈ సంవత్సరమును చందా రెండు న్నర రూపాయిలే (2-8-0) పండ్రెండవ సంచిక అందులోపుగ చంద దారులందరు తమ ౨వ వత్సరపు చందాను మనియార్డరుచేసి పత్రిక పరికటనకు సహాయపడుట ముఖ్యాతిముఖ్యము. తమకు అందని సంచి కలను మాకు వ్రాసి తెప్పించుకొనవలెను. ఇంకను క్రొత్తచంద దార్లను చేర్చి పత్రికాభ్యుదయమునను తన్మూలకముగ సమాజాభివృద్ధి లోను పాల్గొందురని మిక్కిలి నమ్ముచున్నాము. చిత్తగింపవలెను.

ఇట్లు మేనేజరు - విభూతి,
4268 సజ్జలాల్ వీథి, సికింద్రాబాద్ (దక్కన్)

---

సూచన:—వ్యక్తిద్వేషములుగల వ్యాసములనుగాని, పద్యములనుగాని ఎవ్వరును పంపగూడదు.




హైద్రాబాదు స్టేట్ డైరీ:—ప్రకాశకులు, శ్రీరామా బుక్ పో, మార్కెటు స్ట్రీటు, సికింద్రాబాదు, దక్కన్. గ్లేజు కాగితము, 00 పేజీలు. అందమైన అచ్చు. భద్రమైన బైండు. కవరుమూత, లోపల చి. పెన్సిలు గెట్ అప్ ఆకర్షణీయము. వెల రు. 1—0—0 (బి.జి.)

నిజాంరాష్ట్రము అన్నివిధముల ప్రత్యేకతగల విస్తీర్ణమైన ప్రదేశ మైనప్పటికిని విద్యావిషయమున వెనుకబడియుండుటవలన గ్రంథములు, త్రికలు, డైరీలు, మున్నగు వ్యావహారిక సంపత్తు చాల తక్కువ. ంబాయి, మద్రాసు, లాహోరు, అలహాబాదు మున్నగు ప్రదేశముల రి ప్రకటనలే ఇక్కడ మార్గదర్శకములు. అయినను ఇక్కడ సర్కారు ష ఉర్దూ కావున నా భాషలో సామగ్రిని సాధారణముగా స్థానికులే ప్రకటించుచున్నారు. ఉర్దూలో డైరీలు మున్నగునవి విరివిగా కలవు. ని వారికి నిజాంరాజ్యములో నుండెడు తెలుగు మున్నగు భాషలు వు. వారిగొడవే వారిది. ఇక వకీళ్లు, ఉద్యోగులు మున్నగువారు రుపాయులై వానినే ఉపయోగించు చున్నారు. తర్వాత మార్వాడీ రు హిందీభాషా పద్ధతితో నొకడైరీని వేసిరి. కాని అదియు సర్వత్ర చారము నందలేదు.

అత్యధిక సంఖ్యాకులైన ఆంధ్రు లీ విషయమున నింతదనుక రకుండిరి. శ్రీరామా బుక్ డిపోవారే డైరీని ప్రకటించిన ప్రథమాం లు. వ్యాపారదృష్టితో దీనిని చక్కగా ప్రకటించినారు. కచ్చేరీలు, జులు, పోస్టు, కొన్ని కానూనులు, పెద్ద హోదేదార్ల పేర్లు, వ్యాపార షయములు, హైద్రాబాదు చారిత్రకాంశములు, రైల్వేలు, పత్రికలు, నాభా, మున్నగు చాలా విషయములు పరిశ్రమతో సంగ్రహించి చ్చినారు. ఇవి యన్నియు ఇంగ్లీషులో నున్నప్పటికిని చాలావరకు పేర్లు స్టు కావున సులభముగా తెలిసికొనవచ్చును. పార్సీ, ఇంగ్లీషు, క్యాలండ

రులేకాక తెలుగులో సంపూర్ణ పంచాంగమును, కొన్ని ముహూర్త
ములును ప్రతి పేజిమీద తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ తారీఖులును వేసినా
రూళ్లను కలవు. వకీళ్లు, ఉద్యోగులు, వ్యవహారకు లందరును సంగ్రహిం
దగియున్నది. దీనిని కూర్చిన శ్రీ ఎం. అప్పారావుగారి ప్రశ
ప్రశంసనీయము. ముందు సంవత్సరము తెలుగు, ఇంగ్లీషు భాగ
లను విడివిడిగా సంపూర్ణముగా వేసినచో ఆ యా పాఠకులకు చాల
యుక్తముగా నుండగలదని ప్రకాశకులకు సూచించుచున్నాము.

**బాలికల ఉన్నత పాఠశాల - ప్రచురణములు**:—మాతృభా
౧.౨.౩.౪ సంపుటములు. మొదటి సంపుటము గ్లేజు, తక్కిన వన్ని
రఫ్ కాగితములు. డబల్ క్రౌన్ సైజు. అచ్చు మంచిది. పుటలు క్ర
ముగా, ౧౨౦,౮౪,౯౪,౮౪, వెల తెలియదు. చిరునామ:—కార్యద
బాలికల ఉన్నతపాఠశాల, నారాయణగూడ, హైదాబాద్,దక్క

హైదాబాదు ఆంధ్రులలో పేరెన్నికగన్న ఈ సంస్థ దిన
ప్రవర్ధమాన మగుచున్నది. పూనా కర్వేగారి మహిళా విశ్వవిద్యాల
బోధనపద్ధతియే ఇట నవలంబింపబడి పరీక్షలు జరుగుచున్నవి. ఆం
బాలిక లనేకులు ప్రౌఢలై గద్యపద్యరచనాసుమముల నాంధ్రమా
భారతి నలంకరించుచున్నారని తెలిసి ప్రశంసించి సంతోషించని వా
డరు. ఈ పాఠశాలలో నొక లిఖితమాసపత్రిక నడుపబడుచు సం
రాంత్యమున నా వ్యాసములన్నియు సంపుటముగ బ్రకటింపబడు
పొగడ్తగాంచుచున్నవి. వివిధవిషయములమీద బాలికల కథలు, వ్యా
ములు, సమర్థముగానే యున్నవి.అధ్యాపకుల వ్యాసములును ఇందుకల
కొన్ని వందలమంది బాలిక లిందు పఠించుచున్నారు. శ్రీ.రా. బ. వేం
రామారెడ్డి, మా. హనుమంతరావుగారు మున్నగు ప్రముఖుల
శ్రమవలన నిది త్వరగా కళాశాలగా మారి ఆంధ్రాభ్యుదయసూ
మగుగాక! సంపుటముచివరన బాలికలసంఖ్య, విద్యావిషయమున
నివేదికయుండినచో నుపయుక్త మని భావించుచున్నాము.

శ్రీ వ. ఇందిరగారి ఘోషయాత్ర నాటిక, ఎ౯, భారతీరత
కరాంబగారి భారతీనక్షత్రమాలిక, కమలా లలితా కన్యల కేశవరా
గారి జీవితచరిత్ర అను చిన్న చిన్న పొత్తములును పై సంస్థవా
ప్రకటింపబడినవి. మున్ముందింకను ప్రౌఢరచనలు వెడలి యాంధ్రము
చిరస్థాయిత్వమును పొందవలె నని యాశించుచున్నాము. "రాజహం

మానాంతరాభావాత్, ద్రష్టవ్య ఇత్యత్ర దర్శనసాధనాకాంక్షాయాం వేదాంతవాక్యమేవ తత్సాధనం. తచ్చావిచారితం న నిశ్చయాధాయకం. మననిదిధ్యాసనసహకృతం విచారితవేదాంతవాక్యమాత్మసాక్షాత్కారహేతురిత్యయమర్థః సంపద్యతే.

న చ విధౌ లక్షణా క్వాప్యదృష్టచరీ—అర్ధమంతర్వేదిమినోత్యర్ధం బహిర్వేది" ఇత్యత్ర దేశవిశేషలక్షణాయాః, "జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీనాదధీత" ఇత్యత్ర వయోవిశేషలక్షణాయాః, "ఉచ్చైః ఋచా క్రియతే" ఇత్యాదౌ ఋగాదిపదేన వేదలక్షణాయాః, "యావతోఽశ్వాన్ ప్రతిగృహ్ణీయాత్" ఇత్యత్ర ఇజర్థలక్షణాయాః, "నేక్షేతోద్యంతమాదిత్యం" "నార్షేయం వృణీతే" ఇత్యాదౌ పర్యుదాస లక్షణాయాః, "న కలంజం భక్షయేత్" ఇత్యాది పురుషార్థనిషేధేషు బలవదనిష్టసాధనతాలక్షణాయాశ్చ బహుశ ఉపలబ్ధేః. తస్మాల్లక్షణయా విచారవిధిర్యుక్తః.

నను - విచారోఽపి విచార్యనిర్ణయహేతుత్వేన లోకసిద్ధత్వాత్కథం విధేయ ఇతిచేన్న. అపూర్వవిధ్యసంభవేఽపి నియమవిధేరవకాశాత్ - తథాహి - విధిస్త్రివిధః - అపూర్వవిధిః, నియమవిధిః, పరిసంఖ్యావిధిశ్చేతి. తత్ర కాలత్రయేఽపి మానాంతరాప్రాప్తస్య ప్రాప్తిఫలో విధిరాద్యః యథా-"వ్రీహీన్ ప్రోక్షతి" ఇత్యత్ర విధివ్యతిరేకేణ ప్రోక్షణం కేనాపి న ప్రాప్తం - పక్షప్రాప్తస్య అప్రాప్తాంశపరిపూరణఫలో విధిర్ద్వితీయః, యథా "వ్రీహీనవహంతి" ఇత్యత్ర విధ్యభావేఽపి పురోడాశప్రకృతిద్రవ్యాణాం వ్రీహీణాం తండులహోష్యాక్షేపాదేవావహననం ప్రాప్యత ఇతి నాపూర్వవిధిః - కింత్వాక్షేపాన్నఖవిదళనమపి ప్రాప్నుయాదితి తదానీమప్యవహననప్రాప్త్యర్థః ద్వయోరేకత్ర నిత్యప్రాప్తావితరనివృత్తిఫలకవిధిస్తృతీయః - యథా - "ఇమామగృభ్ణన్ రశనామృతస్యేత్యశ్వాభిధానీమాదత్తే" (తై. సం. ౫-౧-౨)

ఇత్రిత్య లింగాదేవ మంత్రో రశనాగ్రహణే నిత్యం ప్రాప్నోతీతి నాపూర్వనియమవిధీ; కింతు లింగావిశేషాదశ్వాభిధానీమివ గర్దభాభిధానీమపి మంత్రః ప్రాప్నుయాదితి తన్నివృత్త్యర్థః. ఏవంచ "వ్రీహీనవహంతి" ఇతివత్ "శ్రోతవ్యః" ఇతి నియమవిధిః. న చ వ్యావర్త్యాభావః, శారీరాత్మవిచారస్య వ్యావర్త్యత్వాత్. న చ తస్య మోక్షసాధనజ్ఞానే ప్రాప్త్యభావః - "ద్వాసుపర్ణా" "ద్వే బ్రహ్మణీ" ఇత్యాదివాక్యాదాపాతప్రతిపత్తిదశాయాం తస్యాపి ప్రాప్తిసంభవాత్. న చ వస్తుతస్సాధనాంతరప్రాప్తావేవ నియమవిధిః-అపూర్వీయవ్రీహిషు నఖవిదళనస్యాప్రాప్తేర్నియమో న స్యాత్. కథంచిత్తండులీభావమాత్రే తత్ప్రాప్త్యా నియమేఽత్రాప్యాత్మజ్ఞానత్వేన జీవాత్మవిచారప్రాప్త్యా పరమాత్మవిచారే నియమవిధిరస్తు.

ఇహాత్మన్ శబ్దస్య "ఇదం సర్వం యదయమాత్మా" (బృ. ౪-౫-౭) "ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాత ఇదం సర్వం విదితం" (బృ. ౪-౫-౬) ఇత్యాదిప్రకరణపర్యాలోచనయా పరమాత్మపరత్వావగమాత్, సమన్వయసూత్రే ఏకోరామసిద్ధభగవత్పాదాచార్యైః "శ్రోతవ్యః" ఇత్యత్రాత్మజ్ఞానవిధిర్నిరాకృతః. న తు జ్ఞానోద్దేశేన విచారవిధిరితి తదవిరోధ ఇతి నిర్ణీయతే. తస్మాద్విచారవిధౌ న కించిద్బాధకమిత్యేవం స్థితే శ్రవణవిధేరపేక్షితాధికారివిషయఫలత్రయపరమిత్యాగమికన్యాయేన నిర్ణీతమిదం సూత్రం "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇతి అత్రానువాదపరిహారాయ శాస్త్రేషు పురుషప్రవృత్తిసిద్ధయే చ కర్తవ్యేతి పదమధ్యాహర్తవ్యం. జిజ్ఞాసాపదేన విచారో లక్షణీయః । నను జిజ్ఞాసాపదేన లక్షణా యుక్తా, ప్రకృతిప్రత్యయసముదాయస్యాశక్తతయా సముదాయలక్షణానుపపత్తేః; ఇతిచేన్న । సన్ప్రత్యయేనైవ జహల్లక్షణయా విచారో బోధ్యతే, ప్రకృత్యా చ సాధ్యజ్ఞానమజహల్లక్షణయోచ్యతే.

కైశ్చిత్ ప్రకృతేస్సిద్ధజ్ఞానమాత్రపరత్వ మంగీకృత్య సాధ్యజ్ఞా
ఽపి జహల్లక్షణై వేత్యుక్తం. సిద్ధతయోపస్థితౌ సాధనాన్వయాయోగేన
ాధ్యతయోపస్థితేరావశ్యకత్వాత్ ప్రకృతిలక్షణాఽఽవశ్యకీతి లక్షణా
్వయమేవ శాంభవానందశివారాధ్యాభిప్రేతం.

అత్ర కేచిత్ - ప్రకృతిప్రత్యయసముదాయే ఏకైవ లక్షణా
న చ వాక్యే లక్షణా న దృష్టచరీ "అర్థమంతర్వేది" ఇత్యత్ర—
విషం భుంక్ష్వ" ఇత్యాదౌ చ దృష్టత్వాత్. న చ శక్యసంబంధా
ావః. సముదాయశక్త్యభావేఽపి సముదాయిశక్యసంబంధాదేవ తదుప
్త్తేః. సా చాజహతీతి. న చ ఏకరూపేణైకక్రియాన్వయాభావాన్న
ైకస్య లక్షణేతి వాచ్యం - తస్యా అప్రామాణికత్వాత్. "ఛత్రిణో
చ్ఛంతి" ఇత్యత్రాపి ఛత్రిత్వేనాచ్ఛత్రిత్వేన చైకాన్వయిత్వం న
మనకర్తృత్వేన, "గంతారో గచ్ఛంతి" ఇతి ప్రసంగాత్. శాబ్దధి
యోఽవచ్ఛేదకప్రకారతానియమాత్. గంతృత్వస్యావచ్ఛేదకత్వే
ముఖ్యార్థస్యాపి లక్ష్యత్వప్రసంగాత్. న చేష్టాపత్తిః. ముఖ్యార్థసంబంధా
ావాదేతదతిరేకేణ ముఖ్యార్థకల్పనాప్రసంగాత్. అతో నైకరూపే
ైకక్రియాన్వయిత్వం. కింతు ఛత్రిత్వేనాచ్ఛత్రిత్వేన చ నానారూపే
ైవ। అత ఏవ "కాకేభ్యో దధి రక్ష్యతాం" ఇత్యత్రాపి కాకత్వా
్యాకారేణైవ క్రియాన్వయః, న దధ్యుపఘాతకత్వాద్యాకారేణ। న
ఏకవృత్త్యుపస్థాపితానాం పరస్పరమనన్వయాత్ విచారజ్ఞానయోరన
్వయః స్యాదితి వాచ్యం. తయోర్భిన్నవృత్త్యుపస్థాప్యత్వాత్. ముఖ్యా
స్య లక్ష్యత్వాభావేనాజహల్లక్షణాస్థలే సర్వత్ర వృత్తిద్వయాంగీకా
ాత్. న చ సకృదుచ్చరితస్య వృత్తిద్వయ మవ్యుత్పన్నం, "గంగా
యాం ఘోషమత్స్యౌ" ఇత్యత్ర దృష్టత్వాత్.

న చ తీరస్య బోధనే గంగాపదస్య న వ్యాపారః—తాత్పర్య పర్య
సానాత్. తాత్పర్యపర్యవసానస్యైవ బోధకతా. తస్మాత్సముదాయే

అజహల్లక్షణాయాం న కించిద్బాధకం. వస్తుతస్తు— జిజ్ఞాసాపదం తంత్రేణోపాత్తం, తత్రైకేన జహల్లక్షణయా విచారో బోధ్యతే. ఇతరేణ ఇష్యమాణం జ్ఞానమభిధయా బోధ్యత ఇతి న కించిదనుపపన్నమ్. ఏవమేకలక్షణయైవోపపత్తౌ న లక్షణాద్వయం, గౌరవాత్; ప్రత్యయలక్షణాయాః క్వాప్యదృష్టచరత్వాచ్చ.।

కించ— ఇష్యమాణజ్ఞానత్యాగేన తస్యైవ పునస్స్వీకారాత్ వాంతభోజనన్యాయప్రసంగః. జ్ఞానస్య ఫలవత్త్వాచ్చ. అనుపపత్తౌ హి సాధ్యత్వం లక్ష్యం, తత్ర మోక్షసాధనస్యైవ సఫలత్వమితి. తదంశోఽపి లక్ష్యతే. న చేష్టాపత్తిః— తస్యార్థికత్వకథనవిరోధాత్. ప్రత్యయానాం ప్రకృత్యర్థాన్వితస్వార్థాభిధాయకత్వనిశ్చయాచ్చ. జిజ్ఞాసాపదేనేతి గ్రంథవిరోధాచ్చాహుః వాక్యే తావన్నైకలక్షణా సంభవతి. శక్యసంబంధస్య లక్షణాత్వాత్ శక్యాన్వయబాధే శబ్దోపస్థితస్యైవ విషయత్వప్రసక్త్యా సర్వశక్తికల్పనే గౌరవాత్. అనన్యలభ్యస్య శబ్దార్థత్వాత్. శక్యసంబంధేనోపస్థితస్యాపి తాత్పర్యవశాద్విషయత్వమంగీక్రియత ఇతిశక్యభేదే తత్సంబంధానామపి భేదాన్నలక్షణాయా ఏకత్వం. ఏవం చార్థవాదాదిస్థలేఽపి పదానామేవ వాక్యార్థద్వారా ప్రాశస్త్యే లక్షకత్వం ప్రత్యేకమేవ. న తు వాక్యే కదాచిద్వ్యాసజ్యవృత్తిలక్షణా. పదానాం తదర్థానాం తత్సంబంధానాం చ నానాత్వే లక్షణాయా ఏకత్వాసంభవాత్.।

ఏవంచ - వాక్యార్థసంబంధేన యత్ర వస్త్వంతరం పదైర్లక్ష్యతే తత్ర వాక్యలక్షణా. యథా - "అర్ధమంతర్వేది"ఇత్యాదా। తద్భిన్నా పదలక్షణేతి శాస్త్రే వ్యవహారః. ఏవం స్థితే ప్రకృతేఽపి సముదాయే నైకలక్షణా. సముదాయిశక్యసంబంధాదేవ తదుపపత్తిరితి వదతాంచ కథమేకత్వం? సముదాయినాం భేదేన తత్సంబంధస్యాపి భేదాత్. న చ ఏకప్రతీతిజనకత్వేన లక్షణానామేకత్వం. ఇష్టాపత్తేః తథా సత్యన్యత్ర

లక్షణయైవ విచారోపస్థితౌ లక్షణాద్వయేనాపి తదుపస్థిత్యంగీకారే వైయర్థ్యాత్ ।

యత్తు— "ఛత్రిణో గచ్ఛంతి" ఇత్యత్ర ఛత్రిత్వాదినైవాన్వయబోధ ఇతి, తచ్చింత్యం— "ప్రాణభృత ఉపదధాతి" "స్పృష్టీరుపదధాతి" ఇత్యత్రేవ సముదాయస్య లక్ష్యత్వాత్. "ఛత్రిణో గచ్ఛంతి" ఇతి చ ఛత్ర్యచ్ఛత్రిసముదాయో గచ్ఛతీత్యర్థః. న చ బహువచనానుపపత్తిః, "గంగాయాం ఘోషమత్స్యౌ" ఇత్యత్ర వృత్తిద్వయవచనానామేకవచనస్యైవ సాధుత్వోపపత్తేః. "అజైతిః పాశాన్" ఇత్యత్రేవావయవబహుత్వేన వా సాధుత్వాత్ ।

న చ శక్యసంబంధాభావః— సముదాయసముదాయినోరభేదసంబంధాత్ — తయోరభేదేఽపి ప్రత్యయయోర్వైచిత్ర్యస్య సర్వసంప్రతిపత్తేః. శక్యతావచ్ఛేదకభిన్నధర్మేణోపస్థితేరేవ లక్ష్యత్వప్రయోజకత్వాత్. న చ జహల్లక్షణాతో భేదప్రసంగః— రూపాంతరేణోపస్థితస్యాపి స్వార్థస్య క్రియాన్వయాత్. "కాకేభ్యో దధి రక్ష్యతాం" ఇత్యత్ర దధ్యుపఘాతకత్వప్రకారకబోధస్యానుభవికస్య అన్యథోపపాదయితుమశక్యత్వాచ్చ ।

వస్తుతస్తు-యత్ర ఛత్ర్యచ్ఛత్రిసముదాయత్వేన రూపేణ గమనాన్వయప్రతిపత్త్యర్థం "ఛత్రిణో గచ్ఛంతి" ఇతి వాక్యప్రయోగః, తత్రాజహల్లక్షణయా శక్యాశక్యోపస్థితిర్దుర్వారా । అత ఏవ గుణాధికరణే దూర్వాసీయే "ఋతం పిబంతౌ" ఇత్యత్ర పిబదపిబత్సముదాయలక్షణాయా అజహల్లక్షణతా ప్రతిపాదితా, ఏవం చ లింగసమవాయాధికరణే ఉపధానయోగితయా గణే స్వార్థోఽప్యంతర్భూతఇతి న వృత్తిద్వయవిరోధ ఇత్యుక్తం. కైవల్యప్రకాశే వ్యాఖ్యాతం చ పరమశివారాధ్యభట్టాచార్యేణ "ఉపధానయోగితయా గణస్య లక్ష్యతా" ఇతి.

యది చ వృత్తిద్వయమపి తాత్పర్యవశాత్సకృదుచ్చరితస్యా
ప్యంగీకృత్య ఛత్రిత్వాచ్ఛత్రిత్వప్రకారకబోధేచ్ఛయా "ఛత్రిణో
గచ్ఛంతి" ఇతి వాక్యమంగీకృత్య "గంగాయాం ఘోషమత్స్యౌ"
ఇత్యత్రైవ వృత్తిద్వయవ్యాపారోఽప్యంగీక్రియతే; అంగీక్రియతాం.
న చైతావతా ఉక్తస్థలే లక్షణయా శక్యాశక్యోపస్థితిర్వారయితుం
శక్యేత్యవశ్యాభ్యుపేయత్వాత్. అజహల్లక్షణానిరాసాయాసవైఫల్య
మితి దిక్.

ఏవం స్థితే ప్రకృతేఽజహల్లక్షణాంగీకారే ఏకవృత్త్యుపస్థితయో
ర్విచారజ్ఞానయోః "వషట్కర్తుః ప్రథమభక్షః" ఇత్యత్రైవ ఉద్దేశ్య
విధేయభావేనాన్వయో న స్యాత్. దర్శితశ్చ తాదృశాన్వయః
"జ్ఞానాయ విచారః కర్తవ్య" ఇతి పరమశివానందారాధ్యస్వామినా
శివజ్ఞానచంద్రోదయే. న చ ప్రకృతే వృత్తిద్వయమేవాంగీక్రియతే
నాజహల్లక్షణేతి వాచ్యం. తథాసత్యజహల్లక్షణోక్తివిరోధాత్.
"గంగాయాం ఘోషమత్స్యౌ" ఇత్యాదౌ వృత్తిద్వయస్థలే అజ
హల్లక్షణావ్యవహారాభావాత్.

ఆస్తాం తావజ్జహత్త్వాజహత్త్వవిచారః, వృత్తిద్వయాంగీకారేఽ
పి ప్రకృతేరైకలక్షణయా నిర్వాహః—తథాహి జ్ఞానస్య సాధ్యత్వో
పస్థితివ్యతిరేకేణ తావన్న సాధ్యతయాఽన్వయః న చేచ్ఛావిషయత్వ
మాత్రం సాధ్యత్వం. అనిచ్ఛావిషయస్యాపి దుఃఖస్యసాధ్యత్వాత్.
అసాధ్యస్యాపి ఇచ్ఛావిషయత్వాత్. విధురస్యాతీతభార్యాయామిచ్ఛో
త్కట్యదర్శనాత్. ఇష్టసాధ్యశబ్దయోరపర్యాయత్వాచ్చ। అతఏవేష్టత్వేన
సాధ్యత్వానుమానం సిరస్తం. వ్యభిచారస్యోక్తత్వాత్. అస్తు వా
సాధ్యత్వానుమానం, తథాపి ప్రకృతే నావ్యుపయోగః--వృత్త్యుపస్థిత
స్యైవ శాబ్దాన్వయబోధవిషయత్వనియమాత్. అన్యథా విచారేఽపి

లక్షణా న స్యాత్. ఇష్యమాణజ్ఞానసాధ్యత్వేన అనుమానాదినోపస్థితస్య అన్వయాద్ధీవిషయత్వసంభవాత్.

కించ— ప్రత్యయార్థవిశేషణత్వేనోపస్థితస్య జ్ఞానస్య స్వాతంత్ర్యేణైవ తదుపసిస్థితిర్నాస్తి "గార్గిత్యా" ఇత్యాదౌ గోత్రస్య స్వాతంత్ర్యేణోపస్థితయే లక్షణాయా అంగీకారాత్. తస్మాత్ ప్రకృత్యా సాధ్యావస్థం జ్ఞానం లక్షణీయమేవేతి లక్షణాద్వయస్యావశ్యకత్వాత్ ప్రత్యయ ఏవ. విచారలక్షణా యుక్తా, న తు సముదాయే, ఏతేన శక్తికల్పనాఽపి నిరస్తా. ఏకేన విచారలక్షణాయా ఇతరేణాపి సాధ్యావస్థజ్ఞానలక్షణాయా అప్యుక్తక్రమేణావశ్యకత్వేన పదద్వయం కల్పయిత్వా పదద్వయేఽపి లక్షణాంగీకారాపేక్షయా ఏకస్మిన్ ఘటితపదే ప్రకృతిప్రత్యయలక్షణాద్వయకల్పనాత్ ద్వయోరేవ లఘుతరత్వాత్. విచారలక్షణాపి న సముదాయే యుక్తా ఉక్తయుక్తేః ప్రకృతేః ప్రత్యయస్య వా తల్లక్షకత్వాదన్యతరనైయర్థ్యాదితి.

యత్తు సర్వప్రత్యయస్య లక్షకత్వం న దృష్టమితి తన్న। "సక్తూన్ జుహోతి" ఇత్యత్ర ద్వితీయాయాః కరణత్వలక్షకత్వస్య, "ప్రయాజశేషేణ హవీంష్యభిఘారయతి"ఇత్యత్ర తృతీయాద్వితీయయోః కర్మత్వాధారత్వలక్షకత్వస్య, ఆఖ్యాతస్య కృత్యర్థకత్వవాదినాం "రథో గచ్ఛతి"ఇత్యత్ర వ్యాపారలక్షకత్వస్య, ఫలానుకూలవ్యాపారార్థకత్వవాదినామపి "జానాతి - ఇచ్ఛతి- ద్వేష్టి - యతతే" ఇత్యాదౌ క్రియానుకూలకృతివ్యాపారయోరప్రతీతేః జ్ఞానాద్యాశ్రయత్వప్రతీతేః, "నశ్యతి" ఇత్యాదౌ చ నాశప్రతియోగిత్వప్రతీతేరాశ్రయత్వప్రతియోగిత్వలక్షకత్వస్య చ బహులముపలబ్ధేః। గుహాధికరణపూర్వపక్షే "ఋతం పిబంతౌ"ఇత్యత్ర బుద్ధిక్షేత్రజ్ఞసాధారణార్థశతృప్రత్యయస్య కర్తృత్వశక్తస్య కారకత్వమాత్రలక్షణాయా దూశ్వాసీయే

ప్రతిపాదనాచ్చ। న చ ప్రత్యయాన్తరస్య లక్షకత్వేఽపి సన్ప్రత్యయే క్వాపి లక్షణా న దృష్టేతి వాచ్యం. “శ్వా ముమూర్షతి” “కూలం పిపతిషతి” ఇత్యాదౌ వ్యాపారమాత్రే లక్షణాయా దృష్టత్వాత్.

అత ఏవ “ధాతోః కర్మణస్సమానకర్తృకాదిచ్ఛాయాం వా” (అష్టా-3-౧-౭)ఇతి సూత్రే “ఆశంకాయామచేతనేషూపసంఖ్యానం” ఇత్యుపసంఖ్యానం చోదయిత్వా “న వా తుల్యకారణత్వాదిచ్ఛాయా హి ప్రవృత్తిత ఉపలబ్ధేః” ఇతి వార్త్తికేన ఇచ్ఛాకార్యే వ్యాపారే లక్షణయా ప్రయోగ ఇత్యుక్తే రచేతనే ఇచ్ఛావత్తదిచ్ఛాకార్యస్యాప్యభావాత్। తత్ర “ఋచా-ఉపమానాద్వా” ఇతి వార్త్తికేన ఇచ్ఛాసదృశే వ్యాపారే గౌణః ప్రయోగ ఇతి పతంజలిభాష్యే ప్రపంచితం. కైయటశ్చ - తథా సతి “గౌణముఖ్యయోర్ముఖ్యే కార్యసంప్రత్యయః” ఇతి న్యాయేన ఇచ్ఛాసదృశే ప్రయోగో న స్యాదిత్యాశంక్య గౌణముఖ్యన్యాయశ్చ క్వచిల్లక్ష్యానురోధేనాప్యంగీక్రియత ఇతి సమాదధే.

ఈక్షత్యధికరణే “కూలం పిపతిషతి” ఇత్యత్ర దూర్వాస భగవత్పాదాచార్యైర్లక్షణాయా అంగీకారాచ్చ తస్మాత్ సన్ప్రత్యయే లక్షణా నాస్తీతి వచోరిక్తం యదపి వాంతభోజనన్యాయ ఇతి, తన్న. ప్రత్యయస్య విచారలక్షకత్వేన న బోధ్యతే సాధ్యతా, కింతు లక్షణయా ప్రకృత్యైవేతి బోధకభేదస్వీకారమాత్రేణ వాంతభోజనన్యాయాసంభవాత్. సాధ్యత్వస్యాత్యాగేన త్యక్తపునస్స్వీకారాభావాత్.

యదతాదర్థికత్వకథనం విరుద్ధమితి తదపి న. జ్ఞానాయ విచారః కర్తవ్య ఇతి జ్ఞానం సాధ్యత్వేనోద్దిశ్య సాధనం విచారో విధీయతే। తత్ర సిద్ధత్వేనోపస్థితౌ సాధనాకాంక్షా నేతి సాధ్యతామాత్రం లక్ష్యతే। యావతా వినా శబ్దాన్వయాపర్యవసానం తావన్మాత్రం లక్షణీయం తస్మిన్ పర్యవసితే విధేః




సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

సికింద్రాబాదు

శా॥ శ॥ ౧౮౬౧ ప్రమాథి

సంపుటము ౧ — పుష్యమాసము — రేఖ ౧౨

22 జనవరి 1940

## మహాకవి నన్నెచోడుని కుమారసంభవ మందలి

# జంగమ మహిమ

ప్రథమాశ్వాసములో

గీ. అన్యదైవ వితతి నర్చించు కొలుపు తా
డిడి ఫలంబు గొనుట పడయఁ గనెడి
సద్య మిష్టఫలదు జంగమ మల్లికా
ర్జునుని గొలుపు మొసరు మునుఁగఁ గొనుట. ౧౨

క. శ్రీ పీఠంబున నిడు తన
శ్రీపాదుకలందు వ్రాలి సేవించెద నేఁ
బాపహతిఁ జేసి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జున దేవుః. ౧౪

మ. అమలజ్ఞానసుదీపవర్తిఁగొని వృద్ధాచార్యుఁడై వేదశా
స్త్రములం దున్న సదర్థమెల్లఁ గొని విద్వచ్ఛ్రీప్రీతిఁ గావించు వా
ని మహాత్మ్యం డనఁ బొల్చు పుణ్యనిధి వాణీముఖ్యు సర్వజ్ఞ జం
గమ లింగంబగు మల్లికార్జును సదా కల్యాణుఁ గీర్తించెదన్. ౧౫

వ. ఇట్లు విశిష్టగుణగణాలంకృతుండై నెగడు నస్మదీయానూనపరి
భార్ణవోదీర్ణరుచిరవస్తువిస్తారితోత్తమకావ్యరత్నవిభూషణం బమ్మ
తాంశుభూషణావతారంబై విలసిల్లు జంగమమల్లికార్జునదేవు నిఖిల
జనశిరోవిభూషణామలదివ్యశ్రీపాదంబు లాకల్పాంతస్థాయిగా విభూ
షించు టశేషజగజ్జనజేగీయమానంబు. ౧౬

చ. రవికులశేఖరుండు కవిరాజ శిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నెచోడుఁడటె, కావ్యము దివ్యకథం గుమారసం
భవ మటె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ డట్టె వినం గొనియాడఁ జాలదే. ౧౭

వ. కావునం బరమశ్రీనగోత్తుంగ మణిశ్రీసంగత మల్లికార్జున దేవతాకంబై
జగంబులం బ్రఖ్యాతంబై ప్రవర్తిల్లుట జంగమమల్లికార్జునదేవుండై
ప్రాణాయామాదిషడంగోపాంగ సకలయోగజనారాధితుం డగుటం
బరమయోగీంద్రుండై న్యాయవైశేషికాదిషట్తర్కకర్కశుం డగు
టం బరవాది భయంకరుండై జన్మమరణాదిదుఃఖార్ణవోత్తీర్ణ్యమా
యమానమానసుం డగుటనుం బరమానందహృదయుండై ఘోర
సంసారపారావారోత్తరణకారణానూనవైరాగ్యనిరతుండగుటసమ్యక్
జ్ఞాన స్వరూపుండై వేదషడంగశాస్త్ర పురాణేతిహాసాగమాదిసకల
కళాస్వరూపాపారవాణీధరుం డగుట నిఖిలవిద్యాగురుండై సకలజనా
భీష్టవిమలజ్ఞానానూనఫలప్రదాయకుం డగుటం బరమస్వరూపుండై
సమస్తవిద్వజ్జనమనోమానసకేళీలాలసుం డగుటం బరమహంస
స్వరూపుండై యత్యుత్తమపురుషార్థ ప్రవర్తితుం డగుటం బుణ్యశ్లో
కుండై నిఖిలముముక్షుజనైకధ్యేయాత్మకుం డగుటం బరమబ్రహ్మ
స్వరూపుండై నిస్త్రైగుణ్యాపదార్థప్రవర్తితుం డగుట గుణగణా
తీతుండై సద్భక్తజనాత్మాలోకనైకహేతుభూతుం డగుట మునిజన
ముఖమణి ముకురుండై నెగడు సద్గురుండైన జంగమ మల్లికార్జున
దేవునకు. ౧౮

క. సద్గురుఁ డనఁ జను నఖిలజ
గద్గురునకు సంతతోపకారికి మునివి
ద్వద్గురునకుఁ గవి బుధహిత
మద్గురున కపారధర్మమతికిఁ రతికిఁ. ౬౦

క. వినుత బ్రహ్మర్షి కి న
త్యనుపమ సంయమికి సజ్జనాభరణునకున్
మనుజాకారమహేశున
కనుపమచరితునకు మల్లికార్జునమునికిఁ. ౬౬

ఉ. మారమదప్రహారు గుణమండనమండితు సుందరాంగు దు
ర్వారభవాబ్ధిపారగు సువర్ణసవర్ణశరీరు సజ్జనా
ధారుఁ గవీంద్రగాయక బుధస్తుతుఁ గాశవికాసహాస ది
క్పూరిత చారుకీర్తి మునిపుంగవు జంగమమల్లికార్జునున్. ౧౩౦

చ. గతమదమత్సరేంద్రియ వికార మమత్వ సమస్తసంగతా
గత వసులోభ మోహ భయకల్మష దుర్వ్యసనా దురీషణా
త్రితయ మనోజమార్గణుఁ బ్రదీపితు నిర్మలినాంతరంగు నా
నతమునినాథమస్తు సుజనస్తుతు జంగమమల్లికార్జునున్. ౧౩౨

క. అక్షయ నిఖిలకళాగమ
దక్షమహోదారు ధీరుఁ దత్వజ్ఞు లలా
టాక్ష జనితోగ్ర శిఖిముఖ
భక్షితపంచేషు దేహుఁ బరమోత్సాహున్. ౧౩౩

గద్య

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జున దేవ దివ్యశ్రీ పాదపంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడదేవ ప్రణీతంబైన కుమారసంభవం బను కథయందుఁ బ్రథమాశ్వాసము. ౧౩౪

ద్వితీయాశ్వాసములో

క. శ్రీకంఠమూర్తిం బుణ్య
శ్లోకు' మహాభాగు నిఖిలలోకారాధ్యున్,
నాకేశభోగి సత్య గు
ణాకరు నచలాత్ము మల్లికార్జున దేవున్, ౧౩౬

క. రమణీ రమణీయ సురూ
పమయాంగజశత్రు వజ్రిపంజరసిభస
ద్విమల శివయోగ తత్పరుఁ
డమల చరిత్రుండు మల్లికార్జును డెలమిన్. ౨౪౨

## తృతీయాశ్వాసములో

క. శ్రీకంధర పరతత్త్వా
లోకన తత్పరుడు నిశ్చలుం డఖిలసుధీ
లోకానందితకల్పా
నోకహుఁడగు మల్లికార్జునుండు నెగడ్తన్. ౨౪౧

ఉ. చారుతరానధానవుత శాశ్వతకీర్తిరసప్రివాహ సం
పూరితరోదసీకుహరుఁ బుణ్యసనాతనమూర్తి సజ్జనా
ధారు సమస్తలోకజనతానుతపాదసరోజపీఠు శృం
గారభవారి నర్థిజనకల్పమహీజము మల్లికార్జునన్. 3౫౨

క. అనవరతదానరతుఁ బా
వనతరశుభమూర్తి భక్తవత్సలు జనతా
వినుతమతికర్మిభవ సం
గనివృత్తు మునీంద్రవరశిఖామణి ననఘున్. 3౫3

ఉ. సత్యవిలాసు నాదిముని సచ్చరితుం గవిగాయకాది సం
స్తుత్యు ననూనదాననిరతుం గరుణాకరు సజ్జనాంబుజా
దిత్యు వినిర్జితాంగభవు దీర్ణభవార్ణవు క్షేమహీసురా
మాత్యు సదాత్మయోగి జనమండను జంగమమల్లికార్జునన్. 3౫౪

## చతుర్థాశ్వాసములో

క. శ్రీమదశేషమునీంద్ర
గ్రామణినుతచరితు విగతకల్మషు శివత
త్త్వామలమతిప్రకాశు ద
యామృత సరసీజు మల్లికార్జున దేవున్. 3౫౭

మ॥ స్రి॥ హారహాసాకాశగంగాత్యమలజలమరాళాబ్జనీహారధాత్రీ
ధరకర్పూరేందుకాకోదరవరపతిదిగ్దంతిప క్షీరనీరా
కర మక్తాహారకుందోత్కర రజతశరత్కౌముదీ ద్యోతకీర్తి
శ్వరు నాత్మారాము వాణీవరు వరగురు సర్వజ్ఞు సజ్ఞానదూరుఁ. ౪౭౫
క. దీపిత విమలజ్ఞాన సు
దీపిత సుఖదళిత మోహతిమిరాపహర
వ్యాపారు సర్వసుజనద
యాపరు నచలాత్ము మల్లికార్జున దేవుఁ. ౪౭౬
మ. స్రి॥ శివధర్మార్థ ప్రవీణుఁ సితయశు దిగ్జగత్సేవ్యు వేదాంతవేద్యుఁ
భవభావాఘౌఘదూరుఁ బ్రవిమలగుణు నభ్రాంతచేతస్కు నంగో
ద్భవ బాణాఘోరతాపాపహతు నచలు నిర్భగ్ను నీశాంబుతో మో
ద్భవసద్భృంగాయమానోత్తమ హృదయు మహోత్సాహు
నానంద దేహుఁ. ౪౭౭
క. స్ఫురిత ఘనాఘన మారుతు
నరిషడ్వర్గాటవీదవానలుఁ గర్మాం
బురుహ సుధాకరు భవసా
గరకుంభజు దివ్యమునిశిఖామణి ననఘుఁ. ౪౭౮

వసంతతిలకము.

సాహిత్యవేది గుణశక్తి వివేకయుక్తుఁ
మోహాదిదోషపథముక్తు బుధానురక్తుఁ
మాహేశ్వర ప్రికరమాన్యు సదా వదాన్యుఁ
దేహేంద్రియాఘ జయధీరు సుమేరుచారుఁ. ౪౭౯

పంచమాశ్వాసములో

క. శ్రీభాషాశ్రిత సన్నుత
భాభాసిత విమలవదనపంకరుహుఁ దపః
శ్రీభామావిభుగుణ ర
త్నాభరణాభరణు మల్లికార్జునదేవుఁ. ౪౮౦
మ. జగదారాధ్యు నసాధ్యు సాధ్యు విమలాచారుఁ మహోదారు స
ర్వగు సర్వేశు ననీశు నీశు సుగుణావాసుం జగత్త్రాసుఁ

త్రిగుణాతీతు నజాతు జాతు వృషవర్ధిష్ణుం గిరియాజిష్ణు లో
కగురుఁ దృశ్యు నవశ్యు వశ్యు వివిధాకల్పుఁ సుజల్పుఁ మహిన్. ౬౧౩

క. సుజ్ఞానామలతత్త్వవి
ధిజ్ఞుఁ గళాభిజ్ఞు భారతీరమణుఁ దిరిలో
కజ్ఞు నయజ్ఞు సుధీనిధి
నజ్ఞాన విముక్తు సుచరితాభరణాంకుఁ. ౬౧౪

ఉ. కరుణామిత్రు నమిత్రు మిత్రు నుతలోకజ్ఞుం గళాభిజ్ఞు సా
గరగంభీరు నుదారు దూరగతదోషున్యుఁ జగన్మాన్యు భూ
సురవంశాద్యు నభేద్యు భేద్యు సుమనఃశుద్ధుఁ మనశ్శుద్ధు వి
స్తరితశ్లోకు నలోకులోకు శివసంసక్తుఁ విముక్తుఁ మహిన్. ౬౧౫

క. లోకాలోకనకీర్తి
శ్రీకాంతాకాంతు విబుధశేఖరు దురితా
నోకహకుఠారు సకల క
ళాకల్పాకల్పు మల్లికార్జున దేవుఁ. ౬౧౬

మాలిని. అమలపరమయోగాయత్తు సంశుద్ధచిత్తుఁ
గమలవిశిఖరమ్యాకారు దుస్సంగదూరుఁ
శమితవిషయుఁ దత్త్వాసక్తు సంసారముక్తుఁ
శమదమ నియతాత్ముఁ శాంతు వాక్శ్రీసుకాంతుఁ. ౬౧౭

షష్ఠాశ్వాసములో

క. శ్రీవాణీవరు నఖిల క
ళావిదు నఘరహితు నిహాలలాటాక్షు దిరిత
త్త్వావిష్కృతమతి నఖిల శు
భావహు నణిమాది గుణగణాలంకారుఁ. ౬౧౮

చ. పటికపుగోలముల్ వెదురు బారాగిఁబోయుచు గౌరుగొమ్ము రోఁ
కటఁగొని దంచుచుఁ శబరకామిని పెక్కులు రాగముల్ మదో
త్కటముగఁ బాడఁజుట్టిన మృగంబులు సోమమనుష్య రూపధూ
ర్జటి మునిముఖ్యు లోకగురు జంగమలింగము మల్లికార్జునుఁ. ౭౦౪

మ. వృతయూపాటవియాగపావక శిఖావిర్భూత ధూమోద్ధరో
శితసంప్రాప్త మహీరుహప్రకర ముక్తిప్రపవర్యాగ్నిరం
జిత మభ్యర్చిత దేవతానికర మాశ్లిష్టాగమాచార మూ
ర్జితపుణ్యంబు మునీశ్వరాశ్రమముఁ గాంచెన్ గౌరి సంప్రీతితోన్. ౭౧౧

క. దూషిత కుతర్కవాదులు
భూషిత షట్తర్కు లఖిల బుధవినుతులు వి
ద్వేషితదోషులు సతతా
న్వేషిత సన్మార్గు లఖిల విద్యానిపుణుల్ ౭౧౬

క. శిష్టాచారులు బోధా
శ్లిష్టాత్మకు లనఘు లఖిలసేవ్యులు సకలా
భీష్టవిరక్తులు మహానులు
సృష్టిన్వ్యయకరులు సద్విచారులు ధీరుల్. ౭౧౭

క. నిష్ఠాపరు లురువేదా
నుష్ఠాన సమాచరులు మనోహరులు మహా
శ్రేష్ఠాత్మకు లమలులు పర
మేష్ఠిసములు సర్వసత్వమిత్రులు పాతుల్. ౭౧౮

క. దుష్కర్మచరణ కుజన బ
హిష్కారపరుల్ సదామహేశ్వర తత్త్వా
విష్కృతబుద్ధులు సిద్ధులు
నిష్కళచారిత్రపరు లనింద్యులు వంద్యుల్. ౭౧౯

ఉ. వాసనగా శివాగమము వర్ణన కెక్కఁ దత్రియాసదర్థముల్
దేసిగ నాత్మశిష్యులకుఁ దెల్పుచు సద్విధి నున్న నిష్కళా
భ్యాసమునందు లీనమగు భావము నిల్పి వెలుంగుచున్న స
ద్భాసురముఖ్యు విప్రమునిపుంగవు జంగమమల్లికార్జునున్. ౭౩౬

చ. గుణగణరత్నభూషణుఁ డకుత్సితచిత్తుఁడు పూర్ణచంద్రభూ
షణపదపంకజాతమదషట్పదుఁ డాశ్రిత సజ్జనార్యపో
షణుఁ డమితాభవాగమవిశారదుఁ డీడిత సన్మునీశ్వరా
గ్రణి శుభమూర్తి సజ్జనశిఖామణి ధీమణి విశ్వసంస్తుతిన్. ౭౩౭

క॰ సంయమ సుచరితుఁడు వా
కసంయమ సువ్రత రతుండు చౌషష్టికళా
సంయుతుఁ డనఘుఁడు గాంతా
సంయోగవియోగభోగసంత్యక్తుఁ డిలన్. ౮౨

చ॰ గతమదమత్సరుండు జితకామలతాంత శిలీముఖవ్రజా
హతపరితాపచేతసుఁ డఘూమితకంటక బంధుభూరుహా
యతనిబిడాజవంజవమహావిపినానలుఁ డింద్రియేభసం
హతిమదవర్ధనోగ్రనఖరాయుధుఁ డాత్మవిదుండు సద్వ్రతిన్. ౮౩

క. సూరిజనస్తుత కీర్తి
శ్రీరమణీ రమణుఁ డమల చేతస్కుఁడు వా
ణీ రుచిరాననతిలకుఁ డ
పారగుణార్ణవుఁడు సుజనబాంధవుఁ డెలమిన్. ౮౪

(సశ్లేషము)*

---

* [క్రీ. శ. 940 అనగా షుమారు వేయి సంవత్సరములక్రితము కవిరాజశిఖా మణి, టేంకణాదిత్యాది బిరుదాంకితుడును సూర్యవంశ క్షత్రియ కులభూషణుడును అగు నన్నెచోడ మహాకవి ఆంధ్రభాషలో "కుమారసంభవ"మను మహాప్రబంధమ్మును రచించెను. దానిని తనగురుడగు శ్రీశైల శివయోగి జగద్గురు శ్రీ జంగమ మల్లికార్జునాచార్యునకు సమర్పించి కృతకృత్యు డయ్యెను. ఆ కాలమున జంగమ మల్లికార్జునుడు సుప్రసిద్ధుడై యుండుటయేకాక నేటి మఠాధిపతులును మాహేశ్వరులును అనబడు శ్రీ పంచాచార్య పరంపరాగత జంగములకు బ్రాహ్మణవ్యవహార మున్నట్లు నిరాటంకముగ జెప్పనగును. నేటికిని ఈ వీరమాహేశ్వరుల అధీనములోనున్న జగద్గురు పంచపీఠములును, లింగధారి సర్వజన గురుత్వమును, దీనికి సాక్ష్యము నిచ్చుచున్నవి. ఆధునికులు ఇట్టి చారిత్రిక మహత్త్వములను గమనింపక తికమకలు పడుచుండుట సహజము. ఇట్టి ప్రాచీనగ్రంథము నతి వ్యయప్రయాసలతో 1909 సం॥న ప్రకటించి శ్రీ మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారు ఆంధ్రమహాజనుల ప్రశంసల నందిన విషయము సుప్రసిద్ధము.

ఈ పద్యములలోని యంశములను గూర్చియు ఈ కావ్యమును గూర్చియు ముందు వివరింపబడును.] —సంపాదకుడు.

# శ్రీ శంకరాచార్య కాలనిర్ణయము.

ఆంధ్రవ్యాస నిపుణ, అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు



శ్లో॥ అద్వైతార్ణవ పూర్ణచంద్ర మభిధా పద్మాటవీ భాస్కరం
విద్వత్కోటి సమర్చితాంఘ్రియుగళం ప్రద్వేషికక్షానలమ్,
హృద్యాభేద్య సమస్తవిద్యవిలస త్ప్రొద్యద్వివేకాలయం
స్విద్యద్వాగమృతం పరాత్పరగురుం శ్రీశంకరం తం భజే.

జ్యోతిర్మయ లింగస్వరూపుఁడగు శ్రీమన్నారాయణుని యాజ్ఞానుసారము కాలప్రవాహము ఝరీవేగమున ననంతముఖములఁ బ్రవహించుచున్నయది. ఈప్రవాహవేగమున నెన్నియో ప్రాణములు చైతన్యరహితములై నవి. అచేతనములు చేతనములుగ మారినవి. జడపదార్థములు చైతన్యముం గలిగి మాటలాడ నేర్చినవి. మాటలాఁడు వ్యక్తిత్వములు మూగనోము ధరించినవి. పసుపు, కుంకుమ, కాటుకలతో నాఁడవారివలెఁ బురుషులు ఆఁటలాఁడజొచ్చిరి. సతీమణులు పురుషకారములు సేయనేర్చిరి. రాజపుంగవులు నిర్వీర్యులై నామమాత్రావశిష్టులైరి. ఉన్నారని యనుకొన్నను లోకమున కిసుమంతయు నుపయోగింపని గోడలకుఁ గన్నములు త్రవ్వి కొంపలార్చెడి యెలుకరాజులుగ పరిగణింపఁ బడుచున్నారు. వారి వారిరాష్ట్రములయందలి యధర్మప్రచారముల నరికట్టంజాలక, మీదుమిక్కిలి తత్ప్రచారములకుఁ దోడ్పడుచు ధర్మదేవతను గోడుగోడున నేడ్పించుచున్నారు. ధర్మదేవత యాక్రందనధ్వనులు, కన్నీటి కెరటములు లోకము నాక్రమించినవి. వీని ఫలితముగ మానవులు తినుటకుం దిండిలేక కట్టగుడ్డ లేక యలోలక్ష్మణాయని యేడ్చుచు యశనమునకై యంగలార్చుచున్నారు. ప్రజల హాహాకారములు పృథ్వీపతులను సంక్షోభింపఁ జేయుచున్నవి. వణిజులు బేరసారములుడిగి కింకర్తవ్యతామూఢులైరి. బ్రాహ్మణులు స్వధర్మములం గోలుపోయి నామమాత్ర బ్రాహ్మణులుగ పరిగణింపఁబడిరి. ఒరులకుఁ జెప్పుపట్ల ధర్మముల నుపన్యసించి తానాచరింపఁ జాలనంతటి దుస్థితికి వచ్చిన బ్రాహ్మణుఁడు లోకకల్యాణ మ్మొనర్పం

జాలక భయంకర సమస్య తీవ్రాగ్నిల జ్వాలలను, కఠోరశాసన ధూమ రాజిని లోకమున వెదఁజల్లుచున్న వాఁడు. ఇతనికిప్పుడుకావలసినవి స్వార్థములగు కామార్థములు మాత్రమే. వీటికిం బుట్టినిల్లగు యహంకార స్వరూపమే నేఁటి బ్రాహ్మణపిశాచీ స్వరూపము. ఈపిశాచీ బ్రాహ్మణ స్వరూపమును గాంచిన మేఘపరంపర లెక్కడ చుట్టుకొనునో యను భయమున సమస్తభూతప్రపంచము గజగజలాడుచున్న యది కుల తత్త్వప్రచార యుద్ధములయందు బ్రాహ్మణ పిశాచీ స్వరూపము వెళ్ళగొట్టంబడుచున్నయది. నిలుచుండుటకుం జోటులేదు; తినుటకన్న ములేదు. కొంపలార్చెడి లంచగొండితనము, కూటసాక్ష్యము నీతనికిం బెట్టని సొమ్ములుగ పరిగణింపఁబడి, వేళదాఁటినను యింత గంజిమాత్ర మైనను త్రాగుచున్నవాఁడు. మరికొంతకాలమున కిదియుఁ బోయి శ్మశాన వాటికలే నివాసయోగ్యములని యందే కాలమును వేగించు నేమో! దుర్నిరీక్ష్య తేజోవంతమై వెలిఁగిన బ్రాహ్మణ తేజమిప్పుడు నిస్తేజమై, నిర్వీర్యమై, తుట్టతుదకు నల్లనిబొగ్గుయై, దీపమాలలు లేని పాడువడిన కొంపలయందు దయ్యములు నాట్యమొనర్చు చున్నట్లున్న దనిన నతిశయోక్తి లేదు.

శ్రీపరమేశ్వరుని సంకల్పముల క్రోడీకరణమే కాలస్వరూపుని మూర్తివంతము. అతఁడభేద్యుఁడు. అతని తీక్ష్ణకిరణజాలము లోకమును వొక్కొక్కప్పుడు త్రాగుట కింతనీరైనను లేకుండునట్లుగను, సమస్త జీవరాసులు తల్లడిల్లునట్లుగను, భయంకరముగ ప్రసరించుచుండును. అట్టి సమయములయందే మానవులాదిగా గల జీవులు, ఆశయను వలలం జిక్కి, సోలి చివరకుఁ బ్రాణములు విడుచుచున్నారు. భూతపంచకము వాయువున లీనముకాఁగనే, చెల్లినది మహారాజైనను సరియే యాతని శరీరమును బండెడు కట్టెలమలంజేర్చి, యగ్నిని దరికొల్పి నిర్దాక్షిణ్యముగ దహింతురు. ఎంతకాలమునుండియో తన్ను ప్రేమమూర్తి యని భావించి, యొకనిముసమైనను విడువక, సదా తన యడుగు జాడలందే తిరిగిన భార్యయే పరిహరించిన నిఁక బంధుమిత్ర పుత్రాదుల సంగతి వేరచెప్పవలయునా? ఈతీక్ష్ణ కిరణజాలమే మరొకప్పుఁడు తేఁటవెన్నె

మై హాయిగూర్చెడి మలయమారుతమునుఁ దోడుఁ జేసికొని యోగు
ను సైతము విరహాగ్నితప్తులనుగాఁ జేసెడి శరదాత్రిత్రులుగాఁ బరి
గణింపఁబడుచుండును. మఱియొకప్పుఁడీ కిరణసమూహము గారడివాని
హస్తలాఘవమువలెఁ జిత్రగతుల నాడుచుఁ దుర్భేద్యముగాఁ గోచరిం
చును. కాలభానుని కిరణసమూహమే లోకమునకు వెలుఁగు.

కాలభానుఁడు తనయుదయ లేతకాంతులనుండి తీక్ష్ణకిరణములను లోకముపైఁ బ్రసరింపఁ జేసి నిదురవోయెడి జీవరాసులను లెండు లెండని లేపుచున్నవాఁడు. అతని కిరణజాలమునుండి తంతువుల రీతిగ ననేక కోటానుకోటుల జీవాణువులు భూమ్యాకాశములకు గతి భేదములుగ సంచారము సేయుచున్నయవి. వీటిగతుల నడకలే యోగులకు, భూత ప్రపంచమునకు నాదర్శప్రాయము. ఈ కిరణ ప్రసారమే అజ్ఞానావృతి నిద్రామత్తులకుఁ బ్రబోధించెడి యద్వైతామృతసారగాన పరంపరలు. ఇంతయేల ? ఈ కిరణసమూహము కాలభానుని రాజ్యదండనశాసన తుల్యము లనినం జాలును.

కాలపురుషుఁడు తలఁచినయన్నిఁటిని మార్పుచేయించును. అంతలో సృష్టిఁజేయును, తృటికాలమున నంతర్హితమొనర్చును, ఇచ్చకలదేని పెంపుఁజేయును, మూర్తివంతము ప్రాతర్మధ్యాహ్న సాయంకాలముల నెట్లు మారుచున్నదియో, యటులనే గతులు, భూతముల సృష్టిపరిణామములు మారుచుండును. అందులకు నేన సాక్ష్యమని ప్రొద్దుతిరుగుడు పూవులు గన్పట్టుచున్నయవి. అతని సంకల్పములకు బలములేదని యందుమేని యీ శరీరధారు లెచ్చటనుండి వచ్చిరి ? ఎచ్చటకుం బోవుచున్నవారు? గమ్యస్థానమెద్ది? లక్ష్యశుద్ధియేది? పరిహారమేది? మల్లెపూవు లిందులకు సాక్ష్యములు. పరిణామవర్తనముల ప్రీతినిమేషము ప్రబోధించుచున్నవి. కారణమేమి? ఎవ్విధమునఁ బ్రబోధించుచున్నవి? ఒకమారు దృష్టినటుల ప్రసరింపఁజేసిన నందుగల, అనఁగా మల్లెపూవుల జననము, పరిమళప్రచారము, వికాసపునవ్వులు, అంతలో సంభవించెడి పతనముఁగాఁగల వానియందలి యంతరార్థములు, స్ఫుటముగాఁ దెలియఁగలవు. అర్థముకలదని యందుమేని, గమ్యస్థానమెద్ది? పరిహార

మేది? యను భావములు పరంపరలుగాఁ దోచి జీవితలక్ష్యమునకుఁ బాట
వడఁజేయును. అట్టి లక్ష్యమార్గాన్వేషణకు వేదములుఁగాఁగలవి యుపక
రించును. ఈ వేదములు శాసనతుల్యములు కావున నంతగా నుపక
రింపవేమోగాని, యాధ్యాత్మిక చింతనమునకు నుపనిషన్మార్గము కంట
కావృతరహిత మార్గమువోలె నుపచరించుట తథ్యము. అటుల నుపక
రింపవేని యధ్యాత్మతత్త్వమును సమగ్రముగఁ బోధించెడి యుప
షత్తులు వ్యర్థములుకాక తప్పవు. శాసనము లొక్కొక్కప్పుడు ప్రజాభి
ప్రాయము ననుసరించి వ్యర్థములు కావచ్చుఁగాని, ప్రజాభిప్రాయ
రూపకంబులగు బోధలు వ్యర్థములుకావు. ఇంతకు ననంతముఖము
ననంతకిరణముల ననంతప్రకాశమైన తేజోరాశిని ప్రసాదించి
మాయావరణ నిద్రనుండి లేపిఁ శాశ్వతానందమును కల్పించుట కన
తుఁడేగదా! అతని యనంతమహిమ లన నంతుఁడే గొండాడవ
యును. మానవుల కా యనంతతత్త్వమును పరిశీలింప నసాధ్యము.

అద్వైతచిద్విలాస పరబ్రహ్మమూర్తి తన ఖేలనాప్రపంచ
ములో ఖేలనావస్తువులను వేనవేలుగ సమకూర్చుకొని వినోదరంగము
చిత్రవిచిత్రముగ నాట్యమొనరించుచు, నోంకార ప్రతిపాదకములగ
నుపనిషత్తులను పాడుచు భూతసృష్టిచేయుచున్నాఁడు. జీవులను సృష్టి
చుట యాతని వినోదములలో నొక్కటియ. ఈ వినోదసృష్టియే యనే
భిన్నభిన్న సాంప్రదాయకములుగను, భిన్నభిన్న వ్యక్తిత్వములుగన
పొడసూపుచున్నయది. భిన్నభిన్న సాంప్రదాయములయం దింతవ
కనేకజీవు లీ భూమికి వచ్చిరి; మరలఁ బోయిరి. ఎచ్చటనుండి వచ్చిరి
ఎచ్చటకుఁ బోయిరి? సృష్టిపరిణామ మెట్టిది? అని విచారించుమేని
యందులకుఁదగిన సమాధానము నిందే కానవచ్చుచున్నయది. ఎచ్చట
నుండి వచ్చెనో మరల నచ్చటికే పోవుచుండెనని గోచరింపకపోదు.

చర్విత చర్వణముగాఁ జావుపుట్టుకలను కల్పించుట, జీవునకు
పరంపరా సంప్రాప్తమైన ప్రారబ్ధకర్మముల ననుసరించియే యుండునని
శ్రుతిప్రామాణ్యము. అఘటనాఘటన సమర్థనీయమైన పరబ్రహ్మము
తేజోవంతమని యొప్పుకొనక తప్పదు. అతని యనంత ప్రకాశమైన

తేజోరాశి ప్రతిక్షణము సర్వజీవులయం దంతర్భూతముగనుండి మాట లాడుటు; నడచుటగాఁగల ప్రాపంచిక వ్యవహారములను చేయింపు చున్నయది. పరబ్రహ్మైక్య సంధానమునకీ తేజోరాశియే ప్రోత్సహించుచున్నది. అట్టి ప్రోత్సాహమే లేనిపక్షమున నీ లోకము లుండవు. లోకపాలురు, లోకులు నుండరు. లోకములే లేనప్పుడు లోకాంతరము లంతకుమునుపే పూజ్యంబగును. లోకములు లేవని యనఁగలమా? అనుటకుఁ జక్షురింద్రియములు మూతలు వడలేదు. స్ఫుటముగఁ గానుపించుచునే యున్నవి. చక్షురింద్రియములు తేజోవంతములుగ వెలుగుచున్నంతవరకు లోకములు కాన్పించుచునే యుండును. చక్షురింద్రియములు నోచిననోము ఫలించెనేని లోకాంతరములు తేజోగోళములుగ గానుపించు ననుటయు నిక్కువము. ఇందులకుఁ దామరసాక్షుల హృదయగోళములే ప్రబలప్రమాణములు.

వినోదముగఁ గల్పింపఁబడిన యీ భూతప్రపంచకమునకుఁ దివారాత్రములు కాలమును గుఱుతింప నేర్పడిన సంజ్ఞాస్వరూపములు. ఈదివారాత్రముల ననుసరించియే దినములు, వారములు, మాసములు, సంవత్సరములు, యుగములు చెల్లినవి. చెల్లుచున్నయవి. గతించిన యుగముల నంతములు. చెల్లనున్నవియు ననంతములే, లెక్కింప వీలు లేదు. లెక్కింపను లేము.

శ్రీ పరబ్రహ్మము, యిచ్ఛామాత్రముగ సృష్టింపఁబడిన యీ ప్రపంచమునకు, లోకాంతరములకుఁ జక్కని రాజబాటల నిర్మించినది. అట్టి రాజబాటల నడచిన వారలకు సుగతి కరతలామలకమని ప్రతిక్షణము యంతరాత్మలు హెచ్చరించుచున్నయవి. అట్టి రాజబాటలు శాసనతుల్యములగు వేదములుకాక వేఱొకటి కలవా? ఇందుఁ బురుషునకుఁ గావలసిన కామార్థములేగాక, ధర్మమోక్షములును కలవు. అనఁగా వేదమతానుష్ఠానపరుఁడు ధర్మార్థకామమోక్షములను సాధింపగలఁడని భావము. ఈ చతుర్విధ పురుషార్థములు జీవికి మైలురాళ్ళవంటివి. గమ్యస్థానముం దెల్పుటకు మైలురాళ్ళెవ్విధమున నుపయోగించునో, తద్విధముగనే చతుర్విధ పురుషార్థము లుపయోగించును.

మోక్షాసక్తులగు జీవులు కామార్థములను పరిత్యజించి, ధర్మమోక్ష మార్గము లనుసరించి శాశ్వతానంద కైవల్యము నందెదరు. లోకవాసనలఁ జవిచూచు జీవు లీ చతుర్విధ మార్గముల ననుసరించును.

యుగయుగములనుండియు నింతవఱకుఁబోయిన జీవులెల్లరీ చతుర్విధముల ననుసరించిరి. ముందువారును ననుసరించియే తీరెదరు. గత మహాయుగములయం దుద్భవించిన మహాపురుషులును, ప్రకృతమునందున్న మహనీయులు నిందులకు సాక్షులు.

మహాపురుషులు భగవదంశసంభూతులు. కావుననే వారినడకలు చిరస్మరణీయము లగుచున్నవి. వారియాదర్శములు స్తుతిపాత్రము లగుచున్నవి. వారిబోధలు శిరోధార్యము లగుచున్నవి. అట్లు కానిపక్షమున నెన్నెన్ని జీవము లుద్భవింపలేదు; ఎన్నిజీవములు గతించలేదు? తుదకు నట్టి జీవుల నామముల నైనను వినగలుగు చున్నవారమా? కామార్థములు పశుతుల్య సమాన జనితములు కావున నామార్గమున నడచిన జీవుల కట్టి గతులు సంప్రాప్తములైనవి. ధర్మమోక్షముల సాధించిన పుణ్యపురుషులు లోకాంతరములనే వశపరచుకొనిరి. యోగులగు పురుషులే లోకాంతర రాజ్యముల నేలుచు పరమహంసలుగ పరిగణింపఁబడుచున్నవారలు. లోకములు, లోకాంతరములు దృష్టిభేదము ననుసరించి కానుపించునేగాని, ప్రత్యేకముగఁ గానుపించునవి గావు. అన్నియు మేదోమాంస శుక్లశోణిత మిశ్రరూపంబగు స్థూలశరీరములందే కలవు. ఆధ్యాత్మిక చింతన కలదేని సర్వము గోచరించునని గ్రహించుటలగ్గు.

అనంతశయనుఁడు లీలావినోదుఁడై కోటానుకోటుల జీవుల సృష్టిఁ జేయుటలో ననేకులు జన్మించిరి. జనియించినవారిలోఁ బుణ్యులు పాపులుకలరు. పుణ్యమూర్తులగువారలు యోగులు; పరమహంసలు. వీరల జీవితలక్ష్యములే సర్వదా యనుష్ఠేయమార్గములు. ఇట్లనీయే శ్రుతుల రూపమున పురుషోత్తముఁడు గాన మొనరించినాఁడు. ఆగాన ధ్వని నేఁటికిని, తేఁపటికిని చల్లారకుండఁగ జేగీయమానముగ ననంత ముఖములఁ బ్రతిధ్వనుల నిచ్చుచున్నది. ఆగానస్వరూప మేప్రణవము.

...ణవమూర్తులే యోగులు; పరమహంసలు. ఈపరమహంసల శుభా
...ర్వాదములే భారతీయుల యందావహించిన వీరరసోద్రేకగుణములు.
...ర్య, స్థైర్య, శమ, దమాదిగుణములు పుంజీభవించిన వీరావతారములే
...నాఁటి భారతీయవీరగుదాప్రవతారములు. అట్టి వీరావతారములకుం
...లములు మహనీయుల యాశీర్వాద బలములే యని గట్టిగ నమ్మ
...చ్చును మహనీయుల యాశీర్వాద బలము లింకను నశింపలేదనుటకు
...నాఁటి భారతీయుల స్వాతంత్ర్య వాంఛలే ప్రబల ప్రమాణములు.

ఆర్యావర్తమున జన్మించిన మహనీయులెల్లరుఁ బరమే
...రుని సృష్టిలోని వారని యెల్లరకుం దే టతెల్లంబ. ఏపరమేశ్వ
...నిచే సృజింపఁబడి, మరల నే పరమేశ్వరునియం దైక్యమగుటకుం
...ప్రయత్నించి, యందుఁ గృతకృత్యులైరో యట్టివారలే మహనీయులగు
...రమహంసలు. ఈ పరమహంసలే హిందూమతమున కాపాదిల్లిన
...బ్రములను పారద్రోలి యనపాయముగ నిలువంబెట్టిన మతకర్తలు.

మతకర్తలలో 1 బుద్ధుఁడు. 2 శ్రీశంకరాచార్యులు.
... రామానుజాచార్యులు. 4 మధ్వాచార్యులు ముఖ్యులు. వీరు ప్రాచీ
...లు. అర్వాచీనులలో శ్రీరామకృష్ణ పరమహంస, స్వామివివేకానంద
...ప్రభృతులు కలరు.

ప్రాచీన మతకర్తలలోఁ బైఁ దెలిపినవారిలో నాస్తికమతమగు
...ద్ధమతమును నిర్మూలించి, షణ్మతముల నంగీకరించి, హిందూమతమును
...లువంబెట్టిన వారిలోముఖ్యులు శ్రీశంకరభగవత్పాదులు. ఇటీవల రెండు
...వత్సరముల క్రితము యొక కవి జీవితమును వ్రాయుటకు కీ॥ శే॥
... వి. లక్ష్మణరావు పంతులుగారిచే రచింపఁబడిన హిందూదేశ కథా
...ంగ్రహము, ప్రథమ భాగ మనంబడు హిందూ మహాయుగమును
...ంచుచుండగా నందు 256 వ పేజీ యందు శంకరాచార్యులగూర్చి—

"విశ్వ విఖ్యాతుఁడగు నీ మహానుభావుఁడు శివుని యవతార
...యుఁ గుమారిల భట్టుయొక్క చరమదశయం దుదయించెననియు
...న హిందువుల యభిప్రాయమై యున్నది. ఇతఁడు క్రీ. శ. ౭౮౮ తా

ద్దంబున నుదయించియుండు. ఇతఁడు మళయాళ బ్రాహ్మణుఁడు (1) *
ముప్పది రెండు సంవత్సరములు మాత్రము జీవించియుండి బ్రహ్మ
చర్యమునుండియే సన్న్యాసియై ఆ సేతుహిమాలయ మంతయుఁదిరిగి పర
మత ఖండనమును, స్వమతమండనముఁ జేయుచు నీ దేశములోని బౌద్ధ
మతము పూర్తిగా నడుగంటఁజేసెను. విష్ణువు, గణపతి, మొదలగు
దేవతలందఱను భేదములేక పూజింపవలయు నని పౌరాణికమతమును
బోధించెను ఇతఁడు బౌద్ధదర్శనములోని యనేకసిద్ధాంతములను
గ్రహించియు, బుద్ధుఁడు 2 * విష్ణువుయొక్క దశావతారములలో
నొక్కయవతారమని వచించియు ననేకబౌద్ధులను హిందువులుగ మార్చె
ననియెదరు."

అను వాక్యములు కానుపించినవి. వెంటనే విస్మయమును కలి
నది. నిజముగ శంకర భగవత్పాదులు వర్ధిల్లిన కాల మిదియేనా? యను
సంశయమును కలిగినది. సంశయ పరిహారమునకై బహుగ్రంథము
నవలోకింపవలసి వచ్చినది. శంకరాచార్య జీవిత నిర్ణయమునకుఁగాను
గ్రంథావలోకనమునందే రెండు సంవత్సరములు చెల్లినవి. నేఁ జూచి
గ్రంథము లన్నిటియందును పరస్పరవిరోధములు కానుపించినవి. పలు
వురు పండితులు పలువిధములుగా వ్రాసిరి. పండితు లివ్విధమునఁ బలు
పోకడలు పోవుటకుఁదగిన కారణములను చూపుచు వచ్చిరి. ఒక గ్రంథ
ములోని సిద్ధాంతముల ననుసరించి మరియొక గ్రంథములోని సిద్ధాంత
ములకు సరిపడకపోగా, సమన్వయించుటకును వీలు కానుపింపలేదు
ఏవంవిధకారణములచే మదీయాంతర్వాణి ప్రబోధించినటుల వా

1 * శంకరాచార్యుఁ డాంధ్రుఁడను యొక వదంతికలదు. ఇందలి సత్యాసత్యము
లను బాగుగా పరిశీలించి ముందొక వ్యాసమును వ్రాయుదును. నిజమునకు శంకరు
డాంధ్రుఁడే యైనపక్షమున యాంధ్రులు గర్వించతగినదియే!

—అ. సు. శర్మ.

2 * ఈ బుద్ధుఁడు విష్ణువుయొక్క దశావతారములలోని వాఁడుగాఁడు; యు
త్రిపురాసుర సంహారసమయమునం దుద్భవించిన బుద్ధుఁడే విష్ణువుయొక్క దశా
వతారములలోని వాఁడనియుఁ గొందఱి యభిప్రాయము. సత్యము విచార్యము.

—అ. సు. శర్మ.

వారి సిద్ధాంతములఁజూపుచు, సత్యసమ్మతము లని తోఁచినరీతిగ వ్రాయు చున్నాఁడను. నా యీ వ్రాతలే సిద్ధాంతము లని యనను. కాని సత్యములని తోఁచిన సిద్ధాంతములనే యిందు వ్రాయుచున్నాఁడనని విజ్ఞాపనము. విబుధలోకము సత్యములనే యంగీకరించునని మదీయాశయము.

"సకలార్థసాగర"మను గ్రంథమునందు శ్రీశంకరులు కలియుగమున 3058 వ సంవత్సరమునకు సరియైన ఈశ్వరనామసంవత్సర వైశాఖశుద్ధ పంచమీ భానువాసరమున నార్ద్రానక్షత్రమునందు జన్మించినట్లు వ్రాయంబడి యున్నది. ఈకాలము క్రీస్తుకు పూర్వము 44 వ సంవత్సరముగ నేర్పడును.

—"ఆర్యవిద్యాసుధాకర"మను గ్రంథమున యజ్ఞేశ్వరశాస్త్రిలుగారు:-

శ్లో॥ నిధనాగేభ వహ్న్యబ్దే విభవే మాసి మాధవే,
శుక్లేతిథౌ దశమ్యాంతు శంకరార్యోదయః స్మృతః.

కలియుగమున క్రీస్తుకు పూర్వము 788 వ సంవత్సరమునకు సరియగు 3889 కి సరియైన విభవ నామ సంవత్సర వైశాఖశుద్ధ దశమి రోజున శంకరాచార్యు లవతరించి రని వ్రాసిరి.

"భారతి" (సంపుటము-2, సంచిక-5,) యందు నీలకంఠశాస్త్రిలవారి "శంకరమందారసౌరభ"మను గ్రంథములోని దని యీ దిగువ శ్లోకము నుదహరించి, యీ క్రిందివిధమున వ్రాయంబడినది.

శ్లో॥ ప్రాసూత తిష్యశరదా మతియాతవత్యా
మేకాదశాధికశతోన చతుస్సహస్ర్యామ్
సంవత్సరే విభవనామ్ని శుభే ముహూర్తే
రాధేసితే శివగురో ర్గృహిణీ దశమ్యామ్.

కలియుగమునందు 3889 కి సరియైన విభవనామ సంవత్సర వైశాఖశుద్ధ దశమిరోజున శుభముహూర్తమునందు శివగురు దీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ ప్రసవించినది, అని ప్రకటింపఁబడినది.

టి. యస్. నారాయణశాస్త్రి, బి. ఏ. బి. ఎల్.గారు "ఏజ్ ఆఫ్ శంకర"యను గ్రంథమున, శంకరాచార్యులు కలియుగమునందలి 2593 కి

సరియగు క్రీ. పూ. 509 లో నందననామ సంవత్సర వైశాఖశుద్ధ పంచమీ పునర్వసు నక్షత్రముతోఁ గూడిన శుభదినమునందు కర్కాటకలగ్నమునం దవతరించినట్లు వ్రాసిరి.

కే. యస్. రామస్వామిశాస్త్రి, బి. ఏ. బి. ఎల్ గారు రచించిన 'శంకరాచార్యచరిత్రము'న శ్రీ శంకరాచార్యులవారు వృష దేవవర్మ యొక్క ప్రభుత్వకాలములో నేపాళరాజ్యమునకు విజయము చేసినట్లు, నేపాళ దేశశాసనమువలనఁ దెలియవచ్చుచున్నదనియు, దీనింబట్టి యా నేపాళదేశపురాజు వృష దేవవర్మ క్రీ. పూ. 500 సంవత్సరములకు బూర్వము రాజ్యము చేయుచున్నట్లును, ఇత్యాది హేతువులతో క్రీ. పూ. 509 లోనే శంకరులవారు జన్మించియుండు నని వ్రాసిరి.

కీ. శే. హానరబిల్, కె. టి. తెలాంగు, బొంబాయి హైకోర్టుజడ్జి గారు "ఇండియన్ ఆంటిక్వరీ"యందు శ్రీశంకరాచార్యులవారి భాష్యమునందుఁ బాటలీపుత్ర నగరమునుంగూర్చి, పూర్ణవర్మయను బౌద్ధప్రభువును గూర్చి వర్ణింపఁబడియుండుటచేతను, పాటలీపుత్ర నగరము క్రీ. పూ. 756 లో నదీ ప్రవాహమునందు నశించియుండుటంబట్టియు, పూర్ణవర్మ క్రీ. పూ. ఆరవశతాబ్దాంతమున మగధదేశమును పాలించియున్న వాఁడగుటచేతను, శ్రీశంకరులు క్రీ. పూ. 6 వ శతాబ్దాంతముననే వర్ధిల్లియుండవలయునుగాని క్రీ. పూ. 788 లో జన్మించి రనుమాట విశ్వసింప దగినదికా దని వ్రాసిరి.

"శంకరేంద్ర విలాస"మను గ్రంథమున—

శ్లో॥ హాయనేఽథ విభవే వృషమాసే శుక్లపక్షదశమీదినమధ్యే,
శేవధిద్విపదశానలవర్షే తిష్య ఏవ ముదసోష్ట విశేషా.

కలివత్సరంబులు 3889 కి సరియగు క్రీ. పూ. 788 కి సరియైన విభవనామ సంవత్సరమున వృషభమాసమునందు శుక్లపక్షదశమి రోజున పుష్యమీనక్షత్ర శుభదినమున నభిజిన్ముహూర్తమునం దితనిని కనె నని వ్రాయంబడియున్నది.

ఇంతవఱకుఁ జూపిన దేశీయపండితుల సిద్ధాంతములందే యనేకాపభ్రంశములు కలవు. ఇఁక పాశ్చాత్యుల యభిప్రాయముల నుపహరించెదను.

ప్రొఫెసర్ మాక్సుముల్లర్, "India and what it can teach us" యను గ్రంథమునందు శంకరులు క్రీ. పూ. 788 వ సంవత్సరమున జన్మించి రని వ్రాసెను.

ప్రొఫెసర్ వీబర్, "హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిటరేచర్" అను దానియందు క్రీ. పూ. 8 వ శతాబ్దములో శంకరులు జన్మించి రని లిఖించెను.

డాక్టర్ ఫ్లీట్, "ది ఇండియన్ ఆంటిక్వరీ" యను దానియందు క్రీస్తుకు పూర్వము 8 వ శతాబ్దమునందు శంకరులు జన్మించె నని వ్రాసినాఁడు.

డాక్టర్ బర్నెల్, "ఎలిమెంట్స్ ఆఫ్ సౌత్ ఇండియన్ పాలియోగ్రఫీ" యను దానిలో క్రీస్తుకు పూర్వము శంకరాచార్యులు 8 వ శతాబ్దమున జన్మించె నని లిఖించెను.

ప్రొఫెసర్ విల్సన్, "విల్సన్స్ యస్సేస్" అను గ్రంథములో ననేక పండితుల యభిప్రాయముల నుదహరించి చర్చించుచుఁ దుదకు క్రీస్తుకు పూర్వము 8-వ శతాబ్దమువాఁడే శంకరుఁ డని సిద్ధాంతపరిచెను.

మిస్ అనిబిసెంటు, ఇద్దరు శంకరాచార్యులు కల రనియు, మొదటి శంకరులు 2500 సంవత్సరములకిందట జన్మించి మత సంబంధములగు నుపన్యాసములను గావించెననియు, రెండవవారు క్రీ. పూ. 7-వ శతాబ్దములో జన్మించి భాష్యాదులు వ్రాసి రనియు లిఖించెను.

పై యింగ్లీషుపండితుల వ్రాఁతలకన్న నీమెవ్రాత మరింత విపరీతముగా నున్నయది. శంకరాచార్యు లిరువు రున్నట్లు ప్రాచీనహిందూ సాంప్రదాయ గ్రంథములయందు వ్రాయంబడి యుండలేదు. ఈయమ గారి కెచ్చటనుండి యిరువురు శంకరులు కల రను నాధారములు లభ్యపడినవో యెఱుంగరాదు.

ఇంతవఱకుం జూపిన గ్రంథములందు శంకరాచార్య కాలనిర్ణయమునుగూర్చిన యభిప్రాయములు పరస్పర విరుద్ధములుగఁ గానుపించుచున్నయవి. కావున ప్రాచీన సంస్కృతగ్రంథములఁ బరిశోధింతము.

వ్యాసాచల కవి రచియించిన "శంకరవిజయ" మను కావ్యమున,

శ్లో॥ అబ్దే కలే రసలవర్ష శరాక్షిసంఖ్యే
శ్రీనందనే దినమణా వుదగధ్వభాజి
రాధేధి పంచమితిథా వసితేతరాయాం
వారే రవే రదితిభే శుభయోగయుక్తే

శ్లో॥ లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారం
శ్రీపార్వతీవ సుఖినీ శుభవీక్షితేచ,
జాయాసతీ శివగురో ర్నిజతుంగసంస్థే
సూర్యే కుజే రవిసుతే చ గురౌచ కేంద్రే.

కలియుగమునందు 2593 వ సంవత్సరమునకు సరియగు నందన నామ సంవత్సరమునందుత్తరాయణమున వైశాఖ శుద్ధ పంచమీ ఆదిత్య వాసరమున పునర్వసూనక్షత్రయుక్త శుభలగ్నమునందు, సూర్యాంగారకశనైశ్చరగ్రహము లుచ్చస్థితి నుండగా, గురువు కేంద్రమును బొందియుండగాను, శివగురుదీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ, పార్వతీదేవి కుమారస్వామిని గనిన యట్లు లోక పుత్రుని గనెను. మఱియు నిదే గ్రంథమునందు శ్రీశంకరాచార్యులవారు సిద్ధి నొందిన కాలమును నీ క్రింది విధముగ వ్రాయంబడియున్నది.

శ్లో॥ వర్షే కలే శ్శరవిలోచన శాస్త్రనేత్రే
రక్తాక్షినామ్ని వృషశుక్ల ముకుందతిథ్యామ్,
గచ్ఛన్ సజాతు సవిధే పరదేవతాయాః
త్యక్తుం సమైచ్ఛ దథ భౌతిక మాత్మదేహమ్.

కలిలో 2625 వ సంవత్సరమునకు సరియైన క్రీ. పూ. 477 కు సరిపడు రక్తాక్షినామ సంవత్సర వైశాఖ శుద్ధ ఏకాదశీ దివసమున, శ్రీకామాక్షీ దేవ్యాలయమున నుండు సమయంబున, నాకస్మికముగ శ్రీశంకరులు భౌతికశరీరమును పరిహరింపఁ దలఁచి........మర్త్య శరీరమును విడిచి బ్రహ్మైక్యము నందెను.

ఈ వ్యాసాచల కవి వ్యాసాచల క్షేత్రవాసి. సారంగపాణి తన యుఁడు. సర్వజ్ఞవిష్ణు వసియెడు మరియొకనామమును కలవాఁడట. వీరు

విద్యాతీర్థులను నపరనామ ధేయముతోఁగాంచి కామకోటి పీఠము నలంక రించెను. విద్యారణ్యులకుం గురువులు, ఆనందగిరి ప్రణీత మగు "శంకర విజయము"నందు—

శ్లో॥ ఈశోఽప్యభూ త్సమదవిద్వద భేద్యదర్ప
సర్వాహితుండికవిదగ్ధసహస్రసేవ్యే
విద్యాధిపత్యపరనామ్ని కులే శివాఖ్యాత్
ఆర్యాపతే రవిసహస్రరుచిః కుమారః

శ్లో॥ తిష్యే ప్రయాత్యనల శేవధి బాణనేత్రే
యో నందనే దినమణా వుదగధ్వభాజి
రాధేఽదితే రుడుని నర్గతమంగలగ్నే
ప్యాహూతవాన్ శివగురు స్స శంకరేతి.

కలియుగమునందు 2593 వ సంవత్సరమునకు సరియగు నందన నామసంవత్సర వైశాఖశుద్ధ పంచమి రోజున పునర్వసునక్షత్రయుక్త కర్కాటక లగ్నమునందు శివగురుని దీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబగర్భమున శంకరులు జన్మించిరని పై శ్లోకములకు సంగ్రహ తాత్పర్యము.

మఱియు నానందగిరి తన శంకర విజయమునందే శంకరులు సిది బొందిన కాలము నివ్విధమున వ్రాసియున్నాఁడు.

శ్లో॥ కల్యబ్దైశ్చ శరేక్షణాధ్వనయనైః సత్కామకోటిప్రదే
పీఠే న్యస్య సురేశ్వరం సమవితుం సర్వజ్ఞసంజ్ఞం మునిమ్
కామాక్ష్యా స్సవిధే సజాతు నివిశ న్నున్ముక్తలోకస్పృహో
దేహం స్వం వ్యపహాయ దేహ్యసుగమం ధామ ప్రపేదే పరమ్.

కలియుగ గతాబ్దంబులు 2625 కు సరియగు క్రీ. పూ. 477 వ సంవత్సరమున శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు కాంచికామకోటి పీఠమునందు సర్వజ్ఞమునియను వానినిఁ దమకు వెనుకటి యాచార్యు లనుగా నియమించి, వారు వయస్సునం జిన్నవారగుటం జేసి। వారికి సంరక్షణ కర్తగా సురేశ్వరాచార్యులను వారిని నియమించి శ్రీకామాక్షీ దేవ్యాలయమున మానవుల కలభ్యమైన బ్రహ్మైక్యము నందెను.

ఈగ్రంథమును వ్రాసిన ఆనందగిరి శ్రీశంకరులవారి భాష్యము కును, సురేశ్వరాచార్యులవారి వార్తికములకును వ్యాఖ్యాన మొ రించెను. 'ఆనందజ్ఞాను'లను నపరనామముతోఁ గానుకోటిపీఠ మ ష్ఠించినాఁడు.

ఈరెండు గ్రంథములందును జననకాలము, సిద్ధినొందిన కాల నొకే విధముగ నున్నవి. లగ్నమునందు మాత్రము భేదములు కల ఈ రెండు గ్రంథములకుఁ బూర్వగ్రంథ మగు శ్రీచిత్సుఖాచా "బృహచ్ఛంకరవిజయము"లో నీ క్రిందరీతిని వ్రాయంబడి యున్న

శ్లో॥ తత స్సా దశమేమాసే సంపూర్ణశుభలక్షణే
షడ్వింశే శతకే శ్రీమద్యుధిష్ఠిరశకస్యవై

శ్లో॥ ఏకత్రింశేథ వర్షేతు హాయనే నందనే శుభే
మేషం రాశిం గతే సూర్యే వైశాఖే మాసి శోభనే.

శ్లో॥ శుక్లపక్షేచ పంచమ్యాం తిథ్యాం భాస్కరవాసరే,
పునర్వసుగతే చంద్రే లగ్నే కర్కటకాహ్వయే.

శ్లో॥ మధ్యాహ్నే చాభిజిన్నామముహూర్తే శుభవీక్షితే,
స్వోచ్ఛస్థే కేంద్రసంస్థేచ గురౌ మందే కుజే రవౌ.

శ్లో॥ నిజతుంగగతే శుక్రే రవిణాసంగతే బుధే,
ప్రాసూత తనయం సాధ్వీ గిరిజేవ షడాననమ్.

శ్లో॥ ఉదయాచలవేళేవ భానుమంతం మహౌజసం,
దుర్నిరీక్ష్యం స్వతేజోభి ర్భాసయంతం దిశోదశ.

ఈ క్రిందరీతి శంకరుని జాతకకుండలి తయారగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| శు | రబు | | చం |
| | శ్రీశంకరాచార్యుని జాతకకుండలి | | లగు |
| కు | | | |
| | | శ | |

అంతట శుభలక్షణములతోఁ గూడి దశమమాసము చేరువకాఁగా యుధిష్ఠి శకాబ్దంబులు 2631-కి సరియగు క్రీ. పూ. 509-వ సంవత్సరమగు నందననామ సంవత్స వైశాఖశుద్ధ పంచమీ భానువాసరము నాఁడు, పునర్వసు నక్షత్రముతోఁ గూడిన నభిజిన్ముహూర్తంబునఁ గర్కాటకలగ్నము నందు, రవి, కుజ, గురు శనైశ్చరగ్రహము లుచ్చస్థితిని బొందియుండ,

ను, శుక్రుఁ డుచ్చస్థానమునం దుండగను, బుధుఁడు మేషరాశియందు
తోఁ గూడియుండఁగ, శివగురుదీక్షితునిభార్య ఆర్యాంబ పుత్రుని
నెను.

వెండియు బృహచ్ఛంకర విజయ మను నిదే గ్రంథమున శ్రీచిత్సు
చార్యులవారు, శ్రీశంకరాచార్యులు సిద్ధినొందిన కాలమును నీక్రింది
ధముగఁ దెలిపియున్నారు.

శ్లో॥ వహ్న్యబ్ధ్యశాగ్రనయనాంక యుధిష్ఠిరాబ్దే
ద్వాత్రింశతంహి శరదో ధరణీం విభూష్య,
శ్రీశంకరేంద్రగురురాట్ శ్రితరాజసేనః
సంశిష్య ధర్మ మఖిలం శివతాం ప్రపేదే.

యుధిష్ఠిరశకాబ్దంబులు 2663 కి సరియగు క్రీ. పూ. 477 వ
సంవత్సరములో కామాక్షీ దేవ్యాలయమునందు, శంకరులు మానవశరీ
రమును విసర్జించి బ్రహ్మైక్యము నందిరి.

చిత్సుఖాచార్యు లాదిశంకరులకు సహాధ్యాయులు. పైఁగాఁ
ప్రథమశిష్యులును, గోకర్ణక్షేత్రనివాసి. విష్ణుశర్మయను నపరనామధేయ
ముతో శ్రీశంకరుల వెంబడి శ్రీగోవిందభగవత్పాదాచార్యులవారి
సన్నిధికిం జేరి, శంకరాచార్యనిర్యాణమువఱకు వెంటనుండినట్లు, శంక
రుని కన్నఁ గొంతపెద్దయైనట్లు, పై గ్రంథమువలనఁ దెలియనయ్యెడిని.
శంకరాచార్యులు నిర్యాణమొందిన తదుపరి ద్వారకానగరమందలి
శారదాపీఠమును బ్రహ్మస్వరూపాచార్యులకు దరువాతఁ గలియుగమున
2654 వ సంవత్సరమునకు సరియగు క్రీ. పూ. 434 లో యెనుబది సంవ
త్సరముల వయస్సున సిద్ధిఁ జెందిరి.

పై రెండు గ్రంథములకును, దీనికిని సిద్ధినొందినకాలము భేదించు
చున్నయది. చిత్సుఖాచార్యులు శంకరాచార్యులకుఁ బ్రథమశిష్యులు.
శంకరులు సిద్ధినొందువఱకు విడువక విడువక వెంటనుండి జననము
మొదలు, నిర్యాణమువఱకుఁ జరిగిన శంకరుని చర్యలెల్లను, బృహ
చ్ఛంకరవిజయమునఁ జూచి వ్రాసినవాఁడు కావున నీగ్రంథము సత్యము
కు దూరమగునది కాదని యస్మదాదుల నిశ్చితాభిప్రాయము.

కీ: శే కే. వి. లక్ష్మణరావుపంతులుగారు తలంచియున్నట్లును, పాశ్చా
పండితులు వ్రాసినట్లును, దేశీయచరిత్రకారులు నవీనుల్లు వ్రాసినట్ల
శ్రీమదాది శంకరులు 7, 8, 6, శతాబ్దంబులకుం జెందినవారుకారు.

మన హిందూసాంప్రదాయములను నిర్ధారణమొనర్చుపట్ల
హిందూరాజులయొక్కయుఁ గవులయొక్కయు, మతకర్తలయొక్కయు
జీవితాదిచరిత్రములను వ్రాయుటకుం దగిన యాధారములు హైం
గ్రంథములే కాని, పాక్షికదృష్టితో వ్రాయఁబడిన పాశ్చాత్త్యుల య
భ్రంశసిద్ధాంతగ్రంథము లాధారములు కావు. పాశ్చాత్త్యాదర్శము
సర్వత్ర నిండియుండి, కేవలముద్వితీయ పాశ్చాత్త్యులవలె సర్వవిషయ
లందు సంచరించెడి భారతీయాంగ్లమానసపుత్రుల వ్రాఁతలు
నాధారములుకావు. వీరి వ్రాఁతలు నిరాధారములే! ప్రాచీనగ్ర
ములను బరిశోధించి పూర్వాపరసమన్వయములతో వ్రాయవలయు
గాని, ప్లీటు, మాక్సుముల్లర్ మున్నగాఁగల దొరలు వ్రాసిన వ్రా
లనే యాధారములుగాఁ గొని ప్రాచీనసిద్ధాంతము లపసిద్ధాంత
లని వ్రాయుట కడుశోచనీయము. మఱియు నేపాళదేశరాజవంశచ
మవలోకించిన, వృష దేవవర్మకాలమున శ్రీ శంకరులు నేపాళరా
లక్ష్మిని తరింపఁజేసినట్లును దెలియవచ్చెడిని. వృషవర్మ క్రీ. పూ. 
సంవత్సర ప్రాంతములవాఁడు.

బృహచ్ఛంకర విజయములో, మగధరాజ్యము నేలిన యాం
వంశపురాజులలోఁ బదునేడవవాఁడగు "హాలుని" కాలములో శ్రీ
రాచార్యు లుండినట్లు వ్రాయంబడియున్నది. హాలుఁడు యు
ష్ఠిరశకము 2644-కి సరియైన క్రీ. పూ. 495 మొదలు 2649-కి సరియ
క్రీ. పూ. 490 వఱకు రాజ్యమును పాలించినవాఁడు. ఇట్లని మత్స్య
విష్ణు, బ్రహ్మాండ పురాణములు తెల్పుచున్నయవి.

జైనమత సాంప్రదాయకుఁడైన ద్వారకాధిపతియగు సుధ
మహారాజు, కుమారిల భట్టాచార్యులవారివలన యుధిష్ఠిరశకము 2
సరియగు క్రీ. పూర్వము 490 లో శ్రీ శంకరులవారికి శిష్యుఁడయ్యె
అది మొదలు శంకరులు పోయిన తావులకెల్లఁ బోవుచు యుధిష్ఠిరశకము

2663 కి సరియైన క్రీ. పూ. 478 లో "విజ్ఞానపత్రిక" యను తామ్ర శాసనమును ప్రకటించెను. ఇందు శంకరుని మహిమలను వినుతించినాఁడు.

కుమారిల భట్టాచార్యులవారిని శంకరాచార్యులు చూచిన కాలము 'జినవిజయ'మను గ్రంథమునఁ గలదని 'సంస్కృతచంద్రిక' 9 వ సంపుటములో.

శ్లో॥ పశ్చాత్ పంచదశే వర్షే శంకరస్య గతే సతి,
భట్టాచార్యకుమారస్య దర్శనం కృతవాన్ శివః.

శంకరులవారికి పదునేను వత్సరములు నిండినతరువాత వారు ప్రప్రథమమునఁ గుమారిలభట్టాచార్యులవారిని దర్శించిరని వ్రాయంబడినది. ఈ కాలము, అనఁగా క్రీ. పూ. 494 కుమారిల భట్టాచార్యులవారికి యవసానకాలము. మఱియు నిదే గ్రంథమునందు శంకరుని నిర్యాణ కాలమును నీ క్రింది విధమునఁ దెలుపంబడి యున్నది.

శ్లో॥ ఋషి ర్బాణ స్తథా భూమి ర్మర్త్యాక్షౌ వామమేళనాత్,
ఏకత్వే నలభేతాంక స్తామ్రాక్ష స్తత్ర వత్సరః.

కలియుగ శతాబ్దంబులు 2625 వ సంవత్సరమునకు సరియైన యుధిష్ఠిరశకము 2157 కి సరిపడు రక్తాక్షినామ సంవత్సరమునం దనఁగా క్రీ. పూ. 477 లో శంకరులు సిద్ధినొందిరి. మెండియు నిదే గ్రంథము (జినవిజయము) సుధన్వ మహారాజునుగూర్చియు వ్రాసినది.

"పుణ్యశ్లోకమంజరి" "గురురత్నమాల" యను ప్రాచీన గ్రంథము లందును నిదే కాలము వ్రాయంబడియున్నది.

ప్రబలము లగు పై శంకరవిజయాది ప్రాచీన గ్రంథముల ప్రమాణముల ననుసరించి శ్రీశంకర భగవత్పాదులవారి కాలము క్రీ.పూ. 509 మొదలు, 477 వఱకని నిశ్చితమైన సిద్ధాంతమని యెఱుంగ దగును. ఇంతియేగాని, లేని పోని కల్లసిద్ధాంతముల పైకిఁ దెచ్చి, ప్రాచీనగ్రంథములఁ ద్రోసిపుచ్చి, వెఱ్ఱిమొఱ్ఱిసిద్ధాంతములను లోకమున వెదఁజల్లుటకు పాశ్చాత్య విద్యలే కారణ మని గ్రహించుట న్యాయము. గీర్వాణభాషఁ జదువక, నందుఁగల్గు విషయములను మన నము చేయక యిదియే సిద్ధాంతమని నమ్మింపఁ జూచుట లోకమును

మోసపుచ్చుటయే యగును. అట్లు కాదేని షణ్మతముల నుద్ధరించి, విశేషించి హిందూమతోద్ధారకుఁడై వెలసిన శ్రీ శంకర భగవత్పాదుల వారి జీవితము నిట్లు పలువురు పండితులు పలుమార్గముల వ్రాయుట సంభవించియుండదు.

సత్యాన్వేషణ తత్పరులారా!

ఈవ్యాసమునందుఁ బూర్వాధునిక పండితుల వ్రాఁతలను జూపించి యుంటిని. ప్రాచీనగ్రంథముల ప్రమాణములను చూపియుంటిని. మదీయహృదయవాణి సత్యసమ్మతము లని ప్రబోధించిన రీతిగ శంకర విజయాదిగ్రంథముల వ్రాఁతలే ప్రమాణము లని ఋజువుచేసియుంటిని. కాని, నా యీవ్రాఁతలే సత్యసిద్ధాంతము లని మిమ్ము నమ్మించుట లేదు. ఇందుగలమార్గము లపసవ్యములని తోఁచెనేని సప్రమాణముగ సత్యమార్గములఁ బ్రదర్శింతురని వేఁడుచున్నాఁడను. ప్రమాదో ధీమతా మపి యను నుడికారము మీ రెఱుంగనిదికాదు. మనకుఁ గావలసినది లోకారాధ్యుఁడైన శంకరాచార్యుని సరియైన జీవితకాలము. వ్యక్తిగత పాక్షిక పోరాటములు కాదు.

ప్రమాదములను మన్నింప వేఁడుచు, సత్యములను వెల్లడింతురని మఱియొకసారి శిరసాగ్గి యింతటితో విరమించుచున్నాను.

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు."

మంగళం మహత్.

శ్రీ శ్రీ శ్రీ



# శీతర్తునతి

కొడుకవోలు వెంకట సుబ్బారావుగారు బి. ఏ.

సీ॥ కంటకు వెల్గులతేని కరసహస్రిము మట్టి
ప్రీతిహోతుని పండ్లు విఱుగఁగొట్టి
యనిలదేవుని కాళ్ళ కధికజాడ్యముగొల్పి
రాత్రిల నమితదీర్ఘముగ సల్పి
మునుఁగు ముచ్చటల మురుమ్మరకోష్ణములఁ జేసి
ప్రకృతికి మంచు వజ్రాలు వోసి,
పాంథ చిత్తవియోగ భర మగ్గల మొనర్చి
వార్ధకమ్మనకుఁ గంపనము గూర్చి,

గీ॥ పడుచువారల క్లిష్టదై వంబ వగుచు
పడుకటిండ్లలో మూలలం దడగి యొదిగి
సంచరించెడు శీత ర్తు సార్వభౌమ!
కొనుము కొనుమయ్య మా యేటికోళ్లు గొనుము!

---

# ఆర్యధర్మ సంగ్రహము

(గత సంచిక తరువాయి)

"విద్యానిధి"

ప్ర:—వర్ణములలోను జాతులలోను ఇంకను విభాగములు కలవా?

ఉ:—కలవు. మతభేదమును, దేశభేదమును అనుసరించి ఈ వర్ణములు కొన్ని వంద లగుచున్నవి. మార్వాడ దేశమున బుట్టినవారు మార్వాడీ లనబరగుదురు. అనగా మార్వాడ దేశమునను బ్రాహ్మణాది సమస్తవర్ణములు కలవు. కాని యచ్చోటి బ్రాహ్మణులకును ఆంధ్రబ్రాహ్మణులకును ఆచార సౌకర్యమును బట్టి సపంక్తి భోజ

నము కుదురదు. ఇటులే బంగాళ గౌడ ఓఢ్ర దేశము జాతుల నెరుంగు నది.

మరియు సామాన్య వైష్ణవ శ్రీవైష్ణవ అను మతములలోను, సామాన్య శైవ, వీరశైవ, అను మతములలోను, బ్రాహ్మణాది వివిధ జాతులు కలవు. ఒక మతమునకు చెందినవారు ఒకేవర్ణముగా నుండ నవసరము లేదు. కావున ననేక భేదములు కలవు. ఒక దేశపువాని భాష మరొకనికి దెలియనపుడుగాని, ఒకమతస్థుని యాచారము మరొక మతీయునకు సదాచారముగా గన్పడనపుడుగాని సంబంధము కాజాలదు.

ప్ర:—ఒకే మతమునకు జెందిన బ్రహ్మక్షత్రియ వైశ్య లను ద్విజులలో రక్తసంబంధమును పంక్తిభోజనమును పరస్పరముగా జరుగ వచ్చునా?

ఉ:—పంక్తిభోజనమునకు శాస్త్రనిషేధములేదు. ప్రాచీన కాలమున ద్విజు లందరును కలిసిమెలసి యుండెడువారు. (ద్విజులనగా:- మాతృగర్భమునుండి యొకసారియును, దీక్షోపనయన వేదమంత్రోప దేశ పూర్వకముగ ఆచార్యుని హస్తమునుండియును [రెండుసారులు] పుట్టుటవలన ద్విజు లని వ్యుత్పత్తి కలిగెను. [ద్వాభ్యాం జాయంత ఇతి ద్విజాః] ఈ యధికారము బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు మాత్రము కలదు. కావున వీరికి ద్విజులని వ్యవహారము కలిగినది. వీరికే త్రైవర్ణికు లని మరియొక వాడుక కలదు) కాని ఆచారములు మారుటచేతను, క్షత్రియవైశ్యులలో అధ్యయనము ఉపనయనములు మున్నగు విషయ ములగూర్చి ఔదాసీన్యము గలుగుటచేతను బ్రాహ్మణుల సపంక్తిపాసి పోయెను. మార్వాడదేశపు వల్లభ వైష్ణవమతస్థులలోను ఆంధ్రకర్ణా టక దేశపు వీరశైవమతస్థులలోను మొదటినుండి సంప్రదాయ విష యము శుద్ధముగా నుండుట వలన ద్విజులలో పంక్తిభోజనము సదా చారముగా నెన్నబడుచు నేటికిని వ్యవహారములో నున్నది.

కన్యాదానము మున్నగు రక్తసంబంధమును ఏవర్ణములోని వారు ఆవర్ణములో (సజాతిలో) మాత్రమే చేసుకొనవలెను. ఈ తత్త్వ మును వదలిననాడు ప్రపంచమున ఆర్యహిందూవైదిక ధర్మము పేరితో నొక సంస్థ లేక మతము ఉండనే యుండదు.

## ఆ శ్రి మ ము లు

ప్రి:—ఆశ్రిమము లనగా నేమి?

ఉ:—విద్యార్జన, సంసారము, సమాజవ్యవస్థ, మోక్షప్రాప్తి అను పురుషార్థముల కొఱకు ధర్మగ్రింథములచే నిర్దేశింపబడిన వయ స్సంబంధమైన కాలమర్యాదకు ఆశ్రిమ మని పేరు. ఇవి బ్రిహ్మచర్య, గృహస్థ, వానప్రిస్థ, సన్యాసములని నాలుగు విధములు.

ప్రి:—బ్రిహ్మచర్యాశ్రిమ మనగా నేమి?

ఉ:—బ్రిహ్మమనగా జ్ఞానము, చర్యయనగా వర్తనము. విద్యా ర్జన (జ్ఞానసంపాదన) కాలమునకు బ్రిహ్మచర్య యందురు. ఇది సామా న్యముగ దీక్షోపనయనసంస్కారమైన యెనిమిదవ సంవత్సరము మొదలుకొని యారంభమయి వివాహపర్యంత ముండును. విద్యాభ్యా సము ముగియు వరకు బ్రిహ్మచారి గురుసన్నిధినే ఆశ్రియించుట పరమ సుఖము. జీవితమంతయు బ్రిహ్మచర్యముగ గడపువానికి నైష్ఠికబ్రిహ్మ చారి యని పేరు.

ప్రి:—బ్రిహ్మచర్యాశ్రిమ నియమము లేవి?

ఉ:—ఈ యాశ్రిమ నియమము లన్నియు స్మృతులలోను తద్ద్వారా సంగ్రిహింపబడిన ధర్మశాస్త్రపు ప్రిబంధ గ్రింథములలోను కలవు. సంక్షేపముగా "ఉపనయనమైన పిదప గురుసన్నిధి జేరి వారి యాజ్ఞ ననుసరించి సమస్త దినచర్యను పాలించవలసియుండును. సూర్యోదయమునకు పూర్వమే మేల్కొని శౌచముఖ మార్జనముల నొనర్చి స్నానసంధ్యా (శివపూజా)దుల నిర్వహించి పూజ్యుల నమస్క రించి విద్యాభ్యాసమునకు గడంగవలయును. ఆద్యంతములలో ప్రాణా యామమును గావింపవలెను. దివానిద్రి కూడదు. స్రిక్చందనతాంబూ లాది సుఖవస్తువులను విసర్జింపవలెను. ఉత్తేజకపదార్థములను సైతము భక్షింపవలదు. సాహసకార్యములను జేయరాదు. అసత్యముగను కఠో రముగను పలుకగూడదు" అని చెప్పవచ్చును.

ప్రి:—గృహస్థాశ్రిమ మనగానేమి?

ఉ:—విద్యార్జనమును చాలించి వివాహితుడై సంసారమును సాగించుచు ధర్మార్థకామములను సాధించవలెను. కాని ఈ యన్నిటి

యందును ధర్మవిహితమైన మార్గమునే అవలంబించవలెను. సదాచార మును మీరవలదు. బ్రాహ్మణుడు జ్ఞానమువలనను, క్షత్రియుడు పరాక్రమమువలనను, వైశ్యుడు వ్యాపారమువలనను, శూద్రుడు సేవవలనను దర్వ్యము నార్జింపవలెను. ప్రత్యహము బ్రహ్మయజ్ఞము (వేద శాస్త్రాభ్యాసము) దేవయజ్ఞము (దేవతాపూజ) పితృయజ్ఞము (మాతృపితృ గురుపూజలు, ప్రత్యక్షపరోక్షములలో) భూతయజ్ఞము (ఇతర జీవులకు బలి) అతిథియజ్ఞము (అతిథితృప్తి) అను పంచమహా యజ్ఞములను యథాశక్తి గావించుట ప్రతియొక గృహస్థుని కర్తవ్యమై యున్నది.

ప్ర:—వానప్రస్థ మనగా నేమి?

ఉ:—గృహస్థాశ్రమమును వీడి లోకసేవ నొనర్చుచు ధర్మా చరణ పూర్వకముగ వైరాగ్యవృత్తి నభ్యసించుట.

ప్ర:—సన్యాస మనగా?

ఉ:—కామక్రోధాది సమస్త వికారముల నణచి సంయమ పూర్వకముగ మోక్షప్రాప్తికై యత్నమొనర్చుట.

## సిద్ధాంతము

ప్ర:—ఆర్యధర్మముయొక్క ముఖ్యతత్త్వమెద్ది?

ఉ:—పునర్జన్మ రాహిత్యపూర్వకమైన కర్మానురూప సుఫల సుజ్ఞానప్రాప్తి.

ప్ర:—పునర్జన్మ మనగా నేమి?

ఉ:—మోక్ష మబ్బువరకు జననమరణ ప్రవాహమున నుండుటయే పునర్జన్మ.

ప్ర:—కర్మానురూప మనగా నేమి?

ఉ:—ఎట్టి కర్మాచరణము మనుష్యునిచే జరిగినదో అట్టి కర్మకు తగిన పరిణామము ఈ జన్మమున లేక ముందుజన్మమున గలుగుటయే కర్మానురూప ఫలము.

ప్ర:—మోక్ష మనగా నేమి?

ఉ:—ప్రతిజీవుని ధ్యేయమును దేవు డగుటయే! (ఇట దేవుడు ఈశ్వర బ్రహ్మవాచ్యుడు) జీవుడు అల్పజ్ఞుడు, కించిత్కర్తృత్వము కల వాడు, కావున జన్మ జరామరణాది అనంతదుఃఖముల బొల్పడుచు సహించుకొన వలసి యుండును. ఇట్టి కష్టము లన్నియు కడకుఁ బోవల యును. సుఖదుఃఖలవలేశమును, జననమరణాదిబాధలును ఎచట లేవో అట్టి జ్ఞానమయ అఖండసచ్చిదానందపరమేశ్వరునిలో నైక్యము నొందుటకై జీవుడు ప్రయత్నించు చుండవలెను. ఈ జీవుడే శివుడు, అనగా పరమేశ్వరు డగును. ఈ జీవభావత్యాగమునకే మోక్ష మనియెదరు. ఇట్టి రహస్యమును సులభముగ జేపట్టుటయే ఆర్యహిందూ ధర్మముయొక్క ధ్యేయము. ఈ తత్త్వవిజ్ఞాన సిద్ధాంతము యొక్క ఊహాకూడ ఇతర మతములలో లేదు.

ప్ర:—అయితే పరధర్మ్మలకు మోక్షము శక్యము గాదా ?

ఉ:—లేదు. ఆ మతములు మోక్షమునకు గావలసిన కొన్ని గుణములను మాత్రమే ప్రదర్శించుచున్నవి. ఈజన్మమందలి శుద్ధా చరణవలన ఆత్మశుద్ధి గల్గి ఆర్యధర్మమున బుట్టిననే తప్ప మోక్షము లభిం చదు.

ప్ర:—పరధర్మియు డెవడైన ఈ జన్మముననే ఆర్యధర్మదీక్షను గ్రహింపవచ్చునా ?

ఉ:—అట్లు గ్రహించినచో చాల చిక్కులు గలుగును. వర్ణ ములు జాతితోడనే వచ్చునని మన ముఖ్యసిద్ధాంతము కావున క్రొత్తగా వచ్చిన వాని నే వర్ణమునను జేర్చుటకు వీలుండదు. ఇట్టి మార్గమునకు ధార్మికప్రమాణములుగాని సదాచారముగాని లేదు.

ప్ర:—ఆర్యధర్మములోని శైవస్మార్త వైష్ణవమతములకు జెందినవా డెవడైనను మరొకమతమును స్వీకరించవచ్చునా ?

ఉ:—ఎవరిమతమున వా రుండుటయే శ్రేష్ఠము. ఎవరైన త్రోవ దప్పినచో మరియొక మతాచార్యుడు సైతము వానికి వాని స్వధర్మ మునే బోధించి శాంతి జేకూర్చవలెను. అట్లుగాక మనఃస్ఫూర్తిగ నిష్క ల్మషముగ శరణాగతుడయ్యేనేని మతాచార్యుడు స్వమతదీక్ష నీయ

వచ్చును. కాని యిందువలన మతము మారునేకాని వర్ణముగాని జాతి గాని మారదు. తన వృత్తి (కులవిద్య) ననుసరించి యుపాసనద్వారా మోక్షమును జేపట్టవలెను. స్మార్తులలోని వ్యక్తులు శైవులుగనో వైష్ణవులుగనో మారినట్లు ప్రమాణములుకలవు కాని శైవవైష్ణవులు స్మార్తులుగా మారినట్లు కనపడదు. చాలమంది జైనబౌద్ధాదులను శ్రీశంకరాచార్యులు స్మార్తులనుగా నొనర్చినట్లు కొందరు చెప్పెదరుకాని గట్టియైన చారిత్రిక ప్రమాణములు లభింప లేదు.

ప్ర:—పతితుని శుద్ధిపఱచి స్వమతములోనికి దీసికొన వచ్చునా?

ఉ:—పతితుడు పశ్చాత్తప్తుడై భక్తి శ్రద్ధలతో గురువు నాశ్రయించినచో వానిని పరీక్షించి శుద్ధిచేయవచ్చును. ఇది వేదశాస్త్ర సమ్మతమైన సదాచారము. దీనిని కొందరు పెద్దమనుష్యులు అవసరము లేదనుటలోని తాత్పర్య మేమనగా ఇట్లే శుద్ధిచేయుచువచ్చినచో మతాచారములలోని దార్ఢ్యము చెడుటయేకాక లక్ష్యముండ దనుటయే!

## సాకార నిరాకారములు

ప్ర:—ఈశ్వరుడు సాకారుడా, నిరాకారుడా?

ఉ:—ఈశ్వరుడనగా సర్వకర్తృత్వ సర శక్తి సంపన్నుడు కావున సాకారముగాను నిరాకారముగాను భక్తునియొక్క భావనాబలమునుబట్టి ప్రత్యక్షమగుచుండును. నిరాకారు డని చెప్పుటకొఱకు నిర్వచన మక్కర లేదు.

ప్ర:—ఈశ్వరు డొక్కడా అనేకములా?

ఉ:—ఏకుడే, అనేకుడు కాడు.

ప్ర:—శివ, విష్ణు, గణపతి, మారుతి, దేవి మున్నగు దేవత లేమిటి!

ఉ:—ఈశ్వరుడు వాస్తవముగ ఒకడేయైనను విశ్వవ్యాపకుడగుటచేత భక్తహృదయము ననుసరించి వివిధరూపములతో గనుపడుచుండును. మనుష్యుడు తన యధికారము, సామర్థ్యము ననుసరించి ఒక మార్గమున మాత్రమే ఉపాసన చేయుచుండును. కావున నా యా రూపములే

ప్రత్యక్షమగుట సహజము. భక్తుని దృష్టి వేరువేరైనను సమస్తాకారము లందు నిర్మలముగ ప్రకాశించు మూల స్వరూప మొక పరమేశ్వరునిదే!

ప్ర:— ఈశ్వరు డెక్కడనున్నాడు?

ఉ:—స్థావరజంగమాత్మక మైన సృష్టిలో నలుదిక్కులలోను కలడు.

## విగ్రహారాధన

ప్ర:—విగ్రహారాధన మూర్తిపూజ లనగా నేమి ?

ఉ:—మూర్తి లేక విగ్రహమనగా, ఆకారముతోగూడిన దేవతయొక్క ఉపాసనకు విగ్రహారాధన యందురు.

ప్ర:—ఇట్టి పూజ హిందువుల కావశ్యకమా ?

ఉ:—ఇదియే పరమావధికాదుకాని యిది యుపాసనాతత్త్వము నకు ముఖ్యమైన సోపానమని చెప్పవచ్చును. నిర్గుణ నిరాకారమైన పరబ్రహ్మము పరమధ్యేయమేకాని యట్టి నిర్విషయకమైన జ్ఞానము సులభసాధ్యముకాదు. కావున నీ మార్గ మావిష్కరింపబడినది. క్రిస్టియనుల క్రాసు, మహమ్మదీయుల పీర్లు మున్నగునవి చూడగా ఇతర మతములలోను ఒకవిధమైన సాకారపూజ కనుపడుచున్నది. స్మారకముగ ప్రతిమలను ప్రతిష్ఠించుట చిత్రముల నూరేగించుట మొదలగు నాధునిక పద్ధతిలోను ఈ తత్త్వము లేకపోలేదు. దీనినే యుత్కృష్టమైన రహస్యపూర్వకముగ వారి వారి యధికారమును బట్టి మూర్తి పూజను నిరూపించిరేకాని యజ్ఞతవలన గాదు.

ప్ర:—ఏ విగ్రహమును ఏ విధముగ పూజింపవలెను ?

ఉ:—స్వసంప్రదాయానుసారముగ నే పూజనైనను ఉపదేశ పూర్వకముగాఁ జేయవచ్చును.

## ధర్మము-వ్యవహారము.

ప్ర:—ధర్మమునకును వ్యవహారమునకును సంబంధము కలదా ?

ఉ:—ధర్మమునకు సంబంధించని వ్యవహార మొక్కటియు లేదు. పైగా ధర్మము ప్రత్యేక పురుషునియొక్కయు ప్రతికర్మయొక్కయు వివరణమును దెలుపునదై యున్నది.

## పా ప పు ణ్యా ము లు

ప్ర:—పుణ్యపాపము లనగా నేమి ?

ఉ:—జీవునియొక్క శ్రేయస్సాధన కుపకరించునది పుణ్యమని యును అధోగతి కీడ్చునది పాప మనియును వ్యవహారము.

ప్ర:—అట్లగుచో నిది చేసిన పుణ్యము, ఇది చేసిన పాప మనియును చెప్పుటలోని సారస్య మేమి ?

ఉ:—భిన్నభిన్న బుద్ధులు గలవా రున్నారు. కావున నట్లు అధికారి తారతమ్యము ననుసరించి బోధింపవలసి యుండును. ఏమతమున ఏకాలమున నెవ్వనికి ఎటులు చేసినచో నుత్కర్షము లేక అపకర్షము కలుగునో తెలియుటకొరకై అవి నిర్ణయింపబడినవి.

ప్ర:—కొన్నిమాటల కర్థమే తెలియకున్నది. ఇక్కడ కూర్చొని "గంగే గంగే", యన్నను నా సమస్త పాపములు నశించు నట! దీని కర్థమేమి ?

ఉ:—ఇట్టి ప్రేరక విషయములకు అర్థవాదము లని పేరు. అట్లు చెప్పుటలో మనుష్యునియొక్క బుద్ధిని పవిత్రమైన గంగవైపుకు మరలించుటయే ముఖ్యవిధి. పాలు త్రాగినచో జుట్టు పెరుగు నని బాలకునకుఁ జెప్పినచో అల్లరి చేయక త్వరగాఁ ద్రాగగలడు. ఆ యా వ్యక్తుల యొక్క బుద్ధులను బట్టి యిట్టి వచనములును చాల ప్రయోజనకారులు. పురాణాదుల యొక్క ఆవశ్యకతను చతురమతులు గమనించవలెను. ఇందలి సత్యసరళమైన విషయములను ప్రతి యార్యుడును సతర్కముగ దెలిసికొని లోకమున బ్రచారము చేయవలసియున్నది. అవకాశము ననుసరించి ఈ చిన్నివ్యాసము నే సమర్థించుచు నొక చక్కని పొత్తమును ప్రకటించు తలంపు గలదు. శివమస్తు.

సర్వేజనా స్సుఖినో భవన్తు.

---

# మహాశివరాత్రి

టి. సీతారామ శర్మగారు, ఉపాధ్యాయులు.

---

సీ. సతత తపోనిష్ఠ ధుతపాతకానీక
మంజుల మునివాస రంజితంబు
పుష్పితాంబుజ గళదచ్ఛారిపరాగ సం
వాసితాంభః పూర్ణ వాపియుతము
క్రమపద ఘనసామరత మునీశ్వరశిష్య
సతతాధ్యయననాద సంకులంబు
పరిపక్వఫలభార తరుజాల సంచర
త్కోకిలాది విహంగ కూజితంబు
తే. మౌనివరహోమజనిత ధూమప్రకల్పి
తాంబుదానీక సంశమితాంబుజాత
తీక్ష్ణతాపంబు లోకైక దీపితంబు
రాజితం బగు నైమిశారణ్యమందు. ౧

ఉ. అందు మునీంద్ర సేవ్యుని౯ యుగాంతక పాదపయోజసేవనా
నందితమానసాబ్జు౯ గరుణామయు నూర్జితశాస్త్రపద్మ ని
ష్యందిమరంద పానరతు నాగమ వేదు పురాణవిద్యరే
ణ్యుం దృఢభక్తియుక్తు సుజనోత్తము సూతునిగాంచి భక్తితో౯. ౨

ఉ. శౌనకు౯ డాదిగా౯ గలుగు సంయములెల్లరు కేలుమోడ్చి వి
జ్ఞాననిధీ! భవత్కృప ననంతుని సత్కథ లెల్లవింటి మ
న్లైనను పార్వతీశ్వరు కథావళి గోరిలమి వీస మంతయు౯
గానవు తృప్తి డెందములు గావున తత్కథ౯ దెల్పవే కృప౯. ౩

మ. అనఘా! తావకవాఙ్ముఖరీనిసృతదివ్యానేక గాథామృతం
బును కర్ణాంజలుల౯ విశేషముగ సొంపు౯ పెంపు దీపింప దాని
విన రవ్వంతయు౯ దృప్తి లేదు కృపతో విశ్వేశు నార్తార్తినా
శను సద్గాథల మమ్ము దన్పగదె దోషవ్రాతముం ద్రూలగ౯. ౪

క. శంకరుఁడు భక్తలోకవ
శంకరుఁ డార్తార్తి హరుఁడు సకలాఘ వినా
శంకరుఁ డటు గావున మా
కింక శివుని పుణ్యకథల నెఱిగింపఁగదే. ౫

తే. కష్టజనుల పాలి కల్పద్రుమంబు శం
కరుఁ డటంచు భక్తగణము వలుక
వింటి మట్లుగాన విశ్వేశు సత్కథ
లెఱుఁగఁ జెప్పవే మునీంద్రచంద్ర! ౬

వ. మఱియు ౭

తే. ఎపుడు పూజసేయఁ గృపఁ బూను శంకరుం
డెట్లు చేయవలయు నెవ్వ రెట్లు
భక్తిఁగొలిచి ముక్తిఁ బడసిరి తత్కథ
ల్మనము లలరఁ దెల్పుమా మునీంద్ర! ౮

చ. అనవుడు సూతుఁ డిట్లను మహాత్ములు మీ కెరుగంగరాని పా
వనచరితంబులు న్గలవె బ్రహ్మవిదు ల్నను గొప్ప జేసి యీ
యనువున నాకుఁ బున్నియము నందఁగఁ జేసెడి కోర్కెగాక యం
చనుపమభక్తి వ్యాసునకు నంజలి చేసి వచించె నీ క్రియన్. ౯

చం. నరుఁడు ధరం జనించి పురనాశను దివ్యకథాప్లవంబునన్
దిరముగ దుఃఖవారిసముదీర్ణము పుత్రసుపాకులంబు మి
త్రరమణికూర్మనక్రసహితం బగు సంసరణాబ్ధి దాటఁగా
స్థిరమతిఁ గోరఁబోక ధరఁ ద్రిమ్మరుచుండును బుద్ధిహీనుఁడై. ౧౦

కం. హరుఁడు పరిపాలితావని
సురుఁడు దయామయుడు భక్తి సులభుఁడు కరుణా
పరుఁ డటుగావున పురహరు
చరితంబు వచింతు వినుఁడు సన్మునులారా! ౧౧

కం. మీరలు పుణ్యాత్మకు లీ
తీరున సత్కథల వినఁగ దివిరెడు వారల్
లేరు పెరవార లని కృప
మీరఁగ వచియింపఁ దొడఁగె మిగిలిన భక్తిన్. ౧౨

తే. నిఖిలభువన తతికి నిర్మాణకారణుం
డైన శివుఁడు విప్రగోనృపాళిఁ
గరుణ నేలువాఁడు కడఁగి సన్నోచ్చిమను
గాక పాదభక్తుఁగా నొనర్చి. ౧౩

క. అని యీ రీతిని వినతులు
బొనరిచి తేనియలు గురియ ముదితహృదయుఁడై
వినిపింపఁదొడఁగె సూతుఁడు
వినుమని మునివరుల కపుడు ప్రియము దలిర్పన్ ౧౪

సీ. గగనోల్లిఖితమేరు నగతుల్య చంచద్వి
రాజిత శిఖరవిభ్రాజితంబు
వకుళ పున్నాగచంపక కేతకీకుంద
ముఖపుష్పతరులతా భూషితంబు
కదళికామ్రలవంగ ఖర్జూరదాడిమీ క
పిత్థాది ఫలవృక్ష విలసితంబు
పరిపక్వ ఫలరసాస్వాదనరతశుక
శారికాదినినాద సంకులంబు
తే. సతతమధుపానలోలుపచంచరీక
శ్రావ్యఝుంకారయుత మదిరాజ మబ్జ
సంభవాది సుపర్వాణ సకలమౌని
వర్యసేవిత కైలాస పర్వతమున. ౧౫

సీ. కైలాసభూధరాగారు చతుర్బాహు
వ్యాళేంద్రమాలాఢ్య పంచవక్త్రు
నీలజీమూత సన్నిభవర్ణు దేవేశు
శూలకలిత హస్తు శుభచరిత్రు
ఖడ్గఖేటకకరు ఖట్వాంగసముపేతు
వరకపాలోపేతు వహ్నినేత్రు
భస్మలిప్తశరీరు సస్మితహితభాషు
కోటిసూర్యప్రభు కుజనశత్రు

తే. నీలకంఠు జగద్గురు నిరతభక్తి
వ్యాప్తసరోరుహావాసు విపత్సహాయు
ప్రమథగణ పరివేష్టితు భవుని గాంచి
శైలరాట్పుత్రి వలికె నీ లీల నపుడు. ౧౬

ఉ. వింటిని ముక్తిదంబులగు విశ్రుత సద్వ్రత నిర్ణయంబులన్
వింటిని దానభేదముల వింటిని తత్ఫలము ల్క్రమంబునన్
వింటిని సర్వధర్మములు వింటిని తీర్థమహాత్మ్యధర్మముల్
వింటిని సర్వగాథలను వీనులవిందుగ భక్తరక్షకా! ౧౭

క. ఐనను నా మనమున నను
మానము మాయంగలేదు మానక కరుణన్
బూని వచియింపు ముత్తమ
మైన వ్రతం బొండు సులభమైనది దేవా. ౧౮

తే. వ్రతసమూహంబునందు గోప్యంబు ఘోర
పాతకాటవులంగాల్చు వహ్నియగుచు
భుక్తి ముక్తిప్రదం బయి పొలుచునట్టి
మేటిసద్వ్రత మెఱిగించుమీ నతార్య! ౧౯

చం. అన విని శంకరుండు ముదితాత్ముఁడునై యిటువల్కె గౌరితో
విను మతిగోప్యమున్ గలుషవిధ్వంసనంబును నిష్టకార్యదం
బును సుకరంబు పుత్రధన ముక్తిదమున్ యమగర్వభంజకం
బును నగు సద్వ్రతంబనుచు పొల్పుగఁ దెల్పఁదొడంగె ప్రేముడిన్ ౨౦

తే. వినుము మాఘమాసమునఁ గృష్ణపక్షమ్ము
నందు దర్శతోడఁ బొందియుండు
పదియునాల్గవతిథి వరలును శివరాత్రి
యనఁగ దానిమహిమ మద్భుతంబు. ౨౧

ఆ. దానయజ్ఞతపోవ్రత ధర్మములను
తీర్థయాత్రల దేవతా ప్రార్థనమున
గల్గుసుకృతంబు చులకన గలుగఁజేయు
నొక్క శివరాత్రి సంశయ మొందవలదు. ౨౨

క. జ్ఞానముననైన మఱి య
జ్ఞానంబున నైననేమి నరుఁ డొనరింపన్
దాను శివపదము నంది య
నూనసుఖంబులను బొందు నుతచరితుండై. ౨౩

తే. మంగళంబులఁ గూర్చి యమంగళముల
దరికి రానీక భక్తులఁ దవిలి ప్రోచి
భుక్తి యిహమునఁ బరమున ముక్తి నొసగు
సత్య మీ శివరాత్రి నిస్సంశయంబు. ౨౪

క. అని శర్వుఁ డాడఁ బార్వతి
విని యచ్చెరు వంది పలుకు విబుధవినుత! యే
యనువున నిరయము విడివడి
చను మనుజుం డనిన శివుఁ డుమాసతి కనియెన్. ౨౫

(స. శై.)

---

# ప్రజాసామాన్యము నావరించిన ఉన్మాదమే సామ్యవాదము

## సర్వసమత్వ పద్ధతి కట్టుకథ వంటిదియె !

### ప్రాచీనసభ్యతను, సంప్రదాయములను విడనాడ నుంకించుట ఆత్మ వినాశమునకే !

విమర్శక శిరోమణి, సాహిత్యవిశారద,

**కోన వేంకట రాయశర్మగారు**



ప్రజాస్వామ్యప్రభుత్వ మననేమో యార్యావర్తమునకు దెలియ దని చెప్పు ప్రబుద్ధులకు భారత దేశ ప్రాశస్త్యము తెలియదని చెప్పవచ్చును వారి కీదేశచారిత్రము తెలియ దన్నమాట. హైందవ రాజకీయ శాస్త్రముల బరికించిన నేటి క్లిష్టపరిస్థితు లెట్లు సమర్థనీయములో విస్పష్టము కాగలదు. భారతీయ స్వరాజ్యము పాశ్చాత్య రాజకీయ శాస్త్రము ననుసరించి యేర్పడగూడదు. అయ్యది భారతీయాదర్శముల ననుసరించియు, బుద్ధిచాకచక్యముల బట్టియు నేర్పడవలయును. భారత దేశము తన నిజస్వరూపమును బొందినప్పుడే తక్కినజాతులలో గౌరవము బడయును.

పూర్వము వివిధవర్గములవారు తమ తమ వర్గముల నొక సమష్టి సంఘముగ నేర్పఱచికొని తత్సంఘవ్యవహారముల నన్నింటి నాయా తావులనుండి యెన్నికోబడిన ప్రజాప్రతినిధి సంఘముచే గొనసాగింపబడునట్టు లేర్పాటుచేసికొనియెను. ఏవర్గమున కావర్గము, ఏవంశమున కా వంశము, ఒక చిన్నిస్వతంత్ర రాజ్యము. అనూచానముగ హక్కు స్వత్వము కలవ్యక్తి యద్దాని బాలించుచుండెను. కాని సంఘమువలన నేర్పడి ప్రజాప్రభుత్వ మయ్యెను. కుటుంబమున కంతకును గుటుంబ యజమాని యెటుల బరిపాలకుడో, యట్లే యావద్దేశ మొకని యధీనమున నుండుటకును, నాతడు వంశ పారంపర్యముగ హక్కు స్వత్వముల

గలిగియుండుటకును దారి యేర్పడెను. రాజపదవి తొలుత దైవసంబంధము గలిగియుండక కేవల మొక మానవసంస్థగా ప్రారంభమయ్యెను. అపుడు రాజు గృహ్యానుజమానుల వలన నెన్నికోబడెడివాడు. తమలో దామ వివదించి కొనకుండనుండుటకును, శత్రువుల నెదుర్కొని కాపాడుట కును, రాజు అవసరమయ్యెను. కాలము కడచన్నపిదప ప్రజాభీష్టము ప్రబలమై పాదుకొనదొడంగెను.

హైందవ "రాజపదవి" గానురాను చాల మార్పులకు లోనయి చివరకు రాజు వంశపారంపర్యహక్కుస్వత్వములం బొంది సార్వజనీన మైన యధికారము సముపార్జించెను. కౌటిల్యుడు తన యర్థశాస్త్రమున "రాజరికసిద్ధాంతము"ను బరిపూర్ణముగ, సకారణముగ విమర్శించినాడు. నైతికవిషయ మటుండనిచ్చిన దత్సిద్ధాంతము రాజనీతికి మతమును లోగ చేసెనుగ్గాని మతమునకు రాజనీతి లోగలేదని తెలియగలదు. రాష్ట్ర సంరక్షణయే మహోత్కృష్ట కార్యము. రాజు ప్రజకు ప్రధానసేవకుడు. కావున రాజనీతి తొలుత రాజున కుపదేశింపబడెడిది. ఇందులకు తోడు రణ, వ్యాపారవిద్యయు నుండెడిది. పరాక్రమ మధికారమునకును, అధి కారము పరివర్తనమునకును,---గల పర్యాలోచనము నర్థశాస్త్రము లేకుండజేసెను. "ఈ రాజరికసిద్ధాంతము గ్రంథములయందు మాత్ర ముండదగినది. ఏలయన; ప్రజల యభ్యుదయ పరంపరాభివృద్ధిని, రాజు యొక్క స్వీయాభివృద్ధికి లంగరువైచె" నని పాల్మార్సన్ ఊర్సెలు అను నతడు వ్రాసెను.

బ్రాహ్మణ మతసిద్ధాంతముంబట్టి "రాజపదవి" వర్ణవ్యవస్థ సుస్థిర ముగ నిలచుటకును, వారి వారి విధ్యుక్తధర్మముల యథాతథముగ కొనసాగుటకును అవసర మయ్యెను. ఇవ్విధముగ "రాజపదవి" యవ సరమ్మని నిర్ధరింప బడిన దేగాని దానికి గొన్ని నియమము లున్నవి. ప్రజల సుపయోగమునకయి యానియమనులు నిర్ణయింపబడినవి. ప్రాక్తన మగు ధర్మము నైజమును మూలబంధమునునై యుండెను. తొలుత విష్ణుమూర్తి విరజు డనురాజును సృజియించెను. వానినుండియె రాజవంశ మొకటి యుదయమయ్యెను. ఆవంశమందె వేను డను నిరంకుశ ప్రభువు నిరుగించి తన యధికార బలదర్పములు, వంశమర్యాదను దుర్వ్యాని

యోగ మొనర్చెను. మహర్షులు వానిం గడదేర్చి యాతని యంగాంగ ములతో నొక జన్న మొనర్చిరి. ఆతని బాహువు మథించగా నందుండి పృథువను నృపపుంగవుండుదయించి ధర్మమును 'దూ-చా' అప్పక అను ష్ఠించెదనని ప్రమాణ మొనర్చెను. ఈ యుపాఖ్యానమువలన రాజపదవి విష్ణ్వంశసంభూత మేకాని వేఱొండు గాదనియు, ధర్మబద్ధమైన రాజ్యము చిరకాల ముండుననియు, లేనిచో నశించుననియు దెలియుచున్నది. కావుననే 'నావిష్ణుః పృథివీపతిః' యని పెద్ద లనిరి. బలవంతుల దౌర్జన్య కృత్యములనుండి బలహీనుల దప్పించుటయే రాజధర్మము కావున నాతని యెడ భక్తివిశ్వాసములు, గౌరవ మర్యాదలు, విధేయత కనబఱుప వలసిన విధి మనకుగలదు. రాజుయొక్క పరిపాలన మొక సాంఘిక సంప్రదాయమే కాక దైవికమును నైయున్నది.

దేశపరిపాలనముం గూర్చియు, నేర్చికోదగిన రాజనీతిని గుఱిం చియు, నర్థశాస్త్రమున వెవ్వేలుగా గొన్ని నియమము లుటంకింపబడి యున్నవి. కావున భారతీయ రాజనీతి తొల్లింటినుండియు బరిపాలనా విధానముం గూర్చియె కాక "ప్రభువు అతని యాదర్శజీవితము"ను గుఱించి యతిశయముగ దెలుపునొక ప్రభుత్వవిధానముం గూర్చియె వచించుచున్నది. ఏ పరిపాలనమైనను సత్పరిపాలనము గావలెనన్న దత్ప్ర భూత్తంసునకు న్యాయ్యము-ధర్మము నిలుపుటకయి యనితరలభ్యమై నట్టియు, నసాధారణమైనట్టియు నధికారము లవశ్యములు. అవినీతి పరులను, దోషాకరులను శిక్షించు విధానముం గూర్చియు, శిక్షనుగుఱిం చియు, దండనీతి తెలుపును. చాణక్యుడు తా నుద్బోధించిన "మాట వెల్లనిజము" సిద్ధాంతముల కతిరిక్తముగ గొన్ని తావుల నధికారము సంఘసంరక్షణమునకే యను సిద్ధాంతమును, బరుల కుపకార మొనరిం చుట—ఐహికభోగములు ధర్మార్థమే యను సిద్ధాంతమును, నాతడు స్థిరీకరించెను. ఈ సిద్ధాంతములే యశోకచక్రవర్తికాలమున రాజకీయము లని శాసనములలో వ్రాయబడినది.

మహాభారతము, మనుస్మృతి యను గ్రంథములు రాజనీతిని గుఱించి విపులముగ జర్చించుచు నొకేవిధమైన సిద్ధాంతముల సూచించు

మున్నవి. ఇతరపదవులకన్న ధర్మబద్ధమైన 'రాజపదవి' శ్రేష్ఠతమ మని యందఱొప్పికొని యున్నారు.

భారత దేశమునకు సామ్యవాదము పనికిరాదు. కారణ మేమన; యథార్థముగ సామ్యవాదమందలి లోపములంబోనాడి భారత దేశపరిస్థితుల నవలోకించినచో బనికిరా దని తెలియగలదు. భారత దేశమున బలువిధములగు వర్ణములు, వర్గములు గలవు. తత్సంబంధవిషయము లతిగాఢములు. పరస్పరవిరుద్ధములు, వర్ణవ్యవస్థ, కుటుంబపద్ధతి, త్రిమత సిద్ధాంతములు మున్నగు నార్యసంప్రదాయములు సామ్యవాదమున కత్యంతవిరుద్ధములు.

సామ్యవాదప్రభుత్వము నిరంకుశ ప్రభుత్వమునుండి విడివడుట కయి వాంఛించునట్టిది. ఈ ప్రభుత్వముగల రష్యాలో నేటి స్థితిగతుల నవలోకించినయెడల నీ వాదము నిరాధార మని విస్పష్టముకాగలదు. ప్రజాస్వామ్యప్రభుత్వముకంటె సామ్యవాదము నిరంకుశప్రభుత్వమునకు జేరువయైనది. రష్యాలో నెవడును దాదలంచినకార్యము సేయుటకు వలనుపడదు. ఆ ప్రభుత్వమువలన బ్రజలు సంతృప్తిజెందుటలేదు. ఇక బ్రజాప్రభుత్వము ప్రభుత్వము యొక్క ఆదర్శవిధానమా? లేక రూపమా? యని విచారింతము. ప్రకృతము ప్రపంచమందలి వివిధ దేశములలో నేర్పడియున్న రాజ్యములు నిజమైన ప్రజాప్రభుత్వములు గావు. అవి ప్రజాశయలబ్ధికి, ప్రజాభివృద్ధికి,—ఎంతమాత్రము నవకాశ మిచ్చుటలేదు. ఒకప్పుడు ప్రజా ప్రభుత్వము, ప్రజాప్రభుత్వము, అని గంతులువైచిన పశ్చిమ దేశీయులకు నేడదియన్న నెడమొగము పెడమొగములుగ నున్నది. రష్యా, ఇటలీ, స్పెయిన్ దేశములలోను, యూరపు ఖండమందలి ప్రాగ్భాగమునను ప్రజాప్రభుత్వ మనిన దురభిప్రాయ మొదవి యచట సాగక తుదకు రూపు మాసినవి. బ్రైసుదొర "యథార్థమైన ప్రజా ప్రభుత్వము స్విట్జర్లాండు, స్కాండినేవియా మున్నగు నే చిన్ని రాజ్యములందో తప్ప దక్కిన వానియందు బనిచేయదేమో" యన్న సంశయమును వెలిబుచ్చి యున్నాడు. ప్రజాప్రభుత్వ మనగా గొందఱు నాయకులును, వారి

యనుయాయులును, దమస్వార్థమునకయి సేయు వెక్కిరింతపని. కాగా, అది ప్రజలకు వ్యతిరేకమైనను గావచ్చును లేక దుర్వినియోగమొన ర్చెడి యధికారమైనను గావచ్చును. నిజస్థితి నవలోకించగా న్యాయ్య ముగా సక్రమముగా నెన్నికోబడిన ప్రతినిధుల కేమాత్రము స్వాతం త్ర్యమును లేక కేవలము ప్రభుత్వనిర్వహణమున కయి యేర్పడు నుప కరణములుగ రూపొందెడిది. ఈ ప్రజాప్రతినిధుల కొసంగు "వోట్లు" వారి సమర్థతను, విశాల దృక్పథమును, గమనించి యీబడినవి కావు. నిజమైన యధికార మే కొలదిమంది నాయకుల చేతులందో, దేశము ప్రజా ప్రభుత్వ మను పేరితో నిరంకుశవిధానమున బాలింప బడు చున్నది. ప్రజా సమూహముచే బరిపాలింపబడు నొక సంస్థయం దొక విషయముంగూర్చి ప్రజ లెట్లు దలంచు చుందురో ఆయాయి భావము లకు బ్రాధాన్యత ఈబడును గాని యీవిషయముయొక్క యథార్థ మైన విలువ ఈబడదు.

రాజకీయ సంస్థలు నడపుటకు బుద్ధిమదగ్రగణ్యులును, అనుభవ పరులును గావలయును లేనిచో నెట్టి ప్రభుత్వమైనను వక్రగతి బట్ట గలదు. ప్రజా సమూహముచే బాలింపబడు ప్రజాప్రభుత్వ మిట్టి యను భవజ్ఞులు, ధీమంతులు లేకుండుటచే బ్రజానురంజనము కొఱవడుచున్నది. ఉన్నతాశయములను, మహోన్నతమైన నాగరకతయు, సంప్రదాయ ములును, హృద్గత మొనర్చుకొని యాచరణమున నుంచినంగాని యీ ప్రజా ప్రభుత్వము (Mob Rule) దేశమున కే విధమైన కళ్యాణము సేకూర్పజాలదు.

రష్యాలో దేశమున కుపయోగించునందాక సాంకేతిక సమ్మ తమేకలదుగాని యాత్మస్వాతంత్ర్యముగాని, కర్మస్వాతంత్ర్యముగాని లేదు. విశ్వవిఖ్యాతులగు సర్. యస్. రాధాకృష్ణన్‌గారు ప్రజాప్రభుత్వ స్వరూప మిటుల సాంగోపాంగముగ జిత్రించిరి. "ప్రజాప్రభుత్వము నీచభావములకును, గ్రమశిక్షణరాహిత్యమునకును నెలవయినది. అట్లని మన వార్తాపత్రికలు సాక్ష్య మిచ్చుచున్నవి. ప్రజాప్రభుత్వము విడ కులకును, షాత్యలకును, రక్షకభట న్యాయస్థానములకును, నర్తనశాలల కును ఎక్కువ అనుకూలమిచ్చినది. విద్యావిషయకావకాశములు ప్రజ

సామాన్యమున కధికముగనున్నను నాగరకము మాత్రమభివృద్ధికాలేదు. కలాశాలలకుం జనుట సుళువై నదిగాని విద్యాభ్యాసముమాత్రము కొఱవడి భారమైనది. నేటి విద్యావిధానము మనల నెట్లు జదువవలయునో నేర్పినదిగాని స్వతంత్రించి యోజించుటకుందగు 'తాహతు' కలుగజేయ లేదు. ప్రజాసామాన్యమున కుద్బోధింపబడు విద్యయు, వార్తాపత్రికలు, చలనచిత్రములు వితంతువార్తలు లోనగునవి యన్నియుః గ్వాచిత్కముగ సామాన్య మానవునకు నడవడిక నిరోధములంగూర్చి యల్పజ్ఞాన మీాగల్గినవికాని పరిపక్వదశ నందించిన వనుటకు వలనుపడదు. దక్షులు, ధీమంతులు మాటాడ వెఱతురు కాని జనసామాన్యము వర్తించినరీతి వర్తింపకతప్పదు. ప్రజలయావేశము, ఉత్సాహము ప్రముఖమై యధికమై, యున్మత్తప్రలాపముల కాస్పదమైనది. విద్యయు నధికారమును సన్నగిలినవి. మనల నెదుర్కొనిన సంక్లిష్టపరిస్థితుల జర్చించుటకు దగిన యవకాశముగాని శక్తిగాని మనకు లేకున్నవి. ప్రజాసామాన్యపుటూహాపోహ లీ ప్రజాప్రభుత్వమున ప్రాధాన్యతవహించుచుండుటచే స్వల్పసంఖ్యాకులయిన వివేచనాపరుల వివేచనాశక్తి ప్రజాసమూహముయొక్క అభిప్రాయమునకు లొంగినది. చాలకాలము చర్చల కుద్దిష్టమై నిర్ధరింపబడిన "మంచి" తాత్కాలికావేశమున అవసరముం బురస్కరించి కొనిన "తొందర"లో లుప్తమైనది.

ప్రతిప్రజాప్రభుత్వమునను నాగరకుడైన ధీమంతుని యభిరుచిని బట్టి ప్రభుత్వమునడచుట యనునది లేక దేవానాంప్రియుని యుద్దేశము ననుసరించియె నడచుట దటస్థించుచున్నది ఆకారణమున సంఘమందు దూరదృష్టి—వివేచనాశక్తి తఱగి నిర్మాణశక్తియు జీవశక్తియు సన్నగిలినవి. వ్యాపారమే ప్రధానముగా బెట్టుకొనిన ఈ యంత్రయుగమున మానవులకు నిత్యకృత్యములకు మించి బుద్ధిచే యోజింపందగునవకాశమే లేకున్నయది. జనులలో నిరంతరాభివృద్ధిదమగు జీవశక్తి లోపించినది. ఏవ్యక్తి కావ్యక్తి తనకు గాలముం బుచ్చుటకు దగుసాధనాంతరముల నన్వేషించి వానిం జేకూర్చ బాటుపడుటయందె దృష్టి నిగుడ్చుట దటస్థించుచున్నది. గాని సంఘశ్రేయస్సునకు, సమష్ట్యభివృద్ధికి యత్నించుట లేదు.

జనులు ద్రవ్యారాధకు లయిరి. వారికి దామెట్టు లోక్యసారిగా గుబేరుల మయ్యెద మనునాశ పట్టిపల్లార్చుచున్నది. న్యాయముగనో అన్యాయముగనో తాము ధనవంతులము కావలెనని యనుకొనుటదప్ప వారికి వేఱొక పరమావధి లేదు. సంఘమున ధనమునకు నిలువయధిక మైనది. ధనమున్న వారు సంఘమునకు నాయకు లగుచున్నారు. ఒకప్పుడు సంఘమంతకును మార్గదర్శకులయి, యాదర్శప్రాయు లయి, యజరామర మగు కీర్తిగాంచిన విద్యాధికులను, మతగురువులను, సంస్కారులను, గౌరవించుట-ఈనాడు శూన్యమైనది. అనగా గౌణమవడినది. ధనార్జనమే మానవున కాదర్శప్రాయమైనది. విధ్యుక్తమైనది ఇట్టిధనార్జనమే పరమ ప్రాప్యముగ బెట్టికొనిన దేశ మెంత యైశ్వర్యవంతముగ నుండినను ప్రపంచమున విఖ్యాతిజెందజాలదు, మార్గదర్శకము కాజాలదు.

ఉన్నతమైన యాధ్యాత్మిక చింతనాపరులమైన మనము మన ప్రాచీను లగు ఋషిసత్తములు మనకు బోధించిన 'విశ్వశ్రేయ' మను మాటను బాశ్చాత్యసంప్రదాయ బద్ధులమైనను విస్మరింపజాలము. ఆర్థికస్వాతంత్ర్యము మన శ్రేయస్సునకు మూలబంధము కాజాలదు. పైగా, ఆయార్థిక స్వాతంత్ర్యము మనలో అహంకారమమకారముల బెంపొందింపజేయును. ఇక్కాలమున మనము మహత్తర భోగములతో గాలము బుచ్చుచున్నారము. ఉన్న స్వల్పవ్యవధియు నుత్తమోత్త మాదర్శములతోగాక నిరంతర భోగలాలసులమై కేకిసల గొట్టికొనుచు వృథసేయుచున్నారము. ఇట్టి స్థితిలో నే ప్రభుత్వమైనను సంఘ శ్రేయస్సు నభివృద్ధి పఱుపజాలదు. రష్యాసైత మార్థిక దుస్థితినుండి విముక్తి బడయలేదు. రష్యా భూతలస్వర్గముగ నైనదని లోకమున ప్రవర్తిల్లిన దుర్భ్రమ నిరాధారము.

ప్రపంచమున నే దేశమైనను ఆర్థిక సమత్వము, ప్రతిపత్తి బొందియుండలేదు, పొందజాలదు. ఏలయన, మానవులంద ఱొకేవిధ మగు సహజశక్తులతో లేరు. అట్లులుండుటకును వలనుపడదు. ప్రకృతి స్వభావముకదా! కొందఱు మహామేధావులును, నింకగొందఱు మహా బలాఢ్యులును, మఱికొందఱు ఆరోగ్యవంతులును నగుటచే నార్థిక సమత-ప్రతిపత్తి కుదురదు. ఆర్థిక సమత్వము—ప్రతిపత్తిలేనిదే రాజ

కీయ సమత్వముగాని ప్రతిపత్తిగాని లేదు. సంఘమున గర్భితమైయున్న ఈ విభేదములు ప్రకృత్యనుగుణములుగాన, మన మెంతగా దుడిచి వైవనుంకించినను బరిహాసపాత్రుల మయ్యెద మని తెలిసికొనదగును.

సృష్టిలోనున్న యనేకత్వమందలి యేకత్వమును స్థిరపఱుపు డని యుపనిషత్తులు వాకొనినవి. కాని సామ్యవాదములోవలె సమతను దల పెట్టలేదు. ఈసిద్ధాంతమునే సంయుక్తరాష్ట్రములకు బాలకుడు (Governor) గానున్న సర్. హెరీహేగ్ గారు ప్రతిపాదించియున్నారు. లోకమున బ్రవర్తిల్లిన ఈయనేక శక్తుల నేకోన్ముఖ మొనర్చి నడపించి నంగాని విశ్వశ్రేయ మొదవజాలదు. సామ్యవాదు లావిధముగ జేయక వివిధవర్గముల నడుమనున్న వైమనస్యము పెంపొందింతురు, సంఘమున గల యీశక్తులనన్నిటికి జీవశక్తియుండుటచే నివి యన్నియు సంఘ శ్రేయస్సునకును, విశ్వకళ్యాణమునకును దోహదమొసంగును. ఒక వస్తువున కందలి ప్రతిభాగమును దద్వికాసమున కెట్లు దోహద మొసంగునో యెటుల దోడ్పడునో, యట్లే యవియును విశ్వకళ్యాణము నకు సంఘశ్రేయస్సునకు దోడ్పడు నని యెఱుంగదగును.

ఆ రీతిగనే ప్రపంచమున సర్వసమత్వసిద్ధాంత ప్రతిపాదన మస త్యమును, నిరాధారమును మాత్రమే కాక యుపద్రవకారియై సంఘ మున బలువిషయములలో విప్లవమును, బరివర్తనమును, వికాంతిని బ్రవేశపెట్టునని గ్రహియింపనగును.

మన దేశములోని రాజకీయ పరిస్థితు లసంతృప్తికరముగా నున్నవి. మానవసంఘముయొక్క నీతిమార్గములును రాజకీయాధికార ములును, ఆర్థికపరిస్థితులును బ్రపంచమునందంతను దినదినము తల్లడిల్లి తాఱుమారగుచున్నవి. ఇట్టి విషయములలో బ్రజలకు మనస్స్వాస్థ్యము లేకున్నది. ఈ సాంఘిక రాజకీయవిషయములలో బ్రాతిపదికము లయిన మూలసూత్రములను గుఱించి మనము యోజింపవలసి యున్నది. రాజకీయసాంఘికార్థిక విషయముల బ్రత్యేకప్రత్యేకముగ విమర్శింప వలనుపడదు. ఇవియన్నియు నన్యోన్యాశ్రయములుగల సమ్మానా ర్థములుగల విషయములు. ఇక్కాలమున వివిధవిషయముల సమన్వయము

లేక పోవుటవలన మానవజీవిత వ్యవహారములన్నియు వక్రమార్గములం బడి సంఘమును మహోపద్రవములకు నీడ్చుచున్నది.

రాజకీయపక్షములు పరస్పరవిరుద్ధములైన యుద్దేశములతో వివదించికొనుచు, నొకపక్షమునెడ నింకొకపక్షము ఈర్ష్యాసూయల జూపెట్టుకొనుచు, నా యీర్ష్యాసూయలు మితిమీఱినపుడు శత్రుత్వముంగూడ వహించుచున్నవి. ఒకప్పుడు భారతదేశమున కంతకును నేకైకరాజకీయసంస్థగా దేజరిల్లిన "భారతజాతీయమహాసభ" (National Congress) నేడు యావద్భారతదేశమునకు బ్రాతినిధ్యము వహించుట లేదు. ప్రముఖులయిన కొందఱు నాయకుల పలుకుబడికి లోనయి భారతజాతికి "దేవాలయప్రవేశచట్టము, అస్పృశ్యతా నివారణచట్టము, విడాకులచట్టము, వర్ణాంతర వివాహసమర్థకచట్టము" లోనగునవి తెచ్చి భారతజాతియందు బ్రధానభాగమైన సనాతనులబలమును, ప్రాపును, సహకారమును, బోగొట్టికొనియెను.

సమష్టినియోజకపద్ధతిని సమర్థించినట్లు నటించిన కాంగ్రెస్సు నేడా పద్ధతికి స్వస్తిజెప్పి భారతజాత్యభివృద్ధి కత్యంత నిరోధకమైన 'సాంఘిక పరిష్కారము' (Conmunal Award) ను సంశయించుచు సంశయించుచు నా సమయముననే యద్దాని సమర్థించుచుండెను.

అంతియకాక నేడు కాంగ్రెస్సు నూతన రాజ్యాంగచట్టమును భగ్నమొనర్పజూచిన సామ్యవాదుల చేతులలో బడినది. ఇక కొలది దినములలో "కాంగ్రెస్సు" సామ్యవాదుల యాజమాన్యమున సామ్యవాదము (Communism) బ్రవేశపెట్టి 'వ్యక్తిగత మగు నాస్తిని' (Private property) దొలగించి దేశములో నెలకొనియున్న ప్రభుత్వమును, శాంతిభద్రతలను నిర్మూలించు నని చెప్పినచో నయ్యది యసంభవము కాజాలదు. ప్రజాసామాన్య మీసామ్యవాదమహత్త్వమునకు, నుదేశికమునకు లోనయి ప్రాచీన హైందవసంప్రదాయములను, సభ్యతను, నునూ్మలింప జూచుచున్నసంగతి ప్రాజ్ఞలోక మెఱుంగ దగునని తలంతుము. (త్రి. లి).

---

# నా కవన ప్రసూనములు

విద్వాన్, పేదిపల్లి లక్ష్మీకాంతంగారు



**పుష్పసందేశము ౧**

పుష్పమా! నీకు ముద్దులు పోహళించి
పూలహారముగా నొక్క లీలఁ గూర్తు—
ఎఱుఁగఁ దెల్పుము ననుగూర్చి యింతికడకుఁ
దరలి—శిరమున నినుదాల్చి మురిసియాడు.

**సౌకుమార్యము ౨**

లేతఁదనమెవిలువ— అదిలేమకొదవె
నేని మేలిమి నెత్తావి పూనినట్లు
చక్కఁదనము, రసజ్ఞత, చనువు, చదువు
గలిగెనేఁ జెప్పవలయునే కలికితీరు!

**అసలుసంగతి ౩**

మోముచందురుఁ డనురాగమును లగించు
సరణిఁ దెలిపె దృక్కంజన శాబకములు;
కానిచోఁ గాము బారి కగ్గంబుకాఁగఁ
దరుణి పదజలజము లేల తలను దాల్చు.

**ధైర్యకవచము ౪**

జవ్వనముపొంగి పొఱలెడు సఖియ కంచు
కంబువలె ధైర్యకవచంబు, కాగి, సడలి,
మృదువయి, పిగిదిలేఁ జిటుకున, నింతివీక్ష
ణాశుగంబులు హృదయంబు హత్తినంత.

**విటుఁడు ౫**

ఎపుడు ప్రేమిుడి ముద్దిచ్చు, నెపుడు కూడు
నని నిరీక్షించు సతి వల పరయలేడు—
చిడిముడిని విదల్చి కసరి చిన్నబుచ్చు
స్వైరిణీ సంగతిని గోరు జముఁడు విటుఁడు.

# సరస్వతి బ్రహ్మభార్య కాదా?

ఆంధ్రవ్యాస నిపుణ ఆవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు



శ్లో॥ నీహారహారఘనసార సుధాకరాభాం
కల్యాణదాం కనక చంపక దామ భూషామ్,
ఉత్తుంగపీనకుచకుంభ మనోహరాంగీం
వాణీం నమామి మనసా వచసాం విభూత్యై.

మహాశయులారా !

విభూతి యొకటవ సంపుటము, ఆరవ సంచికయందు, శ్రీ 'విద్యానిధి'గారు "సరస్వతి బ్రహ్మ భార్యయా?" అను శీర్షికతో సరస్వతి బ్రహ్మదేవుని భార్య గాదని నిఘంటువులచే నిరూపించుటయు, నాపైని యెనిమిదవ సంచికయందు బ్రహ్మశ్రీ శతావధాని గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు "సరస్వతి బ్రహ్మభార్యయే" యని శ్రుతి స్మృతుల మూలకముగ నిరూపించెడి వ్యాసము వ్రాయుటయు జరిగినవి. అంతఁ బో మరల శ్రీ 'విద్యానిధి'గారు పదియవ సంచికయందు "సరస్వతి బ్రహ్మ భార్య కాలే"దనుచు నింకొక వ్యాసమును బ్రచురించిరి. ఈ వ్యాసత్రయమును పరికించిన తదుపరి నా స్వల్పబుద్ధికి గోచరించిన విషయములతో 'సరస్వతి బ్రహ్మభార్యయే'యని వ్రాయుచున్నాను. నా యీ వ్యాసమునందు విశేషముగ శ్రుతి స్మృతులను చూపెట్టుటలేదు; దిఙ్మాత్రముగ జూపుచున్నానని మనవి.

శ్రీవిద్యానిధిగారు పూర్వవ్యాసమున నమరమునందు సరస్వతి బ్రహ్మభార్యగా వ్రాయంబడి యుండలే దనియు, నమరేశ్వరుని కాలమునకు సరస్వతి బ్రహ్మ భార్యగాఁ బరిగణింపఁబడి యుండలేదనియు,నటుల పరిగణింపఁబడిన పక్షమున నిఘంటువున నేల వ్రాయఁ డనియు శంకించి సరస్వతి బ్రహ్మభార్య కా దనిరి.

దీనిపైఁ బరామర్శను శ్రీవీరరాఘవశాస్త్రిగారు వ్రాయుచు నరుణము, శీక్షావల్లి, అమరకోశకారుని కివతల వారివిం గొన్ని, పూర్వపు వారివిం గొన్ని ప్రమాణములను చూపెట్టుచు సరస్వతి

బ్రహ్మభార్యయే యని రుజువుచేయుటకుం బ్రయత్నించిరి. ఫలితము కలదా? యనుచో మరల విద్యానిధిగారు యుత్తరవ్యాసమున శాస్త్రిగారి వాద మంత్రయుఁ దమవాదమున కనుకూలం బనియు, పూర్వపక్షముగా లేదనియు వ్రాసినందున మేమును ప్రయత్నించి రని వ్రాయవలసి వచ్చుచున్నది. విద్యానిధిగారి వాదము ప్రకారము సరస్వతి బ్రహ్మ భార్యయే యని స్పష్టముగఁ దేటతెల్లముగఁ జెప్పినట్లు కానుపించుట లేదు.

ఇఁక నేను వ్రాయు ప్రమాణములను బట్టి సరస్వతి బ్రహ్మ భార్య యగునో కాదో సిద్ధాంతము చేయలేను కాని, లోకమును, వ్యాస కర్తలును, యొకవిధముగ సిద్ధాంతపరచుకొన గల రని మాత్రము యాశించుచున్నాను.

అష్టోత్తరశతోపనిషత్తులలో "సరస్వతీ రహస్యోపనిషత్తను నదియొకటి కలదు. ఆ యుపనిషత్తు ఋగ్వేదీయము. దీనిని యాశ్వలాయ నులు ప్రకటించిరి. ఇది కేవలము వేదాంతపరముగా నున్నను యుపాస కుల సిద్ధికొఱకు, కవితాధార యలవడు నని ఫలశ్రుతిలో మేళవించి చెప్పఁబడినది. లక్ష్యశుద్ధి శబ్దసామగ్రికి, కవితాధారకు యుపాసన, గమ్యస్థానము ప్రణవమందిరము. మొదటిది ప్రాపంచికమునకు, రెండ వది పారమార్థికమునకు; సర్వవిధముల మానవుని బాగుచేయు నీ యుపనిషత్తునందు.

"శ్లో॥ చతుర్ముఖ ముఖాంభోజ వనహంసవధూ ర్మమ,
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ.

శ్లో॥ నమస్తే శారదే దేవి కాశ్మీరపురవాసిని,
త్వామహం ప్రార్థయే నిత్యం విద్యాదానంచ దేహి మే.

శ్లో॥ అక్షసూత్రాంకుశధరా పాశపుస్తకధారిణీ,
ముక్తాహారసమాయుక్తా వాచి తిష్ఠతు మే సదా.

శ్లో॥ కంబుకంఠీ సుతామ్రోష్ఠీ సర్వాభరణ భూషితా,
మహాసరస్వతీ దేవీ జిహ్వాగ్రే సన్నివిశ్యతామ్.

శ్లో॥ యా శ్రద్ధా ధారణా మేధా వాగ్దేవీ విధివల్లభా,
భక్తజిహ్వాగ్రసదనా శమాదిగుణదాయినీ.”

అని కలదు. ఈ శ్లోకము లన్నియు స్తవములే, కాని ప్రథమ శ్లోక ప్రథమచరణమునందు “చతుర్ముఖముఖాంభోజవనహంసవధూ” యనియు, పంచమశ్లోక ప్రథమపాదమునందు “వాగ్దేవీ విధివల్లభా” యనియు కలదు. ఈ రెండు వాక్యములచే సరస్వతి బ్రహ్మభార్యయే యని రుజు వగుచున్నది.

మఱియు నిదే యుపనిషత్తునందు, సరస్వతీ ధ్యానములో

“శ్లో॥ యా సాంగోపాంగ వేదేషు చతుర్ష్వేకైవ గీయతే,
అద్వైతా బ్రహ్మణశ్శక్తి స్సా మాం పాతు సరస్వతీ.

శ్లో॥ నామరూపాత్మకం సర్వం యస్యా మావేశ్యతాం పునః,
ధ్యాయంతి బ్రహ్మరూపైకా సా మాం పాతు సరస్వతీ”

యనియుఁ గలదు. వీటియందు సరస్వతీ బ్రహ్మల కవినాభావ సంబంధముం జెప్పఁబడినది.

ఇంకను నిదేవిధముగ రుద్రయామిళమునందు ఘటతంత్రమునం గల దేవీ మాహాత్మ్యమున పదునేఁడవ పటలమను పేరుగల శ్రీమహా సరస్వతీసూక్తమున,

శ్లో॥ దృఢేనవై శృంఖలయాచ సృణ్యా
విధాతృపత్న్యా చ తథైవవాచా,
శ్లీంక్లీంచ వహ్న్యైకిల శోభయాచ
న్యాసైరమీభిః పరితోపిశంభుః.

అని తేటతెల్లముగా సరస్వతి బ్రహ్మభార్యగాఁ జెప్పంబడినది ఇదే సూక్తమున సరస్వతీ ధ్యానమునందు,

శ్లో॥ సరస్వతీం తా మను నౌమి వాచం
వచఃప్రదాం హంస వరాధిరూఢామ్,
ముక్తా మణిద్యోతితకంఠహారాం,
భాగ్యైకలభ్యాం పరమాం పవిత్రామ్.

శ్లో॥ త్వమేకవాణీ నిఖిలాశ్చ వేదా
స్త్వం శబ్దశక్తిశ్చ తథార్థశక్తిః,
త్వం బ్రహ్మవిద్యాసి పరాపరేశి,
త్వాం బ్రహ్మశక్తిం శరణం ప్రపద్యే,

అని యవినాభావ సంబంధముగ వర్ణింపఁబడినది. ఇదే సూక్తమున ఫలశ్రుతి యధ్యాయమున,

బ్రహ్మోవాచ—

శ్లో॥ తద్యథా మేమనో దేవి దృఢంభవతుసర్వదా,
ఏవమేవవరస్సాక్షా దుత్తమో ప్రియ తేమయా॥

అని బ్రహ్మచేఁ జెప్పింపఁ బడినది.

'విధివల్లభా' 'విధాతృపత్ని' యను శబ్దములకు వే రర్థములుకలవని విద్యానిధిగా రందు రేమో ! వారే నిఘంటువును ప్రమాణముగ గ్రహించిరో యా యమరమునందే.

శ్లో॥ బ్రహ్మాత్మభూ స్సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః,
హిరణ్యగర్భో లోకేశ స్స్వయంభూ శ్చతురాననః॥

శ్లో॥ ధాతాబ్జయోని ర్ద్రుహిణో విరించిః కమలాసనః,
స్రష్టా ప్రజాపతి ర్వేధా విధాతా విశ్వసృడ్విధిః॥

యని బ్రహ్మదేవునకు నామములు కలవు. ఈ నామములను విద్యానిధిగారు వారి పూర్వ వ్యాసమునఁ జూపెట్టియుండిరి. కావున పై యాధారముల ననుసరించి సరస్వతి బ్రహ్మ భార్యయే యని తెల్లమగుచున్నది. లోక ప్రతీతి ననుసరించి చూచినను, తెలుఁగుకవుల యాచారము ననుసరించి చూచినను బ్రహ్మభార్య సరస్వతియే యని యూహింపవచ్చును. మచ్చునకుఁ దెలుఁగు కవుల పొత్తములనుండి గొన్ని పద్యముల నుదాహరించెదను.

ఉ. నాలుగు మోములన్ నిగమ నాదము లుప్పతిలన్ బ్రచండవా
తూలహతిన్ జనించు రొదతోడి గుహావళి నొప్పు మేరువున్
బోలి పయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁ గూడి పే
రోలగ మున్నధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్.

—మనుచరిత్రము.

చ. సిరియును వాణి గౌరియును జెన్నగు కన్యకు మేనువాక్కుఁ బె
న్నురమును నుంకు విచ్చి ముద మొప్ప వరించి జగంబులన్నియుం
దిరములు సేయఁ బ్రోవఁ దుదిఁ దీర్పఁగఁ ద్యక్షయుగేక్షణుండునై
హరివిధిశంభుమూర్తియగు నాథ్యుఁడుమాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

—వీరభద్రవిజయము.

కం. వేణీరుచివిజితాభ్ర
శ్రేణీ జనితప్రభాధరీకృతపులిన
శ్రోణిన్ వీణాపుస్తక
పాణి న్వాణి న్నుతింతుఁ బద్మజురాణిన్

—తామరపల్లి తిమ్మయకవి, శేషధర్మము

తే. వాణి, నజురాణి, ఘననీలవేణి, మధుర
వాణి, బల్లవసంకాశపాణిఁ, బృథుల
సైకతశ్రోణి నాత్మలో సన్నుతింతు
సుమధుమధుర సుధావచస్స్ఫూర్తికొఱకు.

—హంసవింశతి.

గీ. ప్రణవ వర్ణంబు దా నుండు భద్రపీఠి
గాఁగ నింపారు నజురాణి కమలపాణి
వాణి కృపసేయు నెపుడు వాగ్వైభవంబు
నెలమితోఁ జుండి కాళమంత్రీశ్వరునకు.

—శృంగార మల్హాణ చరిత్ర.

సాధుమతులారా !

సరస్వతి బ్రహ్మభార్యయే నని యిందుఁ దేలినను, యింకను బల వత్తరమైన ప్రమాణము లున్నఁ జూపుచు సత్యమును వెల్లడింతురు గావుత మని యాశించుచు నింతటితో విరమించుచున్నాను.

సత్యంవద! ధర్మంచర!

స్వాధ్యాయా న్మాప్రమదః, ఓం శాంతిః.

[ ఈ వ్యాసమందు ననేక ప్రమాణముల నిచ్చినారు. కాని యవి యన్నియు నాధునికములే యగుటవలన నెక్కువ ప్రయోజన మగప

డదు. "సరస్వతీ రహస్యోపనిషత్తు" అను గ్రంథము సనాతన ధార్మికులకు శ్రద్ధాభాజన మనుటలో సందియము లేదు. ఈ యుపనిషత్తు దశోపనిషత్తులవలె ప్రాచీనమనుటకు యుక్తులు గానలసి యున్నవి. పైగా దండికవి తర్వాత నెవరో ఈ యుపనిషత్తును సంకలనము చేసియున్నారని నైతిహాసికుల వాదమై యున్నది. అష్టోత్తరశతోపనిషత్తులలో కొన్నితప్ప తక్కినవి చాల యిటీవలి వని మరియొక వాదము కలదు. కావున నిస్సందిగ్ధమైన ప్రబల ప్రమాణములతో బ్రహ్మభార్యాత్వమును ప్రతిపాదించ వలెనని కోరుచున్నాము. సంపాదకుడు]



# కలియుగనీతి

**కవిరత్న: లక్కన మల్లికార్జునుడుగారు**

---

గీ॥ ప్రొద్దు పొద్దున మేల్కాంచి • ముద్దుమోము
కడగి, పౌడ రద్దుట, కాఫి • కప్పుగొనుట,
కిళ్ళివేయుట, సిగరెట్టు • కేలఁబట్టి
దమ్ము లాగుట తప్పని • ధర్మమయ్యె. 1

గీ॥ అంత పేకాట షాపుకు • గంతు లిడుచు
పోయి మిత్రులతో నాట • పొంగి పొంగి
ధూమ పానము చేయుచు • నీమ మిడక
నాడుచుండుట శీలంబు • నేడు కనగ. 2

గీ॥ పదిఘడియల కింటికినేగి • భార్యమీద
లేని తప్పుల కల్పించి • స్నానమాడి
కడగి భుజియించి యామెను • కసరి తిట్టి
హాయిగా నిద్ర చెందుట • హాయి హాయి. 3

గీ॥ రెండు గంటల టయిముకు • లేచి మరల
ఉపమ తగ మెక్కి కాఫీని • యొకర త్రాగి.

నీటుగా క్రాపు సరిదిద్ది ♦ బూటువేసి
సూటుకోటుల సొంపును ♦ చూపుచుండి. 4

గీ॥ సఖులతోఁగూడి వీథులఁ ♦ జక్కఁతిరిగి
వనిత మోముల గాంచుచు ♦ వదరుకొనుచు
మురియుచుండుట; వింతల ♦ జరుపుచుంట
భవ్య శౌర్యంబు లీనాడు ♦ పురజలయందు. 5

గీ॥ సూర్యభగవానుఁ డపరాద్రి ♦ జొచ్చినంత
జరయు మృత్యువుచేరని ♦ సుర యటంచు
కల్లుషాపుకు చేరియు ♦ కొల్లఁ ద్రాగి
పిచ్చియెత్తిన మనుజుండు ♦ వెలయునటుల. 6

గీ॥ తూలుకొనుచును షోకుగా ♦ లీలవిడుచు
యింటఁ జేరియు తంతుల ♦ నెసగఁ గూర్చి
యాలిఁగొట్టుట పౌరుష ♦ మాయె నిపుడు
కటకటా ! యేమి చెప్పుదు ♦ కాలమహిమ. 7

గీ॥ మత్తుతగ్గిన వెంటనే ♦ మరల మెక్కి
యింట నుండక తన ముండ ♦ యింటికేగి
దాని యడుగుల నొత్తుచు ♦ దనియుటెల్ల
వీరపురుషుని లక్షణ ♦ మూర నేడు. 8

గీ॥ తాత ముత్తాతనాటి వి ♦ త్తంబునంత
యిచ్ఛకొలదిని వెచ్చించి ♦ హీన మతిని
పేరు పుణ్యంబుగానక ♦ ఘోర పాప
పంకిలంబున బడుటయె ♦ పరమపథము. 9

గీ॥ ఇట్టి దినచర్య లెంద రి ♦ ప్పట్టునందు
విడువ జాలక వర్తించి ♦ విమలమతులఁ
బుణ్యశాలులఁ బండిత ♦ బృందములను
పరమభక్తుల ఛాందస ♦ ప్రతతియనుచు
నిందచేయుట లీనాడు ♦ నీతిసుమ్మి
త్యాగ గుణకదంబ! మదంబ! ♦ నాగమాంబ ! 10

ఓం

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## (౯) శ్రీ వైద్యనాథలింగము*

సంథాల పరగణాలో (E. I. Ry) జసీడీహ స్టేషనుకు 3 మైళ్ళ దూరమున నొక బ్రాంచి లయినులో నీ క్షేత్రరాజము విరాజిల్లు చున్నది. ఈ లింగమును స్థాపించిన యితిహాసము యీ విధముగ నున్నది.

ఒకానొక సమయమున రాక్షసరాజగు రావణుఁడు హిమాల యముపైకి వెళ్ళి శివభగవానుని గుఱించి ఘోరమగు తపస్సొనరించెను. మఱియు తన శిరస్సుల ఛేదింపుచు శివున కర్పింప మొదలిడెను. ఒక దాని వెంట నొకటి వరుసగా ౯ శిరములు ఛేదించి శంకరార్పణ మొన రించెను. దశమశిరః ఖండనకుఁ బ్రయత్నముచేయు సందర్భమున శివుఁడు ప్రత్యక్షమై యొప్పెను.

రావణుని పదితలలు యథాపూర్వమైనవి. అతనిని వరముల నిచ్ఛగించుటకై పరమేశ్వరుఁడు కోఱెను. రావణుడచటనుండెడు జ్యోతి ర్లింగమును లంకానగరమునకు గొంపోవ ననుమతి శివ భగవాను నర్థిం చెను. శివుఁ డాజ్ఞ నొసంగెను.

అయిన నొక నిర్బంధము మాత్ర మా యాజ్ఞయందుఁ గలదు. అదేమన నా లింగమును మార్గమధ్యమున నెందేని భూతలమున నిలి పినచో నా లింగము స్థిరమైయుండును. చివరకా ప్రకారమే తటస్థించి నది. రావణుఁడు శివలింగమును గైకొని వెళ్లిన పిదప మార్గమధ్య మున నుండు చితాభూమి పరిసరమున కేగుట తటస్థమయ్యె. అంత నాత నికి లఘుశంక చేయు నవసరము గలిగెను. అచట నుండెడు నొక గోపా లకునికి లింగమును వశపరచి యల్పాచమానమున కా యసురేశ్వరుం

---

* (పరల్యాం వైద్యనాథంచ) యను శ్లోకపాదము ననుసరించి యీవైద్యనాథే శ్వరుని జ్యోతిర్లింగముగా భావింపక హైదాబ్రాదు రాజ్యమునందలి (పరలీ) గ్రామ శివలింగమునే జ్యోతిర్లింగమని యెన్నెదరు.

డరిగెను. లింగభారమును వహింపఁ జాలక నా యహీరుడు దానిని నేలపై నిలిపెను. ఏమని చెప్పవలెను. లింగ మచంచలమైనది. రావణుఁడు తన పని ముగించుకొని లింగమును సన్నిహితింపనెను. తన సంపూర్ణశక్తిని వినియోగించి లింగమును పెకలింప సమకట్టెను కాని యది సులభసాధ్యమగు పనియా? నిరాశాచేతస్కుఁడై శివలింగముపై తన యంగుష్ఠముతో నొక గుఱుతుగావించి లంకా నగరాభిముఖుఁడయ్యెను.

తదనంతరము బ్రిహ్మావిష్ణ్వాది దేవతా బృందము నా లింగము చెంతకేతెంచి యర్చనము గావించెను. శివభగవానుని దర్శించి యతని ప్రితిష్ఠాపూర్వకమగు స్తుతిగావించి తమతమ లోకముల కేగిరి.

వైద్యనాథలింగము మహత్తరమైన ఫలము ల జనుల కొసఁగునది ఈ ప్రిదేశమునందలి వాతావరణము చాలా శ్రేష్ఠమైనది. అనేక వ్యాధిగ్రిస్తులిచట నివసించి రోగ విముక్తులయ్యెదరు. స్టేషనుకు గొంచెము దూరమున నొక తటాకముఁగలదు. దీని నలువైపుల బలిష్ఠములగు ఘట్టములు నిర్మింపఁబడియున్నవి. చెఱువు సమీపమున ధర్మశాల యొకటికలదు. శివలింగము (౧౧) అంగుళముల యెత్తుండును. ఇప్పటికి నా లింగముపై కొంతపల్లముగాన్పించును. ఇచట దూర దూరములనుండి జలమును కొనివచ్చుట లింగాభిషేక మొనరించుటగొప్ప మహిమాస్పదమని తెల్పఁబడుచున్నది. అనేక యాత్రికులు భుజములపై నీటి కావళ్ల మోసికొని వైద్యనాధుని సన్నిధి కేగుట కాననగును. కుష్ఠవ్యాధి పీడితులు రోగవిముక్తికొరకై అనేకు లిచటికి వచ్చెదరు.

తొల్లి భగవానుఁడగు, శంకరుఁడు సతీదేవి శవమును స్కంధములపై నుంచి యున్మత్తునిభాతి సంచరించుచుండెను. అపు డా దేవి హృత్పిండముకరిగి యీ ప్రిదేశమునందే పతనమైనది. దాని నచ్చోటనే దహనసంస్కార మొనరించెను. ఇంతియకాదు. శివపురాణమందలి దిగువశ్లోకము దీనికిదృష్టాంతమై యున్నది. "శ్లో॥ ప్రిత్యక్షం తంతదా దృష్ట్వా ప్రితిష్ఠాప్యచ తే సురాః! వైద్యనాథేతి సంప్రోచ్య నత్వా నత్వా దివం యయుః" భావము "శివుని ప్రిత్యక్షముగా దర్శించి యతని

లింగమును ప్రతిష్ఠించి దానికి వైద్యనాధు డను పేరిడి నమస్కారమొన
ర్చుచు దేవతలందఱు స్వర్గమున కేగిరి."

ఈ సందర్భమున పరలీస్థానముయొక్క పరిచయము గావించు
టయు సమంజసమని తోచుటచే దిగువ వివరింపఁబడుచున్నది.

బొంబాయినుండి ప్రియాగకు బోవు ధూమశకట మార్గము
(G. I. P. Ry.) లో బొంబాయినుండి (162) మైళ్ల దూరమున ప్రసిద్ధ
మగు మన్మాడ్ స్టేషను కలదు. అచటినుండి నైజాం రాజ్యపు రైలు
మార్గ మొకటి పోయియున్నది. ఆమార్గమున హైదరాబాదునగరము
నుండి కొన్నిమైళ్ల దూరమున పర్భనియను (కూడలి) జంక్షను కలదు.
అటనుండి పరలీవరకు ఒక రైలుశాఖ పోయియున్నది. ఈ పరలీ స్టేష
నుకు కొంత దూరమున పరలీగ్రామ సమీపమున శ్రీ వైద్యనాధ
జ్యోతిర్లింగము కలదు. మందిర మతి ప్రాచీనము. దీని జీర్ణోద్ధారము
ఇందూరు మహారాణి అహల్యబాయిచే జరిగినది. మందిరపు దిగువభాగ
మునం దొకనది ప్రవహించును. మఱియు చిన్న కోనేరొకటి యున్నది.
శిఖరారోహణమునకై సోపానములున్నవి. మందిర సంబంధము నైజాం
రాజ్యమునలోనున్నది. అనేకుల యభిప్రాయానుసారము పరలీవైద్యనాధుడే
వాస్తవిక జ్యోతిర్లింగముగా దక్షిణదేశమున ప్రసిద్ధమైయున్నది. ఈ
పరళీ గ్రామమున గడిచిన రక్తాక్షినామ సంవత్సరములో కొందరు
స్మార్తులు వీరశైవులకు వైదిక మంత్రములతో శ్రీ వైద్యనాధ జ్యోతి
ర్లింగము నభిషేకించు అధికారములేదని గొప్పగా అల్లరిచేయగా
షుమారు ఆరుసంవత్సరములవరకు శాస్త్రచర్చలు వ్యాజ్యములు అత్య
ద్భుతముగా జరిగి వీరశైవులకు విజయము కలిగినది. ఆ సందర్భమున
మహారుద్రాభిషేకము శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారి
హస్తమునుండియే జరిగినది. ఈ కాండకు నిజాందేశమున పరళీ ప్రక
రణమని పేరుగలిగినది. దీనికి సంబంధించిన పెద్ద వ్యాసమును, చిత్రమును
ముందు సంచికలో ప్రకటించగలము. పరళీలో వీరశైవులు చాలగా
గలరు. గొప్పక్షేత్రము. సికింద్రాబాదు హైదరాబాదునుండి పర్లీకి
నేరుగా రైలు కలదు.

## (౧౦) శ్రీ నాగేశ్వర లింగము *

శ్రీ భగవానుఁడగు నాగేశ్వర క్షేత్రము గోమతీ ♦ద్వారకనుండి బేట్ ద్వారకాపురి వెళ్లునపుడు ఈశాన్య మూలయందు మార్గమున నున్నది. అటనుండి ౧౨ మైళ్లదూరము. ద్వారకనుండి యీ ప్రదేశమున కేగుటకు వృషభ శకటములు చిక్కును. ద్వారక వెళ్లుటకు రాజకోట వరకు మార్గము వేరావల్ (సోమనాథము) వెళ్లుటకు గత 'సంచిక'లో దెలుపఁబడినది. రాజకోటనుండి జాం నగరము వెళ్లుటయు అటనుండి జాం నగరము- ద్వారకా రైల్వేద్వారా ద్వారక పోవచ్చును.— లింగస్థాన సంబంధ మగు నితిహాసము దిగువ నుదాహృతము.

సుప్రియుఁడను పేరుఁగల నొకవైశ్యుఁడు కలఁడు. అతఁడు గొప్ప ధర్మాత్ముఁడు, సదాచారుఁడు. శివునియం దతని కత్యంతభక్తి ప్రపత్తు

---

* నాగేశ్వర జ్యోతిర్లింగములును మఱిరెండు కలవు. (౧) నాగేశ్వర జ్యోతిర్లింగము హైదరాబాదు రాజ్యమునం దున్నది. అయిన శివపురాణ మవలోకించిన పై నుదహరించిన ద్వారక మార్గమందలి నాగేశ్వరుఁడే ప్రామాణికమని రూఢి యగు చున్నది. అయిన నీ రెండవ నాగేశ్వరుని గుఱించి పరిచయముఁ గావించు టావశ్యకమై యున్నది. ఇది నైజాం హైద్రాబాదు రాజ్యాంతర్గత ఔంఢ్ గ్రామమందుగలదు మన్మాడ్ నుంచి ద్రోణాచలమువరకుపోవు నిజాం స్టేట్ రైల్వేలో పర్భణినుండి యొకిం చుక దూరముననుండు పూర్ణా (జంక్షన్)కు హింగోలివరకుపోవు రైల్వేశాఖయొక్కటి కలదు. అందు చౌండిస్టేషనుకు (౧౨) మైళ్ళదూరమున ఔంఢ్ గ్రామము గలదు. అచటికి వెళ్ళుటకు యెద్దులబండ్లు దొరకును. మోటారు వ్యవస్థయుగలదు..... ...... (౨) కొందఱి అభిప్రాయము ననుసరించి ఆల్మోడాకు (౧౭) మైళ్ళదూరమున నీశాన్య దిశయందుండు యాగేశ (జాగేశ్వర) శివలింగమే నాగేశ జ్యోతిర్లింగమని తెలియు చున్నది.

♦ ఈ సందర్భమున రెండు ద్వారకలు చూపఁబడినవి. ఒకటి భూభాగమం దున్నది. దాని సమీపమునం దొక (ఖాడీ)యందు దీనినే గోమతియని పిలిచెదరు. జవార్ భాట్ (సముద్రపుపోటు) వచ్చును. ఇచట గోమతీచక్రములును దొరకును. దీనిమూలమున గోమతీ ద్వారకయను పేరుగలిగినది. (౨)వ ద్వారకకు బేట్ ద్వారక యని పేరు. గోమతి ద్వారకనుండి (౨౦) మైళ్ళ దూరమునం దొక ద్వీపమున విరాజ మానమై యున్నది. ఈ రెండు ద్వారకలును ఒడోదా మహారాజు రాజ్యమునందే యున్నవి కాని (౧౮౧౭) క్రీస్తుశకమునుండి గోమతిద్వారక, యాంగ్లసామ్రాజ్య వశమున జేరినది.

లతో నుండువాడు. ఒకానొక సమయమున నతడు నావయందు ప్రయాణమై యెచటికో పోవుచుండెను. ఆకస్మికముగ దారకుఁడను పేరుగల రాక్షసుఁడు వచ్చి నావ నాక్రమించుకొనెను.

మఱియు నావయందుండు యాత్రికుల నందఱను తన పురమునకు గొంపోయి కారాగార బద్ధుల గావించెను. ఐనను సుప్రియునికి శివపూజ చెఱసాలయందును జరుగుచుండెను. అతడుశివునియందు మానసము లీన మొనరించి శివారాధన మొనరించు చుండెను. ఇతనిని చూచిన తోడి వారును శివభక్తితత్పరు లగుటకు కారణభూతుడయ్యెను. ఈవార్తను దారుకుడు విని తత్ప్రదేశమున కేగుదెంచెను. సుప్రియుని ధ్యాననిష్ఠను చూచి యీ విధముగాఁ బలికెను. “ఓరి వైశ్యుఁడా! నీవు కనులమూసికొని యేమి పన్నాగము బన్నుచున్నావు” అని భయంకరమగు నట్టహాసము గావించెను. మఱియు నింతటి భీతిగొల్పు గర్జనమునకు నా సుప్రియుని శివభక్తియందు కించిన్మాత్రమైన లోపము తటస్థించనందున యారాక్షసుడు తన సేవకులతో నా సుప్రియుని హత్యగావించుట కాజ్ఞాపించెను. సుప్రియుఁ డీ యాజ్ఞకును జంకడయ్యెను. సమాధినుండి చలింపడయ్యెను. భక్త్రత్రాణ పరాయణుండగు శంకరుని ధ్యానము గావింప సాగెను. తత్ఫలితముగా నా కారాగృహము నందే భగవానుఁడగు శంకరుఁడున్నత స్థానంబునం దొక ప్రకాశమానంబగు సింహాసనమునం దుపస్థితుడై శివలింగ రూపమున గాన్పించెను. దర్శనమే కాక నా భక్తునకు పాశుపతాస్త్ర మనుగ్రహించెను. తిరోహితుఁడయ్యెను. ఈ పాశుపతాస్త్రముతో సమస్త రాక్షస సంహారము గావించి సుప్రియుఁడు శివధామమున కేగెను. భగవానుఁడగు శివుని యాదేశానుసారము యీ జ్యోతిర్లింగమునకు నాగేశ్వరుడను పేర్గలిగినది. ఈ జ్యోతిర్లింగమును దర్శించుట గొప్ప మాహాత్మ్యము కలదు. ఎవ రేని ఆదర పూర్వకముగ నీ జ్యోతిర్లింగము యొక్క ఉత్పత్తి మహిమను ఆలకించెదరో వారు సమస్త పాపములచే విముక్తులై సమస్తైహిక సౌఖ్యముల ననుభవించి అంత్యకాలమున పరమ పదప్రాప్తులగుదురు.

శ్లో॥ ఏతద్ యఃశృణుయా న్నిత్యం నాగేశోద్భవ మాదరాత్,
సర్వాన్ కామా నియాద్ ధీమాన్ మహాపాతక నాశనాన్

(శ్రీ శివపురాణము)

# హేలనా ఫలితం

ఒక సరస కవి



ఉ॥ చక్కని గంధమిద్ది యది ♦ సమ్మతిఁ బొందని దుష్టగంధ మం
చక్కటికంబునం దెలిపి ♦ యాత్మకు జ్ఞానముగూర్చి గోళముల్
నిక్కఁగ రెండు కల్గఁ తగు ♦ నేర్పున జీవిత రక్షకై సదా
మిక్కిలి ప్రాణవాయువును ♦ మేలుగి నూపిరితిత్తులందు పెం,

పెక్కఁగఁ ద్రోచి వానిఁగల ♦ హీనపురక్తము బాగుచేయుచున్
మొక్కఁడు మేలు గూర్చుచును ♦ యిద్ధర ప్రాణుల సేవఁ జేయుచే
సిక్కపు ధర్మమంచు, మన ♦ నెమ్మొగమందున యందగత్తెయై
చిక్కఁ జపాప్రసూన మని ♦ చెల్వుగ సత్కవి కోటిచేత నా,

చక్కని కావ్యరాజముల ♦ సన్నుతికెక్కుచు; నెంతధీరయా
ముక్కు సహేతువాదములఁ ♦ బొల్పుగఁ జేయగ లేక నీర్ష్యతో
చక్కని నా కవిత్వమును ♦ సంస్తుతి చేయగలేక హేళనం
బెక్కుడుచేసి ముక్కుపయి ♦ చెప్పెనురోరి కవిత్వమంచు బల్

నిక్కఁగ నేల దాని సరి♦నీవెటు లయ్యెదు మర్త్యకోటికిన్
చిక్కులు పెట్టు దుష్టుఁడవు ♦ శ్రీశివుభక్తని పొందనట్టి పెం
పెక్కిన గర్వపోతువు గి♦రీశుని భక్తులఁ దిట్టు చెట్టవై
లక్కన మేమి గాంచసి స♦గర్వపరుండవు క్రూరకర్మడా!

---

# "విభూతి" వినయము

శ్రీమత్కల్యాణగుణపరిపూర్ణు డగు సదాశివుని యనుగ్రహ విశేషమున విభూతికి ప్రథమ సంవత్సరము నిండినది. విఘ్నము లెన్ని కలిగినను ప్రతినెల 22 వ తేదీని పత్రికను ప్రకటించుచు పోస్టుచేయు టను తప్పలేదు. ఏ సామగ్రియు లేని మావంటి పరతంత్రుల కిదియే మహాత్కార్యము. పురాకృతవశమున కొన్ని బాధలలోఁ జిక్కుకొని మే మనుకొనిన రీతిని సామగ్రిని సమర్పింపజాలమైతిమి. ప్రయత్న లోపము జరిగియుండలే దని మాత్రము చెప్పగలము. ఇది మా సామ ర్థ్యము ననుసరించి నంతమట్టుకే. పత్రికవలన ఆర్థికలాభము లే దను సంగతి యంద రెరింగినదియ. మీఁదు మిక్కిలి ధరలుపెరుగుటకు దోడుగా మేము విశ్వసించిన ధనసాహాయ్యము హస్తగతము కాకుండుటయు కొంత వ్యగ్రతను గూర్చినది. కేవలము అంకెల జూచిన లాభ ముండదు. అందలి సాధక బాధకము లాత్మకు మాత్రమే సాక్షి. అయినను మాకుఁ దోడ్పడినదాతలు, లేఖకులు ముద్రణాధిపతులు మిత్రులుప్రశంసాపాత్రులు. ముందు నెలనుండి 'విభూతి' కి రెండవ వత్సర మారంభమగును. ఆకా రము "డబల్ కౌన్" పెద్దదిగా మార్చబడుచున్నది. ప్రథమ సంచిక కొంత విశేషముగను వివిధ చిత్రములతోడను ప్రకటింపు తలంపు గలదు. వ్యాసకర్తలు, రాజ మహారాజ పోషక సహాయకులు తమ తమ సహాయమును చిత్రములను అత్యవశ్యముగ నందింపఁ బార్థి తులు. చందాదారులును త్వరగా పత్రికాదక్షిణ నర్పించనిదే 'విభూతి'కి వైభవములేదు. ఇతర మిత్రులలోను ప్రచార మొనర్చుట కర్తవ్యముగా "విభూతి"పరివారము దలంచుగాక!— ఇందు వెంట వ్యాసముల వ్యాస కర్తల సూచియు గలదు. శ్రీకరభాష్యము 8 ఫారములను వేరుగా దీసి యుంచి తక్కిన విభూతి సంచికల నొక్కచో జేర్చి ప్రథమ సంపుటము విషయానుక్రమణికను మీఁదవేసి బైండు చేయించవచ్చును. శ్రీకర భాష్యమును మొదటి సైజులోనే ఒక్కొకఫారమును ముందు అందించ గలము. అష్టవిభూతి సంపన్ను డగుపరమేశ్వరుడు లోకమున కభ్యు దయ పరంపరల ననుగ్రహించు మార్గమున నడుగిడుటకై 'విభూతి' వినయముగ కార్యక్షేత్రమున యథాశక్తి కృషి సలుపుచున్నది. భవి ష్యము భగవదధీనముకదా!

ఇతిశివమ్,

ది 20—1—1940 సంపాదకుడు.

# చందాదారులు

అందరికిని సరిగా తప్పక సంచికలు పంపబడుచున్నవి. పోస్టు వారి లోపము తప్ప మాలోపము లేదని గట్టిగా తెలిసికొందురుగాక! ఇంక నెవరికైనను కొన్ని సంచిక లందనిచో వ్రాయవలెను. త్వరగా పంపించగలము. ముందు సంవత్సర చందా 2-8-0 లను మనియార్డరు ద్వారా పంపుడు. వి.పి చేయుచో ఖర్చులు ఎక్కువగును.

---

# దాతలు

డాకూరు శ్రీ మఠం సిద్ధివీరయ్యగారు సన్మాన పూర్వకముగ నర్పించిన గోదానమును సిద్ధాంతశిఖామణి ముద్రణముకొరకై 25 రు లును, మెదకు శ్రీ పట్నంశెట్టి మల్లప్పగారు 25 రులును, తెనాలి శ్రీ చుక్కా పిచ్చయ్యగారు తమ వాగ్దానము 5 రులును సమర్పించి నారు. ఇది గాక మెదకులో శ్రీ గోలి విశ్వనాధము గుప్తగారు మున్నగువారును జోగిపేటలో శ్రీ తడుగూరి వీరన్న మొదలగువారును సదాశివపేటలో శ్రీ దుద్దాల బుచ్చప్పగారును సన్మానము గావించిరి. తక్కిన వారందరు మా జాబుల కెదిరిచూడక తమ వాగ్దానమును త్వరగా చెల్లించ గోరుచున్నాము.

# విభూతి

సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

ప్రథమ సంపుటము

( శా. శ. బహుధాన్య మహాశివరాత్రి - ప్రమాథి, పుష్యము )

1939 — 1940

●


సంపాదకులు :

వేదకావ్యస్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధి

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సజన్‌లాల్ వీధి, సికింద్రాబాదు (దక్కను)


●


సంవత్సరము చందా రు ౨-౮-౦

విడి సంచిక రు ౦-౪-౦

# 'విభూతి' ప్రథమ సంపుటము

## వ్యాసముల అనుక్రమణిక

---

## చిత్రసూచి

# విభూతి ప్రథమ సంపుటము

## వ్యాసకర్తల అనుక్రమణిక

| వ్యాసకర్తలు. | పుటలు. |
|---|---|
| నిడుదవోలు వేంకటరావుగారు | ౪౧ |
| ప్రమథనాథ శివాచార్యులవారు | ౫౮ |
| బ. సీతారామశర్మగారు | ౭౯౯ |
| బండారు తమ్మయ్యగారు | ౮, ౨౦౭, ౨౭౭, ౩౯౯ |
| బాదిడిమఠం మహంతయ్యగారు | ౧౨౩, ౧౫౫, ౨౮౯ |
| బి. ఎన్. కృష్ణరావ్ గారు | ౩౯౩ |
| బి. శ్యామలాంబగారు | ౭౦౬ |
| మఠం సిద్ధివీరయ్యగారు | ౨౮౯, ౩౫౮, ౩౯౪, ౪౮౩, ౫౫౩, ౬౦౨, ౭౩౦ |
| మహంతుమఠం నాగభూషణయ్యగారు | ౧౨౧ |
| మాడపాటి హనుమంతరావుగారు | ౨౮, ౪౯౩ |
| ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు | ౨౩, ౧౧౫, ౨౮౨ |
| మేడిపల్లి లక్ష్మీకాంతంగారు | ౧౦౮, ౧౮౨, ౨౮౩, ౩౭౨, ౪౩౨, ౪౮౧, ౮౧౧, |
| మేనేజర్ 'విభూతి' | ౬౫౯ |
| రాజహంస | ౬౮, ౧౨౮, ౧౮౫, ౨౫౩, ౩౧౯, ౩౮౦, ౪౫౧, ౫౭౨, ౭౧౨, ౭౬౧ |
| రాయప్రోలు సుబ్బారావుగారు | ౮ |
| రావికోటమఠం వీరభద్రయ్యగారు | ౧౧౮ |
| లక్కన మల్లికార్జునుడుగారు | ౬౪, ౧౯౮, ౩౯౮, ౪౨౮, ౫౦౨, ౫౫౧, ౭౧౦, ౭౪౧, ౮౧౩ |
| విద్యానిధి | ౧౯, ౧౦౬, ౩౩౦, ౪౬౩, ౭౧౫, ౭౪౮, ౭౮౯ |
| విరూపాక్ష శాస్త్రులుగారు | ౧౯౮ |
| విశ్వనాథ వేంకటేశ్వరులుగారు | ౧౪౨ |
| వృషభలింగ శివాచార్య స్వాములవారు | ౨౨౧ |
| శనగవరపు వేంకటరమణశాస్త్రిగారు | ౪౨౯ |
| శిలిగం జగన్నాథముగారు | ౩౪౭ |
| శేషభట్టర్ వెంకట రామానుజాచార్యులుగారు | ౭౨౯ |
| శేషాద్రిరమణ కవులు | ౮౩, ౧౩౯, ౫౮౯ |
| సంపాదకులు 'విభూతి' | ౧, ౭౮, ౧౩౨, ౨౪౨, ౨౮౯, ౩౨౩, ౩౮౦, ౪౪౫, ౪౯౨ |
| సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు | ౧౫, ౮౫, ౩౨౮, ౫౭౯ |
| సి. హెచ్. రంగాచార్యులుగారు | ౧౯౯ |
| సురభి నరసింహముగారు | ౪౫౦ |
| సురవరము ప్రతాపరెడ్డిగారు | ౧౦౧, ౫౯౭ |

పురుషప్రవృత్తి పర్యవసితత్వాత్తస్యాశ్చ నిష్ఫలాయా అసంభవాత్ ఫలవత్త్వసిద్ధ్యై మోక్షసాధనత్వం జ్ఞానస్య కల్ప్యత ఇత్యార్థికత్వం। తత్రి భ్గవతామ్యేవ, తు తద్దృష్ట్యా దురుత్తరం. జ్ఞానస్య ప్రత్యయార్థేచ్ఛాయాం విషయత్వేనాన్వయే జ్ఞానమాత్రస్య నిష్ప్రమాణత్వేన విషయత్వాసంభవాన్మోక్షసాధనబ్రహ్మజ్ఞానస్యైవేష్యమాణత్వేన శ్రౌతత్వప్రసంగాత్।

ఏవం చ - ఇదమప్యపరం ప్రత్యయే విచారలక్షణాయాం బీజం। యదాచార్యాణాం మోక్షసాధనత్వస్యార్థికత్వకథనం. అన్యథా ఉక్తరీత్యా శ్రౌతత్వప్రసంగాత్। యదపి - ప్రత్యయానామిత్యాది, తదపిన. అపేక్షితవిచారస్య ప్రకృత్యర్థజ్ఞానం ప్రతి సాధనత్వేనాన్వయాత్। ఇ యా విషయవిషయిభావేనాన్వయః, విచారస్య తు సాధ్యసాధ నేతి ప్రకృత్యర్థాన్వితస్వార్థాభిధానే న కశ్చిద్విశేషః। యదపి పదేన విరోధ ఇతి, తన్న. ప్రకృతిప్రత్యయయోర్ద్వయోరపి లక్ష పదస్య సకలస్య లక్షకత్వాత్తదభిధానోపపత్తేః। జ్ఞానస్య ప్రకృ సాధ్యత్వలక్షణాయా విచారలక్షణాకథనేనైవ కథితప్రాయ తామనభిధాయ విచారమనపేక్ష్యేతి విచారలక్షణాభిధానోపపత్తేశ్చ। తస్మాల్లక్షణాద్వయమేవ పరమానందారాధ్యేన నిర్ణీతం। ఏకోరామసిద్ధారాధ్య భగవత్పాదాచార్యాదిభిః స్వీకృతత్వాదేతదేవ సమ్యగుపాదేయం।

## శివస్య పరబ్రహ్మత్వ కథనం.

నను - "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత" (తై - ఆనం. ౭) "అమూలమనాధారమిమాః ప్రజాః ప్రజాయంతే" "న కదాచిదనీదృశం జగత్" ఇత్యాదినా జగతః అసత్కారణత్వానాదిత్వే ప్రతిపాదితే, తస్మాత్తస్య న కర్త్రపేక్షితా సముచితా। "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" ఇత్యాదా యాగాదికర్మణాం జీవకర్తృకత్వఫలదాతృత్వదర్శనాత్, చేతనశరీరవ్యతిరిక్తేశ్వరసిద్ధావపి మానా

భావాత్, తేన ప్రయోజనాదర్శనాత్, అదృష్టద్వారా జీవానామేవ కర్తృత్వాంగీకారాత్, లోకే సుఖదుఃఖభోక్తృత్వాదర్శనాత్, పరమేశ్వరకర్తృకత్వే వైషమ్యనైర్ఘృణ్యాపత్త్యా ఈశ్వరత్వభంగప్రసంగాచ్చ ఈశ్వరేణ న కించిత్ప్రయోజనం సిధ్యతి । కించ - జడకర్మణాం జీవానాం చ ఫలదాతృత్వాసంభవాత్ సర్వజ్ఞేశ్వరసద్భావే "క్షిత్యంకురాదికం సకర్తృకం, కార్యత్వాత్ ఘటవత్" ఇత్యనుమానేన ఈశ్వరస్యాంగీకారే "ఆత్మావా ఇదమేకఏవాగ్రఆసీత్" (ఐత. ౧-౧-౧) "బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్" (బృ. ౧-౪-౧౦) "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్" (తై. సం. ౪ ౧-౮) "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" (గీతా. ౮-౧౩) "అసావాదిత్యో బ్రహ్మ" (తై. ఆర. ౨.౨) "నమస్తే వాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" (తై.శిక్షా. ౧) "గణానాం త్వాగణపతిం హవామహే". (తై. సం. ౨-౩-౧౪) "విశ్వాస్మాదింద్ర ఉత్తరః" (ఋగ్వేద. ౮-౪-౧) "ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మ నేశానో నాపో నాగ్నిష్టోమౌ నేమే ద్యావాపృథివీ" (మహో ౧-౧) "అథ పురుషో హ వై నారాయణోఽకామయత ప్రజాస్సృజేయేతి, నారాయణాద్బ్రహ్మ జాయతే నారాయణాద్రుద్రో జాయతే" (నారా ౧-౧) "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛాం. ౬-౨-౧) "మనో వై బ్రహ్మేతి, చక్షుర్వై బ్రహ్మేతి, శ్రోత్రం వై బ్రహ్మేతి" "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" (ఛాం ౪—౧౦—౪) "అన్నం బ్రహ్మ" (తై. భృ. ౨) ఇత్యాదినా బహువిప్రతిపత్తిదర్శనాత్, శివస్యైకస్యైవ కథం బ్రహ్మత్వం?" ఇతి చేన్న.

"అగ్నీషోమీయం పశు మాలభేత" ఇత్యత్ర "ద్విపదాశ్చతుష్పదాశ్చ పశవః" ఇతిశ్రుత్యా ద్విపదాం చతుష్పదాం చ పశుశబ్దవాచ్యత్వేన నిర్దేశాత్, సందేహే "ఛాగస్య వపాయా మేధసః"

(ತೈ. ಬ್ರಾ. ೩—೬—೮) ಇತಿಶ್ರುತ್ಯಂತರೇಣ ಭಾಗಪಶುತ್ವನಿರ್ಣಯವತ್ ಶಿವಸ್ಯ ಬ್ರಹ್ಮತ್ವಂ ಗ್ರಾಹ್ಯಂ। ಅತಃ- "ಯತೋ ವಾ ಇಮಾನಿ ಭೂತಾನಿ ಜಾಯಂತೇ" (ತೈ. ಭೃ. ೧) ಇತ್ಯಾದಿಷು ಜಗಜ್ಜನ್ಮಾದಿಕಾರಣತ್ವಂ ಬ್ರಹ್ಮ ಲಕ್ಷಣಮುಕ್ತಂ ಪರಮೇಶ್ವರಸ್ಯ। ತ್ರಿಗುಣಾತ್ಮಕಶಕ್ತ್ಯವಚ್ಛಿನ್ನಹಿರಣ್ಯಗರ್ಭ ನಾರಾಯಣಕಾಲರುದ್ರಾದೀನಾಂ ನೇಶ್ವರತ್ವಂ। ತೇಷಾಮೇಕೈಕಕರ್ತೃತ್ವೇನ ಜಗಜ್ಜನ್ಮಾದಿ ಕರ್ತೃತ್ವಾಭಾವಾತ್। ಅತ ಏವ ಸೂತ್ರಕಾರೇಣ "ಜನ್ಮಾದ್ಯಸ್ಯ ಯತಃ" ಇತಿ ನಿರ್ದಿಷ್ಟಂ. ಬ್ರಹ್ಮೋತ್ತರಖಂಡೇ—

ಯಸ್ಯಾಜ್ಞಯಾ ಜಗತ್ಸ್ರಷ್ಟಾ ವಿರಿಂಚಿಃ ಪಾಲಕೋ ಹರಿಃ ಸಹರ್ತಾ ಕಾಲರುದ್ರಾಖ್ಯೋ ನಮಸ್ತಸ್ಮೈ ಪಿನಾಕಿನೇ॥

ಇತಿ ಜಗದುತ್ಪತ್ತ್ಯಾದೀನಾಂ ಪ್ರಯೋಜಕಕರ್ತುಃಶ್ಶಿವಸ್ಯೈವೇಶ್ವರತ್ವಂ ನಿರ್ದಿಷ್ಟಂ। ಕಿಂಚ- "ಮಾಯಾಂತು ಪ್ರಕೃತಿಂ ವಿದ್ಯಾನ್ಮಾಯಿನಂತು ಮಹೇಶ್ವರಂ।ತಸ್ಯಾವಯವಭೂತೈಸ್ತು ವ್ಯಾಪ್ತಂ ಸರ್ವಮಿದಂ ಜಗತ್" (ಶ್ವೇ.೪-೧೦) ಇತಿ। ಮಾಯಾಂ- ಪ್ರಕೃತಿಂ, ಕಾರಣಂ ವಿದ್ಯಾತ್, ಮಾಯಿನಂ ತು ಮಹೇಶ್ವರಂ ವಿದ್ಯಾತ್, ಇತ್ಯನೇನ ಮಾಯಾಯಾಃ ಪರಮೇಶ್ವರಾಧೀನತ್ವಮುಕ್ತಂ। ಅತ ಏವ ವಶೀಕೃತಮಾಯತ್ವಾತ್ ಸ್ವತಂತ್ರ ಇತಿ, ತಸ್ಯಾಂಶಭೂತೈಃ ಬ್ರಹ್ಮ ವಿಷ್ಣುಕಾಲರುದ್ರಾದಿಭಿಶ್ಚೈತದ್ವ್ಯಾಪ್ತಂ ಸರ್ವಮಿದಂ ಜಗದಿತ್ಯುಕ್ತಂ॥

ತಥಾ ಅಥರ್ವಶಿರಸಿ—"ದೇವಾ ಹ ವೈ ಸ್ವರ್ಗಂ ಲೋಕಮಗಮನ್ ತೇ ದೇವಾರುದ್ರಮಪೃಚ್ಛನ್ ಕೋಭವಾನಿತಿ, ಸೋಽಬ್ರವೀದಹಮೇಕಃ ಪ್ರಥಮಮಾಸಂ ವರ್ತಾಮಿ ಚ ಭವಿಷ್ಯಾಮಿ ಚ ನಾನ್ಯಃ ಕಶ್ಚಿನ ಮತ್ತೋ ವ್ಯತಿರಿಕ್ತಃ" (ಅಥರ್ವ ಶಿರಃ. ೧) ಇತ್ಯಾದಿನಾ ಶಿವಸ್ಯೈವ ತ್ರೈಕಾಲಿಕಾಬಾಧ್ಯತ್ವಂ ಸರ್ವಾಂತರ್ಯಾಮಿತ್ವಂ ಸರ್ವಕಾರಣತ್ವಂ ಸರ್ವಶಬ್ದವಾಚ್ಯತ್ವಂ ಸರ್ವೇಶ್ವರತ್ವಂ ಸರ್ವಾತ್ಮಕತ್ವಂ ಬ್ರಹ್ಮತ್ವಂ ಚ ಪ್ರತಿಪಾದಿತಂ। ಕಾಣ್ವಶಾಖಾಯಾಂ—"ಯಃ ಪೃಥಿವ್ಯಾಂ ತಿಷ್ಠನ್" ಇತ್ಯಾದಿನಾ ಪೃಥಿವ್ಯಾದ್ಯಷ್ಟಮೂರ್ತಿಸ್ವರೂಪಸ್ಯೈವ ಬ್ರಹ್ಮತ್ವಕಥನಾನ್ನಾನ್ಯಸ್ಯ ಶ್ಶಂಖಚಕ್ರವಿಶಿಷ್ಟದೇವತಾಯಾ ಭೂತಭೌತಿಕ ಸೃಷ್ಟಿಕರ್ತೃತ್ವೇನೇಶ್ವರತ್ವಂ।ನಚಾವಯವವ್ಯುತ್ಪತ್ತ್ಯಾ ವಿಷ್ಣೋರಪಿಪೃಥಿವ್ಯಾದಿಶರೀರತ್ವಮಂತರ್ಯಾಮಿತ್ವಂ ಚ ಸಂಭವತೀತಿ ವಾಚ್ಯಂ. ಅಷ್ಟಮೂರ್ತಿತ್ವಂ ಹಿ ಶಿವಸ್ಯೈವ ಪ್ರಸಿದ್ಧತ್ವಾತ್

విష్ణోరంతర్యామిత్వాప్రసిద్ధేః న చోభయోః శివకేశవయోరంతర్యామిత్వమష్టమూర్తిత్వం చ వక్తుం యుక్తం; ఉభయోరేకశరీరాభావాత్। స్వతంత్రయోరుభయోరపి నియంతృత్వే జగతాముత్పత్తిస్థితిసంహారాణాం యుగపత్సంభవే విశ్వవిలయాపత్తేః। "సోఽంతరాదంతరం ప్రావిశత్, దిశశ్చాంతరం ప్రావిశత్" (అథర్వశిరః ౧) "యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో విశ్వా భువనాఽఽవివేశ తస్మై రుద్రాయ నమో అస్తు" * (తై. సం. ౫-౫-౯) ఇత్యాదిశ్రుతిశతేషు శివస్యైవ సర్వాత్మకత్వసర్వాంతర్యామిత్వదర్శనాత్.

"యో వేదాదౌ స్వరః ప్రోక్తః" ఇత్యారభ్య "యః పరస్స మహేశ్వరః" (మహానా. అను. ౧౦) ఇత్యంతేన అకారోకారమకారవాచ్యబ్రహ్మవిష్ణురుద్రాణాం మహేశ్వరే విలయః ప్రతిపాదితః; తస్మాన్నైతరేషాం బ్రహ్మత్వం.

కించ—"ఈశానస్సర్వవిద్యానాం" ఇత్యారభ్య "సదాశివోం" (మహానా. అను. ౨౧) ఇత్యంతేన తస్యైవ బ్రహ్మత్వం ప్రణవప్రతిపాద్యత్వం చోక్తం.

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం చ దైవతం। పతిం పతీనాం ప్రథమం పరస్తాద్విదామ దేవం భువనేశమీడ్యం" (శ్వే. ౬-౭) ఇతి శ్వేతాశ్వతరే బ్రహ్మవిష్ణురుద్రాదిదేవానాం నియంతృత్వేనేశ్వరం విదామో జానీమః, నాన్యథేశ్వరం జానీమ ఇతి నిర్ణీయతే। "సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితోత విష్ణోః" (ఋగ్వేద. ౭-౮-౬) ఇతి ఋగ్వేదే బ్రహ్మాదివిష్ణ్వంతజగత్కారణత్వం తస్యైవోపపాదితం। సోమప్రకరణపఠితత్వాన్న సోమలతాపరత్వం; అచేతనసోమలతాయాస్సర్వకారణత్వాసంభవాత్.

అథర్వశిఖాయాం చ—"ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం, సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్రాస్తే సంప్రసూయంతే సర్వాణి

చేంద్రియాణి సహభూతై ర్న కారణం కారణానాం ధ్యాతా కారణం తు ధ్యేయస్సర్వైశ్వర్యసంపన్న స్సర్వేశ్వరశ్శంభురాకాశమధ్యే ధ్రువం సర్వాధిక ం" ఇత్యుపక్రమ్య "శివ ఏకో ధ్యేయశ్శివంకరస్సర్వమన్యత్పరిత్యజ్య" (అధర్వశిఖా 3) ఇత్యంతేన ముముక్షూణా మితరనిషేధపూర్వకం శివోపాసనమేవ విహితం.

"ఉతామృతత్వస్యేశానః" (తై. ఆర. 3-౧౨) "సర్వమిదం శివ ఏవ విజానీమహి" "శుద్ధో నిరంజనో విభురద్వయం శివమేకం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః శివోఽద్వైతః" "ఏకో హి రుద్రో న ద్వితీయాయతస్థుః" (శ్వే. 3. ౨) "స సన్న చాస చ్ఛివ ఏవ కేవలః" (శ్వే. ౪. ౧౮) "విశ్వాధికో రుద్రో మహర్షిః" (మహానా. అను. ౧౦) ఇత్యాదిశ్రుతిభి శ్శివస్యాద్వితీయత్వప్రతిపాదనా చ్ఛివ ఏవ పర ఇతి నిశ్చీయతే । కించ—

ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళం।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః॥
(మహానా. అను. ౧.౨)

ఇత్యాదినా నీలలోహితస్య శివస్య పరబ్రహ్మత్వముక్తం.

"ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే" (మాండూక్య ౧-౭) "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ధ్యాత్వా మునిర్గచ్ఛతిభూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్" (కైవ. ౧-౭) "స బ్రహ్మ స శివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమః స్వరాట్" (మహానా. ౧౧ అను.) ఇత్యాదినా శివస్య మూర్తిత్రయాతీతపరబ్రహ్మత్వప్రతిపాదనాత్, తదన్యేషాం కారణత్వాభావాన్నాన్యేషాం బ్రహ్మత్వం యుక్తం, "అన్నం బ్రహ్మ" ఇత్యాది తు స్తుతిమాత్రమేవ.

కించ—"సర్వో వై రుద్రః" (మహానా. ౧౬ అను), "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం. 3-౧౪-౧) "త్రిషు ధామసు యద్భోజ్యం

భోక్తా భోగశ్చ యద్భవేత్, తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః॥ మయ్యేవ సకలంజాతం మయి సర్వం ప్రతిష్ఠితం, మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్'' (కైవ. ౧-౧౯) ఇత్యాదినా హస్తకరపాణిశబ్దవత్ బ్రహ్మాత్మశివశబ్దానాం పర్యాయత్వశ్రవణాత్, మాండూక్యోపనిషది ఉపక్రమే—''సర్వం హ్యేతద్బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ సోఽయమాత్మా'' ఇత్యుక్త్వా అంతే ''శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః'' (మాండూక్య ౧-౭) ఇత్యుక్త్వా అద్వితీయబ్రహ్మప్రకరణే ఉపక్రమోపసంహారయోరేకార్థప్రతిపాదకత్వాదుపక్రాంతస్య బ్రహ్మణ ఉపసంహారగతాద్వైతశివస్య చాభిన్నత్వోపదేశాచ్చ జగజ్జన్మాదికారణత్వేన పరబ్రహ్మత్వం తస్యైవ సిద్ధం। అన్యథా శివబ్రహ్మాత్మాదీనాం శ్రుత్యా జగత్కారణత్వప్రతిపాదనాత్తేషాం ప్రత్యేకమీశ్వరత్వాంగీకారే ఈశ్వరనానాత్వప్రసక్త్యా సకలమతవిరోధః సకలశ్రుతివిరోధశ్చ స్యాత్.

ఏవం సర్వవేదాంతార్థజ్ఞైర్జైమిన్యాచార్యైః స్వకృతవేదపాదస్తవే సకలవేదవాక్యానాం శివపరత్వముక్తం. తథా చ చతుర్వేదపారంగతైః జ్యోతిర్నాథఘంటానాథభీమనాథభట్టభాస్కరాదిభిర్వైదికైర్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యైరపి పాషండపాంచరాత్రబౌద్ధాద్వైతాదిదుర్మతనిరాకరణానంతరం—

మహాదేవో దేవః సకలజగదారాధ్యచరణ,
త్రయీమార్గో మార్గః కుమతిమతవృత్తిప్రమథనః.
తయోర్వ్యావా బ్రూతే వృజిన మనయోస్తస్య నిదధే,
శిరస్యంఘ్రిం వాదిప్రళయదహనోఽహం నృపసభే.

ఇత్యాదినా శివస్యైవ పరబ్రహ్మత్వం వ్యవస్థాపితం తస్మాచ్ఛాస్త్రే బ్రహ్మజిజ్ఞాసేత్యత్ర శివస్యైవస్వరూపజిజ్ఞాసేతి నిర్దిష్టం॥

ఏవం బ్రహ్మణో యజ్జగత్కారణత్వం తచ్ఛివస్యైవేతి స్తోత్రసందర్భేఽపి శాస్త్రే బ్రహ్మేతి వ్యవహారః। ''బ్రహ్మవిదాప్నోతి పరం''

(కై. ఆసం ౧) "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముండక. 3-౨-౯) "శివ ఏకో , ధ్యేయశ్శివంకరస్సర్వమన్యత్పరిత్యజ్య" (అథర్వశిఖా 3) ఇత్యత్ర శివంకరోతీతి శివంకరః భావప్రధానో నిర్దేశః తస్మాదాత్యంతికపాశనివృత్తిపూర్వకశివత్వప్రాప్తిరేవ ముక్తిరిత్యుపదిశ్యతే. న చ ఆగంతుకత్వేనానిత్యత్వాత్ కథం శివత్వప్రాప్తిరేవ ముక్తిరితివాచ్యం। భ్రమరకీటన్యాయేన సత్యక్రిమేః సత్యభ్రమరత్వప్రాప్తిదర్శనాత్. సత్యాత్మకస్య జలస్య స్వభావనివృత్తి పూర్వక సత్యమౌక్తికత్వప్రాప్తి దర్శనాత్ కిమర్థం బంధమిథ్యాత్వకల్పనమితి వివేకభిర్బోద్ధవ్యం.

నను - మరుమరీచికాయాం భాసమానస్యాసత్యస్య తోయజ్ఞానస్య సత్యం మరీచికాజ్ఞానం నివర్తకమితి వ్యాప్తిబలాత్ జ్ఞానేన సత్యస్య కదం నివృత్తిః? ఇది చేన్న. సత్యస్య పూర్వజ్ఞానస్యోత్తరజ్ఞానేన, స్మృత్యా సంస్కారస్య, శివస్మరణేన పాపస్య, ప్రియస్మరణేన దుఃఖస్య, ప్రత్యధికరణం సంశయస్య పూర్వపక్షనిర్ణయేన, పూర్వపక్షస్యచ సిద్ధాంతేన నివృత్తిదర్శనాత్.

నను-"అజామేకాం లోహితశుక్లకృష్ణాం" (మహానా. ౧౦. అను) ఇత్యాదౌ ప్రధానస్య జగత్కారణత్వనిర్దేశాత్, బ్రహ్మణో జగత్కారణత్వే వికారిత్వప్రసంగాచ్చ । "అథ-అతః - అబ్రహ్మజిజ్ఞాసా" ఇతి అబ్రహ్మణః ప్రధానస్య జిజ్ఞాసా కర్తవ్యేతిచేన్న - తజ్జిజ్ఞాసాధాయకశ్రుత్యదర్శనాత్, "నోపాస్యా ప్రకృతిజీవా" ఇతిశ్రుతౌ తదుపాసనానిరాకరణదర్శనాత్, ప్రధానవన్నిరధిష్ఠానశక్తేరభావాచ్చ. ప్రధానస్య జగత్కారణత్వప్రతిపాదకశ్రుతీనాం "శస్త్రం ఛినత్తి శ్రోత్రం శృణోతి" ఇతివాక్యానామివ తదన్యకర్తృత్వం సూచితం, జడస్య జగత్కారణత్వాసంభవాత్ "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం" (శ్వే. ౪-౧౦) ఇత్యాదౌ మాయాయాశ్శివాధీనత్వదర్శనాత్.

ఇతి శ్రీకరభాష్యే ఆద్యం జిజ్ఞాసాధికరణం.

## జన్మాద్యధికరణం ౨.

"లక్షణప్రమాణాధీనా హి వస్తుసిద్ధిః" ఇతిన్యాయేన ప్రథమం బ్రహ్మణః ప్రాధాన్యలక్షణార్థ మిదం సూత్రం ప్రదర్శ్య నిర్విశేషత్వ సవిశేషత్వసంశయవిపర్యయనిరాకరణార్థం జిజ్ఞాస్యస్య బ్రహ్మణో లక్షణ మాహ.

౨. జన్మాద్యస్య యతః

ఇతి—"యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి" (తై. భృ. ౧) ఇతి తైత్తిరీయే శ్రూయతేఽస్య విషయః, ప్రయంతి మ్రియమాణాని సంతి అభిసంవిశంతీతి వాక్యార్థః.

అత్ర పూర్వాధికరణే సందిగ్ధత్వేన బ్రహ్మణో విచార్యత్వసంభ వాదాక్షేపసంగతిః। సర్వత్ర దృష్టాంతప్రత్యుదాహరణసంగతీ చ సంభ వతః। యథాసందిగ్ధత్వహేతునా బ్రహ్మవిచార్యం, తథాజన్మాదీనాం జగన్నిష్ఠత్వేన హేతునా న బ్రహ్మణో లక్షణ మితి దృష్టాంతసంగతిః, అత్ర తటస్థలక్షణత్వేన న తథా సంభవతీతి ప్రత్యుదాహరణసంగతిః, జన్మ ఆది ర్యస్యేతి తద్గుణసంవిజ్ఞానబహువ్రీహిః. అత్ర బ్రహ్మేతి పదమనువర్తతే తచ్ఛబ్దస్యాధ్యాహారః-జన్మాది-అస్య-యతః - ఇతి పద విభాగః। జన్మాది - సృష్టిస్థితిలయతిరోధానానుగ్రహాత్మకం కృత్యపంచకం అస్య చిదచిత్ప్రపంచవిలాసస్య, యతో యస్మాత్ స్వాభావికానంత శక్తివిశిష్టబ్రహ్మణః, సంభవతి తద్బ్రహ్మేతి సూత్రార్థః.

అస్యేత్యనేన చాక్షుషప్రత్యక్షవిషయీభూతచేతనాచేతన ప్రపం చస్యకార్యత్వం, యత ఇత్యనేన బ్రహ్మణో జన్మాదిపంచకృత్యకారణత్వం చ నిర్దిష్టం। పరశివస్య బ్రహ్మణో జగజ్జన్మాదిపంచకృత్యానాం శ్రుతిసిద్ధ త్వాజ్జీవానాం తదుపాసకత్వం విధీయతే। కారణస్య బ్రహ్మణః కర్తు మకర్తుం చ శక్యమేవ। అత్ర-యతో వేతిశ్రుతావభిసంవిశంతీత్యనేన ఆవి ర్భావతిరోధానే సూచితే। విజ్ఞాతే బ్రహ్మణి తటస్థాదిలక్షణానుపపత్తిః; అవిజ్ఞాతే ప్రవృత్తిరేవ న స్యాత్। అత సత్ర కథం లక్ష్యలక్షణప్రవృత్తి రితి నాశంకనీయా, శ్రుత్యాదిప్రమాణేన సామాన్యతోజ్ఞానసంభవాత్। తన్నిశ్చయార్థం లక్ష్యలక్షణవిచారప్రవృత్తి ర్నవిరుధ్యతే॥

